# తిరుపతి శ్రీ వేంకటేశ్వర

*ఆంగ్ల రచన*

సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి

*తెలుగు అనువాదం*

డా॥ ఎస్. లక్ష్మణమూర్తి

డా॥ చింతగుంట సుబ్బారావు

డా॥ టి. విశ్వనాథరావు




*ప్రచురణ*

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

2018

# TIRUPATI SRI VENKATESWARA

*English Original*
**SADHU SUBRAHMANYA SASTRY**

*Telugu translation*
**Dr. S. LAKSHMANA MURTHY**
**Dr. C. SUBBA RAO**
**Dr. T. VISWANATHA RAO**

T.T.D. Religious Publications Series No.1303


*First Edition :* 2018

*Copies :* 500

*Published by*
**Sri Anil Kumar Singhal,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507.

***D.T.P:***
Publications Division,
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507

# ఆముఖం

పవిత్రమైన మన ఆలయాలు శతాబ్దాలుగా ముఖ్య ధార్మికసంస్థలుగా అలరారుతున్నాయి. అవి కొన్ని శతాబ్దాలతరబడి మన వైదిక మతకేంద్రాలుగానే కాక మనప్రజల విద్యా, సామాజిక, సాంస్కృతిక కార్యకలాపాలకు నిలయాలైనాయి. దేవాలయ ప్రాకారాలమీద చెక్కబడిన ఎన్నో శిలాశాసనాలు మన ప్రజల వేద సంబంధమయిన సమాజ సంబంధమయిన జీవితాన్ని ఆవిష్కరిస్తున్నాయి. పాలకుల దయాళుత్వంగానీ పోషకత్వంగానీ, దేవాలయం యొక్క కట్టడాలు, నిర్మాణాల వైభవంగానీ ఇందుకు దోహదపడలేదు. అనేక జనసమూహాల చెక్కుచెదరని భక్తి ప్రపత్తులే మన ఆధ్యాత్మికశక్తికి దుర్భేద్యమైన కోటగోడలుగా నిలిచాయి. దేవాలయాల్లో కొలువుదీరిన పవిత్రమైన దేవతామూర్తులు లక్షలాది ప్రజల జీవితాల్లో శాశ్వతమైన వెలుతురును నింపాయి. ఆ దైవానుగ్రహమే భక్తులందరినీ ధార్మికమైన, సాత్వికమైన మార్గంలో నడిపించింది.

తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం, నిర్వహణ, రాయలసీమ చరిత్ర మరియు రాజకీయ నిర్మాణంలో ప్రముఖ పాత్రను పోషిస్తూవస్తున్నది. పల్లవులు, చోళులు, పాండ్యులు విజయనగరచక్రవర్తులు, ఈస్ట్ ఇండియాకంపెనీ మరియు ఈ ప్రదేశాన్ని పాలించిన మహామహులందరూ శ్రీవేంకటేశ్వరస్వామిని సేవించి ఈ దేవాలయానికి పోషకులై తరించినవారే. దక్షిణ భారతదేశచరిత్రలో ఈ దేవాలయనగరచరిత్ర వాస్తవానికి ప్రధాన భాగమయినది. ఇటీవలికాలంలో ఈ దేవాలయం హైందవ సంస్కృతిని చాటే గొప్ప కళాఖండమయినది. రాజకీయాల కుమ్ములాటలు, తగాదాలు మరియు యుద్ధాల గురించి వివరించే ఇతర చరిత్ర కథనాలకు భిన్నంగా తిరుపతిక్షేత్ర చరిత్ర దృఢమైన మతశక్తినీ మొక్కవోని భక్తినీ ఆవిష్కరిస్తుంది.

ఈ గ్రంథము శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయంలో సూర్యోదయానికి పూర్వం నుండి  సంధ్యాసమయం తర్వాత కూడా జరిగే పూజలు, అర్చనలు, ఆరాధన వంటి విషయాలేకాకుండా, వరాహ, భవిష్యోత్తర పురాణాల్లోని కొన్ని భాగాల్ని కూడా తెలియజేస్తున్నది. ఈ గ్రంథంలో దేవాలయ భవనాలగురించి, గొప్పపరిపాలకుల కాలంలో పాలనా నిర్వహణతీరు గురించి విశదంగా వర్ణించబడినది. కవితలు, పద్యాలు, కృతులు వ్రాసి శ్రీనివాసుని వైభవాన్ని అజరామరం గావించిన ఎందరో సంగీతకారులు, కవులు, రచయితల గురించి ఈ గ్రంథం విస్తృతంగా వివరిస్తుంది.

రచయిత సాధుసుబ్రహ్మణ్యశాస్త్రిగారు అందరికీ సుపరిచితులే. క్రీ॥శ॥ 1930వ సం॥లోనే తిరుమల తిరుపతి దేవస్థానం శాసనాలను, శాసనాధ్యయన నివేదికలను పరిశోధించి, పరిశీలించి, పరిష్కరించి

ప్రచురించిన మార్గదర్శి వీరు. తరువాత కాలం లోని చరిత్రకారులకు వీరి గ్రంథాలు ప్రామాణిక ఆధారాలుగా ఉపకరించాయి. ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్, టి.కె.టి.వీరరాఘవాచార్ మరియు ఎమ్.రామారావు లాంటి పండితులు తిరుపతి గురించిన వారి రచనలకు శాస్త్రిగారి శాసనాధ్యయన నివేదికలను ఆధారంగా చేసుకున్నారు.

**"తిరుపతి శ్రీవేంకటేశ్వర"** అను యీ పుస్తకము దేవస్థాన శాసనాధ్యయన నిపుణుడు కీ॥శే॥ శ్రీసాధుసుబ్రహ్మణ్యశాస్త్రి గారిచే ఆంగ్లంలో వ్రాయబడి టి.టి.డి వారిచే 1981లో మొట్టమొదట ప్రచురించబడినది. తిరుపతి శాసనాలను గురించి ప్రప్రథమంగా నివేదిక తయారుచేసిన సుబ్రహ్మణ్య శాస్త్రిగారే ఈ గ్రంథాన్ని వ్రాయడం మరోప్రత్యేకత. ఈ మోనోగ్రాఫ్ యొక్క శైలి సులభం మరియు సాధారణం. ఈ గ్రంథం పునర్ముద్రణలు పొందుతూ ఇప్పటికి దాదాపు 25,000 ప్రతులకు పైగా అమ్ముడుపోయింది. అత్యంత ప్రజాదరణ పొందిన ఈ గ్రంథాన్ని ఆంగ్లం నుండి తెలుగు, హిందీ, కన్నడ, తమిళ భాషల్లో అనువదించి ప్రజలకు అందుబాటులోకి తీసుకురావాలని టి.టి.డి. సంకల్పించింది. ఆ సంకల్పానుసారంగా ప్రస్తుతం తెలుగు అనువాదాన్ని అందిస్తున్నాము.

**తిరుపతి శ్రీ వేంకటేశ్వర** అనే ఈ అమూల్యమైన పుస్తకాన్ని శ్రీ వేంకటేశ్వరస్వామి వారి భక్తులందరూ తప్పనిసరిగా చదువదగిన గ్రంథంగా పరిచయం చేయడానికి ఎంతో సంతోషిస్తున్నాం.

సదా శ్రీవారిసేవలో...

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానాలు

తిరుపతి

# పీఠిక

షేక్స్‌పియర్ మహాకవి రచించిన **"జూలియస్ సీజర్"** నాటకానికి సర్‌థామస్‌నార్త్ ఆంగ్లంలోకి అనువదించిన ఫ్లూటర్క్ రచించిన "జూలియస్ సీజర్ జీవితం" ఆధారం. నాకు ఆ అనువాదగ్రంథం లభించలేదు. అందువల్ల నేను రెవరెండ్ లారిగ్‌హార్న్ ఫ్లూటార్క్ రచనలకు చేసిన అనువాదాన్ని "పీపుల్ బుక్స్" సీరిస్‌లో చదివాను. క్రీ.పూ 301లో జన్మించిన జూలియస్ సీజర్ తన ముప్పదియవయేట స్పెయిన్‌లో క్వాస్టర్ (Quaester) గా నియమించ బడ్డాడు. కాడిజ్ నగరాన్ని దర్శించి అక్కడి హెర్క్యులెస్ దేవాలయంలో ఆయన అలెగ్జాండరు శిలాప్రతిమను చూశాడు. ఆ విగ్రహాన్ని చూడగానే సీజర్‌కు అలెగ్జాండరు చక్రవర్తి యొక్క విస్తృత విజయాలు, 30వ ఏటమరణించే లోపే ఆయన సాధించిన కీర్తి ప్రతిష్ఠలు స్ఫురణకువచ్చాయి. ఈ ఆలోచన ఆయనకు బాధను కలిగించింది. అతను వలవలా విలపించాడు. అది చూసి అతని స్నేహితుల ఆశ్చర్యపడ్డారు. ఆశ్చర్యపడిన అతని స్నేహితులతో తన కన్నీటికి కారణాలను వివరించాడు సీజర్. "ముప్పది సంవత్సరాల వయస్సు కూడా నిండకముందే అలెగ్జాండారు చక్రవర్తి గొప్ప విజేతగా పేరుసంపాదించి మరణించాడు. నాకు 30వ ఏడుగడుస్తున్నది. నేను ఇప్పటి వరకు గొప్ప పని ఏదీ చేయలేదు. ఈ ఆలోచనే నాలో దుఃఖాతిరేకాన్ని కలిగించి నేను కన్నీళ్ళను ఆపుకోలేకపోయాను" అన్నాడు.

సీజర్ చక్రవర్తి జీవితంలోని ఈ సంఘటన చదివిన తరువాత నాకు చాలా బాధ కలిగింది. దుః ఖంతో విలపించాను. నాకిప్పటికింకా ముప్పది సంవత్సరాల వయసులేదు. నేను ప్రపంచం గుర్తించదగిన ఏదైనా మహత్కార్యాన్ని చేయగలనా? ఈ నా జీవితం ఏమీ సాధించుకుండా గడిచిపోతే ఎలా? అని ఆలోచించాను. జీవిత ప్రారంభంలో ఎంతో బాధనూ దుఃఖాన్ని అనుభవించినప్పటికీ సీజర్ చక్రవర్తి సాహసోపేతమైన సైనిక విజయాలను గడించి అలెగ్జాండరు చక్రవర్తితో సరితూగగల విశ్వవిఖ్యాతి నార్జించాడు. అది చదివిన నాకు సీజరు చక్రవర్తి పేరు గుర్తులకు వచ్చినప్పుడల్లా ప్రగాఢమైన దుఃఖం తద్వార కన్నీళ్ళువచ్చేవి.

ఆంగ్ల మహాకవి జాన్‌మిల్టన్ "నా ఇరువదిమూడవ ఏట" అనే శీర్షికతో తన 24వ పుట్టినరోజు డిసెంబరు 9, 1632న ఒక సానెట్ వ్రాసాడు. ఆ పద్యంలో తన విచారాన్ని, దుఃఖాన్ని వ్యక్తంచేసాడు. "నేను పెద్దవాడినయ్యాను. నాశరీరం నాకున్న వయస్సుకన్నా  తక్కువగానే కనపడుతున్నది. వసంత కాలంపూర్తి చేసుకుంటున్న నేను ఇంతవరకు ఏ గొప్పకార్యాన్ని, ఫలితాన్ని సాధించలేదు. నాకు మానసిక పరిపక్వత చాలినంతగా రాలేదు. నా సమకాలికులు ఎందరో శారీరకంగానూ (Semblance), మానసికంగాను (Inward happiness) చాలా ఎదిగి ఎంతో ఉన్నతిని సాధించి ఆనందంగా ఉన్నారు" అని భావించాడు. భగవంతుని అనుగ్రహంతో తాను కాలం ఎలానడిపిస్తే అలా సాధారణమైనదో, అసాధారణమైనదో ఏదో ఒకటి సాధించడానికి సహనంగా నిరీక్షించడానికి సిద్ధపడ్డాడు. అలా తనకు వచ్చే అవకాశాన్ని భగవంతుని అనుగ్రహంవల్ల సంపూర్ణంగా ఉపయోగించుకో దలచాడు. ఆయన అలాంటి అవకాశాన్ని పొందాడు కూడా.

కాలనిర్ణయానికి కట్టుబడి ఉంటూనే మిల్టన్ మహాకవి ఏదో ఒక అంశాన్ని ఎన్నుకొని రచనా వ్యాసంగాన్ని కొనసాగించాడు. గద్యపద్య ప్రక్రియల్లో అప్పటివరకు ఎవరూ ప్రయత్నించని విశిష్టమైన రచనచేసి "అయోనియన్ పర్వతసానువుల'దాకా ఎగరాలని ఆశించాడు. కొన్ని రచనలు చేశాడు. "King Arthur and the Knights of His Round Table" కింగ్ ఆర్థర్ మరియు ఆయనతో సమావేశమైన మేధావులు" అనే శీర్షికను ఎన్నుకున్నాడు. మేధావులు వారి ప్రణయకథలు ప్యూరిటన్ అయిన మిల్టన్‌కు అంతగా రుచించలేదు. అందుకనే ఆ ప్రయత్నాన్ని కొనసాగించలేదు. చివరకు తనకు బాగా నచ్చిన బైబిల్ గ్రంథంలోని అంశాన్ని ఎన్నుకొని **Paradise Lost** అనే మహాకావ్యాన్ని ప్రారంభించి చాలా సంతృప్తికరంగా మహోన్నతంగా పూర్తిచేశాడు. అలా తనలక్ష్యాన్ని చేరుకున్నాడు.

ఈ ఇద్దరు మహామహుల జీవితవిజయాలు నాకు ప్రేరణ కలిగించాయి. గుర్తించదగిన ఏదో ఒక గొప్పపని చేయాలనే తపన కలిగింది. కాని, భవిష్యత్తును ఊహించలేని నా మనసులో బలమైన కోరిక నిద్రాణంగానే ఉండిపోయింది.

1919వ సం॥రం మే నెలలో తిరుమల తిరుపతి దేవస్థానం వారి విచారణకర్త శ్రీమహంత్ ప్రయాగదాస్‌జీ నన్ను స్వామిసేవలోకి తీసుకున్నారు. ఇరువదిఐదు సం॥లు స్వామివారిసేవలో భక్తి, విశ్వాసం, ఉత్సాహం, నిజాయితీతో వివిధ పదవుల్లో అధికారాన్ని నిర్వహించాను.

క్రీ॥శ॥ 1921వ సం॥లో ప్రభుత్వశాసన అధ్యయన నిపుణుడు ఎచ్.కృష్ణశాస్త్రిగారు లండన్‌లోని భారతగ్రంథాలయ కార్యాలయాధికారి డా॥ ఎఫ్.డబ్ల్యు.థామస్ గారితో తిరుమలను సందర్శించారు. విచారణకర్త శ్రీమహంత్ గారు దేవస్థాన దివాన్ పేష్కార్ శ్రీ సి. దొరస్వామయ్య, B.A.B.L., గారిని పిలిచి శాసనాధ్యయనబృందంలో ఒక సభ్యుణ్ణి తిరుమల తిరుపతి దేవస్థానాల దేవాలయ ప్రాకారాల మీది శాసనాలన్నింటి నకళ్లను తీసి, అక్కడ కొలువై ఉన్న శ్రీవేంకటేశ్వరస్వామి, గోవిందరాజస్వామివారి చరిత్రలను తెలుసుకునేలా చేయాలని చెప్పారు. దొరస్వామయ్యగారి అభ్యర్థన మేరకు శ్రీకృష్ణశాస్త్రిగారు మద్రాసునగరంలోని సహాయక పురావస్తు మరియు శాసనాధ్యయనశాఖవారిని సంప్రదించుతానని శ్రీమహంత్ గారికి చెప్పారు. ఆయన శాసనాధ్యయన శాఖ సూపరింటెండెంట్‌గారిని సంప్రదించారు. తమశాఖ దక్షిణ భారతదేశమంతటా విస్తరించి ఉన్నదనీ, అక్కడి వ్యవహారాలు చూచుకోవడానికే తమకున్న సిబ్బందిచాలడం లేదనీ, ఎవరినీ పంపించడం సాధ్యపడదనీ బదులిచ్చారు. సరియైన వ్యక్తులనెవరినైనా తిరుమల తిరుపతి దేవస్థానంవారు సూచిస్తే వారికి తమ కార్యాలయంలో ఆరు మాసాలకాలం శిక్షణనిచ్చి దేవస్థానంలో శాసనాధ్యయనానికి సంబంధించిన పనులు చక్కబెట్టగలిగే నైపుణ్యాన్ని కలిగిస్తామని తెలిపారు.

కృష్ణశాస్త్రిగారు ఈ విషయాన్ని మహంత్‌గారికి తెలియజేశారు. మహంత్ గారు దొరస్వామయ్యగారు సంప్రదింపులు జరుపుకున్నారు. సరియైన అభ్యర్థులెవరినీ గుర్తించలేకపోయారు. ఆ సమయంలో నేను శ్రీమహంత్‌గారి దగ్గర వ్యక్తిగత సహాయకునిగా పనిచేస్తున్నందువల్ల శ్రీ దొరస్వామయ్యస్వామిగారు నాపేరు

ప్రతిపాదించారు. మహంత్‌గారు నా అభిప్రాయాన్ని అడిగారు. ఏ మాత్రం తటపటాయించకుండా నేను తక్షణమే అంగీకరించాను. జూలియస్ సీజర్, జాన్ మిల్టన్‌ల విజయాలు నన్ను వెంటాడుతున్న ఆ తరుణంలో నాలో నిద్రాణమైన కోరికలు మేలుకున్నాయి. ఒక విశిష్టమైన, ప్రతిభావంతమైన ఈ కార్యం నా కొక మంచి అవకాశంగా, గొప్ప అదృష్టంగా తోచింది. వారిద్దరూ సంతోషించి నాపేరును మద్రాసులోని శాసనాధ్యయన శాఖవారికి పంపించారు. వారు మద్రాసు ప్రభుత్వ ఆదేశాలకై వ్రాసినారు. మద్రాసు ప్రభుత్వం ఆర్థికశాఖవారు జారీచేసిన జి.వో.సంఖ్య 610 ద్వార 1921 జూన్ 14న నా శిక్షణకు ఆదేశాలు వచ్చాయి. కీళ్పాక్‌లో ఉన్న శాసనాధ్యయన కార్యాలయంలో ఆగష్టు 1921లో నేను చేరాను. ఆశాఖలోని కొందరు సభ్యులతో నేను క్షేత్రస్థాయిలో జరిగే ఆచరణాత్మక కార్యక్రమాల అధ్యయనం కోసం తంజావూరు, తిరుచిరాపల్లి, మధుర, దెందులూరు, ఎల్లూరు, విజయవాడ, నెల్లూరు, శ్రీకాళహస్తి వంటి ప్రాంతాలకు వెళ్ళి ఫిబ్రవరి 1922లో తిరుమల తిరుపతి దేవస్థానానికి తిరిగి వచ్చాను.

ఆ తరువాత శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయ ప్రాకారాలపై ఉన్న శాసనాల నకళ్ళను సేకరించాను. ఈ విషయంలో అనుభవజ్ఞులు, సమర్థులు అయిన వి.విజయరాఘవాచార్య పండితులు, తిరుమల తిరుపతి దేవస్థాన ఉన్నత పాఠశాల ఉపాధ్యాయులు శ్రీ.ఆర్. కృష్ణారావుగారి సహాయ సహకారాలతో దాదాపు రెండు సం॥లు పనిచేశాను.

దీనితోపాటు నేను తాళ్ళపాకం వాగ్గేయకారులైన అన్నమాచార్య ఆయన కుమారుడు పెద్దతిరుమలాచార్య మరియు ఆయనకుమారుడు చిన్నతిరుమలా చార్యవారి రచనలు పొందుపరచబడిన రాగిరేకులను శ్రీవేంకటేశ్వరస్వామి వారి ఆలయంలోని ఒక గదిలో భద్రపరిచాను. వాటిని కాగితాల్లో వ్రాసి మూడు టేకుపెట్టెల్లో దాచిపెట్టాను. వీటిలోంచి నేను చిన్న చిన్న రచనలను ఒక సంకలనంలోనూ, రెండు ప్రత్యేక సంకలనాల్లో అధ్యాత్మ సంకీర్తనలు, శృంగార సంకీర్తనలను పొందుపరిచాను. తిరుమల తిరుపతి దేవస్థానం ఉన్నత పాఠశాల తెలుగు పండితులు శ్రీ కలబరి వెంకటరమణ కవిగారు నా అభ్యర్థన మేరకు ఆ సంచికలకు ఫుట్‌నోట్స్ (Footnotes) తయారుచేశారు. దేవస్థానం ప్రచురణ విభాగంవారు తరువాత కొంతకాలానికి ఆ మూడు సంకలనాల్లోని అథస్సూచికలు (Footnotes) చాలా మేరకు తగ్గించి ముద్రించినారు.

1930 వ సం॥లో శాసనాధ్యయన కార్యాలయము మద్రాసుకు మారింది. సంకీర్తనల పత్రాలున్న ఆ మూడు టేకుపెట్టెలను మేము ఆండర్సన్ వీధి, మద్రాసులో ఉన్న దేవస్థానం ముద్రణ కార్యాలయానికి తీసుకు వెళ్ళాము. గద్వాల సంస్థానం వితంతువైన రాణి శ్రీమతి ఆదిలక్ష్మీ దేవమ్మగారు జనవరి 1931లో సమర్పించిన బంగారం మరియు వజ్రాలతో వేంకటేశ్వరస్వామి ఉత్సవమూర్తి, శ్రీమలయప్పస్వామి వారికి వజ్రకిరీటం చేయించే పనిని పర్యవేక్షించడానికి నన్ను మద్రాసుకు పంపించారు. తిరిగి నేను తిరుపతికి బదిలీ అయ్యేంతవరకురాఘవాచార్యపండితులే శాసనాధ్యయన కార్యక్రమాన్ని చూచుకున్నారు. శ్రీమహంత్‌గారి నుంచి పరిపాలనా బాధ్యతలను మద్రాసు ప్రభుత్వం నామినేట్ చేసిన దేవస్థానం కమిటీకి అప్పగించారు.

రెండవ కమీషనర్ శ్రీరంగనాథ మొదలియార్‌గారి హయాంలో దేవస్థాన ముద్రణా కార్యాలయం మద్రాస్ బీచ్ రెండవ లైన్‌లోని థియోసాఫికల్ సొసైటీ భవనంలోకి మార్చబడింది. కార్యాలయాన్ని మార్చుతున్న సమయంలో అప్పటిమేనేజర్ ఆముదు పెట్టెల్లో భద్రపరచబడిన సంకీర్తనల పత్రాలను పనికి రానివని తలచి తగుల పెట్టించి ఖాళీపెట్టెలను మాత్రమే తీసుకువెళ్ళారని వీరరాఘవాచార్య పండిట్‌గారు కొంతకాలం తరువాత నాకు చెప్పారు.

పండిట్‌గారు, నేను ఆ రెండు దేవాలయాలు మరియు యితర ప్రదేశాల నుంచి నఖలుచేసిన ప్రతులు సుమారు (1150) ఒక వేయి నూట ఏబది అయినాయి. వీటికి యితర ఆధారాల ద్వార సేకరించిన మరికొంత సమాచారాన్ని జోడించి నేను “దేవస్థాన శాసనాధ్యయన నివేదికను కూర్చాను. అందులో విజయనగర చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు మరియు అతని కార్యాలయ అధికారులు చేసిన దండయాత్రలు, సాధించిన విజయాలు మరియు అన్నమాచార్యులవారి దగ్గరనుంచి నాలుగు తరువాతి తరాల వాగ్గేయకారుల గురించిన కథనాలున్నాయి. అంతకుముందు తయారుచేసిన రెండు సంకలనాలను అనువదించినాను. మొదటి సంకలనంలో పల్లవులు-పల్లవుల శాసనాలు, చోళుల శాసనాలు, పాండ్యుల శాసనాలు తెలుగు పల్లవులు మరియు యాదవ రాయల గురించిన చారిత్రక కథనాలున్నాయి. యాదవరాయ ప్రభువులు ప్రాంతీయపాలకులు. వీరు దేవగిరి యాదవుల కంటె భిన్నమైనవారు. వీరిగురించి చాలాతక్కువ ప్రచారమే ఉన్నది.

నా ఉద్యోగ విరమణ సందర్భంగా నేను ఒక సిద్ధాంత వ్యాసాన్ని తయారుచేశాను. చాలామంది ప్రసిద్ధిపొందిన పండితులకు చిక్కుముడిగా మారిన “**EdirAndu**” (రాజుగారి పరిపాలనా కాలానికి ఎదురుగా ఉన్న సంవత్సరం) అనే విషయానికి నేను విశ్వజనీనంగా ఉపయోగపడే ఒక పరిష్కారాన్ని సూచించాను. ఈ ప్రయోగం దక్షిణభారతదేశానికి సంబంధించిన వివిధ వంశాలకు చెందిన రాజులు వ్రాయించిన శాసనాల్లో ఉన్నది. చాలామంది పండితులు యీ విషయంలో ఆమోద యోగ్యంకాని విభిన్నమైన వివరణలు ఇచ్చారు. మూడవ రాజరాజచోళుని తిరువేందిపురం శిలాశాసనం ప్రభుత్వ శాసనాధ్యయన నిపుణుడు (డా॥ హల్ట్జ్) Dr.Hultzch ఎడిట్ చేసిన **ఎపిగ్రాఫియా ఇండికా** ఏడవ సంపుటంలో యుద్ధాన్ని గురించి చోళరాజును బంధించడం గురించి వ్రాస్తూ **Edir Andu** అనే యీ సమాసానికి సరియైన వివరణ ఇచ్చారు. కాని, వారు ట్రావెంకూర్ శిలాశాసనాలని ఎడిట్ చేసినప్పుడు పండితులు **Edir Andu** అనే ప్రయోగానికి సూచించిన పరిష్కారాల గురించి సందేహం వ్యక్తంచేసి విమర్శించారు.

ఈ శాసనాధ్యయన వివరాలు చాలామంది సంతోషంగా చదివి వాటిలోని అంశాలను విశిష్టమైనవిగా గుర్తించి ప్రశంసించారు.

దేవస్థాన శాసనాల నివేదిక ప్రథమభాగాన్ని దేవాలయంలో అను నిత్యం జరిగే అర్చనలు, పూజలు, సమర్పణలు, పండుగ సందర్భాల్లో జరిగే విశేషకార్యాక్రమాలు, ధార్మిక కార్యక్రమాలు, మరియు దేవాలయ

భవనాల వైశిష్ట్యం గురించి వ్రాశాను. శ్రీమహంత్‌గారు ఆపేజీలతోపాటు మరికొన్ని పేజీలను తనకు తానుగా చదువుకునేవారు.

ఈ మధ్యకాలంలో మద్రాసువిశ్వవిద్యాలయం "భారతదేశచరిత్ర మరియు పురావస్తు అధ్యయన విభాగ"పు ఆచార్యులు డా॥ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ తిరుపతికి వచ్చారు. నేను తయారుచేసిన శాసనాధ్యయన నివేదికను తనకివ్వమని శ్రీమహంత్ గారిని అభ్యర్థించారు. శ్రీ మహంత్‌గారు దానిని వారికి అందజేశారు. మద్రాసులో ఆ నివేదికను చదివిన తరువాత శ్రీమహంత్ గారికి, ఆనకు ఆ నివేదిక యొక్క చారిత్రక విలువను, ప్రాధాన్యతను పేర్కొంటూ ప్రశంసా పూర్వకమైన సందేశాన్ని వారి కార్యాలయం ద్వార పంపించినారు. ఆ నివేదికను ఏరకమైన ప్రాథమిక నివేదికగానీ, అనువాదంగానీ అవసరంలేకుండానే ముద్రించవచ్చునీ, అది పరిశోధకులకు బహుధా ప్రయోజనకారిగా ఉంటుందనీ వ్రాసినారు. ఎట్టకేలకు నేను రాజకీయచరిత్రతో కూడిన రెండవభాగాన్ని మొదలుపెట్టి పూర్తిచేశాను.

నివేదిక పూర్తిగా సిద్ధమయింది. మద్రాసులోని దేవస్థాన ముద్రణాలయానికి పంపడానికి ప్రయత్నిస్తున్నాను. మద్రాసు విశ్వవిద్యాలయానికి చెందిన డా॥ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ స్థానంలో చేరిన ఆచార్య ఎ.నీలకంఠశాస్త్రిగారు తిరుపతికి వచ్చారు. నేను తయారు చేసిన నివేదిక తీసుకుని తిరుపతిలోని వారి మిత్రుని ఇంటిలో చదివి రెండురోజుల్లో తిరిగి యిస్తానని తీసుకుపోయారు. కాని, వారు ఆ నివేదికను తమ వెంట మద్రాసుకు తీసుకువెళ్ళారు. ఒక నెల తరువాత ఆ నివేదికను ప్రశంసిస్తు వ్రాసిన వారి లేఖతో సహా నివేదికను పంపించినారు. శాసనాధ్యయన నివేదికకు వారు వ్రాసిన మాటల్నే "ఉపోద్ఘాతం'గా చేర్చాను.

నేను వెయ్యిప్రతులను ముద్రించాలనుకున్నాను. కాని, శ్రీమహంత్ గారు ఆ నివేదిక ప్రాధాన్యతను, ప్రయోజకత్వాన్ని, విలువను, అందులో ఉన్న ఆసక్తికరమైన అంశాలను గుర్తించి రెండువేల ప్రతుల ముద్రణకు ఆదేశించారు.

పదవీ విరమణ తరువాత నేను తాళ్లపాక కుటుంబ కవుల గురించిన సంపూర్ణ కథనాన్ని 1949 ఏప్రిల్‌లో దేవస్థానంవారు ఏర్పాటుచేసిన అన్నమాచార్యపండుగ ప్రారంభోత్సవ సందర్భంలో తెలుగులో రచించాను.

దేవస్థానంవారి శాసనాధ్యయన నివేదిక పీఠికలో నేను పేర్కొన్నట్లుగా వేంకటేశ్వరస్వామివారి అనుగ్రహంతో పరిశోధనను మాపెద్దకుమారుడు చి॥నరసింహశాస్త్రితో కలిసి కొనసాగించాలనుకున్నాను. మా అబ్బాయి వైమానిక దళం (AIR FORCE) లో స్క్వాడ్రన్ లీడర్‌గా ఉండేవాడు. పదవీవిరమణకై 1966 నుండి 1968 దాకా విఫల ప్రయత్నం చేశాడు. దురదృష్టవశాత్తు అతను దేవ్‌లాలి వైమానిక సిబ్బంది కేంద్రంలో నవంబరు 1968లో మరణించాడు. నాతో కలిసి పరిశోధన కొనసాగించాలన్న అతని కోరిక నెరవేరలేదు. 1969వ సం॥రం ప్రారంభంలో నేను **"తిరుపతి శ్రీవేంకటేశ్వర"** అనే శీర్షకను

ఎన్నుకొని కొంతకాలం పనిచేసి క్రీ॥శ 1971 చివరిలో పూర్తి చేశాను. దానికి 1975 చివరిలో కొన్ని వివరాలు జతచేశాను.

సెప్టెంబరు ఏడు, పంతొమ్మిది వందల డెబ్బది మూడవ (7.09.1973) నేను కంచిపట్టణానికి వెలుపలనున్న కంచి కామకోటిపీఠంవద్ద పరమపవిత్ర శ్రీచంద్రశేఖరేంద్రసరస్వతి స్వామివారిని దర్శించుకొని ఈ గ్రంథానికి ముందు పొందుపరచిన శ్లోకాలను చదివాను. ఆ తరువాత గ్రంథానికి సంబంధించిన వివరాలను నేను సేకరించిన వివిధ ఆధారాలను గురించి వారికి విన్నవించినాను. వారు నేను చదివిన శ్లోకాలను మెచ్చుకుంటున్నట్లుగా తల ఊపారు. నా గ్రంథంయొక్క వ్రాతప్రతినివారి వద్ద ఉంచి తిరుపతికి వెళ్ళినాను. కొద్దినెలల తరువాత స్వామివారు ఆ వ్రాతప్రతిని కాంచీపురం లోని పచ్చయ్యప్ప కళాశాలలో భౌతికశాస్త్ర ఆచార్యుడిగా పనిచేస్తున్న శ్రీ.కె.ఏకాంబరం గారికి యిచ్చి దానిని చదువమనినారు. అందులో ముఖ్యాంశాలను తనకు వినిపించమనినారు. ఆచార్య శ్రీ ఏకాంబరంగారు అలా వినిపించగా స్వామివారు విని ఎంతో ప్రశంసించి వారి ద్వారానే నా వ్రాతప్రతిని 31.5.1974న పంపించినారు.

(July) జూలై 1975లో శ్రీస్వామివారి శిష్యులు, వారసులు తిరుపతికి వచ్చి తిరుచానూరులో ఉండగా నాసహధర్మచారిణి వారి వద్ద తీర్థం తీసుకునే సమయంలో నా పుస్తకము ప్రచురణలో ఉన్నదని చెప్పినది. వారు దాని ప్రతి ఒకటి పంపమని చెప్పారు. నేను పంపినాను. పరమపవిత్ర శ్రీజయేంద్ర స్వామివారు దానిని చదివి ప్రశంసించారు.

ఇరువురు కంచి కామకోటి పీఠాధి పతుల పరమపవిత్ర ఆశీస్సులతో, ప్రపంచమంతటా పూజించబడుతున్న దైవము శ్రీవేంకటేశ్వరస్వామివారి కథను పుస్తకంగా రూపొందించినాను. ఈ రచనను భక్తులు, భాగవతోత్తములు అందరూ భక్తిశ్రద్ధలతో, ఆసక్తితో చదువుతారని వారి జ్ఞానాన్ని ఉత్తేజ పరిచే దిశగా ప్రేరణను, అవగాహనను (Enlightenment) పొందుతారని విశ్వసిస్తున్నాను.

ఈ విధంగా అత్యంత సాధారణమైన నా జీవితంలో పాఠకులు అందరూ ఆదరించదగిన, సేవార్హమైన ఒక పనిని నా శక్తి యుక్తులమేరకు విజయవంతంగా పూర్తి చేసినాను. నా జీవితానికి ఈ రచనే సాఫల్యాన్ని, సంతృప్తిని కలిగించింది. నా జీవితం ఊసరక్షేత్రంగా మిగిలిపోలేదనే తృప్తి నాకు లభించినది.

విశ్రాంత సాహితీ పండితులు శిరోమణి సుస్వరం గోపాలకృష్ణమాచార్యులగారికి నేనెంతో ఋణపడి ఉన్నాను. వారు పురాణాల్లోని 'శ్రీ వేంకటాచలమాహాత్మ్య'నికి సంబంధించిన కొన్ని ఘట్టాలను కొన్ని నెలల పర్యంతం నాతో చదివి ముఖ్యమైన విషయాలను వివరించినారు. వారి కారుణ్యానికి నేను ఎంతో కృతజ్ఞుడను. విశ్రాంత సీనియర్ తెలుగు పండితులు నరకంఠీరవ శాస్త్రులగారి మనుమడు, నా మేనల్లుడు విద్వాన్ శిరోమణి వట్టిపల్లె బాలకృష్ణశాస్త్రిగారు పద్మపురాణం యొక్క సంక్షిప్త సారాంశాన్ని నాకు అందించారు. వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. విశ్రాంత వైఖానస పండితులు శ్రీ ఆర్. పార్థసారథి అయ్యంగార్ వరాహ పురాణానికి చేసిన తెలుగు అనువాదం నాకెంతయో ఉపయోగపడినది. తిరుమల ఎస్.వి. ఉన్నత

పాఠశాల సహాయక ప్రధానోపాధ్యాయులు శ్రీ ఎస్.కృష్ణారెడ్డి గారు నా(శ్రేయోభిలాషి మరియు ఆప్తమిత్రుడు. ఈ గ్రంథాన్ని మొట్టమొదట ముద్రించినపుడు వారు చాలా సహకరించారు. ఎస్.వి.ఆర్ట్స్ కళాశాల తెలుగు ఉపన్యాసకులు కామిశెట్టి శ్రీనివాసులుగారు ఈ పుస్తక ప్రచురణలో చాలా ఆసక్తిని చూపించారు. వీరందరికీ నేను ఎంతయో ఋణపడి ఉన్నాను.

నా జీవితంలోని బృహత్గ్రంథంగా (*magnum opus*) పేర్కొన దగిన ఈ గ్రంథాన్ని ముద్రించి, ప్రచురించి నను ధన్యజీవిని చేసిన తిరుమల తిరుపతి దేవస్థానాల అధికారులకు, ధర్మకర్తలమండలికి, కార్యనిర్వాహక అధికారిగారికి వారు చూపిన ఆదరాభిమానాలను, ఔదార్యానికి కృతజ్ఞతలు చెప్పడానికి నా భాషాశక్తి, అభివ్యక్తిచాలవు.

మీ అత్యంత అభిమానపాత్రుడు

S.Subrahmanyasastry.

**సాధు సుబ్రహ్మణ్యశాస్త్రి**

# అభిప్రాయాలు మరియు సమీక్షలు

**I. తేదీ 9-3-1926న డా.ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్ గారు వ్రాసినలేఖ.**

"శాసనాధ్యయన నివేదిక వ్రాతప్రతిని అమితానందంతో చదివినాను. ప్రాథమిక నివేదికకు అసలైన రూపకల్పన చేశారు. ఈ నివేదిక తెలుపుతున్న సారాంశం చాలా ఆసక్తిదాయకంగా శాసనాలకు సంబంధించిన సరియైన సూచికగా ఉంది."

**II .విజయనగరం కళాశాల ప్రధానాచార్యులు కె.ఆర్.సుబ్రహ్మణ్యంగారు "దేవస్థానం శాసనాధ్యయన నివేదిక" గురించి 28.8.1933న 'హిందూ' పత్రికలో వ్రాసిన సమీక్ష.**

"శాస్త్రిగారు తన పేరు ప్రఖ్యాతులను ఇనుమడింపజేసే ఉపయోగకర మైన, శ్రమతో కూడిన గొప్ప పనిచేసి ఒక పురావస్తు అధ్యయన నిపుణుడిగా, సులభశైలిలో వ్రాసే చరిత్రకారుడిగా పేరు పొందారు. వారికి అప్పగించ బడినది కడుక్లిష్టమైన కార్యము. దాదాపు ఒక వేయి రెండువందల శిలా శాసనాలను ఓపికగా అధ్యయనం చేసి, చతురతతో అందులో లభించిన విషయాలను ఒక మంచి కథనంగా సమకూర్చిన వారి కృషి చాలా విలువైనది. ఇంకాముందు ముందు వారు మరికొన్ని విలువైన గ్రంథాలను వెలువరించాలని ఆశిస్తున్నాను"

"రచయిత తన గ్రంథాన్ని రెండు భాగాలుగా విభజించారు. మొదటి భాగంలో వారు తిరుపతి, తిరుచానూరు, తిరుమలలోని శాసనాల సహాయంతో దేవాలయంలో కొనసాగే నిత్యసేవలు, భోజనవసతి, పండుగ నిర్వహణ, దేవస్థాన భూములు, మరియు ఇతర ఆస్తులు, రాజులు, ధనవంతులు, సామాన్యప్రజలు ఇచ్చిన విరాళాలు, ఆస్తుల గురించి వ్రాశారు.

రెండవభాగము శాసనాల సమాచారం ఆధారంగా వ్రాయబడిన దక్షిణ భారత రాజవంశీయుల చారిత్రక వర్ణన. తుళువ వంశీకుల చరిత్ర పరిపూర్ణం గాను కొన్నివిషయాల్లో మౌలికంగానూ ఉంది. విజయనగర రాజులశకపు మతగురువుల గురించిన వివరణలు నిత్యనూతనంగా ఆసక్తికరంగా చదువుకోదగ్గట్టు ఉన్నాయి.

విజయనగర చరిత్ర తెలుసుకోదలచిన ప్రతి విద్యార్థి చదువదగిన గ్రంథ మిది.

**III. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల ఆచార్యుడు, తరువాత కాలంలో ట్రావెంకూర్ విశ్వవిద్యాలయం ఆచార్యుడుగా పనిచేసిన వి. రాఘవాచార్య గారు డా॥ఎస్.క్రిష్ణస్వామి అయ్యంగార్ గారి "తిరుపతి చరిత్ర" రెండవ సంపుటం గురించి 11 జూలై 1943వ ఈ క్రింది విధంగా సమీక్షించారు.**

"శాసనాల గురించి తిరుమల తిరుపతిదేవస్థానం కమిటీ" వారు మూడువేల నలుబదిరెండు పుటలు కలిగిన ఎనిమిది పెద్ద సంపుటాలను ప్రచురించిన విషయం లోకవిదితమే. ఈ ఎనిమిది గ్రంథాలలో ఉపోద్ఘాత గ్రంథం ప్రజలందరికీ ఆసక్తిని కలిగించే పండుగలు, ఉత్సవాలకు సంబంధించిన విశేషాలను

శాసనాల్లోనూ, దేవాలయాల్లో భద్ర పరచబడిన గ్రంథాల్లోనూ ప్రస్తావించబడిన అంశాలనూ విశ్లేషించారు. రెండువందల డెబ్బదిమూడు పుటల్లోనున్న మొదటి సంకలనంలో దేవాలయం మొట్టమొదటి రోజుల్లో ఎలా పురోభివృద్ధి చెందిందీ తెలియజేసే శాసనాధ్యయన నివేదిక లున్నాయి. ఈ నివేదికలు చాలా పాతకాలం గురించి కాకుండా క్రీ॥శ॥ 800–1450 కాలంలో దేవాలయ ప్రగతి గురించి తెలియజేయడం ఆశ్చర్యకరం. డా॥ కృష్ణస్వామి అయ్యంగార్ గారి సమీక్ష ఈ మొదటి సంకలనం గురించే ప్రస్తావించింది. రెండువేల నాలుగు వందలపుటల ఐదు ఇతర సంపుటాలు సాళువ, తుళువ మరియు విజయనగర ఆరవీడు వంశాల పాలనా కాలంగురించి మరియు 1801 వరకు పాలించిన బీజాపూర్, గోల్కొండ, మొగలు, కర్ణాటక, ఫ్రెంచి, మరియు ఎస్.సుబ్రహ్మణ్య శాస్త్రిగారి అనువాదము మరియు పరిష్కరణ బహుధా ప్రశంసనీయాలు

**IV. 14.1.1956న మద్రాసు శాసనాధ్యయన విభాగం, కోయంబత్తూరులో పనిచేసిన శ్రీ కె.వి.సుబ్రహ్మణ్యం అయ్యర్‌గారు వ్రాసిన లేఖ.**

“తిరుపతి దేవాలయ శాసనాల ముద్రణ గురించి నేనిదివరకు దాన్ని వ్రాతప్రతిరూపంలో చూసినప్పుడు చెప్పిన దాన్నే తిరిగి వ్రాస్తున్నాను. ఎడిటర్ గారికి ఉన్న విశ్వసనీయతను, కీర్తిని తెలిపే సమంజసమైన రచనయిది.”

**V. తేది 11.01.1948 న అచార్య కె.వి.రంగస్వామి అయ్యంగార్ గారు, వ్రాసినలేఖ. (వీరు ట్రావెంకూర్ విశ్వవిద్యాలయంలో మరియు బనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో మరియు తిరుపతి ఎస్.వి.ప్రాచ్యకళాశాలల సంచాలకులుగా సేవలందించారు).**

“**Andu Edirandu**” (ఆణ్డు–ఎదిర్ ఆణ్డు) అనే అంశంపై మీరు నాకు పంపించిన పునర్ముద్రణ ప్రతికి నాకృతజ్ఞతలు. అది చాలాముఖ్యాంశం. మీరు ఆ అంశాన్ని చాలా క్షుణ్ణంగా మీకులభించిన శాసనాధ్యయనాల సమాచారం ఆధారంగా వ్రాసి ఉంటారు. నాకు వీలు చిక్కినప్పుడు మీరు పంపిన విషయాన్ని జాగ్రత్తగా శ్రద్ధగా చదువుతాను. మంచిగుణాత్మకమైన విలువలున్న రచన చేసేవ్యక్తిగా పేరొందిన మీకు నేను అభినందనలు చెప్పడం విశేషమేమీ కాదు. దేవస్థానం వారి యీ పనిలో నిమగ్నమైనమీరు చరిత్ర మరియు విశ్వవిద్యాలయములో లేకపోవడం ఒక తీర్చలేనిలోటుగా భావిస్తున్నాం.”

**VI. ఆచార్య కె.వి.రంగస్వామి అయ్యంగార్, ఢిల్లీ 27.4.1948న వ్రాసిన లేఖ.**

“**Andu Edirandu**” (ఆణ్డు–ఎదిర్ ఆణ్డు) అనే అంశంపై మీరు వ్రాసిన వ్యాసం నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. అంతకుముందు చాలా మంది పండితులు యీ అంశంపై యిచ్చిన వివరణలు నాకు ఆమోద యోగ్యంగా లేవు.

మీ సిద్ధాంతం క్రొత్తగాను ఆకట్టుకునేలాగానూ ఉంది. దానికి రాజ్యాంగ బద్ధమైన ప్రాధాన్యత ఉంది. సాధారణంగా ఏ రాజైనా తన ఓటమినిగాని రాజ్యాధికారాన్నించి తనను తప్పించడంగానీ అంగీకరించడు.

రాజులు సామాన్య ప్రజలకన్నా గర్విష్ఠులు. వారు పొగడ్తలకు లొంగిపోతారు. ప్రశంసలకు అలవాటుపడతారు. అందువల్లనే భారతదేశంలో విజయ శాసనాలగురించిన వివరాల్లో కొంత అతిశయోక్తి ఉంటుంది. కాని మీరు ప్రతిపాదించిన సిద్ధాంతం ప్రకారం దక్కను మరియు దక్షిణభారత రాజులు కార్యాలయ నివేదికల్లో తాము తాత్కాలికంగా పొందిన అపజయాల్ని, పదవీనష్టాన్ని నిష్కర్షగా అంగీకరించారు. కార్యాలయ పత్రాల విలువ నిర్దోషమైన వాటి నిర్వహణ మనమెరిగినదే. పురావస్తుశాఖవారు భద్రపరచిన దస్తావేజులు, వాటి క్రమపద్ధతి గర్విష్ఠులైన రాజులు సహితం లొంగిపోయేలా చేస్తాయి అని తెలుస్తుంది.

మీరు చాలా శాసనాల్లో "**Edirandu**" (ఎదిర్ ఆణ్డు) అనే పదం వాడబడినచోట్ల దాన్ని చక్కగా విశ్లేషించి అన్వయించారు. ఆ పదం "ఒక రాజుగారి పరిపాలనా కాలంలో ఏర్పడిన అంతరాయం తెలియజేస్తుందని చెప్పినారు. హేతుబద్ధంగా సిద్ధాంత కల్పన చేసిన మీరు విద్యార్థులను "**Edirandu**" (ఎదిర్ ఆణ్డు) అనే పదం ఉపయోగించబడిన గ్రంథాలను, దస్తావేజులను నిశితంగా పరిశీలించి మీరు సూచించిన అన్వయాన్ని సరిచూచుకోవాలని చెప్పడం విశేషం. ప్రభుత్వ శాసనాధ్యయన శాఖలో పనిచేస్తున్న యువతరం పరిశోధకులు ఆ పని చేపడతారని ఆశిస్తున్నాను. ఒక వేళ మీరు ప్రతిపాదించిన సిద్ధాంతము నిరూపించబడితే కాలగర్భంలో మరపుకు గురియైన ఎందరో రాజులు, రాజవంశాల గురించిన కాల నిర్ణయాన్ని "**Edirandu**" (ఎదిర్ ఆణ్డు) సూచిస్తుంది.

నేను చదివినంత వరకు శాసనాల్లో ఏ యితర అంశం కూడా సత్యాన్ని ఇంతగా ప్రతిబింబించలేదు.

ఒక పాలకుడు ఓటమికి గురియై లేదా పదవినికోల్పోయి తిరిగి రాజుగా లేదా పాలకుడిగా రెండవసారి పట్టాభిషేకం చేసుకోవడం ఆశ్చర్యంగా అనిపిస్తుంది. "**Edirandu**" (ఎదిర్ ఆణ్డు) అలాంటి సంఘటనను నమోదు చేస్తుంది. పట్టాభిషేక ఘట్టం ఒక యువరాజు పాలనా కాలపు ప్రారంభాన్ని తెలియజేస్తుంది. అశోకచక్రవర్తి పరిపాలన స్వీకరించిన మూడు సంవత్సరాల తదుపరి పట్టాభిషేకం జరిగింది. కాని ఒక రాజు మూడుసంవత్సరాల కాలంలో మూడుసార్లు తొలగించబడితే అతని పాలనా కాలం మొదట తొలగించబడిన సంవత్సరం నుంచి లెక్కించితే అది పై వివరణకు అనుగుణంగా ఉండదు.

ఏదియేమైనా ఒక గొప్ప సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన మిమ్ములను హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. ఈ మీ ప్రతిపాదన చాలా సందర్భాల్లో బహుశా అన్ని సందర్భాల్లోనూ నిరూపించబడుతుందేమో! దస్తావేజుల ద్వార సంతరించుకున్న ప్రాధాన్యత కన్నా దీనికి రాజ్యాంగ ప్రాధాన్యం, గుర్తింపు, ప్రత్యేకత ఎక్కువ. ఉత్తరభారతదేశ శిలాశాసనాల్లో ఇలాంటి ఆచారం కనిపించదు. కాబట్టి, దక్షిణభారత దేశపుకీర్తికి ఇది కలికి తురాయి.

మీరు ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని క్రమపద్ధతిలో అన్ని శిలాశాసనాల్లో ఈ పదం వాడబడిన చోట అది ఎంతవరకు వర్తిస్తుందో చూస్తూ దానికి భిన్నమైన వాదనలను కూడా పరిశీలించే దిశగా యువ పరిశోధకులను నియోగించాలని ఆచార్య వి.ఆర్.ఆర్.దీక్షితార్ గారిని కోరుతాను.

డాక్టరేట్ డిగ్రీ పొందిన చాలా సిద్ధాంత గ్రంథాలకు ఏ మాత్రం తక్కువగాని డాక్టరేట్ డిగ్రీ ఇవ్వదగిన సిద్ధాంతం మీది.

సరికొత్త అభినందనలు మరియు సాదర సత్కారంతో...

<u>అంకితపత్రం</u>

**పరమేశ్వర శ్రీలక్ష్మీవేంకటేశ్వరస్వామివారి**

**పవిత్రపాదపద్మాలకు వినమ్రపూర్వక భక్తి విశ్వాసాలతో**

**మరియు**

**పరమపవిత్రం అత్యంత ప్రీతిపాత్రమైన**

మా మాతృమూర్తి **శ్రీ లక్ష్మీదేవి** (1871–1899)

మా నాన్నగారు **శ్రీ వెంకటరాయశాస్త్రులు** (1860–1924)

నా పెద్దకూతురు **కామాక్షీదేవి** (1919–1944)

నా పెద్దకుమారుడు **నరసింహశాస్త్రి** (1921–1968)

నా చిన్నకుమారుడు **కృష్ణశాస్త్రి** (1929–1972)

నా సహధర్మచారిణి **శ్రీమతి వెంకటలక్ష్మమ్మ** (1901–1978)

మరియు మా మేనమామ

**శ్రీ వట్టిపల్లె నరకంఠీరవశాస్త్రులు** (1869–1910)గారి

స్మృతికి

ఈ మోనో గ్రాఫ్‌ను అంకితం చేస్తున్నాను.

**సాధుసుబ్రహ్మణ్యశాస్త్రి**

రచయిత

1889–1981



**శ్రీ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి గారు**

గ్రంథకర్త

జననం : 17-12-1889 నిర్యాణం : 10-09-1981

1977 మార్చి 25 వ తేదీ శ్రీ శాస్త్రిగారు ఒక సమ్మానసభలో ప్రసంగించే దృశ్యం సందర్భంగా ఆనాడు తాళ్లపాక అన్నమాచార్యులు వర్ధంతి సభ కావడం విశేషం. అదే ఆయన జీవితంలో చిట్టచివరి సాహిత్య సభ కావడం బాధాకరమైన అంశం. ఈ సభ జరిగిన ఐదు నెలలకే అంటే 1981 సెప్టెంబరు 10 వ తేదీ విష్ణుపరివర్తన ఏకాదశి పుణ్యదినాన ఆయన పరమపదించారు.

# ప్రార్థన

**విఘ్నధ్వాంత నివారణైక తరణిః విఘ్నాటవీహవ్యవాట్**
**విఘ్నవ్యాళ కలాపమత్తగరుడో విఘ్నేభ పంచాననః ।**
**విఘ్నోత్తుంగ గిరి ప్రభేదన పవిః విఘ్నాబ్ధి కుంభోద్భవః**
**విఘ్నాఘౌఘ ఘనప్రచండ పవనః విఘ్నేశ్వరః పాతుమామ్ ॥**

ఆటంకాలనే చీకటిని పోద్రోలే సూర్యుని వంటివాడు, ఆటంకాలనే అడవిని కాల్చే నిప్పువంటివాడు, ఆటంకాలనే పాములను సంహరించే గరుడుని వంటివాడు, ఆటంకాలనే ఏనుగులను సంహరించే సింహం వంటివాడు, ఆటంకాలనే ఎత్తైన పర్వతాలను భేదనం చేసే వజ్రాయుధం వంటివాడు, ఆటంకాలనే సముద్రానికి అగస్త్యుని వంటివాడు, ఆటంకాలనే మేఘాలకు తీవ్రమైన గాలి వంటివాడు, ఐన విఘ్నేశ్వరుడు నన్ను రక్షించుగాక!

**యాకుందేందు తుషారహారధవళా యాశుభ్రవస్త్రాన్వితా**
**యావీణావరదండ మండిత కరా యాశ్వేత పద్మాసనా ।**
**యాబ్రహ్మాచ్యుత శంకర ప్రభృతి భిర్దేవైస్సదా పూజితా**
**సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా ॥**

కుంద పుష్పం, చంద్రుడు, మంచు, పుష్పహారంవలె తెల్లనైన, శుభ్రమైన వస్త్రాన్ని ధరించిన, వీణ, వరదండం చేతిలో ధరించిన తెల్లని పద్మము పై ఆసీనురాలైన, లక్ష్మీదేవి నారాయణుడు, శంకరుడు, మొదలైన దేవతలచే ఎల్లప్పుడూ పూజింపబడిన, జాడ్యాన్ని పూర్తిగా హరించునదైన భగవతి సరస్వతి నన్ను రక్షించు గాక!

**శాంతాకారం భుజగ శయనం**
**పద్మనాభం సురేశం**
**విశ్వాకారం గగన సదృశం**
**మేఘవర్ణం శుభాంగమ్ ।**
**లక్ష్మీకాంతం కమలనయనం**
**యోగిభిర్ధ్యాన గమ్యం**
**వందే విష్ణుం భవభయహరం**
**సర్వలోకైక నాథమ్ ॥**

శాంతమైన ఆకారం కలిగిన, సర్పం పైశయనించిన, నాభియందు పద్మం కలిగిన, దేవతలకు అధిపతియైన విశ్వంవలె కన్పించుచున్న, ఆకాశంవలె సర్వత్ర వ్యాపించిన, మేఘంవలె శరీరకాంతి కలిగిన,

శుభాకృతి కలిగిన, లక్ష్మీదేవీ పతియైన, కమలాలవంటి కన్నులు కలిగిన, యోగుల ధ్యానంచే హృదయంలో ప్రవేశించువాడు, సంసారభయాన్ని హరించేవాడు, లోకాలన్నింటికీ ప్రభువైనవాడు – అట్టి విష్ణువునకు నమస్కరిస్తున్నాను.

**యం శైవాస్సముపాసతే శివ ఇతి**
**బ్రహ్మేతి వేదాంతినః**
**బౌద్ధాః బుద్ధ ఇతి ప్రమాణ పటవః**
**కర్తేతి నైయాయికాః ।**
**అర్హన్ని త్యథ జైన శాసనరతాః**
**కర్మేతి మీమాంసకాః**
**సోఽయం వో విదధాతు సంచిత ఫలం**
**త్రైలోక్యనాథో హరిః ॥**

శైవులు శివుడనీ, వేదాంతులు బ్రహ్మయనీ, బౌద్ధులు బుద్ధుడనీ, నైయాయికులు కర్తయనీ, జైనులు అర్హతుడనీ, మీమాంసకులు కర్మ అనీ, ఎవరిని ధ్యానించుచున్నారో, అట్టి త్రిలోక ప్రభువైన హరి మాకు సంచిత ఫలము నిచ్చుగాక!

**వినా వేంకటేశం న నాథో న నాథః**
**సదా వేంకటేశం స్మరామి స్మరామి ।**
**హరే! వేంకటేశ! ప్రసీద ప్రసీద**
**ప్రియం వేంకటేశ! ప్రయచ్ఛ ప్రయచ్ఛ ॥**

వేంకటేశ్వరునకంటె వేరే ప్రభువులేదు. ఎల్లప్పుడూ వేంకటేశ్వరుని స్మరిస్తాను. ఓ హరీ! వేంకటేశా! ప్రసన్నుడవై మా కోర్కెలను ప్రసాదించవయ్యా!

**వందే పద్మకరాం ప్రసన్న వదనాం**
**సౌభాగ్యదాం భాగ్యదాం**
**హస్తాభ్యా మభయప్రదాం**
**మణి గణైర్నానావిధైర్భూషితామ్ ।**
**భక్తాభీష్టవరప్రదాం**
**హరి హరబ్రహ్మాదిభిస్సేవితాం**
**పార్శ్వేపంకజశంఖపద్మనిధిభి**
**ర్యుక్తాం సదా శక్తిభిః ॥**

హస్తంలో పద్మాన్ని కలిగిన, ప్రసన్నమైన ముఖం కలిగిన, శుభకరమైన భాగ్యాన్నిచ్చే, అభయాన్ని ప్రసాదించే, మణిసమూహాలచే అలంకరింపబడిన, భక్తులకు ఇష్టమైన వరాలు ఇచ్చే విష్ణువు శివుడు బ్రహ్మ మొదలైన దేవతలచే సేవింపబడుతూ, ప్రక్కలో శంఖ పద్మ నిధులు కలిగినట్టి లక్ష్మీదేవికి నమస్కరిస్తున్నాను.

**అసారే సంసారే నిజభజనదూరే జడధియా భ్రమంతం**
**మా మంధం పరమకృపయా పాతు ముచితమ్ ।**
**మదన్యః కోదీన స్తవ కృపణరక్షాతి నిపుణః**
**త్వదన్యః కోవామే త్రిజగతి శరణ్యః పశుపతే!**

సారంలేని ఈ సంసారంలో నీ భజనకు దూరమైన దానిలో జడబుద్ధితో భ్రమిస్తున్న అంధుణ్ణైన నన్ను రక్షించడం ఉచితం. నాకంటె దీనుడెవడు? నీకంటె రక్షించుటకు నిపుణుడెవరు?

**వాగ్దేవీమితి యాంవదంతి మునయః**
**క్షీరాబ్ధికన్యామితి**
**క్షోణీభృత్తనయామితి శ్రుతిగిరో**
**యామామనంతి స్ఫుటమ్ ।**
**ఏకామేవ ఫలప్రదాంబహువిధాకారాం**
**తనుంబిభ్రతీం**
**కామాక్షీం కవిభిర్నుతాంచ సుభగాం**
**వందే మహేశప్రియామ్ ॥**

"నేను శ్రీ మహేశుని దేవేరియైన కామాక్షీదేవిని ఆరాధిస్తున్నాను. శ్రీ కామాక్షీదేవి లక్ష్మిగా పార్వతిగా చెబుతూనే వేదాలు సరస్వతిగా ఈ ముగ్గురు వేర్వేరు రూపాలతో కనబడినా, వారిచ్చే ఫలం ఒక్కటే! ఈ ముగురమ్మలను కవులు పవిత్ర భావనతో ప్రశంసించియున్నారు."

* * *

## విషయసూచిక

# కృతజ్ఞతా నివేదనం

ఈ మోనోగ్రాఫ్ ఈ విధంగా సర్వాంగ సుందరగా ముద్రింపబడి విడుదల కావడంలో ప్రస్తుత గ్రంథ రచనలో పలువురు ప్రముఖులైన అధికారుల, మేధావుల, ఆప్తమిత్రుల, శ్రేయోభిలాషుల సహాయసహకారాలను పొంది ఉన్నాడు. వారికందరికీ కృతజ్ఞతా పారిజాతాలను సమర్పించు కొంటున్నాడు.

1) ఛైర్మెన్, తి.తి.దే., పాలకమండలి సభ్యులు.

2) శ్రీ సి.అన్నారావుగారు, మాజీ–ఛైర్మెన్, తి.తి.దే. పాలకమండలి.

3) శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్, ఐ.ఏ.ఎస్., కార్యనిర్వహణాధికారి, తి.తి.దే.,

4) శ్రీ పి.రాజగోపాలరాజు, ఐ.ఏ.ఎస్., ఎండోమెంట్స్ కమీషనర్.

5) శ్రీ ఎస్.కృష్ణారెడ్డి (గోపీకృష్ణ), ఎం.ఏ.,బి.యిడి., అసిస్టెంట్ హెడ్ మాస్టర్, ఎస్.వి.హైస్కూల్, తిరుమల.

6) శ్రీ కె.శ్రీనివాసులు శెట్టి, ఎం.ఏ., స్పెషల్ ఆఫీసర్, శ్రీఅన్నమాచార్య ప్రాజెక్ట్, తి.తి.దే., తిరుపతి.

7) డా॥ కె.ఎస్.ఆర్.దత్త, ఎం.ఏ, పిహెచ్.డి., ప్రిన్సిపాల్, ఎస్.వి. ఓరియంటల్ కళాశాల, తిరుపతి.

8) శ్రీ. ఎం.విజయకుమార్ రెడ్డి, ఎల్.పి.టి., మేనేజర్, తి.తి.దే. ముద్రణాలయం, తిరుపతి.

9) శ్రీ ఆర్.సూర్యనారాయణమూర్తి, పి.ఆర్.ఓ., తి.తి.దే.,త ఇరుపతి.

10) శ్రీ కె.సుబ్బారావు, ఎం.ఏ., సంపాదకుడు, సప్తగిరి, తి.తి.దే.,తిరుపతి.

11) శ్రీ ఎం.గోపాలరెడ్డి, అసిస్టెంట్ మేనేజర్ మరియు తి.తి.దే. సైన్సు యావన్మది సిబ్బంది.

12) శ్రీ తమ్మన్న, అధీక్షకులు, తి.తి.దే., ఉద్యానవనాలు.

13) శ్రీమతి సాధు గిరిజాసారథి, నా కడగొట్టు కుమార్తె, నా వార్ధక్యదశలో నన్ను కన్నతల్లివలె కంటికి రెప్పలా కాపాడిన దయామయి.

– ఎస్.ఎస్.శాస్త్రి



**వజ్రకవచధర శ్రీ మలయప్ప స్వామి వారు**

మలయప్ప స్వామి ధరించి ఉన్న కిరీటాన్ని 1930 ప్రాంతంలో శ్రీ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి (గ్రంథకర్త) గారి ప్రత్యక్ష పర్యవేక్షణలో తయారు చేయబడింది. ఈ కిరీట నిర్మాణానికి అవసరమైన వజ్రాలు, రత్నాలు, బంగారము సర్వమూ గంగాభాగీరథీ సమానురాలైన గద్వాల్ సంస్థాన మహారాణి గారి భూరి వితరణచే సాధ్యమైనది.



**శ్రీ ఆనంద నిలయ విమానం**

(అధ్యాయం-13)




**శ్రీ కల్యాణ వేంకటేశ్వరస్వామి వారి శ్రీనివాసమంగాపురం దేవాలయం**

(తిరుపతికి 7 మైళ్ల దూరంలో ఉంది)



చక్రవర్తి అచ్యుత దేవరాయలు - ఆయన దేవేరి వరదాజియమ్మ నల్లశాణరాతి విగ్రహాలు, తిరుమల దేవాలయంలోని ప్రతిమా మందిరంలో దర్శనమిస్తాయి (పుట-84)



**తాళ్లపాక కవి వాగ్గేయకారుల సంకీర్తనలు రాగిరేకులపై చెక్కబడినవి.**
**గుత్తులు గుత్తులుగా ఒక వలయానికి వింగడింపబడి ఉన్నవి.**
చూడు. సంకీర్తన భాండారము, పుటలు 84, 223, 244-248, 250, 263-264, 372-375.





తిరుచానూరులో శ్రీ పద్మావతీ అమ్మవారు తాను పద్మసాలె కులస్థుల వారసురాలినని
ఉద్ఘాటించు తామ్రపత్ర శాసనపు రేకులు (పుట–247)
పద్మావతీ అమ్మవారు సాక్షి పలికిన తాళ్లపాక చిన్నన్న 'పాదకానిక' శాసనము (క్రీ.శ. 1543)



**తిరుమలపై శ్రీవారి ఆలయానికి ఎదురుగా గల వేయి కాళ్లమంటపం - దిగువ మెట్ల వరుస - పైన స్తంభాల వరుస (పుటలు.88-89) మంటపం కుడివైపు పై భాగంలో కనబడేది శ్రీ హాథిరాంజీ మఠం. ఇది మహంతుల కాలంలో పరిపాలనా భవనంగా ఉండేది. తిరుమల దేవాలయ వ్యవహారాలకిది ప్రధాన కార్యాలయం. మహంతులు తిరుమల-తిరుపతి దేవస్థాన 'విచారణ కర్తలు' గా 90 సంవత్సరాలు పరిపాలించారు. (అధ్యాయం-25) మంటపం దిగువభాగంలో ఉండేదే కొలువు మంటపం. ఇక్కడ సహస్రదీపాలంకార సేవ జరుపబడేది. ఇప్పుడు ప్రతిరోజు సాయంత్రం 6 గం॥లకు జరుపబడుతోంది. ప్రస్తుతం 'వేయి కాళ్ల మంటపం' లేకపోయినా యాత్రీకుల సంచారానికి ఇబ్బంది లేకుండా తొక్కిసలాటలు, త్రొక్కులాటలు లేకుండా విశాలంగా దారి ఏర్పాటు చేయబడింది.**





రమణీయంగా శిల్పకళానైపుణ్యం ఉట్టిపడే విధంగ తిరుమల ఆలయంలోని
స్తంభాలు విజయనగర శిల్పకళాచాతుర్యానికి తార్కాణాలుగా ఉన్నాయి.



తిరుపతిలో కొండదిగువ కపిలతీర్థం (పుటలు-15, 320, 331).
ఒకప్పుడు 'ఆళ్వారుతీర్థం' గా శాసనాల్లో ప్రసిద్ధికెక్కినదే ఈనాటి కపిలతీర్థం.
అతిప్రాచీన వైష్ణవాలయం శైవాలయంగా మారింది.
ఆళ్వారుతీర్థంగా ఉన్నప్పుడు ఇది తిరుమలకు ముఖద్వారంగా గుర్తింపబడింది.

# అధ్యాయం-1

## అవతారిక

వేంకటాచలంపై నెలకొని ఉన్నందున, వేంకటాచలానికి ప్రభువైనందున వేంకటేశ్వర నామంతో ప్రసిద్ధినందినారు. ఆ ప్రభువునకు ప్రత్యేకమైన పేరేదీ లేదు. వేంకటాచలం పై స్వామి నివాసమున్నందున **తిరుపతి** (శ్రీపతిపురం)= లక్ష్మీపతి స్వధామం అనే పేరు వేంకటాచలంపై నున్న గ్రామానికే చెల్లడం ఉచితం, కాని, వేంకటాచలానికి క్రిందనున్న పట్టణానికే ప్రసిద్ధమై ఉన్నది. వేంకటాచలంపైనున్న గ్రామాన్ని తిరుమల లేదా **ఎగువ తిరుపతి** అని వ్యవహరిస్తారు. క్రిందనున్న తిరుపతి **దిగువ తిరుపతి** దీనికంటె వేరని నిర్దేశించడానికి ఎగువ తిరుపతి అనే వ్యవహారం ఏర్పడింది.

ఎగువ తిరుపతిపై శ్రీవేంకటేశ్వర స్వామి ఆలయం ఉండగా, దిగువ తిరుపతిలో శ్రీకోదండరామస్వామి, శ్రీగోవిందరాజస్వామి ఆలయాలు ఉన్నాయి. పర్వతానికి దిగువ ఉత్తర దిక్కులో శ్రీకపిలేశ్వర స్వామిదేవాలయం, శ్రీవేంకటేశ్వరస్వామి దివ్యరాజ్ఞియైన శ్రీమహలక్ష్మీదేవాలయం ఉన్నాయి. శ్రీమహాలక్ష్మీదేవివినే శ్రీపద్మావతీదేవి పద్మాసీన ఐనందున అలర్‌మేల్ మంగ అని వ్యవహరిస్తారు. శ్రీకృష్ణ, బలరామ శ్రీసుందరరాజ దేవాలయాలు శ్రీ పరాశరేశ్వర దేవాలయం సమీపంలోనే ఉన్న **యోగిమల్లవరం** గ్రామంలో ఉన్నాయి. ఈ గ్రామం ఒకప్పుడు తిరుచానూరులో భాగంగా ఉండేది. **తిరుచ్చోగినూర్** అన్న పేరే తరువాతి కాలాన **తిరుచానూర్**గా మార్పు చెందిందనడానికి ఆధారాలున్నాయి. పూర్వ శాసనాలలో తిరుచ్చోగినూర్ (శ్రీయోగిపురం)గా పేర్కొనబడింది. ఆ యోగి పరాశరయోగి. **తిరుచ్చోగనూర్**లో ఆ యోగి ప్రతిష్ఠించి అర్చించినందువల్ల ఆ స్వామికి **పరాశరేశ్వరుడ**ను పేరు స్థిరమైనట్టు స్పష్టమౌతున్నది. తరువాత కాలంలో తిరుచ్చోగినూర్, తిరుచ్చుకనూర్‌గా, శుకనూర్, శుకపురి, శుకగ్రామంగా పేరుపొందింది. శుకయోగి ఈ గ్రామాన నివసించి శ్రీకృష్ణ దేవాలయ ప్రతిష్ఠను చేసినాడన్న ఐతిహ్యం ఉన్నది.

వేంకటాచలం, వేంకటాద్రి అని ప్రసిద్ధమైన తిరుపతి కొండను **'వేంగడం'**గా శ్రీవైష్ణవ ఆళ్వారులు, ఆచార్యులు కీర్తిస్తారు. దివ్యమైన ఆనంద నిలయ విమానంలో శ్రీవేంకటేశ్వరస్వామి విరాజమానుడై ఉండటంవల్ల, అతి పవిత్ర క్షేత్రంగా భారతీయ ధార్మిక సాహిత్యంలో అనాదిగా కీర్తింపబడుతూ ఉన్నది. దక్షిణ భారతంలోని పరమపావన క్షేత్రాల్లో ఒకటిగా భావింపబడుతూ ఉన్నది. శ్రీ విష్ణు అవతారమైన శ్రీశ్వేత వరాహస్వామి ఆదేశం మేరకు విష్ణు వాహనమైన గరుడుడు, వైకుంఠంలో శ్రీమహావిష్ణువు శ్రీలక్ష్మీ సహచరుడై విహరించే క్రీడాద్రిని, వైకుంఠం నుండి భూలోకానికి తీసుకువచ్చినాడని, ఇది శ్రీవిష్ణు క్రీడాచలమనీ భావింపబడుతున్నది.

* * *

# అధ్యాయం-2

## శ్వేత వరాహ కల్ప కథ

శ్రీ వరాహస్వామి పాతాళం నుండి భూమిని ఉద్ధరించడం, గరుడుడు క్రీడాద్రిని భూమికి తీసుకురావడం (వరాహపురాణం భాగం-1, 1,3 అధ్యాయాల్లో వర్ణించబడింది)

రెండు వేల చతుర్యుగాలు లేదా ఎనిమిది వేల యుగాలు సృష్టి కర్తయైన బ్రహ్మదేవునకు ఒక పగలు, రాత్రిగా భావింపబడుతాయి. ఆ సమయంలో సూర్యుడు మండే తన కిరణాలతో చాలాకాలం అగ్ని కురిపించగా జపతపాల్లో నిమగ్నులైన తపోధనులు భూమిని వదిలి ఊర్ధ్వలోక సప్తకంలో ఒకటైన జనలోకానికి వెళ్ళవలసి వచ్చింది. అప్పుడు బ్రహ్మరాత్రం ప్రారంభం కాబోతున్నది. అరణ్యాలు, పర్వతాలు భీకరమైన అగ్నికి ఆహుతై బూడిదైనాయి. ఆ సమయంలో వాయుదేవుడు బలంగా వీయగా మేఘాలు రూపొంది భయంకరంగా వర్షించడం వల్ల బలమైన వరదలు వాగులు నిండి భూమి కరిగి అధోలోకమైన పాతాళానికి క్రుంగి పోయింది బ్రహ్మరాత్రంలో కొంత భాగం. అప్పుడే ప్రళయ కల్పం సంభవించింది. అప్పుడు సృష్టి స్థితి లయకారకుడైన శ్రీమహావిష్ణువు మహానాకంలో అతివిస్తీర్ణమైన జల ప్రదేశంలో వటపత్రంపై శయనించి ఉన్నారు. భూమిని పునరుద్ధరించాలని సంకల్పించాడు. అధోలోకానికి అధిపతియైన హిరణ్యకశిపుని సోదరుడైన హిరణ్యాక్షునితో, భయంకరమైన శ్వేతవరాహ రూపాన్ని ధరించి, దీర్ఘకాలం యుద్ధం చేసి, విసిగిపోయి, ఆ దైత్యుని శరీరాన్ని తన బలమైన కోరలతో చీల్చి, జలాన్ని రక్తమయం చేశాడు. జలాన్ని ఛేదించి తనకోరలపై భూమిని పైకెత్తాడు. ఆదిశేషుని పై ఒక పాదాన్నుంచి జనలోకంలో ఒక మహాపర్వతం లాగా నిలిచాడు. బ్రహ్మ మొదలుగా దేవగణాలు, మునులు వేద మంత్రాలతో ఆయనను స్తుతించి, భూమిని యధాపూర్వస్థానంలో నిల్పవలసిందిగా ఆర్థించారు. వరాహావతారాన్ని ధరించిన శ్రీమహావిష్ణువు భూమిని యధా పూర్వంగా ప్రతిష్ఠించి సప్త సాగరాలను, సప్తలోకాలను నియమితంచేశాడు. పూర్వం వలెనే, జగత్తును సృష్టింపవలసిందిగా బ్రహ్మను ఆదేశించాడు. జనానీకాన్ని కాపాడటానికి, కొంతకాలం భూమి మీద నివసింపదలచి, వైకుంఠంనుండి, దేవతాగణంతో, విశ్వకర్మ మొదలైన సురలతో క్రీడాచలాన్ని భూమికి తీసుకరావలసినదిగా గరుడుని ఆజ్ఞాపించినాడు. గరుడుడు వైకుంఠానికి పయనమైనాడు. అంతలోనే గోమతీ నదికి 60 యోజనాల దూరంలో రుక్మనదీ (సువర్ణముఖీ నది) సమీపంలో ఉత్తర తీరాన పుణ్యపురుషుల కావాసమైన ఒక పావన స్థలాన్ని, వరాహావతార రూపంలోనున్న శ్రీమహా విష్ణువు ఎంపిక చేసినాడు. గరుడుడు, కనకరత్న ఖచిత శృంగాలతో పంచోపనిష ద్రూపంగా విలసిల్లే దేవగణ నివాసమై ఒప్పారి సువిశాలమై నారాయణగిరి నామంతో విరాజిల్లే క్రీడాచలాన్ని భూమికి తీసుకువచ్చాడు. అది మూడు యోజనాల వెడల్పు, ముప్పైయోజనాల పొడవైన ఆకారంలో శేషుని పోలి ఉన్నది. ప్రజలందరూ సేవింపదగినదై అందరూ నివసించాలని కోరదగినదై విష్ణుమూర్తి శంఖాన్ని తలపించే విధంగా ఉన్నది. ఆకారంలో సముదాత్తమై గొప్ప పుణ్యాన్ని ప్రసాదించడమేకాదు, అప్పుడప్పుడు దర్శించే భక్తజనులకు సైతం మోక్షాన్నీ ప్రసాదిస్తుంది.

వరాహరూపంలో ఉన్న విష్ణువు ఆ పర్వతాన్ని తాను ఎంపిక చేసిన పవిత్ర ప్రదేశంలో నిక్షేపించవలసిందిగా గరుడుని ఆదేశించి, వివిధ రత్నశోభితమై అనేక గోపుర సహితమై మహా మణిమండప సముపేతమై, రత్న ఖచిత స్తంభ విరాజితమై, పవిత్ర వనం మధ్యభాగంలో తూర్పు దిక్కున స్వామి పుష్కరిణితో విలసిల్లగా, పుష్కరిణికి దక్షిణ దిశలో శంఖ చక్రగదా ద్యాయుధధారియై తన వక్షః స్థలంలో కుడి భాగాన శ్రీమహాలక్ష్మి నెలవై యుండగా దివ్య విమానం క్రింద నివాసాన్ని ఏర్పరచుకున్నాడు. బ్రహ్మాది దేవతలు, మునులు, సప్తర్షులు మొదలైనవారు స్వామినిట్లా ప్రార్థించినారు. "ఓ స్వామీ! కోరలతో, కుటిల భృకుటితో, జేగీయమానమైన ఆయుధాలు ఇరుప్రక్కల వ్రేలాడగా మీ ఆకారం భయాన్ని కలిగిస్తున్నది. దేవతలకు తృప్తికరంగా, శాంతమైన ఆకృతితో, ప్రజారక్షణార్థం ఈ కొండపై నివాసమై ఉండవలసిందిగా విన్నపం చేస్తున్నాము. సురలకు నరులకు నివాసయోగ్యంగా ఉండటానికి భూమిని ఉద్ధరించి రక్షించినారు, అనుగ్రహించి సాత్త్విక రూపంతో ఇచ్చటే నివసించి ధ్యానయోగం కర్మయోగం అనుష్ఠించి మిమ్ము చేరు శక్తిలేని ప్రజలను కరుణించి వరాలను ప్రసాదించండి" అని.

ఆ ప్రార్థన నాలకించి స్వామి ప్రసన్నుడై చతుర్బాహువై శాంతవదనంతో, రత్నశోభితుడై శ్రీదేవీ భూదేవీ సహితుడై సాక్షాత్కరించినాడు. అంజలి ఘటించిన దేవతలతో ఇట్లా అన్నాడు. "ఈ వేంకటాద్రి, వైకుంఠం కంటె ప్రీతి పాత్రమైంది. జనుల కోరికలను తీర్చడానికి శ్రీదేవి, భూదేవి సహితుణ్ణై ఇక్కడే నివసించడానికి నిశ్చయించినాను" అని, వారిని వారి నివాసాలకు వెళ్ళవలసిందిగా ఆదేశించి అంతర్ధానమైనాడు.

**వైకుంఠాత్పరమోహ్యేష**
**వేంకటాఖ్యో నగోత్తమః ।**
**అత్రైవ నివసామ్యేవ శ్రీభూమి**
**సహితోఽహ్యహమ్ ॥ (వి-12)**

**దదామి ప్రార్థితానర్థాన్**
**మనుజేభ్యస్సదా సురాః (వి-13)**

**(శ్రీవరాహపురాణం, భాగం-1 అధ్యాయం 35, 12, 13 శ్లో.)**

* * *

## అధ్యాయం-3

### వేంకటాద్రి పై వరాహ నివాసం, వేంకటాచల ప్రశస్తి

శ్వేత వరాహం భూమిని ఉద్ధరించినప్పటి నుండీ, వైకుంఠం నుండి వేంకటాద్రి (క్రీడాచలాన్ని)ని గరుడుడు తీసుకువచ్చి భూమిపై నిలిపినప్పటి నుండీ వేంకటాచలం పైనే అదృశ్యంగా వరాహ నివాసం. ఆయన నదీ తీరాల్లో, పర్వత సానువుల్లో, కొండ చరియల్లో శ్రీలక్ష్మీదేవితో విహరిస్తూ భగవద్భక్తులైన మానవులకు సాక్షాత్కరిస్తాడు. శ్వేత వరాహకల్పం చివరి దాకా ఇక్కడే నివసిస్తాడని బ్రహ్మ వక్కాణించినాడు. ప్రతికల్పంలో శ్వేత వరాహంగా భూమిని సముద్ధరించి పునర్నిర్మాణం చేసి పునరుజ్జీవింపజేస్తాడు. ఆయన యుగాన్ని శ్వేత వరాహకల్పంగా మునులు కీర్తిస్తారు.

(మనం సంకల్పంలో ప్రస్తుత యుగాన్ని శ్వేతవరాహ కల్పంగా, వేంకటాచలాన్ని పరిసరాలను శ్రీవరాహ క్షేత్రంగా పేర్కొంటాము)

దురితం పెరిగి, సజ్జనులు బాధింపబడి, ధర్మం దమించబడి అధర్మం విజృంభిస్తే, దుర్మార్గులు బలిష్ఠులై ప్రజలను బాధిస్తే, ఆయా కాలాల అవసరాలకు అనుగుణంగా నరాకృతిలో దేవుడుగా అవతరించి, దురితాన్ని పోద్రోలి, సుధర్మాన్ని స్థాపించి, సజ్జన రక్షణం చేసి, వేద విద్యను ప్రోత్సహించి తన నివాసం నుండే జీవకోటికి దర్శనమిస్తాడు. శేషాచలంపై శ్రీలక్ష్మీ సహితంగా, దేవగణంతో పరిచారకులతో విహరిస్తూ ఈ కొండపైనే, సూర్యలోక నివాసం కంటె వైకుంఠంలో కంటె, ఈ పర్వతంపై వాసమే ఆ స్వామికి ఎక్కువ ప్రసన్నతను చేకూరుస్తుంది.

**ఆస్థాయశ్వేతపోత్రిత్వం ఉజ్జహార ధరాం యదా।**
**తదైవానాయ్య వైకుంఠాదచలం గరుడేనవై ।**
**కల్పాదావేవ భగవాన్ లీలారస మహోదధిః**
**విహరం రమయా సార్ధం దరీనిర్ఝర సానుషు ।**
**ప్రకాశశ్చ ప్రకాశశ్చ తిష్ఠత్యేవ సదాగిరౌ ।**
**యావత్కల్పం వసత్యేవ ప్రోక్తంచ పరమేష్ఠి నా ।**
**కదా చిత్పుణ్యశీలేభ్యో దర్శనం వితరత్యసౌ ।**
**కల్పే కల్పేచ ధరణీం ఉద్ధర త్యేవమేవహి ।**
**శ్వేత వారాహరూపేణ ధరణీ చోద్ధృతాయతః ।**
**శ్వేత వరాహకల్పస్యాత్ ఆఖ్యయా మునయోహ్యయమ్ ।**
**..... ..... ..... ..... .....**
**సర్వదాశేషశైలేంద్రేవిహరన్రమయాసహ ।**
**నిత్యైర్ముక్తైశ్చ దేవైశ్చ కామరూపైశ్చ సంయుతః ।**

**తిష్ఠత్యేవ సదాతస్మిన్ వేంకటాఖ్యే నగోత్తమే ।**
**వైకుంఠాత్ స్వర్గ సూర్యేభ్యః స్వగేహేభ్యోఽధిక ప్రియః ।**
**అయం భగవతో హృద్యః పర్వతః పుణ్యకాననః ।**

**(వరాహపురాణం, భాగం-1, అధ్యాయం-36, 4-15 శ్లో.)**

స్వయంగా శ్రీమహావిష్ణువునకు క్రీడాచలం కావటంవల్ల, వరాహస్వామి తన నివాసంగా ఏర్పరచుకోవటం వల్లనూ ఈ పర్వతానికి సమధికవైభవం, అత్యద్భుత మహిమాతిశయం కలిగాయి. మానవ ప్రయత్నాలన్నింటికీ వివిధ ఆధ్యాత్మిక సాధనలకు ఇచ్చట సాఫల్యం సమకూరుతుంది. నిరాటంకంగా మంత్రసిద్ధి, కామ్యసిద్ధి, ఇతర సిద్ధులు సాధ్యమౌతాయి. పవిత్ర తీర్థాలన్నీ ఈ పర్వతంపైనే ఉన్నాయి. అల్పమైన తపస్సు చేతనే అభీష్టం సిద్ధిస్తుంది. శ్రద్ధాభక్తులతో సేవించినచో జ్ఞానార్థియైన వానికి జ్ఞానం లభిస్తుంది. ద్రవ్యం కోరిన వానికి బంగారం లభిస్తుంది. పుత్రులను కోరిన వానికి పుత్ర ప్రాప్తి కలుగుతుంది. రాజునకు రాజ్యం లభిస్తుంది. వికలాంగునికి చక్కని రూపం కలుగుతుంది. మానవులు ఏయే సుఖాలను కోరుతారో వారికి అవి సిద్ధిస్తాయి. పశు ధాన్య సమృద్ధి కలుగుతుంది.

**మంత్ర సిద్ధి స్తపస్సిద్ధిర్ జ్ఞాన సిద్ధిస్తథైవ హి**
**కామ్యస్య కర్మణస్సిద్ధి రేవ మన్యాశ్చ సిద్ధయః ।**
**భవంత్యత్ర నరాణాంచ న హి విఘ్నాదికం క్వచిత్ ।**
**అల్పేన తపసాభీష్టం సిద్ధ్యత్యస్మిన్ గిరౌవరే ।**
**సర్వతీర్థాని సతతం పుణ్యాన్యత్రైవ సంతి హి ।**
**య ఏవం సేవతే నిత్యం శ్రద్ధాభక్తి సమన్వితః ।**
**జ్ఞానార్థీ జ్ఞాన మాప్నోతి ద్రవ్యార్థీ కనకం బహు ।**
**పుత్రార్థీ పుత్ర మాప్నోతి నృపోరాజ్యంచ విందతి ।**
**యం యం కామయతే మర్త్యః తం తమాప్నోతి సర్వధా ।**

**(వరాహపురాణం, భాగం-1, అధ్యాయం-4, 15-20 శ్లో.)**

ఈ కనకాచలంపై ఎనిమిది రకాల గనులున్నాయి. అవి పుణ్యకర్మలు చేసిన నరులకు ఒక్కొక్క యుగంలో కన్పిస్తాయి. ఈ శ్రీనివాసగిరిపై అధివసించిన శ్రీనివాసుని వలెనే ఈ పర్వతం జ్ఞానాచలంగా, రత్నగిరిగా, వివిధంగా వివిధకాలాల్లో కన్పిస్తుంది. ఒక్కొకసారి సాధారణ పర్వతంగానూ కన్పిస్తుంది. ఈ పర్వతం సముదాత్త రూపాన్ని ఎవరూ తెలుసుకోలేరు. వేంకటాచలం యధార్థానికి సువర్ణ పర్వతమైనా, కలియుగంలో సామాన్య పాషాణపర్వతంగా కన్పిస్తుంది.

**అష్టానాం ఖనయస్సంతి లోహానాం కనకాచలే ।**
**యుగభేదేన దృశ్యంతే నరాణాం పుణ్య కర్మణామ్ ।**

**శ్రీనివాసగిరిశ్చాయం కదాచిత్ కనకాచలః ।**
**కదాచిత్ జ్ఞాన రూపోఽయం కదాచిత్ రత్నరూపకః ।**
**శ్రీనివాస ఇవాఽఽభాతి కదాచిత్ భూషణోజ్జ్వలః ।**
**అప్రాకృత స్వర్ణ సానురపి శ్రీ వేంకటాచలః ।**
**ప్రాకృతాచల వద్భూమౌ భవిష్యతి కలౌయుగే ।**

**(వరాహపురాణం, భాగం-1, అధ్యాయం-40, 29 శ్లో.)**

భక్తితో ఈ పర్వతాన్ని అధిరోహించే కుంటివాని కాళ్ళకు బలం చేకూరి శీఘ్రగమనశక్తి కలుగుతుంది. అంధునికి కమలములవంటి అందమైన కన్నులు కలుగుతాయి. మూగవానికి పాండిత్యమబ్బుతుంది. బధిరునికి దూర శబ్ద గ్రహశక్తి కలుగుతుంది. వంధ్యాస్త్రీకి సంతానం కలుగుతుంది. నిర్ధనుడికి ధనం లభిస్తుంది. ఈ పర్వతం పై భక్తి కలిగిన వానికి ఇవన్నీ సిద్ధిస్తాయి. ఈ పర్వత తత్త్వాన్ని ఎవడు తెలుసుకోగలుగుతాడు?

**వేంకటాద్రౌపరాం భక్తిం వహన్ గచ్ఛతి చేద్గిరిమ్ ।**
**పంగుర్జంఘాల ఏవస్యాత్ అచక్షుః పద్మలోచనః ।**
**మూకోవాచస్పతి ర్దూరశ్రవీతు బధిరోభవేత్ ।**
**వంధ్యాతు బహుపుత్రాచ నిర్ధన స్సధనోభవేత్ ।**
**ఏ తత్సర్వం గిరౌభక్తి మార్గేణైవ భవేద్ధ్రువమ్ ।**
**తత్త్వతో వేంకటాద్రేస్తు స్వరూపం వేత్తికః పుమాన్ ।**

**(వరాహపురాణం, భాగం-1, అధ్యాయం-8, శ్లో.31-33)**

* * *

# అధ్యాయం-4

## విభిన్న యుగాల్లో క్రీడాచలానికి పెట్టిన వివిధ నామధేయాలు

విభిన్న కాలాలలో, విభిన్న యుగాల్లో, అనేక కారణాల మూలంగా క్రీడాచలానికి వివిధమైన నామధేయాలు లభించినాయి. కృతయుగంలో వృషాచలమని, త్రేతాయుగంలో అంజనాచలమని ద్వాపరయుగంలో శేషాచలమని, కలియుగంలో వేంకటాచలమని క్రీడాచలాన్ని వ్యవహరించారు. **(వరాహపురాణం, మొదటి భాగం, అధ్యాయం 4, శ్లోకం 21-37)**

**చింతామణి** : కోరికలను ఈడేర్చడం వలన కలిగిన పేరు.

**జ్ఞానాద్రి** : జ్ఞానాన్ని అనుగ్రహించడం వల్ల కలిగిన పేరు.

**తీర్థాద్రి** : ఎన్నో తీర్థాలు (పుణ్య జలాశయాలు) ఉండటం వల్ల కలిగిన పేరు.

**పుష్కరాద్రి** : పర్వతం పైనున్న సరస్సులలో ఎఱ్ఱ తామరలు పుష్కలంగా వికసిస్తున్నందున కలిగిన పేరు.

ధర్మదేవత తన శ్రేయస్సు కొరకై తపస్సు చేసిన పర్వతం కావడం వల్ల వృషాద్రి లేదా ధర్మాద్రి అనే పేరు కలిగింది. మరొక గాథ కూడా ఉన్నది. కృతయుగంలో వృషభాసురుడనే రాక్షసుడు ఈ పర్వతాన్ని ఆక్రమించి, మునిజనాన్ని బాధించేవాడు. ఐదువేల ఏళ్ళు, తీవ్రమైన తుంబురు తీర్థంలో తపస్సునూ చేశాడు. ఆ తీర్థంలో స్నానం చేసిన పిదప ప్రతిదినం తన తలను ఖండించుకొని ఖండించిన శిరస్సుతో ఒక పుష్పాన్ని సమర్పించి నరసింహస్వామి సాలగ్రామాన్ని పూజించేవాడు. మళ్ళీ శిరస్సు యథాస్థానంలో సిద్ధమై ఉండేది. నారాయణుడు ఆ రాక్షసునికి ప్రత్యక్షమై వరం కోరు కొమ్మన్నారు. తనకే వరం అవరంలేదని, నారాయణునితో యుద్ధం చేయవలె నని కోరిక కలదనీ చెప్పాడు. సమానమైన బలమూ శక్తి ఉండటం మూలాన ఇద్దరి మధ్య ద్వంద్వయుద్ధం చాలా కాలం సాగింది. నారాయణుడు సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. రాక్షసుని గర్వం పరిహారమైంది. సుదర్శన చక్రంతో హతులైనవారికి పరమపద ప్రాప్తి కలుగుతుంది. కాబట్టి తనకు పరమపదం లభిస్తుందని, ఆ పర్వతానికి వృషభాచలమని పేరు పెట్టాలని కోరగా, వాని భక్తికి మెచ్చి భగవంతుడు అతని కోరికను అనుగ్రహించాడు. అందుకే కృతయుగంలో ఈ పర్వతానికి వృషభాచలమనే పేరు కలిగింది. **(భవిష్యోత్తర పురాణం, అధ్యాయం-1,** శ్లో. 40-68. పురోహితుడైన శతానందుడు జనక మహారాజునకు చెప్పిన కథ). బంగారు ఘటం ఆకారంలో ఉండటం కారణంగా కనకాద్రి అనే పేరు కలిగింది.

ఈ కొండ పై నారాయణుడనే బ్రాహ్మణుడు తీవ్రమైన తపస్సును చేయడంవల్ల తన పేరును కొండకే పెట్టడానికి అనుమతి లభించడం మూలాన **నారాయణాద్రి** అనే పేరు కలిగింది. భవిష్యోత్తర పురాణం, ఈ పర్వతానికి నాలుగు యుగాలలో వరుసగా **వృషాద్రి లేదా వృషభాద్రి, అంజనాచలం, శేషాచలం,**

**వేంకటాచలం** అని పేర్లు ఉన్నట్లు పేర్కొనగా వరాహపురాణం ఈ పర్వతానికి కృతయుగంలో అంజనాద్రిగా త్రేతా యుగంలో **నారాయణాద్రి**గా ద్వాపర యుగంలో **సింహాద్రి**గా, కలియుగంలో **వేంకటాచలం** లేదా వేంకటాద్రిగా ఉన్నట్లు పేర్కొన్నది **(వరాహ పురాణం,** రెండవ భాగం, అధ్యాయం-1, శ్లో. 57-58.)

**వేంకటాద్రి** : శ్రీమహావిష్ణువునకు శాశ్వత స్థానమైన పవిత్ర వైకుంఠం నుండి కొనిరాబడినందున వైకుంఠాద్రి అనే పేరు కలిగింది.

**సింహాద్రి** : ఈ కొండపై స్వామి నరసింహావతారం ధరించి, హిరణ్య కశిపుణ్ణి సంహరించి ప్రహ్లాదుని రక్షించి నందున సింహాద్రి అనే పేరు కలిగింది.

**అంజనాద్రి** : కేసరి వనచర రాజునకు సంతానం లేనందున, ఆయన భార్యయైన అంజనీదేవి ప్రతాపవంతుడైన పుత్రుణ్ణి తానెట్లా పొందగలదో చెప్పమని కోరింది. అంజనీదేవి నివాసమైన (హంపికి దగ్గరైన) పంపానదీ ప్రాంతంనుండి తూర్పు దిశలో ఏభై యోజనాల దూరంలో ఉన్న నృసింహాశ్రమానికి వెళ్ళి అక్కడికి దక్షిణ దిశలో వేంకటాచలంపై స్వామి పుష్కరిణికి ఒక క్రోశం దూరంలోనున్న ఆకాశగంగా ప్రవాహప్రాంతానికి వెళ్ళమన్నాడు. అది నారాయణాద్రికి ఉత్తరదిశలో ఉన్నది. అక్కడ పన్నెండు సంవత్సరాలు తపమాచరిస్తే పుత్రప్రాప్తి కలుగుతుందని మతంగ మహామునిఅంజనీదేవికి చెప్పినాడు. ఆమె స్వామి పుష్కరిణి యందు స్నానంచేసి, పశ్చిమదిశలో నున్న అశ్వత్థ వృక్షానికి ప్రదక్షిణలు చేసి, శ్రీవరాహస్వామిని దర్శించి ఆకాశగంగ వద్దకు బయలుదేరింది. పతిదేవుని ఆశీస్సులను, అచ్చట నివసిస్తున్న మునుల ఆశీస్సులను పొంది పన్నెండేళ్ళ తపస్సును ప్రారంభించింది. మొదటి సంవత్సరం కేవలం నీరే ఆహారంగా తపస్సు చేసింది. ఆమెపై కరుణతో వాయుదేవుడు ప్రతిదినమొక మధురమైన ఫలాన్ని ఇచ్చేవాడు. పన్నెండేళ్ళు పూర్తి కాగానే ప్రాణశక్తి నిక్షేపించిన ఫలాన్ని ప్రసాదించాడు. ఆమె గర్భం దాల్చి ఒక పుత్రుణ్ణి పొందింది. ఆయనయే హనుమంతుడు లేదా ఆంజనేయుడు. హనుమంతుడు దేవతలకు శ్రీరామచంద్రునకు సహాయ పడ్డాడు. అంజనీదేవి తపస్సు చేసినందున త్రేతాయుగంలో ఆ పర్వతానికి అంజనాద్రి అనే పేరు కలిగింది. **(భవిష్యోత్తర పురాణం, అధ్యా.1 శ్లో.68-84**, లో వివరంగా వర్ణింపబడింది. **వరాహ పురాణం, భాగం-1, అధ్యా.4 శ్లో.28-29లో** అంజనీదేవి తపస్సు, హనుమంతుని జననం మాత్రమే ప్రస్తావించింది.)

**వరాహాద్రి** : వరాహస్వామి నివసించిన క్షేత్రం కావడం వలన వరాహ క్షేత్రమనే పేరు.

వానర ముఖ్యుడైన నీలుడు ఈ కొండపై నివాసమున్నందున నీలాద్రి అని పేరు.

వేంకటాచలం లేదా వేంకటాద్రి= అమృతమనే అర్థం కలిగిన 'వేం' ఐశ్వర్యం అనే అర్థం కలిగిన వేంకట పదంలోని 'కట' కలిస్తే ఇహపర సౌఖ్యాలను ప్రసాదించేదనే అర్థం వస్తుంది.

**వేంకారోఽమృత బీజస్తు**
**కటమైశ్వర్య ముచ్యతే ।**
**అమృతైశ్వర్య సంఘత్వాత్**
**వేంకటాద్రిరితి స్మృతః ॥**

**(వరాహపురాణం, భాగం-1, అధ్యాయం-4, శ్లో-31)**

మరొక అర్థంకూడా ఉంది. వేంకట పదంలోని 'వేం' 'అన్ని పాపాలను' అనే అర్థాన్ని ఇస్తుందని, 'కట' పదం 'నాశనము చేయు' అనే అర్థాన్నిస్తుందని వేంకట పదానికి 'సర్వపాప వినాశకర'మనే అర్థాన్ని వివరిస్తారు. బ్రహ్మాండ పురాణంలో భవిష్యోత్తర పురాణంలో కాళహస్తికి చెందిన మాధవుడనే బ్రాహ్మణ యువకుని పాపాలనన్నింటినీ పోద్రోలిన కథ వివరంగా వర్ణింపబడింది. భృగు మహర్షి వేంకటాచలమాహాత్మ్యాన్ని వివరిస్తూ ఈ కథను చెప్పగా విన్న మునులు ఈ కొండకు వేంకటాచలమని పేరును స్థిరపరిచారు. భవిష్యోత్తర పురాణంలో బ్రహ్మయే ఈ కొండను వేంకటాచలమని కీర్తించిన ట్లున్నది.

**అనేక పాపజాలం వైయప్మాద్దగ్ధం ద్విజన్మనః** **(బ్రహ్మాండపురాణం అధ్యా.6 శ్లో.42)**

**వేంకటాచల ఇత్యస్య ప్రసిద్ధిర్భువివర్తతామ్ ।**
**సర్వ పాపాని'వే' ప్రాహుః 'కటస్త' ద్దాహ ఉచ్యతే** **(బ్రహ్మాండపురాణం అధ్యా.6 శ్లో.43)**

**సర్వపాప దహోయస్మాద్వేంకటాచల ఇత్యభూత్** **(బ్రహ్మాండపురాణం అధ్యా.6 శ్లో.43)**

**తదానామచకారాద్రేః వేంకటాచల ఇత్యపి**
**సర్వపాపాని'వే' ప్రాహుః 'కటస్త' ద్దాహ ఉచ్యతే** **(బ్రహ్మాండపురాణం అధ్యా.6 శ్లో.226)**

**తస్మాద్వేంకటశైలోయం లోఽకే విఖ్యాత కీర్తిమాన్** **(బ్రహ్మాండపురాణం అధ్యా.6 శ్లో.227)**

**శ్రీనివాసగిరి** = తన వక్షః స్థలంలో కుడిభాగం లక్ష్మీ నివాసంగా శ్రీనివాస రూపంతో శ్రీమహావిష్ణువు ఈ పర్వతం పై దేవతలకు సాక్షాత్కరించినందున, వారు ఈ కొండను శ్రీనివాసగిరిగా కీర్తించినారు.

**ఆనందాద్రి** = వైకుంఠపుర వాసులు, స్వామి ఈ కొండపై క్రీడానందాన్ని సమధికంగా పొందడం గుర్తించి, దీనిని ఆనందాద్రిగా స్తుతించినారు.

**శ్రీశైలము** = శ్రీ (లక్ష్మి)కి స్థిర నివాసమై, సంపదలను ప్రసాదించు ప్రభావమును కలిగి ఉన్నందున ఈ పర్వతానికి శ్రీశైలమని వ్యవహారమున్నది.

శ్రీశైలము, శేషాచలము, శేషాద్రి= ద్వాపర యుగంలో వాయుదేవుడు శ్రీనారాయణ దర్శనార్థం వైకుంఠానికి త్వరపడి వెళ్ళాడు. అంతఃపురంలో ఏకాంతంగా శ్రీలక్ష్మీతో శ్రీనారాయణుడు విశ్రమిస్తున్నాడు.

ఆదిశేషుడు ద్వారపాలకుడుగా ఉండి వాయుదేవుని ప్రవేశాన్ని అడ్డుకున్నాడు. దీనితో వాయుదేవునికి కోపం కలిగింది, వారిరువురూ కలహించడం ప్రారంభించారు. ఆ సమయాన శ్రీనారాయణుడు వారిని సమీపించాడు. వారిద్దరూ తమ ప్రతాపాన్ని గూర్చి గొప్పగా చెప్పుకున్నారు. వారిరువురిలో ఎవరెక్కువ శక్తిమంతులో తెలిసికోడానికి, ఆదిశేషుణ్ణి మేరు పర్వతానికి ఉత్తర భాగాన ఉన్న ఆనందగిరిని చుట్టుకొమ్మన్నాడు. వాయుదేవుణ్ణి ఆదిశేషుని ఆధీనంలో ఉన్న ఆనందగిరిని గట్టిగా వీచి విడిపించాలని ఆదేశించాడు. (ఈ కథ **భవిష్యోత్తర పురాణం, అధ్యా. 1, శ్లో. 85-132**లో వివరింపబడింది), వాయుదేవుని పరాక్రమానికి, వేగానికి సమస్త భువనాలు వణికి పోయినాయి. బ్రహ్మ, ఇంద్రుడు ఇతర దేవతలు ఆదిశేషుణ్ణి, వాయుదేవుణ్ణి తమ కలహాన్ని ఆపవలసిందిగా అర్థించినారు. కాని, ఆ ఇద్దరు యోధులూ వారి ప్రార్థనను మన్నింపలేదు. ఆదిశేషునితో బ్రహ్మ మొదలైన దేవతలిలా అన్నారు. "నీ అసమాన పరాక్రమం శ్రీమహావిష్ణువుకు తెలుసు, శివునికి తెలుసు, మాకూ తెలుసు. జగత్ క్షేమం కోసం నీవు పర్వతం పై పట్టు సడలించు, శిరస్సును కాస్తా పైకెత్తి వాయుదేవునికి జయం కలుగనీయి" అని. ఆదిశేషుడు పర్వతంపై పట్టును సడలించాడు. వాయుదేవుడు విపరీతమైన వేగంతో వీచి ఆనంద గిరితోపాటు ఆదిశేషుణ్ణి అర్ధక్రోశం దూరం సువర్ణముఖీ నది ఉత్తర తీరానికి విసరివేశాడు. బల పరీక్షలో తనకు కలిగిన ఓటమికి ఆదిశేషుడు తీవ్ర మనస్తాపాన్ని చెందాడు. బ్రహ్మ ఆదిశేషుడిని సాంత్వన పరుస్తూ ఇలా అన్నాడు. "నీవు వేంకటాద్రిలో కలిసిపోతావు. నీపై విష్ణువు నివసిస్తాడు" అని. అందరూ తమతమ నివాసాలకు తిరిగి వెళ్ళారు. ఆదిశేషుడు విష్ణువు ముందు సాగిలపడ్డాడు. **ముప్పై యోజనాల పొడవు, పది యోజనాల వెడల్పు గల శేషాద్రిగా రూపాంతరం చెంది శ్రీవేంకటేశ్వరుణ్ణి ధరించి మధ్య భాగంలో అహోబిల నరసింహుణ్ణి, వాలంపై శ్రీశైలంగా శ్రీమల్లికార్జునుణ్ణి ధరించాడు.** ద్వాపరయుగంలో ఈ పర్వతం శేషాచలం లేదా శేషాద్రిగా విఖ్యాతమైంది. ఇది ఎత్తైన పడగతో, చుట్టుకొన్న శరీరంతో దీర్ఘమైన వాలంతో ఆదిశేష రూపంలో స్థిరమైంది.

భగవంతుని క్రీడాచలంగా పవిత్రమై శ్రీవరాహస్వామి నివాసమై భూతలంపై శ్రీవేంకటేశ్వరుణ్ణి వహిస్తూ పవిత్రమైన ఈ పర్వతం భగవంతుని వలెనే అనంత ప్రశస్త గుణాలతో విరాజిల్లుతూ ఉన్నది. ఈ పర్వత మహిమను వర్ణించడానికి నాలుగు ముఖాలు కలిగిన బ్రహ్మకాని, ఆరుముఖాలు కలిగిన సుబ్రహ్మణ్యుడుకానీ వర్ణింపజాలరు, ఇతరులేమి చెప్పగలరు? జనుల దృష్టిలో ఇది సాధారణ పర్వతంగా గోచరించినా ప్రజల భక్తి దీనిపై పవిత్రమౌతుంది. వారి అభీష్టం సిద్ధిస్తుంది నాలుగు పురుషార్థాలను - ధర్మము, అర్థము, కామము, మోక్షము - పొందడానికి, శాస్త్ర విహిత కర్మలను నిర్వహించు శక్తి లేని వారికి, వేంకటాద్రి కంటె మరొక శరణ్యం లేదు.

* * *

# అధ్యాయం-5

## స్వామిపుష్కరిణి - ఇతరతీర్థాల మాహాత్మ్యం

వైకుంఠవాసియైన స్వామికి క్రీడాసరోవరమైన స్వామి పుష్కరిణి, శ్రీమహాలక్ష్మికి, భూదేవికి ప్రీతిపాత్రమైంది. దీనిలో జలం పవిత్రమై పరిమళభరితమై, ప్రసన్నమై పావనమై ఉంటుంది. గంగాది పవిత్రనదులకు ఇది జన్మస్థానం. శ్రీ మహావిష్ణు ప్రీతికై గరుడుడు పుష్కరిణిని కొనితెచ్చి ఇచ్చట ప్రతిష్ఠించినాడు. ఇది పాపాలను నాశనం చేస్తుంది. వెండినీ, బంగారాన్ని దొంగిలించిన పాపాన్నీ, సురాపానం చేసిన పాపాన్నీ, స్వర్గంలో ప్రవహించే విరజా నది వలె స్వామిపుష్కరిణి హరిస్తుంది. ఇచ్చట ప్రతిదినం స్నానమాచరించే వారికి ప్రాపంచిక సంపదను ప్రసాదిస్తుంది. దర్శన స్పర్శన మాత్రం చేతనే స్నానమాచరిస్తే కోరికలనీడేరుస్తుంది. గాఢంగా ధ్యానిస్తే చాలు ఈ సత్ఫలితాలు కలుగుతాయి. **(వరాహపురాణం, మొదటి భాగం, అధ్యాయం 3, శ్లోకం 17-21).**

స్వామిపుష్కరిణి తీరంలో నివసించే వారు దేవతల కంటే ధన్యులు. స్వామిపుష్కరిణీ వైభవం వారికి అవగతం కాలేదు. (**వరాహపురాణం,** శ్లో. 22-23) స్నానం చేసిన వారికి ప్రాయశ్చిత్త ఫలం లభిస్తుంది. కోరికలను అనుగ్రహిస్తుంది. వేంకటాద్రీశునితో సంబద్ధం కావడంవల్ల దీని అర్హత ఇనుమడించింది. **స్వామిపుష్కరిణి స్నానం, యోగ్యుడైన గురువు పాదసేవనం, ఏకాదశీ వ్రత నిర్వహణం - ఈ మూడూ అత్యంత దుర్లభమైనవి. మనుష్య జన్మ నెత్తడం, కర్మానుష్ఠానం చేస్తూ దీర్ఘకాలం జీవించడం, స్వామిపుష్కరిణి స్నానం సులభంగా లభించేవి కావు.** స్వామిపుష్కరిణి ప్రభావం పాపనాశన సామర్థ్యం, శ్రీసుబ్రమణ్యస్వామి ఉదంతం వల్ల తెలుస్తుంది. తారకాసురుణ్ణి సంహరించినందు వలన కలిగిన బ్రహ్మహత్యా పాతకాన్ని శ్రీసుబ్రమణ్య స్వామి స్వామి పుష్కరిణి స్నానంతో శమింపచేసుకున్నాడు. వేదాల్లో విహితమైన నిత్య నైమితిక కర్మలను, యాగాదులను స్వామిపుష్కరిణి తీరాన సమాచరిస్తే సమస్త దైహిక దోషాలు, వికారాలు తొలగిపోతాయి. ఇంద్రుని శరీరం గౌతమ ఋషి శాపంతో వేయిగాట్లతో నిండిపోగా స్వామిపుష్కరిణీ మహత్త్వం వల్లే విముక్తిని పొందాడు. దశరథ తనయుడైన శ్రీరాముడు అయోధ్య నుండి ప్రయాణమై, హనుమంతుడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు వెంటరాగా, రావణుణ్ణి జయించడానికి పంపాతీరాన్ని దాటి, అంజనాదేవి ప్రార్థన మేరకు వేంకటాచలాన్ని చేరి, తన అనుచరులతో కలిసి స్వామి పుష్కరిణిలో స్నానమాడి ఒకరాత్రి విశ్రమించి, మరునాడు జైత్రయాత్రను ప్రారంభించి యుద్ధభూమికి చేరి రావణాసురుణ్ణి జయించాడు. **(వరాహ పురాణం, అధ్యా.41 శ్లో.3-6.)** రావణుణ్ణి బలమైన శత్రుసైన్యాన్ని జయించి, సీతను రక్షించి అయోధ్యకు విజయం చేసి, తన సోదరుల సమక్షంలో పట్టాభిషిక్తుడై చాలా కాలం రాజ్యాన్ని పాలించాడు. స్వామిపుష్కరిణి స్నాన మహిమయే దీనికంతటికీ కారణమని పెద్దలు విశ్వసిస్తారు. శ్రీవరాహస్వామి శ్రీవేంకటాచల మాహాత్మ్యాన్ని, స్వామిపుష్కరిణి మాహాత్మ్యాన్ని, తదితర తీర్థాల మహిమనూ వర్ణిస్తూ ఇలా చెప్పాడు, "మూడులోకాల్లో ఉన్న సమస్త తీర్థాలు అన్నీ కలిస్తే, స్వామి పుష్కరిణికి మహత్తులో సమానం కావచ్చు, మూడు లోకాల్లో ఉన్న పుణ్యతీర్థాలన్నిటికీ స్వామిని ఐనందున, స్వామి పుష్కరిణి అనే

పేరు సార్థకమైంది. స్వామినియైన స్వామి పుష్కరిణిని సేవించడానికే తీర్థాలన్నీ ఈ కొండపై నెలకొన్నాయి." **(వరాహపురాణం, 2వ భాగం, అధ్యా.1, శ్లో.50-52).**

పూర్వకాలంలో శంఖణుడనేరాజు, పదభ్రష్టుడై స్వామిపుష్కరిణి పశ్చిమ తీరాన ఒక పెద్ద పుట్టకు సమీపాన కుటీరాన్ని, నిర్మించుకొని ఆరు నెలల కాలం, ప్రతిదినం స్వామి పుష్కరిణిలో స్నానం చేస్తూ నియమనిష్ఠలతో నివసించి శ్రీవేంకటేశ్వరస్వామిని అర్చించాడు. శ్రీదేవీ భూదేవీ సహితంగా శ్రీవేంకటేశ్వరస్వామి పుష్కరిణి మధ్య నుండి ఒక విమానంలో సాక్షాత్కరించి, రాజ్యాన్ని తిరిగి పొందాలన్న రాజు కోరికను అనుగ్రహించి బ్రహ్మాది దేవతలు, మునులు, సిద్ధులు, సప్తర్షులు చూస్తూ ఉండగా ఇట్లాదేశించాడు, "రాజా! నీవు పుష్కరిణిలో స్నానమాచరించినపుడే నీయందు మహాభక్తి సముత్పన్నమై నీకు రాజ్యం పునఃప్రాప్తమైంది. స్వామిపుష్కరిణి యందు స్నానమాచరించిన వారికి స్వామిత్వం లభిస్తుంది. నిత్య కర్మానుష్ఠానంలో వారి వారి శ్రద్ధాభక్తులకు, నియమనిష్ఠలకు అనుగుణంగావారు స్వామిత్వాన్ని పొందుతారు. వారు మరొకరి అధీనంలో ఉండవలసిరాదు." అని. స్వామి ఇట్లాదేశింపగానే, దేవతలందరూ పుష్కరిణిని **"స్వామిపుష్కరిణి"** అని కీర్తించినారు. తీర్థాలన్నింటికీ స్వామిని ఐనందున స్వామిపుష్కరిణి అనే పేరు లోకంలో రూఢమైంది. స్వామిత్వాన్ని ప్రసాదిస్తుందని వేంకటేశ్వరస్వామి ఆదేశించి నందున ఆ పేరు అన్వర్థమైంది. ఇది భగవంతునకు అత్యంతం ప్రీతి పాత్రమైంది. ఈ తీర్థానికి ఎంత గొప్ప మహత్త్వమున్నది!

**మాశుచస్త్వం మయా దత్తం స్వామిత్వం పూర్వమాగతమ్ (37)**

**యస్మాత్తవ మహాభక్తిః స్వామి పుష్కరిణీ జలే ॥**
**యేకేచన సమాగత్య స్నానం కుర్వంతి సంయుతాః (37)**

**తేషాంవ్రతానుగుణ్యేన స్వామిత్వం భవతి ధ్రువమ్ ॥ (39)**

**స్యాద్ధి తేషాం పరాధీన భావలేశః కదాఽపి న ।**
**త్వంచ గత్వామహీపాల కురు రాజ్యమకంటకమ్ ॥ (40)**

**సమక్షం దేవదేవానామిత్యుక్త్వాఽంతరధీయత ।**
**"స్వామిపుష్కరిణీ శబ్దో రూఢస్తస్మిన్ సరోవరే ॥ (41)**

**వ్యుత్పత్తిః కథితా తస్యాః తీర్థానాం స్వామినీయతః ।**
**స్వామిపుష్కరిణీత్యేవ తస్మాత్పూర్వం పురాతనైః ॥ (42)**

**ప్రోక్తేదానీం భగవతావ్యుత్పత్తి స్తస్య సమ్మతా ।**
**స్వామి త్వస్య ప్రదానాచ్చ స్వామి పుష్కరిణీత్వియం ॥ (43)**

**అహో మహత్త్వం తీర్థస్య ... (44)**

**(వరాహపురాణం, భాగం-1, అధ్యా.6, శ్లో.37-44)**

**ధనుర్మాసంలో ముక్కోటి ద్వాదశీ తిథిలో ముక్కోటి తీర్థాలు స్వామిపుష్కరిణి లోనికి ప్రవహిస్తాయి. స్వామిపుష్కరిణి ముక్కోటి ఔతుంది**. ఈ ద్వాదశినాడే, సూర్యోదయ సమయాన చక్రత్తాళ్వార్లను మాడ వీధులలో ఊరేగింపు చేసి స్వామిపుష్కరిణి యందు నిమజ్జనం చేస్తారు. సమస్త దేవతలు ఆ సమయంలో ఇచ్చట స్నానం చేస్తారన్న విశ్వాసం ఉన్నది. ఈ సందర్భాన స్నానం అతి పవిత్రంగా పుణ్యప్రదంగా భావిస్తారు. (**స్కాందపురాణం,** భాగం-1, అధ్యా. 17, శ్లో. 20-23)

## సప్త దశ తీర్థమాహాత్మ్యం

**కపిల తీర్థం= వరాహ పురాణం** (భాగం-1, అధ్యా. 8 శ్లో. 4-8) కపిలతీర్థ మహత్త్వాన్ని క్లుప్తంగా వర్ణింపగా, **వామన పురాణం** (అధ్యా. 4 శ్లో. 36-41) కాస్త విశేషంగా ప్రస్తావిస్తుంది.

శేషాద్రికి దిగువ కపిలేశ్వరస్వామి లింగాకారంగా సంస్థితుడైనాడు. కపిలముని పాతాళంలో దీన్ని అర్చించేవాడు. ఏదో కారణంతో, కపిల లింగం పాతాళం నుండి చీల్చుకొని భూమి ఉపరి తలానికి రాగా, దానిని దేవతలు అర్చించి, ప్రతిష్ఠించారు. లింగం సాక్షాత్కరింపక పూర్వమే, కామధేనువు ఆ బిలం నుండి భూమి పైకి చేరి రూపం దాల్చింది. ఆ బిలానికి కపిల తీర్థమని పేరు కలిగింది. సర్వ పాపాలను పోగొట్టగలిగిన ప్రభావం కలదీ కపిలతీర్థం (వరాహపురాణం).

పాతాళలోకంలో కపిలమహర్షి సమర్పింపగా, కామధేనువు నిత్యమూ క్షీరధారతో అభిషేకింపగా, లింగం పెరిగి భూమిని చీల్చుకుంటూ ఉపరితలానికి చేరింది. ఇట్లా పెరగడం కామధేనువునకు ఇష్టం కాలేదు, తన పాదం క్రింద త్రొక్కిపట్టి పెరుగుదలను ఆపాలనుకొన్నది. ఆపాదం గుర్తే లింగం తలపై ఉన్నది. క్రింది భాగం రజతంలాగా తెల్లగా ఉంటుంది. మధ్యభాగం బంగారం మాదిరిగా ప్రకాశిస్తుంది, పంచముఖాలు, మూడు కన్నులూ ఉన్న లింగం ఊర్ధ్వ భాగంసూర్య తేజస్సుతో ఒప్పారుతుంది. పంచవర్ణ శోభితమై భీకరంగా కన్పిస్తూ పాతాళంలో నిత్యస్థితిని పొంది ఉన్నది. కృతయుగంలో కపిలమహర్షి సమర్పించినందున కపిలేశ్వర నామంతో ప్రసిద్ధమైంది. త్రేతాయుగంలో అగ్ని సమర్పించి నందున ఆగ్నేయ లింగంగా పేరందింది. ఆద్యంతాలు లేని అమేయమైన ఆకారాన్ని పొందింది.

(శిరోభాగాన్ని తెలుసుకోడానికి బ్రహ్మ ఊర్ధ్వలోకాలకు వెళ్ళి ప్రయత్నించి విఫలుడైనాడు. పాదపీఠాన్ని తెలుసుకోవడానికి విష్ణువు అధోలోకాలకు వెళ్ళి విఫలుడైనాడు) (చూడుము - ప్రార్థన శ్లోకం)

ద్వాపరయుగంలో విష్ణుచక్రంచే ఇది పూజింపబడింది. కలియుగంలో కపిలగోవుచే అర్చింపబడుతున్నది. ఈ కపిల లింగానికి ఎదురుగా ఒక పవిత్ర సరోవరం ఉన్నది. ఇది పవిత్ర జలపూర్ణమై ఉన్నది. దీన్నే పావన కపిలతీర్థంగా కీర్తిస్తారు. దర్శనం చేసుకుంటే చాలు ఇది సమస్త పాపాలను దూరం చేస్తుంది. ఈ సరోవరంలో స్నానం చేస్తే అశ్వమేధ, వాజపేయ యాగాలను చేసిన దానికంటె పుణ్యఫలాన్నిస్తుంది. యాగాలు చేస్తే పునర్జన్మరాహిత్యం కలుగదు, ఈ సరస్సులో స్నానం చేసి ఒక గ్రుక్క నీళ్ళు త్రాగితే

పునర్జన్మ కలుగదు. **కార్తిక పూర్ణిమనాడు మూడులోకాల ముక్కోటి తీర్థాలు మధ్యాహ్నకాలంలో నాలుగు గంటలకాలం కపిలతీర్థంలో ప్రవేశిస్తాయి. ఇది కపిలతీర్థం ముక్కోటి. ఆ శుభసమయంలో కపిలతీర్థ స్నానం చేసినవారికి బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.** నువ్వు గింజంత బంగారాన్ని దానం చేస్తే, మేరు పర్వతమంతగా భావింపబడుతుంది. అన్నదానం చేసినవారికి చంద్రలోక ప్రాప్తి కలుగుతుంది. కన్యాదానం, గోదానం, విద్యాదానం, విద్యా మంత్రోపదేశం చేసిన వారికి స్వర్గ కైలాస వైకుంఠ బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది. కార్తిక పూర్ణిమనాడు సకలతీర్థాలు కపిలతీర్థంలో ప్రవేశిస్తాయి. అన్న మంత్రశ్లోకాన్ని పఠిస్తూ, ఎవరు ఇతర దివసాల్లో స్నానమాచరిస్తారో, వారికి ఆ ఫలం లభిస్తుంది. ఈ సరోవరంలో స్నానం అత్యంత దుర్లభం. ఇచ్చట స్నానం చేస్తే మోక్షం, విష్ణుపదప్రాప్తి కలుగుతాయి. (**వామనపురాణం**, అధ్యా. 4, శ్లో. 36-47, 50-57)

పద్మావతీ కరగ్రహణాన్ని కోరుతూ, తనకు అన్నదాత్రియైన వకుళ మాలికను వేంకటేశ్వరస్వామి ఆకాశరాజువద్దకు పంపిస్తూ ఆమెను కపిల తీర్థంలో స్నానమాడి, కార్యసాఫల్యానికై ప్రార్థింపవలసిందిగా కోరినాడు. (**భవిష్యోత్తర పురాణం,** అధ్యా. 8, శ్లో. 79-82).

**2. శక్రతీర్థం** : కపిల తీర్థానికి పై భాగాన శక్రతీర్థం ఉన్నది. ఈ తీర్థంలో స్నానమాచరించి, అహల్య కారణంగా గౌతమ మహర్షి శాపగ్రస్తుడైన ఇంద్రుడు శాప విముక్తుడైనాడు.

**3. విష్వక్సేన సరస్సు** : శక్రతీర్థానికి పైన విష్వక్సేన సరస్సు ఉన్నది. వరుణ కుమారుడైన విష్వక్సేనుడు ఇక్కడే తపమాచరించి విష్ణు సారూప్యాన్ని వైకుంఠ సైన్యాధిపతిత్వాన్ని పొందాడు.

**4-8. పంచాయుధ తీర్థాలు** : విష్ణువు ధరించిన పంచాయుధాల పేర్లతో – శంఖం, చక్రం, గద, శార్ఙ్గం, నందకం – ఐదు పవిత్ర సరస్సులు విష్వక్సేన సరస్సుకి పై భాగాన ఉన్నాయి.

**9. అగ్నికుండ తీర్థం** : పంచాయుధ తీర్థాలకు పై భాగాన ఉన్న ఈ తీర్థం దుర్గమంగా ఉన్నది.

**10. బ్రహ్మ తీర్థం** : అగ్ని తీర్థానికి ఎగువన మహాహత్యాపాతకాలను శమింపచేయ గల ప్రభావం ఉన్న తీర్థం. గొప్ప పుణ్యాన్ని ప్రసాదిస్తుంది.

**11-17. సప్తర్షి తీర్థాలు** : బ్రహ్మతీర్థానికి సమీపంగా సప్తర్షులైన కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, వసిష్ఠ, జమదగ్ని ఋషుల పేర్లతో విరాజిల్లే ఈ సరస్సులు పవిత్ర జలపూర్ణాలై ఉన్నాయి.

ఈ పదియేడు తీర్థాలు, సప్తవర్గాలుగా ఉన్నాయి. ఇవి ఉత్తరోత్తరంగా, ఒక దాని కంటె మరొకటి పదిరెట్లు ప్రభావవంతంగా ఉన్నాయి.

ఒకప్పుడు ఒక బ్రాహ్మణుడు తీర్థయాత్ర చేయాలనుకున్నాడు. అప్పుడాయనకు శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై "ఈ పుష్కరశైలం పై పదియేడు దివ్య తీర్థాలున్నాయి. కపిలతీర్థం వానిలో అతి ప్రధానమైంది. ఈ తీర్థాలో నీవు భక్తి ప్రపత్తులతో స్నాన- మాచరిస్తే అసంఖ్యాక తీర్థాల్లో కావించినంత ఫలం కలుగుతుంది" అని ఆదేశించాడు. ఆ బ్రాహ్మణుడు తీర్థయాత్రను మానుకొని వేంకటాచలానికి వెళ్ళి పదియేడు తీర్థాల్లో స్నానసంధ్యాదులను ఆచరించి భగవంతుడు ఆదేశించిన ఫలాన్ని పొందాడు.

మూడు లోకాల్లో ఉన్న ముప్పది మూడు కోట్ల ఏబై లక్షల తీర్థాలు ఈ హరిగిరియైన వేంకటాచలంపై ఉన్న తీర్థాల నుండే ఉత్పన్నమైనాయి. భూ ప్రదక్షిణ ఫలితాన్ని పొందదలచుకున్న వారు ఈ పవిత్ర గిరి ప్రదక్షిణం చేస్తే ఆ ఫలితాన్ని పొందుతారు. ఈ పర్వతం పవిత్ర తీర్థాలతో, స్థలాలతో నిండి ఉన్నది. ఈ గిరి శిఖర దర్శనం మాత్రాన బలరాముడు తీర్థాయాత్రాఫలితాన్ని పొందినాడు.

## వేంకటాచలంపై నెలకొన్న ఇతర పవిత్ర తీర్థాలు

### పాండవతీర్థం :

శ్రీకృష్ణుని ఉపదేశంతో ధర్మారాజు, భీముడు, అర్జునుడు, నకుల సహదేవులు క్షేత్రపాల రక్షితమైన ఒక తీర్థం వద్ద నివసించారు. ఆ తీర్థజలాన్నే స్నానపానాదులకు వాడుకున్నారు. ఆ మహా తీర్థంలో ఒక వత్సరం ఉన్నందున వారికి సర్వపాప పరిహారం కలిగిందనీ, పుణ్యం లభ్యమైందనీ, దాని ప్రభావంతో వారు కౌరవులపై విజయాన్ని పొందినారు. పంచ పాండవులు హస్తినాపురానికి వెళ్ళారు.

పాండవులు నివసించిన కారణాన ఈ తీర్థానికి పాండవ తీర్థమన్న పేరు కలిగింది. శ్రీవేంకటేశ్వర దేవాలయానికి ఈశాన్యంలో ఒకమైలు దూరంలో ఈ తీర్థం ఉన్నది. ఈ తీర్థానికి ప్రక్కనే ఉన్న ఒక శిలా గుహలో ఒకరాతిపై పంచపాండవుల చిత్రాలు చెక్కబడి ఉన్నాయి. పశ్చిమ భాగాన గోగర్భాకారంలో ఉన్నందున ఈ తీర్థానికి గోగర్భ తీర్థం అనే పేరున్నది. వైశాఖ మాస శుక్ల ద్వాదశి ఆదివారంతో కూడి ఉండగా లేదా వైశాఖ మాస కృష్ణ ద్వాదశి మంగళవారంతో కూడి ఉండగా ఈ తీర్థంలో స్నానం చేస్తే శుభకరమని భావిస్తారు. దీనివలన ఇహపర సౌఖ్యం కలుగుతుంది. (**వరాహపురాణం,** ప్రథమ భాగం, అధ్యా. 8, శ్లో. 23-27, **వరాహపురాణం**, ద్వితీయ భాగం, అధ్యా. 1, శ్లో. 70-71).

### జరహర, వాలిఘ్న, రసాయన తీర్థాలు :

ఈ మూడు తీర్థాలు స్వామిపుష్కరిణికి తూర్పుదిశలో వేంకటాచలంపై ఇరవై రెండు బాణాల దూరంలో ఉన్నాయి. దేవమాయా కారణాన అవి అదృశ్యమైనాయి. ఇవి మనుష్యులకు కానరావు. (**వరాహపురాణం,** ప్రథమ భాగం, అధ్యా. 40, శ్లో. 27-29)

### కటాహ తీర్థం :

శ్రీవేంకటేశ్వరస్వామి గర్భాలయానికి ఉత్తర భాగంలో విమాన ప్రదక్షిణంలో ఈ కటాహ తీర్థం లేదా తొట్టి తీర్థం ఉన్నది. శ్రీవేంకటేశ్వరస్వామి అభిషేకతీర్థం, స్వామి స్నానతీర్థం చందన కుంకుమాది ద్రవ్య

సమన్వితమైన జలం శుక్రవారాల్లో ఒకతొట్టిలో నిండుతుంది. భగవన్నామాన్ని ఉచ్చరిస్తూ శ్రీవేంకటేశ్వర అష్టాక్షరీ మంత్రాన్ని (ఓం నమో వేంకటేశాయ) అని స్మరిస్తూ ఈ జలాన్ని స్వల్పంగా మూడుసార్లు సేవిస్తే సకల పాప పరిహారం కలుగుతుంది. పాపపరిహారమై, పుణ్యప్రాప్తి కలిగి భుక్తి ముక్తి ప్రదాయక మౌతుంది. 'పాప పరిహారం కలుగుగాక' అని మనస్సులో జపిస్తూ ప్రతిదినం సేవిస్తే పాపం పరిహారమై మోక్షం సిద్ధిస్తుంది. స్వామిపుష్కరిణిలో స్నానం, శ్రీవరాహస్వామి దర్శనం, కటాహతీర్థ పానం దుర్లభం. (**స్కాందపురాణం**, ద్వితీయ భాగం, అధ్యా. 1, శ్లో. 28–35, అందులోనే శ్లో. 34–35)

**స్వామిపుష్కరిణీ స్నానం**
**వరాహ శ్రీశ దర్శనమ్ ।** **శ్లో. 34**
**కటాహ తీర్థపానం చ**
**త్రయం త్రైలోక్య దుర్లభమ్ ॥** **శ్లో. 35**

**విరజా తీర్థం :**

శ్రీ వేంకటేశ్వరాలయ ద్వారం వాయవ్య దిశలో రాతి దొన్నెలో ఈ చిన్న తీర్థం ఉన్నది. శ్రీ వేంకటేశ్వరస్వామి పాదాల క్రింద విరజానది ప్రవహిస్తుందని విశ్వసిస్తారు. ఆ పాద పీఠం నుండి గర్భాలయంలోనికి నీరు ప్రవహించేది. రాతి దొన్నెలోనికి కూడా ప్రవహించేది. గ్రానైట్ రాళ్ళు పరిచిన భూమిపై రాళ్ళ మధ్యన ఉన్న సన్న వివరాల గుండా ప్రవహించే నీటిని ఆపడానికి కరిగిన సీసాన్ని రాళ్ళమధ్యలో పోసి ప్రయత్నించారు. కొంతకాలం నీరు ఆగి మళ్ళీ మొదలైంది. కరిగించిన సీసాన్ని పోయడం తాత్కాలిక పరిష్కారమే అయింది. పిమ్మట దేవాలయానికి వెనుక వీధిలో ఒక బోర్ బావిని త్రవ్వించారు. దాంతో నీటి ప్రవాహం చాలా భాగం తగ్గింది. రాతి దొన్నెలో ఉన్న జలాన్ని పవిత్రంగా భావిస్తారు.

**ఆకాశగంగా తీర్థం :**

ఆలయానికి తూర్పుదిశగా రెండుమైళ్ళ దూరంలో ఈ తీర్థం నెలకొని ఉన్నది. ఈ తీర్థ స్థలంలోనే త్రేతాయుగంలో అంజనాదేవి పంద్రెండు సంవత్సరాలు తీవ్రమైన తపస్సును చేసి ఆంజనేయుణ్ణి లేదా హనుమంతుణ్ణి సంతానంగా పొందింది. ఇచ్చటి నీరు స్వచ్ఛంగా ఉంటుంది.

పూర్వ కాలంలో రామానుజుడనే బ్రాహ్మణుడు ఈ జలాశయం వద్ద తీవ్రమైన తపస్సు చేశాడు. శంఖ, చక్రాద్యాయుధాలను ధరించి లక్ష్మీసహితుడై విష్ణువు ఆ బ్రాహ్మణునకు ప్రత్యక్షమై ఇలా అన్నాడు, "మేషమాసం (హిందూ పంచాంగంలో చైత్రమాసం అనే మొదటి నెలలో) పూర్ణిమ చిత్తా నక్షత్రంతో కూడి ఉన్న శుభ సమయాన ఈ తీర్థంలో స్నానం చేసిన వారికి తార్కిక బుద్ధి కలిగి భగవద్భక్తులౌతారు. ఇచ్చట స్నానం చేయవలసిన పవిత్ర సమయాన్ని **వరాహపురాణం** (ద్వి.భా.అధ్యా. 1, శ్లో. 68,69)లో నిర్దేశింపబడింది.

ఒక ధార్మికుడు, పండితుడు ఐన బ్రాహ్మణుడు గోదావరీ తీరంపై తన తండ్రి శ్రాద్ధం పెడుతూ ధార్మికుడు పండితుడూ ఐన మరో బ్రాహ్మణుణ్ణి పితృదేవతల ప్రతినిధిగా నియంత్రించినాడు. శ్రాద్ధకర్మ పూర్తియైన పిదప భోజనానంతరం, శ్రాద్ధకర్మ చేసిన బ్రాహ్మణుని ముఖం గాడిద ముఖంలాగా మారిపోయింది. దానితో విచారగ్రస్తుడై సువర్ణముఖీ తీరంలో నున్న అగస్త్య మహర్షికి నివేదింపగా, సంతానం లేని బ్రాహ్మణుణ్ణి శ్రాద్ధకర్మకై నియంత్రించడం వలన ముఖం మారిందనీ, స్వామిపుష్కరిణిలో ముందు స్నాన మాచరించి ఆకాశగంగా తీర్థంలో స్నానం చేస్తే యథాపూర్వస్థితి వస్తుందనీ చెప్పాడు. ఆ బ్రాహ్మణుడు అగస్త్య మహర్షి చెప్పినట్లు చేయగా మళ్ళీ పూర్వమున్న ముఖాన్ని పొందాడు. **(స్కాంద పురాణం**, ప్ర.భా. అధ్యా.12 శ్లో.25-56).

ప్రతి దినం శ్రీ వేంకటేశ్వర స్వామివారి స్నానార్థం ఆకాశగంగనుండి మూడు వెండి బిందెల నిండా జలాన్ని తీసుకువస్తారు. ఏడు ఆచార్య పురుష కుటుంబాలకు చెందిన వారే ఈ తీర్థాన్ని తెస్తారు. వీరే స్వామి ముందు మంత్ర పుష్పాన్ని కూడా పఠిస్తారు. వీరు తిరుమలనంబి కుటుంబం వారు. తిరుమల నంబి, వైష్ణవాచార్యుడైన ఆళవందార్ యామునాచార్యులకు మనుమడు. యామునాచార్యులు వైష్ణవాచార్యుడైన నాథమునికి పౌత్రుడు. **ఈ తిరుమలనంబి, విశిష్టాద్వైత స్థాపకుడై, 11వ శతాబ్ది యందున్న గొప్ప వైష్ణవాచార్యుడైన శ్రీరామానుజునకు మేనమామ. శ్రీమద్రామాయణ రహస్యార్థాన్ని శ్రీరామానుజునకు వివరించిన దేశికుడు. ఈయన తన తాతగారైన యామునాచార్యుల వారి ఆదేశంమేరకు శ్రీరంగం నుండి వేంకటాచలానికి సకుటుంబంగా చేరినాడు. ఆయనకు ఇద్దరు చెల్లెళ్ళు ఉండగా, అందులో ఒకర్తుక మద్రాసు నగరానికి సమీపంగా ఉండే శ్రీపెరుంబూదూర్‌లో నివసిస్తున్న కేశవ సోమయాజిని వివాహమాడింది. ఈ కేశవ సోమయాజి పుత్రుడే శ్రీరామానుజుడు.** శ్రీవేంకటేశ్వర స్వామి పూజా వినియోగార్థం తిరుమలనంబి వేంకటాచలంపై ఉద్యానాన్ని ఏర్పరచినాడు. ప్రతిదినం ఉదయాన్నే, శ్రీవేంకటేశ్వరాలయానికి ఉత్తరదిశలో మూడు మైళ్ళ దూరంలో నున్న పాపవినాశ తీర్థం నుండి జలాన్ని తీసుకు వచ్చేవాడు. వృద్ధుడై శక్తిహీనుడైనందున, పాపవినాశ తీర్థం కంటె కొంచెం తక్కువ దూరంలోనున్న ఆకాశ తీర్థం నుండి జాలాన్ని తెచ్చేవాడు. ఆయన వారసులు ఈ సంప్రదాయాన్ని ఇప్పటికీ కొనసాగిస్తున్నారు.

**పాపవినాశ తీర్థం :**

దేవాలయానికి ఉత్తరదిశలో ఈ జలపాతం ఉన్నది. ఇది ఎత్తైన జలపాతం కాదు. ఈ జలం పవిత్రమైంది. శుక్లపక్షంలో ఉత్తరాషాఢ నక్షత్రయుక్తమైన ఆదివారంనాడు కాని ఆశ్వయుజమాస శుక్లపక్ష ద్వాదశి, ఉత్తరాషాఢ నక్షత్రయుక్తమైన ఆదివారంనాడు ఈ తీర్థంలో స్నానం చేస్తే, పూర్వజన్మ కృత పాపాలన్నీ నివారింప బడుతాయి. ఈ పవిత్ర దివసాలలో సాలగ్రామదానం విశేష ఫలవంతమౌతుంది. పుష్య లేదా హస్తా నక్షత్రయుక్త మైన ఆదివారంతో కలిసిన వైశాఖ మాస శుక్ల సప్తమి లేదా కృష్ణ సప్తమినాడు స్నానం చేయడం పవిత్రమని మరొక శుభదినం కూడా **వరాహపురాణం** (ది.భా అధ్యా.1, శ్లో.72-73)లో పేర్కొనబడింది. దేవస్థానం వారు బస్సు సౌకర్యాన్ని ఏర్పాటు చేసినందున, చాలామంది భక్తులు ఈ తీర్థాల్లో స్నానం చేస్తారు.

**వైకుంఠ తీర్థం :**

ఈ తీర్థం దేవాలయానికి రెండు మైళ్ళ దూరంలో ఈశాన్య దిశలో ఉన్నది. వైకుంఠ గుహ నుండి ప్రవహిస్తున్నందున వైకుంఠ తీర్థమని వ్యవహరిస్తారు.

శ్రీరామచంద్రుడు రావణాసురుణ్ణి జయించడానికి వానర సేనతో బయలుదేరి లంకకు వెళ్ళుతూ, అంజనీదేవి, అంజనేయస్వామి ప్రార్థన మేరకు స్వామిపుష్కరిణీ తటంపై ఒకదినం విశ్రమించాడు. వానరులు అచ్చటి అరణ్యంలో తిరగడం ప్రారంభించారు. **గజుడు, గవాక్షుడు, గవయుడు, శరహుడు మొదలైన వారు ఈశాన్య దిశకు వెళ్ళారు. వాళ్ళకు ఒక లోతైన చీకటి గుహ కన్పించింది. వాళ్ళు ఆ గుహలో ప్రవేశించి చాలా దూరం వెళ్ళారు. అప్పుడు వారికొక దేదీప్యమాన నగరం కన్పించింది. అది స్వర్ణమయంగా ఉన్నది. ద్వారబంధాలు తోరణాలు స్వర్ణంతో సిద్ధమైనవే. ఉద్యానాలు నిర్మల జల ప్రవాహాలు, గోపురమంటప ప్రాకారాలు, బహుమూల్య రత్న ఖచితంగా కన్పించాయి. అక్కడ నివసిస్తున్న వారంతా చతుర్బాహువులై శంఖచక్రధారులై ఉన్నారు. శ్వేతాంబరాలను, ఆభరణాలను ధరించి పరమానంద భరితులై కన్పించారు.**

ఆ నగరం మధ్యలో ఒక దివ్య విమానం కన్పించింది. అందులో తేజస్వియైన వ్యక్తి ఆదిశేషుని పడగల క్రింద చతుర్భుజుడై శంఖచక్రధారియై, పీతాంబరాన్ని ధరించి, వివిధ రత్నమయుడై వైజయంతీ వనమాలా విభూషితుడై వక్షఃస్థలంలో శ్రీవత్సలాంఛనంతో వనితలు చామరములను వీయగా కృపావర్షాన్ని కురిసే నేత్రాలతో కన్పించినాడు. **అంతలోనే హఠాత్తుగా బలిష్ఠుడైన వాడొకడు దండధరుడై వానరులను భయపెట్టాడు. వాళ్ళు భీతులై గుహనుండి వెలుపలికి పరుగెత్తి వెళ్ళి ఆశ్చర్యకరమైన ఆ దృశ్యాన్ని తమ సహచరులకు వర్ణించి చెప్పారు. వాళ్ళంతా గుహలో పునఃప్రవేశించినారు. కాని వారికాదృశ్యం కన్పించలేదు.**

శ్రీమన్నారాయణుని కృపచే కొంతమంది వానరులకు ఆ దివ్య మందిర దర్శనం కలిగింది. భక్తులను అనుగ్రహించడానికి దేవదేవుడు ఈ పవిత్ర గుహలో విరాజమానుడై ఉంటాడు. **(వరాహపురాణం, ప్రథమ భాగం, అధ్యా.10)** ఈ దివ్య గుహ నుండి ప్రవహించే వైకుంఠ తీర్థజలం పావనమైనందున, ఈ జలస్నానం గొప్ప ప్రభావాన్ని కలిగి ఉన్నది. వానరులకు వైకుంఠ దర్శనం కలిగించిన కారణంగా ఈ గుహకు **'వైకుంఠ గుహ'** అనే పేరు ప్రసిద్ధమైంది. ఈ గుహలో నిత్యులు, ముక్తులు మానవులకు అదృశ్యంగా నివసిస్తూ ఎల్లవేళలా భగవత్సేవ చేస్తూ ఉంటారు. రాత్రి వేళ దేవాలయంలో స్వామిని సేవించి గర్భాలయంలో రజతపాత్రల్లో నిక్షేపించిన జలాన్ని పవిత్రం చేస్తారు. ఆ జలాన్నే తెల్లవారిన తరువాత భక్త జనులకు వినియోగిస్తారు.

**జాబాలి తీర్థం :**

దేవాలయానికి ఉత్తరదిశగా రెండు మైళ్ళ దూరంలో ఈ తీర్థం ఉన్నది. ఇక్కడ ఆశ్రమాన్ని నిర్మించుకొని జాబాలి మహర్షి కొంతకాలం నివసించి వదిలి వెళ్ళాడు. తరువాత అగస్త్యమహర్షి చాలా కాలమిచ్చట రాజవంశీకులైన శిష్యులతో నివసించి శ్రీవేకంటేశ్వర స్వామిని ఘనంగా సేవించాడు. **(వరాహపురాణం, ప్రథమ భాగం, అధ్యా.21, శ్లో.21-24)**

**చక్ర తీర్థం :**

దేవాలయానికి వాయవ్య దిశలో రెండుమైళ్ళ దూరంలో ఈ తీర్థం ఉన్నది. రాక్షసుల మూలంగా ప్రాణభయం కలదని శ్రీవేంకటేశ్వరస్వామికి విన్నవించి, ఆ ప్రమాదాన్ని నివారించుకొవడానికి శ్రీవత్స గోత్రీకుడైన పద్మనాభుడు అక్కడ పండ్రెండేళ్ళు తీవ్రమైన తపస్సు చేశాడు. స్వామి ప్రత్యక్షమై, పద్మనాభుణ్ణి అక్కడే నివసింపమని ఆదేశించి, రాక్షస సంహారం కోసం తన సుదర్శన చక్రాన్ని పంపించాడు. అందుకే ఈ తీర్థం తపస్సును చేయడానికి అనుకూలంగా భావింపబడుతున్నది. **(స్కాందపురాణం,** ప్ర.భా. అధ్యా. 13)

శ్రీరంగానికి చెందిన సుందరుడనేవాడు భూతావిష్టుడై రాక్షస రూపాన్ని పొందాడు. వసిష్ఠ మహర్షి ఆదేశంతో ఇచ్చట స్నానమాచరించి రాక్షస బాధనుండి ముక్తుడై మోక్షాన్ని పొందినాడు.

ఈ తీర్థ స్థలంలో శ్రీలక్ష్మీనరసింహస్వామి వారి విగ్రహం, శ్రీసుదర్శన విగ్రహం ప్రతిష్ఠితమైనాయి. కార్తిక బహుళ ద్వాదశినాడు దేవాలయం నుండి ఇచ్చటికి పాయసాన్ని తెచ్చి విగ్రహాలకు నివేదించి, ఈ తీర్థంలో స్నానమాచరించిన భక్తులకు వినియోగం చేస్తారు.

**రామకృష్ణ తీర్థం :**

దేవాలయానికి ఉత్తరదిశగా ఆరు మైళ్ళ దూరంలో ఈ తీర్థం ఉన్నది. ఇక్కడ కృష్ణుడనే భక్తుడు తపస్సు చేశాడు. తన కాలకృత్యాలకు స్నాన సంధ్యాదులకు అవసరంగా ఈ తీర్థాన్ని త్రవ్వి సిద్ధం చేశాడని ప్రసిద్ధి. తరువాతి కాలంలో రామకృష్ణముని ఇచ్చట కొన్ని శతాబ్దులు తీవ్రమైన తపం చేశాడు. ఆయన చుట్టూ ఒక పుట్ట పెరిగింది. ఆయనకది తెలియలేదు. ఆయన తపోనిరతిని పరీక్షించడానికి ఇంద్రుడు ఉరుములు, మెరుపులు, పిడుగులతో ఒక తీవ్రమైన వర్షాన్ని కల్పించాడు. ఆ ప్రళయ భీకర వర్షాన్ని సైతం ఆయన గమనించలేదు. పుట్ట మీది పైభాగం విరిగి భూమిపైకి జారింది. అప్పుడు శ్రీమహావిష్ణువు గరుడ వాహనారూఢుడై ఆయనకు సాక్షాత్కరించి ఇట్లా ఆదేశించాడు, "పుష్యమి నక్షత్రంతో యుక్తమైన మకర మాస పూర్ణిమనాడు నీకు సాక్షాత్కరించాను. ఈ తీర్థంలో స్నానమాచరించిన వారికి సర్వపాప విమోచనం కలుగుతుంది. **(స్కాందపురాణం**, అధ్యా. 5) ఆ పవిత్ర దివసాన ఎంతో మంది భక్తులు ఈ తీర్థ స్నానానికై వస్తారు. దేవాలయం నుంచి ప్రసాదాలను తీసుకొని వచ్చి ఈ తీర్థంలో శ్రీకృష్ణ ప్రతిమకు నివేదిస్తారు. శ్రీకృష్ణాభిషేకం తరువాత భక్తజనులకు ప్రసాద వినియోగం చేస్తారు.

**కుమారధారాతీర్థం :**

దేవాలయానికి వాయవ్య దిశలో ఆరుమైళ్ళ దూరంలో ఈ తీర్థం ఉన్నది. మాఘపూర్ణిమనాడు ఈ తీర్థస్నానం అత్యంత శుభప్రదం. గంగాది పవిత్ర నదీ తీర్థ ఫలితాన్నిస్తుంది. ఆ పవిత్ర దివసాన దేవాలయం నుండి ప్రసాదాలను తెచ్చి ఇచ్చట చేరిన భక్తులకు వినియోగం చేస్తారు. ఈ తీర్థంలోనే పార్వతీ పరమేశ్వర పుత్రుడై అగ్ని సంభవుడైన కార్తికేయుడు (కుమారస్వామి, సుబ్రహ్మణ్యుడు) దేవసేనాదేవీ సహితుడై శ్రీనివాసుణ్ణి

అర్చిస్తాడు. **(వరాహ పురాణం, ద్వి.భా. శ్లో.61-65).** దేవదానవ యుద్ధంలో తారకాసురుణ్ణి సంహరించినందున కలిగిన బ్రహ్మహత్యాపాతకాన్ని పరిహరింప చేసుకోవ-డానికి ఇంద్రుని ఆదేశం మేరకు ఈ తీర్థంలో శ్రీవేంకటేశ్వర అష్టాక్షరీ మంత్రాన్ని జపిస్తూ తపస్సు చేసి ఆ పాతకం నుండి విముక్తుడైనాడు. కుమారస్వామి తపస్సు చేసినందున ఈ తీర్థానికి కుమారధారా తీర్థమని పేరు కలిగింది **(మార్కండేయ పురాణం అధ్యా.4)** కుమారస్వామి వేంకటేశ్వర స్వామికి కిరీటాన్ని సమర్పించినాడని, ఆ కిరీటాన్నే శ్రీవేంకటేశ్వరస్వామి ధరిస్తాడని ప్రసిద్ధి.

ఒకప్పుడు ఒక నిర్ధనుడై అంధుడైన వృద్ధ బ్రాహ్మణుడు దారి తప్పి ఈ కొండ కోనలో భూమిపై పడి దురపిల్లుతూ "కుమారా! కుమారా!" అని ఎలుగెత్తి పిలిచాడు. ఆ సమయంలో శ్రీవేంకటేశ్వరస్వామి యువకుని రూపంలో కొండపై విహరిస్తూ ఉన్నాడు. ఆయన ఈ వృద్ధ బ్రాహ్మణుణ్ణి సమీపించి "ఆ నిర్జన ప్రదేశంలో అర్భకుడెవరూలేడని, ఆయనకు ఏమి కావలెనో తెల్పమన్నాడు. అప్పుడా వృద్ధ బ్రహ్మణుడు "నేను వృద్ధుణ్ణి, అశక్తుణ్ణి, నిత్యకర్మానుష్ఠానం కూడా చేయలేకుండా ఉన్నాను. నాకు నా అన్నవారు లేరు. నేను నిర్ధనుణ్ణి. నా ఆశ్రమానికి దారినికూడా నేనెరుగను. ఇంత అనర్థుణ్ణైన నాకు స్వామి కృపతో దీర్ఘాయుష్యాన్ని అనుగ్రహించినందున ఈ బాధను దుఃఖాన్ని అనుభవిస్తున్నాను" అన్నాడు.

అది విని శ్రీవేంకటేశ్వరస్వామి ప్రసన్నంగా ఇలా అన్నాడు, "నీ శరీరం జరాకృశమైంది. నీ కన్నులకు చూపులేదు. నీకు చిరకాలం జీవించాలన్న కోరిక ఉన్నదా? నీకు వైమనస్యం కలిగి ఈ శరీరాన్ని త్యాగం చేయదలిచావా? నిజం పలుకు," అని. వృద్ధ బ్రాహ్మణుడు ఇట్లా సమాధానం చెప్పాడు, "ఓ ప్రభూ! బ్రతుకు నీడ్వడం కష్టంగానే ఉన్నది. భగవంతుని 'కృపతో ఒకవేళ నా ఆయుష్యం పెరిగితే నిమిత్తకర్మలను ఆచరించి, అగ్నిహోత్రార్చన మొదలైన విహిత కర్మలను ఆచరించనందున కలిగిన పాపాన్ని బాపుకొని దేవఋణాన్ని తీర్చుకుంటాను. అప్పుడు జీవిత త్యాగం చేస్తాను" అని అన్నాడు. ఆ ప్రభువు వృద్ధ బ్రాహ్మణుని చేయి పట్టుకొని ఒక జలప్రవాహం వద్దకు తీసుకువెళ్ళి స్నానం చేసిన తరువాత ఆశ్రమానికి వెళ్ళుదామన్నాడు. ఆ జలంలో స్నానం చేయగానే ఆ వృద్ధ బ్రాహ్మణుడు 16 ఏళ్ళ ప్రాయంవాడైనాడు. అప్పటిదాకా ఆయన వెంట ఉన్న యువకుడు కూడా సహస్ర పాదాక్షిశిరోరుబాహువై విశ్వరూపంతో సాక్షాత్కరించాడు. ఈ అద్భుత సన్నివేశాన్ని చూడటానికి దేవతలంతా ఆకాశవీధిలో కన్పించి స్వామి పై పుష్పవర్షాన్ని కురిపించాడు. అప్పుడు స్వామి బ్రాహ్మణునితో "నీకు శక్తిమంతమైన దేహాన్ని, వలసినంత ధనాన్నీ ప్రసాదించినాను. నీవు యజ్ఞాదులను, విహిత కర్మలను చేసి నీ పాపపరిహారం చేసుకొని అభీష్టాన్ని పొందు" అని ఆదేశించి అదృశ్యమైనాడు.

వృద్ధ బ్రాహ్మణుణ్ణి కుమారునిగా మార్చిన ఆ జల మహత్త్వాన్ని దేవతలు కొనియాడి **"కుమారధార"** అని పేరిడినారు. ఈ తీర్థంలో స్నానమాచరించిన వారు సర్వపాపవిముక్తులై హరిచరణ సన్నిధిని పొందుతారు. **(వరాహపురాణం ప్రథమ భాగం, అధ్యా.3, శ్లో.31-52, మార్కండేయ పురాణం, అధ్యా.3, శ్లో.11-43).**

**తుంబ, తుంబురు కోన లేదా ఫాల్గుణి తీర్థం :**

సౌరమాసమైన మీనమాసంలో ఉత్తరఫల్గుణీ నక్షత్రయుక్తమైన పౌర్ణమి నాడు ఈ క్షేత్రానికి ముక్కోటి దేవతలానాడు ఈ తీర్థంలో స్నానమాచరిస్తారు, పవిత్రం చేస్తారు. ఆ పవిత్ర దివసాన ఈ తీర్థంలో స్నానం విశేష పుణ్యప్రదం, పునర్జన్మరాహిత్యం కలుగుతుంది. **(వరాహపురాణం, ద్వి.భా. అధ్యా-1, శ్లో.66-68).**

ఒక గంధర్వుడు భార్యాసహితుడై ఇచ్చట నివసించేవాడు. మాఘమాసం (మార్చి-ఎప్రిల్) ప్రతిదినం ఉదయం ఈ తీర్థంలో స్నానమాచరించి భార్యకు తనకు పుణ్యాన్ని ఆర్జించాలని తలచాడు. తన నివాసాన్ని శుభ్రం చేసుకొని, ముగ్గులు పెట్టి స్వామికి అన్న నైవేద్యం చేసి, ఇద్దరు ప్రదక్షిణం చేసి కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలను త్యజింప చేసుకొని మోక్షానికి అర్హత సంపాదించుకోవాలనుకున్నాడు. కాని, భార్య ఆయనకు సహకరింప లేదు. ఆయన పాటించమన్న విధులను ఆమె నిర్వహించలేదు. శీతకాలం ఉదయవేళల్లో కలిగే చలిని ఆమె భరింపలేకపోయింది. గంధర్వుడు కోపించి ఆమెను మండూకమై ఒక చెట్టు బొరియలో నివసించేట్లు శపించాడు. ఆమె ఆయన ముందు సాష్టాంగపడి క్షమాభిక్షను కోరింది. అప్పుడాయన అగస్త్య మహాముని ఆ తీర్థానికి వచ్చేదాక మండూక రూపంలో ఉండవలసిందని, అగస్త్య మహాముని తన శిష్యులకు ఈ తీర్థ మాహాత్మ్యాన్ని వివరిస్తాడని, అది విన్న తరువాత ఆమెకు మళ్ళీ గంధర్వ రూపం వస్తుందని శాప విమోచన ప్రకారం చెప్పాడు. అప్పటి నుండి ఈ తీర్థానికి తుంబుర తీర్థమని గంధర్వ నామంతో ప్రసిద్ధమైంది. **(స్కాందపురాణం అధ్యాయం 16)**

19వ శతాబ్దం మొదటి భాగంలో తరిగొండ వెంగమాంబ ఈ తీర్థ స్థలంలోనే తపస్వినిగా శ్రీవేంకటేశ్వర ధ్యానం చేసింది. ఆమె నివాసం ఇప్పటికీ కనిపిస్తుందని అంటారు.

**సనకసనందన తీర్థం :**

మోక్షార్థం చేసే యోగాభ్యాసానికి ఎన్నో ఆటంకాలు కలుగుతూ ఉంటాయి. వారిని అధిగమించడానికి భక్త జనులు సనకసనందన తీర్థంలో స్నానమాచరించాలని అంటారు. పాపనాశన తీర్థానికి ఉత్తరదిశలో నాలుగు మైళ్ళ దూరంలో ఈ తీర్థం ఉన్నది. సిద్ధులు ఇచ్చట నివాసమై ఉంటారు. మానవ దృష్టికి అతీతమైనందున ఇది సామాన్య మానవులకు గోచరింపదు. మార్గశీర్ష శుక్ల ద్వాదశినాడు (ధనుర్మాసం-డిసెంబర్-జనవరి) నాడు స్వామి పుష్కరిణి యందు మొదట స్నానం చేసి మనస్సును, శరీరాన్ని పవిత్రం చేసుకొని యోగాభ్యాస నిరతుడు ద్వాదశి మొదలుగా ఈ తీర్థంలో స్నాన మాచరించి కొన్ని వేలమార్లు శ్రీవేంకటేశ్వర అష్టాక్షరీ మంత్రాన్ని ప్రతిదినం జపించాలి. అది నిర్విఘ్నంగా నెరవేరుతుంది. **(వరాహ పురాణం, 1వ భాగం, అధ్యా.28, శ్లో.31-36).**

**కాయ రసాయన తీర్థం లేదా అస్థి సరస్సు :**

సనక సనందన తీర్థానికి కొంచెం పైభాగాన ఈ తీర్థం ఉన్నది. కాని ఇది కనిపించదు. ఈ తీర్థజలాన్ని త్రాగితే శరీరం త్రుటిలో పవిత్రమౌతుంది. దీని శక్తిని పరీక్షించడానికి ఒక ఎండుటాకును ఈ తీర్థ జలంలో వేస్తే అది ఆకుపచ్చగా మారి నీటిపై తేలియాడుతుంది. **సనకుడు, ఇతర ఋషులు దీని ద్వారాన్ని శిలలతో మూసివేశారు. ఇది మానవదృష్టికి కనిపించదు. మహాత్ములు భగవత్కృపతో దీనిని దర్శింపగలరు.** శరీరాన్ని తృణీకరించక, దానిని ఆరోగ్యంగా శక్తిమంతంగా, దృఢం కావించి కాపాడి, శ్రీవేంకటేశ్వర ధ్యానపరుడై, ఆ భగవంతుని సేవయే అత్యుత్తమైన విధియని భావించి మానవుడు దానియందు నిమగ్నుడు కావాలి. పరమాత్మయైన విష్ణువునకు జీవునకు శేషశేషి భావం. అందుకే భగవంతునకు నిరంతరం సేవ చెయ్యాలి. అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తే మానవుడు కృతఘ్నుడౌతాడు. శాస్త్రవిహితమైన నిత్యనైమిత్తిక కర్మలను, భగవంతుని ఆదేశానుసారం సంపూర్ణమైన మనస్సుతో స్వామికి ప్రీతిగా సమాచరించాలి. మానవుడు తనవిగా భావించే శరీరం, సుఖం, బుద్ధి, విజ్ఞానం, బలం, శక్తి, భూమి, గృహం, ధనం, ధాన్యం తదితరాలను అన్నింటినీ శ్రీవేంకటేశ్వర సమర్పణం చేయాలి. ప్రపంచంలో సమస్త వస్తుజాలం అశాశ్వతమనీ నశించే స్వభావం కలదనీ తెలుసుకోవాలి. పాపకర్మలు దుఃఖాన్ని పుణ్యకర్మలు స్వర్గప్రాప్తిని కలిగిస్తాయి. భగవంతుడే సర్వకర్మలకు ప్రేరకుడు కాబట్టి, మానవుడు తన మనస్సును భగవంతుని యందే లీనం కావించాలి. దాని వలన ఆయన అనుగ్రహం కలుగుతుంది. ధర్మశాస్త్రాల్లో వివరింపబడిన నియమాలను, సిద్ధాంతాలను గురూపదేశాను గుణంగా అనుసరించాలి. వేదార్థాన్ని, వ్యాఖ్యానాలను, భాష్యాలను చర్చించాలి, వేదాంతాన్ని నిత్య జీవితంలో ఆచరించాలి నిషిద్ధ కర్మలను చేయకూడదు. సదాచార ప్రవర్తనతో ధార్మిక జీవనాన్ని సాగించాలి. **(వరాహ పురాణం, ప్రథమ భాగం అధ్యా.28, శ్లో.37-49).**

కాశీయాత్రకు బయలుదేరుతూ, ఒక బ్రాహ్మణుడు గర్భవతియైన తన భార్య యోగక్షేమాలను చూడవలసిందిగా తొండమాన్ మహారాజును కోరి అప్పగించి వెళ్ళాడు. కాలవశాత్తు ఆమె చనిపోగా, శ్రీవేంకటేశ్వరస్వామి ఆజ్ఞానుసారం ఆమె శవాన్ని ఈ తీర్థ జలంలో తొండమాన్ చక్రవర్తి నిమగ్నం చేశాడు. ఆమెకు మళ్ళీ ప్రాణం వచ్చింది.

**దేవ తీర్థం :**

దేవాలయానికి వాయవ్యదిశలో దట్టమైన అడవిలో ఈ తీర్థం ఉన్నది. పుష్యమి నక్షత్రము, వ్యతీపాతయోగము కలిసిన గురువారంనాడు శ్రవణ నక్షత్రయుక్తమైన సోమవారంనాడు కాని, ఈ తీర్థంలో స్నానమాచరిస్తే దీర్ఘాయుష్యం, సత్సంతానం, సౌఖ్యం ఇహలోకంలో కలుగుతాయి. స్వర్గ ప్రాప్తి కలుగుతుంది.

* * *

## అధ్యాయం-6

### శ్రీమహావిష్ణువు వేంకటాద్రికి వేంచేయుట (భవిష్యపురాణం-అ.2)

మొదటి మూడుయుగాల్లో – కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం – శ్రీవిష్ణువు వేంకటాద్రిపైనే ఉన్నాడు. కలియుగారంభంలో ఆయనకు వైకుంఠం, అచ్చటి నిత్యులు, ముక్తులు గుర్తుకు రాగా శ్రీదేవీ, భూదేవీ, నీలాదేవితో కలిసి ఒక దివ్యాద్భుత విమానంపై వైకుంఠానికి వెళ్ళాడు. వేంకటాచలాన్ని శ్రీవరాహస్వామికి అప్పచెప్పాడు.

ఒకసారి నారద మహర్షి వేంకటాద్రికి వెళ్ళాడు. శ్రీవిష్ణువు వైకుంఠానికి తిరిగి వెళ్ళినాడని తెలిపి, సత్యలోకానికి పయనమై వెళ్ళి, బ్రహ్మదేవునకీ విషయాన్ని తెలిపాడు. బ్రహ్మకు విచారం కలిగింది. వేంకటాద్రిపై విష్ణువు ఉన్నపుడు ప్రజలు భక్తియుతులై పుణ్యాత్ములై ఉన్నారనీ, శ్రీవరాహస్వామి ఒక్కడే తాను ప్రారంభించిన బ్రహ్మోత్సవాన్ని రథోత్సవాన్నీ నిర్వహింపజాల దని భావించి, బ్రహ్మదేవుడు వాసుదేవ దశరథాంశలతో ఒక చింత చెట్టును ఆ స్థలంలో సృష్టించి దేవకీదేవి, కౌసల్యాదేవి అంశలతో ఆ చెట్టు క్రింద ఒక పుట్టను పుట్టించడానికి సంకల్పించి, వేంకటాద్రిపై నెలకొన్న ఆ పుట్టలో నివసించే విధంగా శ్రీవిష్ణువును తీసుకురావలసిందిగా యత్నించాలని నారదుణ్ణి కోరాడు.

అక్కణ్ణుండి నారదుడు కశ్యపుడు, ఇతర మునులు యజ్ఞం చేస్తున్న గంగాతీరానికి వెళ్ళాడు. ఆ యజ్ఞ ఫలాన్ని ఏ దేవునకీయదలిచారని వాళ్ళను అడిగాడు. భృగుమహర్షి అక్కడ సమావేశమైన ఇతర ఋషులు చర్చించుకొని ఒక నిర్ణయానికి రాలేకపోయినారు. త్రిమూర్తులలో ఒక్కొక్కరిని వేర్వేరుగా వరాహ గుణగణాలను స్వయంగా పరీక్షించి, వారి అర్హత తెల్పవలసిందని భృగుమహర్షిని మొదట సత్యలోకానికి పంపారు. బ్రహ్మ ఋషి సమూహంతో కొలువై ఉన్నాడు. ఆయనకు సాష్టాంగప్రణామం చేసి, బ్రహ్మ తనను కూర్చోమనడానికి ముందే భృగుమహర్షి కూర్చున్నాడు. బ్రహ్మకు భృగుమహర్షి ప్రవర్తన చికాకు కల్గించింది. ఆయనను గుర్తించనట్లుండి ఆయన రాకకు కారణమేదో కూడా తెలిసికో ప్రయత్నించలేదు. భృగు మహర్షికి ఈ ప్రవర్తన బ్రహ్మదేవునికి రజోగుణం వలన కలిగిందని, ఆయన ముక్తి ప్రదాతకాదనీ, ఆయనకు భూమండలం పై దేవాలయం ఉండరాదని శపించాడు. వెంటనే తన ఆసనం నుండి లేచి కైలాసంలో శివుణ్ణి చూడటానికి వెళ్ళాడు. ఆయన పార్వతి దేవితో ఏకాంత సుఖంలో ఉన్నాడు. భృగుమహర్షి ఏకాంత మందిరంలోనికి వెళ్ళి ఆదిదంపతుల ముందు నిలబడ్డాడు. పార్వతీదేవి ముఖం సిగ్గుతో నిండి పోయింది. శివుడు భృగుమహర్షిని కోపసంరక్త లోచనుడై చూచాడు. ఆయనతో కుశల ప్రశ్న చేయలేదు. తమోగుణమయుడైన శివుడు ముక్తి ప్రదాతకాదని ఆయనకు సర్వాంగపూజ కూడదని శపించాడు. అక్కడి నుండి భృగువు వైకుంఠానికి వెళ్ళాడు.

ఆ సమయంలో శ్రీమహావిష్ణువు ఆదిశేషునిపై శ్రీలక్ష్మీ సహితుడై శయనించి ఉన్నాడు. భృగువు ఆయన వక్షఃస్థలం కుడిభాగాన తన్నినాడు. అది శ్రీమహాలక్ష్మీ నివాస స్థానం. వెంటనే శ్రీమహావిష్ణువు లేచి, మహర్షికి

నమస్కరించి, అర్ఘ్యపాద్యాలను సమర్పించి, ఆయన ముందు కూర్చుని, ఆయన పాదాన్ని తన తొడపై పెట్టుకొని తన చేతులతో సంవాహనం చేశాడు. మహర్షి పాదానికి తన్నడం వలన కలిగిన శ్రమను తగ్గించటానికి సంవాహనం చేసినా, ఆ మహర్షి బొటన వ్రేలికి ఉన్న కంటికి చూపు లేకుండ చేశాడు. భృగుమహర్షికి అది గర్వహేతువు. మహర్షి తన వద్దకు వస్తున్న విషయం తనకు తెలియనందున తాను విశ్రమిస్తున్నానని, అది అపచారమనీ దానికై తనను మహర్షి శిక్షించినాడని, తనకది సమ్మతమేనని క్షమా ప్రార్థన పూర్వకంగా విన్నవించుకున్నాడు. మహర్షి పాదం తన వక్షఃస్థలానికి రత్నం వంటిదని, ఆయన పాద స్పర్శ వలన తనకు ధన్యత కలిగిందని విజ్ఞాపనం చేసి, ముని పాదాలను కడిగి తన శిరస్సుపై ఆ నీటిని చల్లుకున్నాడు.

విష్ణువు వినయానికి, తనకు చేసిన మర్యాదకు భృగువు ఎంతగానో సంతోషించాడు. ఆయన వైపు చూస్తూ తాను చేసిన పనికి సిగ్గుపడ్డాడు. శ్రీవిష్ణువు ఔదార్యం తన తప్పిదం నుండి తనను రక్షించిందని, ఆయన మహోదాత్త గుణాన్ని ప్రశంసించడం సాధ్యం కాదనీ, ఆయన ఒక్కడే పురుషోత్తముడనీ నిశ్చయించాడు.

భృగువు గంగాతీరానికి వెళ్ళి యజ్ఞాన్ని నిర్వహిస్తున్న ఋషులకు తాను త్రిమూర్తులకు పెట్టిన పరీక్షనూ బ్రహ్మ రజోగుణాన్ని, శివుని తమోగుణాన్ని, విష్ణువు సత్వగుణాన్ని వివరించాడు. వారందరూ ఆనందంగా విష్ణువే మోక్ష ప్రదాత అని నిర్ణయించి, యజ్ఞఫలాన్ని విష్ణువునకు సమర్పించి స్తుతించినారు.

భృగుమహర్షి వెళ్ళగానే శ్రీమహాలక్ష్మీ తన కోపాన్ని శ్రీమహావిష్ణువునకు తెలియ చేసింది. **"భృగువు బ్రహ్మకుమారుడు, నీకు మనుమడు, నీవు పరబ్రహ్మవనీ, నన్నెల్లప్పుడూ కాపాడుతావనీ నీ వక్షఃస్థలంలో నివాస ముంటాను. భృగువు అవివేకంగా ఆ స్థలంలో తన్ని నన్ను అవమానించాడు. నేను కోపంతో అవమానంతో బాధపడుతూ ఉంటే, నీవు ఆనందంగా భృగువునకు పరిచర్యచేసి, ఆయనను క్షమాభిక్షను కోరినావు. నేనికమీద నీ వక్షఃస్థలంలో నివసించను. ఎక్కడికైనా వెళ్ళి తపస్సు చేసి భగవద్ధ్యానం చేస్తాను", అని వైకుంఠాన్ని వదిలి కరవీరపురానికి (కొల్హాపురం-మహారాష్ట్రంలో) వెళ్ళి శాశ్వత స్థానాన్ని ఏర్పరచుకొన్నది. అచ్చట భక్తులచే సేవింపబడుతూ ఉన్నది.**

శ్రీమహావిష్ణువు సాధారణ నరుని వలెనే శ్రీలక్ష్మీ వియోగంతో సతమతమైనాడు. భూదేవీ నీలాదేవులను వైకుంఠంలో ఉండేట్లు ఒప్పించి, తాను శ్రీలక్ష్మీదేవిని వెతికి తిరిగి వైకుంఠానికి తీసుకువస్తానని చెప్పి వేంకటాద్రిని చేరి చింతచెట్టు క్రిందనున్న పుట్టలో ప్రవేశించినాడు. అది స్వామిపుష్కరిణికి దక్షిణ తీరంపై ఉన్నది. ఆ పుట్టలో పదివేల సంవత్సరాలు అజ్ఞాతంగా ఉండిపోయినాడు. ఆ పుట్టలో నుండి ఒక దివ్యకాంతి ప్రసరించేది. కాని, ఎవరూ గుర్తించలేదు. అప్పటికి ఎనిమిదవ ద్వాపర యుగం సమాప్తమై కలియుగం ప్రారంభమైంది. ఒక చోళరాజు భూమిపై ధర్మబద్ధంగా రాజ్యం చేస్తూ ఉన్నాడు.

శ్రీ మహాలక్ష్మి కొల్హాపురంలో నివాసమై ఉన్నా, సహజాత శక్తిచే శ్రీ మహావిష్ణువు వైకుంఠాన్ని విడిచి వేంకటాచలం పై ఒక చింతచెట్టు క్రింద పుట్టలో ఉన్నాడని తెలుసుకొని, ఆయనను కోపంతో వీడి

వచ్చినందుకు పశ్చాత్తాపపడినా తన నిర్ణయాన్ని మార్చుకోవద్దని నిశ్చయించుకొని, కొల్హాపురం నుండి ఒక గోపస్త్రీ వేషంతో బయలుదేరి చోళ మహారాజుగారి దేవేరి ప్రాసాదాన్ని చేరుకొని, స్వామినెట్లు ప్రసన్నుని చేసికోగలనా అని ఆలోచించింది. బ్రహ్మదేవుడు ఆమె భావాన్ని గ్రహించి, కపిల గోరూపాన్ని తాను ధరించి, శివుడు ఒక ధవళవత్సంగా వెంటరాగా శ్రీ లక్ష్మీదేవి ముందు ప్రత్యక్షమైనాడు ఆమె ఆ గోవును, వత్సాన్ని చోళ మహారాజ్ఞికి ఒక పాడి ఆవు అవసరం కాగా ఆమెకు అమ్మివేసింది. బ్రహ్మదేవుడు శివుడు ఆవు రూపంలో వత్సంగానూ వచ్చినారని తెలిసి, వారు తన పతిదేవుని పాలతో పోషిస్తారని నమ్మకంతో నిర్విచారంగా శ్రీలక్ష్మి కొల్హాపురానికి తిరిగి చేరుకున్నది. చోళమహారాజునకు రెండువేల గోవులుండేవి. వాటితో పాటుగా తన ఆవును దూడను మేపడానికి పసుకాపరికి ఆ మహారాజ్ఞి అప్పచెప్పింది. ప్రతిదినం ఆవు వేంకటాద్రిపైకి ఎవరూ గుర్తింపకుండా వెళ్ళి పుట్టలో తన పాలనన్నింటినీ విడిచేది. శ్రీ విష్ణువు ఆ పాలను త్రాగేవాడు. రాణిగారి బిడ్డకు ఆవు పాలనీయనందున ఆమె పసుల కాపరిని కోపగించింది. మర్నాడు పసులకాపరి ఆవు వెంట కొండమీదకి పుట్ట వద్దకు వెళ్ళాడు. ఆవు ఆ పుట్ట బొరియలో పాలను విడువడాన్ని చూసి కోపోద్రిక్తుడై తన గొడ్డలితో ఆవు తలపై వ్రేటు వేయపోయాడు. శ్రీ విష్ణువు ఆ పుట్ట బొరియనుండి వెలుపలికి వచ్చి, ఆవు తనకు తల్లిలాగా పాలనిస్తుండేదని, అందుకే ఆవు గొడ్డలి దెబ్బతో ప్రాణం కోల్పోవడం తాను భరించలేకపోయినానని తన శిరస్సును ఆవు తలపై నుంచినాడు. గొడ్డలి ఆయన తలపై గాయం చేసింది. రక్తధార ఆయన శిరస్సు పై కెగిసి భూమిపై పడింది. అది చూచి పసులకాపరి భయంతో ప్రాణం వదిలాడు.

పసుల కాపరి చనిపోవడం చూసి ఆవు కొండ క్రిందికి వచ్చి చోళరాజు ఆస్థానానికి వెళ్ళి భూమిపై పడిదొర్లింది. రాజు ముందు పెద్దగా అంభారవాన్ని చేసి వెనక్కి తిరిగింది. రాజు ఆశ్చర్యపడి తన సేవకులను ఆవును వెన్నంటి వెళ్ళమని ఆజ్ఞాపించాడు. ఆవు పర్వతం పైకి వెళ్ళి పుట్టపై నిలబడింది. పుట్టలోనుండి రక్తధార చిమ్ముతూ ఉండటం ప్రక్కనే పసులకాపరి విగతజీవుడై పడి ఉండటం చూచి రాజభటులు దిగ్భ్రాంతులై, వెంటనే వెళ్ళి రాజుగారికి ఆ భయంకర దృశ్యాన్ని వివరించి చెప్పినారు. రాజుగారు పల్లకీపై పయనమై వెళ్ళి ఆ పుట్టను, భయంకర దృశ్యాన్నీ చూచి, అమాత్యులతో దీనికంతటికీ కారణమేమై ఉంటుందని, చర్చించాడు. అప్పుడు శ్రీ మహావిష్ణువు ఆ పుట్ట బొరియనుండి రక్తధారలు చిమ్ముతున్న తలతో, అశ్రుపూర్ణ నయనాలతో, శంఖ చక్రధారియై బయటికి వచ్చి కోపంతో ఎలుగెత్తి రాజుతో ఇలా అన్నాడు, **"రాజా విను. తల్లిదండ్రులు, సతీసుతులు, బంధువులు లేని పేదవాణ్ణి, పరదేశిని, ఆశ్రయం లేనివాణ్ణి, ఆ పుట్టలో నివసిస్తున్నాను. నాపై దయతో ఈ దివ్యధేనువు తన పాలతో నన్ను తల్లిలాగా సాకింది. నీ పసులకాపరి ఆ గోవు తలపై వ్రేటు వేయబోగా అది నా తలకు తాకింది. ఆ అపరాధానికి వాడు ప్రాణాన్ని కోల్పోయాడు. పవిత్రమైన గోవును చంపయత్నించిన పాపానికి పసులకాపరి చనిపోయినాడు. వాడు నీ సేవకుడు. వాడు నన్ను గాయపరచిన పాపాన్ని నీవు అనుభవించాలి. అందుకే నీవు రాక్షసుడవు కమ్మని శపిస్తున్నాను."** అని. ఆ శాపాన్ని విని రాజు దిగ్భ్రాంతుడైనాడు. కొంత సేపటికి తేరుకొని, శ్రీ విష్ణువు ముందు సాష్టాంగపడి

అశ్రుపూర్ణ నయనాలతో గద్గదంగా ఇలా ప్రార్థించాడు. “దేవా! నేను బుద్ధిపూర్వకంగా నీ యెడ ఏ దోషాన్నీ చేయలేదు. నా అపరాధం లేకున్నా నన్ను శపించినావు. దీన్ని నేను భరింపలేను.” అని. విష్ణువునకు ఆయనపై దయ కలిగింది. తాను తొందరపడి శపించినందులకు చింతించి, **“రాజా! నా శాపానికి తిరుగులేదు. ఈ దినాన సంభవించిన ఘటనలు నీకు బాధను, దుఃఖాన్ని కలిగించాయి. నీ పైనా అనురాగం తగ్గలేదు. కలియుగాంతం వరకు నీవు ఈ శాప ఫలాన్ని అనుభవిస్తావు. ఆకాశరాజు అనే ఒక ఉదారుడైన ప్రభువు తన కూతురైన పద్మావతిని నాకిచ్చి పెళ్ళి చేస్తాడు. ఆయన బంగారు కిరీటాన్ని నా తలపై అలంకరిస్తాడు. ప్రతి శుక్రవారం అది నాతలను ఆరుఘటికల కాలం అలంకరించి ఉంటుంది (రెండు గంటల ఇరవై నిమిషాలు). నాకన్నులలో ఆనంద బాష్పాలు ఉంటాయి. ఆ దృశ్యాన్ని నీవు చూచి ఆనందిస్తావు.”** అని అన్నాడు. చోళరాజు తన ప్రాసాదానికి వెళ్ళాడు. విష్ణువుకు గాయం మూలాన శిరోబాధ ఎక్కువైంది. స్మరింపగానే దేవ గురువైన బృహస్పతి విష్ణు సన్నిధికి వచ్చాడు. శ్రీవిష్ణువు తన గాయం గూర్చి దానిని మాన్చడానికి మందు కావాలన్నాడు. బృహస్పతి ఒక ఓషధి పేరు చెప్పి, దానినుపయోగింపమని వెళ్ళిపోయాడు. ఆ ఓషధిని తెచ్చేవారు ఎవరూ లేనందున, విష్ణువే పుట్టనుండి బయల్వెడలి ఉదయాన్నే ఓషధిని వెతుకుతూ వెళ్ళాడు. అప్పటికే వృషభాసురుణ్ణి సంహరించిన వరాహస్వామి భూదేవీ సహితుడై క్రీడిస్తే వేంకటాద్రిని స్మరించి అక్కడికి వచ్చాడు. అక్కడ మానవాకృతిలో నున్న విష్ణువును రాక్షసుడన్న భ్రమతో ఆయనతో యుద్ధానికి తలపడ్డాడు. వరాహస్వామి తన కాయాన్ని పెంచి భయంకరంగా హుంకరించాడు. విష్ణువు భయపడి పరుగెత్తి వెళ్ళి ఒక పొదలో తల దాచుకున్నాడు. భయంకరాకారంతో, కోరలతో వరాహస్వామి విష్ణువును వెంబడించాడు విష్ణువు కన్నులలో నీరు నిండగా దీనవదనంతో ఆయనకు కన్పించాడు. ఆయన రాక్షసాంతకుడైన విష్ణువుగా వరాహస్వామి గుర్తించాడు. రాక్షసుడు కాదని తెలుసుకున్నాడు. తన తొందరపాటుకు చింతించాడు. **అశ్రుపూర్ణ నేత్రాలతో విష్ణువు వైకుంఠాన్ని ఎందుకు వదిలాడో ఆయన వక్షఃస్థలంలో లక్ష్మీ ఎందుకు నివాసంగా లేదో, ఆయన మానవ రూపాన్ని ఎందుకు ధరింపవలసి వచ్చిందో, ఆయనకు తలపై గాయమెట్లైందో, ఆయన ఎందుకు భయంతో దీనంగా దాక్కోవలసి వచ్చిందో – ఇవన్నీ వింతగా ఆయనను ప్రశ్నించాడు.** తాను వేంకటాచలానికి రావడం తన నెత్తిపై గాయమేర్పడటం, బృహస్పతి ఓషధిని చెప్పడం, వరాహస్వామిని కలుసు కోవడం విష్ణువు వివరించాడు. ఇంకా ఇలా అన్నాడు. “నా తలపై గాయమై నెత్తురు ధారగా పోవడంతో నేను అశక్తుణ్ణైనాను. నీ భయంకర రూపాన్ని, హుంకారాన్ని ఎదుర్కొనే సాహసం చేయలేక పొదలో దాక్కున్నాను. నీవు ప్రేమతో మాటాడినందున నా దుఃఖం మాయమై పోయింది. వేంకటాద్రికి చేరి వైకుంఠవాసం ఇష్టం లేక, పుట్టలో చేరి నప్పటినుండి నీవే నేనుగా భావించి, నీ క్షేత్రంలో ఉంటూ నేను నిన్ను చూడలేక పోయినాను. నేను నీ వద్ద ఉండే విధంగా అనుగ్రహించు”, అని.

వరాహస్వామి విష్ణువుతో ఇలా అన్నాడు. “నేను వృషభాసురుణ్ణి వెంటాడి, ఎన్నో స్థలాలల్లో వెతికి పట్టుకొని చిరకాలం యుద్ధం చేయవలసి వచ్చినందున వేంకటాద్రి నుండి చాలా కాలం దూరం వెళ్ళవలసి

వచ్చింది. నేనిప్పుడు తిరిగి వస్తున్నాను. మళ్ళీ మనం కలుసుకున్నాం. ఇది మన మైత్రికి ఆరంభం. నాకు ఆనందంగా ఉన్నది," అని వరాహస్వామి స్నేహ పూర్వ వచనాలను విని, తాను నివసించడానికి కొంతస్థలాన్ని కలియుగాంతం వరకు ఈయవలసిందిగా కోరినాడు. వరాహస్వామి ఆయనతో అన్నాడు. "పేదవాళ్ళకు వ్యర్థంగా ఆశను కల్పింపరాదు." అని. విష్ణువు ధర చెల్లించడానికి అంగీకరిస్తే నూరు అడుగుల స్థలాన్ని కొలిచి ఇస్తాను అన్నాడు. వరాహస్వామి భూమికి ధర చెల్లించాలని అనగానే విష్ణువు అన్నాడు. **"లక్ష్మి నావద్ద ఉండి ఉంటే భూమికి ధర నిచ్చే సామర్థ్యం నాకుండేది. కాని, శ్రీలక్ష్మి కొల్హాపురానికి వెళ్ళి నివసిస్తున్నది. నేనిప్పుడెవరి నాశ్రయించి డబ్బు తీసుకు రావాలి? నేనిక్కడ ఉన్నప్పటి నుండి ఇతరుల ఔదార్యం మీదే ఆధార పడుతున్నాను. నీవు పాతాళం నుండి ఉద్ధరించినందున భూమి అంతా నీదే, కాబట్టి, కొంత భూమిని నాకీయమన్నాడు.** ఎంత చిన్న స్థలం కానీ నీ విచ్చిన స్థలంలోనే నియమంగా ఉంటాను. నేను మానవునిలాగా నటిస్తూ ప్రజలను ఆకర్షిస్తాను. వారు నీకు ప్రతిదినం పంచామృత స్నానం (నీరు, పాలు, పెరుగు, నేయి, తేనె కలిపిన మిశ్రమం) చేసేట్టు, వరాహతీర్థంలో స్నానమాచరించేట్టు, నిన్ను పూజించి కానుకలు సమర్పించేట్టు, నాకంటే ముందు నీకు అన్న నివేదనం చేసేట్టు చేస్తాను అన్నాడు.

**వరాహస్వామి అంగీకరించి ఆయనకు ఒక వంద అడుగుల స్థలాన్ని ఇచ్చి, వేంకటాద్రిపై విష్ణువునకు స్థానం కల్పించాడు.** తనకు అన్న ప్రాసాదాలను ఇచ్చే వకుళాదేవిని విష్ణు పోషణకై నియోగించాడు. అప్పటి నుండి వకుళాదేవి, విష్ణువునకు శ్యామాక ధాన్యం అన్నాన్ని తేనెతో కలిపి నివేదించేది. అట్లాగే తలపైనున్న గాయానికి ఔషధాన్ని కూర్చి మాన్పింది. ఆయన అవసరాలను, ప్రేమానురాగాలతో ఆయన బాగోగులను చూచేది. వకుళమాలిక ఎవరో కాదు, యశోదాదేవియే. పూర్వ జన్మలో భగవంతుని లీలలను చూచి ఆనందించి తృప్తి నందక, మరొక మారు ఆ ఆనందాన్ని అనుభవించాలని వకుళమాలికగా జన్మించి వేంకటాచలంపై వేంకటేశ్వరుడుగా అవతరించిన విష్ణువును సేవించి సంతృప్తిని పొందింది.

శ్రీవరాహస్వామి భూదేవికి వేంకటాచల వైభవాన్ని, స్వామిపుష్కరిణి తదితర తీర్థాల మహత్మ్యాన్ని శ్రీవరాహమంత్ర జప విధానాన్ని వివరించి శ్రీవేంకటేశ్వరస్వామి నారాయణపురానికి చెందిన ఆకాశరాజు పుత్రికయైన పద్మావతిని వివాహమాడిన కథను చెప్పడానికి ముందుగా భూత భవిష్య ద్వర్తమానాల్లో సంభవించే అంశాలను విశదీకరిస్తున్న విషయాన్ని ప్రస్తావించి ఆది కృతయుగంలో వైవస్వత మనువు కాలంలో సంభవించిన ఉదంతాలే మళ్ళీ ఆ యుగంలో సంభవిస్తాయని, అట్లే వచ్చే యుగాల్లోనూ సంభవిస్తాయని, **"ధాతా యధా పూర్వమకల్పయత్"** అనువాక్య ప్రకారం భారత భూభాగంలో కాలక్రమాన సహజమనీ చెప్పినారు. **(వరాహపురాణం, ద్వి.భా. అధ్యా.3, శ్లో.1)**

భూదేవికి ఇంకా ఇలా చెప్పాడు.

ఒక కృత యుగంలో వైవస్వత మనువు కాలంలో వాయుదేవుడు, లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో దక్షిణ భాగాన ధరించిన శ్రీనివాసుణ్ణి గూర్చి తీవ్రమైన తపస్సును చేయగా సంతోషించి తాను తన దేవేరులైన

శ్రీదేవీ భూదేవీ సహితుడై వేంకటాద్రిపై స్వామి పుష్కరిణికి దక్షిణ దిశలోనున్న ఆనందనిలయ విమానంలో నివాసమై ఉంటానని వరాన్ని అనుగ్రహించాడు. ఆ కాలం నుండి వాయుదేవునకు వరాన్నిచ్చినకారణంగా దేవసేనాపతియైన కుమారస్వామి అదృశ్యంగా విమానంలో ఉండి అర్చింపగా, శ్రీవేంకటేశ్వర స్వామి యుగాంతం వరకు నివసిస్తాడు. అగస్త్యమహాముని వేంకటాచలంపై పన్నెండేళ్ళు తీవ్రమైన తపస్సు చేసి, కల్పాంతం వేంకటాద్రిపై నివసించి అనుగ్రహంతో దర్శనమీయవలసిందిగా కోరగా అంగీకరించినందున, శ్రీదేవీ భూదేవీ సహితుడై చతుర్భుజుడై కుమారస్వామిచే, వాయుదేవునిచే అర్చితుడై శ్రీవేంకటేశ్వర స్వామి మానవులకు దర్శనమిస్తూ ఉంటాడు. **(వరాహపురాణం ద్వి.భా.అధ్యా.3, శ్లో.2-11).**

* * *

# అధ్యాయం-7

## బ్రహ్మాది దేవతలు, ఋషులు వేంకటాద్రిపై శ్రీమహావిష్ణువును దర్శించుట దశరథుడు అచ్చటికి వెళ్ళుట - బ్రహ్మోత్సవాలు ప్రారంభం కావడం

వేంకటాద్రిపై నిజ స్వరూపం ధరించిన శ్రీవేంకటేశ్వరస్వామి బ్రహ్మకు దర్శనాన్ని అనుగ్రహించినాడని, సూత పౌరాణికునకు వేదవ్యాస మహర్షి తెల్పగా, సూతుడు నైమిశారణ్యంలో మునులకు కథనిట్లా చెప్పినాడు.

హిరణ్యకశిపుని సంతానమైన దుష్ట దైత్యులు ఒకప్పుడు ఇంద్రాది దేవతలను, యోగులను, మునులను హింసించడం ప్రారంభించినారు. ఆ బాధలను భరింప లేక తమ బాధలను విష్ణువునకు విన్నవించడానికి క్షీరాబ్ధికి (పాల సముద్రానికి) వెళ్ళి, ఉత్తర తీరంలో నిలబడి ఇట్లా ప్రార్థించినారు; "క్షీరాబ్ధిశయనా! ప్రళయధారణ భూతుడవై ప్రకృతియందున్న సమస్త జీవకోటిని నీయందే ధరిస్తావు. నీవు ఒక్కడవే చేతనా చేతన ప్రపంచాన్ని సృష్టించి, నీవే సమస్త విశ్వంగా భాసిస్తావు. విశ్వాన్ని పాలించే బాధ్యత కలిగిన నీవు, యోగ సమాధిలో, శ్రీమహాలక్ష్మీతో, ఆదిశేషుడు పర్యంకంగా విశ్రమిస్తావు. నీవు మా బాధలను గూర్చి పట్టించుకోవు. మాకేం ప్రయోజనం? ఓ దేవా! సమస్త దేవాధిపతీ! దయాసముద్రా! మాపై కృపను వర్షించు," అని.

వారి ప్రార్థనను విని విష్ణువు కార్యనిర్వాహకుడైన విష్వక్సేనుడు, మాయావియైన విష్ణువు భూలోకంలో వేంకటాద్రిపై ఉన్నాడని తెలిపి, వారిని అక్కడికి వెళ్ళమన్నాడు. వారు ఆయన మాటలను నమ్మలేదు. క్షీరాబ్ధిని వదిలి భూమి పై విష్ణువు నివాసం ఉండటానికి కారణం వారికి తోచక, వారు వైకుంఠానికి వెళ్ళాలనుకున్నారు. దారిలో వారికి వీణావాదనం చేస్తూ వైకుంఠంనుండి వస్తున్న త్రిలోకవేదియైన నారదుణ్ణి చూచి విష్ణువు ఎక్కడ ఉన్నాడని ఆయనను అడిగారు. **విష్ణువును ఆరాధించడానికి తాను వైకుంఠానికి వెళ్ళగా, ఆయన అక్కడ లేడని, భూలోకంలో ఒక కొండపై ఉన్నాడని తెలిసిందని చెప్పాడు. అప్పుడు వారంతా, నారదునితో కలిసి బ్రహ్మలోకానికి వెళ్ళి బ్రహ్మదేవుని అడిగి విష్ణువు నివాసస్థలాన్ని తెలుసుకోవా లనుకున్నారు.**

అష్టదిక్పాలకులు, పరిజనం చుట్టూ ఉండగా గాయత్రీ సావిత్రీ సరస్వతీదేవీ సహితుడై, చతుర్ముఖాలు, చతుర్భుజాలు కలిగిన బ్రహ్మను వారు బ్రహ్మలోకంలో కలిసారు. కుశలప్రశ్నల అనంతరం దేవతలు, మునులు బ్రహ్మతో ఇలా అన్నారు. "స్వామీ! మీ దయ వలన మేము క్షేమంగా ఉన్నాము. కాని, రావణుని వలన కలిగే బాధ తీవ్రంగా ఉన్నది. వాని అనుయాయులైన రాక్షసులు వేంకటాద్రి పొలిమేరల్లోతపోనిరతులైన భక్తజనులను హింసిస్తున్నారు. శపిస్తే తమ ప్రభావం క్షీణిస్తుందనే భయంతో తపస్వులు ఆ రాక్షసులను శపించక, ఇంతకాలం వారి బాధలను భరించారు. ఇకపై వారాబాధలను భరింపలేరని మేము భావిస్తున్నాము. విష్ణువొక్కడే తన మాయాజాలంతో ఈ దుర్మార్గులను నాశనం చేయగలడు. మూడు లోకాలలో మేము విష్ణువును వెతికినాం, కాని, మాకు కనపడలేదు. నీవు సృష్టికర్తవు, మాకు రక్షకుడవు, మాకు విష్ణువును చూపించి, మమ్ములను ఈ బాధనుండి కాపాడవలెను" అని.

బ్రహ్మ ఒక క్షణకాలం ఆలోచించి, ఇలా అన్నాడు. "దేవతలారా! రావణుడు తీవ్రమైన తపస్సును చేసి అసాధారణమైన వరాలను పొందాడు. మానవుణ్ణి అల్పుడని భావించి, వాని నుండి మరణం రాకూడదని వరాన్ని కోరలేదు. అందుచేత మానవుని వల్లనే వాని మరణం సంభవించాలి. దానికి తగిన మార్గాన్ని శ్రీమహావిష్ణువొక్కడే సూచింపదగినవాడు అయిన ఇప్పుడు తనకు ప్రియమైన వేంకటాచలంపై నివాసమున్నాడు. నేను మీతో వస్తాను. మనమందరం కలిసి ఆయన నివాస స్థానాన్ని వెతుకుదాం. ఇక్ష్వాకు ప్రభువైన దశరథుడు వేంకటాద్రిపై స్వామిపుష్కరిణీ తీరంలో పుత్ర సంతాన వరాన్ని కోరుతూ తపస్సు చేయడానికి వెళ్ళుతాడు. భగవంతుడు ప్రీతుడై ఆయనకు వరాన్ని ప్రసాదిస్తాడు", అని. దేవతలు తదితరుల బ్రహ్మలోకం నుండి భూలోకానికి వేంకటాద్రిని వెతుకుతూ బయలుదేరారు. వేంకటాద్రిని చూచారు. అది నిబిడమైన అరణ్యాలతో నిండి ఉన్నది. కందరాలు, గుహలు ఉన్నాయి. అక్కడ సిద్ధులు గంధర్వులు మొదలగు వాళ్ళు ఉన్నారు. గంధర్వ కాంతలు, అప్సరసలు మధురమైన జంత్రగాత్రసంగీతాన్ని ఆలపిస్తున్నారు. అక్కడ దేవతలకు కన్పించిన సుందరపక్షికాని, పశువుకాని, కలసికొన్న గంధర్వుడు కాని ఆ రూపాన్ని ధరించిన విష్ణువేంకటేశ్వరుడేమో అని అనుకున్నారు.

ఆ కాలంలో అయోధ్య నగర రాజధానిగా దశరథ మహారాజు భూమిని అరువది వేల సంవత్సరాలుగా పాలిస్తూ ఉన్నాడు. పుత్ర సంతానం లేనందున బాధపడుతూ ఉన్నాడు. దివ్యజ్ఞానియైన వసిష్ఠుడు ఆయనకు కుల పురోహితుడు. తనకు సంతానం లేని కారణాన్ని పుత్రసంతానాన్ని పొందే ఉపాయాన్ని తెల్పమని వసిష్ఠుణ్ణి కోరాడు. వసిష్ఠుడు ఒక క్షణం ఆలోచించి దశరథునితో అన్నాడు, "నీవు పవిత్రాత్ముడవు. నీవీ జన్మలో ఏ పాపాన్నీ చేయలేదు. పూర్వజన్మలో చేసిన పాపం మూలాన నీకు సంతానం కలుగలేదు. ఆ పాపం పరిహారం కావడానికి వేంకటాచలంపై వేంచేసి ఉన్న శ్రీవేంకటేశ్వర స్వామిని పూజించాలి. వేంకటాచలం గంగానదికి దక్షిణంగా రెండు వందల యోజనాల దూరంలో ఉన్నది. అది పవిత్ర పర్వతం. అది వైకుంఠం నుండి భూమికి తీసుకురాబడిన క్రీడాచలం. అది విష్ణు–వేంకటేశ్వరస్వామికి వైకుంఠం కంటె ప్రీతిపాత్రమైంది. దానిపై తన దేవేరులతో శ్రీవేంకటేశ్వర స్వామి నివాసమున్నాడు. ఆయన దర్శనాన్ని కోరి దేవగణం, యోగులు, బ్రాహ్మణులు అక్కడ తపస్సు చేస్తారు. యజ్ఞయాగాదులను, ధార్మికక్రతువులను ఆచరిస్తారు. లోకక్షేమాన్ని కోరి బ్రహ్మదేవుడు, శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధిలో తపస్సుచేస్తాడు. శ్రీవేంకటేశ్వరస్వామి ఆయనకు దర్శనాన్ని అనుగ్రహిస్తాడు. ఆ స్వామి భక్తుల యెడ దయామయుడు. నీవు ఆ స్వామిని పూజిస్తే నీ కోరికలను తీరుస్తాడు", అని వసిష్ఠమహర్షి ఆదేశంతో హర్షించి, దారిలో గంగ, గోదావరి, కృష్ణవేణి, భద్ర, తుంగ, పంప, భవనాశిని నదులలో స్నానంచేసి, వాటిని దాటి వసిష్ఠ సహితుడై దశరథుడు వేంకటాద్రికి చేరాడు. వనాలతో నిబిడమైన పర్వత శిఖరాలను, పరిసరాలనూ, ప్రవహిస్తున్న సెలయేర్లను, జలాశయాలను, చెరువులను, సరస్సులను చూచి, స్నానం చేసి, పవిత్రుడై తన కోరిక సఫలమౌతుందని తనకు పుత్ర సంతానం కలుగతుందనీ ఆనందంగా భావించాడు.

ముందుకు సాగిపోతూ దశరథుడు, వసిష్ఠుడు స్వామిపుష్కరిణిని సమీపించినారు. వివిధ యాగాలను చేస్తూ ఉన్న మునులు వారికి కన్పించారు. వారిలో కొందరు యజ్ఞాలను చేస్తున్నారు, **కొందరు మనస్సులో విష్ణువును ధ్యానం చేస్తున్నారు. మరికొందరు ప్రణవ సహితంగా తారక బ్రహ్మమంత్రం, గోపాల బీజమంత్రం, వరాహమంత్రం, వాసుదేవ ద్వాదశాక్షర మంత్రం, నారాయణ అష్టాక్షరీ మంత్రం వంటి మంత్రాలను** జపమాలతో జపిస్తున్నారు. వారి మధ్యలో వ్యాఘ్రచర్మం పై సుఖాసీనుడై, కంఠ దేశంలో స్ఫటికమాలను ధరించి శ్రీమన్నారాయణ జపధ్యానంలో నిమగ్నుడై ఉన్న చతుర్ముఖ చతుర్భుజ బ్రహ్మను చూచాడు. స్వామిపుష్కరిణిపై తనకు కన్పించిన అద్భుత దృశ్యానికి దశరథుడు ఆశ్చర్యచకితుడైనాడు.

బ్రహ్మ, మునులు చేస్తున్న తీవ్ర జపతపాలకు ప్రసన్నుడై విష్ణువు సాక్షాత్కరించ బోతున్నాడని వసిష్ఠుడు దశరథునికి చెప్పాడు. స్వామి పుష్కరిణిలో స్నానం చేయమన్నాడు. శ్రీవేంకటేశ్వర అష్టాక్షర మంత్రాన్ని, యంత్రాన్ని దశరథునికి ఉపదేశించి, శ్రీవేంకటేశ్వర ధ్యానం చేస్తూ మంత్ర జపం చేయవలెనని ఆదేశించి, వసిష్ఠుడు కూడా దర్భాసనంపై ఆసీనుడై జపం చేశాడు.

అకస్మాత్తుగా భయంకరమైన మేఘ గర్జన ధ్వని విన్పించింది. అందరూ ఆకాశం వైపు చూశారు. అత్యంత కాంతివంతమైన మెరుపును చూచి, ఆకాంతిని తట్టుకోలేక అప్రయత్నంగా కన్నులు మూసుకున్నారు. కాని, జపాన్ని మానలేదు. ఆ దివ్యకాంతి మధ్యంలో ఒక దివ్య విమానం కన్పించింది. అది గోపుర ప్రాకారాలతో, గోపురాలపై కలశాలతో శోభిస్తూ ఉన్నది. ఆ విమానానికి ముందుభాగంలో ఒక రత్న ఖచితమైన క్రీడా మంటపం ఉన్నది. దాని మధ్యలో ఆస్థాన మంటపం ఉన్నది. ఆస్థాన మంటపంలోని స్తంభాలన్నీ విలువైన మణులతో పొదుగబడి ఉన్నాయి. దానికి నాలుగువైపుల నాలుగు ద్వారాలున్నాయి. ఆ ద్వారాలను ద్వారపాలకులు రక్షిస్తూ ఉన్నారు. దానిలో వేయి స్తంభాలతో విరాజిల్లే నాలుగు వైపులా నాలుగు ద్వారాలున్నాయి. ఆ ద్వారాలను ద్వారపాలకులు రక్షిస్తూ ఉన్నారు. దానిలో వేయి స్తంభాలతో విరాజిల్లుతూ ఉన్న మణిమంటపం ఉన్నది. ఒక రథం, అశ్వాలు, గజాలు, తదితర జంతువులు, మధురగానం చేసే పక్షులు, భేరీ సముదాయం కూడా ఉన్నాయి. సుందర కాంతలు చామరాలను వీస్తూ, హారతుల నెత్తుతూ, ఛత్ర ధ్వజాలను ధరించి నృత్యం చేస్తూ ఉన్నారు.

ఆ దృశ్యాన్ని చూచి బ్రహ్మాది దేవతలు, సనకాది యోగులూ, అగస్త్యుడు మొదలైన మునులు ఆశ్చర్యచకితులైనారు. వారికేమి చేయాలో తెలియలేదు. ఆ విమానం, వైకుంఠంలోని శ్రీవిష్ణువు విమానమని దాన్ని సావధానంగా చూడటానికి తనవెంట రావాలని బ్రహ్మదేవుడు వారిని ఆదేశించాడు. దశరథుడు కూడా వారితో వెళ్ళాడు. మొదటిద్వారం వద్ద వారికి చండప్రచండు లనే ద్వారపాలకులు శంఖచక్రాలను ధరించి కన్పడ్డారు. వారికి నమస్కరించి రెండవద్వారం నుండి ఏడవ ద్వారం దాకా దాటి విమానం మధ్య స్థలానికి చేరారు. అక్కడ మేఘశ్యాముడై సూర్యతేజస్సుతో ప్రకాశిస్తున్న శ్రీవిష్ణువు వారికి కన్పించాడు. ఆదేవుని కుడి ప్రక్కన కమలాసనంపై లక్ష్మీదేవి నిల్చి ఉన్నది. ఎడమ ప్రక్కన భూదేవి ఉన్నది. ఇద్దరూ

కిరీటాలను ధరించి ఉన్నారు. వారు విష్ణువును చూస్తూ అందంగా కన్పిస్తున్నారు. విష్ణువు తన శిరస్సుపై ఒక కాంతిమంత మైన కిరీటాన్ని, మకరకుండలాలను, యజ్ఞోపవీతాన్ని కంఠహారాన్ని, మొలనూలు వద్ద చురికాయుధాన్ని పాదాలపై మంజీర నూపురాలను వివిధ రత్నాలను, వివిధాభరణాలను, సహస్రకిరణ దీప్తమైన సుదర్శన చక్రాన్ని కుడిచేతిలో, పాంచజన్య శంఖాన్ని ఎడమచేతిలో ధరించి, మరొక హస్తం ఆయన పాదాలను చూపింపగా, వరదముద్రను ధరించి, మరొక వామహస్తం కటితటంపై అభయముద్రను చూచింపగా వారికి సాక్షాత్కరించినాడు.

(ఈ వర్ణనం యావత్తు దివ్య విమానంలో ఉన్న, శ్రీవేంకటేశ్వరస్వామికి యధాతథంగా చెందుతుంది. ఆయన సాక్షాత్తు శ్రీమహావిష్ణువే విష్ణు వేంకటేశ్వరుడే. ఒక్కొక్కసారి శ్రీవేంకటేశ్వరస్వామి మహాప్రభువుగా, (ప్రధానంగా పూలంగి సేవా సమయంలో) ఒక్కొక్కసారి వికట భ్రూకుటితో, దుర్నిరీక్ష్యంగా కన్పిస్తాడు).

**ఆయన చిరునవ్వుతో దయామయుడుగా, రమణీయంగా వారికి కన్పించాడు. ఆయనను చూస్తూ ఉంటే వారి కన్నులకు విందుగా, ఆయన దయాసముద్రుడుగా క్షమాగుణనిధిగా, పరమోదారుడుగా, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడుగా, ఆద్యంత రహితుడుగా, అవ్యయుడుగా పురుషోత్తముడుగా వారు తెలుసుకున్నారు. మహర్షులు, యోగులు ఈ సుందర దృశ్యాన్ని కోరి తీవ్రమైన తపస్సును చేస్తారు.** అట్లాంటి ఆనందమయ మైన దర్శనం లభించగానే వారి ఆనందానికి అవధులు లేవు. ఆనంద బాష్పాలతో మైమరిచి నృత్యం చేశారు. కొంతసేపటికి వారికి స్మృతి కలిగింది. శ్రీవిష్ణువేంకటేశ్వరస్వామిని తదేక దృష్టితో దర్శించినారు.

అగస్త్యుడు మొదలైన మహర్షులందరు ఇట్లా కీర్తించినారు, “ఓ యజ్ఞరూపా! యజ్ఞభోక్తా! యజ్ఞకర్తా! యజ్ఞాలను మెచ్చి, రక్షించి, ఫలాన్ని ప్రసాదించుదేవా! నీకు వినయంగా నమస్కరిస్తున్నాము. నీవు విశ్వామిత్ర యాగాన్ని రాక్షసుల నుండి రాముని ద్వారా రక్షించినావు. నీకు మా ప్రణతులు. యజ్ఞశ్రాద్ధ దాన కర్మలను ధార్మిక క్రతువులను కాపాడే వాడవు. నిన్ను ధ్యానించి నీకై చేసిన కర్మలకు ఫలాన్ని అనుగ్రహించటమే కాదు, ఇతర దేవతలను గూర్చి చేసిన కర్మలకూ ఫలాన్ని అనుగ్రహిస్తావు. నీవు సర్వ దేవతల యందు నెలకొని ఉన్నావు. ఆదిలో, మధ్యలో అంతంలో నిన్ను స్మరించకుండా చేసిన ధార్మిక కార్యక్రమమేదైనా నిష్ఫలమౌతుంది. నీనామ జపధ్యానం చేసిన ప్రతి క్రతువూ సంపూర్ణమౌతుంది, సఫలమౌతుంది. ప్రాపంచికమైన ఫలాన్ని ఆశించే యజ్ఞయాగాదులచే కూడా నీవు తృప్తిని పొంది, భక్తజనులకు ధర్మార్థ కామమోక్షాలను అనుగ్రహిస్తావు. వేదాలు, నిర్దేశించిన యజ్ఞయాగాది క్రతువులన్నీ నీకు సమర్పణ బుద్ధితో చేయ వలసినవే. వానినన్నిటిని నీ సేవ కోసమే మేము చేస్తాము. వైదిక క్రతువులను మేము నిర్దోషంగా చేయలేము, మా నిర్వహణలో కలిగిన దోషాలను లోపాలను మీరు దయతో మన్నించమని ప్రార్థిస్తున్నాము”. అని.

(యజ్ఞాలను చేసే మహర్షులు దీక్షతో వాటిని నిర్వహిస్తారు. నిర్దోషంగా నిర్వహించడానికి సర్వదా యత్నిస్తారు ఈ స్తోత్రం సామాన్య జనులకు మార్గదర్శకంగా ఉంటుంది.)

ఇంద్రుడు మొదలైన దేవతలు శ్రీమహావిష్ణువును ఇట్లా ప్రార్థించినారు. "ఓ వేంకటాచల ప్రభూ! శేషాద్రివాసా! సింహాచల నివాసా! శ్రీమన్నారాయణా! వాసుదేవా! నీకు సాష్టాంగ నమస్కృతులు. నీవు దయతో భూమిని పాతాళం నుండి ఉద్ధరించి, దానినిక్కడ స్థిరం చేసి, ఈ పర్వతం పై మానవులను కాపాడే కోరికతో నివాసాన్ని ఏర్పరచుకున్నావు. క్షీర సాగరాన్ని,మధించడానికి తోడ్పడి, దాని నుండి అమృతాన్ని సంపాదించి దేవతలకు ప్రసాదించి వారిని రక్షించినావు నీవు నిష్కాముడవు. నీకై నీవు దేన్నీ కోరవు. నీవు చేసే ప్రతి పనీ నీ భక్తజనులను ఉద్ధరించడానికే. వేయి తలలతో, వేయి కన్నులతో, వేయి హస్తాలతో విశ్వరూపంగా, ఒక్కొకసారి కన్పడి, మరొక మారు రెండు చేతులతో, చతుర్భుజాలతో సాక్షాత్కరించి, ఆకాశంవలె నిరాకారుడవై జ్ఞానైక వేద్యుడవై ఒక్కొకమారు కనపడే నీ రూపాన్ని నీ స్వభావాన్ని ఎవరు గ్రహింపగలరు? నిన్ను నిర్గుణ రూపంగా సుగుణ రూపంగా జ్ఞాన మాత్రకుడవనీ, సత్‌గా చిత్‌గా మునులు భావిస్తారు. వేదాంతులు నీ దివ్యమంగళ రూపాన్ని, నీ సౌందర్యాన్ని ధ్యానించి అర్చిస్తారు."

సనకాది మునులు స్వామిని ఇట్లా అభ్యర్థించారు. "ఓ విష్ణుదేవా! వైకుంఠనాథా! నీవే ఈ జగత్తు కంతటికీ మూలకారణం. నీవు విశ్వాకృతివై ఉన్నా, నీవు నిరంజనుడవు, నీకు సాష్టాంగ ప్రణతులు. ఆధారచక్రం మొదలుగా షట్చక్రాల నుండి సుషుమ్నానాడి ద్వారా జ్ఞానరూపంగా లయ వాచ్యమై మనస్సు ద్వారా గ్రహింపబడే రూపరహితమైన స్వయంప్రకాశ రూపాన్ని, మా హృదయకమలాలలో సమాధ్యవస్థలో మేము నిన్ను ధ్యానిస్తాము. నీల కమలాకృతివై, వేదాతీతుడవై విరాజిల్లే నీకు నమస్కరించు చున్నాము", అని. వారు స్తోత్రం చేసిన తరువాత దశరథుడు అనంద భరిత హృదయంతో స్వామిని ఇట్లా ప్రార్థించినాడు, "బ్రహ్మేంద్రాది దేవతలందరూ లక్ష్మీదేవి దయాకటాక్షానికై వేచి ఉంటారు. అట్టి లక్ష్మీదేవి నీకృపాదృష్టి కోసం వేచి ఉంటుంది. అసురుల త్రిపురాలను దగ్ధం చేసిన త్రిపురారియైన శివునికి నీ ఆయుధమే తోడ్పడింది. నీచే నియుక్తులైన బ్రహ్మాది దేవతలందరూ జాగరూకతతో నీ ఆజ్ఞను పాలిస్తారు. నీకంటె అధికుడు లేడు, జీవకోటి కంతటికీ చింతా దుఃఖాలులేని, నిరతిశయానందదాయకమైన నీ వైకుంఠమే కోరదగినది. నీ స్వభావాన్ని నేనెట్లా కీర్తింపగలను?" అని.

పిమ్మట వేద పరిమళంతో ఒప్పారే నాలుగు ముఖాలతో బ్రహ్మ స్వామిని ఇట్లా కీర్తించినాడు, "సృష్టికి ముందే సత్పదార్థం ఉన్నదని వేదాలు తెలుపుతాయి. ఆ సత్పదార్థం నారాయణుడవైన నీవే. ఆ సత్పదార్థమే నీటిని సృష్టించి, ఆ జలంలో ప్రధాన శక్తిని ప్రవేశపెట్టింది. అది అండ రూపాన్ని దాల్చగా దానినుండి నేను జన్మించినాను. నీవాత్సల్య పూర్ణమైన మార్గ దర్శనంలో నేనీలోకాలన్నింటినీ సృష్టించినాను. నీవే సృష్టికి ప్రధానకారణం. నాకంటె ముందు నావంటి బ్రహ్మలనెందరిని సృష్టించినావో నేనెరుగను. చేతనాచేతనాలను ధరించిన నీవు సృష్టికి మూలకారణమై నీవే ఈ సమస్త విశాల ప్రపంచంగా సాక్షాత్కరిస్తావు.

**ఒకే చెట్టు పై నున్న రెండు అందమైన పక్షులలో ఒకటి ఫలాన్ని భుజింపగా వేరొకటి దానిని చూస్తూ తృప్తినందినట్లుగా, మానవ శరీరాన్ని పొందిన జీవాత్మ కర్మానుసారంగా పుణ్య పాప రూపమైన ఫలాన్ని అనుభవిస్తూ ఉండగా, జీవాత్మ యందుండి శరీరస్థుడవైన నీవు కర్మ సాక్షివై కర్మఫలంతో వికృతి చెందక నిత్యానంద మగ్నుడవై ఉంటావు. జీవాత్మలో నీవు నెలకొని ఉన్నందున, నీచే ప్రేరణనంది కర్మ ప్రవృత్తి విముఖుడై మోక్షాన్ని పొందుతాడు. ఓ లక్ష్మీనాథా! నీ రూపం, తత్వం, సర్వజ్ఞత్వం అనంతమైనట్టివి", అని.**

(పైన ఉదాహరింపబడిన రెండు పక్షులు – జీవాత్మ పరమాత్మల – ఉదంతం **శ్వేతాశ్వతరోపనిషత్తు**లోనూ ఉన్నది. అధ్యా.4, శ్లో.6, 'ముండకోపనిషత్తు'లో ముండకం 3, ప్రథమ ఖండం, శో.2. ఈ రెండు ఒకే విధంగా ఉన్నాయి)

**ద్వాసుపర్ణా సయుజా సఖాయా**
**సమానం వృక్షం పరిషస్వజాతే,**
**తయోరేకః పిప్పలం స్వాద్వత్త్వ**
**నశ్నన్నన్యో అభిచాకశీతి ॥**

**వరాహపురాణం**లో (అధ్యా.48, శ్లో. 38–40) ఇట్లా కాస్తా భిన్నంగా ఉన్నది.

**ఏకం వృక్షం సమాసాతే సుపర్ణావయుతౌ మారేః । (38)**
**తయోరన్యః కర్మ జన్యం ఫలమశ్నాతి సర్వదా ॥**
**అస్పృష్ట గంధస్త్రైవ దీప్యసే యథా రవిః (39)**
**నియంతా సర్వ జీవానాం ప్రేరకశ్చానుమోదకః ।**
**సత్యం జ్ఞానమనంతం చ త్వద్రూపం వైశ్రియః పతే (40)**

**(ఇది మాండూక్యోపనిత్తులో కూడా ఉదాహరింపబడినది).**

దేవ గంధర్వుల ఆనందం మానవుల ఆనందం కంటె వందరెట్లు ఎక్కువ అంటూ వేదాలు వర్ణిస్తాయి. ఆ వేదాలు నీ ఆనందాన్ని గూర్చి చెప్పలేక పోయినాయి. శాశ్వతమైన వేదాలే చెప్పలేవంటే, నీ నాభి కమలం నుండి ఉద్భవించిన నేను వర్ణింప సమర్థుడనౌతానా? ఓ ప్రభూ! నీవు కల్యాణ గుణ సముద్రుడవు. మీ సుందర వదనార విందాన్నిచూస్తూ ద్రిగ్భమ చెందిన మేము మీ సన్నిధిలో చేసిన స్తోత్ర పాఠాల్లో ఉన్న దోషాల్ని క్షమింపమని ప్రార్థిస్తున్నాము. నీవు ఉదారవరప్రదాతవు. శాశ్వతానందదాతవు. నీ కృపాకటాక్షాన్ని నాపై ప్రసరింపచేయవలసిందిగా ప్రార్థిస్తున్నాము."

మునులు దేవతలు చేసిన స్తుతికి ప్రసన్నుడై వేంకటాచలనాథుడు వారిని చూస్తూ దయతో ఇలా అన్నాడు, "బ్రహ్మా! మీ స్తుతి నాకు ప్రీతి కలిగించింది. మీరందరూ నావద్దకు రావడానికి కారణమేమి?" అని.

బ్రహ్మ ఇలా సమాధానమిచ్చాడు, "విశ్రవసు పుత్రుడైన రావణుడు ఘోర తపస్సు కావించి తనకు దేవదానవ రాక్షసుల వలన ప్రాణ భయం లేకుండా వరం పొందాడు. మనుష్యుల వలన మరణం రాకూడదని కోరలేదు. వరం పొందడం వలన కలిగిన అహంకారంతో లోకాలన్నింటిలో ఉన్న జనులను, ప్రత్యేకంగా మునులను అవమానించి బాధిస్తున్నాడు. కొందరు దైత్యులు రావణ సహాయంతో ఉప్పొంగి మారణాయుధాలతో జనులందరినీ హింసిస్తున్నారు. వైకుంఠంలో, క్షీరసాగరంలో తదితర స్థలాల్లో వెతికి నిన్ను కానక ఇక్కడికి వచ్చాము. శత్రుంజయా! ప్రపంచాన్ని రక్షించవలసిన బాధ్యతను విడిచి, నీవు రమా వినోదివై ఈ ప్రసన్న వేంకటాచలంపై ఆనందంగా విహరిస్తున్నావు. నిన్నిక్కడ చూడగలిగినాము. దయతో మమ్మల్ని రక్షించు, నీకంటె మమ్మల్ని రక్షించే వారెవరు?" అని.

బాధాతప్తులైన వారితో స్వామి ఇట్లా అన్నాడు, "నేను మీ రక్షకుణ్ణి, మీకు రావణుని వలన ఇక భయంలేదు. మిమ్మల్ని రక్షిస్తానని వాగ్దానం చేస్తున్నాను. ఆ చిరకాలంలోనే ప్రపంచాన్ని బాధిస్తున్న రావణుని వాని జాతిని నాశనం చేస్తాను." అని.

పిమ్మట అగస్త్యునికి అభివాదం చేసి ఆ మహాముని అక్కడికి వచ్చిన కారణాన్ని అడిగాడు. అగస్త్యుడు ఇట్లా సమాధానం చెప్పినాడు, "ఓ దేవతాప్రభూ! నీముఖార విందాన్ని దర్శింపక నిన్ను సేవింపక నేను ఒక క్షణం కూడా ఉండలేను. అందుకే నిన్ను దర్శించడానికి వచ్చాను. నీకు మరొక విషయాన్ని విన్నవించాలి, "నీ నివాస స్థానమైన ఈ వేంకటాచలానికి సమీపంలో, క్షేమంగా జీవించడానికి వరాలను పొంది, సకల జనులను బాధిస్తున్నారు. మీ నివాస స్థాన సమీపంలో ఇట్లాంటి దుష్కృత్యాలు సంభవించడం అన్యాయం. ఈ ప్రాంతంలో నివసించే ప్రజలందరూ నీవారు. నీవు వారి యోగక్షేమాలను పర్యవేక్షించాలి. వారికి రోగ భయంలేకుండ, సంపూర్ణ ఆరోగ్యంతో జీవించే విధంగా, శక్తిమంతులను కావించి సంపదను సంతానాన్ని అనుగ్రహించి ఈర్ష్యాద్వేషాలనుండి విముక్తులను చేయాలి. వారి యోగక్షేమాల విషయంగా నాకు వరాన్ని ప్రసాదించాలి." అని. స్వామి వెంటనే ఆ వరాన్ని అనుగ్రహించి, వారిని రక్షించే ప్రయత్నం చేస్తానని వారికే హానీ కలుగకుండా కాపాడుతానని వాగ్దానం చేశాడు.

తరువాత సనకాది యోగులను చూచి వారు వచ్చిన కారణాన్ని తెల్పమని అడిగాడు. వారిట్లా అన్నారు, "ఇది పరమ పవిత్ర ప్రాంతం. తపస్సిద్ధి కలిగే క్షేత్రం. ఇక్కడ దుర్మార్గులు చేరినారు. వారినుండి ఈ ప్రాంతాన్ని కాపాడాలి. నీవు వైకుంఠం నుండి, ఈ పర్వతంపై నివాసాన్ని ఏర్పరచుకొని అందరినీ రక్షిస్తున్నావు. నీవు ఎవ్వరికీ కనపడక దర్శనమీయక ఉంటే ఏం ప్రయోజనం? ఇక్కడే శాశ్వతంగా నివాసమై అందరికీ ఉదారంగా దర్శనాన్ని అనుగ్రహించాలి. ఈ గొప్ప వరాన్ని ఆశిస్తున్నాము." అని. విష్ణువు వెంటనే వారి ప్రార్థనను మన్నించాడు.

ఇంద్రుని రాకకు గల కారణాన్ని అడిగాడు. "అచ్యుతా! రావణుడు పెట్టే బాధల మూలాన మేము వివిధ ప్రాంతాల్లో తిరుగుతూ ఉన్నాము." అని ఇంద్రుడు చెప్పాడు. లక్ష్మీపతి ఆయనతో "దేవేంద్రా! నీవు

నిర్భయుడవై సంతోషంగా జీవించు. రావణుడు చంపబడినాడనే భావించు. నన్ను విశ్వసించు, త్వరలోనే వానిని సంహరిస్తాను" అన్నాడు.

కోసలదేశ ప్రభువైన దశరథుని రాకకు కారణాన్ని అడిగాడు, "రాజా నీవు చాలా కాలానికి కన్పించావు. నీవు రావటానికి కారణమేమి?" అనగానే దశరథుడు ఇలా అన్నాడు, "ఓ ప్రభూ! మీ దయతో నేనీ భూమిని స్వతంత్రంగా చాలాకాలం పాలించాను. ధనాన్ని ఆర్జించాను. బ్రాహ్మణులకు పంచిపెట్టినాను. శత్రువుల నందరినీ జయించాను. సుఖాన్ని అనుభవించాను. నాకొక కోరిక ఉన్నది. నాకు పుత్రసంతతి కావాలి. సంతానం లేనివారికి స్వర్గ సుఖం లేదని విద్వాంసులంటారు. బలపరాక్రమ సంపన్నుడై మతిమంతుడై కీర్తిని పొందు పుత్రుణ్ణి ప్రసాదించు." రాజు కోరిక నాలకించి వేంకటేశ్వర స్వామి అన్నాడు,. "రాజా! నీవు పూర్వజన్మలో సహింపరాని క్రూర కర్మలను చేశావు. ఇప్పుడేం చేయగలం" అని. దానికి దశరథుడు వినయంగా అన్నాడు, "ఓ గోవిందా! సూర్యకాంతి రాగానే చీకటి మాయమైనట్లే, నా పాపాలన్నీ నీదర్శనంతో తుడిచి పెట్టుకు పోయినాయి. భాగ్యవశాత్తు, నాకు నీ దర్శనమైంది. ఇక పాపమెట్లా ఉంటుంది?" అని. పాపవినాశకుడైన స్వామి, దశరథునితో అన్నాడు, "రాజా! నీవు నాలుగు శ్లోకాలలో చేసిన స్తోత్రానికి నేను చాలా సంతోషించినాను. నీ భక్తి స్పష్టమైంది. **నీవు పలికిన నాలుగు శ్లోకాలను సంతోషించి నీకు ఉత్తమ గుణసంపన్నులైన నలుగురు పుత్రులను ప్రసాదిస్తున్నాను. నీవు అయోధ్యకు తిరిగి వెళ్ళి పుత్రకామేష్టి యాగాన్ని చేయి",** అని. దశరథుడు ఆనంద తరంగితుడై, స్వామికి ప్రణతులను సమర్పించాడు. స్వామి అనుమతి గైకొని తన పురోహితుడైన వశిష్ఠునితో పరిజనులతో అయోధ్యకు తిరిగి వెళ్ళాడు.

అక్కడే ఉన్న బ్రహ్మదేవుని వైపు చూచి "నీవింకేమైనా కోరదలచనున్నావా? నీకేదైనా కోరిక ఉంటే, కోరుకో. నేను వెంటనే ప్రసాదిస్తాను" అని అన్నాడు. బ్రహ్మదేవుడు వినయంగా అన్నాడు. "స్వామీ! మీ అనుగ్రహాన్ని పొంది ధన్యుణ్ణైనాను. చిరకాలం మీరిక్కడే నివసించాలి. మీ దివ్యమంగళ విగ్రహంతో మానవులందరికీ సర్వకాల సర్వావస్థల్లో దర్శనమిచ్చివారి కోరికలను తీర్చండి. జనులందరూ కామ ప్రవృత్తి కలవారై, తమ పొట్ట నింపుకోవటానికే యత్నిస్తారు. వారు ధర్మాధర్మ వివేకం పొందటానికి అశక్తులు. వారు బలహీనులై, రోగ గ్రస్తులై, కామ ప్రవృత్తితో, తమ శ్రేయస్సునెరగక పశు ప్రవృత్తితో జీవిస్తారు. కలియుగంలో పాపప్రవృత్తితో దైహికమైన కోరికలను తృప్తి పరచుకునే ప్రాపంచికమైన మనస్సుకలవారై సంసారబద్ధులై పశుసమాన జీవనం కంటె అతీతంగా ఊహించక జీవిస్తూ మానవులు దుఃఖాన్ని అనుభవిస్తారు. వారిని వారి కర్మకు వదిలివేస్తే, శాశ్వతంగా పాపజీవనులైన వారి సంఖ్య వృద్ధి పొందుతుంది. మరికొన్ని క్రొత్త నరకాలను వారి కొరకు సృష్టింపవలసివస్తుంది. ఓ వేంకటాచలపతీ! నీవు దయామయుడవు. ఇట్లాంటి దుఃస్థితిని నీవు భరింపలేవు. నీవు ఇక్కడే స్థిర నివాసివై ఉండాలి" అని.

అప్పుడు విష్ణువు బ్రహ్మతో ఇట్లా అన్నాడు, "బ్రహ్మా! నీవు కోరిన కోరిక ఆలోచింపదగింది. నీకున్న భూతదయ మూలాన, వారిపై సముదార చిత్తంతో నీవీవిన్నపాన్ని చేసినావు. నేను సంతోషించినాను.

**కలియుగాంతం వరకు ఇక్కడే నిలబడి అందరికీ దర్శనమిస్తాను.** అనంతుడు, గరుడుడు, విష్వక్సేనుడు, శ్రీదేవి, భూదేవి, నీలాదేవి, పరిజనులందరూ ఇక్కడే నాతో ఉంటారు. తపస్వులు తపస్సిద్ధినీ, యోగులు, యోగసిద్ధినీ ఇక్కడ సులభంగా పొందుతారు. **పుష్కరిణులన్నింటికీ స్వామియైనందున స్వామి పుష్కరిణి పేరు స్థిరమౌతుంది.** గంగాది పవిత్ర నదులన్నీ స్వామిపుష్కరిణి నుండే ప్రభవించి, భూమిపై వివిధ ప్రాంతాల్లో ప్రవహించి పాపులను పవిత్రులను చేస్తాయి. వైకుంఠంలో ఉన్న ఐరమ్మద తటాకమే స్వామిపుష్కరిణిగా రూపొంది నందువలన దీనిలో స్నానం చేసేవారికి సర్వ పాప విమోచనం కలుగుతుంది. ఎవరెవరేయే కోరికలతో స్వామిపుష్కరిణిలో స్నానం చేస్తారో, వారికా కోరికలు సిద్ధిస్తాయి. శరీరంలోని లోపాలన్నింటినీ సరిచేస్తాను. నా భక్తుల సకల వ్యాధులను దోషాలను మాన్పుతాను. దృష్టికోల్పోయిన వారికి దోషాల నుండి విముక్తి కలిగించి పేదరికాన్ని పారద్రోలి, బాధను దూరం చేస్తాను. వారి కోరికలను తీరుస్తాను. ఈ దినం నుండి ప్రజలు దివారాత్రాలు ఇక్కడ నిర్భయంగా ఉండవచ్చును" అని.

సుదర్శన చక్రాన్ని పిలిచి కుముద సాహాయ్యంతో సాయుధంగా, సపరివారంగా అన్ని చోట్లకు వెళ్ళి ముని జనాన్ని, సజ్జనులను బాధించే వారి ఆస్తులను దోచుకొని, దేశాన్ని క్షోభపెట్టే దుష్టులైన దైత్యులను, యక్షులను, రాక్షసులను, నాగజాతి వారిని సంపూర్ణంగా నాశనం చేయవలసిందిగా ఆజ్ఞాపించినాడు. సుదర్శన చక్రం ఆజ్ఞను ఒక క్షణంలో నిర్వర్తించి స్వామికి నివేదించింది.

* * *

# అధ్యాయం-8
## బ్రహ్మదేవుడు శ్రీవిష్ణు వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాన్ని ఆరంభించడం
## (వరాహపురాణం, భాగం-1, అధ్యా. 50-53, 58)

సుదర్శనచక్రం దుష్టులనందరినీ సంహరించి వచ్చి, ఆ వృత్తాంతాన్ని స్వామికి నివేదించిన తరువాత విష్ణువుతో చేయవలసిన పని మరేదైనా ఉన్నదా అని బ్రహ్మదేవుణ్ణి ప్రశ్నించాడు. "మీరు ఆజ్ఞాపిస్తే మరొక కోరికను మీకు విన్నవిస్తాను" అన్నాడు బ్రహ్మదేవుడు. విష్ణువు ఆనతినీయగానే "శ్రీమహాలక్ష్మీయుతుడవైన నీకు మహోత్సవాన్ని నిర్వహించాలని ఉన్నది. అది ధ్వజారోహణంతో ప్రారంభమౌతుంది. మీరు దయతో ఆ ఉత్సవానికి ఆజ్ఞను ప్రసాదించాలి" అన్నాడు. స్వామి ఆజ్ఞను పొంది కన్యామాసంలో స్వామికి గొప్ప ఉత్సవాన్ని బ్రహ్మదేవుడు నిర్వహింపజేశాడు. **శ్రవణానక్షత్రం నాడు అవభృథ స్నానాన్ని నిర్ణయించాడు. కన్యామాసంలో శ్రవణా నక్షత్రం శ్రీవిష్ణువేంకటేశ్వర స్వామి వారి జన్మనక్షత్రం.** దశదిశలనుండి దేవతలు, మునులు, భక్తజనులు ఆ మహోత్సవంలో పాల్గొని తిలకించారు. యోగిజనులకు సమాధ్యవస్థలో కూడా గోచరంకాని స్వామి దయామయుడై, శ్రీనివాసుడుగా ఈ స్థలంలో నిలిచి బ్రహ్మదేవుని ద్వారా నియుక్తమైన మహోత్సవానికి సమ్మతించి సర్వజనులకు దర్శనమీయడానికి అంగీకరించినాడు.

ఈ ఉత్సవ దర్శనం పుణ్యప్రదమని, పాల్గొనడానికి వివిధ ప్రాంతాల నుండి వచ్చే యాత్రిక జనానికి దారి వెంట ఉన్న గ్రామీణులు, నగరవాసులు, వస్త్రాలను, ఛత్రాలను, రత్నాదులను, పాదరక్షలను, వాహనాలను సమర్పించినారు. యాత్రికు లందరూ వేంకటాద్రికి చేరుకున్నారు. అసంఖ్యాకంగా చేరిన యాత్రికుల సౌకర్యార్థం, జలాశయాలు, భోజన శాలలను విశ్రాంతిగృహాలను, తదితర భవనాలను, పర్వతం పై ఒక నగరాన్ని నిర్మింపవలసిందిగా దేవశిల్పియైన విశ్వకర్మను బ్రహ్మదేవుడు ఆదేశించినాడు. విశ్వకర్మ సమర్థంగా ఆ కార్యాన్ని నిర్వహించాడు. స్వామి దివ్య విమానం చుట్టూ ఒక శిఖరాన్ని కూడా నిర్మించాడు.

ఉత్సవ దినాల్లో వేంకటేశ్వరస్వామికి వివిధ రుచులు కలిగిన అన్న ప్రసాదాలను అర్పించి, అశ్వ, గజ, గరుడ, అనంత వాహనాలపై సంగీతయుక్తంగా, నాట్యంతో, వేదఘోషతో, బలిష్ఠమైన అశ్వాలు, గజాలు, వృషభాలు ముందు వెనుక ప్రక్కల్లో విరాజిల్లగా, సర్వజనులకూ, స్వామి దర్శనాన్ని అనుగ్రహించగా, బ్రహ్మోత్సవాలను బ్రహ్మదేవుడు నిర్వహించాడు. యాగశాలలో సముచితమైన వేద క్రతువులు సంపన్నమైనాయి. ఆ ఉత్సవాలలో శ్రీ వేంకటేశ్వరస్వామి శోభాయమానంగా కన్పించాడు.

ఆ ఉత్సవంలో ఎనిమిదవ దినాన శ్రీ వేంకటేశ్వరస్వామి శ్రీదేవి భూదేవి ఇరుప్రక్కల వేంచేసి ఉండగా, వివిధ రత్నాభరణాలను ధరించి, అద్భుతంగా అలంకృతమైన రథాన్ని అధిరోహించి దేవాలయానికి నాలుగు వైపుల ఉన్న వీథులలో ఊరేగి, ఆలయ ప్రవేశం చేసి వైభవోపేతమై స్వర్ణమయమై రత్న స్తంభ విరాజితమైన ఆస్థాన మండపంలో కొలువు తీరాడు.

బ్రహ్మదేవుని పిలిచి, ఆయన భక్తిని హర్షించి భక్తితో వైభవోపేతంగా మహోత్సవాన్ని నిబద్ధం చేయడం పట్ల తృప్తిని వ్యక్తం చేస్తూ ఇట్లా అన్నాడు, "నీవు నిబద్ధం చేసిన ఈ మహోత్సవాన్ని ప్రతి సంవత్సరం కన్యామాసంలో నిర్వహించేవారు ప్రాపంచికమైన సర్వసుఖాలు పొంది, పిమ్మట బ్రహ్మలోకాన్ని పొందుతారు. ఈ ఉత్సవాన్ని దర్శించడానికి వేంకటాద్రికి వచ్చి కానుకలు సమర్పించేవారు, నా పాద సన్నిధికి ప్రయాణం చేసినట్లే. వారికి ఇహలోక సౌఖ్యం సంపూర్ణంగా లభిస్తుంది. ఉత్సవాలన్నింటినీ భూపతులు సమకూరుస్తారు. ఉత్సవంలో పాల్గొనే భక్తులకు అన్నపానాదులను సమకూర్చే వారికి సంతాన ప్రాప్తి కలుగుతుంది. ఏడు తరాలవరకు వారు సంపన్నులై ఉంటారు. ఇహలోకంలో సుఖాలను అనుభవించి స్వర్గలోక సుఖాన్ని పొంది, నన్ను చేరుతారు. అంధులకు, మూగవారికి, వికలాంగులకు చెవిటివారికి వస్త్రాలని ధనాన్ని దానం చేసిన వారికి నా కృప లభిస్తుంది. వారికి సంపదను అనుగ్రహిస్తాను. ఈ కొండపై జన్మించి, నివసించి, మృతి చెందిన వారికి ముక్తిని ప్రసాదిస్తాను. ఈ లోకంలో సంపదను కోరే వారికి సంతతి సంపద లభిస్తాయి. ఈ పవిత్ర క్షేత్రంలో శాస్త్ర విహితమైన దానాలు చేసిన వారికి ఇహలోకంలో సౌఖ్యం, స్వర్గ ప్రాప్తి కలిగి నా పాద సాన్నిధ్యాన్ని పొందుతారు. ఇక్కడ నివసించే వారికి విద్యాదానం చేసినవారు ధన్యాత్ములు. వారు త్రిలోకాల్లో కీర్తినందుతారు. వారి బంధువులు, బంధువుల బంధువులు సుఖాలను పొంది, దేవ జన్మనంది స్వర్గాన్ని అలంకరిస్తారు." అని.

దేవతలనుద్దేశించి శ్రీ వేంకటేశ్వరస్వామి ఇట్లా అన్నారు, "ఇక్కడ పుష్పవనాలను పెంచి, పూవులనీ, పుష్పహారాలను నా సేవలో సమర్పించిన వారికి శాకసహితమైన నాలుగు సేర్ల అన్న ప్రసాదాన్ని నైవేద్యంగా నివేదించిన వారికి, స్వర్ణాభరణాలను రత్నాలను నా అలంకారం కోసం ఇచ్చిన వారికి సంతానం, సంపద, సుఖం ఇహలోకంలో పరలోకంలోనూ లభిస్తాయి. నన్ను అర్చించిన వారికి కోరికలు ఈడేరుతాయి. ఈ కొండపై నివసించే మానవులకు వసతులు కూర్చిన వారికి నా కృప లభిస్తుంది. ఈ కొండ పై నివసించే వారిని బాధ పెట్టినవారు నిర్దాక్షిణ్యంగా నాశనమౌతారు. వారి బంధువులు, సంపదలు నాశనమౌతాయి. నాకొండపైకి వచ్చి, స్వామి పుష్కరిణిలో స్నానం చేసి నన్ను పూజించిన వారికి సుఖసంపదలు సమకూరుతాయి. అక్కడ సమావేశమైన దేవతలు మొదలైనవారు జయజయ ధ్వానాలుచేస్తూ ఉండగా దయాసముద్రుడైన శ్రీవేంకటేశ్వరస్వామి బ్రహ్మాదుల కోరికలను అనుగ్రహించి సభామంటపం నుండి శ్రీదేవి, భూదేవితో కలిసి ఆనందనిలయ విమానం చేరినాడు. ఆ సమయంలో భేరీ నినాదం చేయబడింది. వారిపై పుష్పవర్షం కురిసింది దేవతలు జయధ్వానాలు చేశారు.

తొమ్మిదవ దివసం, బ్రహ్మోత్సవాలలో చివరి దివసం. ఆనాడు శ్రవణా నక్షత్రం. పవిత్రమైన శుభకరమైన అవభృథ స్నానం శ్రీవేంకటేశ్వరస్వామికి స్వామిపుష్కరిణి తీర్థంలో నిర్వహింపబడింది. అదే సమయంలో అక్కడ సమావేశమైన దేవతలు, మునులు, యోగినులు స్వామిపుష్కరిణి తీర్థంలో స్నానమాచరించారు.

అవభృథ స్నానానంతరం, సనక యోగీంద్రుడు సమావేశమైనవారందరినీ ఉద్దేశించి ఇలా అన్నాడు, "మీరంతా శ్రద్ధగా ఆలకించండి. దేవాధిదేవుడైన శ్రీమహావిష్ణువు సర్వతీర్థ స్వరూపుడని ప్రసిద్ధమే.

స్వామిపుష్కరిణియందు ఆ స్వామి అవభృథ స్నానం నిర్వహింపబడింది. ఆ సమయంలో స్వామిపుష్కరిణి యందు స్నానమాచరించిన పుణ్యం తత్క్షణం పూర్వ జన్మపాపాలన్నింటినీ హరిస్తుంది. శివుడు సనక మహాముని వాక్యం సత్యమన్నాడు. విష్ణువు 'తథాస్తు' అన్నాడు.

అవభృథ స్నానం నిర్వహించి, శ్రీవేంకటేశ్వరస్వామి ప్రీతిగా శ్రీపుష్పయాగాన్ని చేశారు. వివిధ సుగంధ పుష్పాలనురాశిగా పోసి మంత్రయుక్తంగా స్వామిని ఆపాదమస్తకం పుష్పాలతో నింపినారు.

బ్రహ్మదేవుడు సంకల్పించిన బ్రహ్మోత్సవాన్ని తిలకించి సంతోషంతో బ్రహ్మదేవునితో శ్రీ వేంకటేశ్వరస్వామి ఇలా అన్నాడు, "నీవు సంకల్పించి నిర్వహించిన ఉత్సవం నాకెంతో ఆనందాన్ని కలిగించింది. నేను నీకు ఏమి చేయగలనో తెలియదు. దీనికి బదులుగా నేను చేయగలిగిన దొక్కటే నీవే నేను, నేనే నీవు మన ఇద్దరి ఏకత్వ భావమే ఇంకేమైనా నీవు చెప్పదలచుకున్నావా" అని అడిగాడు. శ్రీవేంకటేశ్వరస్వామి దివ్య వచనాలకు సంతోషించి బ్రహ్మ తనకు అంతకు మించి ఏమీ అవసరంలేదని, స్వామి కృపయే చాలుననీ, ప్రపంచ క్షేమం కోసం, భక్తుల భయాన్ని దూరం చేయడానికి వారికి వరాలను ప్రసాదించడానికి, ఆనందనిలయం విమానంలో స్వామి శాశ్వతంగా నివసించాలన్నదే తన కోరిక అని దానినే అభ్యర్థిస్తున్నానని మనవిగా చెప్పినాడు. శ్రీమహావిష్ణువు బ్రహ్మదేవుని ప్రార్థనకు అంగీకారాన్ని తెల్పాడు. బ్రహ్మదేవుని సత్యలోకానికి వెళ్ళి భూత సృష్టిని కొనసాగించమని ఆదేశించి బ్రహ్మ కార్యక్రమానికి ఏవిధమైన అడ్డంకులు లేకుండా చూస్తానని, అభయాన్ని అనుగ్రహించాడు.

ఇంద్రుణ్ణి అమరావతికి, శివుణ్ణి పార్వతీదేవితో సుఖంగా ఉండటానికి కైలాసానికి, అగస్త్యమహామునిని తన శిష్యులతో వెళ్ళి తమతమ కార్యక్రమాలలో నిమగ్నమై పోవలసిందిగా, యోగులను యోగనిరతులై విశ్వశ్రేయస్సుకై యత్నించాలని ఆదేశించాడు.

పాపనాశన తీర్థానికి చుట్టూ ఉన్న దట్టమైన అడవిలో సనకుడు, తదితర యోగులు ఆశ్రమాలను స్థాపించుకొని యోగనిరతులైనారు. ఫల్గుణీ ధారా తీర్థానికి (తుంబురు తీర్థ) ఈశాన్యదిశలో వేంకటాచలంపై సప్తర్షులు తమ ఆశ్రమాలను నిర్మించుకున్నారు. పతివ్రతాతిలకమైన వసిష్ఠపత్ని అరుంధతి తపస్సునకు లక్ష్మీదేవి ఫాల్గుణ పౌర్ణమీ తిథినాడు ప్రత్యక్షమై వరాలను అనుగ్రహించింది. ఆ సందర్భానికి గుర్తుగా, ఫల్గుణీ నక్షత్రయుక్త మైన పూర్ణిమకు జ్ఞాపకంగా లక్ష్మీదేవియే ఆ తీర్థానికి ఫల్గుణీ తీర్థమని పేరు పెట్టింది. ఫాల్గుణ పూర్ణిమనాడు ఆ తీర్థంలో స్నానమాచరించినవారికి అభీష్టవరాలను అనుగ్రహించి వారి గృహాల్లో నివాసముంటానని లక్ష్మీదేవి ప్రకటించింది. అందుకే భక్తులైన మునులు తమ ఆశ్రమాలను ఆ ప్రాంతంలో నిర్మించుకున్నారు.

శ్రీ వేంకటేశ్వరస్వామి సాన్నిధ్యమాహాత్మ్యాన్ని తెలిసిన దేవతలు కొందరు స్వామిపుష్కరిణి ఉత్తర దిశలో, దేవనదీ సమీపంలో నివాసమేర్పరచు కున్నారు. శ్రీ స్వామి ఆలయానికి ఆగ్నేయ దిశలో జాబాలి మహర్షి ఆశ్రమాన్ని నిర్మించుకొని శిష్యులతో అక్కడ నివాసమున్నాడు. పర్వత మధ్యంలో కొందరు మహర్షులు

తమ ఆశ్రమాలను నిర్మించుకొని నివాసం చేయగా మరికొందరు కొండ పరిసరాలలో నివాసాలను ఏర్పాటు చేసుకొని శ్రీవేంకటేశ్వరుణ్ణి పూజించడానికి తరుచుగా వెళ్ళి వచ్చేవారు. అగస్త్య భగవానుడు కొండకు దక్షిణ దిశగా స్వర్ణముఖీ నదీ తూర్పు తీరంలో తన నివాస స్థానాంలో ఒక పుష్పవనాన్ని పెంచి, ఆ పుష్పాలతో శిష్యసమేతుడై శ్రీవేంకటేశ్వరస్వామిని ప్రతిదినం అర్చించి, భక్తిసుధాధారలను గ్రోలేవాడు. కృత, త్రేత, ద్వాపర యుగాల్లో నిబద్ధమైన పూజలను ఉత్సవాలను దేవతలు, యువరాజులు నిర్వహించుతూ ఉండగా, శ్రీదేవీ భూదేవీ సహితుడై భక్తజనులందరికీ ఉదారంగా వరాలను ప్రసాదిస్తూ ఉండేవాడు. కలియుగం ఆరంభమైనా వేంకటాచలంపై విద్యుత్కాంతితో దేదీప్యమానంగా విరాజమానుడై ఉంటాడు.

**జనకమహారాజు త్రేతాయుగంలో మిథిలను పాలిస్తూ ఉండేవాడు. ఆయనకు ఒక కూతురు. ఆయన తమ్ముడైన కుశధ్వజునికి నలుగురు కూతుళ్ళు. ఆ నలుగురికీ వివాహం కాలేదు. ఒకే రాజకుటుంబంనుండి ఆ నలుగురు కన్యలకు వరులు జనకునికి లభించలేదు. ఆయన పురోహితు డైన శతానందుడు కలువగా, ఆయనకు సగౌరవంగా పూజాదులను చేశాడు. నలువురు కన్యల వివాహ ప్రయత్నం చేయవలసిందిగా జనకమహారాజునకు శతానందుడు సూచించాడు. జనకుని కూతురైన సీతాదేవి ఆయనకు నాగేటి చాలులో లభించిన లక్ష్మ్యంశసంభూతురాలైన కన్య ఐనందున విష్ణ్వంశ సంభూతుడైన రాజకుమారుడు భూతలంపై జన్మించినాడా అని శతానందుణ్ణి జనకుడు అడిగాడు. భూమి పై అట్టి రాకుమారుడు జన్మించి ఉన్నాడని, ఆయనకు ముగ్గురు సోదరులున్నారని, వారు నలువురు సీత, మాండవి, ఊర్మిళ, శ్రుతకీర్తి అను నలుగురు కన్యలను వివాహమాడటానికి యోగ్యులని శతానందుడు తెల్పి, శ్రీవేంకటాచల మాహాత్మ్యాన్ని భక్తితో ఆలకిస్తే ఆయన కోరిక సిద్ధిస్తుందనీ,** బ్రహ్మకు, అష్టదిక్పాలకులకు శ్రీవేంకటాచల మాహాత్మ్యాన్ని విన్నందువల్లనే పదవులు లభించినాయని, శ్రీ వేంకటాచల మాహాత్మ్యాన్ని వినినందువల్ల కలిగే శుభకర పుణ్యం వలన, పాపాలు, దోషాలు, భయాలు, పేదరికం, దుఃఖం తదితర దురితాలు దూరమౌతాయని ఋషియైన శతానందుడు జనకునితో అన్నాడు.

గౌతమ మహర్షి తనకు ఉపదేశించిన శ్రీ వేంకటాచల మాహాత్మ్యాన్ని, వేంకటాద్రికి వివిధ యుగాలలో కలిగిన పేర్లను, ఆ పర్వతానికున్న వరప్రదాన శక్తిని శుభగుణాలను, ఆ కొండపై నున్న పవిత్ర తీర్థాలను, ఆకాశరాజు పెంపుడు కూతురైన పద్మావతీదేవితో శ్రీవేంకటేశ్వరస్వామి వివాహాన్ని వివరించి చెప్పాడు. శ్రీ వేంకటాచల మాహాత్మ్యాన్ని విని, ప్రతిదినం ఉదయం భక్తితో వేంకటాచలాన్ని స్మరిస్తే గంగానదిలో ఒక నూరుమార్లు స్నానం చేసినంత ఫలం, ఒక వేయిసార్లు త్రిసముద్ర సంగమ స్థానమైన సేతువు (రామేశ్వరం) లో స్నానమాడినంత ఫలం లభిస్తాయని వివరించాడు.

అది విని జనకుడు శ్రీవేంకటాచల తీర్థ దర్శనం చేయాలని కోరి, కొందరు మంత్రులతో, శతానంద మహర్షితో కలిసి ప్రయాణించి, చేరి, అక్కడ కొన్నాళ్ళు ఉన్నాడు. స్వామిపుష్కరిణిలో ప్రతిదినం స్నాన సంధ్యాదులను ఆచరించి శ్రీ భూవరాహస్వామిని, శ్రీ వేంకటేశ్వరస్వామిని అర్చించి, మిథిలానగరానికి

తిరిగివెళ్ళాడు. **శ్రీ వేంకటాచలాన్ని దర్శించిన పుణ్యఫలం వల్ల, కొంతకాలానికి శ్రీరాముడు సీతాదేవిని, లక్ష్మణుడు ఊర్మిళను, భరతుడు మాండవిని, శత్రుఘ్నుడు శ్రుతకీర్తిని వివాహమాడారు.**

నైమిశారణ్యంలో సూతపౌరాణికుడు శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యాన్ని వర్ణించి చెప్పగా విన్న ఋషులందరూ ఆ దివ్య కథలకు పులకితులై ఇంకా తమకు తృప్తి కలుగలేదనీ, కలియుగంలో శ్రీవేంకటేశ్వరుడు వేంకటాద్రిపై ఏ రూపంలో విరాజిల్లుతాడో, ఎట్లాంటి కోరికలను తీరుస్తాడో ఆయన అనుగ్రహించే వరాలు ఎట్లా ఉంటాయో తమకు వివరించవలసిందిగా కోరారు. సూతుడు కలియుగంలో నెలకొనే పరిస్థితులను, శ్రీ వేంకటేశ్వరు డనుగ్రహించే వరాలను గూర్చి వివరించాడు.

**శ్లో. పిబతాం వేంకటేశస్య కథాం దివ్యరసాయనమ్ ।**
**అస్త్యత్ర తృప్తిర్నాస్మాకం భూయస్తృష్ణాచ భూయసీ ॥**
**(వరాహపురాణం అధ్యా. 58, శ్లో.2)**

ఋషులు తృప్తి కలుగక, ఇంకా తెలుసుకోవాలన్న కౌతూహలాన్ని వెలిబుచ్చారు.

**శ్లో. వరాహాద్రి కథాన్యాణాం శ్రోతౄణామమృతోపమా ।**
**వైకుంఠాద్రేః కథాంశ్రోతుం భూయస్తృష్ణా వివర్ధతే ॥ (1)**
**బ్రూహి తేషాం తు తీర్థానాం మాహాత్మ్యం పుణ్యవర్ధనమ్ । (3)**
**(వరాహపురాణం, అధ్యా.40, శ్లో.1, 3)**

**శ్లో. వేంకటాద్రేస్తు మాహాత్మ్యం జనకర్ణ రసాయనమ్ ।**
**శ్రుణ్వతాం నాస్తి తృప్తిస్తు మునీనాంనో బుధోత్తమ ॥ (1)**
**భూయః కథయ వృత్తాంతం శ్రుతంకించిత్త్వయాపురా (2)**
**(వరాహపురాణం, అధ్యా.41, శ్లో.1-2)**

**అహోగిరి ప్రభావోఽయం వర్ణనీయః కథం బుధైః**
**(పండితులైన వారెవరైనా ఈ పర్వత మాహాత్మ్యాన్ని ఎట్లా వర్ణింపగలరు?)**
**(వరాహపురాణం, అధ్యా.41, శ్లో.47)**

**శ్లో. భగవన్ వేదశాస్త్రార్థ తత్వజ్ఞాన సునిశ్చిత ।**
**శ్రుతుం సూత మహాశ్చర్యం ఇహాఽఖ్యాన మనుత్తమమ్ ॥ (1)**

**వేంకటాద్రి ప్రభావోఽయ మీదృతః పాపనాశనః ।**
**తత్రైవ భగవచ్ఛ్రీపతిరీ దృశీనిస్తులా ఖలు ॥ (2)**

**వేంకటేశోమహాశ్చర్య దివ్య చారిత్ర భూషణః ।**
**ఆశ్చర్యం తస్య చారిత్రమద్భుతం పరమాద్భుతమ్ ॥ (3)**

**అదృష్టాశ్రుతపూర్వం తత్కుత్రాఽపి జగతీతలే ।**
**శ్రుణ్వతా మిదమాఖ్యానం నాస్తి తృప్తి స్తపోధన ॥ (4)**
**(వరాహపురాణం, అధ్యా.53, శ్లో.1-4)**

శ్రీవేంకటేశ్వరస్వామి చరిత్రం అత్యద్భుతమైంది. ఆ కథామృతాన్ని ఎంత గ్రోలినా తృప్తినందక, ఇంకా వర్ణింపమని సూత పౌరాణికుణ్ణి ఋషులు కోరినారు. ఇట్లాంటి అసంతృప్తిని ఈ కాలాన కూడా శ్రీవేంకటేశ్వర దర్శన సమయంలో భక్తులు అనుభవిస్తున్నారు. శ్రీస్వామి దివ్యమంగళ విగ్రహాన్ని, సౌందర్యాన్ని, శుభ లక్షణాలను తనివిదీరా చూచి అనుభవించాలని ఎంత సేపైనా స్వామి సన్నిధిలో ఉండటానికి ఇష్టపడతారేకాని కొన్ని క్షణాలు చూచి అక్కణ్ణుంచి కదలడానికి ఇష్టపడరు.

కలియుగంలో సామాన్య జనులు చర్మచక్షువులతో శ్రీవేంకటేశ్వర స్వామిని ఒక శిలా విగ్రహంగానే చూస్తారు. వైకుంఠం నుండి కొని తేబడిన దివ్యవిమానం అదృశ్యమైనందున, కలియుగంలో ఆయన కృపను పొందడానికి భక్తులు ఒక ఆలయాన్ని నిర్మిస్తారు. కాని, కొందరు శ్రీస్వామి మాహాత్మ్యాన్ని తెలియజాలక స్వామి విగ్రహాన్ని శిలా నిర్మితంగా, దారు నిర్మితంగా భావించి అది కృత్రిమంగా సిద్ధమైందని, దేవుడు లేడని, దాని యందు దేవుడు లేడని వాదిస్తారు. కాని, శ్రీస్వామి సమస్తం చూస్తాడు. ప్రపంచంలో సంభవిస్తున్న వాటినన్నింటినీ సాక్షిభూతంగా గమనిస్తాడు. లోక వ్యవహారాల్లో పాల్గొనడు కలియుగంలో ఎవరితోనూ నేరుగా మాట్లాడటానికి ఇష్టపడడు, కాని, తనను ఆశ్రయించిన భక్తులను రక్షిస్తాడు దుష్టులను నిర్దాక్షిణ్యంగా నాశనం చేస్తాడు. భక్తుల కోరికలను నెరవేరుస్తాడు. శ్రీ వేంకటాద్రిపై శ్రీలక్ష్మితో సదా విహరిస్తూ ఉంటాడు.

ఈ యుగంలో మానవులు అల్పమతులని తెలిసి, వారిపై దయతో ఆయన, స్వల్పమైన ధర్మకార్యాలు చేసినా స్వల్ప దక్షిణలను సమర్పించినా కేవలం స్మరించినా సంతృప్తుడౌతాడు. మానవులు చేసే సేవలకు, నిర్వహించే ఉత్సవాలకు ప్రీతుడౌతాడు. కాని, దేవలోకం నుండి దేవతలు వేంకటాద్రికి వచ్చి స్వామిపుష్కరిణిలో స్నానమాచరించి, శ్రీస్వామిని అర్చించి మానవులకు కన్పడకుండా తమలోకానికి తిరిగి వెళ్ళుతారు. శ్రీ వేంకటేశ్వరస్వామిని, శివుణ్ణి దర్శించడానికి ఏదో ఒకసారి రావడం తృప్తినీయనందున శ్రీ వేంకటాద్రిపై శాశ్వత నివాసాన్నేర్పాటు చేసికోవాలని వారు కోరుతారు. శ్రీ స్వామి వారి కోరికను అనుగ్రహిస్తాడు. శ్రీ వేంకటాచలంపై నివసించి భక్తుల కోరికలను తీరుస్తూ భక్తసులభుడై ఆయన లోకంలో ప్రసిద్ధుడౌతాడు. జనులు తీవ్రమైన భక్తితో ఆయనను ఆకర్షిస్తారు. వారు ఆనందంతో తన్మయులౌతారు. వారి ననుసరించి వారి బంధుజనులు తదితరుల గాఢమైన భక్తిని పొంది శ్రీస్వామిని అర్చిస్తారు. **ఈ విధంగా స్వామి భక్తుల సంఖ్య ఘనంగా పెరుగుతుంది. అవర్ణులు, వర్ణేతరులు, విదేశీయులు, వేదాలను ప్రమాణంగా అంగీకరించరని బౌద్ధులు జైనులు వేంకటాచలానికి చేరి స్వామిని భక్తితో సేవిస్తారు.**

**కలియుగంలో స్వామి ఆశ్చర్యకరంగా ఉంటాడు. ధనాదులను కాన్కలను అర్పించిన వారిని వారి దక్షిణలకు అనుగుణంగా అనుగ్రహిస్తాడు. ధనవంతుల నుండి వారి శక్తికి తగినట్లుగా గ్రహించినా,**

**పేదలు యధాశక్తిగా సమర్పించినా తృప్తిపడతాడు. ఆయనకు డబ్బుతో ఏలాంటి అవసరమూ లేదు, ఆయనకే కోరికలూ లేవు, ఆయనయే అన్నింటినీ అనుగ్రహిస్తాడు. ఆయనకు ఏ కొరతాలేదు. ప్రాణుల అభ్యుదయాన్ని కోరి ఆయన కానుకలను స్వీకరిస్తాడు.**

కలియుగంలో జీవిస్తూ పాపపంకిలంలో నివసించే వారికి శ్రీవేంకటేశ్వరుడు తప్ప మరే రక్షకుడు లేదు. శ్రీ వేంకటేశ్వరస్వామితో పోల్చదగిన దేవుడు లేదు. స్వామిపుష్కరిణివంటి పవిత్రమైన తీర్థమూలేదు.

**కలిదోష పరీతానాం నరాణాం పాపకర్మణామ్ । (39)**
**వేంకటేశాత్పరో దేవో నాస్త్యన్యః శరణం భువి ॥**
**వేంకటేశ సమోదేవో నాస్తి నాస్తి మహీతలే (40)**
**స్వామిపుష్కరిణీ తీర్థసమం నాస్తి, నచాస్తి హి (41)**

* * *

## అధ్యాయం-9

### వేంకటేశ్వరునిగా వేంకటాచలంమీద విష్ణుదేవుని స్థిరనివాసం - స్వామివారి అభీష్ట సాక్షాత్కారం

వైకుంఠం నుండి భువికి క్రీడాద్రిగా వచ్చిన వేంకటాచలం స్వాభావిక మైనది, అసాధారణమైనది, చాలా పవిత్రమైనదని స్తుతింపబడే ఈ కొండ విష్ణువునకు క్రీడాప్రియమైన ప్రాంతం. ఈ కొండంటే స్వామికి చాలా ప్రీతి. అందుచేత స్వామి ఇక్కడే ఉండిపోయాడు. శ్రీస్వామిపుష్కరిణికి పశ్చిమతీరాన ఉన్న కళ్ళు చెదర్చే మిక్కిలి సొగసైన విమానం మీద శ్వేత వరాహుడు ఆక్రమించిన తర్వాత, సర్వోత్కృష్టుడు, దైవస్వరూపుడు, సొగసైన విష్ణుమూర్తి 'శ్రీనివాసునిగా' (వక్షస్థలం కుడివైపున శ్రీదేవిని ధరించి), శంఖ - చక్రధారియై 'వేంకటేశ్వరు' నిగా స్వామిపుష్కరిణి దక్షిణ తీరాన తన దివ్యవిమానంలో (దివ్యభవంతి) స్థిరవాసం ఏర్పరుచుకొనుటకు వచ్చాడు. (వరాహపురాణం)

వేంకటేశుడు, అద్భుతమైన దివ్యరూపములను ధరించే 'మాయా', విశ్వమంతటయు శక్తి కలిగిన 'సర్వశక్తః' మరియు నిరంతర లీలలు చూపే 'లీలాపరవశుడు'.

ఒకానొక సమయాన పరాక్రమశాలియైన స్వామి, లక్ష్మీసమేతుడై వేంకటాద్రికి ఉత్తర దిక్కున వినోదియై విహరించుచుండినాడు. అదే సమయానికి కొంతమంది మునులు అక్కడికి వచ్చారు. ఆ కొండమీద యజ్ఞానికి కావలసిన సకల సామగ్రి (వస్తువులు) ఉండటం చూచి, ఆ కొండ అత్యంత పావన ప్రదేశమనితలచి, అక్కడే విష్ణువు కొరకు తీవ్రతపస్సు చేయుటకు సంకల్పించి, యజ్ఞాదులను మొదలు పెట్టారు. పరమ పవిత్రమైన ప్రేమజంట అయిన వేంకటేశ్వరుడు-లక్ష్మీదేవి ఆనందభరితమైన పావన శరీరం గలవారై, ప్రకాశవంతమైన దుస్తులు - నగలు ధరించినవారై, సువాసనను వెదజల్లుతూ యజ్ఞశాలలోకి ప్రవేశించారు. వారిని చూసిన మునులు దిగ్భ్రాంతి చెంది, వారి వద్దకు వెళ్ళి ఇలా అడిగారు- "ఓ రాజా! నీవు ఎక్కడనుండి వచ్చావు? నిన్ను కన్న ఆ అదృష్ట దంపతులు ఎవరు? నీ పేరేమిటి? మీ వివరాలను మాకు తెలపండి".

**వారి ప్రశ్నలకు, విష్ణువు ఇలా జవాబిచ్చాడు - 'నేను రాజు (క్షత్రియుడను)ని కాను, బ్రాహ్మణుడిని కూడా కాను, నాకు కులము లేదు. నాకు తల్లి-తండ్రులు కూడా లేరు. నాకు ఎటువంటి స్థిరనివాసము లేదు. నేను విశ్వమంతట ఉంటాను. నేను అన్ని పదార్థాలను తింటాను. నేను నలువైపులా నిరర్థకంగా సంచరిస్తూ ఉంటాను. నేను అన్ని రూపాలను ధరిస్తుంటాను. నాకు ప్రత్యేకమైన, నిర్దిష్టమైన పేరు ఏమి లేదు. నేను గుణాలన్నిటికి అతీతుణ్ణి. నేను కేవలం మిమ్ములను దర్శించుకొనుటకు ఇక్కడకి వచ్చాను అంతే". (వరాహపురాణం)**

**నాహం రాజా న వా విప్రాః కచిజ్జాతశ్చ నైవమే,**
**న చ మాతా న చ పితా నైవా ఆవాసశ్చ కుత్రచిత్. (20)**

**సర్వా-వాసస్-సర్వ-భక్షస్-సర్వగస్-సర్వరూపధృత్,**
**నిర్-నామా నిర్-గుణశ్చ అహం యుష్మాన్ ద్రష్టుమిహాగతః (21)**

యజ్ఞవిధిలో కలిగిన లోపాలని ఎత్తి చూపి, ఆ యజ్ఞ ప్రయోజనాన్ని ప్రశ్నించాడు. మునులాయనకు ప్రత్యుత్తరమీయ లేదు. ముందు నిశ్చయించిన ముహూర్తానికి సరిపడేటట్లుగా వపను యజ్ఞాగ్నిలో వ్రేల్చడానికి త్వరపడ్డారు. అదే సమయంలో ఒక దివ్య సుందర విగ్రహుడు శంఖ చక్రధారియై వివిధ భూషణాలంకృతుడై వక్షఃస్థలంపై శ్రీవత్స చిహ్నంతో విరాజమానుడై యజ్ఞ కుండంలో ప్రవేశించి వపను స్వీకరించాడు. ఆ అద్భుత సాక్షాత్కారానికి మునులు ఆశ్చర్యచకితులైనారు. భగవంతుడు వారితో "నేను తృప్తినందినాను" అని పలికి తత్క్షణం అంతర్ధానం చెందినాడు. మునులందరూ విష్ణు సందర్శనంతో సంతుష్టులై, స్వయంగా యజ్ఞేశ్వరుడే అరుదెంచి యజ్ఞ హవిస్సును కృపతో స్వీకరించినందున తాము ధన్యులైనా మని భావించి యజ్ఞాన్ని సంపూర్తికావించినారు.

ఒక పర్యాయం, శ్రీ వేంకటేశ్వరస్వామి బాలునివలె వేంకటాద్రిపై విహరిస్తూ ఉన్న సమయాన, "కుమారా!, కుమారా!" అని తన కుమారుణ్ణి పిలుస్తూ ఉన్న వృద్ధుడై బలహీనుడైన అంధ బ్రాహ్మణుణ్ణి చూచాడు. ఆ వృద్ధ బ్రాహ్మణునికి తన చేతిని అందించి, కుమార తీర్థానికి తీసుకువెళ్ళి అక్కడ ఆయనను స్నానమాచరించమని ఆదేశించాడు. ఆ వృద్ధ బ్రాహ్మణుడు స్నానం చేయగానే పదహారేళ్ళ తరుణ వయస్కుడుగా మారాడు. శ్రీ వేంకటేశ్వరస్వామి ఆ బ్రాహ్మణునికి యౌవనాన్ని ప్రసాదించడమే కాదు, ఆయన నిత్య నైమిత్తిక కర్మలకు, యజ్ఞ యగాది నిర్వహణకు అవసరమైన సిరిసంపదలనూ ఆయన కోరికకు అనుగుణంగా అనుగ్రహించినాడు. తరుణ వయస్కుడుగా మారిన ఆ బ్రాహ్మణునికి సహస్ర చక్షువులతో, వేయి ముఖాలతో, వేయి శిరస్సులతో, వేయి బాహువులతో "విశ్వాత్మ"గా దర్శన మిచ్చి అంతర్ధానమైనాడు. **(ఉదాహృతం, పేజి. 33-34)**

పూర్వకాలంలో చంద్రవంశానికి చెందిన శంఖణుడు అనే రాజు శాంకాస్య నగరాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఆయనకు సామంతులుగా ఉన్న రాజకుమారులు ఆయనను పదవీ భ్రష్టుణ్ణి చేసి రాజ్యం నుండి వెడల గొట్టినారు. ఆ రాజు రామేశ్వరానికి తీర్థయాత్రపై బయలుదేరినాడు. ఆయన సేతు స్నానం చేసిన అనంతరం, ప్రయాణమై సువర్ణముఖీనది వద్దకు చేరి స్నానమాచరించాడు. పిమ్మట పద్మసరోవరానికి చేరి స్నానం చేసి నిత్య పూజాదికాలను పూర్తి కావించాడు. తన జీవితంలో కలిగిన వైపరీత్యాన్ని తలచుకొని దుఃఖించాడు. తలదాచుకోవడానికి వీలులేని సంచార జీవితంపై వెగటు పుట్టి, దుస్సహమైన జీవితం కంటె మరణమే మేలని భావించాడు. ఎక్కడికి వెళ్ళాలో ఏం చేయాలో, తన జీవనాన్ని ఎట్లా సాగించాలో ఆయనకు పాలుపోలేదు. దుఃఖిస్తూ ఆయన నిద్రించాడు. ఒక అశరీరవాణి ఆయనకు ఇట్లా విన్పించింది. "ఓ రాజా! నీవు వివేకవంతుడివి, దుఃఖించకు, ధైర్యంతో జీవించు, ఇక్కడినుండి రెండున్నర మైళ్ళ దూరంలో జగత్ప్రసిద్ధమైన శ్రీ వేంకటాచలం ఉన్నది. అర్థి జనానికి కామధేనువుగా, కల్పతరువుగా, చింతామణిగా, కోరికలనీడేర్చి దుఃఖ విముక్తులను చేసే కమలాపతి (శ్రీ వేంకటేశ్వరస్వామి) ఆ కొండ పై నివాసమున్నాడు.

ఆయన కృప, స్వయంవ్యక్తం, నిర్హేతుకజాయమానం. ఆ కొండపైనే ప్రసిద్ధమైన స్వామిపుష్కరిణి ఉన్నది. ఆ స్వామిపుష్కరిణి పశ్చిమ తీరాన ఒక పెద్ద పుట్ట ఉన్నది. ఆ పుట్ట ప్రక్కనే నీవొక కుటీరాన్ని ఏర్పరచుకొని శ్రీ వేంకటేశ్వర స్వామిని ఆరుమాసాలు ప్రతిదినం త్రిసంధ్యలు, స్వామిపుష్కరిణిలో స్నానంచేసి నిత్యపూజాది ధార్మిక విధులను నిర్వర్తించు, నీకు రాజ్య ప్రాప్తి కలుగుతుంది". అని.

ప్రోత్సాహకరమైన ఆ మాటలను వినగానే ఆయన హృదయం ఆనందంతో నిండిపోయింది. పర్వతాన్ని అధిరోహించి, స్వామిపుష్కరిణిని వెదకి, ఆ తీరంలో చిన్నకుటీరాన్ని నిర్మించుకొని, యథోక్తంగా స్వామిపుష్కరిణిలో స్నానమాచరించి నిత్య పూజా విధానాన్ని తపశ్చర్యను ప్రతిదినం త్రిసంధ్యలు ఆరుమాసాల కాలం నిర్వహించాడు.

ఒకనాడు అకస్మాత్తుగా స్వామిపుష్కరిణి మధ్యభాగం నుండి ఒక తేజోమయమైన దివ్యవిమానం కన్పించింది. శంఖచక్రగదాది ఆయుధాలను ధరించిన శ్రియఃపతి శ్రీదేవి భూదేవి ఇరు పార్శ్వాల్లో శోభించగా ఆ విమానంలో విరాజమానుడై ఉన్నాడు. బ్రహ్మ, మునులు, సిద్ధులు, దేవతాగణాలు అక్కడికి చేరినారు. ఆకాశం నుండి దుందుభులు మ్రోగినాయి, అప్సరసలు నృత్యం చేసినారు. దేవగణం వేదమంత్రాలతో శ్రియఃపతిని స్తోత్రం చేసినారు.

శంఖణుడు ఆశ్చర్యచకితుడైనాడు. ధ్యానం నుండి లేచి ఇట్లా ప్రార్థించినాడు, "ఓ దేవదేవా! నీవు అనుగ్రహించిన రాజ్యాన్ని శత్రురాజులు అపహరించి నన్ను రాజ్యభ్రష్టుణ్ణి చేశారు. ఓ జగన్నాయకా! దయాసముద్రా! నన్ను దయతో రక్షించు, మీ దర్శనంతో నేను కృతార్థుణ్ణైనాను." అని. దేవదేవుడిలా అన్నాడు, "నీవు భక్తితో స్వామిపుష్కరిణిని సేవించినపుడే నీకు రాజ్య ప్రాప్తి కలిగింది. భక్తితో స్వామి పుష్కరిణిలో స్నాన మాచరించే భక్తులకు వారి శ్రద్ధా భక్తులకు అనుగుణంగా స్వామిత్వం లభిస్తుంది. నీవు సమాచరించినావు, నీవు ఫలితాన్ని పొందినావు. నీకు నీరాజ్యప్రాప్తి కలిగింది. నీవు వెళ్ళు, రాజ్యాన్ని పాలించు, సుఖంగా ఉండు". అని వెంటనే అంతర్థానమై పోయినాడు.

ఇదిలా ఉండగా సామంతరాజులు పరస్పరం రాజ్యానికై పోట్లాడగా వారిలో చాలామంది నశించారు. ప్రజలు ఆ రాచక స్థితితో విసిగిపోయి, బలహీనుడైన యువరాజు నొకణ్ణి గద్దెపై కూర్చోపెట్టడానికి ఇష్టంలేక, శంఖనుణ్ణే తీసుకువచ్చి రాజసింహాసనంపై పునఃప్రతిష్ఠించాలని నిశ్చయించు కున్నారు. ఆయన కోసం వెతికి వేంకటాచలం నుండి తిరిగి వస్తున్న శంఖణుణ్ణి సాంకాస్య నగరానికి ఆహ్వానించి సింహాసనాధిష్ఠుణ్ణి చేశారు. **(వరాహపురాణం, 1, అధ్యా.38)** (ముందు శంఖణ వృత్తాంతం క్లుప్తంగా ప్రస్తావింపబడింది. పుష్కరిణీ మాహాత్మ్య సందర్భంగా వివరంగా పొందుపరచ బడింది).

పూర్వకాలం మధ్యదేశంలో ఒక విద్యాధికుడైన బ్రాహ్మణుడు ఉండేవాడు. **(వరాహపురాణం, ప్రథమభాగం అధ్యాయం 39).** ఆయన పేరు ఆత్మారాముడు. దైవ బ్రహ్మణ భక్తి కలవాడు. పండిత లోకంలో ప్రశంసలనందినవాడు. ఆయన తండ్రి గతించిన పిదప, ఆయన ఆస్తిపాస్తులు క్రమంగా క్షీణించాయి.

కుటుంబపోషణం కూడా కష్టమైపోయింది. దానధర్మాలు చేసే ప్రసక్తేలేని స్థితి ఏర్పడింది. ఏమి చేయాలో తోచక ఆదఃస్థితిలో వేంకటాద్రి సమీపానికి చేరి, కపిలతీర్థంలో స్నానమాచరించి కపిలేశ్వరునికి నమస్కరించి, వేంకటాద్రిని అధిరోహిస్తూ 17 తీర్థాల్లో క్రమంగా స్నానం చేసి తన దీన స్థితికి బాధపడుతూ ఒకచోట కూర్చుండి చింతింపసాగాడు. అక్కడే సమీప స్థలంలో ధ్యానమగ్నుడైన సనత్కుమారుణ్ణి చూశాడు. ఆ మహామునికి సాష్టాంగపడి తన పేదరికానికి పరిష్కారమార్గాన్ని సూచింపమని వేడినాడు. సనత్కుమారుడు తన యోగశక్తితో ఆత్మారాముడు తన పూర్వజన్మలో ఎప్పుడూ దానధర్మాలు చేయలేదని, ఇతరులు చేస్తున్న దానధర్మాలను అడ్డుకున్నాడని, విష్ణువు నెప్పుడూ స్మరింపలేదని తెలుసు కున్నాడు. విష్ణు వక్షఃస్థలంలో నివసిస్తూ సర్వసంపదలను అనుగ్రహించే శ్రీలక్ష్మీధ్యానం చేసి మహామంత్రాన్ని మనసా జపించవలసిందని ఆత్మారామునికి హితోపదేశం చేశాడు. మహామంత్రాన్ని ఉపదేశించాడు (ఆ మంత్రమిది; **ఓం శ్రీం ఓం నమః పరమాయై లక్ష్మీ విష్ణు వక్షఃస్థలాయై మాయై శ్రీ తారికాయై స్వాహా**).

ఆత్మారాముడు ఆనందంతో మహామంత్రాన్ని జపిస్తూ ముందుకు సాగాడు. స్వామిపుష్కరిణిని చేరాడు. స్వామిపుష్కరిణీ తీర్థం మందాకినీ విరజానదులనుండి వచ్చి చేరిందని భావించి స్నానమాచరించాడు. స్నానం చేసి నీటిలోనుండి బయటికిరాగానే గోపుర మంటప విమాన విలసితమైన ఒక దేవాలయం కన్పించింది. మంటప విమాన గోపురాదులన్నీ స్వచ్ఛమైన బంగారంతో మణిఖచితమై కన్పించినాయి. శ్రావ్యమైన సంగీతం, నాట్య ధ్వని విన్పించాయి. ఆలయ సమీపానికి వెళ్ళి, రెండు హస్తాల్లో శంఖ చక్రాలను ధరించి, మరి రెండు హస్తాలతో వరదాభయ ముద్రలతో విలసిల్లుతూ ఉన్న కమలాక్షుడైన శ్రీవేంకటేశ్వరస్వామిని దర్శించినాడు. ఇరువైపుల శ్రీదేవీ భూదేవీ సహితుడై కోటిమన్మథ సుందరాకారుడై కన్పించాడు. ఆత్మారాముడు గద్గద స్వరంతో స్వామినిట్లా ప్రార్థించినాడు, "ఓ దేవా! నీవు సమస్త జగత్తుకి సృష్టి స్థితిలయ కారకుడవు. నీవే పరమేశ్వరుడవు. నీవు సమస్త జ్ఞానివి. నీవే సర్వాత్ముడవు. నీకు వినమ్రంగా ప్రణతిని సమర్పిస్తున్నాను.

**త్వమేవ పరమంధామ త్వమేవ పరమాగతిః । (42)**

**త్వమేవ జగతాం స్రష్టా ధాతాహర్తా మహేశ్వరః**
**ఇత స్తుతం శివేనాపి విధినాపి స్తుతం సదా (43)**

**సర్వం త్వమేవ జానాసి సర్వాత్మన్ త్వాం నమామ్యహమ్ (44)**

**(వరాహపురాణం, అధ్యా.42, శ్లో.44)**

దయామయుడైన శ్రీ వేంకటేశ్వరస్వామి ఆత్మారాముని మహామంత్ర జపానికి సంతోషించి, వాని పాపాలను క్షమించి, వాని దుష్కార్యాలను మన్నించి సంపదనూ, దీర్ఘాయువునూ, ఆరోగ్యాన్ని ప్రసాదించి, "సంపదలను అనుభవిస్తూ, దానధర్మాలను చేస్తూ భక్తిపరుడవై ధార్మికుడవై జీవించు" మని ఆనతి ఇచ్చి అదృశ్యుడైనాడు.

ఆత్మారాముడు స్వామి దర్శనానికి ఆనందంతో తన్మయుడైనాడు. అది నిజమో స్వప్నమో తెలియనివాడైనాడు. అది యథార్థం కావాలని కోరాడు. నెమ్మదిగా శ్రీవేంకటాచలాన్ని దిగి, పర్వత సమీపంలో నివాసాన్ని ఏర్పరచుకొని సుఖంగా చిరకాలం జీవించాడు.

పురాతనకాలంలో వసువు అనే పేరుగల నిషాదుడు భార్యాసహితుడై శ్రీవేంకటాద్రిపై పుట్టలో మొలచిన చింతచెట్టు క్రింద నివాసముండేవాడు. ఆ పుట్ట క్రిందనే శ్రీ మహావిష్ణువు విరాజమానుడై ఉండేవాడు **(వరాహ పురాణం ద్వి.భా., అధ్యా.9, శ్లో. 1-15).** అ నిషాదుడు శ్యామాక ధాన్యాన్ని పండించేవాడు. ప్రతిదినం, అన్నంలో తేనెను కలిపి భక్తితో పుట్టలో ఉన్న స్వామికి నివేదించి, మిగిలిన అన్నాన్ని భార్యతో కలిసి భుజించేవాడు. కొంత కాలానికి ఆ దంపతుల కొక పుత్రుడు జన్మించాడు. ఆ బాలునికి వీరుడని నామకరణం చేశారు. పిల్లవాడు పెరిగి పెద్దవాడైనాడు. ఒకనాడు దంపతులు తేనెను సంపాదించడానికి అడవికి వెళ్ళుతూ, శ్యామాక ధాన్యంతో అన్నాన్ని వండి, తేనెతో కలిపి, స్వామికి అర్పించి మిగిలిన అన్నాన్ని భుజింపమని ఆ బాలునికి చెప్పివెళ్ళారు. ఆ బాలుడు తన తండ్రి చెప్పినట్లే చేశాడు. అడవినుండి వచ్చి చూడగా ఇంట్లో అన్నం కన్పించలేదు. తన కుమారుడు స్వామికి నివేదించకుండానే అన్నాన్ని భుజించాడని ఆ నిషాదుడు అనుమానించాడు. స్వామికి అర్పించలేదు సరికదా, అపవిత్రమైన అన్నాన్ని భుజించాడు అన్న కోపంతో ఖడ్గంతో వీరుణ్ణి చంపడానికి సిద్ధమైనాడు. నిషాదుడు చేతిని పైకెత్తగానే శ్రీమహావిష్ణువు పుట్టలోనుండి తత్క్షణం బైటికి వచ్చి వెనుక నుండి అదృశ్యంగా నిషాదుని చేతిని పట్టుకున్నాడు. తన చేతినెవడో పట్టుకున్నాడని రెట్టించిన కోపంతో గిర్రున తిరిగి చూడగా సాక్షాత్తు భగవంతుడే శంఖచక్రగదాధారియై కన్పించాడు. నిషాదుడు ఖడ్గాన్ని క్రింద పడవేసి, “స్వామీ! నా పుత్రుడు నీకు శ్యామాక అన్నాన్ని అర్పింపక తానే తిన్న అపరాధానికి శిక్షగా వాణ్ణి చంపాలనుకున్నాను. నీవెందుకు అడ్డగించినావు? అని వేడుకున్నాడు. భగవంతుడు ఆ నిషాదునితో “నిషాదా! నీపుత్రునికి నాపై నీకంటె ఎక్కువ భక్తి ఉన్నది. నాకు నివేదన చేసిన తరువాతే అన్నాన్ని భుజించినాడు. **స్వామిపుష్కరిణీ తీరంలో ఉన్న విగ్రహం మాత్రమే నేనని నీవు భావిస్తున్నావు. కాని, నీ పుత్రుడు నన్ను సర్వవ్యాపకునిగా గుర్తించినాడు. నీ భాగ్యవశాత్తు నా దర్శనాన్ని నీకు కలిగించడానికి నీ పుత్రుడుగా జన్మించాడు. నా ప్రియభక్తుణ్ణి రక్షించడానికి నేను వచ్చాను.”** ఆ నిషాదుడు స్వామి దర్శనంతో పులకించిపోయాడు.

**పూర్వకాలంలో పాండ్యదేశంలో రంగదాసు అనేవాడు జన్మించాడు (వరాహపురాణం ద్వి.భా, అధ్యా.9, శ్లో.16-50).** రంగదాసు బాల్యంనుండి విష్ణుభక్తికలవాడై ఉన్నాడు. ఉత్తరదిశగా తీర్థయాత్ర చేస్తూ నారాయణపురికి చేరాడు. అక్కడ శ్రీ వరాహస్వామిని అర్చించాడు. శ్రీ వేంకటాద్రిపై నివాసమైన శ్రీనివాసుణ్ణి గూర్చి విని ఉత్తరదిశగా ముందుకు సాగి సువర్ణముఖీ నదీ తీరాన్ని చేరాడు. ఆ నదిలో స్నానంచేసి, దానికి ఉత్తరతీరంలో నున్న శుకపురిలో ఉన్న పద్మసరస్సులో స్నాన మాచరించి ఆ నగరంలో ప్రతిష్ఠింపబడిన శ్రీ కృష్ణబలరాములను అర్చించి, తన ప్రయాణాన్ని సాగించాడు. అడవిలో నడుస్తూ పర్వత సమీపానికి చేరుకున్నాడు. అక్కడ శివుణ్ణి అర్చించాడు. ఆ శివుణ్ణే కపిలగోవు పూజించింది. శివాలయానికి ఎదురుగా

ఉన్న చక్రతీర్థంలో స్నానం చేశాడు. ఆ చక్రతీర్థం పరమపావనమైంది. దానిలోతెంతో తెలియదు. అక్కణ్ణుండి వేంకటాచలానికి బయలుదేరాడు.

(<u>కపిలతీర్థానికే చక్రతీర్థమని పేరు.</u> **విజయనగర చక్రవర్తి అచ్యుత రాయలు (శక సం॥1453, ఇంగ్లీషు సం॥25 జూన్, 1531) రాజ్యాన్ని పాలించిన రెండవ సంవత్సరంలో నాలుగు శిలాఫలకాలపై తమిళ, తెలుగు, కన్నడ భాషలలో శాసనాన్ని చెక్కించి, <u>ఆ శాసనంలో తెలుగు, కన్నడ భాషల్లో చక్రతీర్థమని, తమిళ భాషలో ఆళ్వార్ తీర్థమని పేర్కొని నాలుగువైపుల పాతించాడు.</u>** పురాణకథలో రంగదాసు, తీర్థంలో మొదట స్నానంచేసి తరువాత శివుణ్ణి అర్చించి, శివ దర్శనం తరువాత తీర్థంలో స్నానం చేసినట్లు శివదర్శనం తరువాతనే శ్రీ వేంకటాచలాన్ని, ఎక్కడం ప్రారంభించినట్లు చెప్పబడింది. పురాణంలో పురాణకర్తలో అప్పటి సమాజంలో నున్న మతాభినివేశాన్ని ఇది చమత్కారంగా సూచిస్తుంది.)

**దారిలో రంగదాసు వైఖానస గోపీనాథుణ్ణి కలిశాడు. ఆయన వేంకటేశ్వర స్వామి వారి పూజకై వేంకటాచలానికి వెళుతున్నాడు.** ఆయనతో కలిసి పన్నెండేళ్ళ రంగదాసు నిర్భయంగా కొండనెక్కి వెళ్ళినాడు. స్వామిపుష్కరిణికి చేరి భక్తితో స్నానంచేశాడు. పుష్కరిణికి దక్షిణ తీరాన ఉన్న అడవిలో **చింతచెట్టు వద్ద కమలపత్రాక్షుడు, నీలమేఘశ్యాముడైన హరిని దర్శించాడు.** ఎండ, గాలి, వాన మొదలైన వానినుండి రక్షణ లేకుండా ఉన్న హరిని, గరుడాళ్వారు తన విప్పారిన ఱెక్కలనే ఆచ్ఛాదనంగా చేసి యుండగా దర్శించాడు. ఆ అద్భుతదర్శనానికి ఆశ్చర్యచకితుడై, అక్కడ ఒక ఉద్యాన వనాన్ని పెంచాలని నిశ్చయించుకున్నాడు. ఆ ఉద్యానవనం నుండి పుష్పాలను ప్రతిదినం స్వామి పూజాకైంకర్యానికి ఉపయోగించాలనుకున్నాడు. **గోపీనాథుడు ప్రతిదినం స్వామి ప్రసాదాన్ని తాను తీసుకొని మిగిలిన భాగాన్ని రంగదాసుకు ఇచ్చేవాడు. రంగదాసు దానినే ఆహారంగా తీసుకొని, భూమిని చదునుచేశాడు. చింతచెట్టు చుట్టూ ఉన్న చెట్లను కొట్టివేసి, శ్రీవేంకటేశ్వరస్వామికి ప్రియమైన చంపకవృక్షాన్ని కాపాడాడు.** శ్రీవేంకటేశ్వర స్వామికి చుట్టూ రాళ్ళతో ప్రాకారాన్ని నిర్మించి పుష్పలతలను వృక్షాలను నాటి పెంచాడు. కొంత కాలానికి అవి పుష్పాలతో నిండిపోయినాయి. ఆ పూవులను కొన్నింటిని విడిగా, మరికొన్నింటిని పుష్పహారాల్లాగా కూర్చి ప్రతిదినం శ్రీ వేంకటేశ్వర స్వామి పూజార్థం, అలంకారం కోసం అర్చకుడైన గోపీనాథునికిచ్చి స్వామి దర్శనంతో అమితమైన ఆనందానుభూతిని పొందేవాడు. రంగదాసు ఇట్లా స్వామిసేవలో డెబ్బై ఏళ్ళు గడిపాడు.

ఒకనాడొక గంధర్వరాజు తన అంతఃపుర స్త్రీ పరివారంతో ఒక దివ్య విమానంలో స్వామిపుష్కరిణికి చేరి జలక్రీడలో ఉండగా రంగదాసు చూశాడు. తదేకంగా చూస్తూ కామావిష్టుడై తన నిత్య కృత్యాన్ని మరిచి పోయాడు. గంధర్వరాజు వెళ్ళిపోగానే తన నిత్య కృత్యమైన పుష్ప కైంకర్యం గుర్తుకు వచ్చింది. సకాలంలో పుష్ప కైంకర్యం చేయలేకపోయినందుకు దుఃఖపడి, స్వామిపుష్కరిణిలో స్నానంచేసి పూవులుకోసి, స్వామి దివ్యనామాన్ని స్మరిస్తూ స్వామి సన్నిధికి వెళ్ళాడు అర్చక గోపీనాథుడు కోపంతో ఆలస్యానికి

కారణమేమిటని ప్రశ్నించాడు. సమయాతీతమైన తరువాత పుష్పాలను తీసుకువచ్చినందులకు బాధను వ్యక్తం చేశాడు. రంగదాసు ప్రత్యుత్తరం లేక మౌనంగా నిల్చున్నాడు.

భగవంతుడు ప్రత్యక్షమై "రంగదాసా! నీ ఇంద్రియనిగ్రహాన్ని పరీక్షించినాను. నీవు ఇంద్రియ వ్యామోహానికి వశుడవైనావు. నీవు ఇంతకాలం చేసిన సేవకు ప్రసన్నుణ్ణయినాను. **నీవు భూమిపై ఒక రాజుగా జన్మించి, నీవీనాడు చూచిన గంధర్వరాజు వలె సకలసంపదలనూ, భోగాలను అనుభవిస్తావు. కాని, నీ మనస్సు సదాభక్తి పూర్ణమై నా కైంకర్యం కోరుతూ ఉంటుంది.** నీవు కామభోగాలకు వశుడవు కాకుండా ఉంటావు. నీవు నాకొక దివ్య మందిరాన్ని నిర్మిస్తావు. నీవు రాళ్ళతో నిర్మించిన ప్రాకారానికి బదులుగా ఉన్నతమైన ప్రాకారాన్ని, బలమైన విమానాన్నీ నిర్మిస్తావు. నీకు శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి. నీకు నేనప్పుడు ముక్తిని ప్రసాదిస్తాను. నీ జీవితాంతం ఎప్పుడు ఇట్లాగే పుష్ప సమర్పణ సేవను చేయి. ఈ విధంగా నా భక్తుల కోరికలను తీర్చివారికి ముక్తిని ప్రసాదిస్తాను. ఇది నా తత్త్వం, నా స్వభావం." అని. రంగదాసు, స్వామి మాటలతో ప్రభావితుడై, జీవితాంతం భక్తితో పుష్పకైంకర్యం చేశాడు. నూరేళ్ళు నిండుగా జీవించి శరీరత్యాగం చేశాడు.

**మరణానంతరం విష్ణు వరప్రసాద ప్రభావంతో చంద్ర వంశంలో సువీర నందినీ రాజదంపతులకు జన్మించాడు, ఆయనకు తొండమాన్ అని పేరు** పెట్టారు. ఆయన ఐదేళ్ళ ప్రాయంనుండే విష్ణుభక్తిపరాయణుడైనాడు. యుక్తవయస్సు రాగానే పాండ్యరాజు కూతురైన పద్మను తన పట్టమహిషిగా చేసుకున్నాడు. స్వయం వరాల్లో తనను వరించిన వివిధ రాజకన్యలను వందమందిని వివాహమాడి సుఖజీవనం చేశాడు.

**నారాయణపురం రాజధానిగా తన రాజ్యాన్ని పాలిస్తూ ఉన్నాడు.** ఒకనాడు తండ్రి ఆజ్ఞగైకొని తన అనుచరులతో వేటకు బయలుదేరి వేంకటాద్రి పరిసరాలకు చేరుకున్నాడు. అక్కడ ఒక ఏనుగుల గుంపును చూచి, ఆశ్చర్యపడుతూ ఆ గుంపు వెంట వెళ్ళుతూ సువర్ణముఖరీ నదిని దాటి **శుకబ్రహ్మర్షి ఆశ్రమం** చేరాడు. ఆయనకు సాష్టాంగపడి, ఆయన ఆజ్ఞగైకొని అడవిలో కొన్ని దారులవెంట ప్రయాణం చేశాడు. అక్కడ రేణుకాదేవి కావాసమైన ఒక పుట్టను చూశాడు. ఆమెను పూజించి పడమర దిశగా ముందుకు సాగాడు. ఆయనకు **'శ్రీనివాస'** అంటూ ఉచ్చరించే ఐదు రంగుల చిలుక కన్పించింది. దాన్ని పట్టుకోవాలనుకున్నాడు, కాని అది వేంకటాద్రికి ఎగసిపోయింది. దాన్ని వెండిస్తూ, వేంకటాద్రిపైకి వెళ్ళుతూ శ్యామాక ధాన్యం పండించే పొలంలో ప్రవేశించాడు. ఆ పొలం యజమాని యైన వనచరుణ్ణి కలిశాడు. ఆ వనచరుడు, ఆయనను రాజుగా గుర్తించి, నమస్కరించి వినయంగా నిల్చున్నాడు. ఆ వనచరుణ్ణి చిలుకను గూర్చి తొండమానుడు ప్రశ్నించాడు. ఆ వనేచరుడిట్లా అన్నాడు, "అది శ్రీనివాసుని పెంపుడు చిలుక. శ్రీదేవి, భూదేవి దాన్ని ప్రేమతో పోషిస్తారు. స్వామిపుష్కరిణీ దక్షిణతీరంలో ఉన్న వారి మందిరంలో ఉంటుంది. దాన్ని పట్టుకోవడం సాధ్యంకాదు. ఇప్పటికే మధ్యాహ్నమైంది. ఈ చెట్టుక్రింది నా కుటీరంలో

సేద తీర్చుకోండి. నేను స్వామిని అర్చించి వస్తాను, కావలిస్తే, మా అబ్బాయితో ఈ ప్రాంతాన్ని చూచిరండి" అని. స్వామిని దర్శించాలన్న కోరిక కలగడంతో "నేను కూడా నీతో స్వామి అర్చనకై రాకూడదా?" అని తొండమానుడు ఆ వనచరుణ్ణి ప్రశ్నించాడు.

**(వరాహపురాణం, ద్వి.భా., అధ్యా.9, శ్లో.51-108, అధ్యా.10)** దీనిలో 51 వ శ్లోకంలో తొండమాన్ నందినీ సువీర రాజ దంపతుల కుమారుడుగా చెప్పబడ్డాడు. భవిష్యపురాణంలో తొండమాన్ తల్లిదండ్రుల గూర్చి చెప్పబడలేదు. ఆకాశరాజు, మిత్రవర్మ పాండ్యరాజు కూతురు సంతానంగా వర్ణింపబడ్డాడు, పద్మావతిని పెంచి వేంకటేశ్వరున కిచ్చి వివాహం చేశాడు. పద్మావతీ వివాహం తరువాత ఆరు మాసాలకు ఆయన గతించగా తొండమండల రాజ్యాధికార విషయంలో వివాదం తలెత్తింది. తొండమాన్ తాను రాజుగారి తమ్ముడైనందున అన్న తరువాత తానే పాలించాలని వాదించగా వసుదానుడు (తరువాత శ్రీనివాసుడని పేరందినాడు) తాను తన తండ్రి తరువాత రాజ్యాధికారం పొందాలని తన తండ్రి పరాక్రమంతో సాధించుకున్న రాజ్యమనీ, తానే ఆ రాజ్యానికి ఉత్తరాధికారినని వాదించాడు. దీని వలన తొండమానుడు మిత్రవర్మ రెండవ కుమారుడని తెలుస్తున్నది. **(భవిష్యపురాణం, అధ్యా.12, శ్లోకం 45-48)** ఈ విధంగా తొండమానుని తల్లిదండ్రుల విషయంలో భేదం కన్పిస్తున్నది. వరాహ భవిష్యపురాణాల్లో భిన్నంగా ఉన్నది.

వనచరుడు తనతో రాజును తీసుకువెళ్ళడానికి అంగీకరించాడు. శ్యామాకధాన్యాన్ని వండిన అన్నంలో తేనెను కలిపి, మామిడాకులలో భద్రపరచి దానిని తీసుకొని తొండమానునితో శ్రీహరి సన్నిధికి బయలు దేరాడు. కొండపై సుదీర్ఘంగా ప్రయాణించి గంటన్నర తరువాత స్వామి పుష్కరిణి తీరానికి చేరారు. ఇద్దరూ స్వామిపుష్కరిణిలో స్నానం చేశారు. ఆ వనచరుడు తొండమానుణ్ణి దక్షిణ తీరంలో ఉన్న చింతచెట్టు వద్దకు తీసుకువెళ్ళి చెట్టు క్రింద పుట్టలో నిల్చుని ఉన్న పురుషోత్తముణ్ణి చూపించాడు. కమలాల వంటి నేత్రాలతో శ్యామవర్ణంతో చతుర్భుజుడై పీతాంబరాన్ని ధరించి, శిరస్సు పై కిరీటంతో, వివిధాభరణాలతో, పుష్పహారాలను ధరించి, శ్రీదేవి భూదేవి రెండువైపులా విరాజిల్లగా శంఖచక్రాది వివిధ దశాయుధాలతో ఆయన మెరుస్తూ కన్పించాడు. శివుని రెండవ కుమారుడైన సుబ్రహ్మణ్య స్వామి ఆయనను త్రిసంధ్యలు అర్చిస్తున్నాడు. ఆయన పాదాలు పుట్టలో ఉన్నందున, మోకాలుపై భాగమే కన్పిస్తున్నది. నిషాదుడు, తొండమానుడు ఆయనకు సాష్టాంగ నమస్కారం చేశారు. తొండమానుడు ఆ అద్భుత దర్శనానికి ముగ్ధుడై ఆనందబాష్పాలతో తదేకంగా చూస్తూ ఉండిపోయినాడు. నిషాదుడు ఆ స్వామికి తేనెతో మిశ్రితమైన శ్యామాక అన్నాన్ని సమర్పించి, దానిలో సగం తనతో వచ్చిన అతిథి తొండమాన్ రాజునకిచ్చి, మిగిలిన సగాన్ని తాను తీసుకొని తన కుటీరానికి తిరిగివచ్చాడు. నిషాదుని కుటీరంలో ఆ రాత్రి విశ్రమించి తెల్లవారి తొండమానుడు తన రాజ్యానికి ప్రయాణ మైనాడు. తన సైన్యంతో రేణుకాదేవీ నివాసానికి చేరుకొని, అక్కడ విశ్రమించి ఆమెకు ధూప దీప నైవేద్య ప్రసాదాలతో మధుర పానీయాలతో, ఆజ్యధూపాలతో,

పరిమళ ద్రవ్యాలతో సమర్చించాడు. ఆ దేవీ సన్నిధిలో పూజిస్తూ నిలబడి ఉండగా, ఆయన పరిజనంలో ఒకనికి పూనకం వచ్చి ఇలా అన్నాడు, "ఓ రాజా! నీ రాజ్యం విస్తరిస్తుంది. నీ పేరున ఒక రాజధాని ఏర్పడుతుంది, నాకు అనుకూలుడవై భక్తుడవైనందున నీరాజ్యాన్ని నిరాటంకంగా పాలిస్తావు. నీకు శ్రీ వేంకటేశ్వర కృపా ప్రసాద సిద్ధి కలుగుతుంది అని.

శ్రీ రేణుకాదేవి ప్రసాదాన్ని పొంది, తొండమానుడు శుకమహర్షి ఆశ్రమానికి చేరాడు. ఆయనకు నమస్కరించి పూజాదికాలు నిర్వర్తించాడు. తిరుచానార్‌లోనున్న పద్మ సరోవర మాహాత్మ్యాన్ని తనకు తెల్పవలసిందిగా ఆయనను కోరినాడు. **శ్రీశుకపురి, తిరుచ్చుకనూర్, అలర్‌మేల్ మంగాపురం, తిరుచానూర్ అనునవి పర్యాయపదాలు.**

శుకబ్రహ్మర్షి ఆయనకిట్లా వివరించినాడు, "పురాతనకాలంలో దూర్వాసముని శాపం కారణంగా శ్రీ లక్ష్మీదేవి, శ్రీ మహావిష్ణువు భూమిపై అవతరించారు. శ్రీ లక్ష్మీదేవి పద్మ సరోవరం వద్ద పదివేల దివ్యవత్సరాలు తపస్సు చేసింది. ఇంద్రాది దేవతలు శ్రీ మహాలక్ష్మిని వెతుకుతూ, ఆమెను శ్రీ విష్ణువుతో కూడా పద్మసరోవరం వద్ద కనుగొన్నారు. దేవతలందరూ ఆమెను ఇట్లా ప్రార్థించినారు, "శ్రీ లక్ష్మీదేవీ! నీవు బ్రహ్మకు, సమస్త జగత్తుకూ మాతృమూర్తివి. సమస్త ఆభరణాలు ధరించి పద్మముఖంతో కరుణా దృష్టితో విలసిల్లే నీకు ప్రణామం. నీవు సముద్రంలో జన్మించి, మాయెడ అనుగ్రహాన్ని కురిపిస్తావు. ఋగ్యజుస్సామాథర్వణాలతో కూడిన బ్రహ్మ విద్యవు నీవే. నీకృప గలిగిన హేతువుచే బ్రహ్మ సృష్టింపకలుగుతున్నాడు రుద్రుడు సంహరింప కలుగుతున్నాడు." అని. ఈ స్తుతికి శ్రీవిష్ణు వక్షఃస్థలంలో నివసిస్తున్న శ్రీలక్ష్మీ వారితో కృపాభరితంగా ఇలా అన్నది, "ఓ దేవతలారా! మీ పరాక్రమంచే మీరు అసురులను జయిస్తారు. మీ లోకానికి మీరు తిరిగి వెళ్ళండి. ఇల్లులేనివాడు, గృహాన్ని కోల్పోయినవాడు, ఈ స్తోత్రాన్ని పఠిస్తే గృహాన్ని పొందుతాడు. ఈ స్తోత్రాన్ని పఠిస్తూ నన్ను బిల్వ పత్రాలతో అర్చించినవాడు ధర్మార్థకామమోక్షాలకు నెలవై పురుషార్థాలను సంపూర్ణంగా అనుభవిస్తాడు. ఈ పద్మసరోవరంలో స్నానమాచరించి విష్ణుపత్నినైన నన్ను ధ్యానిస్తే సంపదలను, దీర్ఘాయువునూ, విద్యను, పుత్ర సంతతిని, సుందర కాయాన్ని, వర్చస్సునూ, భూరి సంపదలను, సుఖాలను, ఆహార సమృద్ధినీ, ముక్తినీ పొందుతాడు. ఇట్లా దేవతలను అనుగ్రహించి శ్రీ మహావిష్ణు సహితంగా గరుడాళ్వారు నారోహించి వైకుంఠానికి శ్రీ మహాలక్ష్మీ పయనమై వెళ్ళింది.

తొండమానునితో శుకమహర్షి ఇంకా ఇలా అన్నాడు, "ఈ పద్మసరోవర మాహాత్మ్యం సంపూర్ణంగా వినదగింది. ఇది మానవుల పాపాలను హరిస్తుంది. దీనిలో స్నానమాచరించినవారు, పద్మసరోవర నామాన్ని ఉచ్చరించినవారు లక్ష్మీ కటాక్షాన్ని పొందుతారు. నీవీ ప్రాంతానికి వచ్చినావు కావున ఇక్కడ స్నానమాచరించి మీ ఇంటికి వెళ్ళి మీ నాయనగారిని కలువు." అని. తొండమానుడు శుకమహర్షి ఆనతి మేరకు పద్మసరోవరంలో స్నాన మాచరించి, ఆయన ఆజ్ఞగైకొని తన నగరానికి తిరిగి వెళ్ళాడు.

## తొండమానుడు తండ్రి నుండి రాజ్యాధికారాన్ని పొందుట

శుకమహర్షి ఆశ్రమం నుండి తొండమానుడు రాగానే తండ్రి యువరాజుగా ఆయనకు పట్టంకట్టాడు. ఆయన సామర్థ్యాన్ని మూడు సంవత్సరాలు పరీక్షించి, పిదప తన స్థానంలో రాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. తరువాత సవీరుడు, ఆయన భార్య నందిని అరణ్యానికి వెళ్ళారు. తొండమానుడు రాజ్యాన్ని పాలించడం ప్రారంభించాడు. ఆ సమయంలో వేంకటాద్రిపై ఒక నిషాదుడు శ్యామాక ధాన్యాన్ని పండిస్తూ ఉన్నాడు. కోతకు వచ్చిన పంటను వరాహం భక్షిస్తున్నట్లు, పాదముద్రల వలన తెలుసుకున్నాడు. విల్లును, బాణాలను ధరించి ఆ వరాహాన్ని నిరోధించాలనుకున్నాడు. చూస్తుండగానే ఒక తేజోమయమైన వరాహం క్షేత్రంలో తిరుగుతూ కన్పించింది. కోపంతో ఆ వరాహాన్ని బాణాలతో కొట్టాలని అరుస్తూ వెళ్ళాడు. కాని ఆ వరాహం వేగంగా వచ్చిన దారినే వెళ్ళి ఒక పుట్టలో ప్రవేశించింది. కోపం చల్లారని నిషాదుడు ఆ పుట్టను గునపంతో త్రవ్వడం ప్రారంభించాడు. శ్రీవరాహ రూపాన్ని ధరించిన భగవంతుడు ఆ పుట్టలోనుండి బైటకు రాగానే నిషాదుడు మూర్ఛిల్లి నేలపై పడిపోయినాడు. ఆ నిషాదుని కుమారుడు తన తండ్రి తప్పిదాన్ని మన్నింపవలసిందిగా వరాహాన్ని వేడుకున్నాడు. వరాహం నిషాదుణ్ణి ఆవహించి, ఈ విధంగా పలికింది, "నేను వరాహదేవుణ్ణి నేనీ పుట్టలోనే ఎప్పుడూ వసిస్తాను. తొండమానుని వద్దకు వెళ్ళి నా ఆదేశంగా ఇట్లా చెప్పండి. "నన్నీ స్థలంపైనే ప్రతిష్ఠించి పూజించాలి. సమృద్ధిగా నల్లగోవు పాలతో రాజు స్నానాన్ని నిర్వహించాలి. అప్పుడు భూమిలో ఒక నల్ల రాతిఫలకం కన్పిస్తుంది. దాన్ని వరాహాకృతితో చెక్కి విగ్రహాన్ని సిద్ధం చేయాలి ఆ విగ్రహానికి ఎడమ తొడపై భూదేవిని చెక్కాలి. ఆ విగ్రహాన్ని విధ్యుక్తంగా పవిత్రం చేసి, వైదిక క్రియాకలాపాన్ని నిర్వహించి ప్రతిష్ఠించాలి. ప్రతిదినం రెండుమార్లు అర్చన చేయాలి. ఈ పని పూర్తియైన పిదప శ్రీనివాసుని విషయంలోనూ ఈ క్రియను నిర్వహించాలి. నాకు దక్షిణదిశలో ఒక చెట్టుక్రిందనున్న పుట్ట బొరియలో శ్రీనివాసుడు నిలబడి ఉన్నాడు. మోకాలు వరకు పుట్టలో దిగబడి ఉన్నాడు. కపిలగోవుపాలతో ఆయన పాదపీఠం పుట్టలో నుండి కన్పించే వరకు ఆయనకు స్నానం కావించాలి. ప్రతిదినం అన్న ప్రసాదాల నైవేద్యం పెట్టాలి. మాయిరువురికీ ప్రాకారాలను నిర్మించాలి. తొండమానుడే ఈ కార్యక్రమాన్ని పూర్తిగా నిర్వహించాలి". అని. ఇట్లా ఆదేశించి, శ్రీ వరాహం నిషాదుని శరీరం నుండి నిర్గమించింది. ఆ నిషాదుడు మూర్ఛనుండి మేల్కొన్నాడు. కుమారుడు చెప్పగా జరిగిన వృత్తాంతాన్ని సంపూర్ణంగా విన్నాడు. శ్రీ వరాహస్వామి ఆదేశాన్ని విన్నాడు. వసువు అను పేరు కల్గిన ఆ నిషాదుడు తన పరివారంతో, పుత్రునితో తొండమాన్ రాజధానికి వెళ్ళాడు. పిమ్మట తొండమాన్ నృపతి తన మంత్రులను పిలిచి వృత్తాంతాన్ని వివరంగా తెల్పాడు. వేంకటాచలానికి మర్నాడే వెళ్ళే ఏర్పాట్లు చేయమని ఆదేశించాడు. పశుపాలకులను రప్పించి నల్ల గోవులను, కపిల గోవులను, తన మందలో నున్న వానిని, వేంకటాద్రికి తీసుకొని వెళ్ళి సిద్ధంగా ఉంచాలని ఆజ్ఞచేశాడు. అంతఃపుర రాణివాస స్త్రీలకు, తన రాణులకు వేంకటాద్రి ప్రయాణ శుభవార్తను తెలిపి, వారినీ తనతో రమ్మని చెప్పాడు.

**భగవంతుణ్ణి స్మరిస్తూ ఆ రాత్రి నిద్రించాడు. శ్రీనివాసుడు ఆయనకు స్వప్నంలో కన్పడి, కొండలో నున్న ఒక సొరంగం దారిని చూపించి, ఆ సొరంగానికి రాజధానికి మధ్యనున్న మార్గాన్ని నిర్దేశించాడు.** అది పొదలతో చెట్లతో నిండి ఉన్నది. తెల్లవారగానే రాజు తన గుర్రంపై బయలుదేరి మార్గంలో పొదలను చెట్లనూ నెమ్మదిగా దాటి కొండలోనున్న సొరంగం ముఖద్వారాన్ని చేరాడు. ఆ ముఖద్వారం ముందే ఒక నగరాన్ని నిర్మించాడు. ఆ నగరాన్ని తన రాజప్రాసాదానికి అనుసంధానం చేశాడు. దాని చుట్టూ ప్రాకారాన్ని నిర్మించాడు. ఆ క్రొత్త నగరంలో నివసిస్తూ వరాహస్వామి ఆదేశించిన పనిని పరిపూర్ణం చేయాలని సంకల్పించాడు. **కొండపై పొదలను, చెట్లను తొలగిస్తూ ఉన్న సమయాన భగవంతుడు ప్రత్యక్షమై తనకు ప్రియమైన చింతచెట్టునూ, శ్రీ లక్ష్మీదేవికి ప్రియమైన చంపక వృక్షాన్ని తొలగించవద్దని ఆదేశించాడు.** ద్వార గోపురంతో ప్రాకారాన్ని మాత్రమే నిర్మించమని, ఆలయంపై విమానాన్ని, తొండమాన్ వారసుల్లో ఒకడైన నారాయణ నిర్మిస్తాడని, బంగారంతో తాపడం చేస్తాడని చెప్పాడు. అది నారాయణుడు చేయవలసిన కార్యం అని పలికాడు. భగవంతుని ఆదేశానుసారం తొండమానుడు ప్రాకారాన్ని ద్వారబంధాన్ని దానిపై గోపురాన్ని నిర్మించాడు. నిత్య పూజాది కాలకు ఏర్పాటు చేశాడు. **సొరంగం మార్గం ద్వారా ప్రతిదినం శ్రీస్వామిని దర్శించేవాడు. తన రాజ్యాన్ని న్యాయంగా పాలిస్తూ** రాజభోగాలను అనుభవిస్తూ తన జీవితాన్ని గడిపాడు.

## ఉత్తరప్రాంతానికి వీరశర్మ తీర్థయాత్ర
## (వరాహపురాణం ద్వి.భా., అధ్యా.10, శ్లో.50-78)

తొండమానుడు రాజ్యాన్ని పాలిస్తుండగా దక్షిణదేశానికి చెందిన బ్రాహ్మణుడొకడు గంగాతీరానికి తీర్థయాత్రను ప్రారంభించాడు. కొంత దూరం ప్రయాణించిన తరువాత తన భార్య గర్భవతి అని తెలుసుకున్నాడు. ఆమె సుదీర్ఘమైన ప్రయాణాన్ని చేయజాలదని నిశ్చయించుకొని, ఆమెను ఒక సురక్షితమైన స్థానంలో నివాసాన్ని కల్పించి, తాను తీర్థయాత్రను పూర్తిచేయాలనుకున్నాడు. అందుకు రాజైన తొండమానుణ్ణి ఆశ్రయించాడు. తొండమానుడు ఆ బాధ్యతను స్వీకరించాడు. గర్భవతియైన విప్ర వనితను తన అంతః పురం కోరీలో ఉంచి, ఆరుమాసాలకు సరిపడే సామగ్రిని సమకూర్చాడు. ఆమె బాగోగులను విచారించడానికి కొందరు పరిచారికలను నియమించాడు. తరువాత కొంత కాలానికి ఆమె విషయాన్నే మరచి పోయాడు.

ఆ బ్రాహ్మణుడు తన యాత్రను రెండు సంవత్సరాల కాలంలో పూర్తిచేసుకొని రాజు వద్దకు వచ్చాడు. రాజుకు అప్పుడు ఆ విప్రవనిత గుర్తుకు వచ్చింది. ఆమె కుశల వార్తలను ప్రస్తావించకుండ, ఆ బ్రాహ్మణుణ్ణి స్వాగతించి సత్కరించాడు. ఆమె ఉన్న సౌధ ప్రాంతానికి పరుగు పరుగున వెళ్ళాడు. ఆమె ఆహారం లేక చిక్కి శల్యమై ప్రాణాలను కోల్పోయిన దృశ్యాన్ని చూచిన వారుకాని, ఆహార పదార్థాల నిచ్చిన వారుకాని లేకపోవడంతో ఆమె అసువులు బాసింది. వెంటనే తొండమానుడు గుహలోనుండి శ్రీ నరసింహ సన్నిధికి చేరి, అక్కడ నుండి శ్రీనివాసుని దేవాలయానికి వెళ్ళాడు. శ్రీనివాసుడు శ్రీదేవీ భూదేవీ సహితుడై విశ్రాంతి ననుభవిస్తున్నాడు. తన అజాగ్రత్త హేతువుగా బ్రాహ్మణ స్త్రీ మరణించిన ఉదంతాన్ని స్వామికి నివేదించాడు. శ్రీస్వామి రాజునోదార్చి, బ్రాహ్మణ స్త్రీ శవాన్ని అలంకరించి పల్లకిపై దేవాలయానికి తూర్పు దిశగా ఉన్న

అస్థి తీర్థానికి తీసుకువెళ్ళి ఆ తీర్థజలంలో నిమజ్జనం చేస్తే ఆమె జీవిస్తుందని చెప్పి, ఆమెను ఆమె భర్తకు అప్పగించవచ్చునని ఆదేశించాడు. రాజు తన రాజమందిరానికి వెళ్ళి ఆ బ్రాహ్మణ వనిత శవాన్ని పల్లకిలో నుంచి తన రాణులు పల్లకీల పై వెంటరాగా శ్రీవేంకటాద్రిపైనున్న అస్థితీర్థానికి తీసుకువెళ్ళాడు. అందరూ ఆ తీర్థంలో స్నానంచేశారు. శవాన్ని ఆ నీళ్ళలో నిమజ్జనం చేయగానే ప్రాణం వచ్చింది. ఆరోగ్యంగా సజీవంగా నీళ్ళలోనుండి బైటికి వచ్చి తన పతిదేవుణ్ణి చేరింది. వారందరూ రాజమందిరానికి తిరిగి వెళ్ళినారు. బ్రాహ్మణ దంపతులను సత్కరించి వీడ్కోలు చేసినారు. శ్రీనివాసుడు తొండమానుణ్ణి వేళకాని వేళ తన సన్నిధికి రాకూడదని ఆదేశించాడు. "నా నివేదన అనంతరం స్వర్ణ కమలపుష్పాలతో వచ్చి నన్ను అర్చించు, నీ కోరికలన్నీ నెరవేరుతాయి" అని ఆజ్ఞాపించాడు. అప్పటి నుండి రాజు అట్లాగే అర్చించేవాడు.

ఒకనాడు తొండమానునికి స్వామి పాదుకలపై తాను సమర్పించిన స్వర్ణ కమలపుష్పాలలో మట్టితో చేయబడిన ఒక తులసీదళం కన్పించింది. అది అక్కడికి ఎట్లా వచ్చిందో ఆయనకు బోధపడలేదు. ఆ రహస్యాన్ని తెల్పవలసిందిగా స్వామిని ప్రార్థించాడు. అప్పుడు స్వామి ఇలా అన్నాడు, "రాజా! నా భక్తుడు, కుర్వ గ్రామంలో ఉండే కుమ్మరి తన ఇంట్లో నన్ను అర్చిస్తాడు. నేను అర్చనను స్వీకరిస్తాను" అని. రాజు ఆ కుమ్మరి ఇంటికి ఆయనను చూడటానికి వెళ్ళాడు.

రాజు రాకకు కుమ్మరి ఆశ్చర్యపడ్డాడు. రాజుకు నమస్కరించి, ఆసనాన్ని సమర్పించాడు. తొండమానుడు కుమ్మరి భక్తుణ్ణి పూజావిధానం తెల్పమని అడిగాడు. ఆ కుమ్మరి "నేను కుమ్మరిని, నాకు అర్చన అనగా నేమో తెలియదు. నేను అర్చన చేస్తానని మీతో ఎవరు చెప్పారు" అని ప్రశ్నించాడు. రాజు, శ్రీనివాసుడే తనకు స్వయంగా తెల్పినాడనీ అందుకే చూడటానికి వచ్చినానని తెల్పాడు.

అప్పుడు కుమ్మరి భక్తునికి శ్రీనివాసుని అనుగ్రహ వచనాలు గుర్తుకు వచ్చినాయి. "నీ పూజ విశ్రుతమై, తొండమాన్ రాజు నిన్ను దర్శించి నీతో మాటాడుతాడు. అప్పుడు నీకు ముక్తి లభిస్తుంది" అని. ఈ విషయాన్ని తొండమాన్ రాజుకు చెప్పాడు. వెంటనే **భీముడనే పేరున్న ఆ కుమ్మరి భక్తునికి ఒక దివ్య విమానం కన్పించింది. ఆ విమానంలో భగవంతుడు ఆసీనుడై ఉన్నాడు.** కుమ్మరి భక్తుడు ఆయన భార్య ఒకేసారి ప్రాణాలను వదిలినారు. విమానంలోకి ప్రవేశించారు. రాజు చూస్తూ ఉండగా విష్ణుపదమైన పరమపదానికి వైకుంఠానికి చేరినారు.

ఆ అద్భుత దృశ్యం తొండమానుణ్ణి ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. ఆయన తన రాజధానికి వెళ్ళాడు. తన పుత్రుడైన శ్రీనివాసునికి రాజ్యాన్ని అప్పగించి, ఒక ఏకాంత ప్రదేశంలో తీవ్రమైన తపస్సును చేశాడు. ఆయన తపస్సుకు మెచ్చి భగవంతుడు శ్రీదేవీ భూదేవీ సహితుడై గరుడారూఢుడై తొండమానునికి ప్రత్యక్షమై, ఇష్టమైన వరాన్ని కోరుకొమ్మన్నాడు. అప్పుడు రాజు స్వామితో అన్నాడు, "ఓ దేవా! నీ కృపాలబ్ధియే నన్ను కృతార్థుణ్ణి చేసింది. పునర్జన్మ బాధలనుండి మృతినుండి నన్ను విముక్తుణ్ణి చేసి స్వర్గ లోకంలో నాకు స్థానాన్ని ప్రసాదించు" మని, భగవంతునికి వినయంగా సాష్టాంగ ప్రణతి చేశాడు. వెంటనే అక్కడికి ఒక విమానం వచ్చింది. తొండమానుడు దానిలో ఆసీనుడు కాగానే స్వర్గం వైపు వెళ్ళింది.

* * *

## అధ్యాయం-10

### మిత్రవర్మ కుమారుడుగా ఆకాశరాజు జన్మించుట

### (వరాహపురాణం ద్వి.భా., అధ్యాయం-3, శ్లోకం 12-38)

భూదేవితో శ్రీవరాహస్వామి ఈ విధంగా చెప్పాడు. 28వ **చతుర్యుగం పూర్తి కావస్తున్నది. మహాభారతయుద్ధం సమాప్తం కాగానే, కలియుగం ప్రారంభమైంది.** కలియుగంలో విక్రమార్క శకంలో శూద్రకుడు మొదలైన రాజులు ఈ భూమిని పాలించి స్వర్గస్థులైనారు. వారెవరూ నన్నెరుగరు. **చంద్రరాజ వంశంలో మిత్రవర్మ జన్మించాడు. ఆయన మహారథుడై నారాయణపురం రాజధానిగా తొండమండల ప్రాంతాన్ని న్యాయంగా పాలించాడు.** పాండ్యరాజు కూతురును వివాహమాడి, ఆకాశరాజు అనే పుత్రుణ్ణి పొందాడు. ఆకాశరాజు ధరణీదేవియను శకయువరాణిని పెళ్ళాడాడు. ఆయనకు యుక్త వయస్సు రాగానే మిత్రవర్మ తన రాజ్యాన్ని ఆయనకు అప్పగించి తన భార్యతో కలిసి వేంకటాద్రికి వెళ్ళాడు. అక్కడ తపశ్చర్య చేశాడు. ఆకాశరాజు చక్రవర్తి పదాన్ని పొందాడు.

ఆకాశరాజునకు చాలాకాలం వరకు సంతానం కలుగనందున, పుత్రప్రాప్తికై ఒక యజ్ఞాన్ని చేయసంకల్పించాడు అందుకై ఆరణి నదీతీర భూమిని బంగారు నాగలితో దున్ని యజ్ఞ విధికి అవసరమైన నవధాన్యాలను పండించాలనుకున్నాడు. బీజావాపం చేసే సమయంలో కమలపుష్పాల పొత్తిళ్ళలో బంగారు వర్ణంలో ప్రకాశిస్తున్న ఒక స్త్రీ శిశువు కన్పించింది. ఆకాశరాజు ఆశ్చర్యంతో ఆ శిశువునెత్తుకొని ఆనందబాష్పాలతో "నా శిశువే. భగవత్కృప వలన నాకు అనుగ్రహింపబడింది." అని ఆనందించాడు. "ఓ రాజా! ఆమె నీ శిశువే. నీవు జాగ్రత్తగా పెంచుకో" అని దేవవాణి విన్పించింది. ఆనందంగా ఆ శిశువును తన భార్యయైన ధరణీదేవి కప్పగించాడు. పద్మపుష్పాల పొత్తిళ్ళలో లభించినందున ఆమెకు పద్మిని అని నామకరణం చేశారు.

కొంత కాలానికి రాణి గర్భవతియై ఒక కుమారుణ్ణి కన్నది. పుత్రుడు జన్మించిన శుభావసరాన అర్హులైనవారికి స్వర్ణాన్ని గోవులను బహూకరించాడు. 12వ దినమున జాతకర్మ చేసి ఆ బాలునికి వసుదానుడని నామకరణం చేశాడు.

పద్మిని యువతియై తన చెలికత్తెలతో రాజోద్యానంలో పచారు చేస్తుండగా నారదుడు ఆమెను చూశాడు. ఆమె అతిలోక సౌందర్యానికి చకితుడైనాడు. ఆమెను సమీపించి ఆమె తల్లిదండ్రుల గూర్చి ప్రశ్నించాడు. ఆశ్చర్యపడుతూ ఆమె అరచేతిని చూపించమన్నాడు. ఆమె భవిష్యత్తును తెలుపుతాను అన్నాడు. ఆమె అరచేతిలో ఉన్న రేఖల్ని పరిశీలించి, "నీ హస్త రేఖలు అద్భుతంగా ఆశ్చర్యజనకంగా ఉన్నాయి. నీ ముఖ వర్చస్సు, కాంతి నీవు శ్రీ మహావిష్ణువునకు పత్నిగా కావలసిన అంశాన్ని సూచిస్తున్నాయి. నీవు క్షీరసాగరంలో ఉద్భవించిన శ్రీ మహాలక్ష్మివి". అని ఆమె భవిష్యత్తును తెల్పినారదుడు అదృశ్యుడైనాడు. పద్మిని, ఆమె చెలికత్తెలు ఉద్యానవనంలో పూవులు కోస్తూఉన్నారు. అప్పుడే వారొక మత్త గజాన్ని చూశారు. అది కరిణీ

సమూహం మధ్యలో ఉన్నది. తోటలోనికి ప్రవేశిస్తున్నది. పద్మిని ఆమె చెలికత్తెలు భయంతో ఒక చెట్టు వెనక దాగుకున్నారు. అదే సమయంలో వారొక ఆశ్వికుణ్ణి చూశారు. ఆయనకు చేతిలో మణిఖచితమైన శార్ఙధనువు ఉన్నది. అది స్వర్ణమయంగా ఉన్నది. ఆయన యజ్ఞోపవీతధారియై పీతాంబరాన్ని ధరించి ఉన్నాడు. మత్తగజాన్ని వెంటాడుతూ ఆ పుష్పవనంలో ప్రవేశించాడు. ఆ మత్తగజం ఆయనను చూడగానే తన సమూహంతో పరుగెత్తి వెళ్ళిపోయింది. ఆశ్వికుడు ఆ యువతులను "ఇక్కడికి ఒక ఈహామృగం వచ్చిందా?" అని ప్రశ్నించాడు. వారు అట్లాంటి మృగమేదీ రాలేదని చెప్పి, వేటగాండ్రు ప్రవేశించడానికి వీలులేని రాజోద్యానవనానికి ఎందుకు ప్రవేశించినావని ఆశ్వికుణ్ణి ప్రశ్నించారు.

ఆశ్వికుడు గుర్రంపై నుండి దిగి, వారిని గూర్చి ముఖ్యంగా అద్భుత సౌందర్యవతియైన ఆ యువతిని గూర్చి, వివరాలను అడిగాడు. ఆమె ఆ ప్రాంతాన్ని పాలించే ఆకాశరాజు కూతురనీ, తాము ఆమె చెలికత్తెలమనీ చెప్పారు. ఆశ్వికుని పేరు, నివాసం, తల్లిదండ్రులు మొదలైన వివరాలను అడిగారు. ఆయన ఇట్లా వివరించాడు, "నేను సూర్య వంశానికి చెందిన వాణ్ణి. నాకెన్నో పేర్లున్నాయి. అవి మనుష్యులను పవిత్రులను చేస్తాయి. ఐనా నా శరీర కాంతి ననుసరించి నాపేరు కృష్ణుడుగా విఖ్యాతమైంది. శత్రుభీకరమైన చక్రాన్ని వారి దర్పాన్ని అణగించే శంఖాన్ని, దివ్యజగత్తులో సాటిలేని ధనుస్సునూ ధరించిన అప్రతిమాన యోధుణ్ణి. నేను వేంకటాద్రిపై ఉంటాను. మృగయావినోదార్థం నా సహచరులతో తిరుగుతూ ఈ వనానికి ఈహామృగాన్ని వెతుకుతూ వచ్చాను. మిమ్మల్ని కాకతాళీయంగా కలుసుకున్నాను. రత్నం వంటి ఈ కన్యను చూచి, మీ వద్దకు వచ్చాను. నా మనస్సు ఆమెపై లగ్నమైంది. నేనామెను వివాహమాడవచ్చునా? అని అడుగుదామనుకున్నాను" అని ముగించాడు. ఆయన ఇట్లా వివాహ ప్రసక్తి తేవడం ఆ యువతులకు నచ్చలేదు. "రాజుగారికీ విషయం తెలిస్తే, పర్యవసానం భయంకరంగా ఉంటుందని, వెంటనే ఆ ప్రాంతాన్ని వదిలి వెళ్ళ వలసిందిగా వారు ఆశ్వికునికి చెప్పారు. ఆశ్వికుడు వెంటనే ఆశ్వాన్ని అధిరోహించి తన అనుచరులతో వేంకటాద్రికి చేరుకున్నాడు. ఆవాసం లోనికి ప్రవేశించే ముందు గుర్రం దిగి, అనుచరులైన దేవతలను వీడ్కొల్పి మణిమంటపానికి వెళ్ళి ఐదు అంతస్తుల భవనాన్ని మెట్లపైనెక్కి మణిఖచిత మైన పర్యంకంపై పడుకొని, పద్మినిని ఆమె అపూర్వ సౌందర్యాన్ని మననం చేసుకొని ఆమె క్షీరసముద్రం నుండి ఉద్భవించిన శ్రీలక్ష్మియే అని నిశ్చయించు కున్నాడు.

వకుళమాలిక వివిధ రుచికరమైన వంటలతో సిద్ధమైన మధ్యాహ్న భోజనాన్ని కొని వచ్చింది. కాని, దానిని ఆయన చూడనేలేదు. ఆయన అన్యమనస్కతకు కారణమేమిటని వకుళమాలిక ప్రశ్నించింది. ఆ ప్రశ్నకు సమాధానం తన వ్యవహారాన్ని సూటిగా చెప్పక, చుట్టు త్రిప్పినట్లుగా ఇట్లా చెప్పాడు, "త్రేతా యుగంలో దేవతల ప్రార్థన మేరకు రాక్షస సంహారానికై దశరథాత్మజుడుగ రాముడుగా అవతరించినాను. వేదవతి పేరుగల ఒక కాంత, లక్ష్మీ అవతారమైన నా ధర్మపత్ని సీతకు చాలా సహాయపడింది. సీత జనకమహారాజు పెంపుడు పుత్రిక. నేను సీతాలక్ష్మణులతో కలసి అరణ్యవాసం చేస్తుండగా మారీచుడు బంగారు లేడి రూపంతో మా ఆశ్రమ సమీపానికి వచ్చాడు. ఆ లేడిని పట్టుకోవాలని సీత నన్ను కోరింది.

దాన్ని పట్టుకోవడానికి నేను ప్రయత్నించాను, కాని, అది దూరంగా పరుగెత్తి వెళ్ళింది. నేను దానిని వెంబడించి దానిపై బాణప్రయోగం చేశాను. అప్పుడు ఆ రాక్షస మారీచుడు "లక్ష్మణా! నేను హతుణ్ణైనాను" అని అరిచాడు. సీత నేనే ప్రమాద స్థితిలోనున్నానని భావించి, నేను సాహాయ్యం కోరినాననుకొని లక్ష్మణుణ్ణి బలవంతం చేసి నాకు సహాయంగా పంపింది. సీత ఒక్కతే ఆశ్రమంలో ఉండిపోయింది. రావణుడు సన్యాసి రూపంలో భిక్షనడుగుతూ ఆశ్రమానికి వచ్చాడు. వాడు ఆమెను లంకకు తీసుకువెళ్ళాలని నిశ్చయించాడు. **ఆ విషయాన్ని ముందే పసిగట్టిన అగ్నిదేవుడా ఆమెను పాతాళ లోకానికి తీసుకువెళ్ళి తన పత్నియైన స్వాహా దేవికి అప్పగించాడు. ఛాయా సీతను ఆశ్రమంలో నిలిపాడు. ఈ ఛాయా సీతనే రావణుడు లంకా నగరానికి తీసుకువెళ్ళాడు. ఆమెను అక్కడ బందీ చేసి ఎన్నో బాధలకు గురిచేశాడు. ఆమెయే వేదవతి. రావణుణ్ణి సంహరించి ఆమెను నేను రావణుని చెర నుండి విడుదల చేయగానే అమె అగ్ని ప్రవేశం చేసింది. అప్పుడు అగ్ని దేవుడు సీతను పాతాళలోకం నుండి తీసుకువచ్చాడు. వేదవతిని కూడా తీసుకువచ్చాడు. అగ్నిదేవుడు నాతో "ఈ వేదవతి సీత కోసమై లంకలో రావణుడు గురిచేసిన బాధలను అనుభవించింది. ఆమెకు నీవు సంతోషంగా ఒక వరాన్ని ఇవ్వాలి" అని అన్నాడు. సీత కూడా "పతి దేవా! ఆమె నా కోసం ఛాయా సీతగా ఎన్నో బాధలను అనుభవించింది. ఆమెపై సానుభూతితో ఏదైనా ఉపకారం చేయాలి. ఆమెను వివాహమాడటమే ఉపకారం అని పలికింది. నేను ఆమెతో అన్నాను, "ఆమె బ్రహ్మలోకంలో ఇరవై ఎనిమిదవ కలియుగం వచ్చే వరకు నివాసముంటుంది. అప్పుడు నేను శ్రీ వేంకటేశ్వర రూపంతో అవతరిస్తాను. ఆమె ఆకాశరాజుకు లభించిన కూతురు పద్మావతిగా జన్మిస్తుంది. నేనామెను వివాహమాడుతాను"** అని. "పద్మంలాగా ఆకృతి కలిగిన పద్మావతి వేదవతియే. **నారాయణపురం ఉద్యానవనంలో ఆమె చెలికత్తెలతో ఉండగా చూశాను.** ఆమె సౌందర్యానికి ముగ్ధుణ్ణైనాను. ఆమె లేకుండా నేను జీవించలేను. నీవు వెంటనే వెళ్ళి మా వివాహం సంపన్నమయ్యేలా చూడాలి", అన్నాడు. వకుళమాలిక ఒప్పుకున్నది. ఆ ప్రదేశాన్ని, ఆ ప్రదేశానికి చేరవలసిన మార్గాన్ని తెలుసుకున్నది. శ్రీ వేంకటేశ్వరుడు ఆమెతో ఇట్లా చెప్పాడు, **"ఇక్కడి నుండి నరసింహ గుహద్వారా సువర్ణముఖీ నదీ తీరానికి చేరు.** అగస్త్యేశ్వర దేవాలయాన్ని చుట్టుకొని **అగస్త్యాశ్రమం ఉంటుంది. అగస్త్యుడర్చించిన లింగం ఉంటుంది.** అక్కడ ఆ లింగాన్ని పూజించి కొంత దూరం నదీ తీరం వెంట వెళ్ళితే **శుకబ్రహ్మాశ్రమం** ఉంటుంది. అక్కడే పద్మాలతో నిండిన పద్మ సరోవరం ఉంటుంది. దానిలో స్నానం చేసి, అక్కడే తపమాచరిస్తున్న **ఛాయాశుకుణ్ణి దర్శించు.** ఛాయాశుకుడు అర్చించిన కృష్ణబలరాములను పూజించు. నీకు జయం కలిగేటట్లు వారు దీవిస్తారు. అక్కడ నదిని దాటి ఉద్యానాలెన్నో ఉన్న ఆరణి నదిని చూడు, అక్కడి పర్ణ కుటీరంలో విశ్రమించు. ఆ స్థలం నుండి నీకు **నారాయణపురి** కన్పిస్తుంది. అది ఉత్తర దిక్కులో నదీ పరివృతమై ఉంటుంది. ఆ నగరానికి వెళ్ళి, నీ నైపుణ్యంతో కార్యాన్ని సాధించు". ఆమెకీ విషయం చెప్పి, శ్రీలక్ష్మీతో విశ్రమించాడు.

**వకుళమాలిక ఒక అరుణాశ్వాన్ని అధిరోహించి చెప్పిన మార్గాన్ని అనుసరించి ఆరణీ నదీ పశ్చిమ తీరానికి చేరింది.** అక్కడ స్నానం చేసి అగస్త్యేశ్వరుణ్ణి అర్చించాలనుకొని, కొంతసేపు విశ్రమించింది. ఆ

సమయంలో ఆ దేవాలయానికి కొందరు యువతులు వచ్చారు. వకుళమాలిక వారిని కలిసి వివరాలను తెలుసుకున్నది. వాళ్ళు ఆకాశరాజు ప్రాసాదం నుండి వచ్చినారని, పద్మావతీదేవి చెలికత్తెలని, పద్మావతీదేవి ఒక అద్భుత వ్యక్తిని ప్రేమించి విరహబాధను అనుభవిస్తున్నదని, ఆ అద్భుత వ్యక్తి వాళ్ళకు ఉద్యానవనంలో పెద్ద గుర్రంపై ఆసీనుడై కన్పించినాడని, పద్మావతి విరహతాపాన్ని ఉపశమింప చేయడానికి జ్యోతిష్కుల నిర్ణయం ప్రకారం అగస్త్యలింగాభిషేకం చేయడానికి అవసరమైన సామగ్రితో వచ్చినారని తెలుసుకున్నది. వాళ్ళు కూడా ఆమె అక్కడికి వచ్చిన కారణమేమిటో ఆమెను తెలుపగోరినారు. ఆమె వారితో తాను ఒక ముఖ్యమైన విషయమై రాణిని కలుసుకోవలసి ఉన్నదని, ఆ విషయాన్ని రాణికి తెల్పవలసిందిగా కోరింది. వారు ఒప్పుకొని, అభిషేకం కాగానే వకుళమాలికను రాణిగారి వద్దకు తీసుకువెళ్ళారు.

ఇదిలా ఉండగా ఒక జ్యోతిష్కుడు రాజమందిరానికి వచ్చాడు. రాణితో అన్నాడు, “నీ కూతురు పద్మావతికి ఏ జబ్బు లేదు. వేంకటాద్రిపై నెలకొనివున్న వేంకటేశ్వరుని పై అమె మనస్సు లగ్నమైంది. ఆయన కూడా ఆమె పై మనసుపడి ఉన్నాడు. ఆయన మీ వద్దకు రాయబారిగా ఒక ఉత్తమురాలిని పంపించాడు. మీరు ఈ సంబంధాన్ని ఒప్పుకోండి ఆమె శ్రీ వేంకటేశ్వరునితో, శ్రీ లక్ష్మీదేవికి సవతిగా, సుఖంగా ఉంటుంది”. అని.

ధరణీదేవి విరహతప్తురాలైన తన కూతురు వద్దకు వెళ్ళి ఆమెకు ఉపశమనం కావాలంటే ఏమి చేయవలెనని అడిగింది. ఆమె చెప్పింది, “అమ్మా! నేను కోరేదొక్కటే. అది కన్నులకు ప్రీతికరంగా ఉంటుంది. ధార్మికులైన వారి మనస్సులను అది ఆకర్షిస్తుంది. దానిని చూడటానికే బ్రహ్మాదులు తీవ్రమైన తపస్సు చేస్తారు. ఒక విశిష్ట శక్తిగా అది సమస్త విశ్వాన్ని ఆవరించి ఉంటుంది. దాన్ని దైవభక్తులే చూడగలుగుతారు. అది కాంతులన్నిటికీ మూలభూతమైన కాంతి. దేవతల అందరి కంటె దివ్యమైంది. అది లభిస్తే మరేలోపం ఉండదు. దానితో అన్ని కోరికలీడేరుతాయి. అమ్మా! ఆ వస్తువును నాకై వెతికి తీసుకురా.”

కూతురు పలుకులు రాణికి ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఆ వస్తువును కనుకోగల భక్తుల గుణాలని చెప్పమని అడిగింది. సమాధానంగా పద్మావతి వైష్ణవుల తిరుమేనిపై ఉండే గుర్తులను చెప్పింది. “ద్వాదశ స్థలాల్లో ఊర్ధ్వపుండ్రాలను ధరించి ఉంటారు. పంచాయుధ చిహ్నాలని కలిగి ఉంటారు. భుజాలపై శంఖచక్ర చిహ్నాల తాపముద్రలను కలిగి ఉంటారు. శార్ఙాన్ని శంఖాన్ని శిరస్సుపై, గదను నొసటిపై, ఖడ్గాన్ని వక్షః స్థలంపై బాహిర చిహ్నాలుగా ధరిస్తారు. సత్యము, సౌశీల్యం, దయ మొదలైన ఉత్తమ గుణాలతో నిండి ఉంటారు. వేద పారాయణం చేస్తూ, వైదిక కర్మలను చేస్తూ ఉంటారు. వాళ్ళే విష్ణు భక్తులు. శంఖచక్రాల తప్త ముద్రలను మాత్రమే భుజాలపై ధరించిన వారిని వైష్ణవులంటారు. వారి ధార్మిక ప్రవృత్తి చేత వారు బ్రహ్మజ్ఞానాన్ని పొందుతారు. అట్లాంటి అనుభూతి పొందాలని నా మనస్సు తీవ్రంగా కోరుతున్నది. నీలమేఘశ్యామ శరీరుడైన విష్ణువునే ధ్యానిస్తాను, విష్ణువు కంటె ఇతరమైనదేదీ నాకవసరంలేదు. ఆ స్మరణతోనే నేను జీవించి ఉన్నాను. హరి, అచ్యుత నామోచ్చారణమేచేస్తూ ఉంటాను. ఆ నామోచ్చారణమే నన్ను జీవింపచేస్తున్నది. ఆ వస్తువు నాకు లభించే యత్నంచేయి.”

(బ్రహ్మ పదార్థం మహోన్నతమైంది. దాన్ని పద్మావతి వర్ణిస్తుంది. ఆమె విరహ బాధా పీడితురాలై ఉన్నది. ఆమె తపన యావత్తూ ఉద్యానంలో కన్పించిన వేటగాణ్ణి చూడగానే వరించడం, ఆ వేటగాడు ఆమెను వివాహ మాడటానికి ఇష్టపడటం – ఈ వృత్తాంతం మనకు తెలిసిందే. ఆమె బ్రహ్మ పదార్థ వర్ణనం చేయడం విడ్డూరంగా కన్పిస్తుంది. ఆమె మనస్సు వేదాంత పరమై ఉంటే, ఆమె తన విరహతాపాన్ని మానసిక కల్లోలాన్ని సహించి, తన అభీష్టాన్ని ఒక యోగి ద్వారానో వేదాంతి ద్వారానో పొందేది. ఏమీ తెలియని తన తల్లిని అడిగేది కాదు. తన కూతురు వృత్తాంతంతో ఆమెతల్లి విభ్రాంతి చెందింది. కవి ఒక చమత్కార సన్నివేశాన్ని కల్పించి విష్ణుభక్తుల లేదా వైష్ణవుల గుణగణాలని వర్ణించే అవకాశాన్ని పొందాడు. **తాళ్ళపాక అన్నమాచార్యులు తన సంకీర్తన "నిత్యులు, ముక్తులు, నిర్మలచిత్తులు, నిగమాంతవిదులు వైష్ణవులు" మాళవీ రాగంలో గానం చేశారు.** పద్మావతీ స్వభావ సన్నివేశ చిత్రణాన్ని ఆ సంకీర్తనంతో పోల్చవచ్చు. అన్నమాచార్యులిట్లా తెల్పారు. "వారు నిత్యులు, ముక్తులు, పవిత్ర మనస్కులు, వేదాంత విదులు, నిష్కర్ములు, బుద్ధిమంతులు దోషరహితులు, శంఖ చక్ర చిహ్నాలను ధరించినవారు, సకల సందర్భాల్లో పూజ్యులైనవారు, వాంఛాదూరులై మానవసేవ చేసేవారు, రాగద్వేషాలను నియంత్రించిన వారు. భగవంతుడే శరణ్యమని అచంచలమైన శ్రద్ధ కలవారు, పవిత్రమైన జీవనాన్ని గడిపేవారు, ఫలాపేక్ష లేకుండా కర్మాచరణం చేసేవారు, వారే శ్రీ వేంకటేశ్వర స్వామి భక్తులు. ఆ వేంకటేశ్వర స్వామిని ఆరాధించడమే నా భాగ్యం."

**"ఏ కులజుడేమి, ఎవ్వడైననేమి, ఆకడనాతడె హరి నెరిగినవాడు" అనే సంకీర్తనలో అన్నమాచార్యులు, వేంకటేశ్వర భక్తుల గుణగణాలను వివరించినాడు.** ఆ గుణాలను ఇట్లా వర్ణించినాడు, "సత్యవ్రతులు, పరనిందా దూరులు, భూతదయ కలవారు, అందరినీ తమ వలెనే భావించుకునేవారు, పవిత్రాత్ములు, ఉదాత్త స్వభావులు, ధర్మజీవనులు, ప్రవృత్తిశీలులు, హరిభక్తిని విస్మరించని మహానుభావులు, ఎవరియందునూ ద్వేషభావం లేనివారు, సర్వత్రా బ్రహ్మదర్శనం చేసేవారు, శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తులుగా, వినయ శీలురుగా ఉంటారు.)

అప్పటికి అగస్త్యేశ్వరస్వామికి అభిషేకం నిర్వహించడానికి వెళ్ళిన స్త్రీ సమూహం, అభిషేకానంతరం రాణివద్దకు చేరుకున్నారు. వారివెంట వకుళమాలిక వచ్చింది. ఆమెను రాణికి పరిచయం చేశారు. రాణిగారు ఆమె నివాసాదులను, ఆమె రాకకుగల కారణాన్ని అడిగి తెలుసుకున్నారు. వకుళమాలిక ఆమెతో ఇట్లా చెప్పింది, "నేను వేంకటాద్రి నుండి వస్తున్నాను. నా పేరు వకుళమాలిక, సాక్షాత్తూ నారాయణుడైన వేంకటాచల నివాసి శ్రీ వేంకటేశ్వరుడు. ఒకనాడు వేటకు వెళ్ళినాడు. అడవులలో తిరుగుతూ ఒక మత్తగజాన్ని చూచి, దాన్ని వెంబడించాడు. కాని, దాన్ని చేరుకోలేక పోయినాడు. కాని, కాకతాళీయంగా శంఖుడనే రాజును కలిశాడు. **శంఖ మహారాజు ఒక శిలాఫలకంపై శ్రీదేవీ భూదేవీ సహితంగా చెక్కబడిన శ్రీ విష్ణువును అర్చిస్తూ ఉన్నాడు. ఆయన హైహయ వంశీయుడైన శ్వేత మహారాజు కుమారుడని తెలుసుకున్నాడు.** తపస్విగా జీవిస్తూ, తన సంపదను ఉదారంగా దానంచేసి, భగవత్కృపకై నిరంతరం యత్నిస్తూ ఎంతకూ పొందలేకున్నందున నిరాశా పీడితుడైనాడు. అప్పుడు ఆ రాజునకు ఆకాశవాణి విన్పించింది. వేంకటాద్రికి

వెళ్ళి తపస్సు చేయవలసిందని చెప్పింది. అగస్త్యుని ఆదేశానుసారం శ్రీదేవీ భూదేవీ సమేతుడైన శ్రీవేంకటేశ్వరుణ్ణి ఆ స్థలంలో అర్చిస్తున్నాడు. వేంకటేశ్వరుడు ఆ రాజుతో అన్నాడు, "రాజా! నీవు వేంకటాద్రికి వెళ్ళు, అక్కడ ఆ కొండ పశ్చిమ శిఖర సమీపంలో ఒక మఱ్ఱిచెట్టు ఉన్నది. దాని మొదట్లో విష్వక్సేనుడుంటాడు. ఆయనకు సాష్టాంగ ప్రణామం చేసి, స్వామిపుష్కరిణికి వెళ్ళు. అక్కడ స్నానమాచరించు. ఆ స్వామిపుష్కరిణి పశ్చిమ తీరాన ఒక అశ్వత్థ వృక్షం ఉన్నది. దాని క్రింద ఒక పుట్ట ఉన్నది. ఈ రెండింటి మధ్యలో నీవుండి తపస్సు చేయి. ఆ పుట్టలో శ్వేత వరాహస్వామి ఉన్నాడు. ఆయన భక్తిపరులకే దర్శనమిస్తాడు." ఇట్లా పలికి ఆయన తన గుఱ్ఱాన్ని అధిరోహించి, వేటను ప్రారంభించాడు. ఆయన ఆరణీనదీ తీరాన్ని చేరాడు. అక్కడే మత్తగజాన్ని వెంబడిస్తూ ఒక ఉద్యానాన్ని చేరాడు. ఆ ఉద్యానంలో కొందరు అతిలోక సౌందర్యవతులను చూశాడు. అందులో ఒక యువతి అందరికంటె మిన్నగా ఉండటాన్ని గుర్తించాడు. వారందరూ పూవులను కోస్తున్నారు. ఆయన ఆమె అందానికి ముగ్ధుడైనాడు.

ఆమె ఆకాశరాజు కూతురని తెలుసుకొని, ఆయన వేంకటాద్రిపైనున్న తన మందిరానికి వెళ్ళాడు. అది స్వామిపుష్కరిణీ సమీప స్థలంలో ఉన్నది. ఆయన నన్ను పిలిచి ఇట్లా చెప్పాడు, "వకుళమాలికా! నీవు తక్షణం ఆకాశరాజు నగరానికి వెళ్ళు. ఆయన రాణియైన ధరణీదేవిని కలువు. ఆమెను తన కూతురైన పద్మాలయను నాకు వివాహం చేయమని అడుగు. రాజుగారికీ విషయాన్ని తెల్పి, ఆయన అమాత్యులతో సంప్రదించి ఇచ్చిన ఆజ్ఞాపత్రాన్ని తీసుకొనిరా. నాకు వెంటనే విషయాన్ని తెలుపు." అని. "ఆయన ఆజ్ఞానుసారం నేను మీవద్దకు వచ్చాను. మీరు రాజుగారికీ విషయాన్ని నివేదించి, ఆయన అమాత్యులతో సంప్రదించి తెల్పిన అంగీకారాన్ని అట్లాగే మీ అమ్మాయి అంగీకారాన్ని ఆమె అభీష్టానుసారం తెలుసుకోండి. అందరి సమ్మతిని పొందేలా ప్రయత్నించండి" అని చెప్పింది.

ధరణీదేవి సంతోషంగా రాజు వద్దకు వెళ్ళి, పద్మావతిని, అమాత్యులను పిలిపించింది. వారికి వకుళమాలిక రాయబార విశేషాలను చెప్పింది. రాజు వెంటనే అంగీకరించి, మంత్రుల అభిప్రాయాన్ని కోరాడు. వారందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు. "మీ పెంపుడు పుత్రిక వేంకటేశ్వరుణ్ణి భాగ్యవశాత్తు వివాహమాడి, శ్రీ మహాలక్ష్మీదేవికి సపత్నిగా ఆయనతో సుఖంగా ఉంటుంది. వివాహ ముహూర్తాన్ని నిశ్చయించడానికి, బృహస్పతికి కబురు పెట్టండి. ఆహ్వానం చేరగానే **బృహస్పతి విచ్చేసి వైశాఖమాసం, ఉత్తర ఫల్గుణీ నక్షత్రంలో శ్రీ పద్మావతీ మృగశిర నక్షత్రానికి సరిపడునట్లుగా ముహూర్తాన్ని నిశ్చయం చేశాడు.**

అప్పుడు ఆకాశరాజు వకుళమాలికతో ఇలా అన్నాడు, "అమ్మా! నీవు వేంకటేశ్వరుని వద్దకు వెళ్ళి వైశాఖమాసంలో వివాహముహూర్తం నిర్ణయింప బడిందనీ, సరియైన సమయానికి వివాహానికై తరలి రావలసిందిగా తెలుపు. శుకబ్రహ్మర్షిని తన పక్షాన రాయబారం నెరపవలసిందిగా, వకుళమాలికతో పంపించాడు.

పిమ్మట తన కుమారుడైన వాసుదానుణ్ణి పిల్చి దేవలోకానికి వెళ్ళి ఇంద్రాది దేవతలను ఆహ్వానించడానికి పంపించాడు. వారు రాగానే, విశ్వకర్మను తన రాజధానిని అలంకరింపవలసిందిగా కోరాడు. ఆయన అలంకరించాడు. ఇంద్రుడు వర్షించాడు. **కుబేరుడు ధనరాశులను కురిపించాడు.** యముడు ప్రజలను రోగ విముక్తులను చేసి ఆనందపరిచాడు. వరుణుడు రత్నాలను ముత్యాలను రాసులుగా తెచ్చి ఇచ్చాడు. పిమ్మట వారందరూ వేంకటాచలంపై కార్యభారాన్ని నిర్వహించడానికి వెళ్ళారు.

శుక బ్రహ్మర్షితో కలిసి వకుళమాలిక అశ్వారూఢయై వేంకటాచలానికి బయలుదేరింది. మందిరాన్ని సమీపించి అశ్వాన్ని అవరోహించి, బ్రహ్మర్షిని వెంటతీసుకొని, రత్నఖచిత సింహాసనం పై శ్రీలక్ష్మీ సహితుడై ఆసీనుడైన వేంకటేశ్వరునకు సాష్టాంగ ప్రణతి చేసి ఇట్లా నివేదించింది. "ప్రభూ! మీ ఆజ్ఞానుసారం వెళ్ళి మీ కార్యాన్ని సాధించాను. వివాహానికి సమ్మతించి, ఆకాశరాజు శుకబ్రహ్మర్షిని నాతో పంపించాడు. ఇదిగో, శుకబ్రహ్మ" అని ఆయనను పరిచయం చేసింది. శుకబ్రహ్మ శ్రీవేంకటేశ్వరునికి పద్మావతీ సందేశాన్ని ఇట్లా విన్నవించాడు, "ఓ మాధవా! ధరణీదేవి కూతురైన నన్ను నీ కళత్రంగా స్వీకరించు, నీ మధుర నామాన్ని స్మరిస్తూ నీ దివ్యమంగళ విగ్రహాన్ని ధ్యానిస్తాను. నా భుజాలపై శంఖచక్ర చిహ్నాలని ధరించాను. పంచ సంస్కారాలను పొందిన నీ భక్తులనే నేను స్తుతిస్తాను. నీ సంతోషార్థమే నేను నా పనులన్నింటినీ చేస్తాను. నీ సేవకై నన్ను అర్పించుకుంటాను. మాధవా! నాపై కరుణించు, అనుగ్రహించు, స్వీకరించు" శ్రీ వేంకటేశ్వర స్వామి శుకబ్రహ్మతో అన్నాడు. "నా సందేశంగా పద్మావతికి తెలుపు, ఆమె అభ్యర్థనను అంగీకరించినానని వివాహానికి దేవతలతో తరలివస్తానని నివేదించు." అని చెప్పి ఒక తులసీదళమాలను పద్మావతికీయవలసిందని పంపాడు. శుకబ్రహ్మ పద్మావతికి మాలికను సమర్పించి, శ్రీ వేంకటేశ్వరుని సందేశాన్నందించాడు. ఆమె ఆ తులసీదళ మాలికను శిరస్సుపై ధరించి, ఆయన రాకకై ఆసక్తితో నిరీక్షించింది.

ఆకాశరాజు ఆ శుభవార్త ఆనందం పొందాడు. చంద్రుణ్ణి పిలిచి దేవతలకు, ఋషులకు, సామాన్య జనానీకానికి యోగ్యమైన చతుర్విధాలైన వంటను సిద్ధం చేయమని ఆజ్ఞాపించాడు. పద్మావతిని అలంకృతను చేశాడు. తనరాణితో, అమాత్యులతో సభా భవనంలో శ్రీ వేంకటేశ్వరస్వామికి స్వాగతం పలకడానికి కొలువుతీరాడు.

శ్రీ వేంకటేశ్వరుడు లక్ష్మీదేవిని పిలిచి తనకు పద్మావతితో నిర్వహింప బడే వివాహానికి అవసరమైన ఏర్పాట్లను చేయమని కోరాడు. ఆమె తన చెలికత్తెలను సుగంధ తైలాన్ని, వేడి నీటిని, ఆభరణాలను రత్న ఖచిత కిరీటాన్ని, ఛత్రచామరాదులను సిద్ధం చేయవలసిందిగా ఆదేశించింది. లక్ష్మీదేవి శ్రీవేంకటేశునకు సుగంధ తైలాన్నిరాచి, స్నానం చేయించి కేశపాశాలను సవరించి, శరీరానికి చందనాన్ని అలది పీతాంబరాన్ని ధరింప చేసి, ఆభరణాలతో రశనాబంధంతో కిరీటంతో అలంకరించింది. ఆయన తన ముఖంపై ఊర్ధ్వపుండ్రాన్ని ధరించాడు. లక్ష్మీ సహితుడై గరుడ వాహనం పై, బ్రహ్మాదిదేవతలు, యోగులు, భక్తులు భాగవతులు వెంటరాగా, గంధర్వులు దివ్యగీతికలను ఆలపించగా, అప్సరసలు నృత్యం చేయగా, మహర్షులు వేదసూక్తాలను పఠించగా, భేరీ నినాదంతో నిజపరివారం, వకుళమాలికాది స్త్రీజనం రథాలపై అనుసరింపగా, ఆకాశరాజు పట్టణానికి చేరాడు.

పద్మావతి ఐరావతంపై నారాయణపురవీధుల్లో ఊరేగి, ముఖద్వారాన్ని చేరింది. అక్కడ వధూవరులు పుష్పహారాలను పరస్పరం మార్చుకున్నారు. వారిద్దరూ వాహనాలనుండి దిగగానే కల్యాణ వేదికకు కొంపోబడ్డారు. బ్రహ్మదేవుడు పురోహితుడుగా, విధ్యుక్త హోమాదులు పూర్తియైన పిమ్మట మంగళసూత్రధారణ విధి నిర్వహింపబడింది. వివాహం నాలుగుదినాలలో ముగిసింది.

వివాహం సంపన్నమైన తరువాత ఆకాశరాజు సమ్మతితో, శుకబ్రహ్మాది మునులు, బ్రహ్మాదిదేవతలు వెంటరాగా, సంగీత వాద్యయుక్తంగా శ్రీ వేంకటేశ్వరస్వామి శ్రీలక్ష్మీపద్మావతీసహితుడై గరుడవాహనం పై వేంకటాద్రిపై నున్న మందిరానికి చేరగానే దేవతలు మునులు జయజయ ధ్వానాలు చేశారు. శ్రీ వేంకటేశుడు మణిమంటపాన్ని ప్రవేశించి, ఇద్దరు దేవేరులతో సింహాసనాన్ని అధిష్ఠించాడు.

ఆకాశరాజు గంపలలో ధాన్యాన్ని పప్పుదినుసులను, ఫలాలను, శర్కరను, రత్నాలను, ముత్యాలను, నూతన వస్త్రాలను తదితర వస్తువులను గజాలను, అశ్వాలను, గోవులను, సేవకులను తదితర సామగ్రిని వివాహ కానుకలుగా పద్మావతీదేవికి వేంకటేశ్వరస్వామికి సమర్పించడానికి, తన రాజ పదానికి అర్హమైనట్లుగా, భగవంతుడైన అల్లునికి యోగ్యమైనట్లుగా, సన్నద్ధం చేసుకొని ఆయన ముందు నిలబడినాడు. ఆకాశరాజు తన కూతురును అర్పించినందులకు, బహుమతులనిచ్చినందులకు సంతోషించి, వేంకటేశ్వరస్వామి ఆకాశరాజును ఏదైన వరాన్ని కోరుకొమ్మన్నాడు. ఆకాశరాజు ఇలా అన్నాడు, "స్వామీ! నీవు భగవంతుడివి. శాశ్వతంగా నీ సేవ చేయడమే నా అభీష్టం. శాశ్వతమైన గాఢమైన నిరంతరం వృద్ధినందే భక్తిని అనుగ్రహించు, అదియే నా కోరిక. నీ పాదపద్మాలపై నిరంతరం నా మనస్సు నెలకొనే విధంగా నన్ను కరుణించు." ఆయనకు శ్రీ వేంకటేశ్వరుడు వరాలను కోరిన విధంగా ప్రసాదించి, తన మామగారుగా సత్కరించాడు.

అప్పుడు బ్రహ్మాదిదేవతలను సంభావించి, వారి సేవలను కొనియాడి, వారి వారి నివాస స్థానాలకు వెళ్లడానికి అనుమతినిచ్చాడు. వారందరూ వెళ్ళిన తరువాత **వేంకటాచలం పై లక్ష్మీతో పద్మావతితో కొంతకాలం సుఖవిహారం చేసి, స్వామిపుష్కరిణికి దక్షిణతీరాన ఉన్న మందిరంలో ఇద్దరు దేవేరులతో ప్రవేశించి ఆనందంగా నివసించాడు.**

(వరాహపురాణం అధ్యాయం-11, శ్లోకం 440 ప్రకారం శ్రీ వేంకటేశ్వరుడు వివాహానంతరం వేంకటాచలానికి శ్రీ లక్ష్మీపద్మావతీ సహితుడై వెళ్ళిన విషయాన్ని, ఆకాశరాజు నుండి కానుకలను గ్రహించి కొండపై వసించినట్లు ప్రస్తావింపగా, భవిష్యోత్తరపురాణం, ఆకాశరాజు నుండి కానుకలను స్వీకరించిన పిదప **శ్రీవేంకటేశ్వరుడు పద్మావతితో కలిసి అగస్త్యాశ్రమానికి వెళ్ళి అక్కడే ఆరు నెలలు నివసించినట్లు తెల్పుతున్నది. పద్మావతీదేవికిచ్చిన ప్రతిజ్ఞానుసారం శ్రీవేంకటేశ్వర స్వామి, పెళ్ళి తరువాత ఆరు నెలల వరకు వేంకటాద్రికి వెళ్ళలేదు. ఇప్పటికీ ఈ నియమాన్ని పురుషులు పాటిస్తున్నారు.)**

* * *

# అధ్యాయం-11

## వేంకటాద్రికి నైమిశారణ్యం నుండి మునుల ఆగమనం

## (వరాహపురాణం భాగం-1, అధ్యాయం-62)

నైమిశారణ్యంలో మహర్షులు సూతపౌరాణికుని ద్వారా శ్వేత వరాహ కల్ప కథనూ వేంకటేశ్వరుని వృత్తాంతాలను, తీర్థాలను గూర్చి, వివిధ భక్తులు వేంకటాచలాన్ని దర్శించిన వైనాన్ని ఇతర విషయాలను విన్నారు. మహాభారత కర్తయైన వ్యాసమహర్షి నుండి పౌరాణికోత్తముడైన సూతమహర్షి ఈ వృత్తాంతాలనన్నింటినీ తెలిసికొని ఉన్నాడు. మహర్షులు వేంకటాచలాన్ని దర్శించి వేంకటేశ్వరస్వామిని అర్చించాలనుకున్నారు. వేంకటాచలాన్ని దర్శించవలసిన పద్ధతిని గూర్చి సూతమహర్షిని వివరించాలని కోరినారు. సూతపౌరాణికుడు వారికిలా వివరించాడు. **“మీరు అష్టోత్తర శతనామావళితో అర్చించాలి. అష్టోత్తర శతపూజను తులసీదళాలతో పుష్పాలతో చేయాలి. పర్వతాన్ని దర్శించిన వెంటనే పూజించాలి. మొదట కపిలతీర్థంలో స్నానం చేయాలి. కొండకు వెళ్ళే దారిలోనున్న తీర్థాలన్నింటిలో స్నానం చేసి, స్వామి పుష్కరిణిలో స్నానం చేయాలి. ప్రథమంగా భూవరాహస్వామి నర్చించాలి. తరువాత శ్రీవేంకటేశ్వరస్వామి దేవాలయాన్ని దర్శించాలి. శ్రీదేవీ భూదేవీ సహితుడైన స్వామిని అష్టోత్తర శతనామాలతో అర్చించాలి.** సూత పౌరాణికుడు చెప్పిన విధంగా మునులు నైమిశారణ్యంనుండి బయలుదేరి, గంగా, గోదావరి, కృష్ణా నదులను దాటి వేంకటాచలానికి చేరినారు. కొండను చూడగానే ఆనందంతో నృత్యం చేశారు. కపిల తీర్థంలో స్నానం చేసి కపిలేశ్వర స్వామినర్చించి కొండపైకి చేరుకున్నారు. స్వామిపుష్కరిణిలో స్నానమాచరించి భూవరాహస్వామిని ప్రథమంగా దర్శించి వేంకటేశ్వర స్వామివారి ఆలయానికి వెళ్ళి ఇట్లా ప్రార్థించారు. “ఓ హరీ! నీ అనంత గుణాలను వర్ణించడం ఎవరికీ సాధ్యంకాదు. లోకంలో ధర్మాన్ని స్థాపించడానికి త్రివిక్రమావతారాన్ని దాల్చిన నీకు ప్రణామం. సమస్త విశ్వంకంటె పది అంగుళాలు పెరిగి భూతభవిష్యత్తులను విస్తరిస్తావు. విశ్వ ప్రభువైన నీకు నమస్కారం. సృష్టిలో విశ్వం ఒక పాదభాగమే, మిగిలిన మూడుపాదాల పరిమాణం వ్యోమమే. పరబ్రహ్మవైన నీకు సహస్ర నమస్కారములు. నీవు అధీశ్వరుడివి. చతుర్వేదాలను, చతుర్వర్ణాలను, అగ్నిని సూర్యచంద్రులను సృష్టించిన వాడవు. నీవు విశ్వరూపుడవు. నీనామ రూపగుణాలు అనంతాలు వాటిని గణించడం వేదాలకు కూడా సాధ్యంకాదు. మావంటి వారికది అసాధ్యం” ఇట్లా ప్రార్థించి వారు శ్రీ వేంకటేశ్వరస్వామి వారి పాదాలను బంగారు కమలపుష్పాలతో, సూతుడు ఉపదేశించిన అష్టోత్తర శతనామాలతో అర్చించారు. వారి అర్చనతో శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రసన్నుడై ఇట్లా అన్నాడు, “ఓ మునులారా! మీరు వేంకటాచలమాహాత్మ్యాన్ని నైమిశారణ్యంలో వింటూ ఉన్న సమయాన్నే మీకు దాని ఫలితాన్ని ప్రదానం చేశాను. అది కఠోరమైన తపస్సు చేత కూడా సాధింపరానిది. మీకు మరేదైనా వరం కావాలని కోరితే ప్రదానం చేయడానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఎంతో దూరాన ఉన్న భక్తుడు వేంకటాచల మాహాత్మ్యాన్ని విన్నా, చదివినా, వివరించినా, ఆ భక్తునికి కోరికల నన్నింటినీ ఈడేరుస్తాను. కన్యామాసంలో, బ్రహ్మోత్సవాల కాలంలో శ్రీవేంకటాచల

మాహాత్మ్యాన్ని విన్నా, చదివినా, వివరించినా, నాకృప వారిపై సులభంగా ప్రసరిస్తుంది. వారికి సంపదలను, భూమిని, ఫలసాయాన్ని సంతానాన్ని అనుగ్రహిస్తాను. భూమిపై ఉన్నంత కాలం సుఖాన్ని తరువాత ముక్తినీ ప్రదానం చేస్తాను." వేంకటాచల వైభవానికి ముగ్ధులై నైమిశారణ్యం తిరిగి వెళ్ళానుకోలేదు. ఆ కొండపైనే ఐదు సంవత్సరాలు నివసించారు. తీర్థాలలో స్నానమాచరిస్తూ, అర్చనాది క్రియలను నిర్వహిస్తూ, స్వామి దర్శనంతో భగవల్లీలలను అనుభవిస్తూ కాలాన్ని గడిపి నైమిశారణ్యానికి తిరిగివెళ్ళారు. వారు సూతమహర్షి వర్ణించిన యథార్థ విషయాలకు ప్రసన్నులై ఆయనను ప్రశంసించారు. కొండను, కొండపైనున్న విశేషాలను వేంకటాచల మాహాత్మ్యాన్ని ఆయన వివరించి, వేంకటాచల దర్శనానికై వారిలో కోరికను కలిగించి, వేంకటేశ్వర స్వామిని అర్చించేట్లు చేసి వారిని కృతార్థులను చేసినందుకు వారు సూత పౌరాణికుణ్ణి బహుధా ప్రశంసించినారు.

* * *

# అధ్యాయం-12

## వేంకటాచలంపై శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవాలయం

దివ్య ఆనందనిలయం క్రింద నున్న పవిత్ర మంటపంలో దేవాలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామి విరాజమానుడై భక్తులకు దర్శనాన్ని అనుగ్రహిస్తూ ఉంటాడు.

శ్రీ మహావిష్ణువు భూలోకంచేరిన పిదప ఆయన నిరాధారంగా ఉన్నాడు. ఆయనయే చోళరాజుకు చెప్పినట్లుగా ఆయనకు "నివాసంలేదు, తల్లిదండ్రులు భార్యాపుత్ర బాంధవులులేరు. పరదేశిగానున్న నిరుపేద." **స్వామి పుష్కరిణికి దక్షిణతీరంలో బ్రహ్మ కల్పించిన చింతచెట్టు దానిక్రింద పుట్టలో శ్రీవిష్ణువు పదివేలసంవత్సరాలు అజ్ఞాతంగా ఎవరూ గుర్తు పట్టుకుండా ఉన్నాడు. ఆ పుట్టలో నుండి కాంతి ప్రసరిస్తూ ఉండేది. ద్వాపరయుగాంతమై కలియుగం ప్రారంభమైంది. శ్రీ వేంకటేశ్వరస్వామి ఆహారానికై బ్రహ్మ కపిలగోవుగా, శివుడు దూడగా అవతరించి నిత్యం పాలను సమర్పించేవారు.**

ప్రాచీనకాలంలో వైవస్వత మనువు పాలిస్తూ ఉండగా ఒక కృతయుగాంతంలో వాయుదేవుడు తీవ్రంగా తపమాచరించాడు. శ్రీనివాసుడు ప్రసన్నుడై ఆయనకు వరప్రదానంచేసి తన దేవేరులతో అదృశ్యంగా, స్వామిపుష్కరిణీ దక్షిణతీరాన, అదృశ్యంగా ఉన్న విమానంలో కలియుగాంతం వరకు శివపుత్రుడైన స్కందుని పూజలందుతూ నెలవుగా ఉంటాము. వాయుదేవుని కోరికను అనుగ్రహించాడు. పిమ్మట అగస్త్యముని ప్రార్థన నంగీకరించి మానవులకు దర్శనమిచ్చి, వారిని అనుగ్రహించడానికి సమ్మతించాడు. వైకుంఠం నుండి భూమికి కొనితేబడిన విమానం చాలాకాలం క్రితమే అదృశ్యమైంది. కలియుగంలో భక్తులే ఆయన నివాసాన్ని నిర్మిస్తారని స్వామి చెప్పినాడు. **వరాహస్వామి పాతాళలోకం నుండి భూమిని ఉద్ధరించి స్థాపించి, వైకుంఠం నుండి క్రీడాచలాన్ని తెచ్చి వేంకటాచలంపై ప్రతిష్ఠించి, తన విమానంలో ఆ కొండపై స్వామిపుష్కరిణి పశ్చిమతీరాన నివాసాన్ని ఏర్పరచుకోగా, శ్రీవిష్ణువు దివ్యవిమానంలో దక్షిణతీరాన నివసించాడు.** బ్రహ్మదేవునికి, ఇతరులకు, దశరథునకు స్వామిపుష్కరిణి నుండి బహిర్గతమైన విమానంలో నుండి దర్శనమిచ్చి, బ్రహ్మదేవుని ద్వారా బ్రహ్మోత్సవాన్ని నిర్వహింపచేశాడు. స్వామిపుష్కరిణి నుండి బహిర్గతమైన విమానంనుండే శంఖణ రాజునకు దర్శనమిచ్చాడు. కాని, అది వెంటనే అదృశ్యమైంది. ఒక దివ్యమైన వనంలో ఉన్న దేవాలయంలో ఆత్మారాముడు స్వామిపుష్కరిణిలో స్నానంచేయగానే దర్శనమిచ్చి దేవాలయంతో కూడా అదృశ్యుడైనాడు. నిషాదుడైన వసువు ఆయనకు పుట్టలో అర్చించి తేనెతో కలిపిన శ్యామాక ధాన్యం అన్నాన్ని నైవేద్యంగా ఇచ్చాడు.

రంగదాసునికి చింత చెట్టుక్రింద ఆకాశస్థుడై కన్పించాడు. ఆయనకు గరుడుని ఱెక్కలు ఆచ్ఛాదనంగా ఉన్నాయి. రంగదాసుడు చుట్టూ బండరాళ్ళతో ప్రాకారాన్ని నిర్మించాడు. రంగదాసుడే తొండమానునిగా జన్మించిన పిమ్మట విమానప్రాకార గోపురాలను నిర్మించాలని ఆదేశించాడు.

రంగదాసుడు తొండమానుడుగా జన్మించి, నిషాదుని వెంటవెళ్ళి స్వామిని దర్శించినపుడు, పురుషోత్తముడైన విష్ణువుపుట్టపై నిలబడి ఉన్నాడు. మోకాలిబంటి వరకు పుట్టలోనే ఉండి కిరీటరత్న శోభితుడై శంఖచక్రధారియై శ్రీదేవీ భూదేవీ సహితుడై జేగీయమానంగా కన్పించాడు. నిషాదునికి భూవరాహస్వామి ఆవేశించి తొండమానుణ్ణి వరాహ శ్రీనివాసులకు విమానాలను నిర్మించవలసిందిగా ఆదేశించాడు. అప్పటివరకు వారు పుట్టలోనే ఉన్నట్లు భావించాలి. తొండమానుడు విమాన నిర్మాణానికి పూనుకోగానే, ప్రాకారాన్ని మాత్రమే నిర్మించి ద్వార గోపురాన్ని కట్టాలని, విమానాన్ని తొండమానుని వారసుడైన నారాయణుడు నిర్మిస్తాడని చెప్పాడు. **తొండమానుడు ప్రాకారాన్ని ద్వారగోపురాన్ని మాత్రమే నిర్మించినట్లు తెలుస్తున్నది. గర్భాలయాన్ని ఎవరు నిర్మించినారో తెలియదు.** తొండమానుడు అనుచిత కాలంలో స్వామిని దర్శించి, బ్రాహ్మణపత్ని తన నిర్లక్ష్యం కారణంగా నిరాహారంగా మరణించిన వృత్తాంతాన్ని నివేదించగా, బ్రాహ్మణపత్ని శవాన్ని దేవాలయానికి తూర్పున ఉన్న అస్థిసరస్సులో నిమజ్జనం చేయమని చెప్పాడు. **బహుశః తొండమానుడే దేవాలయాన్ని కూడా నిర్మించినట్లు భావించడానికి వీలున్నది.**

శ్రీ వరాహస్వామి భూదేవికి వేంకటాచలాన్ని గూర్చి వేంకటేశ్వరుని గూర్చి కథను వివరిస్తూ చతుర్యుగాలెన్నో గడిచిన పిదప ఇరవై ఎనిమిదవ చతుర్యుగంలో ద్వాపర యుగాంతమైన తరువాత మహాభారతయుద్ధం జరిగిన పిమ్మట, కలియుగారంభంలో విక్రమార్కశకంలో శూద్రకాది రాజులు పాలించినారని, శ్రీ వేంకటేశ్వరస్వామివారిని తెలిసికోకుండానే స్వర్గానికి వెళ్ళారని చెప్పాడు. **మహారథి మిత్రవర్మ చంద్రవంశంలో జన్మించి, నారాయణపురం రాజధానిగా తుండీరమండలాన్ని పాలించి, ధర్మపత్నియైన ధరణీదేవివలన ఆకాశరాజును పుత్రుడుగా బడిసినాడు. మిత్రవర్మ అవతరించే సమయానికి కలియుగం చాలాభాగం గడిచిందని తెలుస్తున్నది.**

ఉత్తరదేశరాజులకే కాదు, దక్షిణాపథంలో నున్నవారికీ గంభీరమైన అడవుల్లో కష్టసాధ్యమైన కొండపై నున్న స్వామి ఉనికి తెలియదు. చుట్టుప్రక్కల ఉన్న వాళ్ళకూ తెలిసినట్టులేదు. ఆ ప్రాంతాన్ని పాలించే తొండమానునికీ తెలియదు. ఒక వనచరుడు ప్రతిదినం శ్యామాక అన్నాన్ని తేనెతో కలిపి నైవేద్యం సమర్పించేవాడు, తొండమానుని ప్రార్థనను అంగీకరించి ఆయనను స్వామిదర్శనానికి తీసుకువెళ్ళాడు. ఆయన పుట్టబొరియలో మోకాళ్ళవరకు దిగబడి, పై భాగం కన్పిస్తూ ఉన్నాడు. దీనివలన, ఎవరో ఆటవికరాజు దక్షిణదేశంలో నాగరకస్థానం నుండి విగ్రహాన్ని ఇక్కడ చింత చెట్టుక్రింది పుట్టలో పెట్టి ఉంటాడన్నీ, చాలాకాలం గడిచిన తరువాత, కొన్ని శతాబ్దాలైనా గడిచి ఉండవచ్చు, గాలికీ వానకులోనై పుట్టలోనికి క్రుంగిపోయి ఉండవచ్చు. క్రింద శిలాతలంవరకు క్రుంగి ఉంటుంది, అని తెలుస్తున్నది.

అందుకే, **కొన్ని యుగాలవరకు ప్రజలకు శ్రీవరాహస్వామిని గూర్చి, విష్ణు – వేంకటేశ్వరుణ్ణి గూర్చి తెలియరాలేదు, వారిరువురూ కొన్ని యుగాలముందే పుట్టలో నివాసం ఏర్పరచుకున్నప్పటికినీ –**

ఆకాశరాజు కూతురు పద్మిని లేదా పద్మావతి, పుష్పోద్యానంలో చెలికత్తెలతో విహరిస్తూ ఉండగా, వేటకై వెళ్ళిన వేంకటేశ్వరస్వామి ఆమె సౌందర్యానికి ముగ్ధుడై, విరహపీడితుడై తన దేవాలయంముందు గుర్రాన్ని దిగి **మణిమంటపం ద్వారా గర్భగృహానికి చేరి అక్కడే పర్యంకం పై విశ్రమించాడు.**

**ఆకాశరాజు కాలానికి వేంకటేశ్వరస్వామికి దేవాలయం గర్భగృహం నిర్మింపబడి నట్లు తెలుస్తున్నది. మణిమంటపాన్ని గూర్చి చెప్పడం కాల విరోధంగా ఉన్నది.** ఎందుకంటే మణిమంటపాన్ని చంద్రగిరి మాధవదాసుని అమాత్యశేఖరుడు విజయనగర ముఖ్యమంత్రి మల్లన శక సం॥ 1339 లో నిర్మించినట్లు శాసనం తెల్పుతున్నది. (TTD శాసనాలు, Vol **I** క్రమసంఖ్య 196&198). ఇంగ్లీష్ తేదీ 25 ఆగస్ట్ 1417కి సరిపోతుంది. **మల్లన విమానంపైకూడా మరమ్మతులు చేశాడు. ఆనందవిమానం అని నామకరణం చేశాడు.** ఆకాశరాజు కాలంనాటి మణిమంటపం అంతర్మంటపమే అయి ఉంటుంది. ఇది ప్రస్తుతం ఉన్న మహామణిమంటపానికి వెనుక భాగాన ఉంది. స్నపన మంటపానికి రెండువైపుల ద్వారపాలకులు పడమట దిశలో నిలబడి ఉన్నారు.

ఏది ఎట్లున్నా, తొండమానుడే శ్రీ వేంకటేశ్వరునికీ, శ్రీ వరాహస్వామికీ ఆలయనిర్మాణం చేశాడు. సుప్రసిద్ధ తొండమానుడెప్పటివాడో, దేవాలయంలో ఏయే భాగాలను నిర్మించాడో తెల్పే చారిత్రక ఆధారాలేవీలేవు. దక్షిణాపథానికి చెంది, అతి ప్రాచీనకాలంలో నిర్మించబడినందున, దేవాలయాలు ద్రావిడ పల్లవశైలిలో ఉన్నాయి.

శ్రీవేంకటేశ్వర మందిరం, బహుశః 12 చతురపుటడుగుల పరిమాణం లోనూ, దానికి ముందున్న అర్ధమంటపం, దానికెదురుగా అదేపరిమాణంలో నిర్మితమై భక్తులు నిలబడి స్వామిని దర్శించే శయనమంటపం, దక్షిణదిశలో పశ్చిమదిశలోనూ 5 అడుగుల వెడల్పుతో, ఉత్తరదిశలో 17 అడుగుల వెడల్పుతో ప్రదక్షిణపథంతో ఉంటుంది. ప్రదక్షిణ పథంలోనే ఒకలోతైన, అభిషేక జలాన్ని గ్రహించే ఘటం, దీనిలోనికి ఉత్తరపుగోడకు ఉన్న రంధ్రం నుండి స్వామి అభిషేకజలం చేరుతుంది. ఇది గర్భగృహానికి చేరువలో ప్రదక్షిణకు అనుకూలంగా గర్భగృహంతోపాటే నిర్మింపబడింది. శిల్పశాస్త్రంలో అనాదిగా మన్నింపబడుతూ ఉన్న సంప్రదాయం ప్రకారంగా గర్భగృహాన్ని, అర్ధమంటపాన్ని పరిమితస్థలంలో వెలుగు పరిమితంగా ప్రవేశించే విధంగా నిర్మించారు. ఒక గంభీరభావాన్ని, ప్రసన్నమైన ఆధ్యాత్మిక భావనకు అనుకూలమైన వాతావరణం ఏర్పడటానికి, గౌరవం, భయం, దైవభీతి, దివ్యత్వం, భక్తిభావం భక్తుడిలో ఉద్భవించడానికి – ఈ నిర్మితి విధానం సూచింపబడింది. గర్భగృహంలో తైలదీపాలు స్వామిని స్పష్టాస్పష్టంగా కన్పించేట్టు చేస్తాయి. భక్తుని హృదయం గంభీరభక్తి భావనతో నిండిపోతుంది. శ్రీ వేంకటేశ్వర దేవాలయ నిర్మాణంలో ఉన్న విశేషం – దూరంనుండి గోపురాన్ని దర్శిస్తూనే గొప్పభక్తిభావం హృదయంలో నిండిపోతుంది. గర్భాలయంలో కాస్తా మందకొడిగా కన్పించినా, మహామంటపందాక అంతకంటె చీకటిగా ఉంటుంది. ఇక్కడికి ప్రక్కనే ఆనుకొని ఉన్న ప్రవేశ మార్గాన్ని మూసివేసినారు. మూలగర్భమందిరాన్ని పొడిగిస్తూ రెండు వేదికలు నిర్మింపబడ్డాయి. వాని ముందే ముఖమంటపం. అక్కడే నేతి దీపాలు నిరంతరం వెలుగుతూ

ఉంటాయి. విలువైనరత్నాభరణాలు, ధనం, విలువైన లోహాలు మణులు పెద్ద చెక్కపెట్టెల్లో, ఇనుప అల్మైరాలలో నిక్షిప్తపరుచబడ్డాయి. వీటిని బహుశః 13 వ శతాబ్దంలో నిర్మించి ఉంటారు. ఈ ప్రదక్షిణ పథాన్ని ముక్కోటి ఏకాదశికి ముందు రాత్రి తెరిచి తరువాతి దినం రాత్రికి మూసివేస్తారు. దీన్ని ముక్కోటి ప్రదక్షిణం అంటారు. ఈ ప్రదక్షిణపథాన్ని మూసివేసినందున, అభిషేకజలం వెళ్ళడానికుద్దేశింపబడిన ఉత్తరపు గోడకున్న రంధ్రంకూడా మూసివేయబడి ఉండవచ్చును. మొన్నమొన్నటివరకు అభిషేకతీర్థాన్ని గర్భాలయం శిలాతలంపై నుండి వెండిపాత్రలతో తీసి ఇటుక – సున్నం కలిపి చేసిన తొట్టిలో భక్తుల ఉపయోగార్థం నింపి పెట్టేవారు. తరువాత కాలాన ఈ తొట్టిని తీసివేసి, అభిషేక జలాన్ని వ్యర్థంగా వదిలి వేస్తున్నారు. కుంకుమపూవు రసంతో కలిసిన ఈ అభిషేకజలం అత్యంత పవిత్రమైంది. శుభప్రదమైంది. స్వామి పవిత్ర దేహాన్ని స్పృశించిన జలం కదా!

ముఖమంటపానికి, మల్లన అమాత్యశేఖరుడు తిరుమహామంటపాన్ని చేర్చాడు. కాలక్రమాన రాజులు, సామంతప్రభువులు రెండు పెద్ద బహిఃప్రాకారాలను నిర్మించి ఉంటారు.

శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయంనుండి వేటకు వెళ్ళి పద్మావతీ సౌందర్యానికి ముగ్ధుడై విరహతాపంతో మళ్ళీ దేవాలయానికి తిరిగివచ్చి లోపలి గృహంలో శయనించినాడని ప్రసిద్ధ కథవలన ఆలయంలో అప్పటికే చాలా గృహాలేర్పడ్డాయని తెలుస్తున్నది. **వరాహపురాణం నిర్మాణకాలాన్ని కాని, నిర్మాతకాలాన్ని కాని తెల్పలేదు. భవిష్యోత్తరపురాణం (అధ్యా.13, శ్లో 26–39), వేంకటేశ్వరుడే తొండమానుణ్ణి భవనాన్ని నిర్మించమని** కోరినట్లు తెల్పుతుంది. తొండమానుడు ఆకాశరాజు తమ్ముడు. **ఆకాశరాజు మరణించిన తరువాత తొండమానుడు, ఆకాశరాజు పుత్రుడు శ్రీనివాసుడు రాజ్యానికై తగవుపడ్డారు. వేంకటేశ్వరుడేవారి రాజ్యాన్ని ఇద్దరికీ పంపకం చేశాడు. పద్మావతి తొండమానుని అన్న కూతురు. తొండమానునితో వేంకటేశ్వరుడు పద్మావతితో కలిసి ఉండటానికి తన కిల్లులేదని, అల్లుడు వేరే ఎవరి ఇంట్లోనో ఉండటం మామగారి గౌరవానికే భంగమని, అందుకే** తనకొక భవనాన్ని నిర్మించడానికి తొండమానుడే తగినవాడని చెప్పాడు. తొండమానుడు అంగీకరించాడు. వేంకటేశ్వరుడు పద్మావతీ సహితంగా సువర్ణముఖరీనదికి తూర్పుతీరంలో ఉన్న అగస్త్యాశ్రమంనుండి వేంకటాచలానికి బయలుదేరాడు. **శ్రీవరాహస్వామిని తన భవనానికి కావలసిన స్థలాన్ని, నిర్మించడానికి అనుమతిని కోరాడు. తొండమానునికి శ్రీ వరాహస్వామి వేంకటేశ్వరుని భవనానికై స్వామిపుష్కరిణికి దక్షిణతీరాన ఉన్న స్థలాన్ని చూపించి, ఆ భవనాన్ని రెండు గోపురాలు, మూడుప్రాకారాలు, సప్తద్వారాలు, ద్వారాలకు ద్వారతోరణాలు, ధ్వజస్తంభం, ఆస్థాన మంటపం, యాగమంటపం, గోశాల, గజశాల, అశ్వశాల, ధాన్యాగారం, వస్త్రకోష్ఠం, పుష్పకోష్ఠం, సుగంధకోష్ఠం, అన్నప్రసాదాలను నేతితో పణ్యారాలను సిద్ధం చేయడానికి రెండు వంటగదులు, ఒక నూనెగది, ఒక నేతిగది, రత్నాభరణాల గది, ఉండేట్లు ఒక చక్కని బావిని తవ్వడానికి, రాతిపనికి ఏర్పాట్లు చేయమని భవనాన్ని తూర్పుముఖంగా నిర్మించమని చెప్పాడు.** (ఒక బావిని తొండమానుడు (తన పూర్వజన్మలో) రంగదాసుగా ఉన్నకాలాన త్రవ్వించి రాగిరేకులతో తాపడంచేసి బంగారుపూత పూయించాడు.)

వేంకటేశ్వరుడు ఆదేశించిన ప్రకారంగా తొండమానుడు భవనాన్ని నిర్మించాడు. దానిపై చతుర్మూర్తులు, గరుడాళ్వారు ఉన్న విమానాన్ని నిర్మించి బంగారు కలశాలతో అలంకరించాడు. కొండపైకి ఒక యోజనం నిడువైన దారిని నిర్మించాడు. భక్తులకోసం దారిలో విశ్రాంతి మంటపాలను కట్టించాడు. బావులను త్రవ్వించాడు. అన్నింటిని పూర్తికావించి శ్రీ వేంకటేశ్వరుణ్ణి మందిర ప్రవేశం చేయవలసిందిగా వినయంగా ప్రార్థించాడు. రాజు ప్రార్థనకు ప్రీతుడై పద్మావతీ సహితంగా ఇంద్రాది దేవతలు వెంటరాగా, దైవజ్ఞులు, వేదవిదులు కలిసిరాగా, క్రొత్త మందిరానికి శ్రీ వేంకటేశ్వరుడు ప్రవేశించాడు. అక్కడ ఋషులు శ్రీ వేంకటేశ్వరస్వామిని అర్చించినారు. విమానంపై విరాజిల్లుతున్న వేంకటేశ - శ్రీనివాసునిపై దేవతలు యక్షులు పుష్పవర్షం కురిపించారు.

అప్పటినుండి భగవంతుడై శ్రీనివాసుడు సుప్రసిద్ధ విమానసహితమైన గర్భాలయంలో తేజోమూర్తియై విరాజిల్లుతూ ఆనందంగా విరాజమానుడై ఉన్నాడు. భక్తులందరికీ ఆనందాన్ని ప్రసాదిస్తుంది కాబట్టే, విమానానికి ఆనందనిలయ విమానమనిపేరు. **శంఖాన్ని చక్రాన్నీ వదలి, లక్ష్మీదేవిని పద్మావతి వక్షఃస్థలంలో ధరించి దక్షిణహస్తంతో సకల సురార్చితమైన తన పదయుగమే సకలజనులకూ శరణ్యమని చూపిస్తూ,** వామహస్తాన్ని కటిభాగంపై నుంచి, తన చరణాలను ఆరాధించినవారికి సంసారసాగరం నడుములోతే అని తెల్పుతూ, శ్రీనివాసుడు ఇప్పటికీ సమధిక వైభవంతో తన మందిరంలో వెలుగొందుతూ ఉన్నాడు.

**భవిష్యోత్తర పురాణంలో తొండమానుడే శ్రీ వేంకటేశ్వర దేవాలయాన్ని, విమానాన్ని, రెండు గోపురాలను మూడుప్రాకారాలను, కొండదారిపై విశ్రాంతి మంటపాలను, లోపలి సౌధాలను తదితరమైన వసతులను నిర్మించినట్లు ఉండగా, దేవస్థాన శాసనాలు ఆ భవనాలన్నీ వివిధ కాలాల్లో వేర్వేరు వ్యక్తులచే నిర్మింపబడినట్లుగా తెల్పుతున్నాయి.** ముక్కోటి ప్రదక్షిణం గోడపై ఉన్న శిలాఫలకాలపై పూర్తిగానూ పాక్షితంగానూ శాసనాలున్నాయి. [కొన్ని శాసన ఫలకాలను గోడనుండి వేరుచేయబడి భూమిపై దేవాలయం లోనూ పడి ఉండగా వాటిని నేనొక వేదికపై నిలబెట్టి ఉంటిని.] ఆ శాసనాలలో శ్రీమాన్ విజయాదిత్యుడు (బాణవంశీయుడైన విజయాదిత్య మహావలి బాణరాయుడు కావచ్చును. ఈయన పల్లవ రాజైన విజయదంతి విక్రమవర్మకు సామంతుడై ఉండెను) (క్రీ.శ. 779-830) (TTD Early Inscritptions Vol **I**, Serial no. 3, P.10) కొప్పాత్ర మహేంద్రపన్మర్ (మహేంద్రవర్మ **I**, క్రీ.శ.600 నుండి 630 వరకు పాలించిన పల్లవ ప్రభువు) రాజరాజ చోళుడు1 - ఈయన రాజ్యంచేసిన 16 వ సంవత్సరంలో పరాంతకదేవీ అమ్మన్‌చే శ్రీ వేంకటేశ్వరస్వామికి ముఖాలంకార పట్టం సమర్పింపబడింది. ఆమే పరాంతక**II**, సుందరచోళుని పట్టమహిషి - రాజరాజ రాణులలో ఒకతెయైన ఉలగమాదేవి (నం.16) రాజేంద్రచోళ **I** (రాజరాజచోళుని పుత్రుడు, వారసుడు) వీరరాజేంద్రదేవుడు (S.No.22) కులోత్తుంగచోళుడు **I**, ఆయన రాణి అవనిముళుదుడైయాళ్ (S.No.26-32) మధురాంతక పొత్తపిచోళ అల్లుంతిరు- క్కాలత్తిదేవుడు (S.No.42) జటావర్మన్ సుందర పాండ్యుడు **I** (S.No.52, 54, 55) విజయ గండగోపాలుడు (S.No.67, 68, 69, 72, 74, 77, 79) మొదలైనవారు పేర్కొనబడినారు.

వారందరూ క్రీ.శ.7 వ శతాబ్దంనుండి 13 వ శతాబ్దంవరకు రాజ్యాన్ని పాలించినవారు. కొన్ని అసంపూర్ణ శాసన శిలలు - ఇవి ఇప్పటికీ ముక్కోటి ప్రదక్షిణం గోడలపై ఉన్నాయి - అక్కడినుండి వేరుచేయబడి మరొకస్థలంలో వేయబడిన శాసనాల ఫలకాలు - వీటిని పరికిస్తే ముక్కోటి మండపానికి ఒకటి రెండుసార్లు మరమ్మతు చేసినట్లు తెలుస్తున్నది. తొలగింపబడిన శిలాఫలకాలు ధ్వజసంభానికి ముందున్న విమాన ప్రదక్షిణానికి నిర్మించిన రెండవ ప్రాకారంలో కన్పిస్తున్నాయి. వెలుపలనున్న మూడవ ప్రాకారం (ఇది వీథికానుకొని ఉన్నది) పెద్దగోపురం, ప్రవేశద్వారం చుట్టూఉన్నది. దీనిలోనూ కొన్ని కన్పిస్తున్నాయి. మూడవ రాజరాజచోళుడు, మొదటి జటావర్మ సుందర పాండ్యుడు, వీరనరసింహదేవయాదవరాయలు, విజయ గండగోపాలుడు మొదలైనవారు 13 వ శతాబ్దంలో రాజ్యాన్ని పాలించారు. వీరు శాసనాలను చెక్కించినారు. అనగా 13 వ శతాబ్దంవరకు ముక్కోటి ప్రదక్షిణం పదిలంగా ఉన్నట్లు అనుమానింపవచ్చు. [శాసనాల విలువతెలియక యధేచ్ఛగా మరమ్మతులు చేయడంవల్లనే కాబోలు 13 వ శతాబ్దికి చెందిన వీరనరసింహ యాదవరాయలు దూరదృష్టితో చాలా విలువైన నియమం చేశాడు. ఆయనకాలంలో తిరుప్పుల్లాణిదాసర్, వేంకటేశ్వరస్వామివారి ఆలయ మధ్యభాగాన్ని మరమ్మతు చేయవలసిందిగా ఒక వినతిపత్రాన్ని సమర్పించాడు, వీరనరసింహ యాదవరాయలు రాజ్యం చేస్తున్న 40 వ సంవత్సరంలో ఆ వినతిపత్రం కారణంగా రాజు ఆలయ నిర్వాహకులకు ఆదేశాలను పంపించాడు. మరమ్మతు చేయవలసిన చోట్లలో ఉన్న శాసనాలను, పునర్నిర్మాణం చేయవలసిన స్థలాల్లో ఉన్న శాసనాలను, జాగ్రత్తగా వ్రాసిపెట్టుకొని, మళ్ళీవాటిని శిలాఫలకాలపై చెక్కించి పని పూర్తియైన తరువాత యథాపూర్వస్థానంలో నిక్షేపించాలని ఆజ్ఞచేశాడు. నాలుగు చోళరికార్డులు (S.No. 8, 9, 14, 19 & 88, 12, 16, 22, 28 & 119 – Vol **I** లో) తిరుపతి దేవస్థానం సమకూర్చిన పూర్వశాసనాలు- ఇప్పటికీ సరియైన స్థితిలో లభించడానికి దూరదృష్టితో రాజు చేసిన నియమంవల్లనే సాధ్యమైందని చెప్పవచ్చు.] ఆయన చేసిన మహోపకారకమైన ఆజ్ఞాఫలితాని కిదేసాక్ష్యం. ("తిరుపతి దేవస్థానం Epigraphical Report P.2") మొదటి విజయనగరరాజులు, సంగమవంశరాజులు, కృష్ణదేవరాయలు, అచ్యుతదేవరాయలు కాలంనాటి శాసనాలు విమాన ప్రదక్షిణం చుట్టూ ఉన్న రెండవప్రాకారంపై లోపలా, బయటా, సంపంగి ప్రదక్షిణంలో ఉన్నాయి. బయటనున్న మూడవప్రాకారం లోపలా, బయటా, సదా శివరాయలకాలం నాటి పెక్కుశాసనాలు, వేంకటపతిరాయలవంటి ఆరవీటి వంశరాజుల శాసనాలు ఉన్నాయి. ఈ రెండు ఎత్తైన ప్రాకారాలు యాదవరాయల కాలంలో ముఖ్యంగా వీరనరసింహ యాదవరాయలకాలంలో నిర్మింపబడి ఉండవచ్చు. వీరు ఇంచుమించుగా స్వతంత్రప్రతిపత్తి కలిగిన బలవంతులైనరాజులు, శ్రీ వేంకటేశ్వరస్వామివారి యెడల గొప్ప భక్తికలవారు. వారు శాసనాల లేఖనానికి వసతి కల్పించారు. వారి సమయానికి చెందిన వాటికేకాదు, తరువాతి విజయనగరరాజులు శాసనాలు చెక్కించడానికి మార్గదర్శకు లైనారు.

ఈ రెండుప్రాకారాల మధ్యభాగాన్ని తూర్పుదిక్కున విస్తృతం చేసినట్లు కన్పిస్తున్నది. రెండు ప్రవేశగోపురాలను వాటిపై నిర్మించారు. ఆ సందర్భంగానే అక్కడ అంతకు పూర్వమే రెండుప్రాకారాల

ప్రవేశద్వారాలకు రెండు వైపుల లిఖింపబడిన శాసన శిలాఫలకాలు విరిగిపోయి, శాసనాలు అసంపూర్ణంగా ఉన్నాయి.

విమాన ప్రదక్షిణ రెండవప్రాకారానికి ఆనుకొని ఆగ్నేయదిశలో ఎత్తైన వేదికపై వంటశాలను, ఆ ప్రాకారానికి పడమటి దిక్కున ఒక పొడవైన మంటపాన్ని యాగశాలను కొన్ని గదులను నిర్మించారు. ఇవన్నీ పడమట దిక్కున ఉన్న కల్యాణమంటపాన్ని కలుస్తాయి. ఈ కల్యాణమంటపానికి సమీపంలో ఆకుపచ్చనిరంగుతో ఉండేరాతితో సిద్ధంచేయబడిన సన్నని జోడుస్తంభాలతో (ఇవి నాలుగువైపుల ఉన్నాయి) ఒక చిన్న మంటపం ఉన్నది. ఈ స్తంభాలను స్వల్పంగా తాకితే సంగీతధ్వనులు వస్తాయి. పడమటి దిక్కులోనే ఒక చిన్నమందిరం ఉన్నది. దీనిలోనే బ్రహ్మోత్సవం ప్రారంభమైన దినం మొదలుకొని దీపావళి వరకు శ్రీ వేంకటేశ్వరస్వామి ఉత్సవమూర్తులను వేంచేపుచేసి ఉంచుతారు.

దీపావళిదినాన స్నానానంతరం ప్రసాదాలను, పణ్యారాలను ఆరగింపు చేసి గర్భాలయంలో ప్రవేశపెడుతారు. తిరుమామణిమంటపానికి ఎదురుగా వంశపారం పర్యంగా విధులను నిర్వహిస్తున్న ఉద్యోగులను ప్రత్యేకంగా సమావేశపరుస్తారు. దేవాలయంలో కార్యనిర్వహణం చేస్తున్నవారు కూడా ఈ సమావేశంలో పాల్గొంటారు. దీన్ని **'ఆస్థానం'** అంటారు. ఈ సమయంలో యాగశాలలో శ్రీరాముదు తదితర దేవతల విగ్రహాలను వేంచేపు చేస్తారు. కేవలం మూలమూర్తితోపాటు భోగమూర్తి రజత విగ్రహాలు, ఉగ్రమూర్తి గర్భాలయంలో ఉంటారు.

[ఉత్తరంవైపు వంటశాలకు వెళ్ళే ప్రవేశద్వారం వద్ద వకుళమాలిక శిలావిగ్రహం ప్రతిష్ఠింపబడి ఉన్నది. **వకుళమాలిక శ్రీ వేంకటేశ్వర స్వామిని పెంచిన తల్లి.** శ్రీ వేంకటేశ్వరస్వామి భోజనావసరాలను ఆమెయే సమకూరుస్తుంది. అందుకే వంటశాలవద్ద ప్రతిష్ఠింపబడింది. ఆమెయే శ్రీకృష్ణభగవానుని తల్లియైన యశోదాదేవి. శ్రీకృష్ణావతారకాలంలో శ్రీకృష్ణ క్రీడావినోదాలను సంపూర్ణంగా పొందజాల నందున **వకుళమాలగా అవతరించి శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధికి చేరి ఆ లీలావినోదాలను సంపూర్ణంగా అనుభవిస్తున్నది. శ్రీ వేంకటేశ్వరుదు శ్రీకృష్ణుడు - ఇద్దరూ శ్రీ విష్ణుస్వరూపాలే.**]

[కల్యాణ మంటపంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి కల్యాణాన్ని రెండుమూడేళ్ళ క్రితంవరకు నిర్వహించేవారు. ఈ మంటపంలోనే శ్రీ మలయప్పస్వామి ఉత్సవమూర్తికి నాచ్చియార్లైన శ్రీ లక్ష్మీదేవి, శ్రీ భూదేవులకే కల్యాణాన్ని నిర్వహించేవారు. ఇప్పుడీ కల్యాణోత్సవాన్ని ఆలయ ప్రదేశద్వారానికి దక్షిణంగా ఉన్న రంగనాయకుల మంటపంలో నిర్వహిస్తున్నారు.] ఉన్నతమైన వేదికలపై ఇలాంటి వసారాలు రెండవ ప్రాకారానికి అనుబంధంగా పశ్చిమంగా ఉత్తరంగా నిర్మింపబడినాయి. విమాన ప్రదక్షిణానికి కూడా ఈ వసారాలు వివిధమైన అవసరాలకై గదులుగా మార్చబడినాయి. గరుడ, గజాశ్వాది వాహనాలకు, పుస్తకాలు రికార్డులను భద్రపరచడానికి, స్వామికర్పించిన లడ్డు, వడ, మొదలైన పణ్యారాలను నిక్షేపించడానికి, స్వామివారి వస్త్రాదులను జాగ్రత్త చేయడానికి, చందనకర్పూర చూర్ణాలను సిద్ధం చేయడానికి, శ్రీరామానుజుల సన్నిధి,

శ్రీ యోగనరసింహస్వామివారి సన్నిధి కల్పించడానికి ఈ గదులను ఉపయోగిస్తున్నారు. ఇవి ఉత్తరదిశలో ఉన్నాయి. ఈ గదులతో పాటు మరొక చిన్నగది కూడా ఉన్నది. ఇది శ్రీరామానుజ సన్నిధి వసారాకు ప్రక్కగా ఉన్నది. దీనికొక చిన్న దారు నిర్మిత ద్వారం ఉన్నది. రెండు చెక్కతలుపులు మూయబడి సీల్ చేయబడి ఉన్నాయి. ఈ గదిలోనే స్వామి సేవకు అంకితమైన శ్రీ అన్నమాచార్యులు, ఆయన కుమారుడు పెద్ద తిరుమలాచార్యులు, వారి కుమారుడైన చిన్నతిరుమలాచార్యులు రచించిన 18000 సంకీర్తనములు 3000 తామ్రఫలకాలపై లిఖింపబడి భద్రపరచబడి ఉన్నాయి. ఒక్కొక ఫలకంపై ఒక్కొక వైపు మూడు సంకీర్తనముల చొప్పున లిఖింపబడి ఉన్నాయి. శాసనాలలో ఆగదిని తాళ్ళపాక వాగ్గేయకారుల **"సంకీర్తన భండారం"**గా పేర్కొన్నారు. అన్నమాచార్యుల జీవితచరిత్రను ఆయన మనుమడు రచించాడు. దానిలో శ్రీ అన్నమాచార్యులవారు 32000 సంకీర్తనలను రచించినారని పేర్కొన్నాడు. (Dev. Ep. Rep. PP.2, 279-302). వారు దేవాలయ సంకీర్తనాచార్యులు. వారి వారసులు ఈ నాటికీ శ్రీ వేంకటేశ్వర దేవాలయంలో నిర్వాహకులుగా ఉన్నారు.

సంపంగి ప్రదక్షిణంలో రెండు ప్రాకారాల మధ్యభాగంలో ఒక అనాచ్ఛాదిత మంటపం ఉన్నది. ఇది కాస్తా ఎత్తైన వితర్దికపై ఉన్నది. మొదటి పెద్ద గోపురానికి దాపుగా ఉన్నది. దీని ఉత్తరభాగాన విజయనగర చక్రవర్తి శ్రీకృష్ణదేవ మహారాజు, ఆయన ఇద్దరు రాణులు తిరుమలదేవి, చిన్నాదేవి తామ్రవిగ్రహాలు నెలకొని ఉన్నాయి. దీని దక్షిణభాగాన మొదటి వేంకటపతి దేవ మహారాయలు తామ్రవిగ్రహం (ఆరవీటి వంశరాజు), అచ్యుతరాయ మహారాజు ఆయన రాణివరదాజీ అమ్మన్ శిలావిగ్రహాలు ఉన్నాయి. కృష్ణదేవరాయలు, తిరుమలదేవి, చిన్నమదేవి, వేంకటపతిదేవ విగ్రహాల భుజస్థలంలోవారి పేర్లు చెక్కబడి ఉన్నాయి. అచ్యుతరాయ, వరదాజీ అమ్మన్ విగ్రహాలపై పేర్లు చెక్కబడిలేవు. అందుకే సర్కారువారి శాసన పరిశోధకుడు, ఆ విగ్రహాలు వేంకటపతిరాయల విగ్రహానికి ఎదురుగా ఉండటం మూలాన అవి వేంకటపతిరాయల తలిదండ్రులైన తిరుమలదేవరాయలు ఆయన భార్య వేంకటాంబ విగ్రహాలు కావచ్చునని ఊహించినాడు (Archaeological Survey Report for 1911-12,189, footnote 3). నేనూ అట్లాగే భావించినప్పటికీ "Dev. Epigrl Report" లో సందేహాన్ని వ్యక్తంచేస్తూ వారి చిత్రపటాలు నం.53 క్రింద "బహుశః తిరుమలరాయ వేంకటాంబలవి" కావచ్చును, అని వ్రాశాను. నా రిపోర్ట్ ప్రకటించబడిన కొద్దికాలం తర్వాత ఒక పురాతన దేవస్థానం దిట్టంపుస్తకంలో (దిట్టం పుస్తకం నైవేద్యానికి అవసరమైన వస్తువుల అన్నప్రసాదాల వివరాలు ఉండేది) ఈ విగ్రహాలన్నింటికీ ప్రతిదినం నివేదనం ఏర్పాటు చేసినట్లు ఉండటం, ఆ విగ్రహాల పేర్లు కూడా పొందుపరచి ఉండటం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ విగ్రహాల పేర్లు శ్రీకృష్ణదేవ రాయలు, తిరుమలదేవి, చిన్నాదేవి, వేంకటపతిరాయలు, అచ్యుతరాయలు, వరదాజీఅమ్మన్‌గా పేర్కొనబడినాయి. తిరుమలరాయవిగ్రహం కూడా పేర్కొనబడింది. కాని, ఆ విగ్రహం దేవాలయంలో కనబడటంలేదు. [ఆ విగ్రహాల పేర్లను సరిచేస్తూ నేను ముద్రాశాలలో చిన్నకాగితం ముక్కలపై ముద్రింప చేశాను. వాటిని ఆ విగ్రహాల చిత్రపటాల క్రింద అంటించాలని కోరాను. కాని, దేవాలయం రికార్డ్స్ ఉద్యోగులు ఆశ్రమ

తీసుకోలేదు. అందుకే ఆ చిత్రపటాలక్రింద ముద్రించిన పేర్లు తప్పుగానే ఉన్నాయి. ఇప్పటికైనా దేవస్థాన యాజమాన్యం దయచేసి ఆ తప్పును సవరిస్తే బాగుంటుంది.]

(రాయవాచకం శ్రీకృష్ణదేవరాయల సమకాలంనాటి పుస్తకం. అది ఆ రాజు పాలనను వివరిస్తుంది. దీనిని మద్రాస్ విశ్వవిద్యాలయంవారు Sources of Vijayanagar History P 127 గా ముద్రించినారు. దీనిలో శ్రీకృష్ణదేవ రాయలే తన విగ్రహాన్ని, తన ఇద్దరు రాణులవిగ్రహాలను నమస్కార ముద్రలో ఉన్నవానిని, **శ్రీ వేంకటేశ్వరస్వామికి శాశ్వత కైంకర్యరూపంగా నెలకొల్పినట్లున్నది. శ్రీ వేంకటేశ్వరస్వామి ఉత్సవమూర్తిని ఆ విగ్రహాలను ఆశీర్వదించడానికి అక్కడికి తీసుకు వచ్చినట్లుగా కూడా పేర్కొనబడింది. ఇది క్రీ.శ.1517 సం॥ జనవరి నెల రెండవ తేదీన, శ్రీకృష్ణదేవరాయలు స్వామి నర్చించడానికి వచ్చాడు. ఆ తేదీకి ఒకటిరెండు దినాలు ముందుగా వీటిని నెలకొల్పి ఉండవచ్చును.** తానే శ్రీకృష్ణరాయలు ఈ విగ్రహాలను నెలకొల్పడం, ఉత్సవమూర్తిని అక్కడికి తీసుకురావడాన్ని గమనిస్తే శ్రీకృష్ణదేవరాయలే ఈ మంటపాన్ని నిర్మించి ఉంటాడని భావింపవచ్చును. స్వామిని దర్శించి శ్రీకృష్ణరాయలు కుంభకోణంలో నిర్వహింపబడే మహామఖానికి వెళ్ళాడు (అది 6th February 1517 లో సంపన్నమైంది) (T.T.Dev.Ep.Report, page 186, Note-2). ఈ మంటపానికి దక్షిణదిశలో రంగమంటపం ఉన్నది. తిరుచిరాపల్లి జిల్లా శ్రీరంగంలోని శ్రీరంగనాథస్వామి ఉత్సవవిగ్రహం, (శ్రీరంగం మొదలైన క్షేత్రాలను మహమ్మదీయులు దురాక్రమణ చేసినందున) ఈ రంగమంటపంలోనే అరువది సంవత్సరాల కాలం నిత్యపూజలందు కున్నదని సంప్రదాయంగా ఉన్న నమ్మకం. శ్రీరంగం మొదలైన పుణ్యక్షేత్రాలను మొదటమాలిక్‌కాఫర్ 1310లో తరువాత మహ్మద్‌బిన్ తుగ్లక్ ధ్వంసం చేశారు. శ్రీరంగనాథస్వామి ఉత్సవమూర్తిని రహస్యంగా మైసూర్ ప్రాంతంద్వారా తిరుపతికి గోప్యంగా తెచ్చారు. విజయనగరరాజైన మొదటి బుక్కరాయలు కుమారుడు రెండవ కుమార కంపన, ఆయన సేనానులు సాలువ మంగిదేవుడు, గోపన్న మొదలైనవారు 14వ శతాబ్ది ఆరవదశకంలో మదురైసుల్తాన్‌ను ఆయన యుద్ధస్థావరాలను గెలిచారు. **అళగియమణవాళ పెరుమాళ్ అనే పేరుగల శ్రీరంగనాథస్వామి ఉత్సవమూర్తిని గోపన్న శ్రీవేంకటేశ్వరాలయంనుండి మొదట శెంజి (జింజీ) కి తీసుకువెళ్ళి, కొంతకాలం తరువాత శ్రీరంగానికి చేర్చాడు. అప్పటికి ఆయన శ్రీరంగనాథాలయాన్ని పునర్నిర్మించి ప్రతిష్ఠ చేయించాడు.** (T.T.D. Ep.Report, page.131)).

ఈ రంగమంటపం సువిశాలమై అందంగా చెక్కబడిన ఎత్తైన గొప్ప శిలాస్తంభాలతో ఒప్పారి ఉంటుంది. ఈ మంటపం చివరలో మరొక చిన్న మంటపం ఉన్నది. దీనిలో పెద్దశేష వాహనం ఉన్నది. రెండు మూడు సంవత్సరాల నుండి దీనికిరువైపుల వేరే వాహనాలను కూడా ఉంచుతున్నారు. కల్యాణోత్సవాలను ఇక్కడనే నిర్వహిస్తారు. రంగమంటపానికి ముందు భాగంలో దేవస్థానం కార్యాలయం ఉన్నది. ఇక్కడే సేవలకు కావలసిన టిక్కెట్లను పొందాలి. అన్న ప్రసాదాలకు ఉత్సవాలకు వాహనసేవకులు ఇక్కడే శుల్కాన్ని చెల్లించాలి. గర్భాలయప్రవేశానికి సమీపంలో మహామణి మంటపంలో ఆగ్నేయదిశగా లేదా ఈశాన్యదిశగా ఉన్న గదిలో ఈ దేవస్థానం కార్యాలయం ఉండేది. (ప్రస్తుతం రంగమంటపంలో కార్యాలయంలేదు. దానిని వేరే స్థలానికి మార్చారు.)

**తిరుమలరాయమంటపం :**

రంగమంటపానికి పశ్చిమంగా కలిసి ఉన్న మంటపాన్ని తిరుమలరాయమంటపం అంటారు. ఉత్తరంవైపున ఉన్న ధ్వజస్తంభం ఈ మంటపానికి ఎదురుగా ఉంటుంది. తిరుమలరాయ మంటపం విశాలంగా ఉంటుంది. దీనిలో రెండు భాగాలున్నాయి. ముందున్న భాగం కాస్త క్రిందికి ఉంటుంది. వెనుకనున్న భాగం ఎత్తైన వేదిక పైన ఉంటుంది. పైకి వెళ్ళడానికి మెట్లు ఉన్నాయి. దీని మధ్యలో ఒక చిన్నగుడారం వంటిది ఉంటుంది. ఆస్థానం కాలంలో ఇందులో ఉత్సవ విగ్రహాలను, వివిధ ఉత్సవాల సమయంలో, వేంచేపు చేస్తారు.

క్రీ.శ. 1473 జూన్ నెలలో సాళువ నరసింహుడు **'డోలా మహోత్సవ అన్న-ఊంజల్ తిరునాళ్'** ఉత్సవాన్ని ప్రారంభించాడు. (ఈ ఉత్సవంలో హంస ఆకారంలో ఉన్న ఒక కొయ్యపలకను ఊయలగా అమర్చి దేవతావిగ్రహాలని ముందుకు వెనుకకు ఊపుతూ ఉంటారు.) ఈ ఉత్సవాన్ని మిథున, ఆణిమాసాల్లో (జూన్-జూలై) 5 దినాలు నిర్వహిస్తారు. పగలూ రాత్రి నైవేద్యాలు సమర్పించడానికి, తన తల్లిపేరున **మల్లాయమ్మన్ సంధి** అనే పేరుతో అన్నప్రసాదాన్ని సమర్పించడానికి, చిత్తిరై ఉత్సవం (ఏప్రిల్) లో మొదటి ఏడురోజులు నైవేద్యాలను సమర్పించడానికి, **కొడైతిరునాళ్** (వేసవి ఉత్సవం - ఆణిమాసం) లో 10 వ దినంనాడు, మకరసంక్రాంతి (15 జనవరి, విషువత్తు) నాడు, స్వామిపుష్కరిణి తీరంలో నున్న తీర్థవారిమంటపంలో వినియోగించడానికి (తీర్థవారి మంటపాన్ని సాలువ నరసింహుడు ఆలయ అర్చకుల నుండి కొనుగోలు చేశాడు.) ప్రతి సంవత్సరం తిరుమలలో నిర్వహింపబడే ఏడు బ్రహ్మోత్సవాలలో 9 వ నాటి నైవేద్యానికీ అవసరమైన ఏర్పాట్ల కోసం, పడై వీడు (సైనిక స్థావరం) రాజ్యంలో ఉన్ని దొమ్మరపట్టి గ్రామాన్ని భగవంతునికి సమర్పించాడు.

దొమ్మరపట్టి గ్రామంనుండి వచ్చే ఆదాయం, అన్న-ఊంజల్ ఉత్సవాన్ని ఐదు దినాలు నిర్వహించడానికి, తదితర ఉత్సవాలసమయంలో నైవేద్యం సమర్పించడానికి అవసరమైన ఏర్పాట్లకు, సరిపోయేది. కాని, ఆ ఉత్సవాన్ని నిర్వహించే స్థలాన్ని నిర్దేశించలేదు.

బహుశః ఇది తిరుమలరాయమంటపంలోనే నిర్వహింపబడే దనుకోవచ్చు. శకసం. 1394 నందననామ సంవత్సరం, కార్తిక శుక్లపక్షం ద్వాదశినాడు - ఉత్థాన ద్వాదశీపుణ్యావసరాన (1472 సం॥ అక్టోబర్ 13వ తేదీ) తిరుపతికి దక్షిణాన ఉన్న దుర్గాసముద్రం గ్రామాన్ని శ్రీ వేంకటేశ్వర స్వామి, శ్రీ గోవిందరాజస్వామివార్ల ఆలయాల నిర్మాణ కార్యక్రమాల కోసం దానం చేశాడు. (Vol.1.II, S.No.79) ఈ గ్రామాన్ని దానం చేయడంవల్లనే, ఆలయానికి చెందిన నిర్మాణవిభాగం, తిరుమల తిరుపతి గోపురాలను, తిరుమలలో నరసింహరాయమంటపాన్ని నిర్మించడం ప్రారంభింపబడి ఉంటుంది.

మే 30, 1482 తేదీ శాసనంలో శ్రీ వేంకటేశ్వర దేవాలయం యాజమాన్యానికి దుర్గా సముద్రంగ్రామాన్ని దేవాలయ నిర్మాణశాఖ వారికి అప్పగించమని ఒక రాజాజ్ఞ ఉన్నది. ఆ రాజాజ్ఞలోనే, అప్పటికే ప్రారంభించిన

పనులను పూర్తిచేయాలని, అవసరమైన మరమ్మతులను నిర్వహించాలని, ఇంకా ఆ రెండు దేవాలయాలలో ఏవైనా అవసరమైన నిర్మాణాలు ఉంటే వాటిని చేయాలని దేవాలయ నిర్మాణశాఖ సిబ్బందికి ఆదేశం ఉన్నది. (S.No.79)

దుర్గసముద్రం గ్రామాన్ని దానంచేసిన తేదీ అక్టోబర్ 13, 1472. డోలామహోత్సవం లేదా అన్న-ఊంజల్ తిరునాళ్‌ను ప్రారంభించిన తేదీ జూన్ 1473. S.No.79 సమాచారంతో కలిపి ఆలోచిస్తే దేవాలయ నిర్మాణశాఖవారు వెంటనే నరసింహరాయమంటప నిర్మాణం ప్రారంభించి ఉంటారని, నరసింహరాయలు ప్రారంభించిన ఊంజల్ ఉత్సవం అప్పటికి పూర్తిగా నిర్మాణం కాని, ఆలయాన పేరిటిమంటపంలో నిర్వహింపబడిందని తెలుస్తుంది. మే 1482 నాటికి అది పూర్తిగా నిర్మితమై ఉండవచ్చు.

కొంతకాలానికి నరసింహరాయమంటపం శిథిలమైపోయి ఉండవచ్చు లేదా ఊంజల్ ఉత్సవం నిర్వహించడానికి స్థలం సరిపోకపోయి ఉండవచ్చు. ఆరవీటి వంశీయుడైన తిరుమలరాయలు చంపక కుర్రు (లేదా సంపంగి ప్రదక్షిణం) లో ఊంజల్ మంటపాన్ని నిర్మించిన విషయాన్ని S.No.79 Vol V dated 15-12-1561 తెల్పుతున్నది. తిరుమలరాయలే నరసింహరాయ మంటపాన్ని ఉద్ధరించి ఉంటాడు లేదా విస్తృతంచేసి ఉంటాడు. తిరుమల రాయలు తాను నిర్మింప చేసిన ఊంజల్ మంటపంలో, బ్రహ్మోత్సవాల సమయంలో 14 దినాలు ఉత్సవమూర్తులకు అతిరసపడులను స్వయంగా ఏర్పాటు చేశాడు. సాలువ మల్లయదేవుడు ప్రారంభించిన (జనవరి 1564) పవిత్రోత్సవం 5 దినాలు నరసింహరాయలు ప్రారంభించిన ఊంజల్ సేవోత్సవం 5 దినాలు కూడా అతిరసపడులను ఏర్పాటు చేశాడు. ఆ సమయంలో తిరుమలరాయడు ఊంజల్ మంటపంలోనే కూర్చునేవాడు. తిరుమలరాయడు వసంతోత్సవాలను (5 రోజులు) ప్రారంభించాడు (జూన్ 1547, V-93) తిరుమలలో మరెన్నో ఉత్సవాలు ఆ దినాల్లో నిర్వహింప బడేవి. **దాదాపు 25 ఉత్సవాలు, 10 బ్రహ్మోత్సవాలతో కలిసి - 25 దినాలు, ఇతర పర్వదినాలు 241 అన్నింటినీ తిరుమలరాయడు ఏర్పాటు చేశాడు.**

సాళువనరసింహరాయలు ప్రారంభించిన ఊంజల్‌సేవోత్సవం 5 దినాలకు నైవేద్యాలు ఏర్పాటు చేయడం, తిరుమలరాయడు సంపంగి ప్రదక్షిణంలో మంటపాన్ని నిర్మించడం వీటివలన తిరుమలరాయ మంటపం అంటే సాళువ నరసింహుని ఊంజల్ మంటపం, పునర్నిర్మాణం, లేదా క్రొత్తగా దాన్నే నిర్మించడమై ఉంటుంది.

సాళువ నరసింహుడు ఊంజల్ మంటపంతోపాటు, తిరుక్కోనేరి (స్వామిపుష్కరిణి) లో వసంత మంటపాన్ని తన "ధర్మం"గా నిర్మించి తిరుప్పళ్లి ఓడత్తిరునాల్ కొరకై ప్రత్యేకించినట్లు తెలుస్తున్నది. 10 దినాలు నిర్వహింపబడే కోడైతిరునాళ్‌లో ఒక దినంనాడు ఈ కోడైత్తిరునాళ్ నిర్వహింపబడాలని నిర్దేశించినాడు. ఉత్సవమూర్తులకు నైవేద్య సమర్పణకై తాను నిర్మించిన వసంత మంటపంలోనే ఆసీనుడై ఉండేవాడు. అధ్యయనోత్సవం తరువాతి 10 దినాలలో మూలమూర్తులకు ప్రత్యేక నైవేద్యం సమర్పించడం

ఏర్పాటుకై నరసింహరాయలు అరగం మురుక్కంపట్టు అనే గ్రామాన్ని దానం చేశాడు. ఇది మకరసంక్రాంతినాటి అర్ధోదయ పర్వసమయంలో చేశాడు (28.12.1467) ఈ గ్రామం తిరుత్తణిప్రాంతంలో ఉన్నది. దీనికి చెందిన దానపత్రం శక సం. 1389 సర్వజిత్ సంవత్సరం మీనమాసంలో రిజిష్టర్ చేయబడింది. దీనికి సరైన ఇంగ్లీష్ తేది 16-3-1468.

దేవాలయంలోపల ఉన్న సంపంగి ప్రదక్షిణానికి నాలుగువైపుల నాలుగుస్తంభాల మంటపాలను నరసింహరాయలు నిర్మించాడు. పుష్కరిణికి నాలుగువైపుల మంటపాలను నిర్మించాడు. దేవాలయ అర్చకులనుండి తీర్థవారి మంటపాన్ని కొనుగోలు చేశాడు. ఈ మంటపాలలో ప్రత్యేక సందర్భాలలో నైవేద్యాలకు ఏర్పాటు చేశాడు. బ్రహ్మోత్సవాలలో 7 వ దినాన, తిరుప్పళ్లిఓడమ్ (తెప్పోత్సవం) దినాన ప్రత్యేకంగా నైవేద్యాల ఏర్పాటు ఉండేది. తిరుప్పళ్లిఓడమ్‌ను స్వామికి తన కైంకర్యంగా నిర్వహించేవాడు. ఆ ఉత్సవం, ఆయనపేరున, ఆయన ముగ్గురు కుమారులు కుమార నరసయ్యన్, చిక్కసంగమన్, పెరియసంగమన్‌ల పేరున నిర్వహింపబడేది. ఒక్కొక మంటపంలో ఒక అప్ప-పడి సమర్పింపబడేది. (Vol.II, S.No.50). దీనికి అనుబంధంగా ఉన్న S.No.51 వలన నరసింహరాయలు పుష్కరిణీ పవిత్ర తీరంలో నందనవనాన్ని పెంచినాడని, మరొక నందనవనాన్ని నరసింగరాయ కోనేరు తీరాన పెంచినాడని తెలుస్తున్నది. నరసింగరాయ కోనేరును ఆయనే తన పేరున త్రవ్వించి నిర్మించి ఉంటాడు. ఒక సత్రాన్ని కూడా నిర్మించాడు. అది కూడా నరసింగరాయకోనేటి ఒడ్డున ఉండేది. పురట్టాసి బ్రహ్మోత్సవాల సమయంలో (సెప్టెంబర్ - అక్టోబర్) ఆ సత్రాన్ని పది దినాలు నిర్వహించే వారు. నరసింహరాయకోనేరు తరువాత కాలాన అచ్యుతరాయ కోనేరుగా మారిఉండవచ్చు. ఇది పుష్కరిణికి పడమట, పడమటి ముఖ్యవీధికి తూర్పున ఉండేది. 19 వ శతాబ్దంలో దీనిని పూడ్చి ప్రముఖులు కొబ్బరితోటను పెంచారు. కొంతకాలం క్రితం, దీనిని దేవస్థానం అధికారులు తిరిగి తీసుకొని దానిపై యాత్రికులకు ఆవాసాలను నిర్మించారు. Vol.II, S.No.79 ఆధారంగా, ఆశాసనం కాలానికి పల్లెకు వెళ్ళే మార్గంలో రెండు బయటిగోపురాలు - ఒకదాని నుండి మరొకటి 100 గజాలదూరంలో ఉత్తరదక్షిణాభి ముఖంగా ఉండేవి. దానిలో ఒకటి మొన్నటివరకూ అసంపూర్ణంగా ఉండిపోయింది.

**వేయిస్తంభాల మంటపం=** Vol.II, S.No.18 శక నం. 1385, స్వభాను సంవత్సరం మకరమాసం - సరియైన ఇంగ్లీష్ తేదీ 18 జనవరి 1464 లో సాళువమల్లయదేవ మహారాజు శాసనం. మల్లయదేవుడు ఎఱ్రకంపయ దేవమహారాజు పుత్రుడు. కంపయదేవుడు సాళువ నరసింహరాయ మహారాజుకు దాయాది సోదరుడు. ఆశాసనం, మల్లయదేవుడు శ్రీవేంకటేశ్వర స్వామి ప్రీతికై, మూలమూర్తికి ఉత్సవమూర్తులైన మలైక్కునియన్నిన్నపెరుమాళ్ళ, శ్రీదేవీ భూదేవీ నాచ్చియార్‌లకు, నిత్యార్చన పాయసంతో అర్పించడానికి, తిరుమలలో ఆ కాలాన నిర్వహింపబడే 7 బ్రహ్మోత్సవాలలో 3, 4, 5, 7 దినాలలో అర్పించడానికి ఆలయంలో కార్తికమాసంలో నిర్వహించే తిరుక్కార్తిగై ఉత్సవాన్ని, శ్రావణమాసం (అణిమాసం-ఆగస్ట్-సెప్టెంబర్) శుక్లపక్షంలో నిర్వహించే ఐదునాళ్ళ పవిత్రోత్సవాన్ని దానికనుబంధమైన అంకురారోపణ,

ఆలయపరిసరాల అలంకరణ వేదపారాయణం, పురాణ పఠనం, ఆలయవీధులలో ఊరేగింపు, పగలు, రాత్రి నివేదన, మొదలగువానికి, తన వ్యయంతో తాను రెండు దేవాలయగ్రామాలకు సాగునీటికై త్రవ్వించిన కాలువల సందర్భంగా ఉత్సవంలో పాల్గొన్నవారికి బహుమానాలు, సంభావనలు సమర్పించడానికీ, చంద్రగిరి రాజ్యంలోని ఏలంబాక్కంగ్రామాన్ని దానం చేసినట్లు తెల్పుతుంది. ఈ ఉత్సవాలన్ని ఆలయం ఎదురుగా వాకిట్లో తాను నిర్మించిన మంటపంలో నిర్వహింపబడే ఏర్పాటు చేశాడు.

ఆలయానికి ముందు సాళువమల్లయదేవుడు నిర్మించిన మంటపం, ద్వారానికి ముందుతూర్పు వీధికి, సన్నిధి వీధికి ఆనుకొని ఉన్న వేయిస్తంభాల మంటపమే కాని మరొకటికాదు. దీని పడమటిభాగం పడిపోయిన కారణంగా దీనిలో ఇప్పుడు వేయిస్తంభాలు ఉన్నాయని చెప్పలేము. కూలినప్రాంతం ప్రస్తుతం ఖాళీగా ఉన్నది. ఈ మంటపం తూర్పుముఖంగా ఉన్నది. దీనిలో ఒక చిన్నగుడారంవంటి నిర్మాణం ఉన్నది. దీనిలో ఉత్సవమూర్తులను వేంచేపు చేసి, మల్లయదేవుడు గ్రామాన్ని దానంచేస్తూ నిర్దేశించిన పూజాదికాలను నిర్వహించేవారు. పూజాదికాలవ్యయం ఆ గ్రామంపై శిస్తుమూలంగా వచ్చేది. విజయనగర శిల్పాన్ని స్పష్టంచేసే సుందరశిల్పంతో కూడిన పెద్దశిలా స్తంభాలు ఈ మంటపం పశ్చిమభాగంలో కన్పిస్తాయి.

సంవత్సరంలో 365 దినాలలో ప్రతిదినం ఏదో ఒక ఉత్సవం శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయంలో ఉండే విధంగా, రాజులువారి సామంతులు, భక్తులు ఏర్పాటు చేసినారు. ఆరవీటి వంశీయుడైన తిరుమలరాయలు 491 దినాలు అతిరసపడి కైంకర్యానికి ఏర్పాటు చేసిన శాసనం కన్పిస్తున్నది. (Vol.V.No.168, 15-12-1561), **10 బ్రహ్మోత్సవాల సందర్భంగా 140 దినాలు, ఇతర ఉత్సవాలతో 110 దినాలు, 13 అమావాస్యలు 13 పూర్ణిమలు, 25 ఏకాదశీపుణ్యవాసరాలు, రోహిణి పునర్వసు మొదలైన నక్షత్రాలకు సంబంధించి 13 దినాలు ఇతర పవిత్ర దినాలు ఇవన్నీ వీనిలో చేరుతాయి. 439 దినాలలో 439 అతిరసపడి సమర్పణాలు, శాసనంలో పేర్కొన్నా అది సరికాదు. కొన్ని సందర్భాలు ఉత్సవాలలో అంతర్భవించి ఉండవచ్చు.** చాలామంది ప్రజలు ఈ ఉత్సవాల్లో ఊరేగింపులలో పాల్గొని ఆ వైభవాన్ని తిలకించేవారు కావచ్చు.

సముద్రమట్టానికి 3000 అడుగుల ఎత్తున ఉన్న తిరుమల చల్లగా ఉంటుంది. చుట్టూ పెద్ద అడవి ఆవరించి ఉండటం మూలాన తరచుగా పెద్దవర్షాలు పడేవి. ఉత్సవాన్ని చూడటానికి వచ్చిన జనానీకానికి, మంగళ వాద్యబృందానికి, అర్చకులకు ఉద్యోగులకు ఈ వర్షాలవలన అసౌకర్యంగా ఉండేది. వీరందరికీ వర్షబాధను తగ్గించడానికి నాలుగు మాడవీధులలో దీర్ఘంగా రెండువైపులా మంటపాలను, విజయనగర రాజ్యకాలంలో దాతలు, యాత్రికుల సౌకర్యార్థం నిర్మించి ఉంటారు. ఇవి యాత్రికులకు రాత్రి, పగలు విశ్రాంతి భవనాలుగా కూడా ఉపయోగపడి ఉంటాయి.

కొంతకాలానికి ఈ మంటపాలను వేరేవ్యక్తులు ఆక్రమించి వాటిని గదులుగా మార్చుకొని నివాస ముంటున్నారు. ఆలయానికి సంబంధంలేని వ్యక్తుల అధీనంలో అవి అన్నీ నివాసగృహాలైనాయి.

**శిలారథం :**

Vol.3, S.No.168 శాసనం వాసల్ ఎల్లప్పనాయకర్ ఒక రాతిరథం సత్రాన్ని, తన ధర్మంగా నిర్మించినట్లు తెల్పుతున్నది. ఇది శకసం.1449 సర్వజిత్ సంవత్సరం చిత్తిరై మాసానికి చెందింది. ఇంగ్లీష్ తేదీ 29-3-1527. కృష్ణదేవరాయలు విజయనగర రాజ్యాన్ని పాలిస్తున్న కాలం. శిలారథ సత్రం అంటే శిలారథం పేరున దానికి సమీపంలో నిర్మించిన సత్రంకావచ్చు. సత్రం నిర్మించడానికి పూర్వమే శిలారథం ఉండాలి. అది విజయనగరకాలానికి పూర్వమై ఉండాలి. కాని, అంతకు ముందున్న రాజులకాలం నాటి శాసనాలలో రాతిరథం ప్రసక్తి కానరాదు. చంద్రగిరి నుండి తిరుమలగ్రామానికి ప్రవేశించేచోట, గ్రామానికి ఈశాన్యంగా ఈ శిలారథం ఉండేది. రాతిరథాన్ని గూర్చి తెలిపే శాసనం ఒక మంటపానికి పునాదిగా ఉన్నది. ఈ మంటపం దక్షిణ పశ్చిమ వీధులు కలిసే నైఋతి దిశలో ఉండి చంద్రగిరి నుండి తిరుమలగ్రామానికి ప్రవేశించే స్థలాన ఉన్నది. ఎల్లప్పనాయకుడు కట్టించిన సత్రం ఈ మంటపానికి సమీపంలో లేకుండవచ్చు. తిరుమలకు ఈశాన్యదిశలో రాతిరథం వద్ద ఈ సత్రం ఉండవచ్చు. పడికావలిగోపురం తూర్పుగోడపై చెక్కబడిన శాసనంలో (Vol.V, S.No.16) రాతిరథాన్ని సెవ్వరాయవడమలైఅప్పార్ కుమారుడు నాగప్పయ్యన్ ధర్మం చేసినాడని ఉన్నది. కాని దీనిపై తేదీలేదు. ఐనా 1527 లో వాసలం ఎల్లప్పనాయకర్ సత్రం నిర్మింపబడకముందే నాగప్పయ్యన్ ధర్మం చేసిన రాతిరథం ఉండేదని తెలుస్తున్నది. రాతిరథం కదలదు, దాన్ని కదిలించడం వీలుకాదు (నిలై తేరు). (Vol.V, S.No.32, Vol.V, S.No.2) శాసనాలవల్ల మరోవిషయం తెలుస్తున్నది. శక సం॥1463 ప్లవనామ సంవత్సరం కుంభమాసం – ఇంగ్లీష్ తేదీ 27.1.1542 నాడు వానమామలైజీయర్, ఆయన శిష్యుడు కోయిలెన్విజీయర్, అలగియమణవాళన్ మఠం ఎదురుగా నున్న రాతిరథంలో ఏర్పాటు చేయబడిన ఊయెలలో వేంచేపు చేయబడిన ఉత్సవమూర్తులకు, మూలమూర్తి శ్రీవేంకటేశ్వరునకు, జలక్రీడోత్సవ సందర్భంగా 9 దినాలు 9 మనోహరపడులను సమర్పించే ఏర్పాటుచేసిన ట్లున్నది. దేవదాసియైన తిరువేంకటదాసి కూతుర్లు లింగసాని, తిరువేంకట మాణిక్యం అనేవారు శకసం.1466 క్రోధి సంవత్సరం మీనమాసం, ఇంగ్లీష్ తేదీ 27-2-1545 నాడు రాతిరథం ఊయెలలో వేంచేపు చేయబడిన మలైక్కునియ నిన్ఱపెరుమాళ్ కోద్రై ఉత్సవ సందర్భంగా 20 దినాలు 20 ఉత్సవ మూర్తులకు గ్రీష్మోత్సవంలో రాతిరథం ఊయెలలో వేంచేసి ఉండగా నైవేద్యసమర్పణం ఏర్పాటుచేసినట్లూన్ను తెలుస్తున్నది (Vol.VI, S.No.61).

(ఈ రాతిరథం ఉత్తరవీధి తూర్పువీధి కలిసే ఈశాన్యం మలుపులో భూమిలోనికి సగభాగం కూరుకుపోయి, కొన్ని శతాబ్దులుగా దర్శనమిచ్చింది. కొంతకాలం క్రితం దానిని చంద్రగిరి నుండి తిరుమలకు చేరే మెట్లదారి చివరలో స్థాపనం చేశారు)

శకసం॥1467, విశ్వావసునామసం॥ర కర్ణాటక మాసంలో –ఇంగ్లీష్ తేదీ 15 జులై 1545 – నాడు ఆరవీడు వంశానికి చెందిన పొట్లపాటి తిమ్మరాజయ్య, రాజుసదాశివరాయ, అళియరామరాజుల పుణ్యంకోసం

తిరుపతి గోవిందరాజస్వామి ఆలయం ముందున్న రాతిరథంలో ఏర్పాటు చేయబడిన ఊయేలలో వేంచేపు చేయబడిన గోవిందరాజస్వామివారి ఉత్సవ విగ్రహానికి గోవిందరాజస్వామివారు వారి ఇద్దరు దేవేరుల ప్రీతికై నైవేద్య కైంకర్యం ఏర్పాటు చేశాడు. శ్రీ వేంకటేశ్వరస్వామికి, శ్రీ గోవిందరాజస్వామి వారికి, శ్రీఅచ్యుతపెరుమాళ్‌కి, శ్రీవరదరాజస్వామికి నైవేద్య కైంకర్యాన్ని ఏర్పాటు చేశాడు. ఇది శ్రీ వేంకటాచల మాహాత్మ్యం పారాయణం ఉదయం, సాయంత్రం చేసిన పిదప సమర్పింపబడేది. (Vol.V, S.No.53) దీనివలన తిరుపతిలో కూడా ఒక రాతిరథం ఉన్న విషయం తెలుస్తున్నది.

(తిరుపతి శ్రీగోవిందరాజస్వామివారి ఆలయం తూర్పు కుడ్యానికి సమీపంగా స్థాపితమైన శిలారథం ఇప్పుడు లేదు. ఇది ఎట్లా అదృశ్యమైందో తెలియదు.)

**వాహనమంటపం, ఘంటామంటపం**= దేవాలయానికి ఎదురుగా తూర్పువీథి మలుపులో, ఒక ఎత్తైన విశాలమైన మంటపం ఉన్నది. దీన్ని **వాహన మంటపం** అంటారు. ఊరేగింపునకు అవసరమైన ప్రత్యేక వాహనాన్ని దేవాలయంనుండి తీసుకొని వచ్చి, విగ్రహాన్ని వేంచేపు చేయడానికి, అలంకరించడానికి వీలుగా ఇక్కడ ఉంచి, విగ్రహాలతో వీధులలో ఊరేగిస్తారు. ఇది చాలాకాలం తర్వాత నిర్మింపబడిన మంటపంగా కన్పిస్తున్నది.

దేవాలయ ప్రవేశగోపురానికి ఎదురుగా తూర్పువీధి సన్నిధివీధి కలిసేచోట, దక్షిణానికి చేరువలో ఒక ఎత్తైన మంటపంఉన్నది. దీన్నే **ఘంటా మంటపం** అంటారు. దేవాలయంలో పూజారంభాన్ని, అర్చక దేవాలయ ప్రవేశాన్ని, ఆలయద్వారం తెరుచుకున్న విషయాన్ని సూచిస్తూ, యాత్రికుల సౌకర్యార్థం ఉదయం సాయంత్రం ఘంటానాదం చేయబడేది. దీన్నే అక్కడి వారు గొల్లవాని మంటపం అంటారు. ఇప్పుడిక్కడ ఒక HMT గడియారాన్ని ఏర్పాటు చేశారు. దేవాలయద్వారం ముందు అర్చకస్వామి ఆగమనాన్ని సూచిస్తూ జేగంటను మ్రోగిస్తున్నారు. **(గమనిక :** ప్రస్తుత మీ కంపెనీవారి గడియారం గొల్లవాని మంటపం దగ్గరలేదు)

* * *

# అధ్యాయం-13

## స్వర్ణమయ విమానం క్రింద గర్భాలయంలో వేంచేసి ఉన్న శ్రీ వేంకటేశ్వరస్వామి

శ్రీ వేంకటేశ్వరస్వామి ఇంచుమించు 8 అడుగుల ఎత్తుకలిగి ఆనంద నిలయ దివ్యవిమానం క్రిందగర్భాలయంలో రాజఠీవితో విరాజమానుడై నిలబడి ఉన్నాడు. ముందు 'మరకతం' ప్రకాశించే కిరీటాన్ని ధరించి ఉంటాడు. తెలుగు ఉగాది, ఆణివర ఆస్థానం, గ్రీష్మ విషువత్తు (15, 16 జూలై) బ్రహ్మోత్సవం మొదలైన ప్రత్యేక సందర్భాలలో క్రొత్తగా సిద్ధం చేయబడిన వజ్రకిరీటాన్ని ధరించి ఉంటాడు. సంస్కరింపబడిన కర్పూర నామం, తెల్లగా ఆయన కన్నులనుకప్పుతూ తీర్చి ఉంటుంది. రెండుతెల్లని నామాల మధ్య కస్తూరీ తిలకం ఆయన నొసటిపై ఒప్పారి, భక్తజనులను కరుణాభరితమైన దృశ్యాలతో చూస్తున్నట్లు విశాలమైన కమలములవంటి కన్నులు, దయామయంగా కృపాపూర్ణంగా అందంగా ఒప్పారుతూ ఉంటాయి. ఆయన చెవులు మకర కుండలాలతో అలంకరించి ఉంటాయి. ఆయన చిబుకానికి కర్పూరం అద్దబడి ఉంటుంది. ఎత్తి ఉంచిన కుడి చేతిలో వజ్రఖచితమైన చక్రం, అట్లాగే ఎత్తిఉన్న ఎడమచేతిలో శంఖం ఉన్నాయి. ముందుభాగంలో ముందుకు సాచిన కుడిచేయి చరణకమలం అంగుళులను చూపిస్తూ ఉంటుంది. తనతో ఐక్యంకావడానికి, శాశ్వతమైన ఆనందాన్ని పొందడానికి తన చరణకమలాలను ఆశ్రయించడం ఒక్కటే మార్గమని భక్తులకు తెల్పినట్లు ఉంటుంది. ముందుభాగాన ఉన్న ఎడమచేయి, నడుముపై ఉంటుంది. తనను ఆశ్రయించినవారికి, సంసారసాగరం. నడుము బంటిలోతే  అని చెప్పినట్లు ఉంటుంది. ముందున్నరెండు హస్తాలు బంగారు కంకణాలతో నాగాభరణాలతో నిండి ఉన్నది. వక్షఃస్థలంపై బంగరుహారాలు ఉన్నాయి. విలువైన రత్నాలు పొదిగిన బంగరుపతకాలు ఉన్నాయి. 108 లక్ష్మీచిత్రనాణెములున్న లక్ష్మీహారం, రత్నాలు పొదిగిన మకరకంఠి, మోకాలు వరకు వ్రేలాడే బంగారుపతకాలు ముత్యాలహారాలు, వైజయంతీ వనమాలాలంకారాలు ఉన్నాయి. వక్షఃస్థలం కౌస్తుభమణితో, శ్రీవత్సాంకంతో అలంకరింపబడి ఉన్నది. ఎడమభుజం నుండి అడ్డంగా బంగారుయజ్ఞోపవీతం ఉన్నది. వక్షఃస్థలంపై కుడిపార్శ్వాన లక్ష్మిని, ఎడమవైపు పద్మావతీదేవిని లేదా భూదేవిని ధరించి ఉన్నాడు. పీతాంబరాన్ని ధరించి ఉన్నాడు. బంగారుసూత్రాలు, చిరుగంటలతో ఉన్న బంగారుకటిబంధం ఉన్నది. నందకం అనే పేరున్న కటారిని ధరించి ఉన్నాడు. అది ఒరలో ఉంది. కటిబంధం నుండి ఎదురుగా వ్రేలాడుతూ ఉన్నది. చరణకమలాలు బంగారుచట్రాల్లో, బంగారునూపురాలతో అలంకరింపబడి ఉన్నాయి. తొడల చుట్టూ బంగారు పట్టీలు చుట్టబడి ఉన్నాయి. వెనుకవైపు ఉంగరాలతో వ్రేలాడుతూ జటారూపంలో శిరోజాలు శిరస్సునుండి వీపుపై దాకా ఉన్నాయి.

(స్వామిపుష్కరిణీ తీరాన ఆయన సాక్షాత్కరించినప్పుడు మునులు తదితరులు శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రత్యంగ దివ్యసౌందర్యాన్ని వర్ణించారు. **(పద్మపురాణం.** అధ్యా.4, శ్లో.38-61). **భవిష్యోత్తరపురాణం** అష్టతమోఽధ్యాయం అధ్యా.1, శ్లో.104-125, **ఆదిత్యపురాణం,** అధ్యా.4 శ్లో.12, 13, 14, 26, 27 & 29 చూడవలసినవి)

ఆదిత్యపురాణం, అధ్యా.1, శ్లో.42 ఇట్లా ఉన్నది.

**ఆనందజ్ఞానదం విష్ణుం**
**ఆనందమయ నామకమ్ ।**
**ఆనందేన దదర్శాయం**
**ఆనంద నిలయాలయే ॥**

శ్రీ వేంకటేశ్వరస్వామిని ఆనందమయుడుగా పేర్కొన్నది. ఆయన ఆలయాన్ని 'ఆనందనిలయాలయం' ఆనందస్థానంగా వర్ణించింది. **"ఆనంద జనకత్వాత్తమానంద నిలయం విదుః"** ఆనందాన్ని జనింప చేసినందున ఆనంద నిలయమని పేరు. **(భవిష్యోత్తరపురాణం అధ్యా.13, శ్లో.81)**

(కీ.శే.శ్రీ యస్.వి.లక్ష్మీనరసింహారావు శ్రీ వేంకటేశ్వరాలయంలో కొన్ని సంవత్సరాలు పారుపత్యదారుగా ఉండేవాడు. ఆయన తన **"శ్రీ తిరుమల – తిరుపతియాత్ర"** పుస్తకం పుట.85లో, విమానానికి తూర్పుభాగం చివరలో ఉత్తరంవైపు విమానశ్రీనివాసుడు కన్పించేస్థలంలో, మార్కండేయముని ఆలింగన చేసుకున్నట్లున్న శివలింగం చెక్కబడి ఉన్నదని వ్రాసినాడు.)

శ్రీ వేంకటేశ్వరస్వామి కొంతకాలం తన శంఖంచక్రం లేకుండా ఉండాలని అనుకున్నాడు. కొంతకాలం తరువాత ఒకరాజు వానిని సిద్ధంచేసి ఆయన చేతులకు అలంకరిస్తాడని చెప్పినాడు. ఆకాశరాజు కాలధర్మం చెందిన పిదప, ఆయన తమ్ముడైన తొండమానుడు రాజ్యాన్ని పొందాలని ప్రయత్నించగా, పద్మావతీదేవి తన తమ్ముడైన వసుదాముని పక్షాన శ్రీ వేంకటేశ్వరస్వామి సాహాయ్యాన్ని కోరింది. ఆయన తన బావమరదియైన వసుదాముని పక్షాన పోరాడాలని అనుకున్నాడు, తన మామగారి తమ్ముడైన తొండమానునికి తన శంఖాన్ని చక్రాన్ని ఇచ్చాడు. అందుకే ఆయన శంఖచక్రాలు లేకుండా ఉన్నాడు. **(భవిష్యోత్తరపురాణం, అధ్యా.12, శ్లో.67).** శ్రీ వేంకటేశ్వరస్వామి. వసుదామునికీ తొండమానునికి రాజీకుదిర్చిన పిదప, తొండమానుడు తనకొకసౌధాన్ని నిర్మించేలా చేశాడు. తొండమానుడు భవనాన్ని నిర్మించి శ్రీ వేంకటేశ్వరుణ్ణి, ఆ భవనంలో నివాసం చేయవలసిందని కోరాడు. బ్రహ్మ, ఇతర **దేవతల సమక్షంలో శ్రీవేంకటేశ్వరుడు ఆ భవనంలో శుభప్రదంగా, పద్మావతిని తన వక్షఃస్థలంలో ధరించి శంఖచక్రాలు లేకుండా (అరిశంఖవిహీనః) ప్రవేశించాడు. (భవిష్యోత్తరపురాణం, అధ్యా.13, శ్లో.82). కురవ గ్రామలో మౌనంగా, నిరాడంబరంగా శ్రీవేంకటేశ్వరస్వామిని అర్చించే అత్యంత భక్తుడైన కుమ్మరి భీమునికి అవసాన దశసమీపించింది. ఆయన ప్రాణం విడుస్తున్న సమయంలో శ్రీ వేంకటేశ్వరస్వామి లక్ష్మీ సహితంగా ప్రత్యక్షమై, ఆ భక్తునికి కిరీటాన్ని, శంఖాన్ని, చక్రాన్ని, కౌస్తుభాన్ని అలంకారానికై పీతాంబరాన్ని ఇచ్చాడు.** దివ్యవిమాన మొకటి భీముణ్ణి, ఆయన భార్యను స్వర్గానికి తీసుకొని వెళ్ళింది.

**దీనివలన తెలిసేదేమంటే, వసుదామునికీ, తొండమానునికి యుద్ధం ముగిసి, రాజీ కుదిరిన తరువాత తొండమానుడు విధ్యుక్తంగా శ్రీ వేంకటేశ్వర స్వామికి శంఖాన్ని, చక్రాన్ని తిరిగి ఇచ్చి ఉంటాడు.** తరువాత

భీమునికి ఇచ్చి ఉంటాడు, భీముడు స్వర్గానికి వెళ్ళినపిదప, తిరిగి శ్రీ వేంకటేశ్వరుడు వానిని పొందలేక పోయినందున, శంఖం, చక్రం లేకుండానే ఉండవలసి వచ్చింది. కొన్నియుగాల తరువాత ఎవరో ఒకరాజు వాటిని పునఃసిద్ధం చేయించి, ఆయన చేతులకు అలంకరించాడు. అందుకే ఇవి తరువాత కాలానికి చెందిన ప్రత్యామ్నాయాలే.

**పురాణాల్లో వర్ణింపబడిన ఆకృతి విశేషాలు, ఆభరణాలు, శివవిష్ణు దేవుల నిద్దరికీ చెందినట్లు తెలుస్తుంది. ప్రధానంగా అహిభూషణం లేదా నాగాభరణం బీజాలంకరణంగా ఉండటం, జటలను ధరించి ఉండటం శివునికి చెందినవైతే, శ్రీవత్సం కౌస్తుభమణి, వైజయంతి విష్ణువునకు చెందినవి. శ్రీ వేంకటేశ్వరుడు శివవిష్ణురూపంగా హరిహరాకృతిగా, స్మార్తులు శివునిగా, వైష్ణవులు విష్ణువుగా ఆరాధిస్తున్నారు. ఈ రెండు ఆకృతులు శ్రీవైష్ణవ ఆళ్వార్ల పాశురాలలో, ఉదాహరణకు పొయిగైఆళ్వార్ల పాశురాలు 5, 74లలో గుర్తింపబడినాయి.** (డా॥ ఎస్.కె.అయ్యంగార్– A History of Tirupati Vol.I PP.59-60) పేయ్ ఆళ్వార్ల పాశురం 63 (యస్.కె.అయ్యంగార్ – A History of Tirupati Vol.I PP.79-80) లో కూడా హరిహరాకృతి వర్ణింపబడింది. విమానం క్రిందిభాగాన మార్కండేయుడు ఆలింగనం చేస్తున్న శివలింగం ఉండటం, కుమారధారాతీర్థం, స్వామిపుష్కరిణి – కుమారస్వామి పరంగా పేరు కలిగి ఉండటం – శ్రీ వేంకటేశ్వరస్వామి శివాత్మకతకు సాక్ష్యంగా ఉదాహరిస్తారు. శ్రీ వైష్ణవులు విష్ణుచిహ్నాలు ఆధారంగా శ్రీ వేంకటేశ్వరస్వామిని విష్ణువు అవతారంగా భావిస్తారు.

శ్రీ వేంకటేశ్వరుడు విష్ణురూపమా, శివరూపమా అన్నవివాదం చాలా పురాతనమై ఉండి ఉంటుంది. శ్రీ రామానుజులకాలంలో ప్రముఖమై ఉంటుంది. శ్రీ రామానుజులు 12 వ శతాబ్దంలో, ఆ ప్రాంతాన్ని పాలిస్తున్న యాదవరాజు సహాయంతో శ్రీ వేంకటేశ్వర స్వామి విష్ణురూపంగా స్థిరపరచినారు. శ్రీ రామానుజులే శ్రీ వేంకటేశ్వర విగ్రహాని వెనుక ఉన్న రెండుచేతులతో శంఖచక్రాలను పొందించినారు. వైఖానసఆగమానుసారం పూజావిధానాన్ని ఏర్పాటు చేసినారు. సీతారామలక్ష్మణుల విగ్రహప్రతిష్ఠ కావించి తమిళ ప్రబంధపారాయణను స్థిరపరచినారు. శ్రీ యస్.కృష్ణస్వామి అయ్యంగార్ రచించిన A History of Tirupati గ్రంథంలో 265, 266, 279, 280, 288 – 90 పేజీలలో విస్తరంగా ఈ విషయం చర్చింపబడింది. **తన గ్రంథంలో శ్రీకృష్ణస్వామి అయ్యంగార్ శ్రీ వైష్ణవ పక్షపాతిగా చర్చించి, శైవులది పిడివాదంగా వర్ణించినారు. శ్రీ వైష్ణవులు శ్రీ రామానుజులు, తానూ ఒకే విధంగా వాదాన్ని పొందుపరచినారు. కాని 7 వ శతాబ్దం నాటికి శ్రీ వేంకటేశ్వర విగ్రహానికి శంఖ చక్రాలులేవు.**

శ్రీ వేంకటేశ్వరస్వామికి అలంకారంగా ఉన్న పెద్దతిరుమణినామము, శంఖచక్రాలు ఉన్నప్పటికీ శ్రీ వేంకటేశ్వరునిది శివాకృతి అని భావించేవారు ఇప్పటికీ ఉన్నారు. శంఖచక్రాలు ఉన్న స్థానంలో ఒకప్పుడు త్రిశూలము, డమరుకమూ (శివచిహ్నాలు) ఉండేవి అని భావిస్తారు. పెర్గూసన్ Indian and Eastern Architecture అనే గ్రంథాన్ని వ్రాశాడు. ఆ గ్రంథం మొదటి సంపుటంలో పుట 404 లో ఉన్న నోట్ 2 లో

J.B.D గ్రిబుల్ వ్రాసిన గ్రంథం (The Temple of Vishnu on the Hill of Tripetty or Tirupati - ఇది 1875 కలకత్తా రివ్యూ (vol.LXI, PP 142-156) లో ప్రచురింపబడింది) లోని అభిప్రాయాన్ని ఉదాహరించినాడు. ఆ అభిప్రాయం ఇట్లా ఉన్నది. **"(తిరుపతి దేవాలయం) ద్వితీయశ్రేణికి చెందిన ద్రావిడ దేవాలయానికి చక్కని మచ్చుతునక. కాని నిరాదరణకులోనై శిథిలావస్థలో ఉన్నది. ఇది మొదట శివాలయం. శ్రీ రామానుజుడు 12వ శతాబ్దంలో శ్రీవైష్ణవాలయంగా మార్చినాడు."**

A.F. కాక్స్ 1880 లో నార్త్ఆర్కాట్ డిస్ట్రిక్ట్ మాన్యువల్‌ని కూర్చినాడు. దీనిని 1895 లో H.A. స్టువార్ట్ పరిష్కరించినాడు. ఇందులో రెండవ సంపుటంలో "తిరుమల" అను అంశం క్రింద ఇలా వ్రాసినాడు. "శ్రీ వేంకటేశ్వర విగ్రహం మొదట శివునిగా పూజింపబడేదనడంలో సందేహం లేదు. దీనిని ఎవరూకాదనలేదు. దీని కొక కథ ఉన్నది. శ్రీ రామానుజులు **ఇది శివ విగ్రహంకాదని, పొరపాటున అట్లా పూజిస్తున్నారని, అది విష్ణు విగ్రహమని, బంగారంతో శంఖచక్రాలను చేయించి విగ్రహం ముందుంచి తలుపులను మూసినారని, తెల్లవారి తలుపులను తెరిచిచూడగా చేతులపై శంఖచక్రాలు ధరింపబడి ఉన్నాయని అది విష్ణుపరంగా ప్రమాణమని భావించినారని (ఒక కథ, ప్రచారంలో ఉన్నది.) శంఖచక్రాలు శిలావిగ్రహానికి చెందినవి కావు. బంగారంతో చేయబడి చేతులకు అలంకరింపబడి ఉన్నాయి. జటలలాగా శిరోజాలు ఉండటం, శరీరంపై సర్పాలు ఉండటం, తదితర కారణాలను పరికిస్తే ఇది శివవిగ్రహమే అని స్పష్టమౌతుంది.** అర్చకులుగా ఉన్న దీక్షితులు, నామాన్ని ధరించినా, తాము శైవులమనే చెప్పుకుంటారు. బహుశః, స్వామికి దేవేరిలేదు, బ్రహ్మచారిగా ఉన్నందున సుబ్రహ్మణ్య స్వామి కావచ్చును.

తిరుపతి వేంకటకవులలో ఒకరైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి 1936 సం॥లో రెండవసారి శ్రీ వేంకటేశ్వరస్వామివారిని దర్శించినారు. ఆయన అప్పుడు వ్రాసిన పద్యాలలో ఇలా వ్రాశారు. "స్వామీ! నిన్ను శ్రీ రామానుజులు విష్ణువుగా మార్చినారని కొందరంటారు. ఇది అంతకుముందు శివస్థలంగా ఉండేదట. శివచిహ్నాలు ఇంకా ఉన్నాయట" అని.

9-12-1968 నాటి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలో Readers' Views అనే శీర్షిక క్రింద ఒక పాఠకుడు 5-12-1968 నాడు వ్రాసిన సందేహానికి సమాధానంగా ఎవరో ఇలా వ్రాసినాడు.

**"తిరుపతి శ్రీ వేంకటేశ్వర దేవాలయం మొదట జైనదేవాలయం తరువాత శివాలయం శ్రీ రామానుజులకాలం నుండి శ్రీ వైష్ణవాలయం ఆదిశంకరులు ఇక్కడ శ్రీ చక్రప్రతిష్ఠను చేశారు." అని.**

శ్రీ వేంకటేశ్వరపీఠంపై ఆదిశంకరాచార్యులు శ్రీ చక్రాన్ని స్థాపించినారని అందరూ విశ్వసిస్తారు దేవాలయం ఇంతగా సంపన్నం కావడానికివారు ప్రతిష్ఠించిన ధనాకర్షక యంత్రమే కారణంకావచ్చు శ్రీ వేంకటేశ్వరాలయం శివాలయంగా ఉన్నప్పుడే ఆయన ఈ యంత్రాన్ని ప్రతిష్ఠించి ఉంటారు.

ఇంత అందంగా, సున్నితంగా, మనోహరంగా ఉన్న శ్రీ వేంకటేశ్వర స్వామి మూలబేరం (మూలవిరాట్టు) స్వయంవ్యక్తంగా భావింపబడుతున్నది. ఇంత మనోహరంగా తీర్చిదిద్దిన శిల్పి ఎవరో తెలియదు. ఏ మానవుడో

ఈ విగ్రహాన్ని ప్రతిష్ఠించినట్లున్నూ తెలియదు. బ్రహ్మ, దేవతలు, మునులు, ఋషులు ప్రార్థింపగా వారి ప్రార్థనను సంతోషంగా అంగీకరించి స్వామి ఇక్కడ నెలకొన్నాడు. భక్తజనులందరికీ కొంగు బంగారమై కోర్కెలను తీర్చి అనుగ్రహించే అర్చావతారము.

పూర్వకాలంలో జనులు సత్ప్రవర్తన కలిగి, ధార్మికులై, భక్తులై, **జప, తప, యోగ సాధనలతో భగవంతుణ్ణి నిరంతరం అర్చించి, ఆయన దివ్యరూపాన్ని హృదయంలో ఆవిష్కరించుకునేవాడు. దీన్ని హార్దరూపం అంటారు.** ఐశ్వర్యంతో, జ్ఞానంతో, బుద్ధి బలంతో సాక్షాత్కరించుకున్న రూపాన్ని **విభవరూపం** అంటారు. మనస్సులో ధ్యానించుకున్న రూపాన్ని **వ్యూహరూపం** అంటారు. మానవ శక్తికి అతీతమైన రూపాన్ని **పరరూపం** అంటారు. కలియుగంలో మానవులు ఉదాత్తంగా జీవింపక కలుషిత బుద్ధులైనందున భగవంతుని సాక్షాత్కరించుకోలేరు. అందుకే బ్రహ్మాది దేవతలు, మానవుల హితంకోరి శ్రీ వేంకటేశ్వరస్వామిని వేంకటాచలంపై వసించి భక్తులను అనుగ్రహించి వారి కోరికలను తీర్చవలసిందిగా అభ్యర్థించినారు. శ్రీ వేంకటేశులను తీర్చవలసిందిగా అభ్యర్థించినారు. శ్రీ వేంకటేశ్వరస్వామి అంగీకరించి నెలకొన్నారు.

## శ్రీ వేంకటేశ్వరస్వామి పంచరూపాలు సహాయదేవతలు

గర్భాలయంలో శ్రీ వేంకటేశ్వరస్వామి ఏకాంతంగా లేరు. బ్రహ్మాది దేవతలు, మునులు, ఋషులు, గంధర్వులు మున్నగువారి ప్రార్థన మేరకు తన ఆజ్ఞానుసారం తొండమానుడు నిర్మించిన వివిధ ప్రాసాదయుక్తమై గజతురగ శాలాది సమన్వితమైన విశాల సౌధంలో శ్రీ వేంకటేశ్వరస్వామి నెలకొన్నారు. విశ్వకల్యాణాన్ని మానవహితాన్ని కాంక్షించి బ్రహ్మ, రెండు దీపాలను వెలిగించి, కలియుగాంతం వరకు అవి దేదీప్యమానంగా ఉండేట్టు అనుగ్రహించవలసిందిగా పరమాత్మ కోరినాడు. ఆ దీపాలు వెలిగినంతకాలం, విమానం నిలిచినంతకాలం వేంకటేశ్వర – శ్రీనివాసుడుగా తన అవతారం విరాజమానమై ఉంటుందని బ్రహ్మకు ప్రత్యుత్తరంగా చెప్పి, **తనకు ఒక ఉత్సవాన్ని కల్పించమని బ్రహ్మను ఆదేశించాడు. ఆ ఉత్సవం ధ్వజారోహణంతో ఆరంభమై రథోత్సవంతో సమాప్తంకావాలని, వివిధ వాహనాలపై తిరువీధుల ఊరేగింపులతో కూడి ఉండాలని, వేదవిదులైన బ్రాహ్మణులు వేదపారాయణ చేస్తూ వెంటనడవాలని, త్రికాల నైవేద్యం భక్తిశ్రద్ధలతో నిర్వహింపబడాలని నిర్దేశించాడు.** బ్రహ్మ, తొండమానుణ్ణి పిలిచి రమాపతికి వివిధ వాహనాలను, రథాన్ని, వెంటనే సిద్ధం చేయించమని చెప్పాడు. విశ్వకర్మ వాహనాలని, ఛత్రచామరాలను, తొండమాన్ నృపతి కోరిక మేరకు అతి సూక్ష్మకాలంలో సిద్ధం చేశాడు. వివిధ దేశాలనుండి రాజులను, అన్ని ప్రాంతాలనుండి ప్రజలను ఉత్సవానికి ఆహ్వానించాలని శ్రీనివాసప్రభువు బ్రహ్మను తొండమాన్ నృపతిని ఆదేశించినాడు, బ్రహ్మ, అంకురార్పణతో ఉత్సవాన్ని ప్రారంభించి నాడు. కన్యామాసంలో రెండవదివసాన, వైఖానస పండితుల సమ్మతితో ధ్వజారోహణం చేసి, మణిఖచితమైన పల్లకిని స్వామి ముందుంచి, దానిలో ఆసీనుడై స్వామిని తిరువీధులలో ఊరేగ వలసిందిగా అభ్యర్థించాడు. అప్పుడు బ్రహ్మదేవునితో స్వామి అన్నాడు, "నీవు యువకుడివి. నేను నీకు నేర్పిన వేదాలను నీవు మరిచిపోయినావు. నిన్ను పరీక్షించాలి"

అని. బ్రహ్మదేవుడు వేదాలను వల్లించినాడు. కాని, కొన్ని తప్పులు దొర్లినాయి. దానికి ఆయన సిగ్గుపడ్డాడు శ్రీనివాసుడు ఆ తప్పులను సవరించాడు. నాలుగు వేదాలనుండి అవసరమైన మంత్రాలను ఉచ్చరిస్తూ తనవలెనే శుభకరమైన నాలుగు ఆకృతులను ఒక క్షణంలో సృజించి, ఆ నాలుగు ఆకృతులకు ఉత్సవ శ్రీనివాసుడు, ఉగ్రశ్రీనివాసుడు, సర్వాధిక శ్రీనివాసుడు (భోగమూర్తి), లేఖక శ్రీనివాసుడు (కొలువుమూర్తి). సువర్ణఛత్రం క్రింద సువర్ణ సింహాసనంపై ప్రతి ఉదయం కొలువుదీరి కొలువుశ్రీనివాసుడు దేవాలయానికి క్రిందటిదినం వచ్చిన ఆదాయం వివరాలను, క్రిందటిదినం, ప్రస్తుతదినం, తరువాతిదినం పంచాంగ శుద్ధిని ఆలకించి, వేంకటాచలాధీశ్వరుడుగా తన అధికారాన్ని వినియోగించి యోగ్యతకు అనుగుణంగా విధులను భృత్యులకు నిర్దేశిస్తాడు. **(భవిష్యోత్తరపురాణము, అధ్యా.14, శ్లో.24-33) బ్రహ్మ తన నాలుగు ముఖాల్లో నాలుగు శ్రీనివాసమూర్తులను ఆధ్యాత్మికంగా ధరించి, ఐదవ మూర్తియైన మూలమూర్తిని తన మనస్సులో నిలుపుకొని, ఉత్సవానికి ఆవసరమైన అన్నింటినీ సంకల్పించాడు.** ఉత్సవమూర్తి ఉత్సవ బాధ్యతలను స్వీకరించాడు, ఉత్సవాన్ని ప్రారంభించాడు. వివిధ వాహనాలతో, నైవేద్యాలతో బ్రహ్మ ఉత్సవాన్ని నిర్వహించాడు.

ధ్వజారోహణానికి ముందుదినాన, విష్వక్సేనుడు (విష్ణుసేనాపతి) దేవతలతో కలిసి గ్రామోపకంఠానికి తీసుకుపోబడుతాడు. అక్కడ మంత్ర యుక్తంగా కొంత మట్టిని సమకూర్చుకొని, ఏనుగుపై దాని నుంచి దేవాలయానికి తీసుకు వస్తారు. ఒక గదిలో ఆమట్టిని పరిచి నవధాన్యాలను దానిలో నిక్షేపిస్తారు. తెల్లవారి ఉదయం ధ్వజారోహణం మొదలుకొని, అవభృథ స్నానం, పుష్పయాగం (మూలమూర్తిని పుష్పాలతో కప్పివేయుట) పర్యంతం బ్రహ్మఉత్సవాన్ని నిర్వహించినాడు.

(ప్రస్తుతం ధ్వజారోహణం సాయంకాలం నిర్వహింపబడుతున్నది. పురాణాల్లో చెప్పినట్లు ఉదయంకాదు. మధ్యయుగకాలంలో బహుశః అట్లా చేసేవారు కావచ్చు, ధ్వజారోహణం దినాన ఉదయం ఆందోళికా (తిరుచ్చి) వాహనసేవలో స్వామి తిరువీధులలో ఊరేగుతారు. ఆ వాహనసేవ అనంతరం ధ్వజారోహణం చేస్తారు. ఆ రాత్రి శేషవాహనసేవ. రెండవరోజు ఉదయం చిన్నశేషవాహనసేవ. రాత్రి హంసవాహన సేవ, మూడవ దినాన ఉదయం సింహవాహనసేవ. ఆ రాత్రి మౌక్తిక మంటప వాహనసేవ, నాల్గవ దినాన ఉదయం కల్పవృక్షసేవ. ఆ రాత్రి స్వరభూపాలవాహనసేవ, ఇది కలశాలతో అలంకృతమై ఉంటుంది. ఐదవ దినాన మోహినీరూపావతారంతో ఆందోళికాసేవ, ఆ రాత్రి గరుడసేవ, ఆరవ దినాన హనుమద్వాహన సేవ. ఆ సాయంకాలం వసంతోత్సవం. ఇది మంగళగిరి (తిరుచ్చి) వాహనసేవతో సంపన్న మౌతుంది. ఆ రాత్రి ఐరావత వాహనసేవ, ఏడవ దినం ఉయదం సూర్యప్రభావాహన సేవ. సాయంకాలం మంగళగిరి వాహనసేవ. రాత్రికి ఇద్దరు దేవేరులతో స్వామి చంద్రప్రభావాహనంపై ఊరేగుతారు. ఎనిమిదవ రోజు ఉదయం అలంకృతరథోత్సవ సేవ. ఆ రాత్రికి ఉచ్చైశ్రవ సేవ. తొమ్మిదవ దినం స్వామివారి శుభనక్షత్రం శ్రవణంతో కూడి ఉన్నందున మొదటి వాహనం ఆందోళిక, రెండవ వాహనం మంగళగిరి, అవభృథస్నానానికి, అవభృథస్నానం శ్రీ వరాహస్వామివారి ఆలయమంటపానికి ముందు నిర్వహింపబడుతుంది. ఉత్సవ

విగ్రహాలన్నింటికీ పసుపుతో కలిపిన తైలంతో, ఇతర పవిత్రద్రవ్యాలతో స్నపనంచేసి ఊరేగింపుగా స్వామిపుష్కరిణిలో తిరుమజ్జనం చేస్తారు. తరువాత మూడవ ఊరేగింపు మంగళగిరి వాహనంలో గరుడధ్వజం విధ్యుక్తంగా అవరోహింపబడుతుంది. దశమ దినాన శ్రీపుష్పయాగాన్ని నిర్వహిస్తారు. విశిష్ట అతిథులకు సమ్మానం చేస్తారు. ఉత్సవాన్ని తిలకించి దేవతలు, రాజులు తమతమ నెలవులకు వెళ్ళుతారు. శ్రీనివాసస్వామికి సాష్టాంగమాచరించి, బ్రహ్మ సెలవు తీసుకొని సత్యలోకానికి వెళ్ళుతాడు, తొండమానుడు ఉత్సవాన్ని నిర్వహించి, భగవంతునిసేవించి సెలవుగైకొని తనపురానికి వెళ్ళుతాడు (భవిష్యోత్తరపురాణం, అధ్యా.14, శ్లో.39 నుండి 68 వరకు)

తనవలెనే నాల్గుమూర్తులనుసృష్టించిన శ్రీ వేంకటేశ్వరుడు దేవాలయంలో పంచబేరాకృతిగా ఉంటాడు (ఐదు ఆకృతులతో ఉంటాడు.)

**1. ధ్రువబేరం:** ఇది స్థిరమైంది, నిలబడిన ఆకారంలో ఉంటుంది. ప్రధానమైన మూలవిరాట్టు ధ్రువమూర్తి.

**2. ఉత్సవబేరం:** శ్రీదేవి భూదేవి అనే ఇద్దరు దేవేరులతో ఊరేగే కల్యాణ ఉత్సవమూర్తి.

**3. స్నపనబేరం:** ఇది ఉగ్ర శ్రీనివాసమూర్తి విగ్రహం. దీని రూపం కోపోద్రిక్తమైనది. ఈ చిన్న విగ్రహం గర్భగుడిలో ధ్రువబేరంతో ఎప్పుడూ సన్నిహితంగా ఉంటుంది. ఈ ఉగ్ర శ్రీనివాసమూర్తి విగ్రహం, వేంకటత్తురైవర్ కోసమే తిరుమల నాల్గు తిరుమాడ వీధుల్లో ఒక ఊరేగింపు సంవత్సరానికి ఒక్కసారి మాత్రమే కైశిక ద్వాదశి రోజు (అక్టోబరు మాసం మధ్యలో) సూర్యోదయాత్పూర్వమే జరుపబడుతుంది. ఆ విధంగా చేయడానికి ప్రధాన కారణముంది. ఉగ్ర శ్రీనివాసమూర్తి విగ్రహానికి సూర్యకిరణాలు సోకితే ఉగ్రత్వం తీవ్రస్థాయికి చేరుతుంది. అప్పుడాయన చూపుల కెదురుగా ఉన్న ఇండ్లు, వస్తువులు ఏవి ఉన్నా అవన్నీ కాలిపోయిన సంఘటన పూర్వం జరిగి ఉండడం వలన సూర్యోదయానికి పూర్వమే ఉగ్ర శ్రీనివాసమూర్తి ఊరేగింపు జరుపబడుతున్నది.

**4. కౌతుకబేరం:** ఇది భోగమూర్తి. భోగ శ్రీనివాసుడు సర్వాధిక శ్రీనివాసు డన్నవి నామాంతరాలు. ఇది ఒక చిన్న వెండి విగ్రహం. పూజ, అభిషేకం, శయనోత్సవాలు గలది.

**5. బలిబేరం:** ఇది కొలువుమూర్తి. లేఖక శ్రీనివాసుడనే పేరుతో దేవాలయానికి ఉదయం నుండి రాత్రి వరకు వచ్చే వివిధ విధాలైన ఆదాయాలను ఎప్పటి కప్పుడు నమోదు చేయడమే కాదు, వాటి లెక్కలు నిర్వహించేవాడు. స్వామివారు బంగారు షామియానా క్రింద, బంగారు సింహాసనంపై ప్రతిరోజు ఉదయం మహామణిమండపంలోనో, ఆస్థానమండపంలోనో కొలువు దీరినప్పుడు, తోమాలసేవ జరిగిన తర్వాత, అర్చన జరగడానికి ముందు గల మధ్యకాలంలో, అంతకు ముందురోజు స్వామివారికి సమర్పింపబడిన కానుకలు, ధనమూ, విభిన్న సేవాక్రమాల ద్వారా వచ్చిన డబ్బు, హుండిలో భక్తులు సమర్పించినవి, తదితర దాన వితరణలు – వీటన్నిటిని కలిపి 'ఆర్జితం' (ఆదాయం) అనే ఒకే పేరుతో పరిగణింప

బడుతోంది. ఈ వివరాలన్నీ లేఖక శ్రీనివాసుని మూలంగా స్వామివారికి విన్నవించడం ప్రతిరోజు ఉదయం 'కొలువు' లో జరిగే ప్రధాన కార్యక్రమం.

ఆ తర్వాత ధ్వజస్తంభానికి నాల్గు దిక్కులలో రాతితో చేయబడిన నాల్గు బలిపీఠాలపై నలుగురు దిక్పాలకులకు అన్నపు పిడుచలను సమర్పించడమే కాదు, దేవాలయానికి నాల్గుదిక్కులలోను, ఆ నాల్గుదిక్కుల మధ్యగల నాల్గు మార్గాలలోను అంటే మొత్తం మీద అష్టదిక్కులలో బలిపిండాలు సమర్పింప బడుతున్నాయి.

శ్రీ వేంకటేశ్వరాకృతితో సిద్ధమైన రజతవిగ్రహాన్ని శక్తివిటంకన్ అనే పల్లవ సామంతరాజు భార్య సామవై దేవాలయంలో ప్రతిష్ఠించింది. ఈ విగ్రహానికే 'మనవాళ పెరుమాళ్' అని పేరు. ఆపాదమస్తకం వజ్రాభరణాలతో అలంకరింపబడి ఉంటుంది. కిరీటం వజ్రాలతో, ముత్యాలతో, కెంపులతో పొదుగబడి ఉంటుంది. మకరకుండలాలు,కర్ణాభరణాలు,నాలుగు కంఠ హారాలు వజ్రాలతో ముత్యాలతో కెంపులతోనిండి ఉన్నాయి. బంగారు ఉదరబంధనం **తిరువరైపట్టికై** – ఇది కెంపులతో పొదుగబడింది. బాహు వలయాలు, కంకణాలు, మణిబంధానికి అలంకారం, పాదఅంగదాలు, పాదమంజీరాలు, శిరస్సుపై కెంపుపొదిగిన రజతఛ్చత్రం. 47 కళంజుల బంగారంతో ఆభరణాలు సిద్ధం చేయబడ్డాయి.

మణవాళపెరుమాళ్‌కి నిత్యనైవేద్యం, దీపారాధన నిమిత్తం **సమవాయి** తగిన ఏర్పాట్లు చేసింది. మకరసంక్రాంతి, కటక సంక్రాంతి, విషువత్తుల సమయంలోనూ తిరుమజ్జనానికి, పురట్టాసిమాసంలో రెండుదినాల ఉత్సవానికి, తొమ్మిది రోజుల ప్రధానోత్సవానికి, చిత్రానక్షత్ర సమయంలో అవభృథస్నానానికి అవసరమైన ఏర్పాట్లకోసం దేవాలయానికి భూదానం చేసింది. ఆ భూమి ఖరీదును కూడా ద్రవ్యరూపంగా దేవాలయానికి దానం చేసింది. దీనినే **'వర్తన'** అంటారు. ముక్కోటి ద్వాదశికి ముందు, ఏడుదినాల ఉత్సవాన్ని ఈ రజతమూర్తికి ఏర్పాటుచేసింది. మార్గళిమాసంలో ముక్కోటి ద్వాదశినాడు మణవాళపెరుమాళ్ విగ్రహాన్ని శ్రీవరాహస్వామిదేవాలయంలో వేంచేపు చేసి సుదర్శనచక్రం నిమజ్జనమైన తరువాత శ్రీ వరాహపుష్కరిణీ జలంతో స్నానం చేయిస్తారు. ఈ ఉత్సవం నిర్వహించడానికి సమవాయి దేవాలయానికి భూదానం చేసింది.

T.T. దేవస్థానం శాసన సంపుటం ప్రథమభాగం **'తొలినాటిశాసనాలు'** 8, 9 సంఖ్యగల శాసనాలు సామవై సేవలనుగూర్చి తెలుపుతాయి. కొప్పాత్ర మహేంద్రపన్మర్‌రాజు పద్నాల్గవ పరిపాలన సంవత్సరంలో వేయబడిన శాసనాల్లో సామవై విషయం ఉన్నది. కోప్పాత్ర మహేంద్రపన్మర్ అంటే కో–పార్థివేంద్రవర్మన్ అని భావించిన వాళ్ళున్నారు. కో పార్థవేంద్రవర్మన్ తొండమండలం ఉత్తరప్రాంతాన్ని పాలించినట్లు మద్రాస్ ఎపిగ్రాఫికల్ రిపోర్ట్స్ తెల్పుతున్నాయి. నార్త్ ఆర్కాట్ చెంగల్పట్టు జిల్లాలలో ఆయన శాసనాలు బయల్పడ్డాయి. (Dev. Ep. Rep. PP.100-101). కాని ఇది సముచితంగా కన్పడటంలేదు. కోప్పాత్ర మహేంద్రపన్మర్ అనే సుదీర్ఘనామం "మహేంద్రపన్మర్ అంటే మహేంద్రవర్మన్" ఆయన నిజనామధేయమని తెలుపుతుంది. ***కో, పాత్ర అనే రెండు పదాల్లో కో అంటే రాజు కావచ్చు. పాత్ర అంటే ఏమిటోతెలియ కుండా ఉన్నది. శిలాశాసనంలో చెక్కేవేళ సంభవించిన పొరపాటు కావచ్చు.**

5 వ శతాబ్దం నుండి సింహవర్మ మొదలుగా పల్లవరాజుల శాసనాలు, నెల్లూరులో లభ్యమౌతాయి. చిత్తూరు, వెల్లూరు జిల్లాలు, చెంగల్పట్టు జిల్లా నార్త్ ఆర్కాట్‌లో ఉండేవి. సింహవర్మ తానురాజ్యాని వచ్చిన తరువాత 11 వ సంవత్సరంలో (క్రీ.శ.486) ఉరవపల్లి దానశాసనాన్ని వేయించాడు. ఆ దాన శాసనం కందుకూరు విష్ణుహర స్వామికి చెందింది. దాలూరులో దేవాలయానికి చారుదేవి దాన శాసనపట్టాలు– ఇవి నెల్లూరు జిల్లాలో ఉన్నాయి. నార్త్ ఆర్కాట్‌లో చెంగల్పట్టు జిల్లాలోని కంజీవరం శాసనాలు, మహేంద్రవాడి, మండగప్పట్టు శాసనాలు – వీటిని గమనిస్తే ప్రథమ సంపుటంలో 8, 9 సంఖ్యగల శాసనాలు మొదటి మహేంద్రవర్మ (క్రీ.శ.600–630) కి చెందినవి అని ఊహించడానికి వీలున్నది. రాణి సామవై పల్లవమంత్రి లేదా పల్లవ సామంతరాజు కూతురు. శ్రీ కాడప్పట్టిగై అని పేరున్న శ్రీ విటంకన్ అనువాని భార్య. ఆమె పల్లవ రాజదుహిత. ఆమెను కాడవన్ (పల్లవ) పెరుందేవి అని వ్యవహరించేవారు. మహేంద్రవర్మ కూడా పల్లవరాజు. పల్లవరాజ్యం సమృద్ధంగా ఉన్నకాలాన్ని ఈ శాసనాలు సూచిస్తున్నాయి. ఇద్దరు మహేంద్ర వర్మలున్నారు. మొదటి మహేంద్రవర్మ క్రీ.శ.600–630 కాలానికి చెందిన పల్లవరాజు. రెండవ మహేంద్రవర్మ క్రీ.శ.668 నుండి 670 వరకు రెండుమూడు సంవత్సరాలే పాలించినవాడు. అందుకే 8, 9 సంఖ్యగల శాసనాలు మహేంద్రవర్మ రాజ్యానికి వచ్చిన 14వ సంవత్సరానికి చెందినందున మొదటి మహేంద్రవర్మకి చెందినవి. సమవాయరాణి ప్రతిష్ఠించిన మణవాళప్పెరుమాళ్ (శ్రీ వేంకటేశ్వరస్వామివారి ప్రతి కృతి) క్రీ.శ.614కి చెంది ఉండాలి. ఇది మొట్టమొదట సిద్ధం చేయబడిన శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రతికృతి. రజతంతో చేయబడి రెండు బాహు వలయాలు, నాల్గు తిరుచ్చందాలతో అలంకరింపబడి ఉన్నది. శిరస్సు నుండి పాదాలదాకా వివిధాభరణ శోభితమై ఉన్నది. అయితే, **శంఖచక్రాలు, శ్రీవత్సం, కౌస్తుభమణి, వైజయంతి – ఆభరణాలలో కానరావు. సామవై శ్రీ వేంకటేశ్వర మూలవిరాట్టుకి సరియైన ప్రతికృతిని సిద్ధం చేయించి, శ్రీ వేంకటేశ్వర స్వామి మూలబేరానికి తగిన ఉత్సవబేరంగా ప్రతిష్ఠించి ప్రారంభించినందున**

---

* ప్రాచీన తమిళ శాసనాల్లో 'కో' శబ్దం శ్రేష్ఠతావాచకం. **'కో', 'కోన్'** శబ్దాలు రాజుల పేరుకు ముందు చేర్చి చెప్పబడేవి. కో+ఇల్= కోయిల్ శ్రేష్ఠమైన ఇల్లు = 'దేవాలయం'; కోన్+ఏతి= కోనేతి (కోనేరు) శ్రేష్ఠమైన పుష్కరిణి; **కోల్ ఉయర కోన్ ఉయర్వాన్** – అవ్వైయ్యార్ సూక్తి (క్రీ.శ.6వ శతాబ్ది). కోల్ = రాజదండం; కోన్ = రాజు "రాజదండం ప్రకాశించే కొద్దీ రాజు ప్రకాశిస్తాడు" అని అర్థం. కాబట్టి, కోన్ అంటే రాజు. చూ. తొలినాటి శాసనాలు (Early Inscriptions) TTD. కొప్పాత్ర మహేంద్ర పన్మర్. కో+పాత్ర = కొప్పాత్ర. ఇందులోని **'పాత్ర'** శబ్దానికి **'సాంధి విగ్రహికో పాత్రః'** అని నిర్వచనం. రాజరికపు కొలువులో గల రాచకార్యపు హోదాను తెలియజేసే పారిభాషిక పదం. విగ్రహమంటే యుద్ధం. ఇద్దరు రాజులమధ్య యుద్ధం జరిగి **'సంధి'** కుదుర్చుకొనేటప్పుడు ఆ సంధిపత్రాన్ని తయారుచేసేవాడిని **'పాత్రు'** డంటారు. రాజరాజనరేంద్రుడు చాళుక్య రాజు. ఆయన కాలం (క్రీ.శ.1022) లో **నన్నయ** ఆస్థానకవియే కాదు, కులబ్రాహ్మణుడు **'పాత్రుడు'** గా వ్యవహరించాడు. చూ.ఆదిపర్వం అవతారిక ఆంధ్రమహాభారతం. నన్నయభట్టు, తండ్రి, తాతలు కూడ పాత్రులుగా వ్యవహరించినారు. ఒరిస్సానేలిన గజపతుల కాలంలోను **'పాత్ర', 'మహాపాత్రు'** లుండేవారు. ఇప్పటికీ ఒరిస్సాలో **'పాత్రో', 'మహాపాత్రో'** అని పేరు చివర ఉన్నవారు ఒకప్పుడు వారి పూర్వీకులు సంధిపత్ర లేఖకులుగా ఉండేవారని తెలుస్తుంది. (Royal Treaty Writer) 'అందుచేత **'పాత్ర'** శబ్దం **పొరబాటుగా చెక్కబడింది కాదు**' అని గ్రహించాలి. (ప్రచురణల ప్రత్యేకాధికారి కార్యాలయం – ము.ప్ర.రావు)

**మూలబేరంలో ఒక వేళ శంఖచక్రాదులు ఉండి ఉంటే వాటికి ఉత్సవమూర్తిలో స్థానం కల్పించకుండా వదిలి ఉండరు. అంటే మూలబేరానికి ఆ కాలంలో విష్ణుచిహ్నాలైన శంఖచక్రాలు లేవని, అందుకే శ్రీ వేంకటేశ్వరుడు విష్ణువిగ్రహంకాదని ఆ కాలంవారు భావించడంలో విడ్డూరం ఏమీలేదు. శంఖచక్రాలు లేకపోవడం, శ్రీవత్సాది చిహ్నాలు లేకపోవడం గూర్చి విచిత్రమైన పురాణగాథలు కల్పింపబడినాయి. శ్రీ వేంకటేశ్వరుడే తొండమాన్ నృపతికి, తన అన్నకొడుకుతో తలపడిన యుద్ధంలో సాహాయ్యంగా ఇచ్చినాడని, తన భక్తుడైన కుమ్మరి భీముని ఆత్మ, విమానంలో సతీసమేతంగా ప్రయాణమై వెళ్ళేవేళ భీమునికి ఇచ్చినాడని (ఈ కథలు ముందు వివరింపబడినాయి) కల్పితాలైనాయి.** క్రీ.శ.7 వ శతాబ్దివరకు, శ్రీ వేంకటేశ్వరస్వామికి ఉత్సవాలు లేకుండేవని, సామవై తాను సిద్ధం చేయించిన రజత ప్రతికృతికి నిత్యనైవేద్యానికి, దీపారాధనకు, ఉత్సవాలు నిర్వహించడానికి భూదానం విశేషంగా చేసిందని తెలుస్తున్నది. మరొక పల్లవరాజు విజయదంతి విక్రమవర్మకి చెందిన శాసనం ఒకటి ప్రథమ సంపుటంలో ప్రథమశాసనంగా ఉన్నది. విజయదంతి విక్రమవర్మకి చెందిన శాసనం ఒకటి ప్రథమ విక్రమవర్మ రాజ్యానికి వచ్చిన 51 వ సంవత్సరంలో వేయబడిన శాసనం, క్రీ.శ.830 కి చెందింది. శోళనూర్‌కి చెందిన ఉలగప్పెరుమానార్ అనే భక్తుడు 30 కళంజుల బంగారాన్ని దానం చేసినట్లు తెల్పుతుంది. ఈ దానం శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిలో ఉన్న రజతప్రతి కృతికి నిత్యదీపారాధనకై చేయబడింది. తిరుచ్చోగినూర్ పాలకమండలి ఈ స్వర్ణాన్ని స్వీకరించి, దానితో భూమినికొని, శ్రీ వేంకటేశ్వర స్వామి సన్నిధిలో, దాతకోరిన ప్రకారం, దీపారాధనను ఏర్పాటు చేసినాడు. ఈ రెండవ రజతప్రతికృతిని ఎప్పుడు ప్రతిష్ఠించినారో తెలియరాలేదు. అంటే అప్పటికి దీపారాధనకై ఏర్పాటు చేయబడలేదని తెలుస్తున్నది. ఇది సమవాయి ప్రతిష్ఠించిన ప్రతికృతికంటె భిన్నమైంది. ఎందుకంటే, సమవాయి తాను ప్రతిష్ఠించిన ప్రతికృతికి దీపారాధనకు కావలసిన భూదానంతో ఏర్పాటు చేసి ఉన్నందున, దీపారాధనకై ఉలగ ప్పెరుమానార్ మళ్ళీదానం చేయవలసిన అవసరం లేదు. క్రీ.శ.830 లో ఈ ప్రతికృతిని ప్రతిష్ఠించి అవసరమైన దానాన్ని దీపారాధనకై చేసి ఉంటారు. తిరుచ్చుకనూర్‌లో రిజిష్టరైన శాసనాలు – ప్రథమసంపుటలో 1 & 4 ఉన్నాయి. వాటి శాసనపాఠం ఇట్లా ఉన్నది.

**"తిరువేంకటక్కోట్టత్తుక్కుదవూర్ నాట్టు–**
**త్తిరుచ్చోగి నూర్– తిరువేంగడత్తు ఎంబెరుమాన్**
**అడిగళుక్కు ఎళుందరుళువిట్ట తిరువిళంకోయిల్**
**పెరుమానడిగళుక్కుచ్చోళ నాట్టుచ్చోళనూర్ ఉలగప్పెరుమానార్"**

తిరుచ్చోగినూర్, తిరువేంగడత్తు ఎంబెరుమానడిగళుక్కు అనే పదాలు ఒకేచోట ప్రక్కప్రక్కనే ఉండటం (నంI) అలాగే

**కోయిర్ పెరుమనడిగళుక్కుం తిరుమంతిర**
**శాలప్పెరుమానడి గళుక్కుం తిరువేంగడత్తు**
**ప్పెరుమానడి గళుక్కుమ్... (నం.4)**

శాసనవాక్యాలు చదివి, కొందరు శ్రీ వేంకటేశ్వర ప్రతికృతులను – (వేంకటాచల, వేంగడస్వామి ప్రతికృతులను) తిరుచ్చోగినూర్‌లో నిర్మితమైన తిరువిళన్ కోయిల్‌లో ప్రతిష్ఠించినారని భావించినారు.

ముఖ్యంగా కీ.శే.శ్రీ **T.K.T. వీరరాఘవాచార్యులు తమ హిస్టరీ ఆఫ్ తిరుపతి Vol I లో, వీరిని అనుసరిస్తూ డా॥యం.రామారావు వ్రాసిన Temples of Tirumala, Tirupati and Tiruchanoor** అనే గ్రంథంలోనూ వ్రాసినారు. డా॥ రామారావు, శ్రీవీరరాఘవాచార్యులను అనుసరించినారు. వీరు ఆలయ శిల్పకళాలక్షణాలను, విగ్రహలక్షణాలను చక్కగా వివరించినారు.

శ్రీ వీరరాఘవాచార్యులు తిరుచానూర్ శాసనాలను పరిశీలించి ఇట్లా నిర్ణయించినారు, "తిరువేంగడం దేవాలయచరిత్ర వేంకటాచలంపై కాకుండ తిరుచ్చోగినూర్ – కొండకు రోడ్డుపై 10 మైళ్ళదూరంలో ఉన్న ఒకచిన్న గ్రామం – లో మొదలైనట్లు కన్పిస్తున్నది. తిరుమలై దేవాలయం పవిత్రమైనా ప్రధానమైనదిగా భావింపబడలేదు. అందుకే తిరుచ్చుకనూర్‌లో తిరువిళం కోయిల్‌ను, తిరుముక్కుడల్‌లో, శ్రీ వేంకటేశ్వరదేవాలయాన్ని చాలాకాలం క్రిందటే నిర్మించినారు. తిరువేంగడం ఉడైయాన్ తిరుమలకొండపై ఉండటం వలన చాలామంది భక్తులకు అందుబాటులో లేకుండేది. అందుకే పల్లవ రాజైన విజయదంతి విక్రమవర్మ రాజ్యానికి వచ్చిన 51 వ సంవత్సరంలో తిరుచ్చుకనూర్‌లో తిరువిళన్‌కోయిల్‌ను నిర్మించి జ్ఞానానికి ప్రతీకయైన దీపారాధన నిరంతరాయంగా ఉండేవిధంగా ఏర్పాటు చేయబడింది. ఇది క్రీ.శ. 826లో సంభవించింది. తిరుచ్చోగినూర్‌లో ఉన్న తిరువేంగడత్తు పెరుమానడిగళ్‌ను గూర్చి ఎనిమిది శాసనాలు ఉన్నాయి (1, 2, 4, 5...1 of Vol I) కోవిజయదంతి విక్రమర్ రాజ్యానికి వచ్చిన 51 సంవత్సరాన వేసిన శాసనం అన్నింటిలో మొదటిది. ఇది క్రీ.శ.826కి చెందిందిగా మేము భావిస్తున్నాము. తిరుచ్చోగినూర్‌లో తిరువిళన్ కోయిల్‌లో తిరువేంగడత్తు ప్పెరుమానడిగళ్ ఉన్నట్లు(శ్రీవేంకటేశ్వరప్రతికృతి) తెల్పుతుంది. తిరువేంగడత్తు పెరుమానడిగళ్ తిరుచ్చొకనూర్‌లో ఉన్నట్లు తిరువిళన్ కోయిల్ పెరుమాన్‌ని చిన్నస్వామిగా ప్రతిష్ఠించినట్లు ఆ తమిళశాసనం తెల్పుతుంది. తిరువళన్ కోయిల్‌ని (ప్రత్యామ్నాయదేవాలయం) తిరువేంగడస్వామికై భక్తజన సౌకర్యార్థం నిర్మించినారన్నది ముఖ్యంగా గమనించవలసిన విషయం, వేంగడం కొండపైనున్న స్వామికి ఇది ప్రతికృతి అని తెలుస్తుంది. తిరువేంగడత్తుప్పెరుమాన్‌కి ఇతరస్థలాల్లో కూడా దేవాలయాలున్నాయి. తిరుచ్చొకనూర్‌లో మొదట మూలమూర్తిని ప్రతిష్ఠించి తరువాత కొంత కాలానికి ఉత్సవమూర్తిని ప్రతిష్ఠించినట్లు శాసనం తెల్పుతున్నదని గ్రహించాలి. చోళనాట్టు ఉళగప్పెరుమానార్ బంగారునాణాలను దానంగా చేసి ఉత్సవమూర్తి దీపారాధనకై ఏర్పాటు చేశాడు.

డా॥ రామరావు, పై అభిప్రాయాలను అంగీకరించి ఇలా వ్రాశారు. "పల్లవ రాజులలో చివరి మూడురాజులలో మొదటి రాజుకు చెందిన మూడురికార్డులున్నాయి (I ... 1 and 2) ఈ శాసనాలు తిరువేంగడంలో ఉన్న దేవాలయానికి బదులుగా ఉన్న తిరువిలాన్ కోయిల్ (తిరుచానూర్‌లో ఉన్నది)కి

చెందినవై ఉన్నాయి. తిరువేంగడముడైయాన్‌గా పిలువబడే శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రసక్తి తిరుచానూర్‌లోనున్న ప్రత్యామ్నాయ దేవాలయం ద్వారా తొమ్మిదవ శతాబ్దం నుండి తెలియవస్తున్నది. తిరుమల దేవాలయంలో నున్న ఒక పురాతన శాసనంలో విజయాదిత్యుడనే బాణయువరాజు జన్మించినట్లు పేర్కొనబడింది. విజయాదిత్యుడు 9 వ శతాబ్దం పూర్వభాగానికి చెందిన రాజు. తిరుచానూర్‌లోనున్న శ్రీ వేంకటేశ్వరునకు దాన సమర్పణం చేశాడు.

శ్రీ వీరరాఘవాచార్యులు ఇంకా ఇలా వ్రాశారు. "మూలమూర్తి, ఉత్సవమూర్తి అనే ఈ రెండు మూర్తులేకాక, మరొకమూర్తి విజయాదిత్యుని దానశాసనంలో తిరుమంత్రశాలై పెరుమానడిగల్‌గా పేర్కొనబడింది. **తిరువిళంకోయిల్ పెరుమానడిగళ్, తిరుమంత్రశాలై పెరుమానడిగళ్, తిరువేంగడత్తు ప్పెరుమానడిగళ్** – అని మూడు మూర్తులు ప్రత్యేకంగా పేర్కొనబడినవి. మొదటి రెండుమూర్తులు స్థానికదేవతలుగా, మూడవమూర్తి తిరువేంగడం కొండపైనున్న స్వామిగా చెప్పబడినారు. **తిరుచ్చోకినూర్‌లో ఒక అనుబంధదేవాలయాన్ని నిర్మించి తిరువేంగడముడైయాన్‌ను ప్రతిష్ఠించినారు. శైవం నుండి వైష్ణవం స్వీకరించే క్రతువు ఒక చిన్న దేవాలయంలో నిర్వహింపబడేది. అక్కడ మరొక విగ్రహం ప్రతిష్ఠింపబడి ఉన్నది. తత్సన్నిధానంలో వైష్ణవం స్వీకరించే క్రతువు నిర్వహింపబడేది."**

డా॥ రామారావు అదే పద్ధతిలో పై విషయాలను వ్రాసినారు. "8 వ శతాబ్దం నాటికే తిరుచానూర్ వైష్ణవ ప్రభావానికి లోనైంది. తిరుమలపైనున్న శ్రీవేంకటేశ్వర దేవాలయం అప్పటికి ప్రసిద్ధమైనా, చాలామంది భక్తజనులకు అది అందుబాటులో లేకుండేది. తిరుచానూర్‌లో శ్రీ వైష్ణవులు తిరుమంత్ర శాలైని ప్రారంభించి వైష్ణవులుగా జనులను మార్చేయత్నం చేసేవారు. వేంగడం కొండపైనున్న శ్రీ వేంకటేశ్వర ప్రతికృతిని తిరువిళన్‌కోయిల్‌లో ప్రతిష్ఠించినారు. తిరుచానూర్‌లో సులభంగా భక్తజనులు శ్రీ వేంకటేశ్వర స్వామిని దర్శించుకునేవారు. మొక్కులు చెల్లించుకునేవారు. తిరువిళన్ కోయిల్‌లో నున్న ప్రతికృతినే తిరువేంగడత్తుపెరుమానడిగళ్ అని వ్యవహరించే వారు. శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రతినిధిగా గౌరవమందించేవారు. విజయాదిత్యుడు బాణవంశానికి చెందిన రాజు, ఈ ముగ్గురు మూర్తులకు (తిరువిళన్‌కోయిల్ పెరుమానడిగళ్, తిరుమంతిరశాలై పెరుమానడిగళ్, తిరువేంగడత్తుపెరుమానడిగళ్) దీపధూప నైవేద్యాదులకు వలసిన ఏర్పాట్లను, భూదానహిరణ్య దానాదులతో కల్పించినాడు.

శ్రీ వీరరాఘవాచార్యులు ఇంకా ఇట్లా ఊహచేసినారు. "తిరుమంతిర శాలై పేరుతో తెలిసేదేమంటే – ఇక్కడే ఈ దేవాలయంలోనే వైష్ణవం స్వీకరించినవారికి అష్టాక్షరి లేదా తిరుమంత్రం ఉపదేశింపబడేది" అని. వైష్ణవం స్వీకరించినవారికి అన్న ప్రసాద వితరణం కూడా ఇక్కడే ఉండేది. **తిరువిళన్‌కోయిల్, తిరుమంత్రశాల – పూర్వశాసనాల్లో పేర్కొనబడినాయి, తరువాతి శాసనాలలోకాదు, రాజకీయ పరిస్థితులు మారినందున వేంగడం కొండపై దేవాలయాన్ని నిర్మింపవలసివచ్చిందని తోస్తున్నది. పల్లవుల కాలంలో దేవాలయం నిర్మింపబడింది. కాని, వారిని చోళులు జయించినారు. శైవానికి ప్రాబల్యం ఏర్పడింది.**

**వేంగడం కొండపైనున్న దేవాలయానికి 10మైళ్ళ దూరంలో తిరుచ్చొకనూర్‌లో దేవాలయం ఉండటం సంతృప్తి కరంగాలేదు సరికదా శైవులతో కలహంప్రాప్తించి వ్యయ ప్రయాసలకు దారితీసింది. అందుకే సామవై అనే భక్తురాలు రజతప్రతికృతిని చేయించి, సర్వాలంకారాలతో శోభాయమానంగా తీర్చిదిద్ది క్రీ.వ.966లో ప్రతిష్ఠించి, పెరియపెరుమాళ్ ధ్రువమూర్తి దర్శనం రజతప్రతికృతిలో భక్తజనులకు కలిగే విధంగా ఏర్పాటుచేసింది.** పల్లవరాజులు పతనం చెందిన తరువాత చోళులకాలంలో శైవం ప్రబలింది. వైష్ణవులకు తిరువేంగడముడైయాన్ సేవ అతి ప్రధానమైంది కావున, వారు తిరుచ్చొకనూర్‌లోనున్న తిరువిళన్ కోయిల్‌ను క్రమంగా వదిలి, తిరుమలైకి తమ కార్యక్రమాలను మార్చుకున్నారు, భక్తులకు ఇబ్బంది కలిగినాసరే. తిరుచ్చొకనూర్‌లోనున్న పరాశరేశ్వర దేవాలయంలో శైవులతో వివాదాలకు దూరంగా ఉండాలని నిర్ణయించు కున్నారు. సమవాయి మణవాళప్పెరుమాళ్ రజత ప్రతిమను తిరువేంగడం దేవాలయంలో ప్రతిష్ఠించడానికి అదికారణమై ఉండవచ్చును. ఇది క్రీ.శ.966 లో సంభవించింది. మరొకకారణం కూడా ఉండవచ్చు. తిరువిళన్‌కోయిల్‌లో నున్న మూడు విగ్రహాలు శ్రీ వేంకటేశ్వరస్వామి ప్రతికృతులే అవి వైఖాన సాగమానుసారంగా కాక పాంచరాత్రాగమానుసారంగా ప్రతిష్ఠించి ఉండవచ్చు. అట్లైన, కొంతకాలానికి వైఖానసులకు, పాంచరాత్రులకు విభేదాలు కలుగవచ్చు వీటికన్నింటికీ పరిష్కారంగా శ్రీ వైష్ణవుల కార్యక్రమా లన్నింటికీ తిరుమలను కేంద్రంగా చేసుకోవాలని నిశ్చయించి ఉంటారు. తిరుమలలోనున్న మూలబేరం విశాలమై ఎత్తుగానున్నందున అభిషేకం నిర్వర్తించడం కష్టంగా ఉండేది. తిరువేంగడముదియాన్ రజతప్రతికృతి (భోగశ్రీనివాసస్వామి) ప్రతిష్ఠతో ఆ ఇబ్బంది తొలగిపోయింది. కాని, భక్తులకు యాత్ర కష్టమైపోయింది. క్రీ.శ.966 కంటె ముందు భక్తులు కొండపైకి ఎక్కచేరలేనందున తిరుచ్చొకనూర్‌లో శ్రీ స్వామిని ప్రతికృతులను సేవించి, కొండ క్రిందనే పూజించి వెళ్ళేవారు. రజతప్రతికృతి తిరుమలకు చేరిన తరువాత భక్తులకు కొండనెక్కి దర్శనం చేసికోవడం నియమమై పోయింది. **మొదటి సంపుటంలోని 8, 9 శాసనాల వలన క్రీ.శ.835 లో తిరువేంగడంపై దేవాలయం ఉన్నదని, నిత్యదీపారాధన ఏర్పాటైందని, తిరుచ్చోకినూర్‌కి చెందిన సుబ్బైయ్యర్ ఆ దేవాలయానికి కార్యనిర్వాహకుడుగా ఉండేవాడని తెలుస్తున్నది.**

పైన వివరించిన అభిప్రాయాలు నిరాధారమైనవి కేవలం ఊహాకల్పితాలు, వాస్తవాలకు విరుద్ధమైనవి. తిరుమల శ్రీవేంకటేశ్వర దేవాలయంలో పంచబేరం పూర్తికావడానికి అవసరమైన నాలుగు ప్రతికృతులలో రెండు ఎలా అక్కడికి చేరినాయో శ్రీ వీరరాఘవాచార్యులు వివరించలేదు. ఆయన సామవైరాణి సిద్ధం చేయించి సమర్పించిన మణవాళప్పెరుమాళ్ లేదా భోగశ్రీనివాసమూర్తి, కొండపై ఒక లోయలో లభించినట్లుగా విశ్వసింపబడే దేవేరితో ఉన్న ఉత్సవవిగ్రహం గూర్చి చెప్పినాడే కాని తిరుచానూర్‌లోనున్న మూడువిగ్రహాలు, శ్రీ వైష్ణవులు తమకార్యక్రమాలను తిరుమలకు మార్చుకున్న పిదప, ఏమైనాయో ఆయన (శ్రీవీరరాఘవాచార్యులు) చెప్పలేదు. **తిరువిళన్ కోయిల్‌లో ఉన్న మూడు విగ్రహాలలో రెండు స్థానిక దేవతలవనీ, ఒకటి మాత్రమే శ్రీ వేంకటేశ్వర ప్రతికృతియని ఒకచోట వ్రాసి, మరియొకచోట తిరువిళన్‌కోయిల్ పెరుమాన్, తిరుమంత్రశాలై పెరుమాన్, తిరువేంగడత్తు ప్పెరుమానడిగళ్ సైతం తిరుమలపైనున్న స్వామి**

**ప్రతికృతులే అని మరొకచోట వ్రాయడం, తన అభిప్రాయాన్ని తానే ఖండించినట్లై పరస్పర విరుద్ధంగా ఉన్నాయి.** ఆ కాలంలో, ఇప్పటి రవాణా సౌకర్యాలేవీలేని దినాలలో, ఎడ్లబండి తప్ప మరే సాధనమూ లేనప్పుడు, ప్రమాద భరితమైన కాలాన తిరుమలయాత్ర చేయదలచుకున్నవాడు పూర్వాపరాలను, ప్రయాణంలో కలుగనున్న కష్టాలను బేరీజువేసుకొని తమశక్తి సరిపోతుందో లేదో తెలుసుకొని, ప్రాణాపాయం కూడా ఉన్న యాత్రను చేయడానికి సిద్ధపడతారు. అట్లా తీర్థయాత్ర కుపక్రమించిన భక్తులు తిరుచానూర్ దాకా వచ్చి, అక్కడి ప్రతి కృతులను మాత్రం దర్శించి తిరిగి వెళ్ళుతారా? ఇంతటి శ్రమకోర్చి కష్టనష్టాల కోర్చి సుదీర్ఘప్రయాణం చేసినవారు మరొక పదిమైళ్ళు కాలినడకన కొండకు వెళ్ళడానికి వెనుకాడుతారా? శ్రీ వేంకటేశ్వరస్వామి మూలబేరాన్ని దర్శనం చేసికోకుండా, కేవలభోగ శ్రీనివాసమూర్తిని చూచి తిరిగి వెళ్ళుతారా? **శ్రీ వీరరాఘవాచార్యులు అభిప్రాయం ఆమోదయోగ్యంగా లేదు. తిరుచానూర్‌లో నున్న ప్రతికృతులను కూడా భక్తులు దర్శించేవారు. దారిలోనున్న దేవాలయాలను దర్శించి పూజాదికాలు చేసినట్లే తిరుచానూర్ ప్రతికృతులను దర్శించేవారే కాని, వాటిని దర్శించి, శ్రీ వేంకటేశ్వరస్వామిని తిరుమలపై దర్శించకుండా వెళ్ళే వారనటం సబబుగాలేదు.**

తిరుచ్చుకనూర్ దేవదానంగా ఉండటంవల్ల, రాజకీయంగా పరిపాలన దేవాలయ వ్యవహారాలను నిర్వహిస్తూ ఉండేది. నిత్యనైవేద్యాదులకు అవసరమైన సామగ్రిని భండారం నుండి పంపించేది, ఇక్కడే ప్రభుత్వాధికారి ఆ ప్రాంతం పాలకుడు ప్రభుత్వభవనంలో తిరుచ్చుకనూర్‌లో సభను చేసేవాడు. పాలకుడు కూడా పరాశరేశ్వర దేవాలయ ప్రాంగణం (తిరుచ్చుక నూర్‌లో) లో సభనేర్పాటు చేసి వ్యవహారాలను చర్చించేవాడు తిరుచ్చుక నూర్‌లో పూర్వశాసనాలున్నాయి. శ్రీ వీరరాఘవాచార్యులే "తిరుచ్చుకనూర్‌కి చెందిన, సుబ్బయ్యర్ వ్యవహారాలను చక్కబెట్టే బాధ్యత కలిగి ఉండేవాడు" అని వ్రాసినాడు.

డా॥ రామారావు ఇలా అభిప్రాయపడ్డారు, "తిరుచానూర్‌లోని తిరువిళన్‌కోయిల్ ఎక్కడ ఉండేదో గుర్తించి చెప్పడం ఇప్పుడు సాధ్యంకాదు. దీనికి చెందిన శాసనాలు ఎక్కువగా వాహనమంటపంలోనూ, పద్మావతీ దేవాలయం పడికావలి గోపురం శిలాఫలకాలపైనను లభించడంవల్ల, పద్మావతీ దేవాలయం ప్రాకారంలోనున్న మూడు దేవాలయాల స్థలంలో తిరువిళన్ కోయిల్ ఉండేదని భావించవచ్చు. అది జీర్ణమైన తరువాత ఆ దేవాలయానికి చెందిన శకలాలతో ఈ మూడు దేవాలయాలు నిర్మింపబడి ఉండవచ్చు.

మొదటి సంపుటంలో 7 వ సంఖ్య శాసనం ఒకటి ఉన్నది. అది విరిగి ఉన్నది. దానిలో గ్రామపరిపాలనలో వచ్చిన ఆదాయాన్ని 'తిరువి'కి వినియోగించవచ్చునని ఉన్నది. 'తిరువి' తిరువిళన్‌కోయిల్‌లోని పదం కావచ్చు. అట్లైతే తిరువిళన్‌కోయిల్ శక సం॥ 820 నాటికి అంటే క్రీ.శ.898 నాటికి ఉండి ఉంటుంది. ఆ విరిగిన శాసనం శక సం॥ 820కి చెందింది కాబట్టి. ఆ దేవాలయంలో ప్రతిష్ఠింపబడిన దైవ ప్రసక్తిలేదు 13 వ శతాబ్దం రెండవపాదం నాటివరకు ఈ దేవాలయం గూర్చిన ప్రసక్తి కానరాదు. మూడవ రాజరాజ చోళుడు రాజ్యానికి వచ్చిన 19 వ సం॥ అంటే క్రీ.శ.1235 వరకు

ఏ ప్రసక్తి కానరాదు. ఈ కాలాన తిరుచానూర్‌లో నున్న అళగియ పెరుమాళ్ ప్రసక్తి కన్పిస్తుంది. ఇది శాసనం 34లో చూడవచ్చు. 34 సం. శాసనం రాజరాజచోళుని 5, 15, 25 పరిపాలన సంవత్సరాలు అంటే క్రీ.శ.1221, లేదా 1231 లేదా 1241 అయి ఉంటుంది. మూడవ రాజరాజు రాజ్యకాలాన్ని సూచిస్తూ, ఈ దేవాలయానికి భూదానం చేసినట్లున్నది. మొదటి సంపుటంలో 97, 118, 119, 120, 137, 144 సంఖ్యలుగల శాసనాలలో తిరువళన్‌కోయిల్, తిరువళన్‌కోయిల్ పెరుమానడిగళ్, అళగియ, పంగుని ప్రసక్తి కన్పిస్తుంది. తిరుచానూర్‌లో అళగియ పెరుమాళ్ కోవెల, ఆ దేవుని సమర్చనకై పంగునిమాసంలో ఉత్సవనిర్వహణం, దానికై నియత మైన సుంకం ఆ దేవునికి చెల్లించడం మున్నగు విషయాలు తెలుస్తాయి.

ఫసలీ 1227 (క్రీ.శ.1818), ఈస్ట్ ఇండియా కంపెనీ కోసం పైమాయిషీ ఎక్కౌంట్ సిద్ధంచేయబడింది. ఈ దేవాలయాలు ఈస్టిండియా కంపెనీ ఆధీనంలో ఉండేవి. తాలుకా ఆఫీస్ శిరస్తాదారైన అలబ్బు గోవిందరావు 14-8-1819 నాడు దీనిపై సంతకం చేశాడు. ఈ పైమాయిషీ రిపోర్ట్ వలన ఈ క్రింది విషయాలు తెలుస్తున్నాయి. చిరతానూర్ (తిరుచానూర్)లో ఉన్న పద్మావతీ అమ్మవారి గర్భాలయంలో చతుర్బాహువులతో నున్న శ్రీ పద్మావతీ అమ్మవారు పద్మాసనంలో ఉన్న విగ్రహంతోపాటు 10 ఉత్సవవిగ్రహాలు ఉండేవనీ, దానిలో మూడు విగ్రహాలు ఇద్దరుదేవేరులతో కూడిన అళగ తిరువెంగడనాథస్వామివారివనీ, పద్మావతీ అమ్మవారిగుడికి దక్షిణంగా ఒక గజంస్థలం ఎడంగా, శ్రీకృష్ణస్వామి దేవాలయం ఉన్నదనీ, కృష్ణస్వామి తూర్పు ముఖంగా రెండు బాహువులతో ఉండగా, ఆయన అన్నగారైన బలభద్రస్వామి లేదా బలరాముడు రెండు బాహువులతో ఉత్తరముఖంగా ఉన్నాడని, శ్రీ కృష్ణదేవాలయానికి దక్షిణంగా అళగ తిరువెంగడనాథస్వామి దేవాలయం (వెంగడం ప్రభువైన సుందర వేంకటేశ్వర స్వామి) పూజారహితంగా ఉన్నదని. (కాలక్రమాన తిరుచానూర్ అళగియపెరుమాళ్ స్వామియే తిరువేంగడనాథ స్వామిగా మార్పుచెంది ఉండవచ్చును). ఈ దేవాలయంలో అళగ తిరువెంగడనాథస్వామి మూల విగ్రహం మాత్రమే ఉన్నదనీ, ఈ దేవాలయాన్ని చివరి విచారణ కర్తయైన మహంత్ ప్రయాగదాస్ శతాబ్ది ప్రారంభంలో నూతనంగా నిర్మించి ప్రతిష్ఠించినాడని, తరువాత పూజాదికాలు నియతంగా జరిగేవని, ఈ దేవునికే తరువాత సుందరరాజస్వామి అనే పేరు కలిగిందనీ, పద్మావతీ అమ్మవారి దేవాలయంలో ఉన్న వరదరాజ లేదా అళగ తిరువేంగళస్వామి మూడు ఉత్సవమూర్తులను ఈ దేవాలయానికి చేర్చినారని తెలుస్తుంది.

ఈ పైమాయిషి అకౌంట్, గ్రానైట్ శిలానిర్మితమైన ఒక పెద్ద దేవాలయం, వరదరాజస్వామివారిది, తిరుచానూర్‌కి తూర్పుదిశలో పడమటి ముఖంగా పూజారహితంగా ఉండేదని తెల్పుతుంది. దీనిని విజయనగరరాజైన అచ్యుతరాయలునిర్మించి ఒక పెద్దవిగ్రహాన్ని ప్రతిష్ఠించినాడని తెలియవస్తుంది. వరదరాజ స్వామిదేవేరియైన పెరుందేవమ్మ దేవాలయం తూర్పుముఖంగా ఉండేదని తెల్పుతుంది. ఈ దేవాలయ ప్రాకారం తూర్పునుండి పడమరకు 327 అడుగులు కాగా ఉత్తరంనుండి దక్షిణం 177 అడుగులు ఉండేదని, ఒక ముఖద్వారం, ఐదు అంతస్తులగోపురం ఉండేదని తెల్పుతుంది. ఈ దేవాలయం వంటశాలనుండి

వేరు చేయబడిన శిలలతో పద్మావతీ దేవాలయంలో గర్భగృహాన్ని, అంతరాళాన్ని మూడవ అంతస్తును, స్నపన మంటపాన్ని ఆస్థానమంటపాన్ని రంగ మంటపాన్ని నిర్మించినారని పైమాయిషి అకౌంట్ ద్వారా తెలుస్తున్నది.

వంటశాలనుండి వేరుచేసిన శిలలను కొన్నింటిని నేను పద్మావతీ దేవాలయం ఈశాన్యదిశలో పెట్టించినాను. కొన్ని వేరుచేయబడిన శాసన శిలలు వాహన మంటపంలో ఉన్నాయి. ఇవన్నీ ఇప్పుడులేని వరదరాజ దేవాలయానికి చెందినవే. కొన్ని శాసనశిలలను గ్రామవాసులు తమ నిర్మాణాల్లో వినియోగించు కున్నట్లు తెలుస్తున్నది.

ఏదిఏమైనా, తిరువిళన్‌కోయిల్ ఏ స్థలంలో ఉండేదో, ఏ దైవ విగ్రహం దానిలో ప్రతిష్ఠింపబడిందో తెలియదు. తిరుచానూర్‌కి తూర్పుదిశలో ఉండియుండ వచ్చును. ఆ స్థలంలోనే తరువాతి కాలంలో అచ్యుతరాయలు వరదరాజ స్వామి ఆలయాన్ని నిర్మించి ఉంటాడు. అది దేవాలయస్థలం కావడంతో యోగ్యమైందని భావించి ఉంటాడు. **ప్రస్తుతం కన్పిస్తున్న పద్మావతీ దేవాలయం, శ్రీకృష్ణదేవాలయం, అళగతిరువేంగడనాథ దేవాలయం ఎప్పుడు నిర్మింపబడినాయో పైమాయిషీ అకౌంట్ తెల్పడంలేదు.** శ్రీకృష్ణ దేవాలయాన్ని మొదట నిర్మించి ఉంటారు. అది స్థలం మధ్యలో ఉన్నది. దానికి ఎదురుగా గోపురం ఉన్నది. శ్రీకృష్ణదేవాలయం ఉత్తరదిశలో తరువాతి కాలాన పద్మావతీ దేవాలయం నిర్మింపబడి ఉంటుంది. పైమాయిషీ అకౌంట్‌లో లభిస్తున్న సమాచారం ఆధారంగానూ, తిరుచానూర్‌లోనున్న వృద్ధజనులకు సంప్రదాయంగా తెలిసిన వర్తమానంవల్లనూ, 18 వ శతాబ్దం ద్వితీయార్థంలో పద్మావతీ దేవాలయం నిర్మింపబడి ఉండవచ్చుననిపిస్తున్నది. 18 వ శతాబ్దం పూర్వార్థంలోనో, 17 వ శతాబ్దం ఉత్తరార్థంలోనో శ్రీకృష్ణదేవాలయం నిర్మింప బడి ఉంటుంది. 17 వ శతాబ్దం మధ్యకాలంలో వేయబడిన శాసనాలలో శ్రీకృష్ణపద్మావతులకు చెందిన అంశాలేవీ ప్రస్తావింపబడలేదు.

శుకమహర్షిపేరున తిరుచ్చుకనూర్, శుకపురి, శుకగ్రామం అని తిరుచానూర్‌ను పేర్కొంటారు. శుకమహర్షి ఇక్కడ శ్రీకృష్ణుని అర్చించినాడని, తన యోగబలంతో 108 మంది విద్వాంసులను సృష్టించినాడని కథలు ప్రచారంలో ఉన్నా, తిరుచానూర్ దేవాలయంలో ఆయన ప్రతిమలేదు. **పరాశరేశ్వర దేవాలయంలోనే కానవస్తుంది. పరాశరుడు శుకమహర్షి పితామహుడు. పరాశరుడు అర్చించినందున పరాశరేశ్వరుడని పేరు కలిగింది.** పరాశరునితోపాటు శుకమహర్షి విగ్రహం ఉన్నది. యోగి– మల్లవరానికి శుకపురి, శుకగ్రామం, తిరుచ్చుకనూర్ అనే పేర్లు చెల్లుతాయి. తిరుచానూర్‌కి ఈ పేర్లను జోడించడం సముచితంకాదు.

ప్రథమసంపుటం నం.4 శాసనం విజయాదిత్యమహావళి బాణరాయలు తిరువిళన్ కోయిల్ పెరుమానడిగల్ – తిరువిళన్‌కోయిల్‌లోనున్న ముగ్గురు మూర్తులకు – నైవేద్యం సమర్పించడానికి కొన్ని కళంజుల స్వర్ణాన్ని దానంచేసినట్లు తెల్పుతుంది. ఈ కళంజులతో కొంత భూమికొనబడింది. ముగ్గురు మూర్తులలో తిరువిళన్‌కోయిల్ పెరుమానడిగల్ శాసనం I లో చెప్పబడిన మూర్తికావచ్చు. ఈ మూర్తికే

నిత్య దీపారాధనను ఉళగప్పెరుమానార్ ఏర్పాటు చేశాడు. శాసనం నం.4 వలన బాణరాజు నైవేద్యం ఏర్పాటు చేసినట్లు తెలుస్తున్నది. ఇక రెండవమూర్తి తిరుమంతిరశాల పెరుమానడిగళ్ ఉత్సవ ప్రారంభ సమయాదులలో సమర్పింపబడడానికి ఉద్దేశింపబడి ఉంటుంది. మూడవమూర్తి ప్రధానమైన శ్రీ వేంకటేశ్వరస్వామిది. నం.1, నం.4 శాసనాలలో తిరువిళన్‌కోయిల్ పెరుమానడిగళ్ ఉద్దేశింపబడిందో తెల్పలేదు. ముగ్గురికీ కలిపి బాణరాయలు నైవేద్యాన్ని ఏర్పాటు చేసినందున, మూడుమూర్తులు ఒకేచోట – శ్రీ వేంకటేశ్వరస్వామి గర్భాలయంలో – ఉండి ఉండాలి. మొదటి రెండుమూర్తులు పరిమాణంలో చిన్నవైనందున ఇతర ప్రదేశాలకు అవసరాన్ని అనుసరించి తీసుకు పోబడేవి. విజయాదిత్యుడు పల్లవరాజైన విజయదంతి విక్రమవర్మకు సామంతుడు. బాణరాజులకు చెందిన నం.3&4 రికార్డులలో విజయాదిత్యుని పేరు కానరాదు. ఆ శాసనాలు విరిగి నందున, విరిగిలుప్తమైన భాగాల్లో ఉండవచ్చు. లేదా ఆ శాసనాలు వేసిన తరువాత విజయాదిత్యుడు నైవేద్యం ఏర్పాటు చేసి ఉండవచ్చు.

9 వ శతాబ్దం ప్రథమార్థం సమయానికి శ్రీ వేంకటేశ్వరస్వామి గర్భాలయంలో మూలవిరాట్టుతో పాటు ఈ మూడుమూర్తులు ఉన్నట్లు తెలుస్తున్నది. మొదటిది క్రీ.శ.614 సం॥ సామవై చేయించి ప్రతిష్ఠించిన రజత ప్రతికృతిమళవాళప్పెరుమాళ్. మూలవిరాట్టు వలెనే ఈ ప్రతికృతికి వైష్ణవచిహ్నాలులేవు. శాసనాల నం.1&4 లలో ప్రస్తావించబడిన తిరువిళన్ కోయిల్ పెరుమానడిగళ్ నం.4లో ప్రస్తావింపబడిన తిరుమంతిర శాలై పెరుమానడిగళ్ – వీటికి కూడా వైష్ణవచిహ్నాలులేవు. ఆశాసనాలలో చిహ్నాల ప్రస్తావనలేదు. ఈ మూడుమూర్తులు మూలవిరాట్టు మాదిరిగానే దేవేరులు లేకుండా ఉన్నారు.

ఈ మూడుమూర్తులు ఉన్నట్లు చెప్పబడుతూ ఉన్న తిరువిలన్‌కోయిల్ ఒక ప్రత్యేక దేవాలయమని చెప్పడానికి వీలుకాదు. అట్లాంటి నిర్మాణమేదీ దేవాలయలో కానరాదు. మూలభూతమైన దేవాలయంలో గర్భాలయం చిన్నగా ఉండేది. అది అర్థమంటపం – ఇప్పటి శయన మంటపం – తో కూడి ఉండేది. గర్భాలయాన్నే తిరువిళన్‌కోయిల్‌గా వ్యవహరించి ఉండవచ్చు – ఈ విగ్రహాలను నెలకొల్పడం మూలాన.

శ్రీ వేంకటేశ్వరస్వామికి ఉన్న పంచబేరాల్లో, నాల్గింటిని తన వలెనే ఉన్నవాటిని శ్రీ వేంకటేశ్వరస్వామి సృష్టించినాడని, బ్రహ్మదేవుడు బ్రహ్మోత్సవాలను కల్పించినపుడు ఒక క్షణంలో నాలుగుమూర్తులు సృజింపబడినాయని తెలుసుకున్నాం. 9 శతాబ్దంనాటికి ఈ నాలుగు విగ్రహాలు ఉన్నాయి. ఐదవవిగ్రహంకూడా ఉన్నది. దీనినే మలైక్కునియనిన్ఱ పెరుమాళ్ లేదా మలయప్పగా వ్యవహరిస్తారు. **మలయప్ప ఇద్దరు దేవేరులతో శంఖచక్రాలను ధరించి 14 వ శతాబ్దంలో అవతరించినాడు. అప్పటికి శ్రీవేంకటేశ్వరుడు వైష్ణవ చిహ్నాలతో విరాజమానుడై ఉన్నాడు. వైష్ణవార్చన విధానం, వైష్ణవప్రబంధ పఠనం అప్పటికే శ్రీ రామానుజులు ఆయన అనుయాయులు 12,13 శతాబ్దాల సమయంలో చేసినట్లు భావింపబడు తున్నది.**

మలయప్పస్వామి – ఇద్దరు దేవేరులైన శ్రీదేవి, భూదేవి సహితంగా – ఉత్సవమూర్తులుగా ప్రస్తావింపబడింది– ప్రథమ సంపుటం శాసనం 104లో. అతి శ్రీరంగనాథ యాదవరాయలు రాజ్యానికి

వచ్చిన 3వ సంవత్సరకాలానికి చెందింది (క్రీ.శ.1339). ఆ శాసనంలో "నాచ్చియార్"తో కూర్చొని ఉండగా" అని ఉన్నది. విరిగిపోయిన భాగంలో మలయప్ప పేరు ఉండి ఉంటుంది. **యాదవరాయలు రాజ్యానికి వచ్చిన 20 వ సంవత్సరాన (క్రీ.శ.1336) వేయబడిన నం.106 శాసనంలో మలైక్కునియనిన్ఱ పెరుమాళ్ స్పష్టంగా పేర్కొనబడినాడు.** మలైక్కునియనిన్ఱపెరుమాళ్ వేంకటాచలంపై లోయలో లభించినాడని ఐతిహ్యం. ఆయన బరువునకు కొండవంగి లోయఏర్పడి నందున మలైక్కునియనిన్ఱపెరుమాళ్ అని పేరు కలిగిందని అంటారు. **శ్రీ వేంకటాచలాన్ని అలంకరించినందున మలైక్కు - నియనిన్ఱ - పెరుమాళ్‌గా వ్యవహారం. తరువాతి శాసనాలలో ఆయనను మలయప్ప లేదా పర్వతప్రభువు అని ప్రస్తావించినారు.**

దేవేరులతో మలయప్ప 14 వ శతాబ్దంలో ప్రవేశించేవరకు, సావవై రాణి సిద్ధం చేయించిన మణవాళప్పెరుమాళ్ రజత ప్రతికృతి ఉత్సవ విగ్రహంగా ఉండవచ్చు. సామవై ఈ రజత ప్రతికృతికి ప్రతిష్ఠా సమయంలోనే పురట్టాసి మార్గళి ఉత్సవాలకు ఏర్పాటు చేసింది. శ్రీ వేంకటేశ్వరస్వామి తన ప్రతికృతులను నాల్గింటిని సృష్టించి నిర్దేశించినట్లు - సామవై రాణి చేయించిన రజత ప్రతికృతి కౌతుకబేరం, లేదా అభిషేక శయనాది సేవలనందే భోగమూర్తిగా (ధనుర్మాసంలో తప్ప, ధనుర్మాసంలో శ్రీకృష్ణ స్వామికీ సేవలు లభిస్తాయి). తిరువిళన్‌కోయిల్ పెరుమానడిగల్ 1 నుండి 4 - బలిబేరం, కొలువుమూర్తి, కొలువు శ్రీనివాసుడు లేదా లేఖకశ్రీనివాసుడుగా, తిరుమంతిరశాలై పెరుమానడిగళ్, స్నపనబేరం, ఉగ్ర శ్రీనివాసమూర్తిగా గర్భాలయంలో ఉంటారు.

పైన వివరించిన పంచబేరాలేకాక, గర్భాలయంలో శ్రీ వేంకటేశ్వర మూల విరాట్టునకు వామభాగంలో శ్రీ రామానుజులు ప్రతిష్ఠించిన సీతారామ లక్ష్మణుల విగ్రహాలున్నాయి. మదురైకి సమీపంలో ఉన్న ఒక దేవాలయం నుండి సంరక్షణార్థం ఒక వైష్ణవుడు శ్రీరామవిగ్రహాన్ని శ్రీ రామానుజుల కిచ్చినాడని ఐతిహ్యం. అప్పుడు శ్రీ రామానుజులు, తిరుమలనంబి వద్ద రహస్యత్రయాన్ని సేవిస్తూ ఉన్నారట. శ్రీ వేంకటేశ్వర స్వామికి వామభాగంలో శ్రీకృష్ణరుక్మిణీదేవి విగ్రహాలున్నాయి. వామభాగంలోనే సుదర్శన లేదా చక్రత్తాళ్వార్ ఉన్నారు. కొంచెం ఎత్తుగా ఏర్పాటైన వితర్దికలపై ఈ విగ్రహాలన్నీ ఉంటాయి. రజతప్రతికృతియైన భోగశ్రీనివాసమూర్తి శ్రీ వేంకటేశ్వరస్వామి పాదాలవద్ద ఉంటుంది. మూడు ఉత్సవమూర్తులు దక్షిణభాగాన, బలిబేరం లేదా కొలువుమూర్తి, స్నపనబేరం లేదా ఉగ్రమూర్తి వామభాగంలో ఉంటాయి.

ఇవికాక, విష్వక్సేన, సుగ్రీవ, అనంత, గరుడ, అంగద, ఆంజనేయ విగ్రహాలు ఉన్నత స్థానంలో ఉన్నాయి. ఇవి గర్భగృహందారిలో రెండువైపులా ఉన్నాయి.

ముక్కోటి మంటపానికి ఉత్తరంగా చివర గర్భగృహానికి ఉత్తరంగా శ్రీ విష్వక్సేన విగ్రహానికి ఒక చిన్న మందిరం ఉన్నది మహామణి మంటపానికి తూర్పుదిశలో గరుడాళ్వార్లకు ఒక చిన్నమందిరం ఉన్నది. మహామణి మంటపానికి ఆగ్నేయమంగా శ్రీ వరదరాజస్వామి మందిరం ఉన్నది.

* * *

# అధ్యాయం-14

## శ్రీ వైష్ణవ సంప్రదాయంలో పన్నెండుగురు ఆళ్వార్లు - ఆళ్వార్ల పాశురాలలో శ్రీవేంకటేశ్వరుడు

శ్రీ వైష్ణవులు దివ్యదేశాలుగా భావించే 108 దేవాలయలలో అర్చింప బడుతూ ఉన్న శ్రీవిష్ణువు, ఆయన అవతారాలను వర్ణిస్తూ ఆళ్వార్లు రచించిన పాశురాల నన్నింటినీ – నాలాయిరదివ్యప్రబంధాలుగా పేర్కొంటారు. వీరిలో ప్రథములైన ముగ్గురిని – 1) పొయ్‌గై ఆళ్వార్ 2) భూతం లేదా పూదత్తాళ్వార్ 3) పై ఆళ్వార్‌గా పేర్కొంటారు. ఈ ముగ్గురుకీ సమకాలికుడైన ఆళ్వార్ తిరుమళిశై ఆళ్వార్‌ని నాల్గవ ఆళ్వారుగా పేర్కొంటారు. తరువాతి ఆళ్వార్లు 5) నమ్మాళ్వార్ 6) మధురకవి ఆళ్వార్ 7) పెరియాళ్వార్ లేదా విష్ణుచిత్తుడు, పెరియాళ్వార్ పెంపుడు కూతురైన 8) ఆండాళ్ లేదా గోదాదేవి 9) కులశేఖ రాళ్వార్ 10) తొండరడిప్పొడి ఆళ్వార్ 11) తిరుప్పాణాళ్వార్ లేదా యోగివాహుడు 12) తిరుమంగై ఆళ్వార్ అనేవారు.

వివిధక్షేత్రాలలో వివిధరూపాల్లో సమర్పింపబడే శ్రీ మహావిష్ణువునకు శరణాగతిని, సర్వకర్మఫల సమర్పణాన్ని ఆళ్వార్లు ప్రబోధించారు. వారు తమ దివ్యజీవనం, ఉపదేశం, విష్ణుభక్తి ప్రచారం, వైష్ణవ దీక్షనీయడం మొదలగువానిచే దక్షిణభారతదేశంలో వైష్ణవాన్ని బలంగా స్థాపించినారు. వైష్ణవేతరులను శ్రీ వైష్ణవులుగా మార్చి, విస్తృత ప్రచారం కావించి శ్రీ రామానుజాది వైష్ణవాచార్యులు వైష్ణవాన్ని తరువాతి కాలాన బలోపేతం చేశారు.

మధురకవిఆళ్వార్, తొండరడిప్పొడి ఆళ్వార్ తప్ప, తదితర పదుగురు ఆళ్వార్లు శ్రీ వేంకటేశ్వరస్వామిని తమ పాశురాలలో పాడి కీర్తించినారు. **పొయిగై ఆళ్వార్** – నాలాయిరదివ్య ప్రబంధంలో మొదటి నూరు పాశురాలను "ముదల్ తిరువందాది" ని రచించిన పొయిగై ఆళ్వార్ కాంచీపురంలో జన్మించినాడని విశ్వసిస్తారు. ఈ నూరు పాశురాలలో పన్నెండు లేదా ఎక్కువ పాశురాలలో శ్రీ వేంకటాచలాన్ని వెంగడంగా శ్రీ వేంకటేశ్వర స్వామిని వెంగడత్తాయ్‌గా (నం.68) వెంగడత్తు మీయన్ (నం.99) ప్రస్తావన ఉన్నది. [*1]**వేంకటాచలాన్ని వర్ణిస్తూ అక్కడ నల్లని ఏనుగులు, సర్పాలు ఉన్నాయని, ఆటవిక కురవజాతివారు అక్కడ నివసిస్తారని, దేవతలచే సమర్పింపబడే లక్ష్మీపతికి నివాసస్థానమనీ వర్ణించినాడు.** సముద్రం నుండి భూమిని ప్రళయకాలంలో సమద్ధరించిన దేవునికి నివాసమని, గోవర్ధన పర్వతాన్నెత్తి ఇంద్రుడు కల్పించిన వడగళ్ళ వర్షం నుండి గోవులను రక్షించిన, కంసుని సంహరించిన, క్షీరసాగరంపై శయనించిన దేవునికి

---

***1** "పైన పేర్కొనబడిన పదిపాశురాలను, శ్రీ T.K.V.N. సుదర్శనాచార్యులు సంపాదకులుగా ప్రచురితమైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి పై ఆళ్వార్ల మంగళా శాసనపాశురాలు" అనే గ్రంథం నుండి గ్రహించినాము. తిరుపతి దేవస్థానం ప్రెస్సు దీనిని ప్రచురించింది. కీ.శే.డా॥ యస్. కృష్ణస్వామి అయ్యంగార్ తాము రచించిన **"హిస్టరీ ఆఫ్ తిరుపతి"** Vol.I లో మరికొన్ని పాశురాలను, నం.98, నం.28 పాశురాలను పేజీలు 65-66లో, నం.5, నం.74 పాశురాలను పేజీలు 59-60 లో ఉదాహరించినారు.

ఆవాసస్థానమని, తెల్లని శంఖాన్ని పూరించే శ్రీకృష్ణస్వామికి ప్రియమైన స్థానమని, పరిమళద్రవ్యాలను, దీపాన్ని, పూవులను, జలాన్ని విద్వాంసులైన లౌకిక భక్తులు వివిధ ప్రాంతాల నుండి నిత్యం కొనితెస్తారని (నం.37) వర్ణించినాడు. హిరణ్యకశిపుణ్ణి సంహరించిన నరసింహస్వామికి అభిమతమైన స్థలమని, **కురవలు వెలిగించే కాగడాలకు భయపడి ఏనుగులు పొలాలనుండి పరుగిడిపోతాయని, కురవలు ధనుర్బాణాలను ధరించి ఉంటారని, వారు ప్రయోగించినశరాలు ఆకాశం నుండి పడుతూ ఉంటే ఏనుగులు భయపడి పోతాయని (నం.40) పాశురాలలో వేంగడం వర్ణింపబడింది.** నాలుగుపుణ్యక్షేత్రాల్లో ఒకటైన వేంగడంలో స్వామిస్థానకంగా అంటే నిలిచి ఉన్న ఆకారంలో, పరమేశ్వర విన్నగర్ లేదా విన్నగర్ కాంచీలో ఆసీనుడై, కాంచీలో వెహ్కాలో శయనమై, పుష్పమయమైన తిరుక్కోవలూర్‌లో, కందకాలతో చుట్టిఉన్న ప్రసిద్ధపొన్నగర్‌లో సంచార రూపంలో ఉంటాడని, ఆ స్వామిని ఆరాధించిన వారికి అన్ని దుఃఖాలు మాయమైపోతాయని (నం.77) పాశురంలో వర్ణింపబడింది. (68) వ పావురంలో, ఓదేవా! స్వర్గంలో భూమిపై, వేంగడాన నివాసమున్నావు. నాలుగువేదాల్లో ఉన్నావు. నీ మహిమను ఎవరు తెలుసుకోగలరు? శుభకరగుణములు కలిగిన స్వామీ! వామనరూపంలో భూమిని కొలిచిన స్వామీ! నిన్ను భక్తితో సేవించినవారికి వేదాల్లో గణుతింపబడ్డ దివ్యరూపం లభిస్తుంది. నీవు నివసించిన వేంగడం కూడా దివ్యసుఖాలను ప్రసాదిస్తుంది.

---

నం.98, నం.28 పాశురాలను ఉదాహరిస్తూ ఇట్లా వ్రాసినారు. "పాశురం నం.98 లో పొయిగై ఆళ్వార్‌వర్ణిస్తూ, బంగారువలె ప్రకాశించే స్వామి జటాశోభితుడై (శివస్వరూపం) ఉన్నాడు. త్రివిక్రమవిష్ణువై నిల్చి విశ్వాన్ని కొలిచినాడు ఈ రెండు ఆకారాలతో ఉన్నా, ఒకటి మరొకదానికి శరీరం వంటిది. దీనితో విష్ణువు తన శరీరంలో శివుణ్ణి ధరించినాడనే అభిప్రాయాన్ని తెల్పుతున్నట్లున్నది. విష్ణువును సంబోధిస్తున్న మరొకపాశురం నం.28లో ఇది ఇంకా స్పష్టంగా ఉన్నది. **"ఓ నీలదేహా! నీ హస్తాలలో శంఖం, చక్రం ఉన్నాయి. నీ వక్షఃస్థలంలో లక్ష్మి ఉన్నది. నీ నాభియందు వేదాలను రచించిన యువకుడున్నాడు." కుడివైపు భాగంలో శరీరంలో త్రిపురాలను దహించిన ప్రభువు (శివుడు) ఉన్నాడు."**

(శివుని పత్నిగా, విష్ణువు శివదేహంలోభాగంగా ఉన్నాడని శ్రీ శంకరాచార్యుల శివానందలహరి శ్లో.15 చూడదగును)

డా॥ S.K.అయ్యంగార్ తన గ్రంథం 59వ పేజిలో నం.5, నం.74 పాశురాలను ఉదాహరిస్తూ ఇట్లా వ్రాసినారు. "ముదల్ తిరువందాదిలోని 5, 74 పాశురాల తాత్పర్యం ఇట్లా ఉన్నది." **ఆయన పేరు అరన్ (హరన్) నారణన్ (నారాయణ). ఆయన వానరం వృషభం, పక్షి. ఆయన గ్రంథం నూల్ తంత్రం లేదా ఆగమం, మరై (వేదం) ఆయన నివాసం కైలాసం, జలం లేదా సముద్రం, చేతిలో ధరించిన ఆయుధం త్రిశూలం, చక్రం, ఆయన రూపం అగ్ని, నీలమేఘం. ఈ అభిప్రాయాన్నే నం.74 పాశురం కూడా తెల్పుతుంది. "ఆయన వృషభాన్ని పక్షినీ అధిరోహిస్తాడు. ఆయన పురాన్ని దహించినాడు (త్రిపురదహనం) ఉరాన్ని భేదించినాడు (నరసింహుడుగా హిరణ్యకశిపుణ్ణి చీల్చినాడు). ఆయన విభూతిని అలదుకున్నాడు. నీలమణి వర్ణంతో ఉన్నాడు. శరీరంలో ఒక భాగం పార్వతి, మరొక భాగం కమలోద్భవయైన శ్రీదేవి. ఆమె లక్ష్మీదేవి. ఆయన జటాధారి, కిరీటాన్ని ధరించినాడు. ఆయను శిరస్సున గంగను ధరించినాడు, విష్ణుత్రివిక్రముడుగా సుదీర్ఘపాదంపై ధరించినాడు. దీనితో ఆయన రెండు ఆకారాలను ఒకే సమయంలో కలిగి ఉన్నాడని, లక్షణాలను, ఆయుధాలను వర్ణించిన విధాన్ని పరికిస్తే, విగ్రహాకృతి హరిహరకృతి (శివవిష్ణువు) అని తెలుస్తుంది."**

(నం.76) శితశరసమాన దృగ్జాలం కలిగిన స్త్రీలు, అందమైనహారాలతో పరిమళద్రవ్యాలను తెచ్చి ద్వాదశినాడు వేంగడం పై వెలిగిస్తారు. ఆ ధూమంతో ఆకాశం నల్లబడుతుంది. అట్లాంటి వేంగడంపై, కృష్ణసార వేషాన్ని ధరించివచ్చిన మారీచుణ్ణి సంహరించిన శ్రీరాముడు నివాసమై ఉంటాడు. (నం.82). ఓనా మనస్సా! మనకు రక్షకుడు పురుషోత్తముడని నీకు తెలుసు. మన గౌరవాన్ని నిలిపి, యోగిజనులు హృదయాల్లో నివసించేస్వామిని ధ్యానించు, ఆయన వెంగడంపై ఉన్నాడు. మన హృదయాల్లో నివాసమై ఉన్నాడు. ఆయనను ధ్యానించు (నం.99). వేంగడం సంపదలను, సౌభాగ్యాన్ని కోరే భక్తుల పాపాలను దహిస్తుంది. కైవల్యాన్ని కోరేవారికి, తులసీ మాలాలంకృతుడైన స్వామినర్చించేవారికి వెంగడం పాపాలను దహిస్తుంది. ఆ వెంగడం నిత్యసూరుల భక్తిజ్వాలను పెంపొందిస్తుంది. (నం.26)

**పూదత్తాళ్వార్ –** ఈయన మొదటి నల్వురు ఆళ్వార్లలో రెండవవాడు, మహాబలిపురంలో జన్మించినాడని అంటారు. నాలాయిర ప్రబంధంలో రెండవశతకం *2 రెండవతిరువందాది ఈయన రచించినది దీనిలో 25వ పాశురంలో "లంకలో కాలిడి రావణుణ్ణి సంహరించిన దేవుడే వేంగడంపై ఉన్నాడని స్తుతిస్తుంది. పాశురం 28 వేంగడంలో, శ్రీరంగంలో ఉన్న దేవుడే తన హృదయంలో ఉన్నాడని, ఆయనను దేవతలు అర్చిస్తారని, ఆయన క్షీరసాగరంలో శయనిస్తాడని, కృష్ణుడుగా అశ్వాకృతిలో వచ్చిన కేశి అనే రాక్షసుణ్ణి సంహరించినాడని వర్ణిస్తుంది. 33, 45, 46, 53, 54, 72 & 75 పాశురాలలో వేంగడంను అక్కడ నివాసమైన తులసీదామ భూషితుడైన దేవదేవుణ్ణి వర్ణించి, ఆయన వేంగడంలో ఇతర స్థలాల్లోనూ నివాసమై ఉన్నాడని, తన మనస్సు ఆయన్నే ధ్యానిస్తుందని ఆయన నామావళినే స్మరిస్తుందని, తన శరీరం ఆయనకు సాష్టాంగ ప్రణతిని చేస్తుందని తన నోరు ఆయన గుణగణాన్నే కీర్తిస్తుందని, ఆయనను శరణమందినవారికి ధనాహంకారం ఉండదనీ విస్పృహులై ఉంటారని, వేంగడంలో జటాధారులైన తపస్వులు నిర్భీకంగా నిరంతరంగా తపస్సు చేస్తూ ఉంటారని వర్ణించినాడు. పాశురం 72లో తన మనస్సును వేంగడం వెళ్ళి స్వామి నర్చింపుమని ప్రబోధిస్తాడు. ఆయన నామస్మరణచేసి, ఆయన కుసుమకోమల చరణాలను పుష్పాలతో అర్చించి ప్రార్థించుమని మనస్సును కోరుతాడు. **వేంగడంలో కోతులు కూడా సమయానికి సరిగా పూవులను కోసి తీసుకువస్తాయని పూజిస్తాయని 72 వ పాశురంలో గానం చేసినాడు.** 54 వ పాశురంలో తిరుమాలిరున్‌శోలై, వేంగడంలో తన హృదయంలో శాశ్వతంగా నివాసమై క్షీరసాగరాన్ని వదలరాదని ప్రార్థించినాడు.

---

*2 "ఈ పాశురంలో ఆళ్వార్ తన హృదయాన్ని ఉలన్‌కోయిల్ లేదా ఉళ్లంకోయిల్ అనీ, క్షీరసాగరాన్ని వెళ్లం–ఇళన్–కోయిల్ అని పేర్కొన్నాడు. ఉలన్‌కోయిల్ అంటే తన ఉళ్లం లేదా హృదయమే ఆయనకు ఆధ్యాత్మికమైన కోవెలలాగా, ఇళన్–కోయిల్ అంటే బాలాలయంలాగా చెప్పి ఉంటాడు. ప్రళయకాలంలో సముద్రంపై దేవాలయ నిర్మాణం ఉండదు. అందుకే దానిని ఇళన్‌కోయిల్ మొదటి తాత్కాలిక గృహంగా పేర్కొని ఉంటాడు. ప్రళయ కాలంలో భూమి, పర్వతాలు, దేవాలయాలు, నిర్మాణాలన్నీ నీటిలో మునిగి పోయి నందున దేవునకు నివాసాలయమేలేదు. ఆయన నివాసానికై ఒక దేవాలయం నిర్మింపబడేవరకు, క్షీరసాగరం బాలాలయం లేదా తాత్కాలిక వసతి అని వర్ణింపబడింది.

**పేయాళ్వార్ -** ముదల్ ఆళ్వార్లలో మూడవవాడైన పేయాళ్వార్, మద్రాస్‌లోని మైలాపూర్‌లో జన్మించినాడని విశ్వసిస్తారు. పేయాళ్వార్ నూరు పాశురాలను రచించినారు. *3 ఇది మూడవ తిరువందాదిగా, నాలాయిరంలో భాగంగా ఉన్నది. ఇరవై పాశురాలలో వేంగడం ప్రసక్తి కన్పిస్తుంది. పద్నాల్గవ పాశురంలో ఏ దేవుని పాదాలను తమ కిరీటాలతో దేవతలు స్పృశిస్తారో, ఏ దేవునినాలుగు వేదాలు స్తుతిస్తాయో, ఏ దేవుడు వేంగడంపై నివాసమై ఉన్నాడో, ఆ దేవునిపై మనస్సునిల్పినవారు సుందరాంగనలనుండి మనస్సును మరల్చి, వేదాంత గ్రంథాలపై కేంద్రీకరిస్తారని, 93 వ పాశురంలో సమస్త వస్తువులందున నెలకొని ఉన్నవాడు, అష్టదిక్కులుగా భాసించేవాడు వేదస్వరూపుడైనవాడు, వేదార్థమైన వాడు, పరమపదమైనవాడు, చంద్ర బింబాన్ని స్పృశిస్తూ వేంగడంపై నివాసమైనాడని, వేంగడంపై మెరుస్తూ గలగల పారేసెలయేర్లున్నాయని ఆదేవుడే తన మనస్సునందున్నాడని వర్ణించినాడు. తన మనస్సును సంబోధిస్తూ 40 వ పాశురంలో "ఓ

---

దేవతలు శిరస్సువంచి వేంగడత్తాన్ (శ్రీ వేంకటేశ్వరస్వామి) పాదాలను స్పృశిస్తారని, ఆయన నీలమణి కాంతిగలిగిన ఆజానుబాహువని వర్ణిస్తాడు. వేంగడం పై వెదురుపొదలుంటాయని, సెలయేర్లు ఉన్నాయని, సరస్సు లున్నాయని, వానిలో ఏనుగులు ఉంటాయని, వాటిలో మగ ఏనుగులు లేత వెదురు చిగుళ్ళను త్రెంపి తేనెలో ముంచి తమభార్యలకిస్తాయని వర్ణించినాడు.

శ్రీ వేంకటేశ్వరుడు, రాముడు, కృష్ణుడు, విష్ణువు, శ్రీరంగం, తిరుకోట్టియూర్, తిరునీర్మలై తిరుమాలిరున్ శాలైలో నివాసమైన దేవుడు అందరూ ఒకరేనని వర్ణిస్తాడు.

పైన వివరించిన పాశురాలనే కాక డా॥కె.యస్.అయ్యంగార్ రచించిన **History of Tirupati Vol.I గ్రంథం 71 వ** పేజీలో 60 వ పాశురాన్ని ప్రస్తావించినాడు. ఈ పాశురం, స్వామికి రెండు రూపాలున్నాయని, అందులో ఒకటి మరొక దానిలో అంతర్భవించి ఉంటుందని, అది విష్ణురూపమని, పొయిగై ఆళ్వార్, నమ్మాళ్వార్ శివుడు బ్రహ్మ రూపాలు విష్ణువులో భాగమైనా యని తెలిపినారు. ఈ పాశురానికి వ్యాఖ్యాతలు సాధారణ వ్యాఖ్యానం చేసినారు. పొయిగై ఆళ్వార్‌వలెనే పూదత్తాళ్వార్ కూడా తిరుపతి ఆలయాన్ని విష్ణుదేవాలయంగా భావించిన భక్తుడని తెలుస్తున్నది. శివలక్షణాలున్నా అవి వారి దృష్టిలో ప్రధానమైనవికావని తెలుస్తున్నది."

*3 "పాశురాలలో శ్రీగిరి లేదా శుభకరమైన పర్వతానికి సమానార్థకంగా తిరుమల పదం పాశురాలలో ఇక్కడే ప్రథమంగా కన్పిస్తుంది. పొయిగై ఆళ్వార్ వలెనే పేయాళ్వార్ కూడా వేంకటేశ్వరస్వామిని హరిహరాత్మకమైన అద్భుత రూపం కలిగి ఉన్నట్లు వర్ణించినాడు.

69 వ పాశురంలో భక్తిపారవశ్యంలో, భగవత్ప్రేమలో 'వేంగడం' అనే మాట వింటూనే తనను తానొక స్త్రీగా సంభావించుకొని భగవంతునకర్పింపవలసిన తులసిని కోసి, తులసీమాలను నల్లనికేశభారంలో అలంకరించుకొని, చాణూరాదులను సంహరించిన శ్రీకృష్ణుడు శయనించే విశాలక్షీరసాగరంలో స్నానం చేయాలని కోరుతూఉన్నట్లు వర్ణించినాడు. 73 వ పాశురంలో, వేంగడంపై నివాసమౌ మంజీర నినాదంతో శోభించే పాదాలు కలిగిన స్వామిని, సూర్యరథాన్ని తూర్పునుండి పడమరకు, కుడినుండి ఎడమకు నడిపించే స్వామిని స్తుతించడం, నీటికుండలు ధరించిన గోపికలతో కలిసి నృత్యంచేయడం తన జీవిత ప్రధానాశయమని తెల్పినాడు. 45 వ పాశురంలో ప్రళయకాలంలో భూమితోపాటుగా వరాహస్వామి ఉద్ధరించిన పర్వతం వేంగడమని వర్ణించినాడు. ఈ పాశురంలోనే స్వామిపుష్కరిణి పశ్చిమదిశలో, శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయానికి ఉత్తరదిశలో వేంచేసియున్న వరాహస్వామి ప్రసక్తి కన్పిస్తుంది. వేంగడం అంటే వేంకటాచలమని అర్థం."

మనస్సా! నీకు పరమాత్ముడున్నాడని, ఆయన శాశ్వతుడని తెలుసు ఆయన భక్తుల హృదయాలలో ఉంటాడనీ తెలుసు, మరోవిషయం కూడా తెలుసుకో, ఆకాశాన్ని స్పృశించే శృంగాలతో, పెద్దసెలయేర్లతో అలరారే వేంగడంపై నున్న దేవుడే తన పాదంతో భూమిని కొలిచిన వామనుడని. 63 వ పాశురంలో, **"తిరుమలపై వాసమైన నా ప్రభువునకు సుదీర్ఘమైన జటలు ఉన్నాయి. సమున్నతమైన కిరీటం ఉన్నది. అందమైన పరశువు, చక్రమూ ఉన్నాయి. చుట్టుకున్న సర్పం ఉన్నది. తిరుమలపై వడివడిగా ప్రవహించే సెలయేర్లున్నాయి. ఆయన ఆకృతి హరిహరాత్మకంగా అద్భుతంగా ఉన్నది"**, అని కీర్తించినాడు.

*4-పేయాళ్వార్ తిరువేహ్కా, వేళుక్కైప్పాడు (కాంచీపురి పరిసరాల్లో ఉన్నది). తిరుప్పాడగం, తిరువిణ్ణనగర్, తిరుక్కుండంద్దై (కుంభకోణం), శ్రీరంగం, తిరుక్కోట్టియూర్ – క్షేత్రాలలో వేంచేసి ఉన్న దేవులను వర్ణించినాడు. వీరందరూ, దేవతలు తమ కిరీటాలతో ఏ దేవుని పాదాలను స్పృశిస్తారో, ఏ దేవుడు భోగిశయనుడై పాలసముద్రం పై శయనిస్తాడో, ఏ దేవుడు గోపాలకృష్ణుడో, వామనుడో, త్రివిక్రముడో ఆ దేవుడు పరమపదంలో ఉంటాడో, ఆ దేవునితో సమానులని వర్ణించినాడు. వేదాలలో, శాస్త్రాలలో, యోగిజనుల మనస్సులలో తన మనస్సులో నెలకొని ఉన్నాడని, ఆయనను వదలలేనని వ్రాసినాడు. వేంగడంపై ఎత్తైన వెదురుచెట్లున్నాయని, అవి ఆకాశాన్ని తాకుతున్నట్లున్నాయని, వాటి చివరికొమ్మలను కురవస్త్రీలు క్రీడార్థంలాగి వదులుతారని, ఆ కొమ్మలుపై కెగిసి రాహువును జయించి, చంద్రునికి గ్రహభీతిని తొలగిస్తాయని వర్ణించినాడు. వెంగడం శిఖరం ఆకాశాన్ని స్పృశిస్తున్నట్లున్నదని, అక్కడ ఏనుగులు, వానరాలు, వరాహాలు, శరభాలు నివసిస్తున్నాయని, ఎన్నో సెలయేర్లున్నాయని, ఆ పర్వతంపై శిలాఫలకాల్లో తమ ప్రతిబింబాన్ని చూచుకొని వేరే ఏనుగులన్న భ్రమతో, కొండపై నున్న ఏనుగులు లక్ష్మీనివాస స్థానమైన తమ దంతాలతో, ఆ రాళ్ళను పొడుస్తాయని, ఆ సమయంలో ముత్యాలు వాటినుండి చిప్పిలి పడతాయని వ్రాసినాడు. వానరస్త్రీలు చంద్రుణ్ణి తీసుకువచ్చి తమకీయాలని పురుషవానరాలను కోరుతున్నట్లు వర్ణించినాడు. పూదత్తాళ్వార్ 72 వ పాశురంలో వర్ణించినట్లే పై ఆళ్వార్ 70 వ పాశురంలో వేంగడంపై నున్న వానరాల భక్తి శ్రద్ధలను వర్ణించినాడు. వేంగడంపై మదగజాలు, స్రవిస్తున్న తమ మదజలంతో ముఖప్రక్షాళనం, పాదప్రక్షాళనం చేసుకుంటాయని, తమ తొండాలతో తేనె నిండిన పువ్వులను వేంగడం ప్రభువునకుసమర్పించి, ఆయనకు సాష్టాంగ ప్రణతి చేస్తాయని వర్ణించినాడు.

---

*4 "ఏనుగుల వర్ణనం గజేంద్రమోక్షాన్ని స్ఫురింపచేస్తుంది. మకరపీడితుడైన గజరాజు శ్రీ మహావిష్ణువును ప్రార్థించి, ఆ బాధనుండి విముక్తుడైనాడు గజేంద్రుడు విష్ణుభక్తుడైనాడు. ఈ గజాలన్నీ, ఆ గజేంద్రుని భక్తిని పొందినట్లు భావించాలి. అట్లాగే పూదత్తాళ్వార్ వర్ణించిన కోతుల భక్తి శ్రీరాముణ్ణి (ఆంజనేయుడు సేవించిన విధానాన్ని తలపిస్తుంది.) పైనుదాహరించిన పాశురాలేకాక **డా॥S.K.అయ్యంగార్ History of Tirupati** Vol.I రచించిన 77 వ పేజీలో శ్రీ విష్ణుక్షేత్రాలను ప్రస్తావిస్తూ "31 వ పాశురం కూడా హిరణ్యకశిపుని వక్షఃస్థలాన్ని చీల్చిన నరసింహస్వామి ఆలయాలను, నాలుగు వేదాలు, క్షీరసాగరం, అనంతుడు మొదలైన రూపాలను ధరించిన దేవుని ఆలయాలను వర్ణిస్తుందని వ్రాసినాడు. కాని, ఆ పాశురంలో వృషభవాహనుడై గంగను శిరస్సున ధరించిన శివుడు (వేంకటేశ్వరస్వామి శరీరంలో) భాగమైనట్లుగా తెల్పబడింది."

**తిరుమళిశై ఆళ్వార్ :**

తిరుమళిశైగ్రామం పూనమల్లికి సమీపంగా ఉన్నది. అది మదరాస్‌కి దగ్గరలో ఉన్నది. ఈ ఆళ్వార్ తిరుమళిశై గ్రామంలో జన్మించినాడు. ఈ ఆళ్వార్‌నకు భక్తిసారుడనే పేరుకూడా ఉన్నది. **'నాన్ముగన్ తిరువందాది'** అని పేరుగల నూరుపాశురాలను ఈ ఆళ్వార్ విరచించినాడు. **'తిరుచ్చంద విరుత్తం'** మరొక 120 పాశురాలను కూడా రచించినాడు. ఈ రెండూ 'దివ్యప్రబంధం'లో చేర్చబడినాయి.

నాన్ముగన్ తిరువందాదిలో 34 వ పాశురంలో తిరుక్కోట్టియూర్‌లో వేంగడంలో నివాసమైన దేవుని సమర్చించడానికి తన గాఢ వాంఛను వ్యక్తంచేస్తూ అదియే సుకృతాలను వృద్ధి చేస్తుందని తెల్పుతాడు. "అయాచితంగా నా శరీరబాధల నన్నింటినీ స్వాభావికంగానే తొలగించే ఆయన పాదాలను ఎట్లా విస్మరిస్తాను?" అని ప్రశ్నిస్తాడు. 39 వ పాశురంలో "వేంగడత్తాన్ సమర్చనకై స్వాగతిస్తాను. ఆయన కొండను దర్శించాలి. ఆ కొండపై తీవ్రవర్షపాతంతో ఎగసిపడే జలపాతాల్లో కొట్టుకు వస్తున్న రత్నరాసులకు భయపడి ఏనుగులు కొండచిలువల నోళ్ళలో పడుతూ ఉంటాయి. దాన్ని నేను ఇసుకలో చిత్రించి వృత్తాన్నేర్పరచి, శ్రద్ధగా చూస్తాను. (ఇట్లా చేయడం ఒక మంత్రశాస్త్ర తంత్రం)" 40 వ పాశురంలో ఇట్లా వ్రాసినాడు, " 'కొండ' అన్న పదాన్ని వినగానే నేను వెంగడాన్ని స్మరించి స్తుతించాను. నాకు తద్వారా ముక్తి లభించింది. నేను భక్తి శ్రద్ధలతో పూజిస్తాను. శ్రీ లక్ష్మీపతి పాదాల్లో నేను బంధింపబడ్డాను. ఆయన భక్తుల వలలో పడ్డాడని వేదాలు వక్కాణిస్తున్నాయి." 41 వ పాశురంలో ఇట్లా తన విస్మయాన్ని వ్యక్తం చేస్తాడు, "వెంగడంపై నివాసమైన దేవా! నీవు రత్నరాసులను వెదజల్లే జలపాతాలున్న ఆ కొండపై స్థిరనివాసాన్ని వదలి, శ్రవణ నక్షత్రంనాడు నీ స్తుతిపాఠాలను వదలి నా హృదయంలో ప్రవేశించినావు నేనేమో కొండపై నున్న నీ నివాసానికి వచ్చి సమర్చించాలని తహతహలాడు తున్నాను." 42 వ పాశురంలో జనులను వేంగడంవెళ్ళి, సర్వపాపాలను దూరంచేసే స్వామిని ఆశ్రయించమని ప్రబోధిస్తాడు. ఆ వేంగడంలో కమలోద్భవుడైన చతుర్ముఖ బ్రహ్మ, త్రిలోచనుడైన శివుడు స్వామి పాదాలను కమలపుష్పాలతో పూజిస్తున్నారని తెల్పుతాడు. 43 వ పాశురంలో "తన జటా పటలంపై చంద్రవంకను ధరించిన శివుడు, కమలాసనుడైన బ్రహ్మ, ఛత్రాలనుగై కొని, ఆకాశాన్ని తాకుతూ ఉన్న శిఖరాలతో శోభించే వేంగడం ఉత్తరదిశను చేరి, స్వామికి ఉదయం సాయంత్రం హారతి సేవను చేస్తున్నారు," అని వ్రాసినాడు. 44 వ పాశురంలో జనులను తరుణవయస్సులోనే వేంగడాన్ని దర్శించ వలసిందని ప్రబోధిస్తాడు. ఆ వేంగడంలో ఎన్నో ఉద్యానవనా లున్నాయి. అక్కడే నిత్యయౌవన విలసితుడైన స్వామి ఉన్నాడు. ఆయన శిశువుగా ఉండగా, రావణుడు ఆయనను తన ఒడిలో లాలిస్తుండగా, రావణుని పదితలలను తన కాలితో స్పృశించి అదృశ్యమైనాడని, ఆ స్వామి శరణాన్ని కోరమని వ్రాసినాడు. 45 వ పాశురంలో చల్లని సెలయేర్లున్న వేంగడాన్ని స్తుతించినాడు. దివ్య క్షేత్రాలలో నెలకొని, మానవులకు, దేవతలకు భాగధేయంగా పుష్పార్చనను పొందుతూ ఉన్న స్వామియే వేంగడంపై విరాజిల్లుతూ ఉన్నాడని వర్ణించినాడు. 46 వ పాశురంలో, "ఒక ఏనుగు దివ్యజ్ఞానం కలిగి, చంద్రుణ్ణిపట్టుకొని, స్వామికి ఒక దీపంగా సమర్పించాలని తన తొండాన్ని సాచగా, ఆటవికులు దాన్ని

చుట్టుముట్టి కదలకుండా చేసినారు. కురవలు ఏనుగులపై బాణాలను వర్షించి వాటిని చెదురగొట్టినారు. వేంగడాన్ని దర్శించినవారికి భూప్రదక్షిణం చేసిన దానికంటె ఎక్కువ పుణ్యఫలం కలుగుతుంది." అని వర్ణించినాడు. 47 వ పాశురంలో వేంగడంపై శరభాలు, సింహాలు, వానరాలు ఉంటాయని, కురవలు నివసిస్తారని, బంగారాన్ని, మణులను, ముత్యాలు అక్కడి అడవులలో లభిస్తాయని, జలపాతాల వేగానికి పుష్పవృక్షాలు కొట్టుకొనిపోతూ ఉంటాయని, ఆ వేంగడంపై ననే నీలమణి కాంతిగలస్వామి నెలకొని ఉన్నాడని వ్రాసినాడు. 48 వ పాశురంలో వేంగడం దేవతలకు ప్రియమైన స్థానమనీ, మానవులకున్న ఆధివ్యాధులనన్నింటినీ తొలగిస్తుందనీ, తన చక్రాన్ని ప్రయోగించి రాక్షసులను సంహరించి దేవతలను రక్షించే స్వామికీ వేంగడం నివాసస్థానమనీ స్తుతించినాడు. 90 వ పాశురంలో ధార్మికులైనవారు, స్వర్గాన్ని పాలించా లనుకునేవారు, వేంగడత్తాన్ పాదాలను (వేంకటేశ్వరుని పాదాలను) పుష్పాలతో సమర్చిస్తే, స్వామి చిత్తాన్ని ఎరిగినవారై, స్వామి భృత్యులకు భృత్యులుగా భక్తి సంపూర్ణులౌతారని, వారికి అమోఘమైన సుఖమూ శాంతి లభిస్తాయని వ్రాసినాడు.

'తిరుచ్చంద విరుత్తం' 60 వ పాశురంలో వేంగడంపై నున్న స్వామి తిరుక్కుడందైలో ఉన్న స్వామీ ఒక్కరే అని వ్రాసినాడు. వేంగడంపై ఎత్తుగా పెరిగిన వెదురుచెట్లు ఉంటాయని వాటిపై మంచుగడ్డలు పడుతాయని, మంచు పేరుకొని ఉంటుందనీ వర్ణించినాడు. 81 వ పాశురంలో వేంగడం పై నున్న స్వామిని అర్చించమని భక్తులను ప్రబోధిస్తూ, వేంగడంపై నున్న స్వామియే క్షీరసాగరంపై యోగనిద్రలో ఉంటాడని, ఆయనయే తారకాసుర సంహారకాలంలో సంహరింప బడినవాడూన్నూ, రావణాసురునికి మాయ మైనవాడూన్నూ అయిన కాలనేమిని పరిమార్చినవాడనీ, ఆ స్వామియే సుగ్రీవునికి వాలివలన కలిగిన ప్రమాదాన్ని దూరం చేయడానికి శ్రీరాముడుగా అవతరించి సప్తసాల భంజనం చేసినాడనీ వర్ణించినాడు. ఈ పాశురంలో రాముడు, విష్ణువు, వేంకటేశ్వరుడు ఒక్కరేయని ఆళ్వార్ తెల్పినారు. కీ.శే. డా॥ S.K.అయ్యంగార్ History of Tirupati Vol.I PP.108-109 లో తిరుమళిశై ఆళ్వార్‌ను గూర్చి ఇట్లావ్రాసినారు, "మొదటి ముగ్గురు ఆళ్వారులవలెనే ఈయన కూడా విష్ణుపూజా పరాయణుడే, విష్ణువే మోక్ష ప్రదాతయని నమ్మినవాడే. కాని ఆ ముగ్గురికంటె ఈయన భక్తి మరీ గాఢమైంది. మొదటి ఆళ్వార్లు బ్రహ్మ, ఇంద్రుడు, శివుడు మొదలైన దేవతలను, వారి అర్చనను సంభావించినారు. కాని ఈయన ఆ విధానానికి భిన్నంగా నాన్ముగన్ తిరువందాది 66 వ పాశురంలో స్పష్టంగా, "సర్పంపై శయనించిన దేవునికే నా హృదయం అంకితమై ఆలయమైంది. ఆ దేవుని నేను చంద్రశేఖరుడైన శివునితో బ్రహ్మతో సమానంగా పోల్చను. వారిని నేను అర్చించను, వారికి ప్రదక్షిణం చేయను," అని తెల్పినాడు. విష్ణువే పరమదైవతమని, తదితరులు కారని, ఇక్కడ స్పష్టంగా తన విశ్వాసాన్ని తెల్పినట్లైంది.

డా॥ S.K.అయ్యంగార్ 'తిరుచ్చంద విరుత్తం' లోని 90 వ పాశురంలో తిరుమళిశై ఆళ్వార్ స్వవిషయాన్ని తెల్పిన విషయాన్ని ప్రస్తావించినాడు. ఆళ్వార్ ఇట్లా వ్రాసినాడు, "నేను కులీనుణ్ణికాదు. వేదవిద్యను నేర్చినవాణ్ణి కాదు. పంచేంద్రియాలను వశం చేసుకున్నవాణ్ణి కాదు. ఇంకా విషయ వ్యామోహబంధనాల్లో చిక్కుకొని

ఉన్నాను. అట్లైనా, నీ పవిత్రపాదాలను ఆశ్రయించినాను." అని భగవంతుని నామోచ్చారణం, నిర్మలమైన భక్తి గాఢమైన శ్రద్ధ, భగవంతునిపై అనన్యమైన విశ్వాసము – ఇవి ఉంటేచాలు, అదియే భగవత్కృపకు, ముక్తికీ మార్గమని ఆళ్వార్ తన జీవితాన్నే ఉదాహరణంగా తెల్పినట్లున్నది. ఇది ఆళ్వార్ భక్తిమార్గం.

**మొదటి ఆళ్వార్లు తెల్పిన వృత్తాంతం*5 :**

ఈ మొదటి ఆళ్వార్లు క్రీ.శ. మూడవ శతాబ్దంవారుగా భావిస్తారు. వీరు వేంగడంను వర్ణించిన ప్రకారం, కొండపై దట్టమైన అడవులు ఉండేవని వెదురుపొదలు, సెలయేర్లు పవిత్ర జలాశయాలు ఉండేవని, నిరంతరంగా వర్షాలు కురిసేవని, వానరాలు, వరాహాలు, పెద్ద ఏనుగులు, పులులు, సింహాలు, శరభాలు, సర్పాలు, కొండచిలువలు, ఉండేవని కురవలు నివాసముండేవారని, తపస్వులు తపస్సు చేసేవారని, దేవతలు వేంగడత్తాన్‌ను సేవించేవారని, అన్ని దిశలనుండి విద్వాంసులు పరిమళద్రవ్యాలను, దీపాలను, పుష్పాలను, జలాన్ని ప్రతిదినం దేవార్చనకై కొని తెచ్చేవారని, ద్వాదశినాడు స్త్రీలు పరిమళద్రవ్యాలను, పుష్పహారాలను ఎక్కువగా పూజకై సమర్పించేవారని, శ్రవణ నక్షత్రంనాడు ప్రత్యేకంగా అర్చన నిర్వహింపబడేదని, విలువైనరత్నాలు వెదజల్లబడేదని, వాటిని కురవలు ఏనుగులపై విసరుతూ భయపెట్టేవారని, ఆ రత్నాలు సెలయేర్ల ప్రవాహాలలో కొట్టుకుపోయేవని తెలుస్తుంది.

---

*5 వేంగడంపై దట్టమైన అడవులు ఉండేవని, అడవి జంతువులు మిక్కుటంగా ఉండేవని, పూజాద్రవ్యాలను తీసుకొని వివిధ ప్రాంతాలనుండి భక్తజనులు వచ్చి శ్రీ వేంకటేశ్వరస్వామిని పూజించేవారని (పొయిగై ఆళ్వార్ పాశురం నం.37) తెలుస్తూ ఉన్నందున, అప్పటికి కొండపై జనావాసం లేదని, కురవలే నివసించేవారని, పూర్వకాలంలో నిత్యపూజావిధానం ఏర్పడలేదని, భక్తులు తమ కిష్టమైన రీతిలో అర్చించేవారని, స్త్రీలు ప్రత్యేకంగా ద్వాదశినాడు, వైదికులైన అర్చకులతో నిమిత్తం లేకుండా, అర్చించేవారని, (పొయిగై ఆళ్వార్ పాశురం నం.82), అనుకోవడానికి వీలున్నది. ఎంతో కాలంగడిచిన తరువాత, దేవతార్చనలో నిపుణుడైన వైఖానసాచార్యుడు ప్రతిదినం తిరుపతి నుండి వచ్చి పూజించేవాడని, రంగదాసు ఆయనను వెంబడించినాడని 'వేంకటా'చల మాహాత్మ్యం **(శ్రీ వరాహపురాణం భా.II అధ్యా.9, శ్లో.22-24)** తెల్పుతున్నది. అప్పటికి శ్రీదేవీ సహితుడై స్వామి ఒక చెట్టుక్రింద ఉండేవాడని, దేవాలయం నిర్మింపబడలేదని తెలుస్తున్నది.

తిరుమళిశైఆళ్వార్ రచించిన నాన్ముగన్ తిరువందాది పాశురం నం.41 లో శ్రవణనక్షత్రం పుణ్యవాసరాన స్వామికి నిర్వహింపబడిన వైదికార్చనను గూర్చి ప్రస్తావించినా, శ్రవణ నక్షత్రంనాడు శ్రీ వేంకటేశ్వర స్వామికి విధిగా ఉత్సవం నిర్వహింపబడేదని భావించడానికి వీల్లేదు, అప్పటికి వేంగడంపై జనావాసమే లేనందున. సామవై రజతప్రతిమను సిద్ధంచేయించి ప్రతిష్ఠించి, రెండు ఉత్సవాలకు ఏర్పాట్లు చేసేవరకు, క్రీ.శ.614 వరకు ఉత్సవాలు నిర్వహింపబడేవని చెప్పడానికి వీలుకాదు.)

మొదటి ఆళ్వార్లు శ్రీ వేంకటేశ్వరస్వామియే శ్రీ రాముడని, శ్రీకృష్ణుడని, శ్రీ నరసింహుడని, శ్రీ వామనత్రివిక్రముడని, వైకుంఠంలో లేదాపరమపదంలో దేవతలచే పూజింపబడే శ్రీ మన్నారాయణుడనీ ప్రళయ కాలంలో క్షీరాబ్ధిపై శయనించే స్వామియని అందరినీ ఒకటిగానే భావించినారు. కాంచీపురి, ఘటికాచలం (శోలింగర్) కుంభకోణం, శ్రీరంగం, తిరుక్కోట్టియూర్, తిరుక్కోవలూర్, తిరునిర్మల క్షేత్రాలలో నున్న స్వామి, వేంగడంపై నున్న స్వామి ఒకరేయని భావించినారు. శ్రీ వేంగడంపై నిలబడి ఉన్నస్వామి, కాంచీలోని విణ్ణగర్‌లో కూర్చున్నాడని,

**నమ్మాళ్వార్*6 :**

తామ్రపర్ణీనదీ తీరంలోని తిరుక్కురుకూర్‌లో నమ్మాళ్వార్ జన్మించినారు. పన్నిద్దరు ఆళ్వారులలో ప్రముఖుడుగా కీర్తింపబడే నమ్మాళ్వార్, అందరికంటె విద్వాంసుడుగా, మహాకవిగా గుర్తింపబడినాడు. ఆయన తిరువిరుత్తమ్‌ను రచించినారు. దీనిలో నూరుపాశురాలున్నాయి. ఇది ఋగ్వేదాన్ని వివరిస్తుందని

---

కాంచీలోని తిరువెహ్కాలో శయనించి ఉన్నాడని, తిరుక్కోవలూర్‌లో నడుస్తూ ఉన్నాడని భావించినారు. ఆళ్వార్లు గొప్ప విష్ణుభక్తులు. 108 దివ్యక్షేత్రాలలోనున్న స్వామి, వేంగడత్తాన్ ఒకరేయని భావించినారు. పొయిగై ఆళ్వార్, పేయాళ్వార్ శివవిష్ణు లక్షణాలను శ్రీ వేంకటేశ్వరుని యందు ఉన్నట్లు భావించి వర్ణించినారు. తరువాతి కాలాన తిరుమంగై ఆళ్వార్‌వీరిని అనుసరించినా మొదటి ఆళ్వార్లు దేవాదిదేవుని తులసీమాలా విభూషితునిగా వనమాలిగా నీలమణి వర్ణంకలవానిగా, సముద్రంవలె, మేఘంవలె నీలవర్ణాకృతి కలవానిగా వర్ణించినారు. ఆయనను దేవతలు సమర్చిస్తారని, పరమపదంలో, భూమండలం పై వేంగడంలో కిరీటాన్ని ధరించి ఉంటాడని, ఆయన కన్నులు పద్మదళాలలాగా, ఆయన పాదాలు పుష్పాలలాగా ఉంటాయని కీర్తించినారు. ఆయనయే తమ మనస్సులో నెలకొని ఉన్నాడని చెప్పినారు. అది వారి స్వానుభవం. కుమరన్‌గా ఇళన్‌కుమరన్, ఇళన్ కుమరర్‌కోమన్ (నిత్యయువకునిగా, యువరాజుగా వర్ణించినారు. జన్మజరామరణ దుఃఖాదులులేని దేవతలకు అధినాథునిగా వర్ణించినారు.

పేయాళ్వార్ పాశురం నం.45లో ఒక్కచోట మాత్రమే భూమినుద్ధరించి వేంగడంపై నివాసమైన శ్రీ వరాహస్వామి ప్రసక్తి కన్పిస్తుంది. ఆయన 'వేంగడం' అను దానికి పర్యాయపదంగా 'తిరుమలై' ని ప్రయోగించినాడు (పాశురం.నం.75) పాశురం నం.40లో ఆయన దేవుని 'ఉత్తమన్' (పురుషోత్తముడు) అని కీర్తించినాడు.

విష్ణుచిహ్నాలైన శంఖము, చక్రము శ్రీ వేంకటేశ్వరస్వామి ధరించి లేకున్నా, (సామవై రికార్డ్ ద్వారా మనకు తెలిసిందే) మొదటి ఆళ్వార్లు ఆయనను విష్ణువుగా శ్రీకృష్ణ శ్రీరామ నరసింహులకు అభేదంగావర్ణించినారు. పై ఆళ్వార్ మాత్రమే పాశురం 63 లో శ్రీ వేంకటేశ్వరస్వామి చక్రాన్ని ధరించి ఉన్నట్లు వర్ణించినాడు. ఆయన శివుని ఆయుధమైన పరశువు ఉన్నట్లు వర్ణించలేదు. వివిధ అవతారాలను ధరించిన విష్ణువు నివాసంగా వేంగడంను వర్ణించిన పొయిగై ఆళ్వార్, వేంగడం భక్తజనుల పాపాలను నశింపచేస్తుందనీ, దేవతలకు ఆత్మోద్ధరణం కలిగిస్తుందనీ, ఆశ్రితులకు స్వర్గాన్ని ప్రసాదిస్తుందనీ పాశురం నం.26 లో వర్ణించినాడు.

ఇదే విధంగా తిరుమళిశై ఆళ్వార్ పాశురం.42 (నాన్ముగన్ తిరువందాది) లో వేంగడం స్వాభావికంగానే సమస్తపాపాలను నాశనం చేస్తుందని, భక్తజనులను వేంగడానికి సాష్టాంగ పడవలసిందిగా ప్రబోధిస్తాడు. తరుణ వయస్కులు వేంగడానికి వెళ్ళి పూజ చేయవలెనని పాశురం 44 లో ఉపదేశిస్తాడు. పాశురం నం.45లో సురలకూ నరులకూ వేంగడం ఒక దివ్య నిధియనీ, శ్రీ వేంగడంను సేవిస్తే భూప్రదక్షిణ ఫలితం లభిస్తుందనీ, భూమిపై నృత్యం చేసినట్లేనని, శ్రీ వేంగడాన్ని చక్రాన్ని ధరించిన స్వామి తన నివాసంగా చేసుకొని, రాక్షస సంహారం చేసి దేవతలను రక్షించినాడని, వేంగడం దేవతలకు ప్రియమైన స్థానమనీ, అది సమస్త పాపాలను రోగాలను హరిస్తుందనీ పాశురం నం.48 లో వర్ణించినాడు.

*6 **(నమ్మాళ్వార్ ఈ పాశురంలో శివునకంటె బ్రహ్మను గొప్పగా భావించినాడు. శివుని బ్రహ్మకు కుమారుడుగా భావించినాడు. ఇది వైష్ణవ సంప్రదాయాను సారమైన భావము.)**

పాశురం నం.9 లో శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తులకు దర్శనమీయ సంకల్పించి వచ్చినాడని, వారినుండి వెనుకకు మళ్ళినాడని, ఆయన కన్నులు ఎఱ్ఱకలువలలాగా, ఆయన అధరం బింబఫలంలాగా ఉన్నదని, ఆయన చతుర్భుజుడని, అమృతస్వరూపుడని, ఆయన ధరించిన చింతామణి కాంతివలన రాత్రులు పగళ్ళలాగా ఉన్నాయని, ఆయన పాదాలను చూడకుండా తాను ఒకక్షణం కూడా ఉండలేనని వ్రాసినాడు.

భావిస్తారు. ఆయన రచించిన తిరువాశిరియంలో 7 పాశురాలే ఉన్నాయి. కాని, ఇది యజుర్వేదాన్ని వివరిస్తుందని విశ్వసిస్తారు. నమ్మాళ్వార్ వ్రాసిన 87 పాశురాల పెరియతిరువందాది అధర్వణ వేదాన్ని, ఆయన తిరువాయ్‌మొళి (1102 పాశురాలలో) సామవేదాన్ని వివరిస్తుందని భావిస్తారు. తిరువాయిమొళిలో 35 పాశురాలు తిరువేంగడంపై నున్న శ్రీ వేంకటేశ్వరుణ్ణి గురించి గానం చేస్తాయి.

"నమ్మాళ్వార్ తిరుపతికి చాలా దూరప్రాంతంలో నివసించినారు. తిరుపతి మహత్త్యాన్ని గూర్చి విన్నవాడేకాని, ఆయన తిరుపతిని దర్శించలేదు. అందుకే ఆయన చేసిన తిరుపతి వర్ణనం, తిరుపతి దర్శించిన మొదటి ఆళ్వార్లు చేసిన వర్ణనం కంటె భిన్నంగా ఉంటుంది. నమ్మాళ్వార్ ఇతరక్షేత్రాల మహత్త్యాన్ని విని వ్రాసినట్లే, తిరుపతి గురించి కూడా వ్రాసినాడు." (డా॥S.K.అయ్యంగార్ History of Tirupati Vol.I Page.140)

తిరువాయిమొళి మూడవభాగంలో 3వ దశకంలో ఉన్న 10 పాశురాలలో నమ్మాళ్వార్ తిరువేంగడత్తాన్. వేంగడంపై నెలకొన్న శ్రీ వేంకటేశ్వరస్వామిని గూర్చి వర్ణించినాడు, తిరువేంగడనాథుని సేవించి పూజించమని జనులను ప్రబోధిస్తాడు. తిరువేంగడం (శ్రీవేంకటాచలం) భక్తులకు స్వయంగా ఆనందాన్ని ప్రసాదించగలదని నొక్కివక్కాణిస్తాడు. 8, 9 పాశురాలలో ఆయన శ్రీకృష్ణునిగా వర్ణిస్తూ, ఆయనకు సేవించినవారికి జరావ్యాధి మరణభయం ఉండదనీ, ఆయన పాదారవిందాలను ఆశ్రయించిన వారికి శాశ్వతత్వం లభిస్తుందనీ

---

పాశురం 10 లో శ్రీ వేంకటేశ్వరుడు నిత్యానపాయినియై పద్మముల వంటి కన్నులున్న లక్ష్మీదేవిని తన వక్షః స్థలంలో ధరించినాడని ఆయన త్రిలోకప్రభువని, ఆయన తన రక్షకుడని, తిరువేంగడంలో నివాసమైన ఆయనను దర్శించడానికి దేవతలు, మునులు అన్వేషిస్తూ వస్తారని, తాను ఆయన పాదాలను ఆశ్రయించి ఉన్నానని వ్రాసినాడు.

పాశురం 11 లో తిరువేంగడం వైభవాన్ని వర్ణిస్తున్న, పై పది పాశురాలను పాడినవారికి స్వర్గం లభిస్తుందని తెల్పినాడు.

తిరువిరుత్త ప్రబంధంలోని 8 పాశురాలలో, తీవ్రమైన భక్తిభావంతో తనను విరహతప్తురాలైన నాయికగా భావించుకొని తన బాధను, మూర్ఛా వస్థాదులను తెలిసి శ్రీ వేంకటేశ్వరునికి తన బాధను తెల్పవలసిందిగా మేఘాలను ప్రార్థిస్తాడు. 50 వ పాశురంలో తనను చూడడానికి తన ప్రియుడైన శ్రీ వేంకటేశ్వరుడు కుతూలహంతో ఉన్నాడని, ఆయన రథాన్ని త్వరగా నడుపుకుంటూ వేంకటాద్రిపై తానున్న స్థానానికీ, తన ముఖకాంతి తరుగక ముందే ఆయనను తీసుకురావలసిందిగా ఆయన రథచోదకుణ్ణి ప్రబోధిస్తాడు. పాశురం నం.81 లో భక్తి పారవశ్యం చెందిన ఒక స్త్రీ విరహావస్థనువర్ణిస్తాడు. ఆమె శ్రీ వేంకటేశ్వరుణ్ణి వలచి విరహార్తురాలై ఉన్నది. ఈ విషయం తెలియక ఆమె తల్లి ఏవేవో ఉపచారాలు చేస్తూ ఆమె ప్రాణానికి అపాయం కల్గిస్తున్నది. తన కూదురు కేశపాశంలో తులసిని అలంకరించి శ్రీ వేంగడానికి ఆమెను తీసుకొనివస్తే ఆమెకు ఈ దురవస్థతొలగుతుంది అని వ్రాస్తాడు.

పెరియతిరువందాది పాశురం.68 లో నీలమేఘశ్యాముడైనస్వామి తన హృదయంలో ప్రవేశించి, దానిని వీడడానికి ఇష్టపడడం లేదని, వేంగడాన్ని, వైకుంఠాన్ని, పరమపదాన్ని వదిలి తన హృదయాన్ని ఆవాసం చేసికోవడం తనకు జాలి కలిగిస్తున్నదని వ్రాసినాడు.

(ఈ పాశురంలో ఆళ్వార్ వైకుంఠాన్ని, పరమపదాన్ని వేర్వేరుగా చెప్పినాడు. ఈ రెండూ సాధారణంగా విష్ణులోకాన్నే సూచిస్తాయి.)

తెల్పుతాడు. శ్రీ వేంకటేశుడు నివాసమైన వేంగడాన్ని, జరాభారం రాకపూర్వమే, తారుణ్యంలోనే జీవిత చరమావస్థకు పూర్వమే దర్శించమని హితోపదేశం చేస్తాడు. 11 వ పాశురంలో, మొదటి 10 పాశురాల; పఠించినవారు సుఖంగా జీవిస్తారని తెల్పుతాడు.

తిరువాయిమొళి 10 వ భాగంలో 6 వ దశకంలో భాగమైన రెండవ పది పాశురాలలో, తిరువేంగడనాథుని పాదాలను సమాశ్రయించే మార్గాన్ని చూపించుమని ప్రార్థిస్తాడు. ఆయన వైకుంఠ వాసియనీ, ప్రళయకాలంలో ప్రపంచాన్ని కబళించినవాడనీ, దేవతా ప్రభువనీ, అసురులను సంహరించిన వాడని, శార్ఙ్గాన్ని ధరించినవాడనీ, మేఘంవలె నల్లనైన కాంతికలవాడనీ, బింబాధరుడనీ, లక్ష్మీనాథుడనీ, గరుడధ్వజుడనీ, తన మనస్సులో నివసించిన మహాప్రభువని వర్ణిస్తాడు. సప్తసాలద్రుమాలను పెళ్ళగించిన శ్రీరాముడనీ, యమళార్జున భంజనం చేసిన కృష్ణుడనీ కీర్తిస్తాడు. 6 వ పాశురంలో భూమిని కొలిచిన వామనునిగా స్తుతిస్తాడు. 5 వ పాశురంలో ఏనుగులు కొండపై నల్లని మేఘాలవలె తిరుగాడుతాయని, 6 వ పాశురంలో దేవతలు వేంకటాచలంపై స్వామిని మనోవాక్కాయాలతో సేవిస్తారనీ వ్రాస్తాడు. పాశురం నం.7 లో తాను మనసా అనుభవించే అమృత స్వరూపుడని, ఆయన పాదాలను చూడకుండా క్షణంకూడా ఉండలేనని తెల్పుతాడు.

పాశురం నం.8 లో విషాన్ని కంఠంలో నిల్పిన నీలకంఠుడైన శివుడు, బ్రహ్మ ఇంద్రుడు మీనాక్షులైన తమభార్యలతో కలిసి వచ్చి శ్రీ వేంకటేశ్వరుని పాదాలను దర్శించడానికి కోరికతో వచ్చి ఉన్నారని, తనకు అర్హత లేకపోయినా, స్వామి దర్శనానికై తాను ఉన్మత్తుడై పోయినందున, తన భావనలో స్వామి తనకు దర్శన మీయవచ్చినట్లే కన్పిస్తున్నందున, ఆయనకు స్వాగతం పలుకుతూ ఉన్నాడు.

తిరువాయ్‌మొళిలో 13 పాశురాలలో వేంగడంపైనున్న స్వామిని నమ్మాళ్వార్ కీర్తించినాడు. తిరువాయ్‌మొళి 8 వ దశకంలో 3 వ పాశురంలో, శ్రీ వేంగడంపైనున్న స్వామియే భూమిపై నున్న జనులను, స్వర్గవాసులనూ కంటికి రెప్పలా కాపాడుతాడని వ్రాసినాడు.

తిరువాయ్‌మొళి 6 లో రెండవదశకం 9 వ పాశురంలో శ్రీ వేంకటేశ్వర స్వామి నిట్లా సంబోధించినాడు. "ఓ వేంగడం పై నివాసమైన స్వామీ! లంకేశ్వరుణ్ణి సంహరించినవాడా! సప్తసాలవృక్షాల పెద్ద కాండాలను బాణంతో ఛేదించిన నిపుణ ధానుష్కుడా! వనమాలీ! దేవతా సార్వభౌమా! అమృత స్వరూపుడా! నా స్వామీ! నా ప్రియుడా! నా హృదయంలో నీ దేవేరిని వేంచేసి ఉండమని నీ వెటుపోగలవు?"

తిరువాయ్‌మొళి 6 రెండవదశకం 10 వ పాశురంలో శ్రీ వేంకటేశ్వర స్వామిని సంబోధిస్తూ, "త్రిజగన్నాథా! పరమా! మహాస్వామీ! శీతలంగా ఉన్న వేంగడంపై తులసీ మాలలను ధరించి, భూత భవిష్యద్వర్తమానాలలో తల్లిగా తండ్రిగా రక్షించి కాపాడువాడా! నిన్ను నేను పొందినాను. వదులుతానా? ఎప్పటికీ వదులను." అని వ్రాసినాడు.

తిరువాయ్‌మొళి 7 రెండవ దశకంలో 11 వ పాశురంలో, "పద్మనాభుడు, సర్వోత్తముడు, తేజస్వి తనను తనవాడుగా చేసుకొని తనకు భోగ్యంగా చేసుకొని నట్టి ఆ స్వామి కల్పవృక్షమని, అమృతమని, వేంగడంపై నివాసమైనవాడని, దేవతారక్షకుడని, స్వయంనియంతయనీ, దామోదరుడనీ, సర్వజన ప్రియుడనీ వర్ణించినాడు. తిరువాయ్‌మొళి 5,3 వ దశకంలో 8 వ పాశురంలో "ఉత్తరాననున్నవారు తిరువేంగడంపై నున్న స్వామి నామాలను నిరంతరం ఉచ్చరిస్తూ ఉంటే, వారిని కొందరు పరిహసించి, పిచ్చివాళ్ళుగా భావించినా సరే, అట్లే నిరంతరం ఆ నామాలను గానంచేస్తున్న ఆనందంతో నృత్యం చేసేవారిని దేవతలు పొగుడుతారు." అని చెప్పినాడు.

తిరువాయ్‌మొళి 9, 3వ దశకంలోనున్న పాశురం 1 లో, తిరువేంగడం స్వామి చుట్టూ తుమ్మెదల ఝుంకారం ఉన్నదని, ఆయన గజంలాంటివాడని, తన తండ్రివంటివాడని, తన గీతాలకు ఆయనయే పరమార్థమనీ, తన జిహ్వాగ్రాన ఉన్న కవితను మరొకనికి అర్పించలేనని వ్రాసినాడు.

తిరువాయ్‌మొళి 5, 4 వ దశకంలోని 11 వ పాశురంలో, మారన్ అను పేరు కలిగిన, కారితనయుడు శఠకోపుడు కురుకాపురివాసి రచించిన 1000 పాశురాలున్న తిరువాయ్‌మొళిలో వేంగడంపై నున్న స్వామిపై రచించిన 10 పాశురాలను పఠించేవారి పాపాలను, పద్మనివాసినియైన లక్ష్మీదేవి, నశింప చేస్తుంది, అని వ్రాసినాడు. తిరువాయ్‌మొళి 6, ఆరవదశకం లోని 11 వ పాశురంలో వేంగడంపైనున్న స్వామికి చెందిన పది పాశురాలను గానం చేసినవారు దేవతలవలె సుఖాలను అనుభవిస్తారు అని తెల్పినాడు.

తిరువాయ్‌మొళి 9 వ దశకంలోని 5 వ పాశురంలో సర్పంపై శయనించిన, వేంగడంపై వాసమైన, సముద్రంపై శయనించిన, భూమిపై నడిచి, అన్నివస్తువుల యందూ నెలకొని ఉన్న, ఊర్ధ్వలోకాలలో ఉన్న స్వామిని సంబోధించి, తనయందు చాలాకాలంగా నివసించిన స్వామి, తనకు కన్పించకుండా ఇంకా ఉండగలడా? అని ప్రశ్నిస్తాడు.

తిరువాయ్‌మొళి 2, 8 వ దశకంలోని మొదటిపాశురంలో, నమ్మాళ్వార్ తనను శ్రీ వేంకటేశ్వరుని ప్రియురాలుగా భావించుకొని, తన చెలికత్తెల ప్రశ్నలకు సమాధాన మిస్తున్నట్లుగా, "ఓ చెలులారా! మీకు నేను ఒక్కమాటలో సమాధానం చెప్పలేను. రక్తాక్షుడైన గరుడుడు వాహనంగా ఉన్నవేంగడం ప్రభువును నేను కోరినాను, పొందినాను. అయినా నా కంకణాలు, చిక్కిన నా బాహువుల నుండి జారిపోయినాయి. నా శరీరకాంతి కోల్పోయింది. నా స్తవపటుత్వం తగ్గింది. నాకేమీ తోచడంలేదు." అని వర్ణించినాడు.

తిరువాయ్‌మొళి 3, 9 వ దశకంలో 8 వ పాశురంలో జనులను ఇట్లా సంబోధించినాడు, "ఓ జనులారా! భూమిపై వేంగడం ఉన్నది. దానిపై శ్రీ వేంకటేశ్వరస్వామి నెలకొని ఉన్నాడు. ఆయన జనుల సుకృత దుష్కృతాలను హరిస్తాడు ఆయనను దేవతలు అర్చిస్తారు. అర్చించినవారు ఆయన కృపతో జననమరణాలులేని దేవతలౌతారు.

తిరువాయ్‌మొళి 5, 10 వ దశకం 6 వ పాశురంలో నీలవర్ణుడైన మాధవుడు, లక్ష్మీపతి, పూతనాస్తన్యాన్ని పానం చేసినవాడు వేంగడంపై వాసమై ఉన్నాడు, అని వ్రాసినాడు.

తిరువాయ్‌మొళి 7, 10 వ దశకం 8 వ పాశురంలో, "అద్వితీయుడై అన్నింటికీ ఆదికారణమైన స్వామి, తిరుమాలిరున్‌శోలైలో, పాల్కడలిలో, తన శిరస్సుపై, లక్ష్మీపతి నివాసమైన వైకుంఠంలో చల్లని తిరువేంగడంపై తన శరీరంలో, ప్రకృతిగా, అనిర్వేద్యమైన మాయగా తన జీవితంగా, ఆత్మగా, మనోవాక్కర్మలుగా ఉన్నాడని వక్కాణిస్తూ, వాటిని ఒక్కక్షణంకూడా వీడడు" అని వ్రాసినాడు.

**పెరియాళ్వార్ :**

మధుర రాజధానియైన పాండ్యదేశంలోని శ్రీవిల్లుపుత్తూరు పెరియాళ్వార్ల జన్మస్థానం. గోదాదేవి అను పేరుగల ఆండాళ్ ఆయనకు పెంపుడు కూతురు. ఆమెకు చూడికొడుత్తనాచ్చియార్ అనే పేరు కూడా ఉన్నది. ఆమె ధరించి తీసిన పుష్పహారాలతో స్వామి నలంకరించి నందున ఆమెకు ఆ పేరు కలిగింది. పెరియాళ్వార్ తనను శ్రీకృష్ణుని తల్లియైన యశోదగా భావించే వాడు. శ్రీకృష్ణుడు, శ్రీ వేంకటేశ్వరస్వామి ఒకరేయని భావించి ఏడు పాశురాలలో స్వామిని సంబోధించినాడు. ఆయన 'తిరుప్పల్లాండు', 'తిరుమొళి'ని రచించినాడు.

ఆ కావ్యాలలో ఆయన వామనావతారానికి చెందిన పురాణకథలను ప్రస్తావించినాడు. వామనావతారంలో స్వామి తన శరీరాన్ని పెంచి భూమిని కొలిచినాడు. రావణాసురుణ్ణి (రామావతారంలో) చంపి విభీషణునికి లంకారాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. ఈ రెండు కార్యాలను వ్యతిరేకించిన, బలికుమారుడైన నముచి స్వామితో యుద్ధానికి తలపడితే అతణ్ణి దూరంగా విసిరివేసినాడు.

తిరుమొళి 5, మొదటి దశకంలోని 3 వ పాశురంలో తనను యశోదగా భావించుకొని చంద్రుణ్ణి సంబోధిస్తూ ఇలా వ్రాశాడు, "నీ కాంతి గొప్పదైనా, చుట్టూ దూరదూరంగా వ్యాపించినా, నా శిశువైన శ్రీకృష్ణుని ముఖంతో తులదూగలేవు. ఆ కృష్ణుడే వేంగడంపై ఉన్నాడు. నిన్ను చేయెత్తి పిలుస్తున్నాడు. ఆయన చేయి నొప్పినందకముందే నీవు ఆయన వద్దకు త్వరగా వెళ్ళు" అని.

తిరుమొళి 6, రెండవదశకం పాశురం 9 లో యశోదగా తనను భావించుకొని పెరియాళ్వార్ ఒక కాకిని కట్టెను తీసుకురమ్మంటాడు, దానితో కృష్ణుడు ఆలమందను కాస్తాడని.

తిరుమొళి 7, రెండవదశకంలో 3 వ పాశురం, తిరుమొళి 9, రెండవదశకం 6 వ పాశురంలో యశోద, అల్లరి చేస్తున్న కృష్ణుణ్ణి మందలిస్తుంది. గోపికల ఇళ్ళకు వెళ్ళి, వాళ్ళ ఇళ్ళపై నుండి ప్రవేశించి, వాళ్ళ వస్త్రాలను చింపి వేస్తున్న వాణ్ణి పిలుస్తూ ఇలా అంటుంది. "తిరువేంగడంలో నివాసమైనవాడా! నావద్దకురా. నీ కేశపాశాన్ని సవరించి మరువకం కాడలతో సువాసితమైన పువ్వులతో అలంకరిస్తాను" అని. "ఓ బాలకృష్ణా! గోరక్షార్థం గోవర్ధన పర్వతాన్ని గొడుగులాగా ఎత్తినవాడా! గోపికలతో పాటు, నెత్తిన

నీటికడవ పెట్టుకొని నాట్యం చేసినవాడా! వేదతత్త్వమైనవాడా! సుందరుడా! త్వరగా ఇటురా! ప్రక్కింటికి వెళ్ళకు. నీవు చేసే అల్లరితో వాళ్ళు విసిగి చెప్పే మాటలను విమర్శలను నేను భరించలేను." తిరుమొళి 3, 3 వ దశకంలోనున్న నాల్గవ పాశురంలో ఇట్లా వ్రాసినాడు, "తిరువేంగడంపైనున్నవాడా! మదించిన నల్లవృషభంలాగా తిరిగేవాడా! నీకై గొడుగునూ, పాదరక్షలను, పిల్లనగ్రోవినీ తెచ్చాను. వాటిని ఉపయోగించ కుండ నీవు ఆలమందవెంట అడవికి వెళ్ళావు. నా కన్నతండ్రీ! నీ సున్నితమైన పాదాలకు, తామరపూవులవంటి పాదాలకు ముళ్ళు గ్రుచ్చుకొని, బాధకలిగి స్తుంటే, నీవు అలసిపోతే, నీ కళ్ళు చిరచిరలాడితే నాకు బాధకలుగుతుంది." అని.

తిరుమొళి 4, 5 వ దశకం మొదటి పాశురంలో ఉన్నత శృంగాలతో మనోహరమైన తిరువేంగడాన్ని నివాసంగా చేసుకున్న దామోదరుణ్ణి సంబోధిస్తూ, "నేను నా శరీరాన్ని సుదర్శనలాంఛితంచేసి, నీ దయకై వేచి ఉన్నాను. ఇక నేను దేనికీ వ్యథపడవలసిన అవసరంలేదు." అని. (దామోదరుడు అంటే త్రాటితో రోటికి కట్టి వేయబడిన వాడు అని అర్థం.)

**శ్రీ ఆండాళ్ :**

తులసీవనంలో పెరియాళ్వార్‌కు లభించిన శిశువు. తమకు సంతానం లేనందున పెరియాళ్వార్ దంపతులు ఆమెను అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసినారు. ఆమెకు గోదాదేవి, చూడికొడుత్త నాచ్చియార్ అనే పేర్లూ ఉన్నాయి. బాలికగా, యువతిగా ఆమె విల్లిపుత్తూర్‌దేవునిపై అత్యంతమైన భక్తి కలిగి ఉండేది ఆమె 'తిరుప్పావై' 'నాచ్చియార్ తిరుమొళి' అనే గ్రంథాలను రచించింది.

ఆమె యౌవనవతిగా పెరుగుతూ ఉన్న తరుణంలో స్వామిపై ఆమె భక్తి కూడా గాఢమైంది.

తిరుమొళి 8 లో తన విరహావస్థను వర్ణిస్తుంది. కన్నీటితో తన స్తనద్వయం తడిసిపోతూ ఉండగా, మన్మథుని బాణాలతో కలిగిన బాధను భరింపలేక, రాత్రులందు దక్షిణానిలంతో ఆ బాధతీవ్రతరంకాగా, శరీరకాంతి తరిగిపోగా, కంకణాలు వదులైపోగా, నిద్ర, స్మృతి, ధైర్యము శక్తి తరిగిపోగా, గోవిందనామ సంకీర్తనంతో ప్రయోజనం కలుగనందున, శ్రీ వేంగడంపై నున్న స్వామికి తన బాధను తెల్పవలసిందిగా, కొండపై వ్రేలాడుతూ కన్పించిన మబ్బులను తన వార్తాహరులుగా వెళ్ళమని సంబోధిస్తుంది. తిరువేంగడంపై ఉన్న స్వామికి, లక్ష్మీదేవిని తన వక్షఃస్థలంలో ధరించిన దేవునికి తన తీవ్రతాపాన్ని తెల్పమంటుంది. ఆయన ఆశ్లేషాన్ని కోరుతున్నట్లు తెల్పమంటుంది.

వామనావతారంలో మహాబలినుండి భూదానాన్ని గ్రహించినవానికి, వేంగడంపై నివాసమైనవానికి, తన అంతరాత్మను దొంగిలించినవానికి, వెలగపండులోనికి ప్రవేశించి సారాన్ని అంతాగ్రహించే మశకంలాగా, తన అంతరంగంలో ప్రవేశించిన వానికి, తన మనస్తాపాన్ని బాధను ఉన్మాదాన్ని తెలియచేయమంటుంది. పద్మపత్రాక్షుడైన ఆ స్వామి పాదపద్మాల సన్నిధిలో, సముద్రాన్ని మథించి ఎన్నో శంఖాలను వెలికి తెచ్చిన స్వామికి, తన కోరికను విన్నవించమంటుంది. తననొక్కసారి కూడమని ఆలింగనంచేసుకొని తన

స్తనాలపైనున్న కుంకుమను చెదరగొట్టమని, మన జీవితాన్ని కాపాడమని అర్థిస్తుంది. పాశురం 8 లో, వర్షాకాలంలో పండిన జిల్లేడు ఆకులురాలి నట్లుగా శత్రువులు నేలకొరగగా, యుద్ధంలో విజయం పొందిన శ్రీరాముణ్ణి స్మరించినా, ఉపశమింపని తన తనూతాపాన్ని వేంగడంపైనున్న స్వామికి తన జీవితం సమాప్తంకాక పూర్వమే ఒకసారి నివేదించమని ప్రార్థిస్తుంది.

9 వ పాశురంలో వేంగడంపై మదగజాల్లా వ్యాపించిన మబ్బులతో అందరికీ అన్ని వేళలా ఆశ్రయభూతుడైన శేషశాయి వచనం అసత్యమైందని, ఆయన అశ్రద్ధమూలంగా ఒక స్త్రీ ప్రాణంపోతే లోకం దాన్ని పట్టించుకోదేమో అని అంటుంది.

శ్రీవిల్లిపుత్తూరు నివాసులందరికీ పెద్దవాడైన పెరియాళ్వార్ కూతురు, గోదాదేవి, వేంగడంపైనున్న శేషశాయికి విన్నపంగా మేఘాలతో పంపిన సందేశం వస్తువుగా, విరచించిన తమిళపాశురాలను పఠించినవారు పరమ భక్తులౌతారని తిరుమొళి 8, 10 వ పాశురంలో, శ్రీ ఆండాళ్ వచించింది.

ధనుర్మాసంలో ముప్పది దినాలు నియమనిష్ఠలతో ఆరాధించినా శ్రీ వేంకటేశుని కృపలభించనందున నిరాశపడి, గోదాదేవి మన్మథుణ్ణి సంబోధిస్తుంది. తిరుమొళిపాశురం 1 లో ఇట్లా అంటుంది. "తై మాసంలో మన్మథుడు సంచరించే ప్రదేశాలను అలంకరించినాను. ఆయనకు, ఆయన సోదరునికి సాష్టాంగం చేస్తున్నాను. ఒకసారి వేంగడంపైనున్న స్వామిని, తీవ్ర కృపాణాన్ని చక్రాన్ని ధరించినవానిని సేవించే అవకాశాన్ని ఒక్కసారి కల్గించమని వేడుకుంటున్నాను." అని.

తిరుమొళి 1, పాశురం 3 లో, మన్మథుణ్ణి దత్తూర, పలాశ పుష్పాలతో సమర్చించి, తన మనస్సులో 'గోవింద' నామంబలంగా నిల్చిపోయే విధంగా, పుష్పధనుర్బాణాలతో పాదుకొల్పమని, వేంగడం ప్రభువుకాంతిలో తాను లీనమై పోవాలని, అట్లైతేనే ఆయన పలుకు అసత్యంకాదని, లేని పక్షాన తన నిందావాక్యాలతో ఆయన కీర్తి కళంకిత మౌతుందని తెలుపుతుంది.

తిరుమొళి 4, పాశురం 2 లో మన్మథుణ్ణి స్త్రీపుంస యోగకారుకుడుగా సంబోధించి, ఆటవీమయమైన వేంగడంపై సుఖంగా నివాసమైన వామనుణ్ణి, తిరుకణ్ణపురంలో కూడా నివాసమైనవానిని, తనను వెతుకుతూ వేగంగా పరుగెత్తి వచ్చి కౌగిలించుకునే విధంగా ప్రేమతో నింపమని అభ్యర్థిస్తుంది.

తిరుమొళి 5, పాశురం 2 లో చంపకపుష్పాల తేనెను త్రాగి మధురంగా గానంచేస్తున్న కోకిలను సంబోధించి, "వేంగడంపై నివాసమై, వామహస్తంలో శంఖాన్ని ధరించిన స్వామి, ఆమెకు కన్పడకుండానే ఆమె హృదయంలో ప్రవేశించి, ఆమెను బాధిస్తూ, ఆనందిస్తున్నాడని", అందుకు కోకిల తనకు సాహాయ్యం చేయడానికి, మధురంగా పాడుతూ వేంగడం ప్రభువును తన వద్దకు వచ్చేటట్లు చేయాలని ప్రార్థిస్తుంది.

తిరుమొళి 10, పాశురం 5 లో, కోకిలలను కర్ణకఠోరంగా పాడవద్దని ఉపదేశిస్తూ, మంగళకరమైన వేంగడంపై నివాసమైన స్వామి దయతో తన వద్దకు చేరినప్పుడు తన వెంట ఉండి గానంచేస్తూ నాట్యం

చేయమని కోకిలలను అభ్యర్థిస్తుంది. తాను స్వయంగా కోకిల బృందాన్ని పిలిచి వాని సంగీతాన్ని వింటానని, గరుడధ్వజుడు తనను చేరినప్పుడే అది సాధ్యమౌతుందని తెల్పుతుంది.

తిరుమొళి 10, పాశురం 8 లో "మైనం గూటిపై మట్టిని అద్ది, కుంపటిలో వేడిచేసి మైనాన్ని తొలగించినట్లే, సున్నితంగా, ఉదాత్తంగా, మేఘాలు, ప్రసన్నంగా ఉన్న వేంగడం పై సుఖంగా నివాసమైన అల్లుణ్ణి, ఆమె మనస్సులో ప్రత్యక్షమై, ఆమెను ప్రేమతో ముద్దుగా అలరించేవిధంగా చేస్తే, ఒక ధీరోదాత్తకృత్యాన్ని నిర్వహించినట్లే అని వ్రాసింది.

**కులశేఖర-ఆళ్వార్[*7] :**

కేరళరాష్ట్రానికి చెందిన తిరువంజిక్కాలం అనే చోట దృఢవ్రత మహారాజు తనయుడుగా కులశేఖరాళ్వార్ జన్మించినాడు. పెరుమాళ్ తిరుమొళి అనే తన ప్రబంధంలో 11 పాశురాలలో 'వేంగడం'ను స్తుతించినాడు కులశేఖరాళ్వార్ 'ముకుందమాల' ను కూడా రచించినాడు. పెరుమాళ్ తిరుమొళి పాశురం 1 లో వేంగడంపై స్వామిపుష్కరిణి కోనేరులో కొంగనై పుట్టినా తాను ధన్యుడైనట్లేనని, నీలాదేవిని వరించడానికి ఏడు వృషభాలను జయించిన స్వామిని సేవించు కోరిక గలదని, మరొక జన్మనెత్తి శరీర ధారణం చేయాలన్న కోరికలేదని, వేంగడంపై శంఖాన్ని ధరించి నిల్చిన స్వామిని సేవిస్తానని వ్రాసినాడు.

---

*7 (కులశేఖర ఆళ్వార్ 'శత్రువులను నిర్జించి, ద్వేషించినవాడు' అని వ్రాయడంలో ఆయన స్వభావం తెలుస్తున్నది. పైన ఉదాహరించిన పాశురాలలో తనకు ప్రాపంచిక భోగాలపై కోరికలేదని, స్వర్గ సుఖాలను కోరను అని వ్రాసినాడు, 'శత్రువులను ద్వేషించి, అవమానించడం' గొప్పగా భావిస్తే, ప్రాపంచిక సుఖాదులను ఆయన కోరినాడని అనుకోవలసివస్తుంది.)

'పెరుమాళ్ తిరుమొళి' యే కాక కులశేఖర ఆళ్వార్ సుప్రసిద్ధమైన 'ముకుందమాల'ను వ్రాసినాడు. ఇది 42 సంస్కృత శ్లోకాలలో ముకుందుని స్తవంగా ఉన్నది. ముకుందమాలలో శివబ్రహ్మాదులను తృణీకరిస్తూ వ్రాసినాడు. ఒక శ్లోకంలో "క్షుద్రాః రుద్రపితామహప్రభృతయః కీటాస్సమస్తా స్సురాః" అని వారిని కీటములతో పోల్చినాడు. ముకుందుని గొప్పగా పొగడటమే ధ్యేయంగ చేసినట్లున్నది. లౌకికమైన శత్రువులను నిందించుట కంటె శివబ్రహ్మాది దేవతలను నిందించడం, ఆయన ఔదార్యం లేమిని సూచిస్తున్నది. వైష్ణవ సంప్రదాయంలో దేవతలస్థానాలను నిర్దేశించినారు. శివబ్రహ్మాది దేవతలకు రెండవమూడవ తదితర స్థానాలనిచ్చినారు. కులశేఖర ఆళ్వార్ వారిని కీటకాలుగా తృణీకరించడం హేతుబద్ధంగాలేదు.

దేవుడు ఒక్కడే బ్రహ్మ విష్ణు శివుల ఏకరూపం. చేసే కార్యవిధానాన్ని బట్టివారికి బ్రహ్మ, విష్ణు, శివుడు అని వారు కరణంచేశారు. ముదల్ ఆళ్వార్లైన పొయ్‌గై ఆళ్వార్, పై ఆళ్వార్ వేంకటేశ్వరుణ్ణి శివ, విష్ణు, బ్రహ్మల ఏకీకృత రూపంగా వర్ణించినారు. ఇంతేకాక, విష్ణువులేదా ముకుందుడు జీవుల సృష్టి స్థితిలయాలను చేసే దేవుడు. అందుకే శివ(రుద్ర) బ్రహ్మలను అవమానిస్తే, సృష్టి, లయకార్యాలను నిర్వహించే విష్ణువును-ముకుందుణ్ణి- అవమానించి నట్లే ఔతుంది. పర్యవసానంగా కులశేఖర ఆళ్వార్ తన ఇష్టదైవమైన ముకుందుణ్ణి స్తుతించడానికి వ్రాసిన ముకుందమాలలో ముకుందనింద చేసినట్లైంది.

పాశురం 2 లో చిరకాల యౌవనాన్నికానీ, రంభాద్యప్సరసః సుఖాన్ని కానీ స్వర్గసుఖాలను కానీ, రాజవైభవాన్ని కానీ తాను కాంక్షింపనని, పుష్పవనాలతో నిండిన వేంగడంపై నున్న జలాశయాల్లో తానొకచేపనై జీవించినా చాలునని చెప్పినాడు.

పాశురం 3 లో వేంగడంపైనున్న స్వామి తాంబూల చర్వణంచేసి నిష్ఠీవనం చేసే స్వర్ణపాత్రను పట్టుకొని సేవచేసే అవకాశం లభిస్తే తనకు చాలునని, ఆ స్వామి జేగీయమైన చక్రాన్ని ధరించి ఉంటాడని, ఆయన పరిజనంతో పాటుగా ఆ స్వామి ముందు ఉండడమే చాలునని, జటాధారి యైన శివుడు, బ్రహ్మ ఇంద్రుడు, వైకుంఠద్వారం ముందు పడిగాపులుగా ఉన్నా సరే – అని వ్రాసినాడు.

పాశురం 4 లో, పగడాలు పరిఢవిల్లే పాల్కడిలో శయనించేస్వామి మాయావి వేంకటేశ్వరుని పాదాలను దర్శించే భాగ్యం కలిగితే చాలు, వేంగడంపై తుమ్మెదలు గుమిగూడే చంపక వృక్షంగానైనా జన్మించాలను కుంటాను అని వ్రాసినాడు.

పాశురం 5 లో, గజారోహణం చేసి రాజమర్యాదలతో ఊరేగాలన్న కోరికలేదని, రక్షకుడైన దేవదేవుడున్న సుందరమైన వేంగడంపై ఒక పొదగాపుట్టే అవకాశం లభిస్తే చాలునని వ్రాసినాడు.

పాశురం 6 లో, తను మధ్యలైన ఊర్వశి, మేనక మొదలైన అప్సరల నృత్యగీతాదులు అవసరంలేదని, వేంగడంపై, తుమ్మెదలు మధురంగా ఝంకారం చేస్తూ తిరుగాడే స్వర్ణమయ శృంగంగా, జన్మనెత్తడానికి తీవ్రమైన తపస్సును చేస్తాను, అని వ్రాసినాడు.

---

సర్వశక్తిమంతుడైన భగవంతుడు సృష్టి స్థితిలయ కారకుడని అందరికీ తెలిసిందే. జగత్తునంతా, జగత్తునందున్న సర్వ విషయాలను నియంత్రించేదీ భగవంతుడే. **శ్వేతాశ్వతర ఉపనిషత్తులో "క్షరం ప్రధానం, అమృతాక్షరం హరః క్షరాత్మనా వీశతే దేవ ఏకః"** అనువాక్యం ఉన్నది. భగవంతుని లక్షణాలను తెల్పుతూ **ప్రధానం లేదా ప్రకృతి. అది క్షరం అంటే నశించేది. హరం అంటే ప్రళయకాలంలో తనయందు లీనం చేసుకొని జగత్తును రక్షించే పరమేశ్వరుడు. ఆ పరమేశ్వరుడు అక్షరం అంటే శాశ్వతమైంది. ఏకః దేవః= ఒకడేదేవుడు. క్షరంగా ఆత్మగా సృష్టిస్తాడు. అంటే జగత్తును, ఆత్మను= జీవుణ్ణి సృష్టించి అనుశాసిస్తాడు.** తిరువాయ్‌మొళి 10, 6 వ దశకం పాశురం నం.1 లో నమ్మాళ్వార్ భగవంతుణ్ణి "ఉలగం–ఉండ–పెరువాయ" అన్నారు. అంటే ప్రళయకాలంలో జగత్తులను మ్రింగే పెద్దనోరు కలవాడు" అని అర్థం. తిరుమంగైఆళ్వార్ ఇంకా స్పష్టంగా తిరుమొళి 8, ప్రథమదశకం, 6 వ పాశురంలోనూ, తిరుమొళి 10, ప్రథమదశకం, 3 వ పాశురంలోనూ "అష్టదిక్కులనూ, సప్తలోకాలనూ, సముద్రాలను, భూమిని వస్తుజాతాన్ని సమస్తమూ తన ఉదరంలో ప్రళయానికి గురికాకుండా దాచి రక్షించిన వాడ"ని వర్ణించినాడు.

బ్రహ్మ విష్ణు శివుడు అని నిర్వహించే పనులనుబట్టి నిర్దేశించిందేకాని మతమౌఢ్యంతో కొందరు కటువైన పదజాలాన్ని వాడతారు. శ్రీ లక్ష్మీస్తోత్రంలో, **లక్ష్మీదేవి – "బ్రహ్మ విష్ణు శివాత్మికా"** అని పేర్కొనబడింది. మరొక శ్లోకంలో **'హరిహరబ్రహ్మాదిభి స్సేవితామ్'** విష్ణువు, శివుడు, బ్రహ్మ, ఇతర దేవతలు ఆమెను అర్చిస్తారని ఉన్నది. అట్లాగే పార్వతీదేవి వివిధ రూపాల్లో, సరస్వతీదేవి కూడా బ్రహ్మ విష్ణు శివార్చితగా వర్ణింపబడింది (ఈ గ్రంథాదిలో ఉన్న 'ప్రార్థన'ను చూడండి). ఆ స్థితిలో ఎవరు గొప్ప అని చెప్పడం.

పాశురం 7 లో, ఆకాశమంత విశాలమైన ఎత్తైన శ్వేతచ్ఛత్రంక్రింద రాజులను పాలించే చక్రవర్తిగా, ప్రజల పొగడ్తలను పొందాలన్న కోరిక లేదని, మధుభరితమైన సుందరపుష్పాలతో విరాజిల్లే ఉద్యానవనాలున్న వేంగడంపై సెలయేరుగా జన్మించే భాగ్యం కలిగితే చాలునని వ్రాసినాడు.

పాశురం 8 లో, తన జటాకలాపంలో చంద్రుణ్ణి ధరించిన శివుని కోరికలనీడేర్చే ప్రభువు, బ్రహ్మ, ఇంద్రుడు నిర్వహించిన యాగాలకు అనుగుణమై ఫలాన్ని ప్రసాదించే స్వామి, వేదములలో స్తుతింపబడిన దేవుడు, వాసమైన, సుగంధ సుఖశీతల వనాలతో నిండిన, వేంగడం పర్వతానికి నేను ఒక బాటగా ఉండినాచాలునని భావిస్తాడు.

పాశురం 9 లో, 66 దేవాదిదేవా! లక్ష్మీనాథా! వేంగడపై నివాసమైన వాడా! చెట్లలాగా పెరిగేమానవుల క్రూరకర్మలను నశింపచేయువాడా! నీ పవిత్ర దేవాలయానికి ముందు, భక్తులు, దేవతలు, రంభాద్యప్సరలు నిరంతరం నడుస్తూ వెళ్ళేమెట్టుగా ఉండే అదృష్టం కలుగుతుందా? నీ అధరప్రవాళాన్ని చూచే భాగ్యం కలుగుతుందా? అని వ్రాసినాడు.

పాశురం 10 లో, తన ఛత్రచ్ఛాయ క్రిందకు ఊర్ధ్వలోకాలను జయించి తీసుకురావాలన్న కోరికలేదని, స్వర్ణవలయ భూషితమైన తనుమధ్యంతో విలసిల్లే ఊర్వశిని పొందాలన్నవాంఛలేదని, చక్రధారియై, ప్రవాళాధరుడైన స్వామి నివసించే సుప్రసిద్ధ వేంగడంపై ఏదైనా ఒక వస్తువుగా జన్మించాలని కోరికకలదని వ్రాసినాడు.

పాశురం 11 లో, స్వచ్ఛమై వ్యాకరణ బద్ధమైన తమిళభాషలో కులశేఖరునిచే రచింపబడిన ఈ పాశురాలను, వేంగడంపై నివాసమైన స్వామి బంగరుపాదాలను సేవించినవారు పాడిన భక్తులౌతారు. వేంగడం ఉత్తరదిశలో ఉన్నది. అది నిరంతరం ప్రవహించే చల్లనిసెలయేర్లతో ప్రకాశిస్తూ ఉంటుంది. కులశేఖరుడు శత్రువులను నిర్జించి ద్వేషించినవాడు. ఆయన నిశితశూలపాణి.

**తిరుప్పాణ్ ఆళ్వార్ :**

చోళామండలంలో శ్రీరంగానికి సమీపంగా ఉన్న ఉరైయూర్‌లో తిరుప్పాన్ ఆళ్వార్ జన్మించాడు. అనాథ శిశువుగా ఒక హరిజనునికి లభించగా, ఆయన పోషణలో పెరిగాడు. బాల్యంనుండీ శ్రీరంగనాథునిపై భక్తికుదిరి, నిరంతరం శ్రీరంగనాథుని పూజలో నిమగ్నమై ఉండేవాడు. లోకసారంగముని తిరుప్పాణ్ ఆళ్వార్‌ని శ్రీరంగనాథ స్వామి సన్నిధికీ తీసుకువెళ్ళాడు. తిరుప్పాణ్ ఆళ్వార్ శ్రీరంగనాథుని విగ్రహాన్ని కన్నులారా దర్శించి 'అమలనాదిపిరాన్' పాశురాలను రచించాడు. 'అమలనాదిపిరాన్' (స్వచ్ఛమైన జగత్ సృష్టికర్త) అనే పదంతో మొదటి పాశురం మొదలౌతుంది. దీనిలో ఆయన శ్రీ వేంకటేశ్వరుడు శ్రీరంగనాథుడుగానే భావిస్తాడు.

కమలపుష్పాలవంటి స్వామి పాదాలు తనకు మేలు కలిగిస్తూ తన కన్నులలో నిలిచిపోయినాయని, ఆ స్వామి స్వచ్ఛమైన జగత్సృష్టి కర్త అనీ, దయామయుడైన దేవతాప్రభువనీ, సురభిళవనాలతో నిండిన

వేంగడం పై నివాసమైనవాడని, ధర్మాన్ని పాలించేవాడని. ఆయన భక్తులకు తాను భృత్యుడననీ ఆయన ఉన్నత ప్రాకారాలున్న శ్రీరంగంలో నెలవై ఉన్నాడని మొదటి పాశురంలో వ్రాసినాడు.

మూడవపాశురంలో వేంగడంపై దేవుడు నిల్చి ఉన్నాడని, అక్కడ వానరాలు క్రీడిస్తూ ఉంటాయనీ ఆయనను దేవతలు పూజిస్తారని, శ్రీరంగంలో సర్పంపై శయనించి ఉన్నాడని, ఆయన ధరించిన వస్త్రం ఎఱ్ఱని ఆకాశం రంగులో ఉన్నదని, బ్రహ్మకు జన్మస్థానమైన కమలం, ఆయన సుందరనాభి నుండి ఉద్భవించినదనీ, ఆ స్వామి ఆత్మోద్ధారకమైన కోరికను తన మనస్సులో కల్పించినాడని వ్రాసినాడు.

**తిరుమంగై ఆళ్వార్ :**

కావేరీనది బంగాళాఖాతంలో కలిసేచోట, చోళమండలంలో తిరుక్కురై యలూర్‌లో తిరుమంగైఆళ్వార్ జన్మించినాడు. ఆయన పెద్ద సంఖ్యలో పాశురాల రచించినాడు. అవి వివిధ విషయాలపై రచింపబడి ఉన్నాయి. తమిళ ప్రబంధంలో భాగంగా ఉన్నాయి. అవి, పెరియతిరుమొళి, తిరుక్కురుం దాండగం, తిరుడుండాండగం, సిరియతిరుమడల్, పెరియ తిరుమడల్, **తిరువేలుక్కుట్టిరుక్కై** అనునవి.

పెరియతిరుమొళిలోనున్న విభిన్నదశకాల పాశురాలలో వేంగడంను గూర్చి, అధిష్ఠాన దైవతమైన శ్రీ వేంకటేశ్వరస్వామిని గూర్చి ప్రస్తావించినాడు.

తిరుమొళి 8 మొదటి దశకంలో వేంగడంను చేరవలసిందని తన మనస్సును ప్రబోధిస్తాడు. పాల్కడలిలో వటపత్రంపై శయనించిన, అద్భుత కృత్యాలు సాధించిన, శ్రీరంగంలోనున్న కృష్ణునికి అది పవిత్రనివాస స్థానమని, ఆ దేవుణ్ణి కృతయుగంలో తెల్లనివానిగా, కలియుగంలో నల్లనివానిగా, ద్వాపరయుగంలో పసుపు పచ్చనివానిగా మహానుభావులు ఆరాధించి ధ్యానించినారని, ఆయనకు సాష్టాంగ ప్రణతులను అర్పిస్తారని ఆయన పాదకమలాలను దేవతలు అర్చిస్తారని, ఆయన సుదర్శన చక్రాన్ని ధరించి ఉంటాడని వ్రాసినాడు.

వేంగడంపై నున్న దేవుడు, త్రివిక్రముడు, రాముడు, గజేంద్ర రక్షకుడు, హిమాలయబదరికాశ్రమనివాసి, తిరుమాలిరున్‌శోలై, తిరువిడవింద్రై క్షేత్రాల్లో ఉన్న స్వామి ఒకరేయని భావిస్తాడు. **ఆయన అష్టభుజస్వామియని, అష్టదిక్కులనూ, సప్తలోకాలనూ ప్రళయకాలంలో కాపాడేవాడని, సుదర్శన చక్రాన్ని ధరించి ఉంటాడని.** రెండు సాలవృక్షాలను పెరికి వేసిన వాడని, భారతయుద్ధంలో పాండవులు జయించడానిక తోడ్పడినవాడని బలిచక్రవర్తి నుండి భూమిని కానుకగా తీసుకున్న వాడని, సప్తసాలభంజనం చేసినవాడని, నరసింహుడుగా తన నఖాలతో హిరణ్యాసురుణ్ణి రెండుగా చీల్చిన వాడని, చంద్రుని రోగాన్ని మాన్పినవాడని, పంచభూత నిర్మాణం చేసిన వాడని, సహస్రనామాలు కలవాడని జన్మరహితుడని, దేవతలకు ప్రభువని, శ్రీ లక్ష్మీపతియని వర్ణించినాడు. 9 వ పాశురంలో పర్వతతిలకమైన వేంగడాన్ని చేరమని మనస్సును ప్రబోధిస్తాడు. ఆ వేంగడం సువాసనాభరిత మైన పుష్పాలతో నిండిన ఉద్యానవనాలతో ఉన్నదని, భక్తులందరికీ సులభంగా దర్శనాన్నిచ్చే స్వామి అక్కడ నిల్చి ఉన్నాడని, **'ఓం నమోవేంకటేశాయ'** అనే అష్టాక్షరీ మంత్రాన్ని భక్తితో జపించిన వారికి పునర్జన్మ కలుగదని వ్రాసినాడు.

10 వ పాశురంలో తనను కలియన్‌గా పేర్కొన్నాడు. కలియన్ అంటే జనులకు నాయకుడు. తిరుమంగై ప్రాంతానికి జననాయకునిగా తనను చెప్పుకొన్నాడు. శ్రీ వేంగడంపై నున్న దేవునికి హారంగా చక్కని తమిళంలో 9 పాశురాలను విరచించి సమర్పించి ఉన్నానని, వాటిని పఠించినవారు భక్తులై, స్వజనరక్షకులై, స్వర్గాన్ని పొందుతారని తెల్పినాడు.

ఈ పాశురాలను చదివితే, వేంగడంపై సరస్సులు, సెలయేర్లు ఉండేవని, వాని నిండా ఎఱ్ఱని చేపలు ఉండేవని, చుట్టూ పవిత్రమైన కోనేర్లు, పటకుటీరాలు, ఉద్యానవనాలు ఉండేవని వరాహాలతో భూమిని దున్ని సేద్యం చేసేవారని, తను మధ్యలైన కురవస్త్రీలు, చెక్కలతో చేసిన తాత్కాలిక నిర్మాణాలపైనుండి చూచేవారని మనకు తెలుస్తుంది. తిరుమొళి 9 మొదటి దశకంలో, చల్లని వేంగడంపై నివాసమైన ప్రభువు పాదాలను ఆశ్రయిస్తాడు. ఆ వేంగడంపై ఏపుగా పెరిగిన వెదరుపొదలున్నా యని, సురభిళమైన ఉద్యానాలున్నాయని, ఆ ఉద్యానాలలో తుమ్మెదలు, తేనెటీగలు పుష్పాలనుండి మధువు నాస్వాదిస్తూ ఉంటాయని, సరస్సులు జలాశయాలు కమల పుష్పాలతో సమృద్ధిగా నిండి ఉన్నాయనీ, మేఘాలు క్రమ్ముకొని ఉన్నాయని, మదపుటేనుగులు తిరుగాడే ఎత్తైన శిఖరాలు ఉన్నాయని వర్ణించినాడు. తన విషయం మనవి చేసుకుంటాడు, తాను మొదటినుండీ దుర్మార్గమైన పాప జీవితం గడిపినానని, ప్రాపంచికమైన, తల్లి, తండ్రి, సంతానం, బంధువులు మొదలైన బంధనాలతో బాధపడ్డాననీ, నష్టపోయినానని చెప్పికొన్నాడు. కుక్కలాగా నీచ జీవనం చేస్తూ ఉన్న తరుణంలో వేంగడంపై నున్న ప్రభువును స్మరించి, ఆశ్రయించి తనను సేవకునిగా గ్రహింప వలసిందిగా అర్థించినానని వ్రాసినాడు. మృగాక్షులైన స్త్రీల అందానికి ఆకర్షితుణ్ణై అజ్ఞానంతో క్రూరకర్మలెన్నింటినో చేసినానని, ఎందరి ప్రాణాలనో హరించినానని, దానధర్మాలను చేయలేదని, మంచిపనులను చేయలేదని, యౌవన కౌమారదశల్లో కేవలం సుఖార్థిగా జీవితం గడిపినానని, భగవత్ప్రార్థన చేసే శక్తిని కోల్పోయినానని, పాంచభౌతికమైన శరీరం ఆధివ్యాధులకు గురియైపోగా, పశ్చాత్తాపంతో స్వామి పాదాలను ఆశ్రయించినానని ఆయనకు భృత్యుణ్ణై ఆయన కృపనర్థించినానని, ఆయన కృప ననుగ్రహింపుమని ప్రార్థించినానని వ్రాసినాడు.

రెండవ పాశురంలో స్వామిని తన గజంగా వర్ణించినాడు. 10 వ పాశురంలో, ఎత్తైన భవనాలున్న తిరుమంగై ప్రదేశానికి చెందిన జననాయకు డైన కలియన్ భగవంతునిపై వ్రాసిన మధురమైన శ్రావ్యమైన పాశురాలను పఠించినవారికి, సర్వపాపాలు మాయమైపోతాయి. ఆ భగవంతుడు సప్తలోకాలకు కన్నులవంటివాడు, ప్రాణంవంటివాడు. ఆయనను దేవతలు ఆరాధిస్తారు. వేదాలు ఆయనను స్తుతిస్తాయి. పుష్పవనాలతోనిండిన వేంగడంపై ఆయన నివాసమై ఉంటాడు.

తిరుమొళి 10 మొదటి 5 పాశురాలలో మొదటి పాశురంలో వేంగడంపైనున్న స్వామికి తనకున్న అడ్డంకులన్నింటినీ తొలగించి, దయనే చూపి, కాపాడమని ప్రార్థిస్తాడు. తరువాతి 4 పాశురాలలో ఆ స్వామి మాయామయుడని, తన మనస్సులో నివాసమైనాడని, అశాశ్వతమైన మానవ జీవనాన్ని తొలగించి,

తనను తన సేవకునిగా చేసికొన్నాడని, దుర్లభుడైన ఆయన భక్తిపరులకు సులభంగా లభిస్తాడని, శాశ్వతంగా ప్రకాశించే జ్యోతిస్సనీ, అందరి వాంఛితాలను తీర్చేవాడని, చింతామణి వంటివాడని, అందరికీ ప్రభువైన ఆయన, సేవకుడైన తన మనస్సులో ప్రవేశించినాడని, ఆయనను వదలలేనని, ఆయన పాదాలను తప్ప మరేదీ స్మరించనని వ్రాసినాడు.

10 వ పాశురంలో **తిరుమంగైఆళ్వార్** ఇట్లా వ్రాసినాడు:

"భుజబలుడైన కలియన్, శక్తిమద్బాహువులు కలిగి నీల తనుడై ఆటవికభిల్లుల కావాసమైన వేంగడంపై నున్న స్వామిపై వ్రాసిన పాశురాలను పఠించినవారు స్వర్గంలో దేవతలౌతారు". అని

పాశురం 1 లో, లంకాధిపతియైన రావణుని సంహరించిన రామునిగా శ్రీ వేంకటేశ్వరుణ్ణి వర్ణిస్తాడు. పాశురం 2 లో, గరుడవాహనం పై వెళ్ళి లంకయందున్న రాక్షస వంశాన్ని నిర్మూలించిన విష్ణువుగా వర్ణిస్తాడు. పాశురం 3 లో, ప్రళయకాలంలో, భూమినీ, సముద్రాలను, భూమిపైనున్న సమస్త వస్తువులనూ తన నోట్లో పెట్టుకొని, కాపాడి, ఒక చిన్నవటపత్రం పై శయనించే అద్భుతమైన అమృత స్వరూపం కలిగిన శ్రీకృష్ణుడుగా వర్ణిస్తాడు. పాశురం 4 లో ఉట్టినుండి వెన్నను దొంగిలించే నవనీత చోరుడుగా, భూమ్యాకాశాలను తన పాదాలతో కొల్చిన వామనుడుగా వర్ణిస్తాడు. పాశురం నం.5 లో దారు స్తంభం నుండి ఆవిర్భవించి హిరణ్య కశిపుని చీల్చిన నరసింహునిగా వర్ణిస్తాడు. ఆదిశేషునిపై శయనించినట్లు వ్రాసినాడు. పాశురం 6 లో స్వామిని తన తండ్రిగా, తన ఏనుగుగా వర్ణిస్తాడు. పాశురం 7 లో నీలాదేవిని వివాహమాడటానికి ఏడు వృషభాలను జయించిన విష్ణువని కీర్తిస్తాడు. పాశురం నం.8 లో శ్రీకృష్ణునిగా భావించినాడు.

తిరుమొళి I, రెండవదశకం 9 పాశురాలలో తన మనస్సు వేంగడం ప్రభువును సేవించినందుకు సంతోషపడుతూ వర్ణిస్తాడు. ఆ వేంగడం ప్రభువు, తీవ్రమైన తపస్సు చేసేవారి మనస్సుల్లో ప్రవేశిస్తాడని, దేవతలు ఆయనను సేవిస్తారని, ఆ సేవాస్వభావాన్ని తన మనస్సు పొందిందనీ, తపసు చేసేవారు భవబంధాలను విడనాడి, నిరుపమానుడైన స్వామినే విశ్వసిస్తారని, ఆయన భక్తులకు జన్మ రాహిత్యాన్ని ప్రసాదిస్తాడని, బంధుమిత్రులతో కూడి ఆయన భక్తులు స్వర్గన్ని పొందుతారని, వ్రాసినాడు. తన మనస్సును బౌద్ధులకు జైనులకు దూరంగా ఉండమని అంటాడు. **బౌద్ధులు, జైనులు శాఖా నిబిడమైన అశ్వత్థాన్ని, అశోక వృక్షాన్ని తమ గుర్తులుగా పెట్టుకొని సంచరిస్తారని, వారు కాషాయాన్ని ధరించి శిరోముండనం చేసుకొని, తమకు తామే దేవుళ్ళుగా భావించుకుంటూ ఉంటారని, అపరిశుభ్రంగా సాంఘికంగా భుజిస్తారని, అసత్యతర్కంతో తమ మతాన్ని ప్రచారం చేసుకుంటూరని, పెరుగుతో కలిపిన అన్నాన్ని పొట్టనిండా నింపుకుంటారని, వారు భగవంతుని గూర్చి అ సంబద్ధంగా వాదిస్తారని పాశురాలలో వ్రాసినాడు.** నిన్నటి వరకూ ప్రాకృతజనులతో కలిసి వారి ఆలోచనలను, ఆశయాలను తనవిగా చేసుకొని, వాళ్ళ భావాలతో వాళ్ళ పదాలను ఉచ్చరిస్తూ వారితో నృత్యం చేసిన తన మనస్సు వేంగడంపైనున్న దేవుని సేవించడానికి

ఉన్ముఖమైంది. తనకు తెల్వకుండానే ఇట్లా మారిపోయిందని సంతోషిస్తాడు. తన మనస్సు సేవించే వేంగడం స్వామిని పెక్కుమంది స్తుతిస్తారని, కాని ఆయనకు పొందలేరని, దానవులు కూడా ఆయనకు నమస్కరిస్తారని, ఐశ్వర్యం కలిగిన బ్రహ్మ, ఈశ్వరుడు, ఇంద్రుడు ఆయన ముందు వినయ విధేయంగా నిలబడి ఉంటారని వర్ణించినాడు.

పాశురం నం. 10 లో, మెరుపులతో కూడిన మేఘాలతో నిండిన వేంగడంపై నున్న స్వామిని కీర్తిస్తూ, కలికన్టి వ్రాసిన గీతాలను పఠించినవారు స్వర్గాన్ని పొందుతారు. **వేంగడం పైనున్న స్వామి ఒకప్పుడు హంసగా అవతరించినాడు. ఆయనను దేవతలు అర్చిస్తారు. ఈ గీతాలనువ్రాసిన కలికన్టి ఎత్తైన ప్రాకారాలున్న మంగైయార్ నగరానికి చెందినవాడు. ప్రసన్న మైన తమిళభాషలో వ్రాసినాడు,** అని తెల్పినాడు.

ఈ పాశురాలలో శ్రీ వేంకటేశ్వరుణ్ణి వామనునితో కృష్ణునితో పోలుస్తాడు. సూర్యబింబాంతర్వర్తియని వ్రాస్తాడు. వేంగడంపై ఆటవికు లున్నారని, వారు వంట చెరుకుగావాడుతూ ఉన్న కట్టెలనుండి సువాసన కలిగిన పొగవస్తుందని వ్రాసినాడు. ఆ కొండపై జడలబర్రెలు గుంపులుగా తిరుగుతాయని, తుమ్మెదలు మధురంగా గానంచేస్తూ ఉంటాయని, వెదురు పొదలు సమున్నతంగా పెరుగుతాయని, వాటి కాండాలు పగిలినపుడు వెదజల్లబడే విత్తనాలు ముత్యాలలాగా ఉంటాయని వర్ణించినాడు.

తిరుమొళిలో విభిన్నదశకాలలో ఉన్న తొమ్మిది పాశురాలలో స్వామిని వర్ణించినాడు. వేంగడంపై నివాసమైన స్వామి, తన సుదర్శన చక్రాన్ని ప్రయోగించి బాణాసురుని వేయి బాహువులను ఖండించినాడని, వేంగడంపై ప్రకాశించే ఎత్తైన శిఖరాలున్నాయని, వేంగడంపై నివాసమైన స్వామిని ఆయన తేజస్సువలన వేదాల్లో గుర్తించవచ్చుననీ ఆయన'నాన్ కెం.పెన్ సీ.' అనే ప్రసిద్ధదేవాలయంలో నివసిస్తాడని, ఆ దేవాలయంలో పండితులుంటారని వ్రాసినాడు. తాను పూజించేస్వామి, తన భావాలను కేంద్రమైనస్వామి, ముక్తి ప్రదాత, లక్ష్మీపతి, ఉత్తరాన ఉన్న కొండపై వేంగడంపైనున్న ప్రభువు, తన మనస్సులోనున్నవాడు, **తిరుక్కోవలూర్**లో బలమైన కాళ్ళతో భూమిని కొల్చిన వామనుడుగా ఉన్నవాడు, (ఉద్యానవనాలతో, తుమ్మెదలతో తిరుక్కోవలూర్ నిండి ఉన్నదని) పవిత్రజలం ప్రవహించే శ్రీరంగంలో విశ్వాత్ముడుగా ఉన్నాడని (తిరుమొళి 6, 5 వ దశకం, 7 పాశురం) లో వర్ణించినాడు. ఆటవికులున్న తిరువేంగడంపై దీపంగా, వేదవిద్వాంసులున్న **తిరునాంగూర్**లో, ఉద్యానవనాలతో నిండిన **తిరువెళ్ళాక్కుళ్**లో (5th P.of 4th d of 7th T) ఉన్న స్వామిని తన పాపాలను నాశనం చేయమని ప్రార్థిస్తాడు. తిరుమొళి 3, 5 వ దశకం, 4 వ పాశురంలో, మామిడి తోటలు, పనస తోటలు విరివిగా ఉన్న **తిరువెళ్ళరై**లో నెలకొన్న స్వామిని, భారతయుద్ధంలో పాండవులకు రాజ్యప్రాప్తిని కలిగించిన శ్రీకృష్ణుని, వెదురుపొదలు విస్తారంగా ఉన్న తిరువేంగడంపై నివాసమైన స్వామిని తనను ప్రబోధించి భక్తిని ప్రసాదించాలని ప్రార్థిస్తాడు. 1–6–8 లో తాను స్వామిని అన్వేషించి, పొందినానని, ఆయన తన శరీరాన్ని కృష్ణాజినంతో కప్పుకొని బ్రహ్మచారిగా మహాబలినుండి, భూమిని తన పాదాలతో కొలిచి, కానుకగా గ్రహించినాడని, ఆయన వేంగడం పైనున్నాడని, తేనెలుకారే పర్వతోపత్యకపై

**తిరునరైయూర్**లో దర్శించి పూజించినానని వ్రాసినాడు. 5-7-3 లో దయామయుడైన తిరునరైయూర్ స్వామి కమలాలవంటి పాదాలను తప్ప, మరేదీ స్మరించనని, తాను నరకంలో బాధలనుభవిస్తున్నవేళ తన వద్దకు వచ్చి అభయమిచ్చి రక్షించిన స్వామియని, ఊర్ధ్వలోకాలకు ఆభరణంగా వేంగడంపై సింహంగా ఎవడు ఉన్నాడో, బాలకృష్ణుడుగా హయాసురుని నోటిని ఎవడు చీల్చినాడో, ఎవడు వెన్నను దొంగిలించి తిననందున, తల్లి రోటికి కట్టివేసిందో, ఎవడు శర్కరారసంవలె మధురంగా ఉన్నాడో, తేనెవలె తీయగా (3-7-10) ఉన్నాడో, ఆయనను వెతికి పట్టుకున్నానని వ్రాసినాడు. ఆయన **తిరుక్కణ్ణమంగై** క్షీరంవలె ఆహ్లాదం కలిగించేవాడు. హిమాలయ పర్వతం కూతురైన పార్వతికి పతియైన పరమేశ్వరునితో కలిసిపోవడానికి ఇష్టపడుతాడు. వెన్నెల నిండిన ఆకాశంవలె ఉన్నవాడు. సూర్యుని అంతరాత్మ, ఉత్తరాన ఉన్న కొండ, వేంగడానికి రత్నం వంటివాడు, సజ్జనులు స్తుతించేవాడు. దివారాత్రాలను కల్పించేవాడు అని వర్ణించినాడు. తాను, తనవెంట ఉన్నవారు, వేంగడం శిఖరంపై, బంగారంవలె ఆకర్షించే దేవాదిదేవుణ్ణి, నీలవర్ణం కలవానిని, నిర్దోషమైన ఆకృతి కలవానిని, తేజస్విని, మెరుపువలె విరాజిల్లేవానిని చూచి అర్చించినామని వ్రాసినాడు. ఆయన తనను సేవకునిగా పరిగ్రహించినాడని, ఆయన వేంగడంపై నిల్చి ఉన్నాడని, మరొకసారి ఆయనను, **తిరుత్తణ్ కోవిల్**లో పూజిస్తామని వ్రాసినాడు.

4-9-7 తిరుమొళిలో తన మనస్సుతో ఇట్లా అంటాడు, "ఓ మనస్సా! మధురంగా భాషించే సుందర వనితలను గూర్చిన భావాలనుండి విముక్తం కావాలంటే, పరమాత్మనామోచ్చారణం నిపుణంగా చేయడం నేర్చుకో. ఆ పరమాత్ముడే స్వర్గంలోని దేవతల విన్నపాలను వింటాడు. ఆయన వేంగడంపై నివాసమై ఉంటాడు. సముద్రంవలె విస్తారమైన ఆకారం కలవాడు. ఆయనకు **తిరువెళ్ళావాల్** అనే పేరుకూడా ఉన్నది. ఆయనను స్మరించి వృద్ధిచెందు" అని.

**మూడుపాశురాలలో ఆళ్వార్ తనకు తాను ప్రేమవివశయైన స్త్రీగా. ఊహించుకుంటాడు. ఆ స్త్రీ తల్లి ఇట్లా అంటున్నది. "నా కూతురు సిగ్గుపడకుండా 'వేంగడం-వేంగడం' అని అంటూ ఉన్నది. నా ఒళ్ళో విశ్రాంతి తీసుకోదు. తన విశాలమైన నేత్రాలను తెరిచే ఉంటుంది. నిదురపోదు. నా కూతురునకు బాధకలిగించిన దేవునిగూర్చి చెప్పనా? ఆయన సీతాకోక చిలుకలవలె, వర్షాకాలమేఘాలవంటి వర్ణంకలవాడు, దేవతలకు ప్రాణంవంటి వాడు. పాల్కడలిలో పుట్టిన లక్ష్మీదేవిని భార్యగా గ్రహించినవాడు."** " ఆమె సెలయేర్లున్న తిరుమల, శుభ్రమైన నీరున్నచోటు" అంటూ శుభాకృతి కలిగిన ఆయనను గూర్చి అడుగుతుంది. మౌనం వహిస్తుంది. 'శ్రీ కృష్ణపురం' అంటుంది. చెమరుస్తుంది. మూర్ఛపోతుంది. ఆమెకు ఉన్మాదం కలిగింది. ఈ దుఃఖాన్ని నివారించడమెట్లా?" తన సందేహాన్ని ఇట్లా తెల్పుతుంది, "అందమైన నాకూతురు, శుభలక్షణాలన్నీ కలిగిన నారాయణుణ్ణి, శంఖచక్రాలు ధరించినవానిని, బలమైన ఎత్తైన గుండ్రంగా ఉన్న భుజాలు కలిగినవాణ్ణి, ఆకర్షణీయమైన యజ్ఞోపవీతాన్ని ధరించినవానిని, ఉద్యానవనాలున్న వేంగడం నివాసమైనవానిని, వేదాలలో నిర్వచింపబడినవానిని, పాదాలకు శిలంబు అనబడే మంజీరాలను ధరించిన వానిని **తిరుమాలిరున్ శోలై** పర్వతంపై నిల్చి ఉన్నవానిని పొందగలదా?" అని.

ఆళ్వార్ తనకు తానొక ప్రభావోద్విగ్నయైన స్త్రీగా ఊహించుకొని, తన పెంపుడు రామచిలుకను, వేంగడంపై సుదర్శన చక్రాన్ని ధరించి, బలమైన భుజాలుకల్గిన స్వామిని తన వద్దకు రావలసిందిగా చెప్పమని అంటాడు. ఆళ్వార్ ఆ భావోద్వేగంలోనే ఇట్లా అంటాడు, "శ్రీకృష్ణుడు నా మనస్సులోనే నివాసమైనా, నా చేతికంకణాలు ఎందుకో వదులైనాయి. మేము స్త్రీలుగా జన్మించినందున స్త్రీ సహజలక్షణాలను పొందుతాము. కానీయండి. **వేంగడంపై, శ్రీరంగంలో** నివాసమైన స్వామి కీర్తించడం మాకు నిషిద్ధమా?" (7-11-3) అంటాడు. ఒక చెలికత్తెకు సమాధానమిచ్చినట్లుగా తననొక స్త్రీగా ఊహించుకొని, ఇలా అంటాడు, "ఆయన మహాబలిని మూడడుగుల నేలను కోరి భూమండలం సమస్తం కొలిచిన **మాయావి** అనీ, ఆయన పాల్కడలి పై శయనిస్తాడని, ఆయన వేంగడంపై ఉంటాడని లోకులంటారు" అని. చెలికత్తెతో **"ఓ చెలీ! పాల్కడలిపై శయనించే దేవుడు, వేంగడంపైన కూడా ఉన్నాడు. ఆయన తిరుమంగై ఆళ్వార్ (కలియన్) హృదయంలో శాశ్వతస్థానాన్ని ఏర్పరచుకున్నాడు"** అని వ్రాసినాడు.

తిరుక్కురుందాండకం, 7 వ పాశురంలో ఇట్లా వ్రాసినాడు "ప్రాపంచిక మైన ఆనందాన్ని, స్వర్గలోక ఆనందాన్ని అనుగ్రహించే పరమాత్ముని మహత్త్వాన్ని, స్వర్గంలో ఆనంద స్వరూపంగా ఉన్నవానిని, పెద్ద ఉద్యాన వనాలతో ఉన్న అద్భుతమై శ్రీరంగంలో నివాసమైన వానిని, అరుణ నీలవర్ణాలతో భాసించేవానిని (యుగధర్మాన్నీ అనుసరించి) **తిరుమలై అన్న ఈ తమిళపదం - పవిత్రమైన పర్వతం - అని వేంగడంను నిర్దేశిస్తూ ప్రయోగింపబడడం,** ఇది రెండవ ఉదాహరణం. మొదటి ప్రయోగాన్ని పూదత్తాళ్వార్ పాశురం 63 లో ప్రయోగింపగా మనం చూచి ఉన్నాం. తిరుమలైపై నరులకు దేవతలకు ఆనందాన్ని ప్రసాదిస్తున్నవానిని స్మరించిన వారిని ఆయన తన తలపై ఆభరణంగా ధరిస్తాడు" అని.

పాశురం నం.8, తిరునెడుందాండగంలో ఇట్లావ్రాసినాడు. "నేను పరమాత్ముణ్ణి అర్చించాలన్న తీవ్రమైన కోరికతో ఉన్నాను. ఆయన **'తిరు ఊరగం'**లో నెలకొని ఉన్నాడు. ఆయన వేంగడానికి శిరోభూషణంగా ఉన్నాడు. ఆయన కాంచీలోని **తిరునిలాత్తింగళ్తుండం**లో వాసమై ఉన్నాడు. సంసన్నమైన కాంచీలోనున్న **తిరుఊరగం**లో ఉన్నాడు. కాంచీలో నది ఒడ్డున **తిరువెఃక్కా**లో శయనించి ఉన్నాడు, జగద్వంద్యుడై ఆయన తిరుక్కారగంలో ఉన్నాడు, జగద్వంద్యుడై ఆయన తిరుక్కారగంలో ఉన్నాడు, తిరుక్కార్వాణంలో ఉన్నాడు, తిరుప్పేర్ పట్టణంలో, కావేరీనదీ దక్షిణ తీరాన ఉన్నాడు, భక్తుల మనస్సులలో వాసమై ఉన్నాడు. ఆయనయే వెన్నను దొంగిలించిన వాడు. నా మనస్సులో నెలకొన్నాడు." అని పాశురం నం.9 లో ఇట్లా అర్థిస్తాడు, "సముద్రతీరంలో విలువైన రత్నాలను తెచ్చేనావలతో ఉన్న తిరుక్కడల్‌మల్లైలో ఉన్నవాడా! సమున్నతప్రాకారాలున్న **కాంచీనగరం తిరువెఃకా**లో శయనించిన వాడా! తిరుప్పేర్ పట్టణంలో ఉన్నవాడా! అరుణవర్ణం కలిగిన, తేనెతో నిండిన కొండపూవుల హారాలను వక్షఃస్థలంలో ధరించినవాడా! వామభాగంలో హిమవంతుని కూతురైన పార్వతిని ధరించిన పరమశివుణ్ణి కుడిభాగాన నిలుపుకొన్నవాడా! పాల్కడలిపై సుఖనిద్రను పొందినవాడా! వివిధావతారాలలో భూమిపై తిరుగాడినవాడా! చల్లగా ప్రసన్నమైన వేంగడంపై నిల్చినవాడా! ప్రవాళంవలె ఎఱ్ఱనైనవాడా! నీవెక్కడ ఉన్నావు? పరమదీనభక్తుణ్ణైన నేను నీ కోసం వెతికి

వేసారిపోయి నీరసపడ్డాను" అని. పాశురం 10 లో తన ఆరాటాన్ని ఇట్లా విన్నవించినాడు, "విద్యాగంధం లేని పామరభక్తుడనైన నేను నిన్నురమ్మని పిలువగలనే కాని, అంతకంటె మరేమీ చేయలేను. దక్షిణ దిశలో ప్రశస్తమైనా **తిరుమాలిరున్‌శోలై** కొండపై వసిస్తున్న మదగజానివి, ఉత్తరాన వేంగడంపై నిల్చున్న మదగజానివి. పడమట శ్రీరంగంలో శయనించిన మహాగజానివి, తూర్పు దిక్కున **తిరుక్కణ్ణపురాన** వాసమైన మత్తగజానివి. నీవు దేవతాశ్రేష్ఠుడవు. **తిరుమొళిక్కళంలో** ప్రకాశిస్తూ అవతారాలన్నింటిని ధరించిన పిదప, వసించి జనులచే అర్చింపబడినవాడవు పరమాత్ముడవు, బంగారంచే కప్పబడినవాడవు, సప్తలోకాలను కాపాడిన వాడవు." అని. పాశురం 16 లో **తిరుమంగైఆళ్వార్** తాను ప్రేమోద్విగ్నయైన కాంతగా భావించుకొని. ఆ కాంత తల్లి అన్నట్టుగా ఈ విధంగా వ్రాసినాడు, "ఆలమందలనుకాచే అందమైన యువకుడైన కృష్ణున్నే స్మరిస్తుంది. తిరుక్కణ్ణపురంలో ఉన్న స్వామిని తన నిధిగా భావిస్తుంది, ఉత్తరానికి ఆ భరణంగా ఉన్న వేంగడంపైనున్న స్వామిని, అసురులను ఓడించి, నాశనం చేసిన వానిని, సురభిళకుసుమాలతో నిండిన **తిరునరైయూర్‌లో** నిల్చిన వానిని, అందమైన కురులున్న నల్లనివానిని తన సహచరునిగా కోరుతూ, స్తనయుగంపై కన్నీరుపడగా దుఃఖిస్తుంది, మూర్ఛిల్లుతుంది." అని.

**శ్రీ వేదాంతదేశికుడు :**

ఆళ్వారులేకాక, ఒక వైష్ణవాచార్యుడు, సంప్రదాయాచార్యుడు, వేదాంత దేశికుడుగా ప్రసిద్ధుడైన వేంకటనాథుడు, శ్రీ వేంకటేశ్వరుణ్ణి స్తుతిస్తూ ఒక వంద శ్లోకాలను **'దయాశతకం'** పేరున రచించినాడు. **'అధికార సంగ్రహం'** వంటి మతగ్రంథాలనూ వ్రాసినాడు. దీనిలో పాశురం 43 లో వేంగడాన్ని ఇట్లా వర్ణించినాడు, "శ్రీకృష్ణపాదాలను ధరించిన ఈ పర్వతం, పాపుల సుకృత దుష్కృతాలను దహిస్తుంది. స్వర్గంవలె ప్రకాశమానమైంది పవిత్ర సరస్సులతో నిండి ఉన్నది. ఇక్కడ పుణ్యం పెంపెసలారు తుంది. స్వర్గంలో పుణ్యఫలాన్ని అనుభవించే అవకాశాన్ని కల్పిస్తుంది. మానవులు, దేవతలు కోరుకునే ప్రదేశమిది. వేంగడం అంటే మూర్తీభూతమైన వేద సమూహమే.

దయాశతకంలో 108 శ్లోకాలున్నాయి. నీతిబద్ధంగా జీవించనివారిని, ధర్మశాస్త్రోల్లంఘనం చేసిన జనులను శ్రీ వేంకటేశ్వరస్వామి శిక్షించాలని భావిస్తాడు. ఆయన దయాస్వభావమే దయాదేవిగా, అట్టివారిని స్వామి క్షమించేట్టు చేస్తుంది. వారు స్వభావాన్ని మార్చుకొని ధర్మశీలురు, భక్తిపరులు సజ్జనులుగా పరిణామం చెందుతారు.

* * *

# అధ్యాయం-15

## శ్రీవేంకటేశ్వరునికి రాజుల కానుకలు, లౌకికుల సేవలు

తిరుపతి దేవస్థానంవారి సంకలనంలోని ప్రాచీనతమ శాసనాలు, **తొలిశాసనాలు**[1] అనే పేరున గల 1వ సంపుటంలో 8,9 అంకెలతో గుర్తింపబడినాయి. ఇవి క్రీ.శ 600 నుండి క్రీ.శ. 630 వరకు పాలించిన పల్లవరాజు మొదటి మహేంద్రవర్మ పాలనకాలంలో 14వ సంవత్సరానికి చెందినవి. ఈతడు గొప్పరాజు మాత్రమే కాక వాస్తుశిల్పికూడ. క్రీ.శ. 614 నాటి ఈ రెండు శాసనాలలో పల్లవ యువరాణి సామవై తాను శ్రీవేంకటేశ్వరుని రూపంలో నిర్మించి సమర్పించిన ఒక వెండి విగ్రహం, ఆలయంలో ధార్మిక క్రియాచరణ తరువాత ప్రతిష్ఠింపబడి, ఆపాదమస్తం అలంకరింపబడినట్లును, నిత్యదీపారాధన నైవేద్యాల కేర్పాటు చేయబడి నట్లును, ఆ స్వామి ప్రతిమకు పురట్టాశి, మార్గళి యను తమిళ మాసాలలో రెండు ఉత్సవాలను జరుపడానికి ఆరంభం చేశాదని వ్రాయబడి ఉంది. (పై చెప్పిన గ్రంథములో 99 నుండి 101 సంఖ్యగల పుటలు)

1వ సంపుటంలోని 1వ అంశంలో, పల్లవరాజు విజయదంతి విక్రమవర్మ పాలనకాలంలోని 51వ సంవత్సరానికి సరియైన క్రీ.శ 830లో, ఆ రాజుగారి అధికారియైన చోళనాటి చోకనూర్ **ఉలగప్పెరు మానార్, స్వామి తిరువిళంకోయిల్- పెరుమానడిగళ్**వారి కొక దీపాన్ని సమర్పించినట్లు మనకు తెలియవస్తుంది. ఈ స్వామి బహుశః వేంకటేశ్వరుని ఆలయంలో క్రొత్తగా ప్రతిష్ఠింపబడినవాడు అయి ఉంటాడు.

2వ అంశంగా, మరియొక దీపాన్ని శీయగంగ అనువారు సమర్పించిన ట్లున్నది. వీరు బహుశః విజయదంతి-విక్రమవర్మగారి పశ్చిమ గంగకు చెందిన పాలెగాడు అయి ఉంటాడు.

3వ అంశం బాణ రాజకుమారుడు విజయాదిత్య మహావలి బాణరాయల జననమును ప్రస్తావిస్తుంది. ఈతడు కూడ బహుశః విజయదంతి విక్రమవర్మ యొక్క పాలెగాడు అయి ఉంటాడు.

4వ అంశంగా అతడు నిత్యం రెండుసార్లు ముగ్గురు దేవతా మూర్తులకు నైవేద్యానికై చేసిన యేర్పాటు ప్రస్తావితం (చూడు దేవస్థానం ఎపిగ్రఫీ రిపోర్టు మరియు సంపుటి-1). ఆ ముగ్గురు దేవతా మూర్తులు: తిరువిళం కోయిల్- పెరుమానడిగళ్, తిరుమంతిరసాలై - పెరుమానడిగళ్, తిరువేంకటత్తు- పెరుమానడిగళ్, అనగా, (1) పై జెప్పిన 1(2)లోని క్రొత్తగా ప్రతిష్ఠింపబడిన వేంకటేశ్వరుని ప్రతిమ, (2) వేద మంత్రోచ్చారణతో, ఉత్సవముల వంటి ప్రత్యేకమైన మతధార్మిక కార్యక్రమాలను ప్రారంభించే సందర్భంలో అధిష్ఠానదేవతగా ఆ ధార్మిక కార్యక్రమాలను ప్రారంభించే సందర్భంలో అధిష్ఠానదేవతగా ఆ ధార్మిక యజ్ఞాలకు వ్యవహరించడానికి ఉద్దేశింపబడిన ఒక క్రొత్త దేవతామూర్తి మరియు (3) ప్రధానదైవమైన మూలబేరం

1. The Early Inscriptions

వేంకటేశ్వరుడు. ఆతడు కొంత బంగారపు కళంజును నిక్షేపించగా, దానితో కొంత భూమిని కొని, రైతులకు వానిలో పంటలు పండించడానికి అప్పగించి, ఆ ధాన్యాన్ని వారి నుండి సేకరించి, శాశ్వతంగా స్వామివారికి నైవేద్యానికై వినియోగించుటకు ఆలయోద్యోగులకు అధికార మీయబడినది. ఆ రెండు నైవేద్యములలో ఒకటి నంది-ఏరి-తిరు-అముదు, అనగా, నంది ఏరు అని ప్రసిద్ధమైన చెరువునీటితో ఆ క్షేత్రంలో పండించబడిన పంటతో చేయునైవేద్యం, అని అర్థం.

5వ అంశం, గంగై-గంగాన్-రణసింగన్ అనేవాణ్ణి ప్రస్తావిస్తుంది. ఈతడు పశ్చిమ గంగ రాజకుమారుడు కావచ్చు. ఈతడు, తాను నిక్షేపించిన బంగారంపై వచ్చు వడ్డీనుపయోగించి శాశ్వతంగా స్వామికి నిత్యం నైవేద్యాన్ని సమర్పించేటట్లు యేర్పాటు చేశాడు.

6వ అంశంలో గుణవాన్-అపరాజితన్ అను పేరుగల ఒకానొక ఇరుంగోళక్కోన్ (ఇరుంగోళల రాజు) కొంత తూకం గల బంగారాన్ని నిక్షేపించి, దాని ద్వారా ఎల్లకాలం ఇరువురు బ్రాహ్మణులకు భోజనాన్ని ఏర్పాట్లు చేసే సౌకర్యాన్ని కల్పించినట్లు తెలుస్తోంది. వాని పేరును బట్టి చూస్తే, ఆతడు కట్టకడపటి పల్లవరాజైన అపరాజితుని పాలెగాడని తోస్తున్నది. ఈ అపరాజితుడు చోళరాజైన మొదటి ఆదిత్యునిచే ఓడింపబడి, క్రీ.శ. 898లో రాజ్యభ్రష్టుడైనాడని చరిత్ర.

7వ అంశం శక సంవత్సరం 720కు సంబంధించిన (క్రీ.శ.898) ఒక శకలం. ఆ గ్రామపరిపాలన ద్వారా వచ్చిన రాబడిని తిరువిళంకోయిల్ కోసం వినియోగించే యేర్పాటును ప్రస్తావిస్తుంది. దీనిలో పల్లవరాజు లేదా చోళరాజు ప్రస్తావించబడలేదు. ఎందుకంటే, ఈ కాలం పల్లవుల నుండి చోళుల రాజ్యాధికారం మార్పుజెందు కాలానికి సంబంధించింది, కనుక స్థిరమైన పాలన ఈ ప్రాంతంలో యేర్పడి యుండలేదు. ఒక ప్రాంతీయాధికారి ఈ ఉత్తరువును ఇచ్చియుండ వచ్చు.

ఈ విధంగా పల్లవుల పాలన క్రిందనున్న 7వ శతాబ్దితో మొదలగు చారిత్రిక కాలంలో, రాజకుటుంబాలకు చెందిన ప్రాంతీయ సేనాపతులు, పల్లవ ప్రభువుల పాలెగాండ్రు, వేంకటేశ్వరుని ఆలయ సంక్షేమాన్ని కాంక్షించిన వారై, ఉత్సవాల్లోను ఊరేగింపుల్లోను యజ్ఞాది ఇతర కార్యాలలోను పాల్గొనుటకు తగినట్లు ఆ స్వామి క్రొత్త విగ్రహాలను సమర్పిస్తూ, బంగారం పెట్టుబడిగా భూముల్ని కొని వాని ద్వారా లభించు పంటను శాశ్వతంగా సేవలను పండుగలు ఉత్సవాల్లోను, దీపనైవేద్యాది కైంకర్యాలకును వినియోగం ఉండేటట్లు ఏర్పరచారు. ఈ పల్లవుల కాలమున వేంకటేశ్వరుని పోలిన ప్రతిమలు మూడు ప్రతిష్ఠింపబడ్డాయి.

తరువాతి చోళుల కాలంలో, 10వ శతాబ్దారంభం నుండి, 40 కళంజు బంగారాన్ని ఆలయాలలో దీపారాధన నిమిత్తం మలైనాడుకు చెందిన కొడుంగోళూరాన్ అనే పేరు గలవాడు మొదటి పరాంతకుని 29వ పాలన సంవత్సరంలో (క్రీ.శ. 936) (ఇదే గ్రంథంలోని అంశం 12) నిక్షేపించినట్లు తెలిసి వస్తున్నది. ఇదే చోళరాజు పాలనవత్సరం 20లో (క్రీ.శ. 927) మరియొక దీపకైంకర్యం చేయబడినట్లున్నది. కాని ఆ చేసిన వ్యక్తి పేరు, 13వ శాసనంలోని శిథిలమైన భాగంతోపాటు, అజ్ఞాతంగ ఉండిపోయింది (ఇదే గ్రంథం).

తరువాత క్రమంలో వచ్చేది, 52 కళంజు బరువుండి, 6 కెంపులు, 4వజ్రములు, 28ముత్యములు పొదుగబడిన బంగారు పట్టము (స్వామి ఫాలభాగాన్ని అలంకరించే రేకు వంటి ఒక ఆభరణం) కానుకగా 2వ పరాంతకుడనబడే సుందరచోళుని (ప్రసిద్ధుడైన 1వ రాజరాజచోళుని తండ్రి) ప్రధాన దేవేరి, ఆ గొప్ప చేర రాజు కుమార్తెచేత, ఆమె సవతి కుమారుడైన రాజరాజ చోళ-1 (క్రీ.శ. 1001) పాలన వత్సరం 16లో, తిరువేంగడదేవర్ (వేంకటేశ్వరుడు) కోసం చేయబడిన సమర్పణ (ఇదే గ్రంథమున అంశము 14).

16వ అంశం ఒక అసంపూర్ణ శాసనం. దీనిలో 'నందా', 'ఉలగమా', 'ముడైయానుక్కు', 'ఇరుబత్తొంబదు', అన్న పదాలు కనిపిస్తాయి. దీనిని బట్టి, తిరువేంకటం-ఉడైయాన్ సమక్షమున శాశ్వతముగ ఒక దీపము వెలిగించడానికి 1వ రాజరాజచోళుని సహచర రాణియైన ఉలగమాదేవి 29గోవులను సమర్పించినట్లు భావించదగును.(29 కళంజు కంటె ఇదే సముచితమని తోస్తున్నది).

15, 17 సంఖ్యగల అంశాలలో, అరుళాక్కి లేక మూవేందవేళాన్ అని పేరుగల ఒకటవ రాజరాజు యొక్క (క్రీ.శ. 985-1016) అధికారి, నెం. 15లోని 1వ రాజరాజు యొక్క చారిత్రక పరిచయం క్రింద, ఒక దీపసేవ నిమిత్తం 40కళంజు బంగారాన్ని నిక్షేపించినట్లు తెలుస్తూన్నది. ఈతడు కావేరీనది యొక్క దక్షిణ తీరాన గల శోణాడుకు చెందినవాడు.

మొదటి రాజరాజు కుమారుడూ వారసుడునూ అయిన మొదటి రాజేంద్ర చోళుని పాలన కాలంలో, **బ్రహ్మమారాయన్-మునైయడరయన్** అని కూడ పేరుగల కోతూరు (ఇప్పుడు లేదు) యజమానియైన **రాయన్- రాజేంద్ర-చోళన్** అనే పేరు గలవాడు, తిరుపతికి ఉత్తరానగల పర్వతపాదంలో ప్రత్యక్షంగా తెలియబడేటట్లు శ్రీ కపిలేశ్వరునికి ఒక ఆలయాన్ని నిర్మించినట్లు 20వ అంశంలో తెలియవస్తున్నది.

మొదటి రాజేంద్ర చోళుని పాలన కాలానికి చెందిన 19వ అంశం వలన మన దృష్టికి వచ్చే విషయం: అధికారి (గవర్నర్) కొఱ్రమంగళము డైయాన్ ఒక పాలనాపరమైన విచారణను నిర్వహించాడు. ఇది వారు అంగీకరించిన 24 ద్వీపాలలో, అందుకు ధనాన్ని స్వీకరించినట్లు (ఒక శిలాశాసనంలో ఉన్నట్లు), 22 దీపాలు మాత్రమే వెలిగించిన తప్పుకు తిరుముండియంకు చెందిన సభైయార్‌పై నిర్వహింపబడింది. ఇదిగాక మిగిలిన 23 పొణ్ణు (బంగారు నాణాలను తిరుచానూరులోని వేంకటేశ్వరుని మూల ధనాన్ని కలుపడానికి కొండపై దేవునికి తిరుచానూరు నుండి పంపబడే మిగత నిత్యసంబారాలతో కలిపి దేవుని మందిరంలో దీపాలు వెలిగించే నిమిత్తం అవసరమైన ఘృతాన్ని పంపవలెనని, తద్వారా ఒక కర్పూర దీపంతో కలిపి మొత్తం 24 దీపాలను తిరువేంకటదేవుని సేవకులు, నిర్వాహకులు వెలిగించునట్లును, తాను జారీ చేసిన ఆజ్ఞలను ఉల్లంఘించడంవల్ల ఈ విచారణ జరుపబడింది.

ఈ శాసనాన్నిబట్టి, ఈ సభ లేక కమిటీ తిరుచానూరు నుండి తిరుమలలో వేంకటేశ్వరుని ఆలయ విషయాలనన్నిటిని నిర్వహిస్తూ ఉండేదని, దాని పక్షంలో కానుకల్ని దానాలను గ్రహిస్తూ, నిత్యావసర

వస్తువుల్ని సంబారాలను యేర్పాటు చేస్తూ, అక్కడగల ఒక గిడ్డంగిని కూడ వారే నిర్వహిస్తూ పర్యవేక్ష ణాధికారాన్ని చేస్తూవుండినారని తెలుస్తోంది. ఆ కారణంగానే పల్లవుల కాలంలోను, చోళుల కాలంలోను దీపారాధనకును నైవేద్యం నిమిత్తంగాను, ఇవ్వబడిన భూదానాలు, సువర్ణ నిక్షేపాలను, తిరుచానూరులో లిఖించబడి ఉన్నాయి. **క్రీ.శ 12వ శతాబ్దం వరకు గల కాలంలో తిరుచానూరులో కాని లేక తిరుపతిలోకాని ఏ దేవతకైనను ఒక ఆలయమున్నట్లు కన్పడదు.** తిరుచానూరుకు ప్రాముఖ్యము, అది పాలనాధికారులు ఎడనెడ మజిలీ చేయుటకు తమ అధికారానికి లోబడిన ప్రాంతాలలో పర్యటించేటప్పుడు అనుకూలముగ ఉండటం వలన, అక్కడ రాజధనంతో ఒక దర్బారు గృహం ఆ ప్రయోజనసిద్ధికై నిర్మింపబడటం వలన తెలియవస్తున్నది. ఈ శాసనంలో, తిరుచానూరు గ్రామం తిరుమండియంతో కూడ, వేంకటేశ్వర దేవునకు దేవదానంగా ఇవ్వబడినదని వ్రాయబడి ఉంది. ఒకటవ కులోత్తుంగ చోళుని కాలంనాటి (క్రీ.శ 1070-1120) 21వ శాసనాంశం నుండి తెలియవచ్చే దేమంటే, తిరుచానూరుకు పడమట రెండు ఫర్లాంగుల దూరమున నున్న నేటి యోగిమల్లవరం గ్రామం ఆనాడు తిరుచానూరులో అంతర్భాగమే యనియు, అక్కడి ఆలయంలో ఆరాధింపబడు దేవతపేరు తిప్పలాదీశ్వర ముడైయ-మహాదేవుడు (శివలింగం) అనియు, ఆ దేవతకు దేవదానంగా పూర్వము నేడు ముందలపూడి అనబడుచున్న నాటి మున్నైప్పుణ్ణి గ్రామమనియు. ఈ మహాదేవుడిప్పుడు పరాశరేశ్వరుడని పిలువబడుచున్నాడు. అందుకు కారణము బహుశః పరాశర మహర్షిచేత ఆ స్వామి పూజింపబడుటే కావచ్చును. ఆ మహర్షి విగ్రహము ఆ ఆలయములోనున్నది.

నెం. 34 తిరుచానూరు శాసనం 3వ రాజరాజదేవచోళుని కాలమైన క్రీ.శ.1221కి చెందినది. దీని నుండి తెలిసేదేమంటే, తిరుచానూరు నధిష్ఠించిన దేవత, ఇప్పుడు సుందరరాజస్వామిగా పిలువబడుచున్న స్వామి, నాడు మొట్టమొదటిసారి స్వామి అలగియ పెరుమాళ్ అనియు, పొక్కారన్ పాండియ దరైయన్ అనేవాడు ఒక భూఖండాన్ని చదునుచేసి, దానిని సేద్యానికి అనుకూలపరచి, అచటి కైక్కోళులకు (నేత పనివారికి) అప్పగించి, తమిళ మాసమైన పంగునిలో (మార్చి-ఏప్రిల్) ఆ స్వామికి ఉత్సవం జరిపించుటకు వారిని ఒప్పించెనని. ఆ క్షేత్రం ఆ దేవతకు ప్రాచీన కాలంలోకి దానంగా ఇవ్వబడిందని చెప్పబడింది.

నెం. 36శాసనం ననుసరించి తిరుచానూరుకు చెందిన సభైయార్ తిప్పలాదీశ్వరుని ఆలయానికి సంబంధించిన జమాఖర్చులను నిర్వహించె ననియు, ఈ ఆలయ స్థానత్తార్ దాని యొక్క మతధార్మిక విషయాలను నిర్వహించాడని తెలుస్తోంది.

3వ రాజరాజచోళుని (క్రీ.శ.1235) పాలన కాలంలో 19వ సంవత్సరానికి చెందిన శ్రీ గోవిందరాజస్వామి ఆలయశాసనం నెం.40 నుండి, అప్పటికి కొంతకాలం ముందు, గ్రామాల సమూహమైన నాడుకు చెందిన సలహా సంఘ సభ్యులు, పెరియనాట్టవర్, ప్రాంతీయమైన కుడువూర్ నాడు గ్రామ సమూహానికి సంబంధించిన వారు అయి యుండవచ్చు. శ్రీ తిరుమంగైయాళ్వార్ ప్రతిమను శ్రీ గోవిందప్పెరుమాళ్, తిరుపతి ఆలయంలో ప్రతిష్ఠించినట్లును, ఆ స్వామి అముదుపడి (నైవేద్యం), శాత్తుపడి

(పుష్పాలంకారం, చందన లేపనం మొదలగు సేవలు) వీనికై యేర్పాటు గావించుటకు వారు సర్వసభ్యసమావేశంగా తిరువిళంకోయిల్ (కొత్తగా నిర్మింపబడిన మందిరం) నకు అనుసంధానంగానున్న సభాభవనంలో తిరుచానూరులో సమావేశమై, కుడవూరార్ అను కుడవూరు వాసులిచ్చిన భూదానాన్ని అంగీకరించారు. దీనిని బట్టి ఒక నాడుకు సంబంధించిన భూదానాలను ఆ నాడుకు చెందిన సలహాసభ అంగీకరించ వలసి ఉందని తెలుస్తోంది. (ఆ గోవిందరాజ విగ్రహం ప్లాస్టిక్‌తో చేయబడినదని యాదృచ్ఛికంగా మాకు తెలియవచ్చింది) ఆ దానక్షేత్రం నుండి పంటను శ్రీ భండారం పర్యవేక్షకులు వసూలు చేయవలసి ఉంది. ఈ కాలంనాటికి, అనగా క్రీ.శ 13వ శతాబ్ది యొక్క రెండవ పాదం నాటికి, తిరుమల వేంకటేశ్వరుని ఆలయ స్థానత్తార్ యును శ్రీభండారమున్న తిరుచానూరు సభైయార్ పర్యవేక్షణ నుండి స్వతంత్రులై, తమ పర్యవేక్షణాధికారుల, తిరువేంగడముడైయన్‌కు చెందిన తదితరుల ద్వారాను, బహుశ. గోవిందరాజుల ఆలయానికై ప్రత్యేకమైన ఉద్యోగులు గాని కమిటీగాని లేని కారణంగా, శ్రీ గొవింద ప్పెరుమాళ్‌వారి ఆదాయంతో బాటు లావాదేవీలన్నిటిని చూస్తుండేవారు.

గోవిందరాజు ఎప్పుడు ప్రతిష్ఠింపబడ్డాడో, ఆలయనిర్మాణం నెప్పుడెవరు చేసిరో, ఈ వివరాలు ఈ శాసనంలోకాని ఇంతకు ముందటి కాలం నాటి గ్రంథాలలోగాని పేర్కొనబడలేదు. ప్రజలు విశ్వసించు చున్నట్లు, ఆ గోవిందరాజప్రతిష్ఠను ఆలయ నిర్మాణాన్ని శ్రీరామానుజులు (క్రీ.శ1017- 1137 మధ్య 120 సంవత్సరములు వారు జీవించిరి) చేసియుండ వచ్చును. లేక 11వ శతాబ్దిలోనో 12వ శతాబ్దిలోనో, క్రీ.శ 1120లో కులోత్తుంగుని మరణం తర్వాత, ఒక గాధ ప్రకారం, గోవిందరాజు విగ్రహాన్ని ఒక చోళ రాజు చిదంబరం వద్ద సముద్రంలో పారవేయగా, వానివలని భయంతో రామానుజులు శ్రీరంగం నుండి మైసూరులోని మేల్కోటేకు ప్రాణరక్షణార్థం పారిపోయి ఉంటాడు. ఇది ప్రచారంలోనున్న సాంప్రదాయిక కథ. వారు చిదంబరం వద్ద సముద్రం నుండి తెచ్చిన గోవిందరాజ విగ్రహం సుమారు రెండడుగుల ఎత్తుగల చిన్న విగ్రహమైనందున, ఆలయంలో మధ్యనున్న శయనించి యున్న పెద్ద విగ్రహంగా ఒక ప్రక్కకు బత్తిగిలి పరుండియున్న 5 లేక 6 అడుగుల పొడవుగల విగ్రహముగా తగిన అవయవముల పొందికతో, లక్ష్మి, బ్రహ్మ, మహర్షులు, మొదలగు దేవతలతో కూడి, సిద్ధపరుపబడింది.

నెం.40,41 తిరుచానూరులోని తిరువిళంకోయిల్‌ను ప్రస్తావించినాయి. దాని నిర్మాణకాలాన్ని గురించి ఎట్టి సమాచారం ఇవ్వలేదు. అట్లే ఏ దేవతను ప్రతిష్ఠించిరో, ఎవరు ప్రతిష్ఠించిరో కూడ ఇవ్వలేదు. (ఇట్టిదే నెం. 43, 118, 119, 120 (129), 137, 144 కూడ). బహుశః అది అళగియ పెరుమాళ్ ప్రతిష్ఠాపనకు సంబంధించింది కావచ్చు (నెం.34). నెం. 42 ఒక శాసన శకలం. ఈ నాయకుడెవరో బహుశః సైన్యాధికారి, నెల్లూరు వాడైన తెలుగు చోళరాజు మధురాంతక పొత్తపి-చోళ అల్లుందిరుక్కాళత్తి దేవుని పాలన కాలంలో 5వ సంవత్సరంలో వేంకటేశ్వరునకు భూమి దానం చేసినట్లు ప్రకటించాడు. ఈ తెలుగు చోళరాజు పాలన ఆ కాలంలో కాంచీ వరకు సాగినట్లు కూడ అందులో చెప్పబడింది. ఆ రాజు పాలన కాలంలో 5వ సంవత్సరమంటే క్రీ.శ.1255 అవుతుంది.

నెం. 43లో మనకు తెలియజేసేదేమంటే, స్థానత్తార్ విన్నపాన్ని అనుసరించి, కుడవూర్‌నాడు, తొండపాడిప్పళ్ళు గ్రామవాసులయొక్క అగరప్పళ్ళుకు చెందిన వారియవిమానత్తాన్ యొక్క సిఫారసువల్ల, వీర నరసింగదేవ యాదవరాయలు బలపఱచినందువల్ల, కోరబడిన భూమిని నాయనార్ జటా వర్మన్ సుందరపాండ్య-1 (క్రీ.శ.1251-1275) తమ తిరుముఖంలో యాదవరాయలు తమ ఓలై (రాజాజ్ఞ) ద్వారా స్థానత్తార్‌కు తెలియపరచినట్లు మంజూరు చేసి, ఇది పాండ్యరాజు పాలన కాలంలోని 3వ సంవత్సరం (క్రీ.శ.1254) నుండి అమలు జరుగుతూ, తిరువేంగడ ముడైయాన్‌వారి ఆలయ ప్రయోజనముల కివ్వడమైంది. ఈ భూమి తిరుళంకోయిల్‌లోని కర్ర గడతో కొలవబడింది.

నెం. 44లో వీరనరసింగదేవ యాదవరాయలు సుందరపాండ్యుని పాలన కాలంలో 12వ సంవత్సరంలో (క్రీ.శ. 1263) అమలయ్యేటట్లు, పాదిరివీడు గ్రామాన్ని, దాని పంటతో తిరువేంగడముడైయాన్ వారికి నిత్యకైంకర్యం జరిగేటట్లు, దానం చేస్తూ ప్రకటించిన అజ్ఞ పొందుపరచ బడింది.

నెం. 45,46, 1వ జటావర్మన్ సుందరపాండ్య ప్రశస్తిని (సైనిక కృత్యాలను స్మరించి కీర్తిని, స్తుతిని) ప్రకటిస్తుంది. ఆతడు చంద్రవంశభూషణ మని, కేరళ జాతి విధ్వంసకుడైన మధురాధినాథుడు/మాధవుడని, లంకను కొల్లగొట్టిన రెండవ రాముడనీ, చోళవంశపర్వతానికి వజ్ర సముడనీ, కాఠకులు (కాడవులు, పల్లవులు) అనబడే గజయూథానికి పాకల (జ్వరం) అనీ, నానా శత్రువుల కొండ-కోటల విధ్వంసకు డనీ, వీరగండగోపాలుడు అను అరణ్యానికి కార్చిచ్చు అనీ, కాంచీనగరవైభవ ప్రభువనీ, (కాకతీయ) గణపతియను జింకకు పెద్దపులి యనీ, సామంతరాజ స్థాపకుడు అనీ, మహారాజాధిరాజులకు స్వర్గానికి పంపినవాడనీ, రాజ దండకుడనీ, ఇత్యాది ప్రశంసలు క్రుమ్మరిస్తాడు.

నెం.45 కడపట, వాని పాలన కాలంలోని 14వ సంవత్సరానికి వ్యతిరేక[1] సంవత్సరంలో అనగా క్రీ.శ. 1266లో, పూర్వపు ఉత్తర్వులను ధ్రువపరుస్తూ ఇచ్చిన ఆజ్ఞ ఉంది. ఇది, నెం. 55లో కూడ, కావేరీనది యొక్క దక్షిణ తీరంలో దక్షిణానికిగల రెండు గ్రామాల దానాన్ని చేర్చిన ఉత్తర్వు.

---

1. రాజుల పాలన కాలాలలో వ్యతిరేక సంవత్సరం **ఎదిర్-ఆండు,** అనేది ఆ సంవత్సరంలో కొంతకాలం ముందుగా రాజ్యం, రాజ్యాధికారం చేజారిపోయి, అటు తర్వాత అదే సంవత్సరంలో మరల వారికి చేజిక్కటాన్ని సూచిస్తుంది. కేరళదేశాన్ని, అనగా తిరువాన్మూరును, కావేరీ ప్రాంతపు చోళదేశాన్ని, కాంచీ నుండి నెల్లూరు వరకు గల పురాతన పల్లవభూమిని జయించి 14సంవత్సరాలు విజయవంతంగా పరిపాలించిన వీరవిజేత జటావర్మన్ సుందర పాండ్య-1, 14వ సంవత్సరాంతంలో లేక 15వ సంవత్సరారంభంలో తన రాజ్యాన్ని సామ్రాజ్యాన్ని కోల్పోయేటట్లు ఎలా ఓడిపోయాడో మహాశ్చర్యం. దీనినే ఈ శాసనం వ్యతిరేక సంవత్సరంగా పేర్కొన్నది. వానిచేత పరాజితులైన రాజులెవ్వరూ అతణ్ణి రాజ్యభ్రష్టుని, సింహాసనభ్రష్టుని చేయగలిగినంత బలవంతులుగా భావింపబడటానికి వీలులేదు. బహుశః వాని సహపాలకుడైన విక్రమ పాండ్యుని వలన ఇది జరిగి ఉంటుంది. ఏది యేమైనప్పటికీ, ఆతడు తన సింహాసనాన్ని, సామ్రాజ్యాన్ని తిరిగి వ్యతిరేక సంవత్సరంలో, అనగా, క్రీ.శ. 1266కు సరియగు తన 15వ సంవత్సర పాలన కాలంలో పొందాడు.

నెం. 47 నుండి 56 వరకు శాసనశకలాలు. ఇవి సుందర పాండ్యుని ప్రశస్తిలోని కొన్ని అంశాలను ప్రస్తావిస్తాయి.

నెం. 49 సుందరపాండ్యదేవుడు శ్రీ వేంకటేశ్వరుని ఆలయ విమానంపై ఒక హేమకలశాన్ని స్థాపించినట్లు చెబుతున్నది.

నెం. 50, 52 ఆతడు తనను తానే అభిషేకించికొన్నట్లు, అంటే తనకు తానే వీరాభిషేకం చేసికొన్నట్లు, నెం. 51, అచటనే, కాంచిలో రాజమకుటాన్ని ధరించినట్లును ప్రకటిస్తాడు.

నెం. 57లోని విషయం: పర్వతపాదంలో కపిలతీర్థం దగ్గర వానేడుత్త కైయళగియార్, పల్లవరాయర్ అను మారుపేరుగలవాడు, 13వ శతాబ్ది చివర (పే.69, సంపుటి 1), నమ్మాళ్వారులకు ఆలయాన్ని నిర్మించినట్లుంది. ఈ నమ్మాళ్వార్ గుడిలోని నెం.58 శాసనం వారిని మునిగా, తటాకం (చెఱువు) వద్ద బోధకుడుగా ఉండి దివ్యజ్ఞానాన్ని పొందినవానిగా పేర్కొంటుంది. ఆ ముని దివ్యత్వాన్ని గురించిన పరిపూర్ణ జ్ఞానాన్నిపొంది, కరుణతో బ్రహ్మవిద్యను నరులకు ఉపదేశిస్తాడని భావం. నెం.165 వానినే పెరుమక్కళ్, తిరుమల పాదం దగ్గరగల శ్రీవైష్ణవులచే ఆదరింపబడినవాడని పేర్కొంటుంది.

నెం.59లో తెలియవచ్చేది. 33 గోవులు, 1 వృషభము, తిరువేంకట ముడైయాన్ సన్నిధిలో శాశ్వతంగ దీపం ఉంచడానికి, దానికి అవసరమగు నేతిని ఆ గోవుల క్షీరం నుండి పొందేటట్లు బహూకరించబడినాయి. దీపారాధనకోసం పూర్వముండే 30 లేక 40 కళంజు బంగారాన్ని సమర్పించే ఆచారంతో పోల్చిచూస్తే ఇది ఒక క్రొత్త విధానంగా కన్పిస్తుంది. ఈ బహూకరణ తెలుగు పల్లవరాజు విజయగండ గోపాలదేవుని (క్రీ.శ. 1250–1285) పాలన కాలంలో 9వ సంవత్సరంలో అణ్ణన్ పెరుమాళ్ ప్రియన్ అనే పేరుగలవాడు చేశాడు. గోవులదానం ఆలయానికు చాలా ప్రయోజనకరం ఎట్లనగా, వాని పాలు, పెరుగు నైవేద్యానికి ఉపయోగ పడతాయి.

నెం. 61లో శ్రీ గోవిందరాజులకు నిత్యము తిరుమొళి పఠించునప్పుడు చేయవలసిన తిరుమొళి–పడి నిర్వహణకును వైకాశి నెలలో (మే-జూన్) జరిగే ఉత్సవంలో నైవేద్యానికి, శ్రీ వేంకటేశ్వరునికి నిత్య కైంకర్యాల కోసం, చిత్తిరై(2) (ఏప్రిల్–మే)లో జరిగే ఉత్సవ సమయంలో తిరుమలలో సేవలకు ఏర్పాట్లు ప్రస్తావించబడినాయి. ఇది విజయగండగోపాలుని (క్రీ.శ.1264 లేక 1274 లేక 1284 అయినను కావచ్చు) పాలన కాలంలో 4వ సంవత్సరానికి చెందింది.

(శ్రీ గోవిందరాజుల ఆలయంలో తిరుపతిలో ఎప్పుడు ఎవరిచేత నిర్మించబడినదో, విగ్రహం, దాని గురించి, 11 లేక 12 శతాబ్దాలలో శ్రీ రామానుజుల జీవితకాలమున క్రీ.శ.1137లో వారి మరణానికి ముందుగా, క్రీ.శ.1120లో చాళుక్యచోళరాజైన మొదటి కులోత్తుంగుని మరణం తర్వాత ఉత్సవ విగ్రహాన్ని చిదంబరం వద్ద సముద్రంలో పారవేశాడనీ, వాని నుండి మరణభయంవలననే శ్రీరంగం నుండి వారు

మైసూరులోని మేల్కోటెకు పారిపోయినారని ఒక చారిత్రక కథనం[1]. అట్లే, శ్రీ గోవిందరాజులకు వైకాశీ ఉత్సవం ఎప్పుడెవరిచేత ప్రారంభించ బడిందో తెలియదు. గోవిందరాజుల ఆలయంలో లభించిన శాసనాలలో అతిపురాతనమైనది 40వ నంబరుగలది, 3వ రాజరాజ చోళుని పాలన కాలంలో 19వ సంవత్సరానికి సరియగు క్రీ.శ. 1235కు చెందింది కనుక, గోవిందరాజు ఆలయం క్రీ.శ. 1235కు ముందు, 13వ శతాబ్ది ఆరంభంలో నిర్మించబడిందని చెప్పడానికి అవకాశ మేర్పడుతోంది. తిరుమంగై-ఆళ్వార్ ఆలయం, వారి ప్రతిష్ఠ 4 లేక 5 సంవత్సరాలు ముందుగా, సుమారు క్రీ.శ.1230 ప్రాంతానికి శ్రీ గోవిందరాజుల ఆలయ ప్రాంగణంలో క్రీ.శ.1235కు కొంత ముందుగా తిరుమంగై-ఆళ్వార్ విగ్రహం ప్రతిష్ఠించ బడినట్లు, ఆ స్వామి నిత్యనైవేద్యానికై భూమినిచ్చినట్లు, దానిని పెరియ- నాట్టవర్ అంగీకరించినట్లు చెప్పబడినందున. నెం. 61 వైకాశి ఉత్సవం తేదీ విజయ గండగోపాలుని పాలనకాలపు 4వ సంవత్సరం (4కు ముందు 3 లేక 4 అక్షరాలు శిథిలం కావడంవల్ల) క్రీ.శ.1264 లేక 1274నకు సరియైన 14వ, 24వ లేక 34వ దైనను సంవత్సరం, బహుశః 14వ లేక 24వ సంవత్సరం అయి ఉంటుంది. నెం. 86 నుండి తెలియవచ్చేది: వీరనారసింగదేవ యాదవరాయల రాణి, వారి పరిపాలన 30వ సంవత్సరంలో (క్రీ.శ.1235) శ్రీ గోవిందరాజుకు ఆణి (జులై) నెలలో ఉత్సవం జరుగేటట్లు స్థాపించాడు. ఇదియును, వైకాశి ఉత్సవాన్ని (జూన్) విజయనగరరాజుల కాలం కొరకు కొనసాగాయి. కాని, ఆ తరువాత ఈస్ట్ ఇండియా కంపెనీ వారి పాలనలో మొదటి రెండు మూడు దశాబ్దాలు 19వ శతాబ్దిలో, ఆణి ఉత్సవం నిషేధించబడిన ట్లున్నది. ఇప్పుడు వైకాశిలో ఉత్సవం మాత్రమే జరుగుతూ ప్రచారంలో ఉంది. ఈ ఉత్సవం 8వ రోజున ఉపయోగింపబడు పెద్ద కొయ్యరథము సుమారు ఒక దశాబ్దం క్రింద శిథిలమైంది. క్రొత్త రథాన్ని తయారు చేసి 1972లో వాడుకలోకి తేబడింది.

శ్రీ గోవిందరాజు ఆలయంలో ముఖద్వారానికి ఎదురుగా మధ్యలో నిలబడి ఉన్న విగ్రహం, మూడు గోపురాలును, పార్థసారథి (మహాభారత యుద్ధంలో అర్జునుని రథసారథియైన శ్రీకృష్ణుడు) ఇదియే రెంటిలో పురాతనమైనదై ఉంటుంది. దాని నానుకొని, దానిలోనికి చొచ్చుకొని ఉండే **గోవిందరాజుల ఆలయం 12వ శతాబ్ది చివరగాని లేక 13వ శతాబ్ది మొదటగాని నిర్మింపబడినట్లు కన్పడుచున్నది.** శాసనాలన్నిట్లో గోవిందరాజు ప్రస్తావనమే ఉండగా, 13వ శతాబ్ది తరువాత ఒక్క ప్రస్తావనకూడా పార్థసారథిని గురించి కానరాదు. ప్రస్తుతం ఆ దేవుని మూర్తి కప్పబడి ఉంది, ఆ ఆలయం మూయబడింది, పూజ జరుగడం లేదు. కారణం, విగ్రహం వికలాంగమైనందున పూజార్హం కాకుండుట. ఇదెప్పుడు ఎట్లు జరిగిందో తెలియదు. ఒక వేళ ఇది గోవిందరాజ ప్రతిష్ఠకు పూర్వమే జరిగినదైతే, పార్థసారథి తొలగించబడి గోవిందరాజు అదే గుడిలో, వానికై క్రొత్త దేవళాన్ని నిర్మించక, ప్రతిష్ఠింపబడి ఉండేది.

---

1. Sri Ramanuja in Karnataka - Dr.B.R.Gopal (1976) - A Study Based on Inscriptions.

తిరుపతికి పడమట, **'నరసింహతీర్థం'** అని పిలువబడు మంచినీటి చెఱువు యొక్క పడమటి గట్టు మీద పరిత్యజింపబడిన ఒక పెద్ద నీలపు జాతివిగ్రహం గోవిందరాజుది పడి ఉంది. అది కిరీటాగ్రం నుండి పీఠం వరకు ఎనిమిది అడుగుల కంటె ఎక్కువ పొడవు ఉంది. ఇది గోవిందరాజు ఆలయంలో పూజలందుకొనుచుండి, శిథిలమైనందున, పరిత్యజింపబడి చెఱువుగట్టు మీద నుంచబడిందని ప్రజల విశ్వాసం. ఆలయంలో నెప్పు డున్నదో, ఎప్పుడెట్లు శిథిలమైందో తెలియదు. బహుశః అతుకులతో ఉన్న ఈ చిన్న విగ్రహం దాని స్థానంలో ఉంచిన మరియొకటి, చిదంబరం వద్దగల సముద్రంలో చోళరాజుచేత పారవేయబడింది, తెచ్చి ప్రతిష్ఠించబడి ఉంటుంది. కాని శాసనాలలో నెం. 40లోని యాదృచ్ఛిక మైన ఆ మూర్తి ప్లాస్టిక్‌ది అన్న ప్రస్తావన తప్ప, **"తిరుప్పతియిల్ చిత్రమేళి - విణ్ణగరాన శ్రీ గోవిందప్పెరుమాళ్ కోయిలిల్" ఎక్కడనూ ఆ ప్రస్తావన లేదు.**

క్రీ.శ.1310 ప్రాంతము నుండి 17వ శతాబ్దపు 3వ లేక 4వ పాదం వరకు దక్షిణదేశ మాలిక్ కాఫర్, ఔరంగజేబ్‌ల నేతృత్వంలో జరిగిన మహ్మదీయుల దాడులవలన ఈ త్యక్తవిగ్రహం శిథిలం చేయబడి ఉంటుంది. ఔరంగజేబ్ ఆ కాలంలో షాజహాన్ క్రిందనున్న దక్కన్ గవర్నరుగా ఉన్నాడు. లేక, గోల్కొండవాడైన సుల్తాన్ అబ్దుల్లా వలన కూడా ఈ గోవిందరాజు ఆలయంలో అప్పటి పార్థసారథి విగ్రహం (పూజలేక మరుగునబడింది) ఉత్సవ విగ్రహమనే అభిప్రాయం ఉంది.

పల్లవ రాకుమారి సామవై, తిరుమల నధిష్ఠించిన దైవమైన శ్రీవేంకటేశ్వరుని ఆకృతిలో వెండితో మనవాళప్పెరుమాళ్ విగ్రహాన్ని చేయించి, ప్రతిష్ఠించి, దానిని నఖశిఖపర్యంతం అమూల్యాభరణాలతో అలంకరించి, ప్రతిష్ఠించి, శాశ్వత దీపార్చనకును నైవేద్యాన్ని ఏర్పరచి, ఆ మూర్తికి పురట్టాశి మాసంలో (సెప్టెంబర్) 11 రోజులపాటు జరుగునట్లొక ఉత్సవాన్ని, మార్గళి నెలలో (డిసెంబర్) మరియొక ఉత్సవాన్ని జరుగున ట్లేర్పాటు గావించి విశాలమైన సుక్షేత్రం దానికోసం బహూకరించాడు. (నెం. 8,9 ముందు జెప్పబడినాయి). నెం. 61లో విజయగండ గోపాలుని 14వ లేక 24వ పాలన సంవత్సరానికి సరియైన క్రీ.శ. 1264 లేక 1274లో, తమిళ మాసం చిత్తిరై (మే) లో వేరొక ఉత్సవానికి ఏర్పాటు జరిగినట్లు 10 ఉత్సవాలు ఏర్పాటైనవి. ఇవి తిరుపతిలోని శ్రీ గోవిందరాజుకై జరిపించ బడినాయి. తిరుమల శ్రీ వేంకటేశ్వరునకు జరుపబడే ఈ 7 లేక 10 ఉత్సవాలలో పురట్టాశి పంగుణి నెలలో జరుపబడు రెండు ఉత్సవాలలో మాత్రమే 8వ రోజున ఊరేగింపుకు రథం ఉపయోగించునట్లు కనబడు తోంది. (నెం. 96,113, సంపుటి-11) గోవిందరాజస్వామి విషయంలో ఎట్లో, అట్లే తిరుమల శ్రీ వేంకటేశ్వరుని విషయంలో కూడ, పురట్టాశి నెలలోని ఉత్సవం ఒక్కటి తప్ప మిగత నెలలలో జరుగు ఉత్సవాలన్నియును 19వ శతాబ్దిలో నిషేధింపబడినట్లు తెలుస్తున్నది. పురట్టాశి ఉత్సవ మొక్కటే నేటికిని జరుగుతూ ఉంది.

నెం.62, ఒక దీపాన్ని, ఒక అప్పపడి (బియ్యపు పిండి బెల్లం కలిపి నేతిలో ఉడికించిన ఒక తియ్యని రొట్టె) శ్రీ వేంకటేశ్వరునికి సమర్పించడానికి వీలుగా 3 గండగోపాల-మాడై (రాజుపేరిట బంగారు నాణాలు, వాని అధికార వైశాల్యాన్ని సూచించేవి) నిక్షేపించినట్లు చెబుతుంది.

నెం.63,64 తిరువేంగడముడైయన్ వారికి మూడు దీపాల నిమిత్తం విజయగండగోపాలుని రాణియైన దేవరశియార్ గోవులనిచ్చినట్లు నమోదు చేసినవి.

నెం.67లో పురట్టాశి నెలలోని ఉత్సవంలో దీపార్చనకై 32 గోవులు, ఒక ఎద్దున్ను, శ్రీ వేంకటేశ్వరుని సన్నిధిలో శాశ్వతంగా ఘృతదీపం ఉంచడానికి, కర్పూర దీపాన్నివెలిగించడానికి 15మాడై ఇచ్చినట్లుంది.

నెం.68,69లలో వేంకటేశ్వరునికి ఉదయ సంధి కాలాల్లో రెండు పూజలు జరిగే సమయంలో, నైవేద్యాలకై 450 **వరాహన్-పణమ్** (వరాహ దేవుని ముద్రగల రాగి లేక వెండి నాణాలు) నిక్షేపించబడినట్లున్నది. శ్రీ వేంకటేశ్వరుని ఆలయంలో వారికై నైవేద్యానికై బియ్యాన్ని కొలిచే కొలతను **'ఉచ్చియిలేనిన్ఱ-నారాయణన్,** అందురని నెం. 68 తెలుపును. ఈ శబ్దమున కర్థం. కొండపై ఉచ్ఛస్థానంలో నిలిచి మూర్తిగా ఉన్న నారాయణుడు అని అర్థం. నెం. 74లో, ఇది కేవలం 'నిన్ఱాన్' అని ఉంది. తరువాత ఈ రేకు, **మలైక్కినియ-నిన్ఱాన్-కాల్,** అనగా మరక్కాల్ లేక తుంబు అనిమార్చబడినది. ఇది 13వ శతాబ్ది ప్రథమార్థంలో **'మలైకినియ-నిన్ఱ-పెరుమాల్'**ను వాని ఇద్దరు నాచ్చిమార్‌లతో కలిపినప్పుడు వాడుకలోనికి తేబడినది. గోవిందరాజ ఆలయంలో ఉపయోగంలో ఉన్న కొలత **'చాళుక్య-నారాయణన్-కాల్'** అని పిలువబడుతుంది.

నెం.70 కూడా విక్రమాదేవి పురానికి చెందిన ఒక సాలెవాడు (చేతపనివాడు) ఒక తిరుప్పోనకం (పెసరపప్పు, మిరియము, ఉప్పు, నెయ్యి కలిపి ఉడికించిన బియ్యపు అన్నము) యేర్పాటు కొరకు 450 వరాహన్ – పణం నిక్షేపించినట్లున్ను, ఈ పదార్థములను ఆలయకొట్టం/లోని శ్రీభండారానికి సమర్పించేటట్లు చెబుతాడు.

నెం.71,72లో ఒక కొందరు సాలెవారు, సగం **నందావిళక్కు** (అఖండదీపం) (Perpetual Lamp) కోసం, మరియొక 8వ వంతు దీపం కోసం, బహుశః మొత్తం కలిపి నెం. 164లో ప్రస్తావితమైన ఎనిమిదింట మూడవ వంతు దీపంతో కలసి, ఒక పూర్తి దీపం వెలిగించే యేర్పాటు వ్రాయబడి ఉన్నది.

నెం.73లో తిరువేంగడం-ఉడైయాన్ ఉత్సవ సందర్భంలో మంటపంలో వేంచేసి యుండగా నైవేద్యమిక్కడకుద్దేశింప బడిన మూలధనంగా 3 మాడై(బంగారు నాణాలు) విక్రమాదేవిపురపు సాలీయుల పెద్ద పేరున ఉత్సవవిగ్రహానికి గాని ఉత్సవంలో నైవేద్యమిచ్చేటట్లు ఇక్కడ మొదటి సారి తెలియవస్తున్నది.

నెం.74లో వేంకటేశునకు చిత్తిరై, పురట్టాశి మాసాలలో రెండు ఉత్సవాల ముచ్చట ఉంది. ఈ సందర్భంలో, శ్రీ ఆండాళ్ రచించిన తిరుప్పావై పఠించే సమయంలో నైవేద్యానికి తిరుప్పావై-పడి యేర్పాటు గురించి ఉన్నది. విజయగండ గోపాలుని పాలన కాలంలో 14వ లేక 24వ సంవత్సరానికి సరియగు క్రీ.శ.1264 లేక 1274నకు చెందిన నెం. 61లో, శ్రీ గోవిందరాజునకు వైకాశి ఉత్సవసందర్భంలో నిత్యం **తిరుమొళి-పడి** యేర్పాటును గురించి చూచాము. నెం. 74లో, తిరుప్పావై – పడిని సమకూర్చడానికి కొన్ని **గండపాలన్-మాడై** బహూకరింపబడినట్లు తెలుస్తోంది. ఇందు మూలంగా, తిమిళ్-ప్రబంధం కాలంలో

పన్నెండుగురు వైష్ణవ-ఆళ్వారులచే రచింపబడిన 4000 చతుష్పదులను (నాలాయిర దివ్యప్రబంధాన్ని) ప్రత్యేకించి కులశేఖర ఆళ్వార్, పెరుమాళ్ తిరుమొళి, తిరుమరుగై-ఆళ్వారుల తిరుమొళి, గోదాదేవి చెప్పిన నాచ్చియార్-తిరుమొళి, ఆండాళ్‌వారి తిరుప్పావైయును పఠనమారంభింప బడినట్లు, ఆ విధంగా రెండు ఆలయాలను వైష్ణవాచారం క్రమంగా ముంచెత్తి నట్లు తెలుస్తున్నది.

నెం. 75 పురట్టాశి, చిత్తిరై నెలలోని వేంకటేశ్వరుని రెండు ఉత్సవాలను గూర్చి ముచ్చటిస్తుంది.

నెం. 77 మాడై అను బంగారు నాణాన్ని, పురాతన చిహ్నాలుగల మాడై, బహుశః ఏడున్నర వరాహ-పణాలతో సమానంగా ప్రకటించినట్లు తోస్తుంది.

నెం.78 ఒక పుష్ప-మంటపాన్ని, ఆ తోటలో ఒక ద్వారమంటపాన్ని తిరుమలలో నిర్మించినట్లును, ఏదేనొక ఉత్సవంలో స్వామివారి ఉత్సవ విగ్రహానికి ఉత్సవ కాలంలో అప్పపడి నొకటి నైవేద్యం కోసం మూలధనంగా మూడు మాడలు, విజయగండ గోపాలుని పాలనకాలపు 5వ సంవత్సరం (క్రీ.శ. 1255)లో ఇచ్చినట్లు నమోదు చేస్తున్నది.

నెం.79గల ఆరు ఖండాలలో నెం.డిలో సౌమ్య వత్సరం,రామానుజుడు, ఎమ్బెరుమానార్‌లను గూర్చి ప్రసక్తి ఉంది. 13వ శతాబ్ది యొక్క 3వ, 4వ పాదాల కాలానికి సరియైన విజయగండ గోపాలుని పాలనకాలాన్ని ఈ శాసనఖండాలు చెందినవి ప్రత్యక్షంగా కనబడుతూ ఉన్నందున, ఈ మూడు పదాలు బహుశః తిరుమల దేవాలయంలో చాంద్రమాన సంవత్సరమైన సౌమ్యలో శ్రీరామానుజుల ప్రతిష్ఠను సూచిస్తుంది. ఆ కాలంలో లేక కొంత ముందువెనకల గాని (క్రీ.శ.1248-9) వాని కైంకర్యాన్ని ఏర్పాటు చేయబడింది. ఇది క్రీ.శ.1137-38లో రామానుజుల నిర్యాణానికి సుమారు 110 సంవత్సరాల తర్వాతి కాలానికి చెందిన విషయం.

తిరుక్కాళత్తిదేవ యాదవరాయుని పరిపాలన కాలంలో 19వ సంవత్సరానికి (క్రీ.శ.1209-10(పేజి.103, సం.I) చెందిన నెం.81, వాని ఉత్తర్వుకు సంబంధించింది. ఇది కుడవూర్ గ్రామాన్ని పూర్తిగా, తిరుమల స్థానత్తార్ కోరికపై, అవిలాల సభలో చర్చించిన మీదట, ముందుటి దేవదానాన్ని విస్తరించి ఆ స్వామి సేవకై శాశ్వతమైన యేర్పాటుగా తిరువేంగడ ముడైయన్ ఆలయానికివ్వటాన్ని గురించి చెప్పేది. హద్దురాళ్ళను విష్ణువు సుదర్శన చక్రపు గుర్తుతో ముద్రించాలని, తద్వారా ఈ భూమి దేవునిదని సూచింపవలెనని కూడ ఇందు శాసించబడింది. నిత్యకైంకర్యానికి ఉత్సవ సేవలకును తగినంతగా వనరులు లేనందున స్థానత్తార్ ఈ పెంపును కోరినట్లు తోచును. క్రీ.శ.1254లోని (నెం.43) పాండ్యరాజు భూదానం తర్వాతి కాలానికి చెందింది.

నెం.82 **తిరుక్కాలత్తిదేవుని కుమారుడైన వీర రాక్షస యాదవరాయలు,** మూడవ కులోత్తుంగ, చోళుడయి ఉండవచ్చును. (క్రీ.శ.1193) ఒక చోళ రాజుని పాలనకాలపు 15వ సంవత్సరంలో కుడవూర్ నాడులోని

భూమిని దానం చేసిన దానికి సంబంధించింది. ఇది మూడవ కులోత్తుంగ చోళుని పాలన కాలపు 15వ సంవత్సరం లోనే శ్రీకాళహస్తీశ్వరునకు **తిరుమన్తిర- తిరుప్పోనకం** కొరకు చేసిన దానాన్ని పోలింది. (సం.1, పే.104)

నెం. 84, వీరనారసింగదేవ యాదవరాయని పాలనకాలపు 12వ సంవత్సరంలో (క్రీ.శ.1217) (సం.1, పే. 105), వారి రాణియైన యాదవ రాయనాచ్చియార్, వేంకటేశ్వరుని సన్నిధిలో 2నేతి దీపాలను వెలిగించుటకై 64 గోవులను, 1 ఎద్దును బహూకరించిన సందర్భానికి చెందింది. నెం.85 ఆమె ఆ రాజు పాలన కాలపు 15వ సంవత్సరంలో (క్రీ.శ. 1220) గోవిందరాజు సన్నిధిలో ఒక దీపం పెట్టడానికి 32 పెద్ద గోవులను, 1 ఎద్దు దానం చెబుతుంది.

(ఈ ముగ్గురు యాదవరాయల కాలాల క్రమంలో, అంటే తిరుక్కాళత్తి దేవ, వాని కుమారుడు వీరరాక్షసుడు, వీరనారసింగదేవుడు, వీరిక్రమంలో వీరి తేదీలు ఒక దానినొకటి అధిష్ఠించి ఉండటం కానవచ్చును. (చూడు, సం.1, పే. 103-105). బహుశః వీరరాక్షసుడు చిన్న వయసులోనే మరణించాడేమో అనిపిస్తుంది. తర్వాతి కాలంలో వాని ప్రసక్తి లేకపోవడం దీనికి బలాన్ని ఇస్తుంది. ప్రాత తొండమండలపు దక్షిణ ప్రాంతపాలనాన్ని వీరనరసింహునికి స్వేచ్ఛగా వదలి, తిరుక్కాళత్తిదేవుడును, ఘట్టిదేవుడు, రాజమల్లుడును నెల్లూరును తదితర ప్రాంతాల్లో పాలించి ఉంటారు).

నెం. 86లో రాణి యాదవరాయనాచ్చి పయిండప్పళ్లి గ్రామంలో సగభాగాన్ని శ్రీ గోవిందప్పెరుమాళ్‌కు ఆణి మాసంలో జరిగేటట్లు తానేర్పరచిన ఉత్సవంలో అయ్యే ఖర్చుల నిమిత్తం, ఒక కూటాన్ని (శిఖరం అలంకారంగానుండే కలశం) ఏర్పరచి, గోవిందరాజు కోసం తాను నిర్మించిన నాలుగు ముఖాలుగల రథాన్ని కొప్పున యేర్పరచడానికి, మరికొన్ని వస్తువుల కోసం బహూకరిస్తూ, మిగత సగం గ్రామం తిరువేంగడముడైయాన్ వారి శ్రీభండారానికి చెందినదైనందున మినహాయింపుగా వదలివేస్తూ, వీరనారసింహ యాదవరాయని పాలనలోని 30వ సంవత్సరంలో వారి దేవేరి సమర్పించిన ట్లున్నది, (క్రీ.శ.1235), (సం.1, 106,118).

వీరనారసింగదేవ యాదవరాయల పాలనలో 34వ సంవత్సరానికి (క్రీ.శ. 1239) చెందిన నెం. 87, **మలైకినియనిన్ఱార్** లేక **తిరువేంకటనాథన్** అనువాడు తిరువేంగడముడైయాన్ కొరకొక దీపానికై 32 గోవులను దానమిచ్చినట్లు చెబుతాడు.

వీరనరసింగదేవ యాదవరాయడు తన పాలనలో 40వ సంవత్సర ములో (క్రీ.శ. 1245) వేంకటేశ్వరుని ఆలయస్థాన్‌త్తార్‌నకు, ప్రధానాలయ పునరుద్ధరణను చేపట్టిన దేశాంతరి (ఇంకో ప్రదేశానికి చెందిన పరదేశి) **తిరుప్పుల్లాణిదాసర్**ను ఆ కార్యక్రమం ఆరంభించడానికి ముందుగా దాని గోడల మీద కనబడే శాసనాలను పని పూర్తియైన వెనుక ఉత్తరపు మూలన బైటివైపు గోడపై మరల చెక్కించునట్లున్న ఆజ్ఞను నెం.88 పొందుపఱచును. రాజుగారి ఉత్తర్వు తమిళ నెల అర్పశి లో జారీయైనది, కాగా, పునరుద్ధరణ

కార్యక్రమం పూర్తియై వారి పాలనలో 40వ సంవత్సరంలో చిత్తిరై నెలలో ఆ శాసనాలు గూడ మరల చెక్కబడినాయి. అనగా, ఆరు నెలల్లో మొత్తం పని పూర్తి చేయబడింది. ఈ రాజాజ్ఞ క్రింద 4 శాసనాలు మరల చెక్కబడినాయి. క్రమ సంఖ్యలు 8,9,14,19.

నెం.89 తిరుపతిలో శ్రీ గోవిందరాజు ఆలయంలోనిది, వీరనారసింహ యాదవరాయల పాలనలోని 50వ సంవత్సరము (క్రీ.శ.1255)నకు చెందినది. ఇందు, ఈ సంవత్సరం నుండి శ్రీవైష్ణవులు దీపాలను, పూల దండలను వైష్ణవ ఆచార్యుడైన **ఎంపెరుమనార్ రామానుజు**ని ఆలయానికై సమర్పించునట్లున్నది. నెం.79డి ప్రకారం వారు చంద్రమాన సంవత్సరం సౌమ్యలో, అనగా క్రీ.శ.248–49లో ప్రతిష్ఠింపబడిన ట్లుండగా, ఇప్పుడు క్రీ.శ.1255లో అటు తర్వాత ఆరు సంవత్సరాలకు, వారికి దీపార్చన పుష్పహారార్చన ఏర్పరచబడినాయి.

వీర నారసింహయాదవరాయల పాలనకాలపు 51వ సంవత్సరం (క్రీ.శ.1256) లోనిది నెం.90. దీనితో తిరుపతికి చెందిన శ్రీవైష్ణవులు అదే సంవత్సరపు ఆడి నెల నుండి అమలగునట్లు ఒక దస్తావేజును వ్రాశారు. దాని ప్రకారం **'యాదవ-నారాయణ్'** పేరుతో ఒక పూదోటను పెంచుటకు అనుమతించబడింది. అట్లే, వేంకటేశ్వరుని అలంకారానికై **పెరియమాంబట్టు** గ్రామంలో స్వామివారి అలంకారార్థం ఒక ఎఱ్ఱ తామర కొలను తవ్వడానికి కూడా అనుమతి యివ్వబడింది. ఈ గ్రామం గోవిందరాజుకు దానమీయ బడింది. ఈ కొలనుకై తిరుపతిలోని పెద్ద చెఱువు నీటిని ఉపయోగించ వచ్చును. నెం.91 ఒక సంస్కృత శ్లోకంలో, వీరనారసింహదేవ (యాదవ రాయలు) యుద్ధంలో తన శత్రువుల్ని జయించినాడని, రాజ చిహ్నాలైన పూదండ, ఏనుగు, వెల్లగొడుగు, తదితరాలను స్వీకరించినాడని తన ఎత్తు బంగారాన్ని తూచి (తులారోహణం)ఆ బంగారాన్ని శ్రీ వేంకటేశ్వరుని ఆలయానికి సమర్పించి, తద్వారా వేంకటగిరిని (తిరుమలను) సురగిరి (మేరుపర్వతం)తో సమానం చేసెనని చెప్పును.

నెం.93, వీరనరసింహదేవయాదవరాయని పాలన కాలంలో నెల్లూరుకు చెందిన **తేవప్పెరుమాళ్** అనునాతడు వేంకటేశ్వరునికై ఒక దీపం నిమిత్తం గోవుల్ని, ఒక వృషభాన్ని బహూకరించినట్లు చెబుతాడు.

నెం.94 వీరనారసింహ యాదవరాయల భూదానాన్ని నమోదు చేస్తున్నది.

శ్రీ గోవిందరాజుల ఆలయంలోని నెం.98 చాంద్రమానవత్సరం కీలకకు సరియైన శకసంవత్సరం 1230 (క్రీ.శ.1308)నకు చెందింది. ఇది శ్రీగోవిందరాజుల నిత్య అభిషేక నైవేద్యాలకు కైశికద్వాదశి (కార్తిక మాసంలో), మార్గళి ద్వాదశి (డిసెంబరులోని ముక్కోటి ద్వాదశి), మకర సంక్రమణం జనవరి 15న వచ్చే చలికాలపు అయనం), చిత్తిరైవిషు (తమిళ సంవత్సరాది), చిత్తిరై నెల మొదటి రోజు, ఎప్రిల్ మధ్యలోనిది), ఇట్టి ప్రత్యేక సందర్భాల భారతదేశమున మాలిక్ కాఫర్ దండయాత్రల వలన కలిగిన రాజకీయ సంక్షోభ సమయం. కనుక ఈ శాసనంలో యే రాజు పేరుగాని లిఖించబడక కేవలం చాంద్రమాన సంవత్సరం, శక సంవత్సరం మాత్రమే పేర్కొనబడినాయి. ఈ శాసనం, హైందవ పంచాంగమునసరించి కొన్ని పవిత్ర దినాలలోను ఆ దేవతకు ప్రత్యేక పూజల నిమిత్తం జరుపబడిన యేర్పాటును ఉట్టంకిస్తాయి.

శ్రీవేంకటేశ్వరుని ఆలయంలోని నెం.99, తిరువేంకటనాథ యాదవ రాయల రాజాజ్ఞను నమోదు చేయును. ఇది ఆ రాజు యొక్క పాలన కాలంలో 8వ సంవత్సరానికి ప్రతియగు (వ్యతిరేక వత్సరమైన సంవత్సరపు ఆడి నెలకు చెందింది, వాని పాలన కాలపు 9వ సంవత్సర ఆడి నెల నుండి (సుమారు క్రీ.శ.1330-31) ప్రారంభమయ్యే టట్లు పొంగలూర్ గ్రామంలో 10 భాగాలలో 5 భాగాలను సర్వమాన్యంగ ఎటువంటి పన్నులు లేకుండ, **తిరువేంగడముడైయాన్ యొక్క ఆడి నెలలోని ఉత్సవంలో నైవేద్యఖర్చుల నిమిత్తం, రేచయ దండనాయకుని పేరున సింగయదండనాయకుడు స్థాపించినట్లు ప్రకటించబడింది.** మిగత 5 భాగాల గ్రామం ఆ గ్రామదేవతకు పూర్వమే దానమీయబడినది. దాని చివర, ఉపసుంకాలతో సహా దాదాపు 40 విధాల సుంకాలు విధించరాని పన్నులుగా ఒక జాబితా ఇవ్వబడింది.

(జటావర్మన్ సుందరపాండ్య-1 విషయంలో వాని పాలనలోని 14వ ప్రతి సంవత్సరం (వ్యతిరేక సంవత్సరం), క్రమ సంఖ్య 45 (పే.146)లో గమనించినట్లు, ఇక్కడ **తిరువేంకటనాథ యాదవరాయల** విషయంలో వాని పాలనలో 8వ సంవత్సరానికి ప్రతి సంవత్సరం ఉన్నట్లు గమనిస్తాం. ఇది వాని పాలనలో 8వ లేక 9వ సంవత్సరం ఉన్నట్లు గమనిస్తాం. ఇది వాని పాలనలో 8వ లేక 9వ సంవత్సరంలో అతడు తన రాజ్యాన్ని రాజాధికారాన్ని కోల్పోయి 9వ సంవత్సరంలో తిరిగి పొందినట్లు సూచిస్తున్నది. అందువలన తిరిగిపొందిన 9వ సంవత్సరపు పాలన లెక్క గట్టబడుతుంది. దీనిని వాని ఉత్తర్వు వానిపాలనలోని 9వ సంవత్సరము నుండి అమలవుతున్న ప్రకటన సూచిస్తున్నది. ప్రాచీన చోళ, పాండ్య వంశములంతరించగా, వారి పాలెగాంద్రు ప్రభుత్వాధికారం కోసం పోరాడుకొన్నారు. అప్పుడు హోయసళు డైన మూడవ వీరబల్లాళుడు ద్వారసముద్రాన్ని త్యజించి తిరువణ్ణామలైలో రాజ్యాన్ని స్థాపించి క్రీ.శ.1342-43వరకు పాలించారు. బహుశః **తిరువేంకటనాథ యాదవరాయలు** వీరబల్లాళుని తిరువణ్ణామలై దండయాత్రను ప్రతిఘటించి పరాజితుడై యుండును)

నెం.100,101, ఒక దాని నకలు మరియొకటి. ఇవి గోవిందరాజుల ఆలయంలోనివి. ఇవి వేంకటేశ్వరుని తిరుపతి గ్రామాన్ని సర్వమాన్య (పన్నులులేని) గ్రామంగా మార్చడాన్ని నమోదు చేస్తుంది. ఈ గ్రామాన్ని పూర్వదానం సందర్భంగా చాల విధాల వన్నుల భారాన్ని మోసినది. ఆ జాబితా నెం. 100కు అనుబంధం చేయబడింది. ఇది తిరువేంకటనాథ యాదవరాయల పాలనలోని 12వ సంవత్సరానికి (క్రీ.శ 1333-1334) చెందింది.

నెం.102 పొణ్గళూర్‌ను అన్ని సుంకాల చెల్లింపు నుండి మినహాయించి, తిరువేంకటనాథ యాదవరాయలువారు తమ పాలనలో 12వ సంవత్సరంలో, ఆ గ్రామంలో సర్వమాన్య గ్రామంగా అనుమతించడానికి సంబంధించింది. ఈ కాలం నెం. 99 ననుసరించి నిర్ణయం. ఈ ఆజ్ఞ **ఆడి-తిరునాళ్,** సంధి సమయాలలోని సేవలకుద్దేశింపబడి చేయబడింది. ఈ సేవలు సింగయ- దన్నాయక్కర్ అనేవారు **రేచయ-దణ్ణాయక్కర్** అనే పేరుగల వారి పేరున వేంకటేశ్వరుని కోసం యేర్పర్చబడినవి. ఈ రాజాజ్ఞ

శ్రీవేంకటేశ్వరుని ఆలయ స్థానత్తార్‌నకు తెలుపబడింది. ఆ తర్వాత **సింగయ-దణ్ణాయకుడు** స్థానత్తార్‌కు ఆ గ్రామంలోని పంటను పై జెప్పిన ఆడి ఉత్సవానికి, సితకరగండన్ సంధికిని మాత్రమే కాక, వీరనరసింగ-పెరుమాళ్, తిరుమంగై ఆళ్వార్‌లకు తిరుపతి లోను, ఆపై సితకరగండన్-కంఠంలో నిత్యం 32 శ్రీ వైష్ణవులకు భోజనం ఏర్పాటు చేయుటకు, నిల్వధనంతో తిరుమలలో ఒక పూదోటను, చలివేంద్రాన్ని మిగతదానాలకు వినియోగించేటట్లు కోరాడు. స్థానత్తార్ అన్నిటిని అంగీకరించి ఊతిపైన, రాగిరేకులపైని దస్తావేజును వ్రాయించినట్లు స్పష్టము.

నెం.103, **శ్రీరంగనాథ యాదవరాయల**ను రాజు తన పాలనలో 3వ సంవత్సరంలో (క్రీ.శ1339-40)(సం.1,పే.111), తిరుపతిలోని పెద్ద చెఱువు నుండి ఎంబెరుమానార్-రామానుజులకు, బహూకరించబడిన క్షేత్రాలకు నీటిని సరఫరా చేయడానికి ఉత్తర్వులిచ్చినట్లు నమోదు చేసింది. అది తిరువేంగడముడైయాన్‌కు బహూకరించబడియున్నందున తిరువేంగడ ముడైయాన్‌కు **తిరుమున్-కాణిక్కై** క్రింద (బహుమతి లేక రుసుం) 200 పణాన్ని చెల్లించిన పిమ్మటనే ఈ ఏర్పాటు అమలు జరుపాలని ఉత్తర్వు.

నెం.104, తిరుమలలోను, తిరుపతిలోను రెండు మఠాల (మతధార్మిక సంస్థలు) మహాప్రధాని **ఇమ్మడి-రాహుత్తరాయన్ మాదప్పన్- సింగయ దణ్ణాయక్కర్** స్థాపించినట్లును, కొందరు సన్యాసుల అధీనంలో వానినుంచి నట్లు, 1000 పణాలు ఒక జీయర్ నుండి వసూలుచేసి, ఆ రెండు మఠాలను, రెండు నందనవనవనాలను (పూదోటల్ని) వానికి నివాసంగా నర్పించినట్లును ప్రకటిస్తాడు.

(దీనితోనే, సింగయ దండనాయకునిచే రెండు మఠాల స్థాపనయు, పూదోటల్ని, వానిని దేశాంతరి-జీయర్ నకు వాని పోషణ సౌకర్యంతో, క్రీ.శ.1339-40లో, ఆలయంలో వాని సేవ నిమిత్తం సమర్పించడంతోనే, ఆలయంలో జీయర్‌లు కార్యకర్తలగుట ప్రారంభమై, తర్వాతి కాలంలో ఆలయయాజమాన్యంలో జోక్యం కలిగి (సం.1,పే.113), ఆపై 'ధర్మకర్త' అను హోదా సంపాదించబడి ఉంటుంది. వారు ఇద్దరు మతధార్మిక సన్యాసులు, ఒకరు పెద్దవారు, మరియొకరు చిన్నవారు. పెద్దవారు జీయర్ లేక జీయంగార్. దక్షిణ దేశస్థుడైన ఒక తెంగల వైష్ణవ బ్రాహ్మణుని ఎంపికచేసి వాని యువాధికారిగా నియమించారు. పెద్దవారి స్థానం ఖాళీయైనప్పుడు యువకుడు దాని నాక్రమించి మరియొకనిని యువస్థానంలో నిలుపుతాడు. తిరుమలలోను, తిరుపతిలోను వారికి వేర్వేరుగా రెండు మఠాలున్నాయి. ఆ రెండు ఆలయాల నుండి కొంత భాగం ప్రసాదాలుగా, కొద్దిపాటి ధనాన్ని పారితోషికంగా వానికి అందుతూ ఉండేవి. వారికి ఏకాంగులు అను సహాయకులు, వారి విధులలో ఉత్సవాలలోను దేవాలయ సేవలలోను సహకరించేవారు).

నెం.104 ప్రకారం, **ఒకవేళ జీయర్ తన కొరకు చేయబడిన ఏర్పాటును అనుభవిస్తూ మరణిస్తే, ఆ ఆస్తులు ఆ దండ నాయకునికే తిరిగి చేరుతుంది. అప్పుడాతడు ఒక దేశాంతరిని శ్రీ వేంకటేశుని సేవలో**

**ఆతడు శ్రీభండారం లోనికి 400పణములు చెల్లించిన తర్వాత నియమిస్తాడు.** ఇలా నియమితు లైనవారు ఆ స్వామి యొక్క ఉత్సవ విగ్రహాలు 4వ ఉత్సవ దినంలోను, పార్వేటోత్సవదినంలోను, అరిశాణాలయన్ నందవనం, వణ్‌శఠకోపన్ నందవనంలోను వేంచేసి యుండగా వారి సేవలకై శ్రీభండారంలోని మూలధనంగా ఉంచబడిన 100 పణాలపై వచ్చే వడ్డీని ఉపయోగించాలి. ఇది శ్రీరంగనాథయాదవరాయల పాలన కాలంలో 3వ సంవత్సరాలకు (క్రీ.శ.1339-40) చెందింది.

నెం.105 శ్రీరంగనాథుని పాలనలో 9వ సంవత్సరం నాటిది (1345-46) పాదియవేట్టై రోజున చేయవలసిన కైంకర్యాలను ప్రస్తావిస్తుంది.

నెం.106, శ్రీరంగనాథయాదవరాయని పాలన కాలపు 19వ సంవత్సరానికి (క్రీ.శ.1355-56). శ్రీ వేంకటేశ్వరుని ఉత్సవవిగ్రహం దీనిలో మలైక్కినియనిన్ట-పేరున, వానితోకూడ ఊరేగింపులో కలసి చేదియరాయ మంటపంలో ఉత్సవాలన్నిటిలో, 4వ రోజున కూర్చొని ఉన్న వాని రాణులు నాచ్చియార్‌తో సహా, అవసరమైన సకల పదార్థాలు ఆలయకొట్టం నుండి సరఫరా కాగా, సేవింపబడవలెను. తళువక్కుల లేక పల్లవరాయర్ శ్రీ భండారంలోనికి సమర్పించిన 400 పణాల పై వచ్చు వడ్డీతో ఇది జరుపబడాలి.

(మలైక్కియనిన్ట-పెరుమాళ్, వాని దేవేరులిద్దరు **'నాచ్చిమార్' శ్రీదేవి**యు **భూదేవి**యు, వీరి పేర్లు ఇక్కడనే మొదటిసారి కనబడుచున్నవి. నెం. 104, 'నాచ్చిమార్' అని యున్నను 'మలైక్కినియనిన్ట-పెరుమాళ్' అన్నది లేదు. ఆ భాగం శాసనం శిథిలం కావటం కారణం. కాబట్టి ఈ మూడు ఉత్సవ విగ్రహాలను క్రొత్తగ ప్రతిష్ఠింపబడి వాడుకలోనికి తేబడి ఉంటుంది. ఇది సుమారు క్రీ.శ.14వ శతాబ్ది రెండవ పాదమధ్యకాలంలో జరిగి ఉంటుంది. ఇది సుమారు స్పష్టమైన కారణం, 7వ శతాబ్దంలో వాని ఉత్సవాలకు యేర్పాటుతో సహా, సామవైచేత ప్రతిష్ఠింపబడిన మణవాళ్ పెరుమాళ్ వెండి మూర్తి చాలా చిన్నది. కుడి ఎడమల్లో శ్రీదేవి భూదేవులు లేని కేవల శ్రీనివాసమూర్తి విగ్రహం. కనుకే ఆ స్వామి మిగత ఉత్సవాలకు ప్రక్కనుంచబడి, క్రొత్త మూర్తులు సిద్ధం చేయించబడినాయి.

అదియుగాక, ఈ లేఖనం చివర, ఈ దేవతకు నైవేద్యాన్ని దానమిచ్చే వారికి ప్రసాదంలో నాల్గవ వంతును స్వీకరిస్తూ అధికారం కల్పింపబడినట్లు, ఒక ఒప్పందం కనిపిస్తుంది. ఇది క్రొత్త ఏర్పాటు వేంకటేశ్వరుని నైవేద్యానికై ఏర్పాటు చేసిన విషయంలో ఇట్టిది ఇంతకు ముందు మన దృష్టికి రాలేదు.

నెం.74,75లలో పురట్టాశి, చిత్తిరై నెలలో రెండు ఉత్సవాలు జరుగు చున్నట్లున్నది. నెం. 73,78లలో, బహుశ ఆలయానికి బైట, కొన్ని మంటపాలలో నైవేద్యమివ్వడానికి ఏర్పాట్లున్నట్లు చెప్పబడినాయి. ఈ నాలుగు శాసనాలు స్పష్టంగా తెలుగు-పల్లవరాజు విజయగండగోపాలుని కాలానికి చెందినవని తెలుస్తోంది. అవి ఆ రాజు పాలనలోని 5వ సంవత్సరమును, గండగోపాలక మాడై, కేవలం మాడై అని ప్రస్తావిస్తుంది. కావున, ఈ నాలుగు శాసన ఖండములు క్రీ.శ. 1255-1260 ప్రాంతపు కాలము నాటివై ఉండవచ్చు. ఏ యొక్క విగ్రహం లేక విగ్రహద్వయం లేక త్రయం నాలుగు వీధులలో ఊరేగింపులోను, పూదోటలలోని

మంటపాలకు చేర్చబడినవో, రథంపై ఆ సమయంన ఎన్ని విగ్రహాలు ఉంచడానికి అవకాశ మున్నదనే దానిపై అది ఆధారపడి ఉంది.

నెం.107 శ్రీరంగనాథ యాదవరాయని పాలనకాలంలో యేదో ఒక సంవత్సరానికి చెందింది. ఇది తిరుమలలోని ఉత్సవ విగ్రహాలకు ఉత్సవాలలో ఆలయద్వారం వద్దను, వేరెక్కడైన కూర్చొని ఉండగా తిరువాయ్‌మొళి పఠనాన్ని వినేటపుడు (తమిళ ప్రబంధంలో ఒక భాగం), తిరుప్పోనకమును సమర్పించుటను గూర్చినది.

(నెం.61లో, **క్రీ.శ.1264 ప్రాంతంలో శ్రీ గోవిందరాజుల ఆలయంలో తిరుమొళి పఠనాన్ని ప్రవేశపెట్టిన విషయముంది.** నెం. 74లో **క్రీ.శ. 13వ శతాబ్ది ద్వితీయార్థంలో, శ్రీ వేంకటేశ్వరుని ఆలయంలో ఆండాళ్ వారి తిరుప్పావై పఠనాన్ని ప్రవేశపెట్టినట్లుంది.** నెం. 107లో, ఇక్కడ శ్రీ వేంకటేశ్వరుని ఆలయంలో **తిరువాయ్‌మొళి** పఠనానికి14వ శతాబ్ది 3వ పాదంలో ప్రవేశపెట్టినట్లు కనుపిస్తుంది. ఇట్లు ఈ రెండు ఆలయములును ఆ కాలానికి వైష్ణవ క్రియాకలాపములతో నిండి పోయినవి).

నెం.109 **తమిళ పద్యఛందస్సులో ఉంది.** విషయం, శ్రీ రంగనాథ యాదవ రాయలు, తమ శత్రురాజులనోడించి, వారు తమ పట్టణాలను విడిచి కొండలలో నివసించేటట్లు చేసి, తన గాయపడిన ఛాతీని పూల మాలతో అలంకరించికొని, వెంకటాచలంపై స్థిరాస్తిగా, తన పాలనకాలపు 16వ సంవత్సరంలో (క్రీ.శ 1352-53) తన కొరకొక రాజభవనాన్ని నిర్మించికొన్నాడు. బహుశః నేటి శ్రీ హథీరాంజీ మఠం తిరుమలలో మహంతులకు చెందినదైయుంటుంది.

నెం.110 బిరుదుల్ని పట్టిక చేస్తుంది: యుద్ధంలో రాముడు, చంద్ర వంశాలంకారుడు, చాళుక్య-నారాయణుడు. ఇది శక సంవత్సరం 181కి సరియైన చాంద్రమాన సంవత్సరం వికారి, అనగా శక సంవత్సరం 1281కి చెందింది. ఈ కాలం బహుశః శ్రీరంగనాథ యాదవరాయల పాలన కాలానికి సంబంధించింది. ఇది 24వది, వాని పాలనలో చివరిది అవుతుంది (క్రీ.శ.1360) కనుక ఆతడు మొదటి హరిహరునకును, వాని క్రీ.శ.1336 స్థాపించబడిన విజయనగరానికి సంబంధించిన 'సంగమ వంశం' వారు. బహుశః ఈతడు వారిని సేవించి ఉంటుంది. (సం.1, పే.111)

నెం.113, యాదవరాయని పాలనకాలవు ఒకానొక సంవత్సరంలో శ్రీమహానాయక్కర్ అను బిరుదుగల ఎఱమంచి పెరియపెమ్మా-నాయక్కర్, అనే వ్యక్తి, తిరుమలలో వసంతోత్సవాన్ని అతడు సేవించికొన్నప్పుడు శాశ్వత దీపానికై దానంగా 32 గోవులను 1 ఎద్దును ఇచ్చినట్లు ప్రకటించును. **ఈ నాయక్కర్‌కు భాషగె తప్పువ రాయరగండ (ఇచ్చిన మాట తప్పు వారలను శిక్షించువాడు) అని కూడ బిరుదముంది. ఈ యాదవరాయడు బహుశః శ్రీరంగనాథయాదవరాయడే కావచ్చును.**

నెం. 114, అట్టి 32 గోవులు, 1 ఎద్దున, తిరువేంగడన్-ఉడైయాన్ వారికి ఒక నందావిళక్కు అనగా శాశ్వత దీపానికై పాప్పునాయక్కర్- పెమ్ము-నాయక్కర్, శ్రీమాన్ **మహానాయంకరాచార్య అనియు, భాషగె**

**తప్పువ-రాయరగండన్** అనీ బిరుదులు గలవాడు చాంద్రమాన సంవత్సర శార్వరి (క్రీ.శ.1361)లో బహూకరించడాన్ని గూర్చి చెప్పేది. ఈ దాత నెం. 113లోని దాతకు తమ్ముడు, ఇద్దరును పాప్పునాయక్కర్ కుమారులు. సోదరు లిద్దరును శ్రీరంగనాథయాదవరాయని కొలువులోని వారైనట్లే తోస్తున్నది. (సం.1, పే.112) బహుశః ఇంతకు ముందటిదైన వికారి నామ సంవత్సరంలో శ్రీరంగనాథ యాదవరాయలు పరమపదించి నందు వల్ల, నెం. 114, రాజు పేరును స్మరించక, చాంద్రమాన సంవత్సరం శార్వరిని మాత్రమే నమోదు చేసి ఉంటాడు.

నెం. 116 ఒక సంస్కృత శ్లోకం. ఇందు శౌరి (విష్ణు) హస్తానికై ఒక ఆభరణాన్ని, రాజు హోబళుడు, జనమనోరంజకంగా సమర్పించెనని చెప్పును. వేంకటేశ్వరస్వామి వరదహస్తానికి ఈ ఆభరణం ఉండటం వైకుంఠతత్వాన్ని సూచిస్తుందని చెబుతుంది. ఆ వైకుంఠత్వగుణాలు శాంతి, సమృద్ధి, అనంతత్వం, ఆనందం మొదలగునవి వేంకటాద్రిపైన మాత్రమే కలుగునని వివరించబడినాయి (సం. 1, పే.142)

నెం. 117 ఒక తమిళపద్యం. ఈ ఆభరణమును ఉత్తర వేంకటాచల దేవునికై **తిరుక్కైమలర్**గా బహూకరింపబడినదనియు చెప్పును. ఆ బహుమతినిచ్చినవారు **ఓబళనాథన్** అను తంజై యాదవరాజు (తంజావూరు). ఈ హోభళుడు లేక ఓబళనాథుడు, తాను తంజావూరు పాలకుడనని చెప్పుకొన్నాడు. వీని కాలంగాని, పూర్వాపరాలగాని తెలియవు. ఆ ప్రాంతపు యాదవరాయలలో ఆతడొక్కడై యుండవచ్చును. లేక మైసూరులోని దేవగిరి నేలిన యాదవరాజులలోని వాడైన కావచ్చు. నెం. 148, ఈ కొండను శ్రీశైలమని పేర్కొంటున్నది.

13వ, 14వ శతాబ్దానికి చెందిన, విజయనగర రాజుల అధికారం బలంగ ప్రతిష్ఠితం కాకపూర్వమే సుమారు 60 శాసనాలు అసంపూర్ణ శకలాలు. ఇవి కొంత సుసంబద్ధంకాని సమాచారాన్ని ఇస్తున్నాయి.

వానిలో క్రమ సంఖ్యలు 162, 163 కలిగినవి మఠాలను, నందన వనములను ప్రస్తావిస్తాయి. ఇవి స్పష్టంగా నెం. 104లో శ్రీరంగనాథ యాదవరాయల పాలనలోని 3వ సంవత్సరానికి చెందినవి. ఇవి జీయర్‌కు **అరిశాణాలయన్, వణ్-శఠకోపన్** పూదోటలను ఉత్సవ విగ్రహముల సేవకై అర్పించినట్లు ప్రస్తావించును. నెం. 162లో మఠం ఆదాయం నుండి ఒక కొన్ని మూర్తులను ఆభరణాలతో రత్నాలతో అలంకరించిన ట్లున్నది. నెం. 163 శ్రీరంగనాథుల 5వ సంవత్సరానికి (క్రీ.శ.1341-42) స్పష్టంగ తెలుస్తోంది. ఇది మూల ఒప్పందాన్ని ధ్రువపరుస్తూ, జీయర్ పరమపదించిన పిమ్మట, ఒప్పుకొన్న మొత్తాన్ని వారి వారసుడు చెల్లించవలెననీ, మఠానికివ్వబడిన అధికారం క్రింద పన్నులను వసూలుచేసి, కైంకర్యాలను, పైజెప్పిన తోటలలోనికి ఆ రెండు ఉత్సవదినాలలో ఉత్సవ విగ్రహాల కొరకు చేర్చవలెననీ ఉంది. నెం.111, నెం.112 అసంగతమైన పలుకులుగల ఫలకాలు. ఇది **"ఇది శ్రీమాన్ మహాప్రధాని ఇమ్మడి- రాహుత్తరాయన్ సింగయ దణ్ణాయక్కన్, సితకరగండన్ అనుబిరుదుగలవాని మఠం"** అని ప్రకటిస్తుంది.

"జయించవలెనన్న నిశ్చయంతో", (విజయ) స్తంభాన్ని స్థాపించి" అనుమాటలతో మొదలగు నెం. 160, బహుశః జటావర్మన్ సుందర పాండ్య-1కు సంబంధించింది కావచ్చు.

నెం.161 అసమగ్రలేఖనం చిత్రమైంది. దానిలో ఇలా ఉంది. "...సర్వోత్తముడైన ప్రభువు పరమపదించగా... సరియైన పద్ధతి ననుసరించుచు..." ఇక్కడ ముచ్చటించినది బహుశః శ్రీరంగనాథయాదవ రాయలు మరణాన్ని గూర్చి. ఈతడు తన పాలనకాలపు 16వ సంవత్సరంలో తన శత్రువులను జయించిన పిమ్మట, నెం. 109లో చెప్పబడినట్లు, జీవించియుండి, బహుశః తన 24వ పాలనకాల సంవత్సరం (క్రీ.శ 1359-60, నెం. 110)లో, కొంత కాలం తర్వాత, వేంకటాచలంపై తాను తనకై నిర్మించికొన్న మహలులో తనవారసుని ఎంపిక తర్వాత, మరణించి ఉంటాడు.

నెం.123, 6 దీపపు శెమ్మెల బహూకరణాన్ని, బహుశః 6 దీపాలు ఆలయంలో వెలిగించడం కోసం నమోదు చేస్తున్నది.

నెం.125, నెం.126 ఎవరో ఒక విస్మరించబడిన ఆళ్వారుకు నిత్యం పాలను సమర్పించడానికై గోవులు దానమివ్వబడినట్లు ప్రకటిస్తుంది. ఈ సేవ యొక్క బాధ్యత సభైయార్ చేత స్వీకరించబడింది. ఆ గోవులనాతడు విలువకట్టి ధర్మనిధిగా స్వీకరించెను. నిజానికి వేంకటేశ్వరుని ఆలయంలో అసలు ఆళ్వార్ అనేవాడే లేడు.

నెం. 27 కులోత్తుంగచోళుడు తన దేవేరి **ఉలగముడైయాళ్**తో పాలించిన కాలానికి చెందింది. తిరుమల నధిష్ఠించి ఉండే ఆళ్వార్ కొరకు ఆ రాజు దేవేరి పాలు పెరుగుల్ని సమర్పించినట్లు దానిలో (3 పంక్తి) 2వ పంక్తి కూడా **నిన్ఱ ఆళ్వార్**ను ప్రస్తావిస్తుంది. కనుక నెం. 125, నెం. 126లలో ప్రస్తావించబడిన ఆ 'ఆళ్వారు' నిస్సందేహంగా శ్రీ వేంకటేశ్వరునే సూచిస్తుంది.

నెం.130, 131 తిరువేంగడముడైయాన్ కోసంశాశ్వత దీపాలను, 310 పణమ్ విలువగల గోవులు, 1 ఎద్దు బహూకరణను గూర్చి చెబుతుంది. దాతలు ఈ ధనాన్ని సమర్పించినట్లు కనిపిస్తుంది.

నెం. 132, స్వామికై నాలుగు దీపాల ఏర్పాటును ముచ్చటిస్తుంది. నెం. 133, నెం. 134, నెం. 135 దీపాల ఏర్పాటును గురించే చెబుతుంది. రెండు దీపాలను, రెండు దీపపు శెమ్మెలను బహూకరించినట్లు తెలుపుతుంది. నెం. 169 32 గోవులు, 1 ఎద్దు, ఒక దీపపు శెమ్మె, దీపానికై, బహూకరింపబడినట్లు చెబుతుంది.

నెం. 150, తంబిరాన్మార్లలో ఒకరైన చేరనైవెన్నాన్ అనే వ్యక్తి **విణ్ణప్పమ్** సేవను నిర్వహిస్తూ (ఆలయ కార్యకలాపాలను ప్రారంభించడానికి అనుమతిని వేడుకోవడం) మంటపాన్ని నిర్మించినట్లు సూచిస్తుంది.

నెం. 151, నెం. 152, నెం. 153, నెం. 154 నైవేద్యానికి చేసిన ఏర్పాటును గురించి ముచ్చటిస్తుంది. నెం. 152 నైవేద్యానికై 400 పణాన్ని నిధిగా యేర్పాటు చేయడాన్ని గురించి, నెం. 154, నెం. 155, 2000 కుళి భూమిని బూకరించటం ద్వారా ముదల్-సంధి, మొదటి నైవేద్యాన్ని అవిట్టం (ధనిష్ఠ) నక్షత్రమునను, ఒక నందావిళక్కు (శాశ్వతదీపాన్ని) యేర్పాటును ప్రస్తావిస్తుంది. నెం.166 కూడా

తిరుప్పోణకం (పొంగలి) యేర్పాటును ప్రస్తావిస్తుంది. నెం.167, నెం.168 పూదోటలనుగురించియు, నెం. 168లో కోడై-తిరునాళ్ (పుష్పోత్సవం) కాలంలో నైవేద్యాన్ని ప్రస్తావిస్తుంది.

తిరుచానూరు దేవళం నుండి 16 అసమగ్ర లేఖనాలున్నాయి. వానిలో నెం. 119 నెం. 120, నెం. 137 తిరువిళంకోయిల్-పెరుమాన్-అడిగళ్, క్రొత్త దేవళంలోని దైవాన్ని, కొంత కళంజు బంగారం నుండి నైవేద్యం ఏర్పాటును గురించి నెం. 118లోను, శోలనాడులోని కొంత భూ బహూకరణ నుండి ఒక సేవ గురించి నెం. 119లోను, కొందఱు బ్రాహ్మణులకు 10 నాణాలు చెల్లించి భోజనవసతిని కలిగించడానికై కొంత భూమిని **తిరువున్నాళికైపురం**గా బహూకరించడాన్ని గురించి నెం. 120లోను, దానితో ఆలయనైవేద్యాన్ని గూర్చి నెం. 137లోను ప్రస్తావించ బడింది.

నెం.121 వసూలు చేయబడిన పన్నుల మొత్తం, బహుశః నిధిగా సమర్పించబడిన ఒక కొంత మొత్తం నుండి ఆదాయంలోని తరుగును భర్తీచేస్తూ, కొన్ని విధాలైన నైవేద్యాలకు చేయబడిన ఏర్పాటును గురించినది. నెం.127, నెం.128, నెం.129 వైష్ణవుల సంరక్షణను, **తిరువేంగడదేవర్** కొరకు దాతల ద్వారా చెల్లింపబడిన 40 కళంజు బంగారంపై ఆదాయం నుండి ఎంపెరుమాన్, అడియార్, 18 నాడులకు చెందిన దానాలు, సేవల్ని ఏర్పాటును గురించింది. నెం.139 నిత్యనైవేద్యాలైన నిశదప్పడిని, నిక్షేపించబడిన బంగారంపై వచ్చు వడ్డీ నుండి ఏర్పాటు గురించినది. నెం.140, 100 కళంజు బంగారం చెల్లింపును గూర్చియు, దానితో **తిరుచ్చోకునూర్ సభైయార్** ధాన్యం పండే భూమిని కొనినట్లును చెబుతుంది. నెం.141 ఒక దీపాన్ని గూర్చి చెబుతుంది. నెం.170,తిరువేంగడ ముడైయాన్‌కు 10 తూంబు(తూము) ధాన్యమును, కూరగాయలు, పప్పుదినుసులు, ఉప్పు, పెరుగు, వక్కలు, తమలపాకులు, గంధం నైవేద్యానికై ఏర్పాటును గురించియు దీపానికై నూనె ఏర్పాటును గురించి ప్రస్తావిస్తుంది. నెం.146 కూడా, 80 వట్టి (పుట్టి) ధాన్యాన్ని, వక్క, తమలపాకులతోను, ఆ స్వామి శరీరాన్ని అభిషేకించడానికై తైలాన్ని, మిగత వస్తువుల్ని ఏర్పాటు చేయడం గురించి చెబుతుంది. నెం.144, గోవిందమ్మాళ్ నారాయణలను తిరువిళం కోయిల్‌ను అళగియ - పెరుమాళ్‌ను, శ్రీబండారం లోనికి చెల్లింపబడిన కొంత ధనాన్ని ప్రస్తావిస్తూ నారాయణ అనగా, తిరుపతిలో ప్రతిష్ఠింపబడినదై **వేంకటనాథయాదవరాయ**నిచే యేర్పరుపబడెను. (నెం.100, నెం.101, సం.1; పే. 102-103 డిటో) **తిరుచానూరులోని దేవత ఉలగియ-పెరుమాల్** (నెం.34, పే. 54-55, సం.1) గోవిందరాజస్వామి.

అసంపూర్ణ శకలాలైన నెం. 171, నెం. 172, నెం. 173, నెం. 175లలో ఈ మాటలు కనబడుతుంది. ఉడైయవర్, రామానుజ, అనంతాళ్వాన్, వేంకటత్తురైవార్ (అనంతాళ్వాన్ మనుమడు), అనంతన్‌పిళ్ళై వేంకటత్తురైవార్, వీరు తిరుపతికి చెందిన ఆచార్యపురుషులలోని వారున్ను, వాజులను, పూదోటయును. **అనంతాళ్వాన్ శ్రీరామానుజుల శిష్యుడని ప్రతీతి.** ఆతడు తిరుమల వేంకటేశ్వరుని సేవలో స్థిరపడినాడు. ఆతడు **తిరుమల గ్రామానికి పడమటగల మంచినీటితో నిండిన ఆళ్వార్ చెఱువును త్రవ్వెనని జనప్రవాదం.** వేంకటత్తురైవార్ అనునాతని కుమారుడు కూడ తిరుమలలో స్థిరపడి, తన దానంగా (నెం.171) నైవేద్య సేవలను, పుష్పమాలాలంకరణను, శ్రీరామానుజుల గంధసేవను తానే నిర్వహించి ఉంటాడు, లేదా అప్పటికే

మరియొకరు యేర్పచియుందురు(నెం. 171, నెం. 172) రామానుజన్ తిరునందనవనం (నెం. 175) అనేదాన్ని సిద్ధం చేసి నిర్వహించి ఉంటాడు. ఆతడు తిరుపతి ఆచార్యపురుషులలో ఒకరని అంటారు. రామానుజుల నిర్యాణ సమయంలో, క్రీ.శ1137-38లో, **వేంగడత్తురైవర్ యువకుడై యుండును, లేదా, ప్రౌఢవయస్కుడై యుండును. ఆతడొకవేళ తిరుమలలో రామానుజుని ప్రతిష్ఠించి ఉంటే, ఆ కాలం క్రీ.శ. 12వ శతాబ్దపు 3వ పాదమై ఉంటాడు.** అప్పుడు, నెం. 79డిలో రామానుజుని ఎంబెరుమానార్ ప్రస్తావనయును, చాంద్రమాన సంవత్సర సౌమ్య (క్రీ.శ.1248-49) ఆయన నైవేద్యాలకు ఇతర సేవలకు కొంత అవకాశ మిస్తూ ఉంది.

నెం.176 ఒక చిన్న, సంపూర్ణ శాసనం. ఇది తిరుపతికిని అవులాలి (తిరుపతికి దక్షిణంలో సుమారు ఒక మైలు దూరంలో గల అవిలాల గ్రామం) గ్రామాల మధ్య సరిహద్దుల్ని నిర్ణయిస్తుంది. తిరుపతికి నైరుతి మూలనగల పెరియ-ఏరి నుండి ఈ నిర్ణయం. దీనిలో పడమటి దిక్కున అంతకుముందే పాతబడి ఉండే హద్దు రాళ్ళ గూర్చి ప్రస్తావిస్తుంది. ఇది జీయర్-కుళిని నిర్దేశించడానికి చేయబడింది.

నెం.177 అలిపిరి (అడి-పడి) లోని పెరియాళ్వార్ ఆలయానికి చెందింది. **ఇది తిరుమలకు ఱాతి మెట్లను నిర్మించుట నారంభించినప్పటిది.** ఇది అందించు సమాచారమిట్లుంది: కామవిల్లి అనే ఒక వ్యక్తి త్రవ్వించిన ఒక చిన్న చెఱువును **సర్పగిరి-అప్పన్** (శేషాద్రీశుడు, అనగా ఆది శేషరూపంలో ఉన్న కొండ నధిష్ఠించి ఉండే శ్రీ వేంకటేశ్వరుడు) కు అంకితమిచ్చి, తనకు ముప్పై రెండు దానాల పుణ్యాలను బోధించిన తన మాతృమూర్తి పేరున సమర్పించాడు. (పే.166.సం.1)

ఈ సంపుటికి చెందిన నెం.10, నెం.11 **పల్లవరాజు సర్వజ్ఞ - ఖడ్గ - మల్లకోప్పెరుంజింగ** లేక **మహారాజసింహుని** ప్రస్తావిస్తుంది. ఆతడు శేండమంగలం (దక్షిణ ఆర్కాటు జిల్లా)ను 3వ రాజరాజచోళుని జ్ఞాపకంగా వాని పాలన మొదటి కాలపు సంవత్సరాలలో క్రీ.శ.1216 నుండి పాలించాడు. ఇవి వాని బిరుదాల్ని మాత్రమే ఇలా స్తుతిస్తాయి : **కాఠకకుల తిలకుదు** (కాఠక (కాడవ లేక పల్లవ జాతి) జాతికి అలంకారం), **కాంచీనాయక, కవిసార్వభౌమ** (కవులలో చక్రవర్తి), **సహోదరసుందర** (జటావర్మన్ సుందరపాండ్య-1తో సహోదర బంధుత్వంగలవాడు), **కర్ణాటక-లక్ష్మీ-లుంటాక** (కర్ణాటక లేక హోయసల రాజ్యము, **ద్వారసముద్రం,** మైసూరులోనిది. దీని సంపదను, వైభవాన్ని కొల్లగొట్టిన వాడు), **గణపతి-ఆత్త-వీర-పద-ముద్ర** (వరంగల్ వాడగు కాకతీయ గణపతిచేత అలంకరింపబడిన గండపెండెరము గలవాడు) ఇట్టివే మరికొన్ని. ఈ రెండు శాసనాలలోను అతనిచే ఆలయానికి ఏమి సేవ చేయబడిందనే సమాచారం లేదు. ఇతడు అత్యాశాపరుడైన, శక్తిమంతుడైన సామంతుడై ఉండి, తన చోళ ప్రభువుపై తిరుగబడి, వాని నోడించి, ఖైదు చేసినవాడు. ఈ సమయంలో చోళుని బావమఱదియైన కర్ణాటకరాజు అతనికి సాయం వచ్చి, చెఱవిడిపించి, వానిని తంజావూరులోని తన సింహాసనంపై పునఃప్రతిష్టించాడు. (చూ.పే.17-19,సం.। మరియుపే. 101-103,115-116), సంస్కృత శ్లోకంలోనున్న వాని ఉల్లేఖనాలు శ్రీ శైలం ఆలయంలో చెక్కబడి ఉన్నాయి. ఈతడు క్రీ.శ 1225 నుండి క్రీ.శ 1272-73వరకు పాలించాడు.

* * *

# అధ్యాయం-16

## ఆలయావసరములు నెరవేర్చడం

శ్రీవేంకటేశ్వరుని ఆలయ లావాదేవీలను 7వ శతాబ్ది నుండి సమీక్షించటంలో, క్రీ.శ.614లో సామవై మణవాళప్పెరుమాళ్ రజతమూర్తిని ఆమె శుద్ధిచేసి ప్రతిష్ఠించిన సందర్భంలో ఆమె ఆ రజతమూర్తిని ప్రతిష్ఠించిన **'తిరువిళం కోయిల్'** అనేదాని ప్రసక్తి (నెం.8, నెం.9) వచ్చింది. మరల **'పెరుమాన్ - అడిగళ్'**ను ప్రతిష్ఠించినది కూడ తిరువిళం కోయిల్‌లోనే అని తెలుసుకున్నాం. ఈ రెండవమూర్తియైన **ఉలగప్పెరు మానార్** కొరకు శోళనాడులోని శోళనూర్ దీపసేవకై 30 కళంజు బంగారాన్ని మూలనిధిగా పల్లవరాజు విజయదంతి విక్రమ దేవుని 51వ పాలనవత్సరంలో (క్రీ.శ.830) (నెం.1) చెల్లించినట్లు తెలుస్తున్నది. అదే పల్లవ దంతివిక్రముని పాలనలో, లేక కొన్ని సంవత్సరాల తరువాత, **బాణరాజు విజయాదిత్యమహావలి బాణరాయడు, తిరువిళన్-కోయిల్-పెరుమానడిగళ్, తిరుమంతిరశాలై-పెరుమానడిగళ్, 'తిరువేంకటత్తు-పెరుమానడిగళ్, తిరుమంతిరశాలై- పెరుమానడిగళ్, 'తిరువిళం కోటత్తు-పెరుమానడిగళ్'** (నెం.4) అను ముగ్గరు మూర్తులకు కలిపి రెండు నైవేద్యాలను యేర్పరచినాడు. ఈ మూడిటిలో, 'తిరువిళం కోయిల్-పెరుమానడిగళ్' బహుశః నెం.1లోనిదే యైనను తిరుమంతిరసాల పెరుమానడిగళ్' కొంత తర్వాతి కాలంలో ప్రతిష్ఠించబడిన దాని నకలు కావచ్చును. ఇక మూడవ దేవతామూర్తి 'తిరువేంగత్తు- పెరుమానడిగళ్' మూలబేరం, ముఖ్య దైవం వేంకటేశ్వరుడు, వేంకటాచలంపై కొలువైనవాడు. బాణరాజు ముగ్గురు దేవతలకు కలిపి రెండు నైవేద్యాల నేర్పరచెను. కనుక, మూడు మూర్తులును ఒకేచోట ప్రక్కప్రక్కనున్నవారని భావించడం యుక్తం. ఈ ప్రాచీన కాలంలో అందుకు తగిన స్థలముంది గర్భగుడిలోని చిన్న ప్రదేశమే. ఆ ప్రాతకాలపు శతాబ్దాలలో, దేవతా మూర్తులను ప్రతిష్ఠించిన స్థలం సాధారణంగ చిన్న గర్భగృహాలు, వానిలో కలిసిన అర్ధ-మంటపాలు. ఇవి కూడా చిన్నవే. ప్రదక్షిణ చేయడానికైనా సరిపోనివి. భక్తులు ప్రదక్షిణాలు బైటి నేలపై చేయవలసి ఉండెను. అంత ఇరుకైన ఆలయములలో ఒక చిన్న గుడి 'తిరువిళం కోయిల్' గర్భగృహంలోనే ఏర్పాటు చేయుట ఎట్లు సాధ్యమో తెలియదు. ఒక క్రొత్త నిర్మాణం బైట చేసియుండ వచ్చును. ఆలయానికి బైట అట్టిక్రొత్త గుడిని కట్టినట్లు యే మాత్రమూ ఆధారంగాని సూచనగాని లేదు. కనుక వేంకటేశ్వరుని చిన్న మూర్తులు మూడును, అనగా, వెండిమూర్తి మనవాళప్పెరుమాళ్ (నెం.8, నెం.9) **'తిరువిళంకోయిల్-పెరుమానడిగళ్'** (నెం.1,నెం.4), **తిరుమంతిర శాలై - పెరుమానడిగళ్** (నెం.4), ప్రధానమూర్తి వేంకటేశ్వరుని ప్రక్కన గర్భగృహంలోనే వేదికపై నిలిపియుండిరనవచ్చును. ఆ మూడు నకలు ప్రతిమలును మూలవేంకటేశ్వరుని వలెనే సేవించబడిరి. ఆ మూడు మూర్తులను తప్పక ధ్రువబేరం వేంకటేశ్వర నకళ్ళే తప్ప మరియొకటికావు. ఎందుకంటే, వాటికి రాముడు, కృష్ణుడు, శివుడు, గణేశుడు, స్కందుడు లేక మరొకపేరు పెట్టలేదు కదా.

'తిరువిళంకోయిల్' అను ఈ పేరు 7వ శతాబ్ది రెండవదశకమైన క్రీ.శ.614కు చెందిన నెం. 8లోనే కనబడును. 9వ శతాబ్దియైన క్రీ.శ.930కి, కొంత తరువాత కాలానికి చెందిన నెం.1, నెం.4లలోనూ, "నాయనార్" జటావర్మన్ సుందరపాండ్య-1 పాలనకాలపు 3వ సంవత్సరం, అనగా క్రీ.శ 1254కు చెందినది 'తిరువిళంకోయిళ్' లోని భూమిని కొలుచు కర్ర లేక చువ్వను ప్రస్తావించిన నెం. 43లోను, అసమగ్రమైన నెం.137లోను, ఇట్లు 13వ శతాబ్ది పర్యంతం ఈ ప్రస్తావన కన్పిస్తుంది. నెం.137లోను, 'తిరువిళంకోయిల్-పెరుమానడిగళ్'ను తన రెండు పంక్తులలోను, (1) నంబి అముదన్‌తిరువిళంకోయిల్-పెరుమానడిగళుక్కు తిరురాణ్ణాళిగై....(2) కోయిల్- పెరుమానడిగళుక్కు తిరువుణ్ణాళిగైపురం తిరువమిర్దు, అనగా, నంబి అముదన్ తిరువళం కోయిల్‌లోని విగ్రహానికి ఆలయంలో నైవేద్యం సమర్పించాడు, ఈ విధంగా ఆ ప్రస్తావన కనిపిస్తుంది. దానిని **'తిరువుణ్ణళిగై పురం',** గర్భగుడితో సమానంగా చెప్పుటచే, 'తిరువిలంకోయిల్' అనుదాని అర్థం, ప్రాధాన్యము కొంత స్పష్టమౌతోంది.

7వ శతాబ్ది ఆరంభానికి చెందిన నెం.8 మనవాళప్పెరుమాళ్ యొక్క చిన్ని వెండి విగ్రహం వేంకటేశ్వరుని మూలదేవళంలో ఒక చిన్న గుడి ఉన్నట్లు తరువాతనో మూలబేరాన్ని నిర్మించడానికిగాని లేక పునరుద్ధరించడానికిగాని సూచించవచ్చు.

14వ శతాబ్దంలో (పే.110-111, డిటో)లో శంఖచక్రాలను మూర్తి యొక్క చేతులలో ఉంచిన ఒక నాల్గవ రాగి నకలును ప్రవేశపెట్టడంతో, ఇద్దరు నాచ్చిమార్‌లు, శ్రీదేవి భూదేవులతో కలిపి ముగ్గురు కుటుంబ సభ్యులతో కూడిన ఈ విగ్రహం తయారీలో ఆగమ శాస్త్రసంబంధమైన పంచబేరమను ప్రమాణం సిద్ధించింది. మిగత మూడు మూర్తులును ప్రత్యేక ప్రయోజనాలకై, వేంకటేశ్వర శ్రీనివాసుని ఆజ్ఞమేరకు, తాను వారిని అప్పటికప్పుడు సృజించినట్లు చెప్పబడింది (పే.99 డిటో)

ధ్రువబేరం, మూలమూర్తి, వెంకటేశ్వరుని అసలు విగ్రహం, వివిధ సేవల సందర్భాలలో తగిన వస్త్రాలంకారాలతో తన భక్తులకు దర్శనమిస్తుంది. గురువారం రాత్రులలో పుష్పోపవస్త్రంతో, శుక్రవారం అభిషేక సమయాన దాదాపు వివస్త్రంగాను, వివిధాలైన నైవేద్యాలను, అల్పాహారాలను (పణ్యారాలను) ఆస్వాదిస్తూ దర్శనమిస్తాడు.

పల్లవరాకుమారి సామవై ప్రతిష్ఠించిన **మనవాళప్పెరుమాళ్** వెండి విగ్రహం అప్పటి వరకు ఊరేగింపు ఉత్సవాలలోను నైవేద్యం, ఇతర సేవలలోను ఆలయంబైట అనేక ప్రదేశాలలో పాల్గొన్నది. కాని ఇప్పుడు కౌతుకబేరం లేక భోగమూర్తిగా నిత్యపూజకును అభిషేకాలకును, రాత్రి పవళింపు సేవలకును స్వీకరించబడింది.

తిరువిళంకోయిల్-పెరుమానడిగళ్(నెం.1, నెం.4)ను బలిబేరంగా నియోగించి యుండవచ్చు. ఈ దేవత నిత్యం ఉదయం ముంగిటి మహామణి మంటపంలో అధ్యక్షత వహించి పరివారదేవవతలకు ఆరగింపు చేస్తూ, నిమిత్త పూజలందుకొంటూ, పంచాంగపఠనాన్ని వింటూ, గడచిన రోజు కోవెల ఆదాయపు లెక్కలను వింటూ ఉంటాడు.

తిరుమంతిరశాలై–పెరుమానడిగల్(నెం.4) బహుశః స్నపనబేరంగా పరివర్తన చెంది మతధార్మిక కార్యకలాపాలలోను యజ్ఞవిధి స్నానాల లోను వేదమంత్రాలను వినుచు, జపాలను స్తోత్రాలను వింటూ ధ్రువబేరానికి ఎడలేని సాంగత్యం నెఱపుతుంటాడు.

ఐచ్చికంగ నాచ్చిమార్ లిద్దరితో కలిపి చేయబడిన మూర్తిస్పష్టంగా మలైకినియ నిన్ఱ–పెరుమాళ్ లేక మలయప్ప ఉత్సవబేరంగా ఊరేగింపులలో 14వ శతాబ్ది నుండి ప్రయుక్తుడై ఉన్నాడు.

ఒక దేవత ప్రతిష్ఠింపబడినప్పుడు ప్రధానమైన అవసరాలు, మూర్తి భక్తులకు కనబడటానికి సన్నిధిలో దీపాలు, ఆ స్వామి పూజకై పూలు, నైవేద్యం. మొదటి శాసనంలో **ఉలగప్పెరుమానార్** స్వయంగనే తిరువిళం కోయిల్–పెరుమానడిగళ్ సన్నిధిలో దీపం పెట్టడానికై 30 కళంజు బంగారము చెల్లించినట్లుంది. రెండవదానిలో శీయకన్ లేక శీయగంగన్ కూడ ఆలయంలో ఒక దీపం నేర్పరచినట్లు, ఇది పల్లవరాజు విజయదంతి విక్రమవర్మన్ పాలనకాలంలో జరిగినట్లుంది. పల్లవ రాకుమారి సామవై స్వయంగానే శాశ్వత దీపారాధనకై మనవాళప్పెరుమాళ్ సన్నిధిలో యేర్పాటు చేసింది. ఈ మూర్తిని ఆమెయే ప్రతిష్ఠించింది. నెం. 12లో కొడుంగొలూరాన్ యేర్పరచిన దీపాన్ని, నెం.13లో చెప్పబడినదీ, ఈ రెండును వేంకటేశ్వరునికై ఉద్దేశింపబడినట్లే తోస్తుంది. ఇప్పటికి 14వ శతాబ్దికి దీపానికై చేసిన ఏర్పాట్లు 40 వరకున్నట్లు తెలుస్తోంది. నెం.19లో, తిరుముడియం గ్రామ సభైయార్ ద్వారా శ్రీ వేంకటేశ్వరునకు యేర్పరుప బడిన 24 దీపాలలో, ఒక కర్పూరదీపంతో సహా, వారు 22 దీపాలను వెలిగించక, రెండు దీపాలను మాత్రం, కర్పూర దీపముతో సహా వెలిగించినట్లు తెలుస్తోంది. ఆ ప్రాంతానికి చెందిన అధికారి, లేక గవర్నర్, ఈ విషయం విచారించి, తిరుముడియం సభ అధీనములో గల కొంత బంగారంపై ఆదాయంతో మొత్తము 24 దీపాలను వెలిగించవలసిందిగా ఆజ్ఞాపించాడు, నెం.123 ప్రకారం ఆలయానికి 6 దీపపు శెమ్మెలు బహూకరించినట్లును, నెం.132లో ఆలయంలో ఆనందంగా 4 దీపాలు వెలిగించడానికి యేర్పాటు కన్పిస్తుంది.

నెం.4లో బాణరాజు విజయాదిత్యుడు పూర్వమే నైవేద్యానికి ఏర్పాటు చేయించాడని చూచాము. నెం.లో గంగైగంగాన్ రణసింగన్, నెం. 8లోను, నెం.9లోను రాకుమారి సామవై, పాలు పెరుగులకై యేర్పాటు 1వ కులోత్తుంగని రాణిచేత చేయబడినట్లు నెం. 27లోను కనిపిస్తుంది. అటు తరువాతి కాలంలో కూడ, ధనిష్ఠ నక్షత్ర తిథిలో ముదల్ సంధి (మొదటి సేవ)గా నెం.155లోను, సితకర నక్షత్ర తిథిలో ముదల్ సంధి (మొదటి సేవ)గా నెం.155లోను, సితకర గండసంధిగా నెం. 102లోను, తిరుమంతిర తిరుప్పోనకంగా నెం. 82లోను ఉంది. అదెట్లైనా, 13వ శతాబ్దిలో నొక కాలంలో, సేవలకు ధనలోపం కలిగినట్లు కనిపిస్తుంది. ఆలయ స్థానత్తార్, భూదానం ద్వారా తగిన యేర్పాటు చేయవలసినదిగా కోరగా తిరుక్కాళత్తిదేవ యాదవరాయలు, ఆ కోరికననుసరించి క్రీ.శ.1254లో శాసనాలలో, భూదానాలు, గ్రామదానాలు ఉన్నట్లు కనిపించును. కావేరీ నదికి దక్షిణంలో గల కొన్ని గ్రామాల పూర్వదానాల కాలం పొడిగించబడింది. ఈ విషయాన్ని 13వ శతాబ్ది మధ్యకాలంలో 1వ జటావర్మన్ సుందర పాండ్య నిర్ధారించెను.

తిరుపతితో సహా, తిరుపతి దగ్గరనున్న 6 గ్రామాలు యాదవరాయ వంశీయ ప్రభువులచే ఆలయానికి దానమీయబడ్డవి.

వేంకటాచలంవంటి అటవీపర్వతంపై కాకపోవచ్చును. అడవిపూలు పూయుచుండ వచ్చును. అవి పూజకు పనికి వచ్చునవి కాకపోవచ్చును. కనుక కొందరు భక్తులు తిరుమలపై పూదోటలను వేసి, వేంకటేశ్వరుని నిత్యపూజకును, ఉత్సవాలు, ప్రత్యేక సందర్భాలలోని ప్రత్యేక పూజకుకూడ పూలను ఆ తోటల నుండి సమర్పిస్తుండేవారు. కొందరు పూదోటల యజమానులు నీడ కొరకును, విశ్రాంతి, వసతి కొరకును, ఆ పూదోటలలో మంటపాలను నిర్మించి ఉంటారు. ఉత్సవాలలో ఊరేగింపులు వారి మనసుల్ని నాకర్షించినందున, ఆ మంటపాలలోనికి ఉత్సవ విగ్రహాలను వేంచేయింపుజేసి తిరుప్పోనకంతో (పచ్చపెసర పప్పు, బియ్యం, నెయ్యి, కొద్దిగా మిరియం, రుచికై ఉప్పు కలిపి ఉడికించినది) అప్పాలతో (బియ్యపు పిండి బెల్లం కలిపి చేసిన రొట్టెలు నేతిలో ఉడికించినవి) నైవేద్యం ఇచ్చి, దానిలో కొద్ది భాగాన్ని ఆ సమయంలో అక్కడ చేరిన యాత్రికులకు, సింహభాగం ఆలయ సేవకులు, ఉద్యోగులు, యాజమాన్యం పంచుకోడానికి యేర్పాటై ఉంటుంది. ఈ పద్ధతిలో అక్కడ గుమిగూడటం, నైవేద్యం చేయడం, ప్రసాదవినియోగం, దీనిని 'తిరువోలక్కం' (తెలుగులో ఓలగం, సంస్కృతంలో ఆస్థానం, ప్రదర్శనార్థం వచ్చినవారు) అందరు.

రాకుమారి సామవై ప్రారంభించిన రెండు ఉత్సవాలలో, పురట్టాశిలోని ఉత్సవం ఈ నాటికిని సాగుతుంది. మార్గళిలోని ఉత్సవం ఈ నాటికిని సాగుతోంది. మార్గళిలోని రెండవ ఉత్సవం ఆగిపోయిట్లుంది. 13వ శతాబ్ది 3వ పాదానికి చెందిన నెం.67 శ్రీ వేంకటేశ్వరునకు పురట్టాశి, చిత్తిరైలలోని ఉత్సవాలను ప్రస్తావిస్తాయి. నెం.74, నెం.75 పురట్టాశి, చిత్తిరైలలోని ఉత్సవాలను ప్రస్తావిస్తాయి. ఒకక్రొత్త ఉత్సవాన్ని తిరువేంకటనాథ యాదవ రాయలు తన పాలనలోని 9వ యేట (క్రీ.శ. 1330) ఆడి నెలలో ప్రారంభించి, అందుకై పొంగలూరు గ్రామాన్ని, దానిపై గల 40 విధాలైన పన్నుల్ని తొలగించి, ఆ గ్రామంలో సగాన్ని సర్వమాన్యంగా (నెం.99) దానం చేశాడు. ఇప్పటికి శ్రీ వేంకటేశునికి 3 ఉత్సవాలు 14వ శతాబ్ది ప్రథమార్ధంలో నిర్వహింపబడినట్లు తెలియవస్తోంది.

ఈ పై మూడు ఉత్సవాలను కాక, **తిరుక్కోడి–తిరునాళ్** ధ్వజ స్తంభాగ్రంలో గరుడ పతాకాన్ని ఎగురవేయడం ద్వారా జరుపబడుతుంది. మిగత పండుగలు కూడ ఆలయంలోనే జరుపబడుతాయి. నెం.113లో ఒక వసంతోత్సవాన్ని గూర్చి ఉంది. ఇది క్రీ.శ.1360 ప్రాంతానికి చెందింది. ఇది మార్చి–ఏప్రిల్ నెలలో వసంతర్తువులో జరిపించబడి ఉండవచ్చు. నెం.168 కోడై–తిరునాళ్ ఉత్సవాన్ని మే–జూన్‌లలో వేసవిలో జరిపించేదాన్ని ప్రస్తావిస్తుంది.

తిరుపతిలోని శ్రీ గోవిందరాజులకు వైకాశిలో ఒక ఉత్సవాన్ని జరిపిస్తున్నట్లు 13వ శతాబ్ది ఉత్తరార్ధానికి చెందిన నెం.61లో నున్నది. వీరనరసింహ యాదవరాయని దేవేరి ఆణి నెలలో రెండవ ఉత్సవాన్ని ప్రారంభించి, గోవిందరాజుల ఊరేగింపునకై ఒక కొయ్య రథాన్ని తయారు చేయించింది. ఈ కొత్త ఉత్సవ

ఖర్చుల నిమిత్తంగాను, ఒక కూటాన్ని లేక శిఖరాన్ని (రథంపైన అలంకారంగ కిరీటంగ నుంచుటకు బంగారపు లేక బంగారు పూతగల ఒక కలశం) చేయుటకును, రథం యొక్కయు, ఆలయం యొక్కయు ఉద్ధరణకై, ఆ రాజు పాలనలోని 30వ సంవత్సరంలో (క్రీ.శ. 1235) పయిండప్పళ్ళి గ్రామంలో సగాన్ని ఆ దేవాలయానికి దానమిచ్చింది. (నెం.86)ఈ రెండుత్సవాలు 17వ శతాబ్ది వరకు సాగాయి. నేడు వైకాశి ఉత్సవం ఒక్కటి మాత్రం జరుగుతోంది.

తిరుపతికి ఉత్తరాన కొండకు దిగువన ఒక మైలు దూరంలో జలపాతం దగ్గరున్న శ్రీ కపిలేశ్వరుని ఆలయం **బ్రహ్మమారాయన్ మునైయదరైయన్** అను **రాయన్- రాజేంద్ర-శోళన్ కోట్టూర్** గ్రామ ముఖ్యుడు నిర్మించింది. ఆ గ్రామం ఆ రోజులలో ఆ కొండ పొలిమేర లోపల ఉత్తరాన ఉన్నది, తిరుపతి పడమట, తిరుచానూరు దక్షిణాన ఉన్నవి. ఆ నిర్మాత పేరును బట్టి, రాయన్- రాజేంద్ర-శోళన్, 1వ రాజేంద్ర చోళుని కొలువులోని అధికారియనుకోవచ్చును. ఈ ఒకటవ రాజేంద్ర చోళుడు 1వ రాజరాజుని కుమారుడు, వారసుడు, చోళ సామ్రాజ్యాన్ని క్రీ.శ.1011 నుండి 1044 వరకు పాలించినవాడు. కనుక శ్రీ కపిలేశ్వరుని ఆలయం 11వ శతాబ్దపు 2వ పాదంలో నిర్మింపబడి ఉంటుంది. పశ్చిమ ముఖంగా నున్న ప్రధాన శ్రీ కపిలేశ్వరలింగం ఆలయము, దానికి దక్షిణమున దాని నానుకొని ఉండే, ఆ స్వామివారి దేవేరియగు కామాక్షీదేవి ఆలయంతో, చాలా అందమైన ప్రదేశాన్ని, కొండ నుండి, వ్రేలాడుచున్నట్లున్న పెద్దఱాతి చట్టు క్రిందుగా, జలపాతానికి ఎదురుగా, ఒక అడవిమధ్య ఉంది. (పే.20,సం.1)

తిరుచానూరులో నేడు ప్రధాన దేవత శ్రీ పద్మావతీ లేక లక్ష్మీ, **అలర్‌మేల్- మంగైయ**ని కూడ ఈమెకు పేరు. కాని, ఆమె ప్రస్తావన యే ఒక్క శాసనంలోను లేదు. ప్రధాన గోపురానికెదురుగా ఆలయంలో మధ్యభాగంలో గల ఆలయదేవత శ్రీకృష్ణుని గురించికూడా ప్రస్తావన లేదు. ఈ స్వామిని శుకమహర్షియర్చించినట్లును, ఆ కారణముగనే ఆ ప్రదేశమునకు **శుకపురి, శకనూరు, తిరుచ్చుకనూర్** అనిపేర్లు కలిగినట్లును పద్మపురాణంలో వేంకటాచలమాహాత్మ్యంలో గూర్చి వ్రాయబడి ఉంది. 3వ రాజరాజచోళుని పాలనలో 5వ సంవత్సరానికి (క్రీ.శ.1221) చెందిన నెం.34లో మాత్రమే అళగియ పెరుమాళ్ ప్రస్తావన కలదు. ఆ స్వామికి భూమి లేక గ్రామం పురాతనకాలపు దానంగా ఉన్నట్లు కూడ అందున్నది. ఒక భూభాగాన్ని చదునుచేసి, పొక్కారన్ పాండియదరైయాన్ సేద్యానికి కనుకూలం జేసి, దానిని తిరుచానూరుకు చెందిన పెరుమాళ్‌కు పంగునిలో ప్రతిష్ఠింపబడిన యాదవ నారాయణుడు అయి ఉంటాడు) 'తిరువిళం కోయిల్' దానియందున్నది. అది అళగియ-పెరుమాళ్ స్వామికే నిర్మింపబడిన ఆలయమై ఉండవచ్చు.

ఈ కాలంలో కొందరు ఆళ్వారుల ప్రతిష్ఠించడం జరిగినట్లు తెలుస్తోంది. మొట్టమొదటివారు నెం.40లో చెప్పబడిన తిరుమంగై యాళ్వార్. ఇది క్రీ.శ.1235లో 3వ రాజరాజచోళుని కాలంలో జరిగింది. దానిలో చెప్పబడిన ప్రకారం, ఈ గోవిందరాజుల ఆలయంలో ప్రతిష్ఠించబడింది. కాగా, ఆ స్వామి అర్చనకై,

నైవేద్యాలకై కుడవూర్ గ్రామస్థులు కొంత భూమిని సమర్పించినట్లు అందున్నది. క్రీ.శ.133-031లో వేంకటేశ్వరునకై తిరువేంగడనాథ యాదవరాయలు పొంగళూర్ గ్రామాన్ని దానమిచ్చిన మీదట, సింగయ దండనాయకుడు వేంకటేశ్వరుని ఆలయ స్థానత్తార్‌ను ఆ దానగ్రామం యొక్క పంటనుండి ఆదాయాన్ని ఆడి నెలలో ప్రారంభ మయ్యే ఉత్సవమునకు మాత్రమే మొదట యేర్పాటును బట్టి కాక, కొరకును తిరుమంగైయాళ్వార్ కోసం కూడా ఉపయోగించడానికి స్థానత్తార్ అంగీకరించాడు. (నెం.102, పే. 105,108,109, సం.1).

ఆ తర్వాత నమ్మళ్వార్‌ను కొండపాదం దగ్గర కపిలతీర్థ జలపాతం వద్ద ఆలయంలో **వానెదుత్తకైయళిగైయార్,** పల్లవరాయర్ అను నామాంతరం గలవాడు, ప్రతిష్ఠించినట్లు కనిపించును. ఇది క్రీ.శ.1285-1290 ప్రాంతమున జరిగెను. (నెం.57, నెం. 58, నెం.165, పే.69, సం.1)

కపిలతీర్థానికి పడమట, కొండ దిగువన, కొండనెక్కుటకు మెట్ల వరుసగల చోట, పెరియాళ్వార్, ఆండాళ్ వారి పెంపుడు తండ్రిగారి ఆలయ ముంది. అదెప్పుడు నిర్మించబడినదో, వారి విగ్రహాలు అందులో ఎప్పుడు ప్రతిష్ఠించబడినదో తెలియదు. దాని గోడల మీద చెక్కబడిన శాసనములు రెండున్నాయి. అవి యాత్రికులకు త్రాగునీటి కోసం రెండు బావులను నిర్మించినట్లు, ఒకటి కామవిల్లి చేతను (నెం.177, సం.1), మరియొకటి లోనికి మెట్లతో కూడ, చాంద్రమాన సంవత్సరమైన సౌమ్య శక సంవత్సరం 1411కు సరియగు క్రీ.శ.1490, జనవరి 25న, **కార్వెట్టి-పులి-ఆళ్వార్ మన్నర్ పిళ్ళై** అను **ఉత్తరమెరూర్** నివాసి నిర్మించినట్లును ఉన్నది. ఈ సంవత్సరము సాళువ నరసింహుని పాలనాంత సంవత్సరం 1411కు సరియగు క్రీ.శ 1490, అందులో ఈ రాజు శ్రీ లక్ష్మీనరసింహస్వామి ఆలయానికి గోపురాన్ని, బహుశః డిశెంబరు 1930లో పిడుగుపడి వర్షాకాలంలో పడిపోయిన ఆ పెద్ద గోపురాన్ని కూడ నిర్మించినట్లుంది. (నెం.90, సం.॥) ఆ రెండవ బావి క్రొత్తగా క్రీ.శ.1490లో త్రవ్వబడి ఉంటుంది. అప్పటికి కామవల్లి త్రవ్వించిన మొదటి బావి శిథిలమై పడిపోయియుండును. కనుక మొదటి దాని నిర్మాణం కొంత హెచ్చుతగ్గులుగా ఒక శతాబ్దం ముందుగా జరిగి ఉండవచ్చు, అనగా 14వ శతాబ్ది చివరన అయి ఉంటుంది. కారణంగా, ఈ మొదటి శాసనాలు వ్రాయబడిన గోడలుగల పెరియాళ్వార్ ఆలయ నిర్మాణం 14వ శతాబ్ది మధ్యకాలమై ఉంటుంది.

ఈ ఆళ్వారులు కాక, గొప్పవైష్ణవాచార్యుడైన శ్రీరామానుజులు కూడ ఈ కాలపు కొన్ని శాసనాలలో కనిపిస్తారు. అసమగ్రమైన నెం. 79డి, నెం.171, నెం.172, నెం.173, నెం. 175లలోని పొడి మాటలను బట్టి, రామానుజులు శ్రీ వేంకటేశ్వరుని ఆలయములో చాంద్రమాన సంవత్సరం సౌమ్యలో నెం. ముందు కాలంలోనే ప్రతిష్ఠింపబడి, ఆ సంవత్సరం సౌమ్యలో నెం. 79డిలో ఉన్నట్లు క్రీ.శ.1248-49కి సరిగా ప్రతిష్ఠించబడి ఉంటుంది. లేదా, ముందు కాలంలోనే ప్రతిష్ఠింపబడి, ఆ సంవత్సరంలో వారి పూజకు, నైవేద్యానికి కొంత ఏర్పాటు చేయబడి ఉంటుంది. అనంతాళ్వాన్ మనుమడు వేంకటత్తురైవర్ ఆ ఏర్పాట్లు

చేసి ఉంటాడు. ఆతడే రామానుజుని పేర ఒక పూదోటను గూడ పెంచి ఉంటాడు. (నెం.175). నెం. 89లో, తిరుపతికి చెందిన శ్రీవైష్ణవులు గోవిందరాజస్వామి ఆలయంలో ఒక దీపాన్ని, పూమాలను సమర్పించునట్లు వీర నరసింహ యాదవరాయల ఒక దీపాన్ని, పూమాలను సమర్పించునట్లు, క్రీ.శ 1255లో అంగీకరించారు. తిరుపతిలో కొంత భూమిని దానం చేశారు. తన పాలనలో 3వ సంవత్సరంలో (క్రీ.శ. 1399-40) శ్రీరంగనాథ యాదవరాయలు ఒక ఉత్తర్వు ద్వారా తిరుపతిలోని పెద్ద చెఱువు నుండి నీటిని, శ్రీ వేంకటేశ్వరుని ధనాగారానికి 200 పణాలు చెల్లించి, పొందేటట్లు ఏర్పాటు.

13వ శతాబ్దిలో కొంతమంది వైష్ణవ ఆళ్వారుల్ని ప్రతిష్ఠించడమేకాక వారి ప్రబంధాలలోని కొన్ని భాగాలు సైతం ప్రవేశపెట్టబడినాయి. శ్రీ గోవిందరాజుల ఆలయంలో తిరుమొళి, ప్రబంధ భాగం నైవేద్యంతో పాటు పఠనాన్ని విజయ గండగోపాలుని 14వ లేక 24వ పాలన సంవత్సరంలో, అనగా క్రీ.శ.1264 లేక 1274లో (నె.61) ప్రవేశపెట్ట బడినది. ఈ తిరుమొళి ఆండాళ్ రచించిన నాచ్చియార్, తిరుమొళి అయి ఉంటుంది. కులశేఖరాళ్వార్, పెరియాళ్వార్, తిరుమంగై యాళ్వారుల రచనలనడం కంటే, సమంజస మనిపిస్తుంది. అదే సమయంలో ఆండాళ్ రచనయేయైన తిరుప్పావైపఠనం శ్రీ వేంకటేశ్వరుని ఆలయంలో ప్రవేశ పెట్టబడి, ఆ సమయంలో పఠనం తరువాత, ఒక నైవేద్యం కూడ యేర్పరుప బడింది. (నెం.107)

ప్రధానావసరాలైన దీపాల తరువాత పూజాపుష్పాలను నైవేద్యంలో ఏర్పాట్లును ప్రతిష్ఠింపబడిన దేవతకై జరుగుతాయి. అలంకారం వైభవాలు ప్రవేశిస్తాయి. ఆభరణాలు రత్నాదులు అందాన్ని లావణ్యాన్ని సమకూరుస్తుంది. అటుపై ఆలయాన్ని విశాలతరం చేస్తూ ఎన్నో గదులు, నడవలు, ప్రాకారాల గోడలు, వివిధాలైన ఉత్సవాలు, ఊరేగింపుల నిర్వహణం, ఎన్నో వాహనాలపై అలంకరింపబడి ఊరేగించడం, సంగీతవాద్య బృందాలు, వృషభాశ్వగజోష్ట్రాలు అలంకరింపబడి వెంటనడవడం, ఆ స్వామి వైభవాన్ని, కీర్తిని ఇనుమడింపచేస్తాయి. వేంకటేశ్వరుని ఉత్సవాలు చాలా ముందే ప్రారంభమైనాయి, 13వ శతాబ్దిలో వన్నెలు దిద్దబడినవి. కాని, ఆలయాన్ని విశాలం చేయడం తరువాత విజయనగర కాలంలో 15వ శతాబ్ది నుండి సాగింది.

ఆ దేవతను అలంకరించే విషయంగా, రాకుమారి సామవై మణవాళప్పెరుమాళ్‌కు మాత్రం రత్నాభరణాలు సమర్పించింది. వేంకటేశ్వరునకు బంగారు పట్టము, 6 కెంపులు, 4 వజ్రాలు, 28 ముత్యాలు పొదిగింది, రెండవ పరాంతక సుందరచోళుని రాణి పరాంతకదేవి - అమ్మన్, తన సవతికుమారుడైన మొదటి రాజరాజ పాలన 16వ సంవత్సరానికి సరియైన క్రీ.శ.1001లో, ఆ స్వామికి ఆభరణాలను సమర్పించిన మొట్టమొదటి సందర్భంగా (నెం.14) కనిపిస్తాయి. రెండవది, వేంకటేశ్వరుని చేతికి, బహుశః అరచేతికి వైకుంఠహస్తం, వరదహస్తం ముందున్న కుడి చేయి, క్రింద పాదాలను చూపేది, దానికొక బంగారు తొడుగును తంజైరాజు, బహుశః 13వ లేక 14వ శతాబ్దిలో, హోబళ యాదవుడు సమర్పించాడు. (నెం.116, నెం.117, సం.౹)

మొదటి జటావర్మన్ సుందర పాండ్య శ్రీ వేంకటేశ్వరుని ఆలయ విమానంపై, బహుశః దాదాపు క్రీ.శ 1256లో ఒక బంగారు కలశం **"హేమకలశోస్థాపి"** నిలిపినపుడు ఆలయానికి కూడ అలంకారముంది. అప్పుడా రాజు తన పాలనలోని 5వ, 10వవ సంవత్సరాల మధ్యఉత్తర దేశానికి దండయాత్రగా కృష్ణానది వరకు వస్తుంది.(నెం.49, పే. 67–69, సం.ı.) సుమారు అదే కాలంలో వీరనరసింహదేవ యాదవరాయలు విమానాన్ని బంగారు పూతబూసిన రేకుతో కప్పించాడు. ఈ బంగారం బహుశః తనతో తులతూచి ఆలయానికి సమర్పించిన బంగారంలోని భాగమే (నెం.91, పే.104–105, సం.ı)

కొన్ని మఠాలు (సన్యాసుల నివాసాలు) 14వ శతాబ్ది శాసనాలలో కనిపిస్తుంది. తిరువేంకటనాథ యాదవరాయలు తన పాలనలో 9వ యేట, క్రీ.శ.1330–31లో ఆడి నెలలో తామేర్పరచిన శ్రీవేంకటేశ్వరుని ఉత్సవ ఖర్చులకై అట్లేసంధి, అనగా, **సితకరగండన్–సంధి** అనేది **రేచయ – దండనాయకుని** పేర(నెం.99) సింగయ దండనాయకులు ప్రారంభించిన దానికై కూడ, పొంగళూరు గ్రామ సగభాగాన్ని బహూకరించిన, మీదట, వినియోగించగలందులకు సింగయదండనాయకులు స్థానత్తార్‌ను కోరడంవల్ల, వేంకటేశ్వరుని ఆడి ఉత్సవంతోబాటు సంధి నైవేద్యాన్ని ప్రతిరోజున, అట్లే వీరనరసింగ పెరుమాళ్, తిరుమంగైయాళ్వారుకును, ఇద్దరును తిరుపతిలో ఉండేవారు, 32 శ్రీవైష్ణవులకు సితకరగండన్ మఠంలో భోజన సంతర్పణ చేయడానికి, నిర్వహించవలయును. (నెం.102) శ్రీ రంగనాథయాదవరాయల (క్రీ.శ. 1339–40) 3వ సంవత్సర పాలన కాలంలోని నెం.104 నుండి తెలియవచ్చింది: రెండు సితకరగండన్ మఠాలున్నాయి : ఒకటి తిరుమలలోను, ఒకటి తిరుపతిలోను, తిరుమలలోని మఠానికి రెండు పూదోటలు అనుసంధింపబడ్డాయి, **అరిశానాలయన్** – నందనవనాన్ని **వణ్–శఠకోపన్**–నందనవనమును; ఈ మఠముల బాగోగులు సింగయచే కొందరు సన్యాసులకు అప్పగించబడ్డాయి; వారు ఆ బాధ్యతను వేరొక సన్యాసికి 1000 పణాలు చెల్లించిన మీదట తన నిర్యాణం తర్వాత ఆతడు ఆ బాధ్యతను మరల ఆ సింగయకు ఇవ్వగా, అతడు 400 పణాలను ఆలయ ఖజానాకు చెల్లింపుపై మరియొక సన్యాసికి దాని నప్పగిస్తాడు. ఈ ఆస్తుల పెత్తనం స్వీకరించడం ద్వారా ఆ సన్యాసి శియర్ లేక జియర్ ఉత్సవ విగ్రహాలకు పూజాదికములను 4వనాడు, ఉత్సవపు పార్వేటనాడు ఆ పూదోటలలో కూర్చొని యుండగా సమర్పించాలి. శ్రీ వేంకటేశ్వరునికి కొన్ని ఆభరణాలు ఈ ఆదాయం నుండే చేయించి అలకరించినట్లుంది (నెం.162). ఆ సన్యాసి, ఆ మఠపు జీయర్ ఆలయంలో కొంత సేవ చేయవలసింది. ఇలా సింగయ – దండనాయకుని సితకరగండన్–మఠం ఈనాటి జీయర్ లేక జీయంగార్‌కు వేంకటేశ్వరునికి, శ్రీ గోవిందరాజుకును ఆలయాలలో కొంత సేవ చేయడానికి మూలమైంది.

* * *

# అధ్యాయం-17

## మొదటి విజయనగర వంశం - కాలం

ఇది శ్రీవేంకటేశ్వరుని ఆలయం యొక్క బహుముఖత్వానికి బహుళ కార్యకలాపాలకు, దాని తొల్లింటి రోజులైన 7వ శతాబ్ది నుండి 14వ శతాబ్ది మధ్యకాలంవరకును, మొదటి విజయనగర సంగమ వంశీయుల ఆధిపత్యం ఈ ప్రాంతంలో ప్రతిష్ఠితమైన కాలానికి చెందిన విహంగ వీక్షణం.

ఈ సంగమ వంశీయుల కాలానికి చెందిన మొట్టమొదటి శాసనం మొదటి బుక్కరాయలది (క్రీ.శ.1355-1377). ఇది తిరువేంగడముడైయాన్‌కు ప్రతి దినం 2 **తిరుప్పోనకంతో** పూజ జరుపటానికి ఒక గ్రామాన్ని బహూకరిస్తున్నది. శాసనం శిథిలమైనందున, ఆ గ్రామనామం, ఆ తిథి నష్టమైంది. (నెం. 178, సం.I) బహుశఃఈ అర్చన నెం. 219, నెం. 225లలో ఉన్నట్లు, **బుక్కరాయన్-సంధి** అని ప్రసిద్ధమై ఉంటుంది.

చాంద్రమాన ప్రభవ సంవత్సరం, క్రీ.శ1388 జనవరి 18, ముల్లై- తిరువేంకట జీయర్, అరిశాణాలైయన్ పూదోటకు మఠానికి అధిపతి, పూంగోదు గ్రామం నుండి వచ్చిన ఆదాయంలో 100 పణాలను చెల్లించి మార్చి నెలలో విజయనగర చక్రవర్తియైన 2వ హరిహరుల పేర (క్రీ.శ.1377-1404) ఒక ఉత్సవాన్ని ప్రారంభించి, ఈ ధనానికి మరియొక 100 పణాలు క్రీ.శ.జూన్ 1390లో అవసరమైన వస్తువుల్ని సంభారాలను సమకూర్చుకోవటానికి చెల్లించాడు. (నెం.185,నెం.189,సం.I, నెం.83, సం.II)

రెండవ దేవరాయలు (క్రీ.శ.1423-1446) క్రీ.శ.1429 డిశెంబరు 5వ తేదిన వేంకటేశ్వరదైవాన్ని స్వయంగా దర్శించాడు. అప్పుడు స్వామికి నిత్యము 30 తట్టల అన్నం, 1 తట్ట పాయసం (పాలు, పంచదార, సుగంధద్రవ్యాలు కలిపి ఉడికించిన అన్నం), 1 తట్ట పాయసం (పాలు, పంచదార, సుగంధద్రవ్యాలు కలిపి ఉడికించిన అన్నం), 1 తట్ట అప్ప (తీపి రొట్టెలు), మొత్తం 33 తట్టలు సమర్పించడానికి, దానికిగాను చంద్రగిరి రాజకోశానికి చెందిన **విక్రమాదిత్యమంగళ, చిఱుకూరకాలుతో కూడిన ఇళమాండియ, కళరు విద్దాలెయును** మరియొక అపూర్వబహుమానము, మూడు గ్రామములను బహూకరించి, 2200 బంగారపు వరాహ నాణెములను చెల్లించెను. అదిగాక సుగంధిత జలమునకును, పునుగు నూనెను, స్వామివారి దేహలేపనానికి రెండు పెద్ద గిన్నెలను సమర్పించాడు. ఆతడు **ఆశ్వయుజ** మాసంలో (సెప్టెంబరు- అక్టోబరు) తొమ్మిది రోజులపాటు పునర్వసు నక్షత్రముండే తిథితో మొదలై **స్వాతి** నక్షత్రముండే రోజున తీర్థవారి (పుణ్యస్నానం)తో సంపూర్ణమగునట్లు, ఒక ఉత్సవాన్ని జరిపించడానికి యేర్పాటు చేశాడు. మూడు గ్రామాల బహూకరణ దేవరాయలచే, హరికి ప్రీతికరమగు ఉత్థానద్వాదశినాడు నీటితోను బంగారంతోను ధారవోయబడిం దని చెప్పబడింది. ఆ రోజున విష్ణువు, ఆషాఢ (జూన్-జులై) మున కృష్ణ పక్షం విదియ నుండి నాలుగు నెలలు విశ్రాంతి తరువాత మేల్కొనునని భావించబడును. ఇది గడచిన నెలయైన కార్తికంలో (అక్టోబరు-నవంబరు) శుక్లపక్షంలో, క్రీ.శ.1429 నవంబరు 8న అగును(నెం.192)

శక సంవత్సరం 1364 దుందుభికి సరియైన క్రీ.శ.1443 జనవరి 12న, ముద్దెయ నాయకుని కుమారుడగు **తెప్పద నాగెయ నాయకుడు** 2వ దేవరాయల సేనానాయకుడైయుండి శ్రీ వేంకటేశ్వరుని దర్శింప వచ్చెను. అప్పుడు అతడు 3000 పొన్ను (బంగారు నాణాలు) కాణికె (బహుమతి)గా నిచ్చి, 100 బంగారు నాణాలు అమృతపడి (పవిత్ర నైవేద్యం)గా 2 తట్టలు, రెండు పూమాలలు అమృతపడి (పవిత్ర నైవేద్యం)గా 2 తట్టలు, రెండు పూమాలలు మరికొన్ని ఎనిమిది వస్తువులతో సమర్పించు కొరకు చెల్లించి, తామిచ్చిన 3000 బంగారు నాణెములతో (నెం.209) మూడు చిన్న పళ్ళెరాలు చేయునట్లాజ్ఞాపించినాడు.

అమాత్యశేఖరుడు (ముఖ్యమంత్రి) మల్లాణుడు, లేక మల్లండైయర్, మాధవదాసు అను గోపీనాథయ్య శిష్యుడును అగునాతడు అవిలాలి గ్రామంలోని చెఱువుకు నీటి సరఫరా అయ్యే కాలువను మరమ్మతు చేయించి, చెఱువు నుండి మరియొక కాలువను సరఫరాకైత్రవ్వించి, భూమిని చదును చేయించి 5000 **కుళి** భూమిని సాగులోనికి తెచ్చి, ఈ వనరుల ద్వారా ధాన్యం దిగుబడిలో వృద్ధి నుండి, శ్రీ వేంకటేశ్వరునికి నిత్యమూ ఒక తిరుప్పోనకం నైవేద్యానికి కల్పించి, నెయ్యి కోసం, నైవేద్యానికి ఆలయంలో శక సంవత్సరంలో, అనగా క్రీ.శ 13-3-1409న, ఏర్పాటు చేశాడు. (నెం.194) మల్లాణుని ఈ రెండు సేవలూ, నైవేద్యం, నిత్యదీపం అనునవి ఒక చిన్న సంస్కృత శ్లోకంలో (నెం.195) వర్ణించ బడినాయి. ఆతడు 1వ బుక్క నుండి 2వ దేవరాయల వరకు నల్గురు విజయనగర చక్రవర్తుల క్రింద సేవ చేశాడు. (నెం. 194) మల్లాణుని ఈ రెండు సేవలు, నైవేద్యం, నిత్యదీపం అనునవి ఒక చిన్న సంస్కృత శ్లోకంలో (నెం.195) వర్ణించ బడినాయి. ఆతడు 1వ బుక్క నుండి 2వ దేవరాయల వరకు నల్గురు విజయనగర చక్రవర్తుల క్రింద సేవ చేశాడు. (దేవ.ఎపి.రిపోర్టు, పే.134-185), క్రీ.శ. 2-10-1444కు సరియైన 1366వ శక సంవత్సరంలో మరల నాతడు **పాడి గ్రామం**లోని చెఱువుకు ఒక సాగునీటి కాల్వను త్రవ్వించి, దానితో పెరిగిన పంట ద్వారా ఆ దేవునకు రెండు సంధి నైవేద్యములను ఏర్పాటు చేశాడు. ఇంతలో శక సంవత్సరానికి1339లో నాతడు తిరుమహామణి మంటపమును (గర్భగుడి ఎదురుగా పై కప్పులేని నడవ) కట్టించి, దానిని శ్రీ వేంకటేశ్వరునికి తన సేవగా క్రీ.శ.1417 ఆగష్టు 25న అంకితము చేసెను (నెం.196). శిథిలశాసనము (నెం.198) ఈ పొడి మాటలను నమోదు చేయును: పణము. దీనిని బట్టి ఆతడు **ఆనందవిమానము**నకు (గుడిపై కలశము) సంబంధించిన కొంతపని నేదో చేయించినట్లు తోచును, మరమ్మతులో, లేక రంగులద్దుటో, అట్టి యొకటి మొట్టమొదటిసారిగా విమానము పేరు **'ఆనందవిమానము'** అని తెలుప బడినది. **ఎల్లకంపయదేవ మహారాజు** కుమారుడు పెరి-మల్లయదేవుడు, శక సంవత్సరం 1368లో, క్రీ.శ.1446 అక్టోబరు 10న (నెం.210) (పే.137-138, దేవ. ఎపి. రిపోర్టు) తిరువేంగడ ముడైయాన్‌కు నిత్యం ఒక తిరుప్పోనకం సమర్పించడానికి 1000 పణాలు చెల్లించాడు. వీరి తండ్రికి ఈ సాళువ బిరుదులున్నవి: **శ్రీమన్ మహామండలేశ్వర, మేదినీ-మీసరగండ** (భూమిపై మీసము గలవారిలో మొనగాడు, అనగా సైనికుడు, అనగా సైనికుల ముఖ్య నాయకుడు), **కఠారి సాళువ** (కత్తిని కుటుంబ చిహ్నముగ దాల్చిన సాళువ కుటుంబసభ్యుడు).

శక సంవత్సరం 1372, క్రీ.శ.1450 అగష్టు 31న ఇంకొక సాళువ సేనాపతి **సిఋమల్లైయదేవ మహారాజు, మలగంగయదేవ మహారాజు** కుమారుడు, పై జెప్పిన సాళువ బిరుదులు గలవాడు, వేంకటేశ్వరునకు నిత్యం ఒక తిరుప్పోనకం చేయించడానికి 1200 నఞ్ పణాలు చెల్లించి, దానిపై వడ్డీని వినియోగించేటట్లు చేశాడు. వేంకటేశదేవునకు ఈ నైవేద్యముల నర్పించునపుడు ఈ దాతలు తమ వంతుకు వచ్చే నాల్గవ వంతు ప్రసాదాన్ని స్వీకరించడానికై ఆలయంలో ఉండరు కాబట్టి, 1వ బుక్క రాయల పేరున యేర్పాటైన **రాయర్‌సంధి**తో సహా(నెం.178) అప్పటి వరకున్న దాతల నివేదనల ప్రసాదం మొత్తాన్ని, వాడుకలో నున్న ఆచారం ప్రకారం, అనగా, ఆలయ పరిచారకులు, యాత్రికులకు పంచబడుతుంది.

**కోయిల్‌-కేళ్వి**(పర్యవేక్షకుడు లేక ఆలయనిత్యకృత్యముల నిర్వాహకుడు), **పంకయచ్చెల్లి-తిరునందవనము** (పూదోట) తిరుమల మఠానికి గూడ యజమాని నిర్వాహకుడు అయిన ఎంబెరుమానార్ జీయర్, ఆలయ కోశాగారంలో, శక సంవత్సరం 1367, క్రీ.శ.1445 డిశెంబరు 13న, 2000 నఞ్‌పణాలు నిక్షేపించి, నిత్యం **బుక్కరాయ-సంధి**గా జరిగే పూజతో కూడ శ్రీ వేంకటేశ్వరునకు 2 తిరుప్పోనకం సేవగా అర్పించడానికి యేర్పాటు చేశాడు. కోయిల్-కేళ్వి, వారు పూదోటకు, మఠానికి (మత సంబంధి వ్యవస్థ) యజమాని యని మొదటిసారి వచ్చిన ప్రస్తావన ఇది (నెం.219). ఆతడు స్థానత్తార్ నందలి సభ్యులలో కూడ ఒకడు.

ఈ ఎంబెరుమానార్ జీయర్ శ్రీభండారంలో మరికూడా కొన్ని నిధుల్ని నిక్షేపించాడు. ఈ ధనంతో తిరుమలలో ఉత్సవ విగ్రహాలకు పుష్పయాగం (10వ రోజున మూలమూర్తి, ప్రధాన విగ్రహం, పూలతో పూర్తిగా అలంకరింపబడి నప్పుడు) తన పూదోట మంటపంలో గరుడ పతాకాన్ని ధ్వజంపై ఎగురవేయడంతో ప్రారంభమయ్యే 7ఉత్సవాల్ని, పంగుణి నెలలో ప్రారంభమయ్యే వానిని జరుపడానికి, తిరుపతిలో 9వ రోజున విడాయాట్టి (ఉత్సవశ్రమ తరువాత విశ్రాంతి); వైకాశి, ఆణిలలో జరిగే ఉత్సవాలకై క్రీ.శ.1446 ఫిబ్రవరి 17న 1000 పణాలు చెల్లించబడింది (నెం.220). బీజావాపంనాడు తిరుమలలోని 7 ఉత్సవాల ప్రారంభం రోజున, తిరుపతిలో రెండు ఉత్సవాలకై క్రీ.శ.1446 జూన్ 27న 1000 నఞ్‌పణాలు చెల్లింపు కైయార్-చక్రం[1]( సుదర్శన చక్రాన్ని విత్తనాలను నాటడానికై కొద్దిపాటి మట్టిని తెచ్చుటకు బైటకు తీసికొని వెళ్ళుట) రోజు పూజల కోసం జరిగింది. (ఇది క్రీ.శ.1447 జులై 17న జరిగింది. (ఇది క్రీ.శ.1457 ఫిబ్రవరి 21న, చివరిదగు 5000 పణము చెల్లింపు జరిగింది. ఇది గోవిందరాజుకు నిత్యం తిరుక్కణామదై అను ఒక రాత్రి పూజకు ఉద్దేశింపబడినది (నెం.223). ఇదిగాక ఈ ధనంతో ఆలయానికి దానం చేయబడిన అవిలాలిలో ఒక చెఋవును త్రవ్వించడానికి ఉపయోగించడానికి ఉద్దేశింపబడింది.

1. ఇదికూడ పై చెప్పబడిన విత్తనాలు నాటడమనే అంశానికి చెందినవి. అయినప్పటికీ ఈ రెండు వేర్వేరు అంశాలుగా చెప్పబడినవి. బహుశః ఆ రోజున ముందుగా ఒక పూజను జరిపి, అదే రోజున తరువాత సమయంలో మరియొక్కటి జరుపబడుట ఉద్దేశమై ఉంటుంది.

నెం.220లో ప్రసాద వినియోగం ఏ పద్ధతిలో జరుగవలయునో సూచింపబడింది. పూర్వపు శాసనాలలో దాత ఒక నాల్గవవంతు నైవేద్య ప్రసాదాన్ని గ్రహించడానికి అధికారం కలవాడని చెప్పబడింది, కాని మిగత మూడు వంతులు ప్రసాదాన్ని ఎట్లా వినియోగించాలనో చెప్పబడ లేదు. ఈ రికార్డులో ఇట్లు చెప్పబడినది: 24 నాళి ప్రసాదంలోనుండి 4 నాళిని అదే మఠంలో ఉంటూ పంకయచ్చెల్లితోటను, చూచుకొనుచున్న ఏకాకి– శ్రీవైష్ణవులకు ఉచితంగా ఇవ్వబడింది; 12 నాళి, స్థానత్తార్ (ఆలయ నిర్వాహకులు) 12 నిర్వాహం(పాళ్ళు)నకును, 8 నాళి ప్రసాదం, 1 నాళి అక్కాళిప్రసాదం, 7 అప్పప్రసాదమును, మంటపములో **తిరువాయ్మొళి**ని పఠించు శ్రీ వైష్ణవులకును ఉచితంగా ఇవ్వబడింది. 4+12+8 నాళి మొత్తం 24 నాళి ప్రసాదమౌతుంది. దాత భాగమగు అక్కాళి ప్రసాదంలో నుండి కొద్ది భాగం దాతచే ఉచిత బహుమతిగా **ఎంబెరుమానడియార్** (ఆలయ దాసీలు) వారికిని, ఇంకొక భాగం **తిరువగంపడి-కైక్కోళర్,** ఆలయంలో కొంత సేవ చేసే నేతపనికివారికిని ఇవ్వబడింది. అప్పటికిని మిగిలిన 4 నాళి, 7 అప్పాన్ని దాత స్వీకరిస్తాడు.

దాతకు రావలసిన నాల్గవ వంతు అప్పప్రసాదం ఇక్కడ 14 అంకాలుగా చెప్పబడింది, కాని సాధారణంగ అది 13 మాత్రమే. ఎందుకనగా మొత్తం అప్పాలు సంఖ్యకూడ మిగత పణ్యారముల రకాలు (తినుటకు వీలయిన రొట్టెలు, వేపుడు వస్తువులు) సంఖ్యయు కలిపి 52 మాత్రమే. ఇది గోవిందరాజుల ఆలయంలోని అదే శాసనంలో పంపిణీ గురించిన సమాచారం ప్రకారం, ప్రసాదం 24 నాళి దాతకిచ్చు నాల్గవవంతు 8 నాళి చిల్లర **మఠశేషప్రసాదం,** 2నాళి **అక్కాళిప్రసాదం,** 13 అప్ప ప్రసాదం.

ఈ **కోయిల్-కేళ్వి ఎంబెరుమానార్ జీయర్,** తిరుపతిలోని రెండు ఉత్సవాల, తిరుమలలోని ఏడు ఉత్సవాల కాలంలో పూజలు ఏర్పాటు చేయడంలో, పెరియపెరుమాళ్ అనే స్వామికి **పూజయ మాత్రై**యును (పెరుగు అన్నం, ఉప్పయిన లేకుండ కూడ), **తిరువీట్రిరుంద – పెరువీట్రిరుంద – పెరుమాళ్**కు, గోవిందరాజు ఆలయంలోని స్వామికి గూడ, చెప్పబడిన రెండు ఆలయాలలోని రెండు ప్రధానమూర్తులకు పూజానైవేద్యాదికాలను యేర్పాటు చేశాడు. ఏ స్వామి ఉద్దేశింపబడినాడో తెలియదు. (నెం.220, నెం.221) ఇట్లే నెం.184లో స్థానత్తార్‌లలో ఒకరైన దాత **అళగప్పిరానార్ తిరుక్కలి కన్రిదాసర్** అనే వ్యక్తి ఎవరో ఒక పెరుమాళ్‌కును (వారి పేరు నష్టమైనది), **శ్రీ వరహ-నాయనార్** (శ్రీవరాహస్వామి, శ్రీ స్వామి పుష్కరిణి పడమటి తీరంలో ఆలయంలోనున్న స్వామి, వీరి పేరు మొదటిసారి ఈ శాసనాలలో కన్పిస్తుంది), **పెరియ-పెరుమాళ్,** అనగా **మూలమూర్తి** వేంకటేశ్వరునితో కూడ పూజ చేయడానికి ఏర్పాటు చేశాడు. ఇది శక సంవత్సరం 1301లో క్రీ.శ.1380 జనవరి 13న జరిగింది.

నెం.187లో వేంకటేశ్వరుని ఆలయస్థానత్తార్‌లోని 12 మంది నిర్వాహం సభ్యుల మధ్య ఒక్కొక్కరికి పంచవలసిన పద్ధతి చెప్పబడింది: 11 నాళి ప్రసాదం, దాత **ముల్లైతిరువేంకట జీయర్, అరిశాణాలైయన్ – తిరునంద వనం మఠాల అధిపతి,** 'అనగా, తమరు బహూకరించిన ప్రసాదాన్ని స్థానత్తార్ ఈ రీతిగా పంచుకొంటాడు : తిరుపతి శ్రీవైష్ణవులకు నాలుగు నిర్వాహం – **తిరుచ్చుకనూర్ సభైయార్**కు మూడు

నిర్వాహం, కోయిల్-కేళుక్కుం-జీయర్లకు రెండు నిర్వాహం, **నంబియార్** (ఆలయ అర్చకులు)కు 1 నిర్వాహం, **కోయిల్- కణక్కు-తిరునిన్ఱైయూర్-ఉడైయార్** కు రెండు నిర్వాహం'. ఈ అంకెలు సూచిస్తుంది, తిరుపతి శ్రీవైష్ణవులలో 4, తప్పనిసరిగా, తిరుచానూరు సభైయార్ సభ్యులు 3, ఆలయార్చకులలో 1, బహుశా ప్రధానార్చకుడు, కోయిల్-కేళ్కుం జీయర్లు 2, ఒకరు పెద్దవారు, ఒకరు చిన్నవారు, ఇప్పటి వలెనే, ఆలయ పద్దులు వ్రాసేవారు 2, వీరు తిరునిన్ఱ-ఊర్ (లక్ష్మీ నివసించే గ్రామం), తిరువళ్ళూరు దగ్గర తిన్ననూర్, ఆర్కోణం మద్రాస్‌ల మధ్యరైలు మార్గంలో. ఈ ఆలయానికే చిన్న జీయర్ ధర్మకర్త (శ్రీవేంకటేశ్వరుని **ఆలయ స్థానత్తార్,** అనగా నిర్వాహకంగా కార్యవర్గమును కల్పించినవాడు).

(ఆలయానికి ఉత్తరంలో సుమారు 3 మైళ్ళు దూరంలో) పాపనాశతీర్థం దగ్గర ఒక పూదోటలోనున్న ఆశ్రమంలో నివసించుచున్న శ్రీరాయదాసు అనే వ్యక్తి శకసంవత్సరం 1377లో క్రీ.శ. 7-7-1454న, తన పేరున శ్రీవేంకటేశ్వరునకు నిత్యము 1 తిరుప్పోనకం అర్పించడానికి 1000 పణాలను చెల్లించాడు (నెం.225, నెం.226). ఆతడే మంచి గోవులను, ఆభరణాలను కూడ బహూకరించాడు. (నెం.227). నెం.211లో, తిరుపతికి చెందిన **సాత్తాదశ్రీవైష్ణవులలో** ఒకరైన (సాధారణంగా **సాతానివారు** లేక **దాసనంబి** అను వారు ఆలయానికి పూమాలలను చేసియిచ్చేవారు) **కరుణాకరదాసు** అనునాతడు, శక సంవత్సరం 1364లో, క్రీ.శ.1442 జూన్ 29న, నిత్యము గోవిందరాజునకు 1 తిరుప్పోనకం సమర్పించడానికై 100 పొన్ (బహుశ వరహాలు అనబడు బంగారు నాణేలు) చెల్లించాడు. అట్లే, **తెప్పద నాగెయ నాయకుడు** 100 హోన్ను లేక పొన్ అదే శకసంవత్సరం 1364లో, క్రీ.శ.1443 జనవరి 12న, నిత్యం శ్రీ వేంకటేశ్వరునకు ఒక అర్చనకై నిక్షేపించాడు (నెం.209), 100 బంగారు నాణేలు ఇతరులు అదే అర్చనకై నిక్షేపించాడు (నెం. 209), 100 బంగారు నాణేలు ఇతరులు అదే అర్చనకై చెల్లించిన 1000 పణము లేక నఱ్పణానికి సమానమై యుండును. ఈ దేవతకు నిత్యం ఒక తిరుప్పోనకం సమర్పించుటే ఆ అర్చన.

**కొల్లి కావలిదాసర్** అను నామాంతరంగల పెరుమాళ్, శక సంవత్సరం 1308లో, క్రీ.శ.1387 ఫిబ్రవరి 24న గోవిందరాజునకు నిత్యం ఒక తిరుప్పోనకం అర్పించుటకై 100 పణాలు చెల్లించాడు (నెం.228)

ఈ విధంగా వేంకటేశ్వరునకు, గోవిందరాజునకు ఈ కాలంలో నిత్యనైవేద్యాలు అధిక సంఖ్యాకాలైనవి.

పతాకధ్వజంపై పతాకం ఎగురవేయునప్పుడు జరిపించు ఉత్సవాలు, **తిరుక్కోడి-తిరునాళ్,** పూర్వము మూడు కాని నాలుగు కాని ఉండేవి. ఇవి పురట్టాశి, చిత్తిరై, ఆడి నెలలలోను, రాకుమారి సామవై ఏర్పరచిన మార్గళిలోని ఉత్సవం, అది కూడ వాడుకలోనున్నట్లయితే. విజయనగర రాజ్యం మొదటి వంశపాలనలో రెండు కొత్త ఉత్సవాలు చేర్చబడినాయి. అవి ఒకటి, రెండవ హరిహరరాయల పేరున ముల్లై తిరువేంకట జీయర్ క్రీ.శ 1388లో మాశినెలలో జరిపించేది; రెండవ దేవరాయలు తన వ్యక్తి దర్శన సందర్భంలో క్రీ.శ 1429 డిసెంబరు 5న జరిపించు ఆశ్వయుజ మాసం లోనిది రెండవది. ఇది పునర్వసు రోజున

ఉత్సవం ప్రారంభించి స్వాతి నక్షత్రం రోజున సంపన్నం చేసేటట్లు మూడు గ్రామాలు దానంగా, 2200 వరహాలు బహుమతిని ఇచ్చాడు. (నెం. 192) ఆశ్వయుజ మాసం తమిళ నెల పురట్టాశితో సమంగా నడుస్తుంది. ఈ ఉత్సవం శ్రావణ నక్షత్రంనాడు ఆశ్వయుజంలో శుక్లపక్షంలో ఉత్సవం ప్రారంభం ఆశ్వయుజంలో కృష్ణపక్షంలో పునర్వసు నక్షత్రం రోజున జరుపబడవలసి ఉంది. ఇట్లు ఉత్సవాలు 5 లేక 6 అంకెకు పెరిగినాయి. ఎన్నో శాసనాలలో వేంకటేశ్వరుని ఉత్సవాలు ఏడు అనియు, గోవిందరాజుకు వైకాశి, అణిలలోని రెండు ఉత్సవాలనియు, మొత్తం 9 అని పేర్కొనబడినాయి (నెం,21కి, నెం.215, నెం.220) నెం. 215 ఆడి ఉత్సవము నుండి చిత్తిరై ఉత్సవం వరకు ఏడవ ఉత్సవంవరకు ఏడు ఉత్సవాలను లెక్క బెట్టుతారు, కాని, దాతల పూజలకు పంగుణి ఉత్సవం నుండి ప్రారంభమని చెప్పును. ఏది యెట్లయినా, ఈ శాసనాలలో ఒక దానిలో నైనను యే యేడు నెలలలో ఈ ఏడు ఉత్సవాలు జరిగాయని స్పష్టంగ ప్రకటించలేదు. బహుశః అవి ఆడిలో పురట్టాశి రెండు ఉత్సవాలు బహుశః, మార్గళి, మాశి, పంగుని, చిత్తిరై నెలలో వేంకటేశ్వరునికి ఐదు ఉత్సవాలు, తిరుపతిలోని గోవిందరాజునకు రెండు ఉత్సవాలు, వైకాశి నెలలోను, ఆణి నెలలోను చెప్పబడినాయి.

ఈ ఉత్సవాలలో దాతలు గుడిలోని ప్రధానదైవానికి కొన్ని రోజులలోను, ఉత్సవ విగ్రహాలకు వేర్వేరు మంటపాలలో పూదోటల్లో, ఊరేగింపుల సమయాలలో, మిగత చోట్ల తొమ్మిది లేక పది రోజుల ఉత్సవాలలో ఎక్కడో ఒక చోటను అర్చనలకు ఏర్పాటు చేశారు.

మూలమూర్తికి నిత్యం జరిపే ఆరాధనలు కాక, ఏడు ఉత్సవాలలో కొన్నింటిలో కూడ, కొందరు దాతలు వేరే మరికొన్ని సందర్భాలలో స్వామి అర్చనకై ఏర్పాటు చేశారు. తిరుపతికి చెందిన శ్రీవైష్ణవులలో ఒకరును, తిరుమలకు చెందిన స్థానత్తార్‌లో సభ్యులు నైన **ముదలియార్ - తిరుక్కలి - కన్టిదాసర్ ఆళగప్పిరానార్** అనునాతడు శక సంవత్సరము 1356లో, క్రీ.శ 1434జులై16న, తన పేరున **తిరువేంగడం-ఉడైయాన్**కు దక్షిణాయనంలో ఆడి మొదటి రోజు నుండి మార్గళి చివరిదాకా, అనగా ఉత్తరాయణం నుండి (దాదాపు జులై నుండి మార్గళి చివరివరకు, అనగా ఉత్తరాయణం నుండి (దాదాపు జనవరి 15) ప్రతి రోజున్నూ సూర్యోదయ కాలంలో దేవుని పూజా వేళను, ముఖలేపనంగా పునుగుతైలాన్ని, హారతి నివ్వడానికి కర్పూరానికి (నెం.207) ఒక సంధిని ఏర్పాటు చేయుటకై, చెల్లింప బడిన 4000 నఙపణంపై వచ్చు ఆరు నెలల వడ్డీని వినియోగించునట్లు చేశాడు.

శకసంవత్సరం 1367లో క్రీ.శ.1445 డిసెంబరు 13న ఒక ఉత్తిర-పడి (ఉత్తరఫల్గుణి నక్షత్రమునాడు చేయు ఒక పూజ) శ్రీ గోవిందప్పెరుమాళ్‌కును, ఒక రోహిణి-పడి శ్రీకృష్ణునికిని (రోహిణి నక్షత్రము రోజున చేయు అర్చన) ప్రతి నెల ఈ నక్షత్రములున్న రోజులలోను, గోవిందరాజునకు **తిరుప్పళ్ళి - ఎళుచ్చి** 30 రోజులలో ప్రతిరోజును మార్గళి నెలలో (నెం. 212) ఒక **తిరుక్కణామదై** యేర్పాటుకు 4 దాతలు 400 చక్రపణము నిక్షేపించిరి.

శక సంవత్సరం 1312లో క్రీ.శ.1390 డిసెంబరు 8న ఒక తిరువో-లక్కంను, మార్గళి నెలలో ఉత్సవవిగ్రహాల సమక్షంలో, మలై-కినియనిన్ర- పెరుమాళ్, నాచ్చిమార్లకు తిరుమలలో తిరుప్పావై పఠించు 10రోజులలో మధ్యరోజున సమర్పించేటట్లు ముల్లై తిరువేంకట జీయర్ 1200 పణము చెల్లించిరి. అట్లే, సాత్తుముఱై (చివరి) రోజున ఒక చెల్లింపు. అట్లే గోవిందరాజుకు తిరుప్పావై 10 రోజులలోను మార్గళిలో అధ్యయనోత్సవం కాలంలో (నెం.187). ఈ శాసనం నుండి తిరుప్పావై పఠనం, రెండు ఆలయాలలోను, అధ్యయనోత్సవంలో మధ్యగల 10 రోజులలోనే జరుగుతుందని తెలుస్తోంది.

ఆత్రేయ గోత్రజుడైన శాయణ్ణగళ్ కుమారుడును, శాంతప్ప నాగప్పణన్ తమ్ముడును అయిన గిరిదేవప్పగళ్, 600 పణమునకు తిరుమలపై లక్ష్మీ-నారసింహన్- మంటపాన్ని, ఒక నందవనమును కొని, దానిని ఆలయానికి సమర్పించాడు. అందుకుగాను శక సంవత్సరం 1326లో క్రీ.శ.1404డిసెంబరు 18న చేయబడిన ఏర్పాటు ననుసరించి, ప్రతి యొక్క ఉత్సవ విగ్రహములకు ఈ మంటపంలో ఒక **తిరువోలక్క చ్చిఱప్పు**ను సమర్పించబడుతుంది.

శ్రీవేంకటేశ్వరుని ఆలయంలో ఏకారణం చేతనోగాని వేద పారాయణం (వేదములు చదువుట) ఆగిపోయెను. ఐనను తిరువేంగడముడై యాన్‌కు అన్ని ఇతర సేవలలోను వైభవం అట్టే నిలిచి ఉండినది. ఈ విషయంలో తిరుమల స్థానత్తార్‌లలో ఒకరైన ముదలియార్ తిరుక్కలికన్రి - దాసర్ అళగప్పిరానార్ అనునతడు శ్రద్ధవహించి చొరవచూపెను: ఆతడు చంద్రగిరి రాజ్యమునకు రాజపాలకుడు (గవర్నర్) అయిన **ఉడైయార్ దేవణ్ణ-ఉడైయార్**కు ఈ విషయమును నివేదించి, నిలిచిపోయిన ఆచారమును మరల ప్రారంభించుట ధర్మమనియును, దానికై ఆనాటి విజయనగర చక్రవర్తి యైన దేవరాయ మహారాయలు (2వ దేవరాయలు) శ్రీనివాసపురమను మరియొక పేరుగల **సిద్ధకుట్టై** గ్రామములో సగమును దానము చేసెననియును, అది రాజభండారము (రాజుగారి ధనశోశము)నకు చెందిన దనియును, దానిని శ్రోత్రియముగ (వేదవిదులకు, లేక వేదపండితులకై ఆలయమునకు అప్పగించి, 24 మహాజనము, వేదపాఠకులకు వేద పారాయణము చేయువారి కిచ్చుటకై ఇవ్వబడినట్లును నివేదించెను. ఈ గ్రామం వైకుంఠ-వళనాడులోని, చంద్రగిరి సమీపస్థ కొట్టాల స్థలంలో కలదు. ఈ 24 మహాజనం అందలి పంట తమ భుక్తికి సరిపోని దగుటచేత, ఆలయానికి చెందిన మిగత సగం గ్రామాన్ని, సంవత్సరానికి 200 పణము ఆదాయమునిచ్చు దానిని, తమకు ఇప్పించవలసినదిగా స్థానత్తార్‌ను కోరాడు. ఈ ఆదాయాన్ని ఆలయం చేకూర్చుకొనలేదు కనుక ఇంకొక విధంగా ఆ నష్టాన్ని పూరించుకోవాలి. శ్రీ భండారానికి చెందిన ఆ సగం గ్రామాన్ని అంగీకరించి, ఒక ఒప్పందానికి గ్రామాధికారులున్ను, తిరుక్కుడవూర్-నాడు, వైకుంఠ నాడు అను రెండు నాడుల అధికారులున్ను, ప్రతి గ్రామానికి ఎంతెంతకు ఒకప్పందమో ఉట్టంకించుచు, రిజికుట్టై గ్రామాన్ని యొక్క సగం భాగాన్ని 24 మహాజనానికి ఇచ్చివేసి, వారికి శ్రీవేంకటేశ్వరుని ఆలయంలో ప్రతి నెల ఇద్దరు చొప్పున 12 జతలుగా 12 నెలలును వేదపారాయణం చేసే బాధ్యతను అప్పగించాడు. ఇట్లు తిరుక్కలికన్రిదాసర్ ఎంతో కష్టపడి ప్రయత్నించి శ్రీవేంకటేశ్వరుని

ఆలయంలో మరల వేదపారాయణం జరిగేటట్లు కట్టడి చేశాడు. ఈ వివిధాలైన లావాదేవీలు నెం.199-203లో నమోదు, చేయబడి ఉన్నాయి. వీనిలో 199 రాజభండారం భాగాన్ని, దానిని 24 మహాజనానికి స్వాదేవీలు నెం. 199-203లో నమోదు చేయబడి ఉంది. వీనిలో 199 రాజభండారం భాగాన్ని, దానిని 24 మహాజనానికి నమోదు చేసింది. ఇది శక సంవత్సరం 1433 క్రీ.శ. 1433 నవంబరు 22 నాటిది. నెం. 201 శిలాశాసనం, శ్రీభండారానికి గ్రామాధికారులు వ్రాసిన తమ చందా ఒప్పందం, ప్రతి గ్రామానికి వ్రాసిన తమ చందా ఒప్పందం, ప్రతి గ్రామానికి వారు వేసిన సాధికారముద్ర తేది క్రీ.శ. 1433 నవంబరు 22. దీనితోబాటు క్రీ.శ.1433 అక్టోబరు 25, ఉత్థానద్వాదశి రోజున వారి చందాయన ప్రమాణం ద్వారా నిశ్చితం. నెం.202 ప్రతి గ్రామం యొక్క చందా భాగం చెప్పేది. ఇది ఒక రోజు తర్వాత తేది వేయబడింది, క్రీ.శ.1433 నవంబరు 23. నెం.200, నెం.203 గ్రామములో శ్రీభండారానికి చెందిన సగం గ్రామం బహూకరణను గూర్చి స్థానత్తార్ 24 మహాజనానికి ఇచ్చిన సగం భాగం గూర్చి, వారిని మాసానికి ఇద్దరు వంతున సేవ చేసే ఏర్పాటును గురించి ఉన్న ఈ రెండు శాసనాలకు తేది వేయబడలేదు.

ఇది ఇలా ఉన్నప్పటికిన్నీ, స్థానత్తార్ తదితరులను వేదపారాయణం నందాసక్తిని కనబరచక, వేదపాఠకులను ప్రసాదాలతో ప్రోత్సహించకుండి నట్లు కనబడుతుంది. కాని, తిరువాయ్‌మొళి పఠించువారికి దాత కోయిల్ – కెళ్వి ఎంబెరుమానార్ జీయర్ కల్పించిన భాగం ప్రసాదం నిచ్చి ప్రోత్సహించారు (నెం.220).

రెండు శాసనాలు ఇండ్ల స్థలాల అమ్మకాలను గూర్చి ప్రస్తావిస్తుంది. అవి ఒక్కొక్కటి నాలుగు విడి భాగాలుగా ఉన్నాయి, శిథిలమై ఉన్నాయి. వాని కాలం శక సంవత్సరం 1355లో (క్రీ.శ.1433) రెండవ దేవరాయ మహారాయలనుగాని వాని బిరుదాలలో ఒక భాగాన్నిగాని ప్రస్తావిస్తుంది. పెరుమాళ్-దేవియార్ అను నామెకు తిరుమలపై ఇండ్లస్థలములున్నవి. ఆమెకు సంతానం లేదు. ఆమె ఆ ఇండ్లస్థలాలను ఆలయానికి విక్రయించాలని కోరింది. బహుశః స్త్రీ చేయు విక్రయం చెల్లదని భావించారు కాబోలు! దేవణ్ణ ఉడైయార్, చంద్రగిరిరాజ్య గవర్నరుగా సిద్ధకుట్టెని రాజభండారం భాగంగా, రెండవ దేవరాయల ధర్మంగా శకసంవత్సరం 1355లో (నెం.199), వేద పారాయణం కోసం ఆలయానికిచ్చి అతడు, ఆమెనుండి ఆ స్థలాలనుకొనదానికి, ఆ పై వానిని శ్రీ భండారానికి విక్రయించడానికి, "నాపై దేవణ్ణ ఉడైయార్ ఉంచిన బాధ్యత మేరకు" లభించిన ఆస్తిని నేను స్వాధీనం చేసికొనునప్పుడు", **శ్రీ శఠకోపనంబి అళగప్పిరానార్ గోవిందన్**కు అధికార మిచ్చెను. అప్పుడున్న విలువను బట్టి ఆతడట్లే చేశాడు. నెం.204 ప్రకారం, తిరుమలలోని నాలుగు ఇండ్ల స్థలాలను వానిలోని ఇండ్లతో సహా 700, 1000, 1000 పణాలకు విక్రయించాడు. నెం.205 ప్రకారం, నాలుగు ఇండ్ల స్థలాలను వానిపై గల ఇండ్లతో సహ తిరుపతిలో 2000, 450, 1500, 4200 పణాలకు రిజిస్ట్రేషన్ ఖర్చుతో కూడ అమ్మాడు. ఈ విక్రయాలు అక్కడి **ఆవణక్కళరి** రిజిస్ట్రేషన్ కార్యాలయములో రిజిష్టరైనట్లు చెప్పబడినది. ఈనాటి విక్రయదస్తావేజుతో పాటించు పద్ధతులన్నీ ఈ 15వ శతాబ్ది నాటి దస్తావేజులలో కనిపిస్తాయి: ఉదాహరణకు : దీనిపై చేవ్రాలు చేశాను; క్రయం చేసికొన్న హక్కు కారణంగా

ఈ ఆస్తి నీ పరమగును, నేనిట్లు రెండవ పర్యాయం, మూడవ పర్యాయం ప్రతిజ్ఞా పూర్వకంగ ప్రకటిస్తున్నాను. దానిపై యేదైన అప్పు వగైరా ఉన్నట్లు తెలియవస్తే, అట్టి అప్పు వగైకృతి ఒనరులు, భవిష్యత్తులో పొందబడునవి, వెంటనే లభించు వస్తువులు, భవిష్యత్తులో జరుగుమార్పులు, అట్టి యాజమాన్య సంబంధమైన ఇతర విషయాలు న్యాయమైన హక్కుగా మీకు చెందుతాయి; హక్కుగా దీనిని అమ్ముట, తాకట్టుపెట్టుట, వస్తుమార్పిడి చేయుట, విభజించుట, వారసత్వంగా స్వీకరించుట, బహూకరించుట మరియు అన్ని విధాల వ్యవహారాలకును తగును; వేరొక ధరను నేను కోరకపోడానికి అంగీకరిస్తాను, ఇటువంటి వేరొక దస్తావేజుపై ధరను నేను కోరకుండుటకు అంగీకరిస్తాను, ఇటువంటి వేరొక దస్తావేజుపై సంతకం చేయను; ఇందులో అక్షరాలు, మాటలు జారిపోయినవని క్రొత్తగా మరియొక దస్తావేజు వ్రాయించి, మరల రిజిష్టరు చేయించవలెనని కోరకపోవడానికి నేనంగీక రింతును. నెం.205లో ఇట్లున్నది: కాణిక్కై (దానము) శ్రీభండారానికి దేవణ్ణ-ఉడైయార్ ద్వారా చేయబడినది. గోవిందన్ దస్తావేజుపై చేవ్రాలు చేసెను. విక్రేతయు మరి కొందరు వ్యక్తులును సాక్ష్యంగా ఉండినారు.

నెం.206 దేవరాయల కాలానికి చెందిన, ఒక ఆడపిల్లను దత్తత చేసికొన్నదానిని గూర్చింది. ఇది శిథిలమైన విడిగానున్న శాసనం. ఈ దత్తతకు గుర్తుగా, దత్తత తీసికొన్న తల్లి మిరియపునీళ్ళను, అసలు తల్లి పసువు నీళ్ళను త్రాగినట్లు దీనిలో ఉన్నది.

అసమగ్రమైన నెం.230డి ఏదో ఒక ఇంటి స్థలం యొక్క విక్రయాన్ని గూర్చి ప్రస్తావిస్తాయి. చిత్తిరై నెలను, అన్న ఊంజల్(హంసరూపంలోని ఊయల)ను ప్రస్తావిస్తాయి. బహుశః చిత్తిరై నెలలో ఒక డోలోత్సవం జరుపబడి ఉంది. ఈ ఉత్సవం బహుశః రెండవసారి సాళువ నరసింహరాయలచే శక సంవత్సవం 1395లో, క్రీ.శ.1473 జూన్ 15న, మిథునం (జూన్-జులై)లో శుక్లపక్షంలో అయిదు రోజులపాటు జరుపబడి ఉంటుంది. (నెం.50, సం.ıı). అసమగ్రమైన ఈ ఖండంలో చెప్పినట్లు చిత్తిరైలో (ఎప్రిల్-మే) కాదు.

సాళువ నరసింహుని ఒక ప్రసిద్ధ పూర్వీకుడు, వారి ముత్తాత **సాళువ మంగి మహారాజు,** ఒకటవ గుండని కుమారుడు, ఒకటవ బుక్కరాయల ప్రసిద్ధ సేనాపతి. వాని కుమారుడగు కుమార కంపణునిపై తిరుగుబాటుచేసిన దక్షిణదేశపు పాలకులపై యుద్ధము చేసెను. ప్రత్యేకించి **సాంపరాయనిపై** లేక **సంబువరాయని**పై కాంచీ పట్టణం చుట్టుగల మధ్యప్రాంతభూమిలో, పాలార్‌నది యొక్క దక్షిణ సరిహద్దుపైనను, మరికొందరు చిన్న చిన్న సేనాపతులతోను, మధుర మహమ్మదీయ సుల్తానును ఎదుర్కొన్నాడు. సాంపరాయడు లొంగిపోయినందున మరల సింహాసనంపై ప్రతిష్ఠింప బడినాడు. మధుర సుల్తాను వాని సైన్యం పూర్తిగా నాశనంగావింపబడి వారి వేధింపుల నుండి పాండ్యదేశం విడుదల చేయబడింది. అందుచేత **'సాంపరాయ స్థాపనాచార్య'** (గౌరవనీయులైన సాంపరాయప్రతిష్ఠాపకులు) అను బిరుదాన్ని పొందెను. ఈ సాంపరాయడు లేక సంబువరాయడు **తెలుంగ సాంపరాయడు, సంబుకుల**

**చక్రవర్తి తిరుమల్లినాథ సంబువరాయప్పెరుమాళ్** అని నెం.183లో తిరువేంగడముడైయాన్‌కు ఏదో బహూకరించినట్లు చెప్పబడిన వాని కుమారుడై యుండవచ్చు. మధుర, సుల్తాన్‌ను నాశనం చేసి మధురను జయించిన తరువాత, మంగిదేవుడు **'పరపక్షిసాళువ'** బిరుదాన్ని పొందినట్లు చెప్పబడి ఉంది. బహుశః ఈ బిరుదాన్నే సంగ్రహించి 'సాళువ' యను వంశనామంగా వాని వారసులు స్వీకరించి ఉంటారు. వాని పేరు ఉండే రెండు శాసనాలు, నెం.179 తెలుగులోను, నెం.180 తమిళంలోను, ఆతడొక బంగారు కలశాన్ని ఆలయవిమానంపై ప్రతిష్ఠించినట్లును, శ్రీవేంకటేశ్వరుని ఆలయపు దైవపీఠానికి బంగారపు తొడుగు శక సంవత్సరం 1281లో, క్రీ.శ.1359 జులై 6న వేసినట్లును చెప్పును. మంగదేవుడు **'శ్రీమన్ మహామండలేశ్వర', 'మేదినీమీసరగండ'** బిరుదాలంకృతుడై 'సాళువ' బిరుదు లేకుండ ఉండెను. ఆతడు శ్రీరంగనాథుని కూడ ప్రతిష్ఠించి 60,000 మాడలు బహూకరించినట్లు ఆతడు చెప్పబడి ఉంది.

సాళువమంగిదేవుని సామంతరాజు కుమార కంపనుడు, 1వ బుక్కరాయల కుమారుడు, 'మహామండలేశ్వరుడు', **'అరిరాయ-విభాళ', భాషైక్కుత్తప్పువ-రాయర గండ'** బిరుదాంచితుడు నెం.181లో శక సంవత్సరం 1290కి సరియగు క్రీ.శ.1368లో, అతని మంత్రియైన ఒక **పెక్కడై** లేక **ప్రెగ్గడై,** బహుశః బ్రాహ్మణ సేనాని గొప్పణ, శ్రీవేంకటేశునికి దీపార్చనకై గోవులను దానమిచ్చినట్లు చెప్పును. (చూ.దేవ.ఎపి.రిపో. పే.131-132)

నెం.193లో శ్రీవేంకటాచలదేవునికి, విస్సణ-దేవరాయల కుమారుడగు శ్రీగిరీశ్వరుడు, ఒక బంగారు పట్టాన్ని ఆభరణాలను బహూకరించినట్లున్నది. ఇది శకసంవత్సరం 1352లో ఇవ్వబడిన ఒక వంశానుక్రమణిక బట్టి శ్రీగిరి 2వ దేవరాయల లేక ప్రౌఢదేవరాయల కుమారుడైనట్లు లేదు. రెండవ దేవరాయలుకు వీరపర్వతరాయల సోదరుడున్నాడు. ఈ తెలుగు పేరు **'విస్సణదేవరాయలు'** ఎవరో తెలియదు (చూ.దేవ.ఎపి.రిపో.పే.136)

శకసంవత్సరం 1372లోని, క్రీ.శ.1450-51లోని, నెం.224లో చెన్నకేశవదాసర్ అనునాతడు, ఇద్దరు వ్యక్తులకు, నీటి సరఫరా కాల్వను **పైండిపళ్ళి** నుండి ఇతర గ్రామాల గుండా తిరుపతి వరకును అవిలాలి చెఱువు వరకు పొడిగింపబడునట్లు త్రవ్వినందుకు 1000 పణాలు చెల్లించినట్లును, ఈ త్రవ్వకానికి **పైండిపళ్ళి** గ్రామస్థులు అభ్యంతరం తెల్పుచూ, తమ పొలాలు పాడైపోవుననినట్లును, అంతట స్థానత్తార్‌లును అధికారి యజ్ఞరసర్ కూడా ఆ కాల్వను పరీక్షించి, గ్రామంలోని బహు సంఖ్యాకాలైన పొలాలకు నష్టం కలుగుతుందని భయపడి వాని కావిషయాన్ని గూర్చి తెలియపరచినట్లు ఉంది. అప్పుడాతడు ఆ ఇద్దరు వ్యక్తుల నుండి 1000 పణాలను తిరిగి తీసికొని, దస్తావేజును గ్రామస్థుల కనుకూలంగా మార్చివ్రాశాడు. బహుశః వారికి నష్ట పరిహారాన్ని చెల్లించి ఉంటాడు. ఆపై వేరొక ప్రదేశం నుండి గ్రామంలో తన ఖర్చుపై ఒక క్రొత్త కాల్వను త్రవ్వించాడు. ఇట్లాతడు తన ధనాన్ని వెచ్చించి కాల్వను త్రవ్వించి నందులకును, చదునుచేయించిన క్రొత్త భూమిలోని దిగుబడి దృష్ట్యా, క్రొత్తకాల్వవలన సాగులోనికి వచ్చినందుకు స్థానత్తార్

ఒక యేర్పాటు చేశాడు. దాని ప్రకారం, తిరుపతి పొలిమేర పైనున్న శ్రీనివాసపురంలోని ఆలయంలో వేంచేసియున్న వీరనరసింహ పెరుమాళ్‌కు ప్రతిరాత్రి ఒక తిరుప్పోనకం యేర్పాటు చేసి, దాతకు చేరవలసిన నాల్గవ వంతు ప్రసాదాన్ని పొలిమేరపై గల, తనచే ఏర్పరుచబడిన రామానుజకూటం గల వారికిచ్చునట్లు ఈ శాసనంలో, ఈ అర్చనకు కావలసిన పదార్థాలను అప్పన్ శ్రీ భండారం నుండి ఇచ్చునట్లంగీకారం. ఇది బహుశః క్రొత్తగ చేరిన శ్రీ గోవిందరాజు ఆలయాగారం అయి ఉంటుంది. శ్రీభండారం బదులు దీని నుండి ఇచ్చేటట్లు యేర్పాటు.

నెం.217 **చెన్నప్ప ఉడైయర్** అను చంద్రగిరికి చెందిన ఒక నియోగి బ్రాహ్మణుని రాచమాలికంగా, రాజపురుషులకు పూమాలలను సమర్పించు వానిగా ప్రస్తావించును. ఆతడు తిరుపతిలో ఒక ఇంటి స్థలాన్ని అచట వైష్ణవులిద్దరి నుండి క్రయాన్ని పొంది, దాని విక్రయ దస్తావేజు శక సంవత్సరం 1371లో క్రీ.శ.1450 మార్చి 4న విజయనగర చక్రవర్తి మల్లికార్జునదేవ మహారాయల చరిత్రాత్మక ప్రస్థానం సందర్భంగా రిజిష్టరు చేయబడింది. ప్రాంతీయ రాజ్యపాలుని (గవర్నరు) ప్రధాన నివాసం చంద్రగిరిలో కనుక, అచటనే సంభారాలు తదితర అవసర వస్తువులు, విలాసవస్తువులు సమకూర్చువారు నివాసాలను ఏర్పరచుకొనియుండటం సహజం. ఆ ఊరిలో ఒక సైన్యంకూడ స్థావరమైనట్లు కనిపించును. ఏలన, ఒక **'పడైయిల్ ఇరుక్కుం-వ్యాపారి'** (సైన్యానికి సంబంధించిన ఒక వ్యాపారి) ఆలయంలో యేదో ఒక సేవకు యేర్పాటు చేసి, దాని నిర్వహణానికి అచటి యజమానుల కప్పగించాడు. (నెం.236, అసమగ్రఖండం).

14వ శతాబ్ది మధ్యకాలం నుండి శ్రీ వేంకటేశ్వరుని ఆలయంలోని పరిస్థితులివి. అప్పుడే తొలి సంగమ వంశరాజులలో ఒకడైన, వారిలో రెండవ రాజైన, ఒకటవ బుక్కరాయలపాలన ఈ ప్రాంతమున కూడ వ్యాపించింది. నెం. 178లో వాని పేరునూ, బిరుదములనూ, ఒక గ్రామాన్నీ ఆలయానికి ఇచ్చిన వివరం కన్పిస్తుంది. అయితే, విజయనగర లేక విద్యానగర స్థాపన సాంప్రదాయికంగ సుమారు రెండు దశాబ్దాలు ముందుగా క్రీ.శ. 1336లో అని చెప్పబడుచున్నది. ఆ దత్త గ్రామం శ్రీవేంకటేశ్వరునకు శాశ్వతంగా నిత్యనైవేద్యానికై ధాన్యమూ సమర్పించవలసి ఉంది. వాని వలెనో, కొందరు సాళువ సేనాపతులును మరికొందరు అన్యులును స్వామివారికి నిత్యం అర్చనలకై ఏర్పాటు చేశారు. ఉత్సవాలు పతాకారోహణంతో యేడుకు చేరాయి, ఒక రోజున, రెండుగాని మూడుగాని వివిధాలైన నైవేద్యాలు, వండినవి, వేపుడు చేసినవి లేక రొట్టెలుగా కాల్చినవి, భక్తుల చేత యేర్పరుపబడినవి. ఈ యేడు ఉత్సవములు కాక, వేసవిలోని **కోడై-తిరునాళ్,** చలికాలమున మార్గళి నెలలో ప్రబంధ పఠనంతో అధ్యయనోత్సవం, ఇట్టి ఇతర ఉత్సవాలు కూడ కొన్ని రోజులలో భక్తులచే యేర్పరుపబడింది. వేదపారాయణం, కొంతకాలం అణచబడింది లేదా విడువబడింది. తిరువాయ్‌మొళి ప్రాధాన్యంతో, మరల ప్రారంభింపబడి శాశ్వతంగా ప్రతిష్ఠింపబడింది. కొందరు ఘృతదీపాలకై గోవులను బహూకరించారు. ఆభరణములు రత్నాదులు కూడ దేవుని కర్పింపబడ్డాయి. కొందరు స్వంత ఖర్చుతో నీటి పారుదల కాల్వలను దత్తగ్రామాల లోని చెఱువులలోనికి త్రవ్వించారు. దాతలు శ్రీభండారంలో నిక్షేపించిన నిధులతో ఆలయానికి దానమీయబడిన గ్రామాలలో

క్రొత్తగా నీటిపారుదల కాల్వలను త్రవ్వటమూ, ప్రాత వాటిని బాగుచేయటమూ, అట్లే అచటి చెరువులు కూడ, మొదలగు పనులు నిర్వహించబడినాయి. అందువలన ధాన్యం దిగుబడి నైవేద్యాల కొరకు అధికంగా వృద్ధియై, అది ఇప్పటి (ఈశతాబ్దంలో ప్రథమ దశాబ్దంలో) నిర్మాణమైన దేవస్థానము[1] వారి శ్రీగోవిందరాజు ఆలయానికి తిరుపతిలో పడమట ఉన్న కార్యాలయానికి ఎదురుగా గల విశాలమైన ఊతి మంటపంలో నిల్వ చేయబడింది. ఈ స్థలం ఇటీవలి వరకు కణజంతోట (ధాన్యపుతోట) గా పిలువబడింది. కాని, ఇప్పుడు ఈ మంటపం దేవస్థానంవారి వేర్వేరు కార్యాలయాలుగా మార్చబడింది, దాని ముందటి భాగం పైన గదులు కూడ కట్టబడినాయి. దీనిని బట్టి ఈ కాలంలో ఆలయం సర్వోతోముఖ సమృద్ధిని పొందినదనీ దాని ఖ్యాతి కూడ విస్తరించి సర్వత్ర వృద్ధియైన దని చెప్పవచ్చును.

* * *

1. ఇప్పుడు కపిలతీర్థంరోడ్డు (కె.టి రోడ్డు)లోని విశాలమైన మూడు అంతస్తుల భవనంలోకి మార్చబడింది. పైన చెప్పబడిన ప్రాత కార్యాలయభవనం చంద్రగిరి సబ్ కలెక్టరువారి కార్యాలయానికి ఇవ్వబడింది. -గోపీ కృష్ణ

సాధారణ గమనిక:

1. ఈ పుస్తకములో వివిధ తావులలో కనిపించు ఒకే పదమును ఉచ్చారణాది సూచనలకు సంబంధించిన గుర్తులు వేర్వేరు విధములుగ ఉండవచ్చును. కనుక గమనార్హమేమన ఈ విషయము గ్రానైట్ ఊళ్ళపై చెక్కబడిన 7వ శతాబ్ది వరకు గల కాలానికి చెందిన శాసనాలమూల పాఠముపై ఆధారపడి ఉంటుంది.
2. వ్యక్తి ప్రదేశ, కాలాల ప్రాధాన్యాన్ని సూచించడానికి పెద్ద అక్షరాలు ఎక్కువగా వాడబడినాయి.

# అధ్యాయం-18

## సాళువ నరసింహుని పాలన కాలం

తరువాతి ఐదు లేక ఆరు దశాబ్దాలు, దాదాపు 15వ శతాబ్ది చివరి వరకు, మల్లికార్జునుడు విరూపాక్షుడు విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన ప్రభువు లైనప్పటికిన్నీ, సాళువ నరసింహుడు సామ్రాజ్యాన్ని పట్టుసడలకుండ ఉంచిన చాలా ప్రముఖుడైన, పలుకుబడి గల సేనాని. ఇది తాను స్వయంగా శ్రీవేంకటేశ్వరుని రెండు గ్రామాలను **ముపదువేట మాంగోడువెలడ** అను **పడైవీట్టు** రాజ్యంలోని వానిని, శకసంవత్సరం 1389లో, క్రీ.శ.1467 డిసెంబరు 27న(సం.II, నెం.30) దానమిచ్చుటలో స్పష్టమగును. అదే పడైవీట్టు రాజ్యంలోని దొమ్మరపట్టిని శకసంవత్సరం 1395లో క్రీ.శ.1473 జూన్ 15న (నెం.50) ఇచ్చెను. శ్రీమన్ మహామండలేశ్వర తిమ్మయదేవచోళ మహారాజు తెప్పత్తినాగణచావడి అను గ్రామాన్ని, పడైవీట్టు రాజ్యంలోని మరియొక గ్రామాన్ని శకసంవత్సరం 1386లో క్రీ.శ.1464 మే న దానం చేశాడు (సం.II, నెం.21). అత్యంబరగండ వల్లభయదేవ మహారాజు పొత్తపినాడులోని (ఇప్పటి కడప జిల్లాలోనిది) ఉదయగిరి రాజ్యంలోని పురందలూరును వ్రాసి ఇచ్చాడు. శోళమండలం లోని **మరుత్తువక్కుడి వాళైకులచ్చేరి** శక సంవత్సరం 1415లో క్రీ.శ. 1493 ఆగష్టు 19న కోనేరిరాజు వ్రాసి ఇచ్చాడు. (సం.II., నెం.106). శ్రీ వేంకటేశ్వరుని ఆలయంతో ఆతడు సంగతమగుట మొదట మొదట చంద్రగిరి రాజ్యములోని ఆలిపురం గ్రామాన్ని వ్రాసియిచ్చినప్పుడు శకసంవత్సరం 1378లో చాంద్రమాన సంవత్సరం ధాతలో క్రీ.శ 1456 సెప్టెంబరు 12న, ఆతడు కళ్యాణపురం రాజధాని మైసూరులోని ఒక రాష్ట్రానికి గవర్నరుగా జీవికను ప్రారంభించిన తరువాత దాదాపు 8 సంవత్సరాలకు వాని వారసత్వం **"సాళువాభ్యుదయం"**లో చెప్పబడి నట్లు. కాలాంతరంలో అతడు చంద్రగిరిని చేరుకొన్నాడు. (దేవ. ఎపి.రైస్.పే. 144-145).

క్రీ.శ.1464 జనవరి 18న అతని సవతి సోదరుడు **సాళువ మల్లదేవుడు** చంద్రగిరి రాజ్యంలోని **ఈలంబాక్కం** గ్రామాన్ని వేంకటేశునకు దానము చేసెను. ఆ కాలంలో చంద్రిగిరిరాజ్యానికి సాళువ నరసింహుడు గవర్నరైనచో, అప్పుడు నరసింహుడు ఎక్కడ నుండెనో, తెలియదు. పైగా, క్రీ.శ.1464 మేలో ఆలయానికి **పడవీడు** రాజ్యంలోని రెండు గ్రామాలను తిమ్మయదేవ చోళ మహారాజు దానమిచ్చెను. క్రీ.శ.1464 మేలో ఆలయమునకు పడవీడు రాజ్యంలోని రెండు గ్రామాలను **తిమ్మయదేవ చోళమహారాజు** దానమిచ్చాడు. క్రీ.శ.1467,1468లలో సాళువ నరసింహుడు పడవీడు రాజ్యంలోను చంద్రగిరి రాజ్యంలోను రెండుచోట్ల, గ్రామాలను దానం చేశాడు. (నెం. 30, నెం.31, నెం.34) అదిగాక, తాను పూర్వం క్రీ.శ.1472 అక్టోబరు 13న (నెం.79) చేసిన దుర్గసముద్రం (తిరుపతి దగ్గర) గ్రామ దానాన్ని 1482 మే 30న ధ్రువపరచాడు. స్పష్టంగా, విజయనగర ప్రభుత్వంలో అతడు చుక్కాను పట్టు స్థితిలో నుండి, రాష్ట్రగవర్నర్లపైనను, సైన్యాధికారుల మీదను, మొత్తం రాజ్యంలో అనేక రాష్ట్రాలలో దానాలు చేసేటంతగా

అధికారాన్ని కలిగియుండేదనుకోవచ్చు. తన సమర్థుడైన సేనాపతి తుళువ నరసనాయకుని సహకారంతో, తిరుగుబాటుచేసిన దాక్షిణాత్య సేనల్ని అణచి, రాజ్యపు మధ్య పరగణాలను చెక్కు చెదరకుండ సమర్థించుకొన్నాడు. ఆతడు ఔత్తరాహిక, పాశ్చాత్య, దక్షిణ-తమ ప్రాంతాలను ఒరిస్సాకు చెందిన గజపతి రాజు నుండి తిరిగి గెల్చుకొనలేకపోయాడు. క్రీ.శ.1484 ఆగష్టు 11న ఆతడు శ్రీవేంకటేశ్వరుని ఆలయనిర్వాహకులకు జారీ చేసిన ఉత్తర్వు (నియోగం) ద్వారా **గుండిప్పూండి** ఆదాయం నుండి కొంత కాలం క్రిందట సుగంధవస్తువులు తదితర ఇద్దర దేవతామూర్తుల స్నానానికి సంబంధించిన యేర్పాటు చేయడానికి సంబంధించి యున్నట్లు మాత్రం ధ్రువీకరించ బడినది.అట్లే, ఇది నిత్యపూజానైవేద్యాలు శ్రీ కులశేఖరాళ్వారులకు యేర్పాటును గురించి కూడ (నెం.22). కాని, కులశేఖరాళ్వారుల నిత్య పూజాది విషయం వదలివేయబడింది (నెం.81). ఈ శాసనాలలో కన్పించే సాళువ నరసింహుని ప్రస్తావన మరల క్రీ.శ.1485 ఏప్రిల్ 20న, నెం. 82లో. ఇది వానిచే (అలిపిరి లేక అడిపడివద్ద) కాలిబాట ప్రక్కన, ఎదుటగల కొండ పాదంలో ఉన్న ఆలయంలో లక్ష్మీ నరసింహ స్వామి ప్రతిష్ఠింపబడటం గురించి.

**ముఖప్పాళం నాగమనాయకుడు** సాళువ నరసింహుని అధికారంలోని సైనికాధికారి. తన ప్రభువైన **శ్రీమన్ మహామండలేశ్వర సాళువ నరసింహరాయ మహారాజ ఉడైయార్** మెప్పుకై, **నాగమనాయకుడు** 1487 ఆగష్టులో తిరుమలలో ఒక పూదోటను నిర్మించాడు. దాని నుండి లభించే పువ్వులను వేంకటేశ్వరుని ఆలంకారానికై అంకితం చేశాడు, స్వామిసన్నిధిలో నిత్యం రెండు దీపాలను వెలిగించేటట్లేర్పరచి, అందుకుగాను **నరసింహ రాయుడైయార్** తనకు సైనిక సేవలందించినందుకు ఈనాముగా ఇచ్చిన కచ్చిపేట్టు-శీర్మైలోని **తిరడంపాడి** గ్రామాన్ని దానం చేశాడు. (నెం.87)

నరసింహునకు సంబంధించిన మరీ ఇటీవలి ప్రస్తావన క్రీ.శ.1490 జనవరి 25 నాటి నెం. 90 శాసనం. ఇది **కరవేట్టిపుళియాళ్వార్ మన్నర్‌పిళ్ళై, ఉత్తర-మేరూర్** వాసి నిర్మించిన ఒక ఊాతి మెట్లుగల బావిని గురించినది. దీనిలో ఆ బావి లక్ష్మీనరసింహస్వామి ఆలయగోపురానికి పర్వతపాదంలో గల పెద్దగోపురానికి దక్షిణమున ఉన్నట్లు చెప్పబడెను. ఈ రెండును శ్రీమన్ మహారాయర్ సేవలుగా చెప్పబడినాయి.

వాని తర్వాతి చరిత్ర రెండేండ్లు సాగింది, క్రీ.శ.1492 వరకు, ఈ సంవత్సరంలో అతడు మరణించినట్లు కనబడుతుంది. వాని కుమారుడు ఇమ్మడి నరసింహుడు విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించి, తుళువ నరసనాయకుని సహకారంతో క్రీ.శ.1505 వరకు పాలించాడు. ఈ **నరసనాయకుడు** ప్రసిద్ధుడైన **కృష్ణదేవరాయలకు,** వాని సోదరులకు తండ్రి.

ఇట్లు క్రీ.శ.1448 నుండి క్రీ.శ.1492 వరకు సాగిన 44 సంవత్సరముల సైనిక చరిత్రలో సాలువ నరసింహుడు తన స్వంత రాష్ట్రాలైన కళ్యాణపురం, చంద్రగిరి, పడవీడు రాజ్యాలను మొదట పాలించి అటుపై విజయనగర సామ్రాజ్యాన్నంతటిని, రాజ్యము నపహరించినట్లు కనబడ నీయకుండ పాలించెను.

[1]సాళువ నరసింహుడు శ్రీవేంకటేశ్వరుని ఆలయమునకు ప్రాపకమిచ్చి 18 గ్రామాలను దానమిచ్చాడు. ఆతడు **దోలామహోత్సవ-అన్న-ఊంజల్ తిరునాల్** (ఊయెల ఉత్సవము) మిథునమున గాని ఆణి నెలలోగాని (జూలై) శుక్లపక్షంలో అయిదురోజులు విస్తారమైన వైభవంతోను రాత్రింబవళ్ళు నైవేద్యాలతోను (నెం.50) యేర్పాటు చేశాడు. బ్రహోత్సవాలతో గూడ వివిధమైన ఉత్సవాల కేర్పాటు చేశాడు. ఆతడు పుష్కరిణి మధ్యలో వసంత మంటపాన్ని కట్టించాడు; వేర్వేరు ఉత్సవాలలో వేర్వేరు రోజులలో **తిరుప్పణ్ణి- ఓడిత్తిరునాళ్** (తెప్పోత్సవం) క్రమబద్ధం చేసి, ఆలయపూజారుల నుండి తీర్థవారి మంటపాన్ని కొనుగోలు చేసి, కోనేటి ఒడ్డున నాలుగు మంటపాలను గుడి ఆవరణలో సంపంగి ప్రదక్షిణంలో (గుడిలోని రెండ ఆవర్తనం : దానిలో ఆ రోజులలో చంపక, సంపంగి వృక్షాలు పెరిగి యుండేవి) నిర్మించాడు. ఈ మంటపాలలో ఉత్సవ విగ్రహాలకు తన పేరు మీద, తన పెద్ద కుమారుడు కుమార నరసయ్యన్ (ఇతడే ఇమ్మిడి నరసింహుడు, తర్వాత కాలంలో విజయ నగరసింహాసనం నాక్రమించిన వాడు) పేరు మీద, తన మూడవ కుమారుడైన చిక్క తంగమన్ పేరుమీద, తన రెండవ కుమారుడైన పెరియ- తంగమన్ పేరుమీద పూజానైవేద్యాలను (నెం.51), తన తల్లియగు మల్లాయమ్మన్ (మల్లాంబిక) పేరు మీద ఊయల ఉత్సవం (డోలోత్సవము) మొదటి రాత్రి అన్నపురాశి నైవేద్యం (నెం.50) యేర్పరచెను. ఆతడు ముఖ గోపురాన్ని ఇతర గోపురాలను శ్రీ వేంకటేశ్వరుని ఆలయంలో తిరుమలగ్రామ ప్రవేశం వద్ద ఒక అసంపూర్ణ గోపురాన్ని, గోవిందరాజుల గుడిలో తిరుపతి లోని గోపురాలను, ముఖ పర్వతపాదం వద్దగల పెద్ద శిథిల గోపురాన్ని నిర్మించాడు. (నెం. 79, నెం.34)

కందాడై రామానుజ అయ్యంగార్ వారు ఆధ్యాత్మిక గురువైనట్లు తోస్తున్నది. రామానుజకూటములు (రామానుజ అయ్యంగార్ పేరు మీద) నిర్మింపబడి, తిరుమలలోని ఉత్తరపువీథిలోని వానికిని, తిరుపతిలోని గోవిందరాజు ఆలయంలోని వానికిని, ఉచిత అన్నదాన సత్రాలకు, వారినే యజమానిగా నియమించి, దాత భాగానికి వచ్చు ప్రసాదాలన్నింటిని శ్రీ వైష్ణవులకు భుక్తమయ్యేటట్లు ఏర్పాటు చేశాడు. అటు తరువాత, ప్రవేశ గోపురం దగ్గర తిరుమల ఆలయంలో ఒక సత్రం (ఉచిత భోజనశాల)నుకట్టి, దానికి **హస్తిగిరి అయ్యన్**ను యజమాని చేసి, క్రీ.శ.1468 మార్చి 16న ఆలయానికి అయిదు గ్రామాలను దానమిచ్చి, దానితో ప్రతిరోజు కొన్ని తీపి పదార్థాలతో కూడ 30 సంధి నైవేద్యాల నేర్పరచి, దాత భాగం ప్రసాదం హస్తిగిరి అయ్యన్‌కు అందజేయునట్లు దానితో నతడు సత్రములో అన్న దానం, జరిపించేటట్లును, ప్రసాదం అతనికి సత్రంలో అందజేసిన బ్రాహ్మణుల జీతాలను, సత్రంలో వంట చేసినందుకుగాని, కూరగాయల్ని కొనడానికి వినియోగించునట్లేర్పరచాడు. (నెం.34) సాళువ నరసింహ ఉడైయార్ క్షేమానికై సత్రంలో అన్నదానం ప్రతిరోజు జరుపుటకు వీలుగా గంగురెడ్డి పళ్ళిని కూడ ఎవరో దానం చేశాడు (నెం.125). ఈ

1. సాళువ నరసింహుడు శ్రీ వేంకటేశ్వరుని ఆలయమునకు అంతగ సేవ చేసినను దానికి మరెన్నియో సేవలు దానములు చేసినను, వాని పరమదైవము, 'శ్రీరామచంద్రుడు' అనవలెనేమో. నెం. 30 చివర కనిపించు శాసనభాగము దానిని సమర్థించును.(ఈ విషయమై మరింత సమాచారానికై చూ.ఎపి. రిపోర్ట్‌పే.137-147)

రెండు అన్నదాన గృహాలేకాక, మూడవ సత్రాన్ని కూడ స్వామిపుష్కరిణికి పడమట వానిచే త్రవ్వించబడిన నరసింగరాయ కోనేరి ఒడ్డున నిర్మించి, పురట్టాశి నెలలోని బ్రహ్మోత్సవం కాలంలో ఒక పది రోజులపాటు ఆ సత్రం సాగేటట్లు యేర్పాటు చేశాడు.

సాళువ నరసింహుడు కాక, పైన చెప్పినట్లు, శ్రీ వేంకటేశ్వరునికి గ్రామాలను దానమిచ్చినవారు: వారి సోదరుడు **సాళువ మల్లయదేవుడు, తిమ్మయదేవ చోళమహారాజు, వల్లభయదేవ మహారాజు, శ్రీమన్ మహా మండలేశ్వర గండభేరుండ పెరియ తిమ్మనరాజ ఉడైయర్** అనే **కొమ్మరాజ ఉడైయర్** కుమారుడు, ఇంతకు ముందటి దానగ్రామభాగమైన పుదుచ్చేరిని, తన వారసత్వనాయకత్వంలో భాగమైన శీర్మైలోని **వీట్టు వక్కుళత్తూర్‌**ను ఆలయానికి దానమిచ్చాడు. క్రీ.శ.1494 జూన్ 5న (నెం.126) తిరడంపాడికి చెందిన, తన పాలెగాడైన **ముఖప్పాళం నాగమనాయకుడు** చేసినట్లే ఇదికూడా; క్రీ.శ.1487 ఆగష్టులో ఇది జరిగింది (నెం.87)

15వ శతాబ్దపు ద్వితీయార్ధంలో ఇలా శ్రీ వేంకటేశ్వరుని ఆలయం సుమారు 30 గ్రామములకధికారి అయినాడు. ఇవి వివిధ ప్రాంతాలలో చెదిరి ఉన్నాయి. అంతకుముందు కాలంలో ఆలయయాజమాన్యంలో దాదాపు సమూహంగా గుమిగూడియున్న తిరుపతి సమీపంలో గల 20 గ్రామాలతో ఇవి చేరి ఉన్నాయి. ఈ దాన గ్రామాల విషయంలో స్థానత్తార్, ఆలయనిర్వహణ సమితి, ఆ యా గ్రామాల నుండి ధాన్యం, బంగారం, తదితరాలపై పన్నులు వసూలు చేసికొని బాధ్యత నంగీకరించింది. ఇది కొన్ని దాన పత్రాలలో స్పష్టం చేయబడింది. కనుక అందు నిమిత్తం ఆలయ ఉద్యోగులు పన్ను వసూళ్ళకుతోడు ధాన్య సేకరణకు కూడా ఉండి ఉంటారు. ప్రత్యేకించి, **సాళువ నరసింహుడు దుర్గసముద్రం** గ్రామాన్ని, తిరుపతికి దక్షిణంలో రెండుమైళ్ళ దూరంలోనున్న దానిని, మంటపాలు, గోపురాలు తదితర నిర్మాణాలు తిరుమల, తిరుపతులలో నిర్మించడానికి ఉద్దేశించ బడింది. దానితో సమంగ గోపురాలు కట్టబడి ఉండేవి. ఇవి నరసింహరాయ ఆస్థానమంటపం ధ్వజస్తంభం ముందున్న సంపంగి ప్రదక్షిణంలో నాలుగు స్తంభాల మంటపాలను, తిరుమలపై పుష్కరిణీ తీరంలో, తిరుపతిలో శ్రీగోవిందరాజుల ఆలయంలో రెండు గోపురాలు, మంటపాలును (నెం.79, పంక్తి9, నెం.34) గోవిందరాజుల ఆలయ ప్రవేశంవద్దగల వసంతమంటపం **వణ్–శఠకోప జీయర్‌**చే **పూంగోడు** గ్రామం నుండి వచ్చిన ఆదాయంతో అసంపూర్ణముగ నిర్మింపబడింది. ఇది ఆలయానికి పురాతన దాన గ్రామం. దీనిని నల్లార్ అంగాండై అను ఆలయపు లెక్కలు వ్రాసే గణకుడు పూర్తిచేసి పైన కప్పువేయించాడు.(నెం.83)

నిత్యనైవేద్యాల విషయంలో, వందకుపైబడిన నైవేద్యాలు లేక సంధులు అనేకులైన భక్తులచే యేర్పాటు చేయబడ్డాయి. వీనిలో సాళువ నరసింహుడు యేర్పరచిన 57 సంధులు నిత్యము 68 ప్రమాణాల బియ్యపుఅన్నం, మరికొన్ని తీపిపదార్థాలతో ఉండేవి, వారి రాణి శ్రీరంగాంబదేవి యేర్పరచిన 4 నైవేద్యములు (నెం.4, నెం.30, నె.34, నెం.25). వారి పెద్దన్నగారు సాళువ తిమ్మరాజదేవమహారాజు ఒక అప్పపడితో

నైవేద్యం, ఒక తిరుక్కణామడై, ఒక **పాయసహరివాణం** (నెం.18); వారి ఇతర దాయాదులు **సాళువ రామచంద్ర** ఒకటి (నెం.19), **సాళువ పర్వతరాజు** నాలుగు (నెం.23); సాళువ గోపయ్యన్ ఒక పెద్ద పాత్ర నిండ పానకం ప్రతి రాత్రి సంవత్సరం పొడుగున (నెం.41, నెం.42) పెద్ద సంఖ్యలో మహామండలేశ్వర మహారాజులు, ప్రాంతీయ గవర్నరులు, సేనానులు, ఒకటి రెండు నైవేద్యాలు; **వల్లభదేవ మహారాజు** ప్రతి యొక్క దానికి 8 సంధులు (నెం.35); **కందాళై రామానుజ అయ్యంగార్, నరసింగరాజ ఉడైయార్** వారి సంధి (నెం.26)తో నిత్యము ఒక అప్పపడి, తిరుక్కణామడై; ప్రతిరోజు ఉదయం తోమాలసేవ సమయంలో నాల్గవ దధ్యోదనసంధి (నెం.38); ప్రతిరాత్రి శ్రీవేంకటేశ్వరునకు రెండు రెండవ–**తిరుప్పోనకం గోవిందరాజు**కు రెండుకు నాలుగున్ను, కులశేఖరాళ్వార్‌లకు 8 సంధి (నెం.128). ఈ ఆళ్వారును తిరుపతి ఆలయం యొక్క ఉత్తర మార్గం దగ్గర (ఇప్పుడు కనబడుట లేదు) తానే ప్రతిష్ఠించాడు (నెం.36). **కోయిల్ కేళ్వీ ఎంబెరుమానార్ జీయర్ శోళ**మండలంలో వేంకటేశ్వరునకై **కోనేరి రాజు** నుండి సంపాదించాడు. ఈతని పేరుతో ఒక తిరుప్పోనకం రోజూ ఆ స్వామికి అర్పింపబడింది (నెం.106). తిరుపతిలోని ఆచార్యపురుషుల్లో ఒకరైన **కుమార తాతయ్యంగార్,** ఒక రాజాన– తిరుప్పోనకాన్ని రెండు కొలతల అన్నంతో రోజున్ను రాయర్‌సంధితోకూడ (నెం.109). ఒక చంద్రగిరికి చెందిన నియోగి బ్రాహ్మణుడు నిత్యం ఒక నైవేద్యానికి (నెం.2); శ్రీ నరసింహదేవుని ఆలయానికి చెందిన ఒక యువతి, **వేంకటవల్లియార్** అనే ఆమె నిత్యం ఒక నైవేద్యానికి (నెం.5,నెం.6); తిరువేంకటనాథన్ పూదోట, మఠం నిర్వహణాధికారియైన పెరియ పెరుమాళ్ జీయర్ **నిత్యం బుక్కరాయన్‌సంధి**తో కలిపి రెండు నైవేద్యాలకు (నెం.7); మలైకినియనిన్ఱ పెరుమాళ్ **కుప్పర్ బుక్కరాయన్** సంధితో కలిపి నిత్యము ఒక నైవేద్యానికి (నెం.9); పెరియనైవేద్యానికి ఏర్పాటు చేశాడు (నెం.69).

ఉత్సవాల విషయంలో, గరుడపతాకాన్ని ధ్వజస్తంభాగ్రానగాని లేక పతాకధ్వజంలో గాని ఎగురవేయడంతో మొదలగు తిరుక్కోడితిరునాల్, సాధారణంగా బ్రహ్మోత్సవాలని పిలువబడే సంఖ్య ముందున్నట్లే ఏడు అట్లే ఉన్నాయి. కాని, ప్రతి ఉత్సవంతో 10 లేక 12 రోజులలో రోజూ సమర్పించే నైవేద్యాల సంఖ్య చాలా పెరిగిపోయింది. తిరుక్కోడి తిరునాళ్ జరిపించు 6 నెలలు ఈ విధంగా కొన్ని శాసనాలలో లిఖించబడి ఉన్నాయి: పురట్టాశి, పంగుణి (సం.॥, నెం.96, నెం. 68, నెం.110, నెం 105, నెం.108) అర్పశి, మాశి (నెం.112), ఆడి, చిత్తిరై (నెం.38, నెం.50, నెం.142). ఏ శాసనంలోనూ ఏడవ నెల ఉత్సవం చెప్పబడలేదు. ఉత్సవాలలో రోజుల సంఖ్య, దాతలు ఉత్సవ విగ్రహాలకు నైవేద్యం లేర్పరచిన దానిని బట్టి వేర్వేరు విధాలుగా లెక్కగట్ట బడినాయి. సం.॥లోని నెం.1లో **తీర్థవారి అధివాసం** (అవబృథమను పవిత్రస్నానం వరకు తొమ్మిది రోజులు, మిగతవి (సం.।, నెం.213)ఉత్సవాలలో ఊరేగింపుల తరువాత) గరుడ పతాకారోహణం రోజు నుండి లెక్కించబడింది. నెం.83, నెం.127, నెం.138, సం.॥, కయ్యార్ చక్రం నుండి **విడాయాత్రి** వరకు ఉత్సవం 12రోజులని ప్రస్తావించును. అనగా పతాకావిష్కరణకు రెండు రోజులు ముందుగా సుదర్శన చక్రాన్ని ఊరి పొలిమేరకు తీసికొనిపోయి అక్కడ నుండి కొంతమట్టిని

తెచ్చి గుడిలోని యాగశాలలో కొన్ని చిన్న మట్టి పాత్రలలో యజ్ఞాగ్నిశాలలో ఉంచడం, నవధాన్యాలు చల్లడానికి, నవధాన్య అంకురార్పణం మరునాడు, అనగా పతాకారోహణానికి ముందు రోజు ధ్వజారోహణంతో, గరుడపతాకం పతాకధ్వజం నధిరోహించడంతో, ప్రధానోత్సవం ఒకేమూర్తి ఊరేగింపుతో ప్రారంభమగును. ఈ మూర్తి **మలైకినియనిన్ఱ పెరుమాళ్** లేక, సంగ్రహంగా, **మలయప్ప.** ఈతడు తనదివ్యదేవేరులతో, శ్రీదేవి భూదేవుల గూడి కొన్ని నాళ్ళను, ఇతర దినాలలో ఆయా వాహనములపై చుట్టుగల నాలుగు ముఖ్యరహదారుల గుండా రథోత్సవం సాగుతుంది. 8వ నాటిరాత్రి మలయప్ప యొక్కడే వేటకు గుఱ్ఱము నెక్కి సాగును(సం.II, నెం.96). తొమ్మిదవరోజు తీర్థవారి జరుగుతుంది, శ్రీవేంకటేశ్వరుని ఆలయం నెదుట మంటపంలో స్వామి పుష్కరిణి నుండి తెచ్చిననీటితో పవిత్ర స్నానం జరుగుతుంది. 9వ నాటి రాత్రి ధ్వజావరోహణ, ధ్వజస్తంభంపై నాటి రాత్రి వేంకటేశ్వరుని శరీరమంతయు పువ్వులతోను పూమాలలతో కప్పివేయడం అను **పుష్పయాగం** జరుగుతుంది.(సం.II, నెం.135). 11వ రాత్రి తిరువేంగడముడైయాన్‌కు అను పుష్పయాగం జరుగుతుంది. (సం.II, నెం.135). 11వ రోజున విడాయాత్రి(విశ్రాంతి) యగును. సం.II, నెం.109, నెం.134 ప్రకారం, పుష్పయాగము, విడాయాత్రి అనునవి ఒకదాని తరువాత నొకటి రెండు వేర్వేరు రోజులలో జరుపబడునవి. అయితే. కైయార్ చక్రం రోజు నుండి విడాయాత్రి రోజుకు 13వ రోజగును. అందుచే నెం.83, నెం.127, నెం.138లలో 12వ రోజు అనియున్న దానితో విభేదించును. కైయార్ చక్రం ఊరేగింపును, **తిరుమలైతిరునాళ్** (అంకురార్పణం) రెండు వేర్వేరు రోజులలో ఒక దాని తరువాత నొకటి జరుగుచున్నట్లు నెం.222, నెం.221, సం.Iలోగల వేంకటేశ్వరునికి, గోవిందరాజుకు వేర్వేరు రోజులలో నైవేద్యాలు యేర్పాటును బట్టి స్పష్టం. ఇదే విధంగా సం.I, నెం.213లోని దాత యేర్పరచిన నైవేద్యములు, తిరుమలై-తిరునాళ్ (విత్తనాలు చల్లు రోజు), తిరువారినాళ్, శ్రీ వేంకటేశ్వరునకు ఏడు బ్రహ్మోత్సవాల కాలముననను, గోవిందరాజులకు రెండు బ్రహోత్సవాలలోను, నెం. 214లో వైభవోపేతమైన ఉత్సవాల మొదటి, చివరి రోజుల నైవేద్యం పరమమని చెప్పబడింది. కాని, విత్తనాలు చల్లుట అనేది ఉత్సవారంభానికి ముందటి రోజు, పతాకారోహణంనాడు, తీర్థవారి, స్నపనం, ఉత్సవాంతం.

మూర్తుల ఊరేగింపులో ఉపయోగింపబడే వాహనాలు, ఒక్క 8వ రోజు మాత్రమే రథం (నెం.12), ఆ రాత్రి అశ్వం (నెం.96), వేంకటేశ్వరునకు, గోవిందరాజునకు ఇద్దరకును; 9వరోజు, గోవిందరాజునకు, తిరువనంతాళ్,శేషవాహనం అని యున్నది. మిగత రోజులలోని వాహనాలు చెప్పబడలేదు. కాని, దేవతలకు నైవేద్యాలు పతాకాన్ని పతాకాధ్వజంపై నెగురవేసేటప్పుడు (నెం.69, సం.II) మూడవ, నాల్గవ, ఐదవ, ఏడవ రోజులలో (నెం.18); ఆరవ, ఏడవ, పుష్పయాగం, విడాయాత్రి రోజులలో (నెం.134); 6వ 7వ రోజుల్లో (నెం.103); మొదటి ఏడు రోజున; సాలువ నరసింహుని మంటపంలో ధ్వజస్తంభానికి దక్షిణదిక్కున (నెం.50), ఉత్సవం 12 రోజుల్లో (నెం.83, నెం.127, నెం.138, సం.II) నైవేద్యాలున్నవి. 20 మంది దాతల కంటె ఎక్కువగా తిరునాళ్ ఏడవ రోజున మూర్తులకు నైవేద్యాలనర్పించుట కిష్టపడిరి.

ఈనాడు ఊరేగింపులో వివిధ ఉత్సవాలలో ఉపయోగించే వాహనాల వివరాలిట్లున్నాయి: ధ్వజారోహణానికి ముందటి రోజు **సేనాధిపతి** లేక **సేనైముదలియార్** ఊరేగింపు, ఆ తరువాత బీజావాపము, **అంకుర్పారణం;**

| | | |
|---|---|---|
| మొదటి రోజు | సాయంత్రం | మూర్తుల్ని బంగారు తిరుచిలో ఊరేగించిన తరువాత **ధ్వజారోహణం,** పల్లకి వంటివాహనం, |
| | రాత్రి | పెద్ద శేషవాహనంపై ఊరేగింపు |
| రెండవ రోజు | ఉదయం | **చిన్నశేషవాహనం** |
| | రాత్రి | **హంసవాహనం** |
| 3వ రోజు | ఉదయం | **సింహవాహనం** |
| | రాత్రి | **సర్వభూపాలవాహనం** |
| 4వ రోజు | ఉదయం | **కల్పవృక్షం** |
| | రాత్రి | **సర్వభూపాలవాహనం** |
| 5ఇ రోజు | ఉదయం | పల్లకిలో **మోహిని అవతారం** |
| | రాత్రి | **గరుడవాహనం** |
| 6వ రోజు | ఉదయం | **హనుమంత వాహనం** |
| | సాయంత్రము | ముగ్గురు మూర్తులతో తిరుచ్చి; మూర్తులు తెల్లని దుస్తులతో గంధంలో కలిపిన కుంకుమపువ్వుతో (వసంత శోభను కలిపి) వివాహాలలో ఇది 6వరోజు సంప్రదాయం. అందు ఈ ఊరేగింపునకే **వసంతోత్సవ**మని పేరు |
| | రాత్రి | **గజవాహనం** |
| 7వ రోజు | ఉదయం | **సూర్యప్రభవాహన** |
| | రాత్రి | **చంద్రప్రభవాహనం** |
| 8వ రోజు | ఉదయం | **రథోత్సవం** (రథంపై ఊరేగింపు) |
| | రాత్రి | **అశ్వవాహనం** |
| 9వ రోజు | ఉదయం | మొదటి ఊరేగింపు పల్లకిలో, శ్రవణా నక్షత్రం రోజున శ్రీ వేంకటేశ్వరుని జన్మ నక్షత్రమని భావించడం వలన, రెండవ ఊరేగింపు తిరుచ్చిలో **తీర్థవారి, అవభృథ** స్నానానికి, శ్రీవరాహస్వామి మంటపం వద్ద స్వామి పుష్కరిణి నీటిలో తైలాన్ని పసుపును పంచుట |
| | రాత్రి | తిరుచిలో ఊరేగింపు, **ధ్వజావరోహణం** అను పైనున్న జండా కర్ర నుండి జండాను క్రిందికి దించుట. |

నేటి ఆచారం **"శ్రీవేంకటాచలమాహాత్మ్యం"** లోను భవిష్యోత్తర పురాణం లోను వర్ణింపబడిన పద్ధతికి, ఒకటి రెండంశాలలో తప్ప, అనుగుణంగానే ఉన్నది. శాసనాలలో **కైయార్ చక్రం** ఊరేగింపుతో మట్టిని తీసుకురావడం, దానిని చిన్న చిన్న మట్టి పాత్రలలో బీజావాపానికై నింపడం అనేవి రెండు వేర్వేరు దినాలలో పతాకారోహణ దినానికి ముందు రోజు జరిగేటట్లు చెప్పబడినాయి. పురాణాలలో అవి పతాకారోహణానికి ముందు రోజు ఒకే రోజున జరుగుతాయని, నేటి ఆచారం ప్రకారం సేనాధిపతి లేక సేనైముదలియార్ ఊరేగింపుతో జరుగుతుందని ఉంది. సుదర్శనంనాడు కాదు. ధ్వజారోహణం ఉదయవేళ జరుగుతుందని పురాణాలలో ఉంది. కాని, ఇప్పుడది ఉషఃకాలంలోకాక సాయంవేళ జరుపబడుతూ ఉంది. వేర్వేరు రోజులలో ఉపయోగింప బడే వాహనాలు మార్పులేదు కాని 7వ రోజు సాయంకాలం మంగళగిరిపై ఒక ఊరేగింపు జరుగునట్లు అందున్నది. బహుశః ఇప్పుడు వాడుకలోలేని తిరుచి ఉత్సవం ఇదియే కావచ్చును. అట్లే, పురాణములో 10వ రోజున జరుగునని చెప్పబడిన పుష్పయాగం వాడుకదప్పి చాలాకాలమైంది. అది మరల 14-11-1980 తేదిన ప్రారంభింపబడింది, కాని ఆ చెప్పబడిన రోజున కాదు. "వేంకటాచల మాహాత్మ్యాన్ని **పశిండి వేంకటత్తురైవర్** అను **జీయర్ రామానుజయ్యన్** శక సంవత్సరం 1413లో క్రీ.శ.1491 జూన్ 27న రచించి శ్రీ వేంకటేశ్వరునికి సమర్పించినారు కనుక, పై జెప్పిన పురాణంలో గుడిలో జరుగుచున్న ఆచారాన్నే చేర్చి ఉంటాడు. (నెం.95,సం.॥)

నెం.83, సం.॥లో శ్రీగోవిందరాజు, నాచ్చిమార్(వారి భార్యలిద్దరు), ఇద్దరి ఊరేగింపులును వివాహసందర్భంలోవలె వసంతమంటపంలో 5వ రోజు ఉత్సవంలో ఊయలపై కూర్చుని ఉండటాన్ని వివాహంలో క్రిందికి పైకి కదలే పలకపై ఊగులతో పోల్చబడింది. నెం.127, సం.॥లో శ్రీకృష్ణుడు ఊరేగింపుగా వెడలిన 5వ రోజు వివాహదినమని 6వ రోజు వసంతోత్సవ మని ఉంది.

తిరుమలలోని ఏడు ఉత్సవాలలో ప్రతి యొక్క ఉత్సవం 6వ రోజున మూడు ఉత్సవ విగ్రహాలను రామానుజయ్యన్ పుష్పమంటపానికి జ్ఞానప్పిరాన్ లేక జ్ఞానప్రదాన్ స్వామిపుష్కరిణి పశ్చిమ తీరంలో గల వరాహస్వామి, ఆలయానికి కొనిరాబడి, సుగియపడి నైవేద్యంతో అర్చించి, అక్కడి, ఊయలపై నుండజేసి, ముందుకు వెనుకకు ఊపబడి, అటు తరువాత శ్రీ వరాహస్వామి ఆలయం చుట్టూ ముమ్మారు ప్రదక్షిణంగా త్రిప్పబడుతుంది. (నెం.68)

**తిరువేంకటచ్చిఉుక్కన్ తిరుప్పణి పిళ్ళై ఎంబెరుమానార్** అను శ్రీ వేంకటేశ్వరుని ప్రజాహిత కార్యనిర్వాహకుడు **మలైకినియనిన్ఱ పెరుమాళ్లకు** ఉత్సవము లేడింటిలోను ప్రతి యొక్క ఉత్సవపు 12వ రోజునను, 7వ సాళువ నరసింహుని మంటపం, సంపంగి ప్రదక్షిణంలో, **సాళువ నరసింహరాయల కుమారుడగు ఇమ్మడి నరసింహ రాయ మహారాయల క్షేమానికై,** అదనంగా మరి యొకటియు, నైవేద్యాల కేర్పాటు చేశాడు. ఇది శకసంవత్సరం 1426, క్రీ.శ.1504 సెప్టెంబరు 20న జరిగింది (నెం.138)

తిరుమలలో శ్రీ గోవిందరాజు ఉత్సవ విగ్రహం **తిరుమంగై ఆళ్వారు** ఆలయానికి కొనిపోబడింది. ఇది బహుశః కపిలతీర్థానికి పోయే మార్గంలో రోడ్డు ప్రక్కన ఉన్నది. ఇచటకి వైకాశి, అణి నెలలోని

ఉత్సవాల 7వ రోజునను, మరల 9వ రోజైన తిరువనంతాళ్, శేష వాహనం నాడున్ను తీసికొని పోబడి ఈ నాలుగు రోజులున్నూ ప్రతిరోజు ఒక అప్పపడి నైవేద్యమివ్వబడును (నెం.122). **కందాడై రామానుజయ్యంగార్** తిరుపతి ఆలయంనుండి ఉత్తరానికి పోయేమార్గంపై ఒక ఆలయాన్ని నిర్మించి, దానిలో కులశేఖరుల విగ్రహాన్ని క్రీ.శ.1468 నవంబరునకు ముందు ప్రతిష్ఠించాడు. (నెం.36) 9 వరోజున తిరువనంతాళ్ వాహనంపై అక్కడకు వేంచేసినప్పుడును, మరల విడాయాట్టి రోజుల్లోను, అనగా రెండు ఉత్సవాలలో కలపి నాలుగురోజులు, గోవిందరాజ పూజాదికాన్ని యేర్పాటు చేశాడు. (నెం.134) గోవిందరాజు 9వ రోజు **తిరువనంతాళ్** నాడు, రెండు ఉత్సవాలలోను **రఘునాథుని (శ్రీరాముని)** ఆలయానికి కొనిపోబడి (నెం.118) అక్కడ ఒక మంటపంలో అర్చింపబడింది, మరల వైకాశి ఉత్సవంలో విడాయట్టి రోజున, వాని ఇద్దరు నాచ్చిమార్‌లతో కొనిపోబడి నైవేద్యములివ్వబడుతాయి. (నెం.110)

శ్రీ వేంకటేశ్వరుని బ్రహ్మోత్సవాలు ఏడునూ పతాకావిష్కరణతో ప్రారంభ మౌతాయి. వానిలో తమిళ నెలలగు పురట్టాశి, పంగుణిలలో జరిపించు రెండు మాత్రం ఊరేగింపునకు రథాన్ని ఉపయోగిస్తారు. (సం.II, నెం.68, నెం.96, 100, 105, 108, 11, 111). తిరుపతిలోని గోవిందరాజుకు ఊరేగింపులో 8వ రోజున రెండు బ్రహ్మోత్సవాల్లో వైకాశి, ఆణిలలో జరుగువానిలో రథం ఉపయోగింపబడుతుంది.

వేంకటేశ్వరుని ఏడు ఉత్సవాలలో ప్రతియొక్క దానిలో 9వ రోజూ, గోవిందరాజును రెండు ఉత్సవాలలోను, ఆరోజులలో ఆచారంగా ఆలయ లావాదేవీలను చదివి వినిపించడం ఉండేది; బహుశః ఇది ఆలయ ఆదాయం యాత్రికులద్వారా గడచిన 8 రోజులలో ఎంత వచ్చినదను విషయం కావచ్చు. దీనిని ఆలయపు లెక్కలు వ్రాసేవారు. ధాన్యాగారం ముందు, ఉత్సవ విగ్రహాలు వేంచేసియుండగా వారి సమక్షంలో చదివేవారు. కనుక బియ్యం, పప్పుదినుసులు గడచిన ఎనిమిది రోజుల్లో ఎంత ఖర్చయిందో, ఆ లెక్క. దీనిలో యాత్రికులు ప్రసాదం, పణ్యారం కొరకు చెల్లించిన సొమ్ముకూడా చేర్చి చదవబడి ఉంది. (సం.II, నెం.115).

ఈ విషయం ప్రత్యేకించి స్పష్టీకరించబడకున్నప్పటికి, ఈ నాటి ఆచారం ప్రకారం ఒక చిన్న, అలంకరింపబడిన ఖాళీ రథాన్ని ఉత్సవ విగ్రహాలు పరివేష్టించియున్న పెద్ద రథానికి ముందుగా, శ్రీ వేంకటేశ్వరుని రథోత్సవం నాడు, గడచిన యుగాలలో సృష్టికర్తయైన బ్రహ్మదేవునిచే ఈ బ్రహ్మోత్సవం ప్రారంభింపబడినదని గుర్తింపుగాను, కనుక ఆ బ్రహ్మయే ఎల్లప్పుడు వేంకటేశ్వరుని ఈ ఉత్సవాన్ని జరిపించునను గుర్తుగాను ఇది జరుగుతుంది. ఈ చిన్న రథం **'బ్రహ్మరథం'** అనబడుతుంది. అందు అదృశ్యంగా బ్రహ్మ కొలువై ఈ ఉత్సవాన్ని నిర్వహిస్తాడని నమ్మబడుతోంది.

కొందరు వ్యక్తులచే కొండపైనా తిరుపతిలోను ఇండ్లముంగిటను పూదోటలలోను చాలా మంటపాలు నిర్మించబడినవి. ఈ బ్రహ్మోత్సవ సమయాలలోను, తదితర ఉత్సవాల కాలంలోను, మరికొన్ని శుభపవిత్ర తిథులలోను దేవతామూర్తులు తమ ఊరేగింపులలో ఈ మంటపాలపై అర్చింపబడి నైవేద్యం లందుకొంటారు.

ఈ బ్రహ్మోత్సవాలు లేక తిరుక్కొడి తిరునాళ్ కాక ఈ రెండు ప్రదేశాలలోను వేరు ఉత్సవాలు కూడా ఉన్నాయి. **కోడైతిరునాళ్** అనబడే వేసవి ఉత్సవం చిత్తిరై నెలలో (ఏప్రిల్-మే) చిత్తిరై నక్షత్రమున్న రోజున మొదలై 20రోజులు సాగాయి (సం.II, నెం.126). అందు మొదటి మూడురోజులు వసంతోత్సవ తిరునాళ్‌గా జరుపబడుతుంది (నెం.127) భక్తులచే నైవేద్యాలు 1వ, 10వ, 20వ రోజులలో సమర్పించబడేది. **కందాడై రామానుజయ్యంగార్,** తమవేయగు రామానుజ కూటముల నిర్వాహకులు. ఇదిగాక, సాళువ నరసింహుదును పాణ్-భండారం నిర్వాహకుడును వీనిని **సాళువ నరసింహుని కుమారుడు ఇమ్మడి నరసింహుడు** ఉత్తర్వుతో నియమించెను. ఈతడు మలైకినియనిన్ఱ పెరుమాళ్, గోవిందరాజులకు 20 రోజులు 20 అప్పపడికై యేర్పాటు చేసెను. అంతేకాక, రెండు కుండల నిండుగా పానకం దేవతలిద్దరకు చేయించాడు. వాని ఉలా లేక స్తుతిని ఆలయంలో గానం చేసినందుకు, దేవతలిద్దరు ఊరేగింపులో మెల్లమెల్లగా కోడై ఉత్సవంలో (నెం.134) సాగిన సందర్భంగా, **కుమార తాతయ్యంగార్** కూడా 20 అప్పపడి శ్రీ వేంకటేశ్వరునకు ఈ 20 రోజులు నైవేద్యంగా సమర్పించాడు. (నెం.109) మహామండలేశ్వర ఉత్తమగండ గండభేరుండ నరసరాజ ఉడైయార్ గోవిందరాజుకు తాను ఆలయమునెదుట నిర్మించిన మంటపంలో **కోడైతిరునాళ్** ఇరవై రోజులు నైవేద్యానికి ఇరవై అప్పపడి సమర్పించాడు. (నెం.127) బ్రహ్మోత్సవాలవలె కోడైతిరునాళ్ ఇంతకు ముందే **వీరనరసింహదేవ యాదవరాయని** పాలనకాలం 17వ సంవత్సరంలో, అనగా క్రీ.శ. 1222లో ప్రారంభింపబడింది. క్రీ.శ. 1404లో వాడుకలో ఉండేది. (సం.I, నెం.168, నెం.19.1)

అట్లే **అధ్యయనోత్సవం** (వైష్ణవ ఆళ్వారుల స్తోత్రాలు చదువబడే ఉత్సవము) ముళ్ళై తిరువేంకట జీయర్, అరిశాణాలైయన్ అను తిరుమలలోని పూదోటకు నిర్వాహకుడు, శక సంవత్సరం 1312లో క్రీ.శ. 1390 డిసెంబరు 8న 1200 పణాలు చెల్లించడం ద్వారా యేర్పాటు చేసినట్లు కనబడుతుంది. ఇది **తిరుప్పావై** (శ్రీ ఆండాళ్, అనగా **సూడిక్కొడుత్త నాచ్చియార్** రచించిన ప్రబంధంలోని భాగం) మార్గళి నెలలో ధనుర్మాసంలో **మలైకినియనిన్ఱ-పెరుమాళ్** వారి ఇద్దరు నాచ్చిమార్‌లు తిరుమలలో వారి ఊరేగింపులలోను అదే పది రోజులు తిరుపతిలో గోవిందరాజుకున్ను నైవేద్యాలు యేర్పాటు చేశాడు. (నెం.187, సం.I) శక సంవత్సరం 1367లో, క్రీ.శ.1445 డిసెంబరు 13న, తిరుపతివారైన ఇద్దరు శ్రీవైష్ణవులున్ను ఇద్దరు ఆలయపు లెక్కలు వ్రాయువారున్ను కలసి **గోవిందరాజు**నకు **తిరుప్పళ్ళి-ఎళుచ్చి**యున్ను, ఒకే మార్గళి నెలలో (దాదాపు డిసెంబరు 15 నుండి జనవరి 15 వరకు) నైవేద్యము లేర్పరచిరి (నెం.212, సం.I) ఇట్లు అధ్యయనోత్సవమున్ను తిరుప్పళ్ళి-ఎళ్ళుచ్చియున్ను, ఒకే మార్గళి నెలలో జరుపబడి, రెండు వేర్వేరు ఉత్సవాలు. అందుకే ఈ రెండు ఉత్సవాలకువిడివిడిగా దేవతలకు నైవేద్యాల యేర్పాటు సమాంతరంగా ఒకేసారి ఉన్నది. పై పెచ్చు అధ్యయనోత్సవం మొత్తం 22 అని గుర్తువ్రాసి, మరల 2 రోజులు కలిపి 24 రోజులని వ్రాయబడింది. (నెం.134, సం.II), 23 రోజులని (నెం.83, నెం.109), పూర్తి 24 రోజులుగా (నెం.138, సం.II) తిరుప్పళ్ళి- ఎళుచ్చి మార్గళి నెల పూర్తి 30 రోజులున్నది. ఇదిగాక ఇయల్పా (ప్రబంధంలో ఒక భాగం) తువక్కం (ప్రారంభం) కూడా మొదటి రోజున ఉన్నది. తిరువధ్యయనం 24 రోజులు,

**తణ్ణీర్-అముదు** (వళి) **తిరుత్తూనాళ్** (నీటి ఒనరు దగ్గరకు పోవుబాటను శుభ్రం చేయుట) వరకు ఉంది. (సం.II, నెం.138). ఈ బాటను బాగుచేయు కార్యము. ఆకాశగంగ – జలపాతం వద్దకు పోవుబాట ఇది. అచటనుండి నేడు కూడ వేంకటేశ్వరుని నిత్యపూజకు జలం తేబడుచున్నది. ఈ విషయం నెం.95లో స్పష్టం చేయబడింది. అందులో, కడైకోళి నాచ్చియార్ యొక్క తిరువధ్యయనం రోజునకు తరువాతి రోజు బాటను శుభ్రం చేయడం జరుగును, అనియు నైవేద్యమిడిన ప్రసాదంలో పెద్ద పరిమాణాలు జలపాతం చెంతకు పంపబడి, స్థానత్తార్ తదితరులు అక్కడున్నవారు స్వీకరిస్తారని ఉంది.

తిరుపతిలో కూడ దీనిని పోలిన కార్యక్రమమొకటి, నీటివద్దకు బాట బాగుచేయుట జరిగింది. దానిని చూచుటకు గోవిందరాజు బయలు దేరినాడు (నెం.85) కాని ఆ శాసనం ఖండంగా (broken) మాత్రముండటం వలన, నీటిని ఎక్కడ నుండి తెత్తురనిగాని, ఎప్పుడు తెత్తురనిగాని వివరాలు నష్టమైపోయినాయి. అదే విధంగా, నెం.29 గోవిందరాజుకు శ్రీదేవి భూదేవి సమేతంగా లోకసంగ్రహార్థం శ్రీరామానుజార్యుడు, బహుశః వైష్ణవాచార్యుడై రామానుజుడు యేర్పరచిన పద్ధతిలో, దేవతలచే పవిత్రీకరింప బడిన, సర్వపవిత్ర నదీజలాలు అదృశ్యంగా చేరియున్న ఒక నీటి వనరు నుండి తెచ్చిన నీటితో పవిత్రస్నానం చేయించబడినట్లు ప్రస్తావిస్తుంది. ఈ స్నపనం యే సందర్భానికి సంబంధించిందో చెప్పబడలేదు. సాధారణంగా గోవిందరాజు అవబృథం రోజున, అనగా తన బ్రహ్మోత్సవం 9వ రోజున, వైకాశిలో తొలిరోజులలో చక్రస్నానానికై, శ్రావణమాసంలో యజ్ఞోపవీత ధారణకై, నెం.29లో చెప్పబడినట్లు, శ్రవణానక్షత్ర సహిత పౌర్ణమినాడు, శ్రవణానక్షత్ర సహిత పౌర్ణమినాడు, యజుర్వేద-ఉపాకర్మం రోజున కపిల-తీర్థానికి తీసికొనిపోబడును. కాని, ఇది గోవిందరాజు ఆధ్యయనోత్సవము సందర్భంకాదు, వేంకటేశ్వరుని విషయంలో వలె, నేడు తమిళ నెలయగు తై నెలలో, ఈ శాసనాలలో ఉన్నట్లు మార్గళి నెలలోకాదు, అనగా సుమారు జనవరి 15 నుండి, గోవిందరాజుల ఆధ్యయనోత్సవం జరుగుతూ ఉంది.

శకసంవత్సరం 1385లో, క్రీ.శ.1464 జనవరి 18న **సాళువ నరసింహుని దాయాది సాళువ మల్లయదేవ మహారాజు, ఎఱ్ఱకంపయదేవ మహారాజు, ఎఱ్ఱకంపయదేవ మహారాజు** కుమారుడు, వేంకటేశ్వరునకు ఆవణినెలలో తిరుపవిత్ర తిరునాళ్, పవిత్రోత్సవం, శుక్లపక్షదశమి రాత్రి అంకురార్పణంతో మొదలయి 5 రోజులు సాగునట్లు యేర్పాటు చేశాడు. ఏకాదశినాడు తిరుమామణి మంటపాన్ని అలంకరించి, ద్వాదశినాడు పవిత్రాన్ని (దర్భగడ్డితో చేసిన ఉంగరాన్నిగాని లేక పట్టుదారంతో చేసినది గాని) ధరింపజేసి పుణ్యాహవాచనం అను పవిత్రీకరణం చేసి, ముగ్గురు ఉత్సవమూర్తులు కూర్చుని యుండగా, వారిని ఊరి వీధులగుండా ఊరేగించుట అనేది ఈ ఉత్సవం. ఈ కార్యక్రమంలో ద్వాదశినాడు జరిగేది ప్రధానకార్యక్రమం. ఇదే తంతు ఆ తరువాతి రెండు రోజులలో కూడ పునరావృతమై ఉంటుంది. ఎందుకంటే ఈ ఉత్సవం 5 రోజులు సాగుట కుద్దేశింపబడింది. కనుకే ఈ కార్యక్రమం మాత్రమే శాసనాలలో వ్రాయబడింది. ఈ ఉత్సవదినాలలో పెద్ద పరిమాణంలో నైవేద్యాలు కూడ యేర్పరుపబడ్డాయి (నెం.18). శక సంవత్సరం

1415లో, క్రీ.శ 1494 ఫిబ్రవరి 17న, చంద్రగిరి రాజ్యంలో బ్రాహ్మణ సేనానాయకుడగు **తిమ్మన దండనాయకుడు,** ఉత్సవవిగ్రహాలకై తువక్కం, పవిత్రతిరునాళ్ ఆరంభంలో ఒక అప్పపడి నైవేద్యంగా అర్పించాడు; శకసంవత్సరము 1417లో, క్రీ.శ.1495 ఆగష్టు 31న, కందాడై రామానుజయ్యంగార్ తిరునాళ్ 5 దినాలలో నిత్యం ఒక అప్పపడి నైవేద్యం నేర్పరచాడు; శక సంవత్సరం 1426లో, క్రీ.శ.1504 సెప్టెంబరు 20న, **తిరువేంకట చ్చిఱుక్కన్ తిరుప్పణి పిళ్ళై ఎంపెరుమానార్** పవిత్రోత్సవం 5 రోజులున్ను అయిదు అతిరసపడి యేర్పాటు చేశాడు (138). ఈ ఉత్సవం చాలా కాలము క్రిందట ఆగిపోయినది, మరల కొద్ది సంవత్సరాల క్రింద పునః ప్రారంభింపబడింది.

చాంద్రమాన విజయనామ సంవత్సర, శక సంవత్సరం 1395లో, క్రీ.శ. 1473 జూన్ 15న సాళువ నరసింహుడు **డోలామహోత్సవ-అన్న-ఊంజల్–తిరునాళ్** అను హంసడోలోత్సవాన్ని ప్రారంభించాడు. ఈ ఉత్సవం విస్తారమైన కర్మకాండతో, బియ్యం, పాలు, నెయ్యి, పెరుగు, సుగంధద్రవ్యాలు, నూనె, వస్త్రం, గంధం, పసుపు ఇత్యాది వివిధ పదార్థాలు పెద్ద ప్రమాణంలో వినియోగింపబడుతుంది, 5 రోజుల పాటు మిథున మాసంలో శుక్లపక్షంలో సప్తమితిథినాడు నవధాన్యాల వికిరణంతో ప్రారంభమై సాగుతుంది. పెద్ద ప్రమాణంలో ప్రసాదం (వండిన అన్నం), ఆరు విధాల పణ్యారం (తిను బండారము కాల్చినదిగాని, నేతిలో ఉడికించిందిగాని, సాధారణంగా పడి అనబడే, ఒక ప్రమాణం బియ్యం లేక పప్పులతో చేయబడింది), రాత్రియు పవలును కూడ, ఒక సంధితో కలిపి రాత్రి పూర్ణాలంకృత దేవతలకు యేర్పాటు చేయబడింది. ఇది తన తల్లి మల్లాయమ్మన్ పేరున జరుపబడింది (నెం.50) ఈ ఉత్సవము తన మంటపంలోనే ఊంజల్ లేక ఊయెల మీద జరుపబడింది. ఈ మంటపం ధ్వజస్తంభానికి దక్షిణంలో సంపంగి ప్రదక్షిణంలో నిర్మింపబడింది. కాని నేడిది **తిరుమలరాయ మంటపం** అనబడుచున్నది. తరువాతి కాలంలో ఉత్సవ విగ్రహాలకు ఈ మంటపంలో ఒక రోజునగాని లేక ఎక్కువ రోజులలోగాని ఈ ఉత్సవం కాలముననను తదితర ఉత్సవాల కాలంలోను కూడ నైవేద్యాలు భక్తులచే యేర్పరుప బడింది.

డోలోత్సవంతోబాటు సాళువ నరసింహుడే ఉత్సవమూర్తులు ముగ్గురిని డోలపై కూర్చుండబెట్టి చిత్తిరైతిరునాళ్ (చిత్తిరై నెలలోని బ్రహ్మోత్సవం) మొదటి 7 రోజులు, కోడైతిరునాళ్ 10వ ఉత్సవమురోజు, సంక్రమణము రోజు (మకర సంక్రాంతి, దక్షిణాయనము) వివిధ పదార్థములతో వారికి ఆరు విధాల నైవేద్యాలనర్పించేటట్లు యేర్పాటు చేశాడు (నెం.50). తిమ్మణ దండనాయకుడు చంద్రగిరి సైన్యాధిపతి, క్రీ.శ.1494 ఫిబ్రవరిలో,విగ్రహాలకు డోలోత్సవం మొదటిరోజు, పవిత్రోత్సవంలో వలెనే (నెం.113), ఒక నైవేద్యానికై యేర్పాటు చేశాడు. కందాడై రామానుజయ్యంగార్ ఉత్సవం అయిదు రోజులలో ప్రతి రోజున్ను, పవిత్ర తిరునాళ్లోవలె, నైవేద్యం నేర్పాటు చేశాడు. (నెం.134) **తిరువేంకట చ్చిరుకూన్, తిరుప్పణి పిళ్ళై ఎంబెరుమానార్** ప్రతి రోజున్ను పవిత్ర తిరునాళ్ వలెనే, అయిదు రోజుల పాటు నైవేద్యాలను యేర్పాటు చేసెను (నెం.138)

ఈ పై జెప్పిన ఉత్సవాలుకాక, **తోపు–తిరునాళ్** అను నొక ఉత్సవం ఒక పండ్లతోటలోగాని లేక చిన్న వనంలోగాని ఒక 20 రోజులు జరుగుతుంది నెం.113లో మన దృష్టికి వస్తుంది. **తిమ్మణదండనాయకుడు** దీని పూర్వార్ధపు 10 రోజులలో మొదటి ప్రారంభ దినాన్ని (తువక్కం), ఉత్తరార్ధపు 10 రోజుల మొదటి రోజునను ఒక నైవేద్యానికై యేర్పాటుగావించాడు.

ఉత్సవాలు మాత్రమే కాదు, పుణ్యతిథులు **శ్రీరామనవమి, నృసింహ జయంతి కృష్ణజయంతి** వంటివి కూడ ప్రత్యేక పూజలకు, నైవేద్యాలకు, ఊరేగింపులకును సందర్భాలే. శ్రీరామనవమి. చైత్రశుద్ధ నవమి, పుణ్యతిథిగా శ్రీరాము దవతరించిన రోజుగా భావించబడుతూ ఉంది. ఇది ఇండ్లలోకూడ పండుగగా జరుపుకోవడం ఆచారం. ఆనాడు రఘునాథుడను శ్రీరాముడు, రఘువంశంలో జన్మించినవాడు, తిరుపతిలోని రాముని ఆలయంలో నైవేద్యం సమర్పింపబడి, మరల మరియొక నైవేద్యం ఆ స్వామి హనుమంతుని (ఆంజనేయుడు, రామబంటు) ఆలయానికి ఊరేగింపు తరువాతవచ్చినప్పుడు (నెం.118), మరియొకటి **శరణుశెట్టి** అనుదాత కట్టించిన నరసింగరాయ పురపు పొలిమేరపై తిరుపతిలోని మంటపంవద్ద, ఇవ్వబడుతుంది. (130). ఈ రోజున ఆలయాలలో ఆస్థానం జరుగుతుంది.

ఇట్లే, నృసింహజయంతి శ్రీ నరసింహుని అవతారదినంగా కొందరు తమ ఇండ్లలో పండుగ చేసికొంటారు. ఇది తెలుగు చాంద్రమాన వైశాఖ మాసంలో శుద్ధ చతుర్దశినాడు, జరుగును. ఈతడు ప్రహ్లాదుని తండ్రియైన హిరణ్యకశిపుని చంపినదేవుడు. ఆ మరునాడు వసంతపూర్ణిమ. ఈ రోజుకూడా మిగత అన్ని రోజులవలెనే, అనగా శ్రీరామ నవమి, శ్రీజయంతి వంటివి, ఉత్సవ కాలంలోను ఒకానొక తమ్మయన్ అనునాతడు **అళగియ శింగర్, నృసింహ, యోగనృసింహ** దైవానికి విమాన ప్రదక్షిణములో వేంకటేశ్వరుని ఆలయపు ఈశాన్యమున (101) నైవేద్యాలకు యేర్పాటు చేశాడు. అళగియ–శింగర్ స్నానాలు, వేంకటత్తరిగా నువ్వుల నూనె గంధపు ముద్దతో జరుగుతుంది. వీనితో ప్రసాదం, పణ్యారం, వసంతపూర్ణిమనాడు, పంగుణి అమావాస్య నాడు (నెం.38). **తిరుప్పణిపిళ్ళై ఎంబెరుమానార్ వేంకటత్తరికి వసంతపూర్ణిమ** రోజున (నెం.138) **చిత్రపూర్ణిమ అని కూడ అంటారు. అది సౌరమాసంలో చిత్తిరై నెలలో వస్తుంది కనుక ఆ పేరు, నైవేద్యం ఏర్పాటు చేశాడు.**

అట్లే **శ్రీజయంతి:** శ్రావణమాసంలో కృష్ణపక్షంలో అష్టమితిథిరోజు **కృష్ణజన్మాష్టమి,** శ్రీ కృష్ణుని పుట్టిన రోజుగా, గృహస్థులు పవిత్రదినంగా ఇండ్లలో జరుపుకుంటారు. ఈతడు అర్జునుని, రథసారథిగా, మహాభారత యుద్ధభూమిపై నడిపినవాడు. ఈతడే అర్జునునకు భగవద్గీతనుపదేశించిన వాడు. ఈ రోజును **గోకులాష్టమి** అనికూడా, వాని జన్మ గోకులంలో జరిగిన కారణంగా అంటారు. సాధారణంగా రోహిణీ నక్షత్రం అష్టమి తిథినాడు వస్తుంది. ఆ రోజున ఎందరో భక్తులు ఆ స్వామికిగాని, వేంకటేశ్వరునకుగాని లేక గోవిందరాజునకుగాని నైవేద్యాలు సమర్పిస్తారు. ఒక బాలుడుగా ఆతడు గొల్లవారి ఇండ్లలోని ఉట్లనుండి

ఎగిరి అందుకొని వెన్నను దొంగిలించినాడని భావించదుతూ ఉంది. కొన్నిచోట్ల ఈ ఆకతాయితనం ప్రదర్శింప బడుతూ ఉంది. రెండు వెదురు బొంగులను నిలువబెట్టి, వాటిని కలుపుతూ అడ్డంగా ఒక వెదురు కర్రను కట్టి, ఒక చిన్న కప్పీని దానికి కట్టి, దానికే ఒక క్రొత్త గుడ్డను కొబ్బరికాయకు చుట్టి మరికొన్ని వస్తువులతో ఒక త్రాటికి కట్టి ఉంచుతారు. దాని నందుకొనేందుకు యువకుడెవడైన ప్రయత్నించినప్పుడు, అతడు ఎగురగానే అందకుండ ఆ త్రాడును లాగుతూ ఉంటారు. ఎన్నో ప్రయత్నాల తరువాత దాని నాతడు అందుకొంటాడు. దీనిని చూచేందుకు వందలమంది గుమిగూడుతారు. ఈ కార్యక్రమం చివరన, దేవతకు కొన్ని నైవేద్యం పెడతారు. ఈ పండుగను తమిళంలో **ఉరి-అడి** అనిన్నీ, తెలుగులో **ఉట్లు** అనిన్నీ అంటారు.

శ్రీకృష్ణుడవతరించిన వేళ శ్రీజయంతి రోజున వేంకటేశ్వరునికి పెద్ద నైవేద్యం పెడతారు. తిరుపతిలోని గోవిందరాజుకున్ను **శీడైపడి** అను నైవేద్యం చేస్తారు (నెం.88, 91, 96, 101); వేంకటేశ్వరుని ఆలయంలో కృష్ణునకు స్వయముగాను, ఉరి-అడి రోజున, లెక్కలు చూచేవారు యేర్పరచింది, గోవిందరాజునకు (132), వేంకటేశ్వరునికి ఒక్కనికిన్నీ (138) నైవేద్యం లేర్పరుపబడ్డాయి.

శ్రీజయంతి రోజుననే ఉరిఅడి జరుపబడుతుంది (నెం.96), ఆవణి నెలలో, (నెం.83). ఇది చాలా ప్రదేశాలలో జరుగుతుంది. దాతల ఇండ్ల ముంగిట వారు కట్టించిన మంటపాలు, మఠాలలో ఒక దాని తర్వాత నొకటిగా, ప్రతిచోటా నైవేద్యం ఇవ్వబడుతుంది. ప్రత్యేకము, పిళ్ళైకి (బాలకృష్ణునికి) అయిదు రకాల నైవేద్యాలు అర్పింపబతుంది (146).

సూర్యుడు వేర్వేరు రాశులలో ప్రవేశించినప్పుడు, స్త్రీ పురుష వంశకర్తలకు పూర్వులకు తిలలు నీళ్ళు తర్పణంగా వదిలిపెట్టు సందర్భాలలో, అమావాస్య, సంక్రమణం సమరాత్రిందివ కాలాల్లో పవిత్రదినాలుగా భావించే రోజులు చాల ఉన్నాయి.

వేర్వేరు నెలలలోని అమావాస్యలలో, సౌరమాన లేక తమిళ నెలయైన తై నెల ప్రత్యేకంగా గోవిందరాజునకు నైవేద్యములిచ్చుటకు శుభదినంగా నెంచబడి, ఆ రోజున హనుమంతుని ఆలయంలో, ఊరేగింపుగా అతడక్కడకు తీసికొనిరాబడినప్పుడు (నెం.96) దాతల మంటపాలలోను (నెం.105, నెం.111), సంవత్సరంలోని 12 అమావాస్యలలో కూడ (నెం.127) అర్చించబడుతుంది.

'సంక్రమణమున', అంటే మకరసంక్రమణం రోజున (దక్షిణాయనము) సాళువ నరసింహుడు, ఉత్సవ విగ్రహములను **అన్న-ఊంజల్**పై కూర్చుండబెట్టుటకు యేర్పాటు చేశాడు. ఈ ఊంజల్ తన మంటపంలోని ఉయ్యాల. అప్పుడు వారికి ఆరు విధాలైన నైవేద్యాలివ్వడానికి యేర్పాటైనది (నెం.50). తిమ్మణ్, తిరుచ్చుకనూర్ సభైయార్‌లలో నొకరు వేంకటేశ్వరునకు, గోవిందరాజుకు, ఇద్దరకు, 2 వ వారికి పవిత్రస్నానంతోబాటు (నెం.100) నైవేద్యాలు ఏర్పాటు చేశాడు. ఇద్దరు ఆలయపు లెక్కలు చూచేవారు ఇద్దరు దైవాలకు నైవేద్యాలను (నెం.115), మరిద్దరు దాతలు గోవిందరాజుకు మాత్రమే నైవేద్యాలను ఏర్పరచారు (నెం.117, నెం.127).

**ఆడి– అయనము** లేక **కటక సంక్రమణము** (ఉత్తరాయణము), దక్షిణాయనము మొదలుపెట్టే రోజు, సుమారు జూలై 15 నుండి మకర సంక్రమణము ఉత్తర అయనము మొదలుపెట్టే రోజు, దాదాపు జనవరి 15 నుండి, ఆలయ కార్యక్రమములలో చాలా ముఖ్యమైన రోజు. ఉత్సవ విగ్రహాలు తిరుమహామణి మంటపంలో ముందు వైపు కూర్చుండబెట్టబడి, పవిత్రస్నానాలు చేయించి, వస్త్రధారణం చేయించి, వజ్రాదులతో ఆభరణములతో అలంకరింపబడి, వివిధములైన ప్రసాదాలు పణ్యారములు నివేదించ బడుతుంది. ఆ తరువాత ఆ నైవేద్యాలు అర్చకుడు, జీయర్, లేక జీయంగార్, ఆచార్యపురుషులు, మిగత మిరాసిదార్ వారసులు లేక హక్కుదారులు, కార్యనిర్వాహక సమితి సభ్యులు, ఆలయ కార్యానిర్వహణాధికార ప్రముఖులు, ఒక పెద్ద ఆస్థానంగా, వీరందరకు పంచబడుతుంది. సంవత్సరంలో ఇది మూడిట మొదటి పెద్ద ఆస్థానం. దీనిని నేడు **ఆని-వర-ఆస్థానము**, అనగా **సౌరమాన ఆని మాసము** చివర జరుగునది అని పిలువబడుచున్నది. కాని, నిజానికిది తరువాతిదైన **ఆడి మాసారంభ దినంలో** జరుగుతుంది. కనుక శాసనాలలో దీనికి **ఆడి అయనము** అని పేరిడిరి. ఈ రోజుతో ఆలయ సంవత్సరం మొదలవుతుంది, ఫసలీ సంవత్సరానికి కూడా ఇదే మొదటి రోజు. దీని ప్రత్యేకత ఏమంటే, అర్చకుడు, జీయంగార్ ఆలయపాలనావ్యవస్థకు, కార్యనిర్వహణాధికారులకు పెద్దయైనవాడు, వీరందరు ఒకరి తరువాత నొకరు, తమ అధికారానికి, సేవలకు చిహ్నంగా ఆలయం తాలూకు పెద్దతాళపు చెవులగుత్తిని పట్టుకొంటారు.

దానితో ఆలయ సంవత్సరం మొదలవుతుంది కనుక, ఆ రోజు నుండి ఆలయపు జమ-ఖర్చులు లెక్క వ్రాయటం మొదలవుతాయి. ఈ విషయం శాసనాలలో ప్రత్యేక శ్రద్ధతో ప్రస్తావించబడింది. ఈ రోజున **వేంకటేశ్వర గోవిందరాజు** లిద్దరకు నైవేద్యాలు ఏర్పాటును గురించియున్న శాసనాలలో; ప్రత్యేకం ఆలయపు లెక్కలు వ్రాయువారేర్పరచి నప్పుడు, క్రొత్త సంవత్సరపు లెక్కల పద్దు లారంభమైన రోజు, లేక పద్దులారంభమైన వెంటనే, రెండు ఆలయాలలోను, అని వ్రాయబడింది. నెం.116 లో **ఆడి అయనం రోజున, తిరువేంగడముడైయాన్, గోవిందప్పెరుమాళ్‌లకు మాత్రమే కాక తిరువిరుండ పెరుమాళ్, ప్రసన్న – తిరుమలైయన్, యాదవ నారాయణప్పెరుమాళ్, ఉడయార్ అను గోవిందరాజు ఆలయంలో గల ఈ నలుగురకు కూడ నైవేద్యము లేర్పరచినట్లుంది.** దీనిని బట్టి పూర్వం **వేంకటేశ్వర గోవిందరాజు** లిద్దరి ఆలయాలలో వేర్వేరుగా లెక్కలు వ్రాయబడుచున్నట్లు తెలియవస్తున్నది. అయితే తిరుపతిలోని గోవిందరాజు ఆలయం, తిరుమలపై గల వేంకటేశ్వరుని ఆలయస్థానత్తార్ (నిర్వాహకులు) పరిధిలో ఉంది (నెం.95, నెం.115, నెం.116, నెం.118, నెం.132) ఇప్పుడు ఈ రెండు దేవాలయాలను ఇతర చిన్న చిన్న గదులున్ను దేవస్థానాల ధర్మకర్తల సంఘం నిర్వహణలోనున్నందు వల్ల, తిరుపతిలో వేరుగా నొక ఆ దేవస్థానపు కార్యాలయంలో ఉండటం, ఈ కార్యాలయం లెక్కలన్నిటిని ప్రతి సంవత్సరం జులై 1 వ తేది నుండి ఫసలీ సంవత్సర ప్రారంభం అనుకూలమని భావించి, ఆడి అయనం లేక ఆనివర ఆస్థానము తేదియగు జులై 15 నకు బదులుగా, ప్రారంభించి వ్రాస్తారు.

ఆడి అయనం అనగా కటక సంక్రమణం, మకర సంక్రమణం ప్రసిద్ధంగా సంక్రమం లేక సంక్రాంతి అని పిలువబడునవి **అయన సంక్రాంతి** అనబడును (ఉత్తరాయణము, దక్షిణాయనము, ఈ క్రమమున) అనగా సూర్యుడు దక్షిణ దిశగా సాగునపుడు కర్కటకరాశిలోనికి ప్రవేశించడం, తిరిగి ఉత్తర దిక్కునకు మరలి సాగునపుడు మరకరాశిలోనికి ప్రవేశించడం, అనగా నతని ఉత్తర దిక్కునకు ప్రయాణంలో మేషరాశి ప్రవేశ సమయం, అట్లే దక్షిణ దిక్కుకు ప్రయాణంలో తులారాశి ప్రవేశం, వీనికి విషు సంక్రమణాలు, వసంతంలోని ఆకురాలు కాలంలోని విషుపదములు సౌరమాసం చిత్తిరై లేక మేష (జ్యోతి శ్చక్రంలోని రాశి పేరు), సౌర సంవత్సరం ప్రారంభం అర్పశి లేక అల్పశి నెల మొదలు. ఇవి తర్పణానికి అనుకూలమైన విషువత్ పుణ్యకాలం. చిత్తిరై విషు రోజున, ఇతర దినాలలో కూడ ఒక భక్తునిచే రఘునాథుడు లేక శ్రీరామునకు నైవేద్యం లేర్పరుపబడింది (నెం. 88); గోవిందరాజు (ఉత్సవ విగ్రహం)నకు, నాచ్చిమార్‌కున్ను చిత్రకూట మంటపంలో వాని ఆలయ ప్రవేశద్వారం వద్ద విశాలమైన నడవ, తిరుచానూర్ సభ సభ్యులచే (నెం. 105) శ్రీకరణ మంటపం నొద్ద ఉత్సవ విగ్రహానికి పరమేశ్వర మంగళం నివాసులైన ముగ్గురిచేత నైవేద్యాలు ఏర్పరుపబడింది (నెం. 132). **అర్పశి-విషు లేక తులాసంక్రమణం నాడు ఆలయంలో లెక్కలు వ్రాయు విఘ్నేశ్వర శ్రీరామన్, రఘునాథునకు (నెం. 88); తిరుమలకు చెందిన ఏకాంగి - శ్రీవైష్ణవులలో ఒకడైన పెరియ పెరుమాళ్ దాసర్ తిరుమంజనం, తిరువోలక్కంలను గోవిందరాజుకు ఏర్పరచాడు** (నెం. 137).

మకర సంక్రమణానికి ముందురోజు భోగి పండుగ, దానికి తర్వాతి రోజు పాడియవేట్టై, పారువేట (వేటకై పరుగు). దీనిని కను, కనుమ అని కూడా అంటారు. పాడియవేట్టై కొరకు శ్రీగోవిందరాజు, నాచ్చియార్‌లు తిరుపతికి తూర్పున ఒక మైలు దూరంలో రేణిగుంటకు పోయే మార్గంలో ఉన్న మంటపంలో తీసుకుపోబడి, అక్కడ కొందరు భక్తులిచ్చిన దానాలతో నైవేద్యా లియ్యబడేవి. కొందరు దాతలు మంటపాలు కట్టించి వానిలో నైవేద్యాలను కూడా యేర్పరచారు. **అంతెంబరగండ ఉరగోల (అంత్యం బరగండ ఊర్గోలం) 'ఊర్గోలం' - 'ఉరగోల' అంటే మెరవణి, ఊరేగింపు అని అర్థం. సురత్రాణ బైచరాజ తిమ్మరాజు, మహామండలేశ్వరుని కొమ్మరాజ శిరుతిమ్మరాజు**యొక్క కార్యదర్శి, తన యజమాని పేర నొక మంటపాన్ని కట్టి అందు గోవిందరాజు నాచ్చిమార్లకొక తిరువోలక్కం నైవేద్యం నేర్పాటు చేశాడు. అట్లే సేనై ముదలియార్‌కు కూడా వారొక తాలం లేక తిరుచి వాహనం పై అక్కడకు వచ్చినప్పుడు కూడా ఆ నైవేద్యం ఏర్పాటైనది. (నెం. 97) **కోయిల్-కేళ్వి రామానుజ జీయర్, పంకయచ్చెల్వి** పూదోట మఠాలకు నిర్వహణాధికారి, తన మఠం ప్రవేశ ద్వారం నొద్ద గోవిందరాజుకు తాను పాడియవేట్టై నుండి ఆలయానికి తిరిగి వెళ్ళేటప్పుడు (నెం. 122) ఒక అప్పపడి నైవేద్యం ఏర్పరచాడు.

అది కనుమ రోజుకూడ అయినందున, శఠకోపదాసర్ నరసింహరాయ ముదలియార్, నాచ్చియార్, అనగా శూడిక్కుదుత్త నాచ్చియార్ (ఆండాళ్)కు **కనుప్పడి** (కాణుంపొంగల్) సందర్భంగా జరుగు పవిత్రస్నానం తర్వాత ఒక తిరువోలక్కంను సమర్పించాడు (నెం. 68). ఆ రోజున రఘునాథునకొక నైవేద్యం స్నానానంతరం

ఇవ్వబడింది (నెం.88). స్నానానంతరం సీతాదేవియార్‌కు రెండు అర్చన మొదలైనవి అర్పించబడినాయి (నెం.118).

మహానవమి శరన్నవరాత్రి పండుగలో 9 వ రోజు. ఈ రోజున వైకాశి – విశాఖం రోజుననను, అనగా సౌరమాసమగు వైకాశిలో లేక వైయాశిలో విశాఖ నక్షత్రమున్నరోజు, రఘునాథునకు అర్చననైవేద్యము లర్పింపబడుట కేర్పాటు చేయబడింది (నెం.88).

దీపావళి దీపాల పండుగ, నూనెతో వెలిగింపబడిన దీపాలు వరుసలు వరుసలుగా ఇండ్ల ముంగిట, ఇండ్ల లోపల వెలిగే రోజు, అనందకరమైన రోజు. సాధారణంగా చిన్న వయసువారు టపాసులను సంతోష సూచకముగ కాల్చు సందర్భం. ఆలయంలో ఒక పెద్ద ఆస్థానం ఆ రోజున నిర్వహించ బడడం ఇప్పటి ఆచారం. 15 వ శతాబ్దిలో, శకసంవత్సరము 1413, క్రీ.శ.1491 జూన్ 27 న, మహామండలేశ్వర బైచరాజ తిమ్మయదేవ మహారాజు వేంకటేశ్వరుని ఉత్సవవిగ్రహాన్ని, పుణ్యస్నానాన్ని, నైవేద్యాన్ని, చంద్రుని ఆకారంలోని ఒక గుండ్రని పూమాలతో అలంకారం, వీధులవెంట దీపావళినాడు వాని ఊరేగించాలని; అట్లే ఉగాదినాడుగూడ; అట్లే ఆ రెండు రోజులలో గోవిందరాజుకు కూడ సమర్పించడాని కేర్పాటు చేశాడు. అప్పుడు రెండు ఆలయాల లోను ఒక తిరువోలక్కం లేక ఆస్థానం జరిపి, గంధం, తమలపాకులు, పోకచెక్క, ప్రసాదం, పణ్యారం పంచుతారు. ఇదిగాక, మాత్ర (గడ్డపెరుగు కలిపిన అన్నము) నైవేద్యం వేంకటేశ్వర గోవిందరాజుల మూలమూర్తులకు ఇవ్వబడుతాయి (నెం.94). ఆ రోజున ఒక అప్పపడి నైవేద్యం గోవిందరాజుకు ఇవ్వడానికి కొమ్మరాజ శిఖు – తిమ్మరాజు పుత్రుడు మహామండలేశ్వర నరసరాజుచే, వాని నైవేద్యానికై ఎన్నో సందర్భాలలో యేర్పరచిన 115 అప్పపడి సంఖ్య నుండి యేర్పరచాడు. (నెం.127) పరమేశ్వరమంగళం వాస్తవ్యులైన ముగ్గురు శ్రీగోవిందప్పెరుమాళ్‌కు శ్రీకరణ మంటపం (ఆలయ పద్దులకు సంబంధించింది) వద్ద దీపావళి, **యుగాది, చిత్తిరై–విషు రోజులలో ఒక సుగియపడి నైవేద్యాన్ని, అదే మంటపం వద్ద ఆడి–అయనం, తిరుక్కారికై, ఉతి–అడి, తై–అమావాస్య రోజులలో ఒక అప్పపడి నైవేద్యానికై యేర్పాటు చేశారు.** దీని వలన ఆ యా రోజులు అన్నిటిలో స్వామిమూర్తిని తిరుపతి వీధులలో ఊరేగించిరని సూచన లభించింది (నెం.132).

దీపావళి అనునది ఇండ్లలో జరుపుకొను దీపాల పండుగ అయినట్లు యైనట్లే, సౌరమాసమైన కార్తికంలో పూర్ణిమనాడు చేసే తిరుక్కార్తికై అనేది శివవిష్ణువు లిద్దరి ఆలయాలలో జరుపు దీపాల పండుగ. ఆ రోజున వేంకటేశ్వరునికి (ఉత్సవ విగ్రహానికి) కందాడై రామానుజయ్యంగారి (నెం.56) తిరుప్పు – మంటపం వద్ద, ఆ మూర్తి కా సందర్భంలో ఊరేగింపు జరిగిందనడానికి సంకేతంగా, వేరొక చోట వేరొక అర్చనకూడ, అర్పణతో యేర్పాటైంది. (నెం.138, నెం.123) నుండి తెలియవచ్చున దేమంటే ఒక కూటం లేక భోగిమంటను పోలింది, బహుశః ఆలయం ఎదురుగా బహిరంగంగా వీధిలో వెలిగింపబడినట్లు, ఆ రోజున దానిని చూడడానికి ఉత్సవమూర్తిని అక్కడకు తెచ్చినారని తోస్తుంది. ఆలయంలోనికి మరలి

వెళ్లేటప్పుడు స్వామిని **యమునత్తురైవన్**-మంటపానికి, నిత్యము దివ్యమూర్తులకు అలంకరించు పూలమాలలెక్కడ కట్టబడునో, ఆ ఈశాన్య మూలనున్న దానికి తీసికొనిపోబడి అర్చనార్పణలు ఇవ్వబడుతుంది. తిరుపతిలో, గోవిందరాజు ఊరేగింపుగా తీసికొని పోబడి, అంతకు ముందుగ ఆలయంలో నైవేద్యమర్పింపబడి, ఊరేగింపు సాగుతుండగా శ్రీకరణ మంటపం వద్ద అర్చార్పణలు కావింపబడుతాయి. (నెం. 132). ఆ రోజున రఘునాథునకు గూడ నైవేద్యమర్పింప బడినది (నెం. 88), మరల పంగుణి-ఉత్తిరము నాడు కూడ.

ఏకాదశి రోజులు ఉపవాసం చేయవలసిన రోజులు, దానిననుసరించి వచ్చు ద్వాదశి రోజులు విందు రోజులు. చాతుర్మాస్యంలో వచ్చు ఈ రెండు రోజులు, వర్షాకాలం నాలుగు నెలల్లో వచ్చునవి. శ్రీవిష్ణువు యోగనిద్రలోనికి పోయి, శయన-ఏకాదశీ, మరల ఉత్థాన లేక ప్రబోధన - ఏకాదశి రోజున నిద్రమేల్కొంటాడు. ఈ నాలుగు నెలలు సన్యాసులు ఒకే ఒక్క ప్రదేశంలో వర్షకాలాంతము వరకు ఉంటారు, అనగా దాదాపు జులై ఆరంభం నుండి అక్టోబరు చివరి వరకు. మొదటి, మధ్య, చివరి ఏకాదశీ, ద్వాదశులు భక్తులు వేంకటేశ్వరుడు, గోవిందరాజు ఇద్దరకును ఊరేగింపులు నైవేద్యాలు యేర్పరచారు. శ్రీమన్ మహామండలేశ్వర కొమ్మరాజ శిఱు - తిమ్మరాజ ఉడైయర్, శక సంవత్సరం 1412 లో, క్రీ.శ. 1490 జూన్‌లో, మొదటి ద్వాదశి, మధ్య ద్వాదశి, ఉత్థాన - ద్వాదశి రోజులలో చాతుర్మాస్యంలో శ్రీ వేంకటేశ్వరునకు తిరువోలక్కములు యేర్పాటుకై 1600 నాఱ్పణము నిధిగా యేర్పాటుచేశాడు. అట్లే, రెండు ద్వాదశి రోజులలో వీథులవెంట ఊరేగింపుల తరువాత రెండు తిరువోలక్కములు; మొదటి ఏకాదశి, మధ్య ఏకాదశి రోజులలోను, ఉత్థాన లేక ప్రబోధన లేక క్షీరాబ్ధి లేక కైశిక - ద్వాదశి, చాతుర్మాస్యముల చివరి ద్వాదశి, ఉత్థాన ఏకాదశి నాడు ఊరేగింపు తరువాత గోవిందరాజుకు ఒక తిరువోలక్కము (నెం. 91) యేర్పాటు. మహామండలేశ్వర నరసరాజు ఉడైయార్, కొమ్మరాజ శిఱు- తిమ్మరాజ ఉడైయార్ కుమారుడు, పై జెప్పిన శాసనాలలోని దాత, శకసంవత్సరం 1416 లో, క్రీ.శ. 1494 జూన్ 5 న, అదనంగా చేసిన యేర్పాటును బట్టి, ఒక అప్పపడి ఉభయంలో ప్రతిరోజు, అనగా, నడువిల్, ఉత్థాన, ఏకాదశి రోజులలో గోవిందరాజునకు అర్పణం, మిగత రోజులలోను ఇదే విధమైన అర్పణ మొత్తం 115 అప్పపడి, దీనికై 2300 పణం (నెం. 127) నిధి యేర్పాటు చేశాడు. శకసంవత్సరం 1415 లో క్రీ.శ. 1494 మార్చి 9 న ఇద్దరు ఆలయ లెక్కలు వ్రాయువారు **శ్రీ వేంకటేశ్వరునకు ఉత్థాన - ఏకాదశినాడు తన సమక్షంలో పఠింపబడిన కైశికపురాణ శ్రవణానంతరం ఒక కైశిక - తిరువోలక్కమును సమర్పించుటకేర్పాటు చేశారు.** అప్పుడు మలైకినియనిన్ఱ-పెరుమాళ్ లేక మలయప్పయొక్క ఉత్సవ విగ్రహమొక్కటే కాక వేంకటేశ్వరుని మూలమూర్తి, పెరియ-పెరుమాళ్, పొన్-మేయుద-పెరుమాళ్ (బహుశః విమాన వేంకటేశ్వరుడు లేక శ్రీనివాసుడు, ఉత్తర దిక్కునగల మధ్య కలశంపై పూతపూయబడిన రాగిరేకుపై గల వేంకటేశ్వరుని పోలిన గచ్చు చేయబడిన ఒక మూర్తి), **శ్రీ నరసింగ-పెరుమాళ్** (నెం. 38, నెం. 138 లలో వేంకటత్తరి అని పిలువబడే యోగనరసింహుడు, అళగియ-సింగర్ అని నెం. 139, నెం. 101లలో చెప్పబడిన వాడు), **ఆదివరాహ ప్పెరుమాళ్** (పుష్కరిణియొక్క పశ్చిమ

తీరంలోనగల ఆలయంలోని వరాహస్వామి (నెం.115), వీరికి గూడ అర్చనార్పణలు యేర్పరచారు. **ఈ శాసనంలో కైశికపురాణం ఏకాదశినాడు పఠించబడునని చెప్పబడింది, కాని ప్రస్తుతం ద్వాదశి రోజున ఒక చిన్న ఆస్థానంలో చదువబడుతున్నది. ఇదే రోజున చక్రతీర్థంయొక్క ముక్కోటి కూడ (పురుషులకు పుణ్యస్నానం చేయదగిన పవిత్రదినం.)** చక్రతీర్థం, ఆలయానికి ఒక మైలు దూరంలో పశ్చిమోత్తర దిక్కున గల నీటి సరస్సు. దీనిలో ఈనాడు మూడుకోట్ల దేవతలు స్నానం చేయదురని విశ్వాసం. ఇది గాక ఈ రోజున ఉగ్రమూర్తి, అనగా ఉగ్ర–శ్రీనివాసునకు సూర్యోదయానికి ముందే ఊరేగింపు చేస్తారు. సూర్యోదయం తరువాత బహిరంగంలో స్వామి కనులముందున్న దంతా కరిగి పోతుందని భావింపబడుతుంది.

కీ.శే. శ్రీ టి.కె.టి. వీరరాఘవాచార్య, తమ 'తిరుపతి చరిత్ర', సంపుటి 1, పే.50–51 (రెండవ ముద్రణ) లో కైశికపురాణాన్ని గూర్చి సంగ్రహంగ చెప్పియున్నారు. నేను కృతజ్ఞతతో దానిని యథాతథంగా ఇట పొందుపరుస్తూ:–

"ఒక బ్రాహ్మణ విద్వాంసుడు వేదవిహితకర్మలు చేయుచు మోక్షసాధన చేస్తుండగా, ఆ కర్మాచరణలో దోషం సంక్రమించిన కారణంగా, అతడు విధివశం చేత బ్రహ్మరాక్షసుడయ్యాడు. చాల యేండ్ల తరువాత వానియొద్దకు గొప్ప భక్తుడొకడు వచ్చుననియును, వానివలన ఈ శాపమంతరించి ఆ బ్రాహ్మణుడు ముక్తుడగుననియు చెప్పబడినది. నంబాడువాన్ అను ఒక చండాలుడు నిరంతర నిర్మోహి. భక్తుడైయుండి, పన్నెండు సంవత్సరాలు ఏకాదశి ఉపవాసము నాచరించాడు. 12 వ సంవత్సరములో ఈ బ్రహ్మరాక్షసుడా చండాలుని మార్గమధ్యంలో నిలువరించి వాని మాంసాన్ని తినగోరాడు. అందుకా చండాలుడంగీకరించి, కొద్ది వ్యవధి కావలెననియు, ఆలయానికి పోయి, స్వామికి తాను నిత్యం చేస్తున్న స్తోత్రాలను వినిపించి వత్తుననియు కోరాడు. బ్రహ్మరాక్షసుడు ఆతడు తిరిగి వచ్చునని నమ్మలేకపోయాడు. కాని, ఆతడెంతయో నమ్మబలికిన తరువాత, వేచి ఉండడానికి కంగీకరించాడు. తన మాటను నిజం చేస్తూ, ఒక బ్రాహ్మణుని సలహాను పాటింపక, ఆ చండాలుడు వానికి తానాహారం కావడానికి తిరిగి వచ్చాడు. ఆ బ్రహ్మరాక్షసుడు వానిని, వాని భక్తివలన కలిగిన పుణ్యాన్ని తనకు ధారబోస్తే, ప్రాణాలతో వదలివేస్తానని ఆ చండాలునకు చెప్పాడు. దానికా చండాలుడు తన కంతటి శక్తిలేదని చెప్పాడు. ఎందుకంటే, తాను నిష్కామకర్మ చేస్తున్న వాడనని చెప్పాడు. కాబట్టి, తాను తన కర్మల ఫలాన్ని ఆ భగవంతునకు సమర్పించితినన్నాడు. ఆ బ్రహ్మరాక్షసుడు, ఆ భక్తుని తాను కైశికీరాగంలో పాడిన తన చివరి కీర్తనవలన కలిగిన పుణ్యాన్నైనా ధారబోయమని బ్రతిమాలాడు, కాని, ప్రయోజనం లేకపోయింది. అప్పుడాతడు ఆ చండాలుని ముందు సాగిలపడి, తనకు మోక్షాన్ని సాధించి పెట్టుమని కోరాడు. తన కథను వినిపించాడు. ఆ చండాలుడు వినయంతో తాను నీచ జన్ముడనియు, కాని మరియొకరి ఆత్మకు నిజంగా సహాయం చేయగలిగినచో, మనసా ఆ వ్యక్తి మోక్షం కోసం ప్రార్థిస్తానని చెప్పాడు. అంతట ఆ బ్రహ్మరాక్షసునికి శాపము తీరి మోక్షం లభించింది. ఈ పురాణాన్ని తమిళదేశం అన్ని వైష్ణవాలయాల్లో శ్రీ ఆళ్వందార్ కుటుంబంలోని సభ్యులలో ఎవరో ఒకరు పఠిస్తున్నారు.

మార్గళి–తిరుద్వాదశి లేక ముక్కోటి ద్వాదశి ఆలయంలో చాలా ముఖ్యమైన పుణ్యతిథి, పండుగరోజు. ఇది ముక్కోటి లేక వైకుంఠ–ఏకాదశి తరువాతి రోజు; ఏకాదశి ఉపవాసదినం. గుడిలోపలి లేక గుడి చుట్టు ముక్కోటి ప్రదక్షిణం (సంవత్సరమంతా మూసి ఉండే ఇరుకైన నడవ) ముందటి రోజు దశమి రాత్రి తెరువబడి, ముక్కోటి ద్వాదశినాడు ఉత్సవ విగ్రహాలను ఊరేగింపుగా స్వామిపుష్కరిణికి తెచ్చి, ఆ విగ్రహాలను శ్రీ వరాహస్వామి ఆలయము ముంగిటనున్న ద్వారమంటపంలో కూర్చుండ బెట్టి, స్వామి పుష్కరిణిలో సుదర్శనచక్ర నిమజ్జనంతోబాటు స్నానం చేయించబడుతుంది. ఇది ముక్కోటి దేవతలు చక్రంతోకూడ స్నానం చేస్తారని, అలా ఆ జలం పవిత్రీకరింపబడునని నమ్మబడుచున్నందున, వేలకొలది ప్రజలు స్వామిపుష్కరిణిలో స్నానం జేసి పుణ్యాన్ని సంపాదిస్తారు. ఈ మార్గళి–తిరు–ద్వాదశి రోజున, సాళువ నరసింహరాజ ఉడైయర్ పెరియపెరుమాళ్ వేంకటేశ్వరునకును మలైకినియనిన్ఱ పెరుమాళ్‌కును తిరుమహామణి మంటపంలో ముందు భాగంలో మహా నైవేద్యాలను యేర్పాటు చేశాడు. ఇదిగాక, మరికొన్ని సమర్పణలకు కూడ శక సంవత్సరం 1389 లో, క్రీ.శ.1468 మార్చి 16 న యేర్పాటు చేసి, వీనినన్నిటిని నిర్వహించడానికై **అగరం, మురుక్కంపట్టు** గ్రామాలను వేంకటేశ్వరునకు సువర్ణముఖి జలాలతో అభిషేకాలతో గూడ అర్ధోదయ పుణ్య సందర్భంగా మూడు నెలలు ముందుగా జరిగేటట్లు దానమిచ్చాడు. ఈ అర్ధోదయం మకరసంక్రాంతి నాడు క్రీ.శ.1467 డిసెంబరు 28 న సమకూరింది. మార్గళినెలలో వేంకటేశ్వరుని అధ్యయనోత్సవంతో ఒనగూడినది (నెం.31). తిరుచానూరు సభైయార్‌లలో నొకడుగు అప్పయ్యన్, శక సంవత్సరం 1413 లో క్రీ.శ.1491 డిసెంబరు 28 న, మలయప్పన్ తన ఇంటి ముంగిట మంటపంలో కూర్చొని ఉండగా, అక్కడ జరుగు మిగత వానితోగూడ, నైవేద్యాలు ఏర్పాటు చేశాడు. (నెం.96) ఇది ఊరేగింపు జరిగే సమయాన్ని సూచిస్తుంది. ఆలయ లెక్కలు వ్రాయు **'శరణాగతి'**యను ఒకడును మరియొకడును శకసంవత్సరం 1415 లో క్రీ.శ.1494 మార్చి 9 న శ్రీ గోవింద ప్పెరుమాళ్‌కు ఈ రోజున తిరువోలక్కంను యేర్పరచాడు (నెం.116). **కందాడై రామానుజయ్యంగార్, వేంకటత్తూరైవార్, అనగా ఉగ్రశ్రీనివాసునకు** ఈ తిరుద్వాదశి నాడు ఒక అప్పపడిని, **కోడైతిరునాళ్** 20 రోజులు 20 అప్పపడిని క్రీ.శ.1495 ఆగష్టులో యేర్పాటు చేశాడు. ఇవి శ్రీవేంకటేశ్వరునికి, గోవిందరాజుకు పండుగ రోజులలోను, మిగత రోజులలోను 6500 పణము నిధియేర్పరచుట ద్వారా యేర్పాటు చేసిన 97 అప్పపడిలోనివే (నెం.134). **తిరుప్పణిపిళ్ళై ఎంపెరుమానార్** క్రీ.శ.1504 సెప్టెంబరులో వేంకట త్తూరైవార్‌కు, **ఉగ్రబేరానికి** అదే తిరుద్వాదశిరోజున అతిరసపడిని సమర్పించాడు. ఇది తాను ఇమ్మడి నరసింగరాయ మహారాయ, నరసింగరాయ మహారాయని కుమారుని పుణ్యానికై 3825 పణము నిధి ద్వారా యేర్పరచిన 153 అతిరసపడితో కలిసి సాగేది. (నెం.138).

ఉగాది చాంద్రమాన సంవత్సరారంభాన్ని, చాంద్రమాన సంవత్సరాన్ని మొదటి నెలయైన చిత్తిరై మొదటి రోజున్ను, గృహస్థుల పండుగరోజు సంతోషం. ఇది మార్చి ద్వితీయ పక్షం, ఏప్రిల్ మొదటి పక్షములోను ఉన్నది. ఈ రోజున **బైచరాజ తిమ్మయదేవ మహారాజు,** శక సంవత్సరం 1413 లో క్రీ.శ.1491

జూన్ 27 న, మలైకినియనిన్ద పెరుమాళ్‌కు స్నానం చేయించి, గంధం పూసి, చంద్రునివలె గుండ్రని పూమాలను ధరింప జేసి, ఊరేగించిన తరువాత, తిరుమలపై దీపావళి రోజునవలెనే, ఒక తిరువోలగాన్ని మహానైవేద్యంతో యేర్పాటు చేశాడు. గోవిందరాజుకు కూడ ఉగాది, దీపావళి, రెండు రోజులున్ను ఇదే విధమగు సమర్పణ (నెం.94). శక సంవత్సరం 1416 లో, క్రీ.శ.1495 జనవరి 10 న గోవిందరాజు శాంతికై ఉగాది రోజున ఒక సుగియపడి, దీపావళినాడు **శ్రీకరణమంటపం (లెక్కలు వ్రాసేవారు నిర్మించిన ప్రవేశద్వారం)** వద్ద తిరుపతిలో మిగతరోజులలోని మిగత నివేదనలతో కలిసి, ఒక సుగియపడిని (నెం.132) పరమేశ్వరమంగళం వాస్తవ్యులైన ముగ్గురు వ్యక్తులు యేర్పరచిరి.

ప్రస్తుత కాలమున, ఉగాదినాడు, ఆడి–అయనము లేక ఆనివారనాడు దక్షిణాయనం మొదలగు రోజు, దీపావళినాడు, ఉత్సవ విగ్రహాలను తిరుమామణి మంటపంలో కూర్చుండజేసి, పవిత్ర స్నానం చేయించి, వస్త్రధారణ చేయించి, అలంకరించి, పూలమాలలు వేసిన తరువాత ఒక పెద్ద ఆస్థానం జరుపబడుతుంది. దాని వెనువెంటనే 5 రకాల ప్రసాదాలు (వండిన అన్నం), పొంగలి, చక్కెర పొంగలి, పుళి–ఓగిరం 'చింతపండు రసంతో ఉడికించి చేసే అన్నము' (పుళిహోర), దధ్యోదనం, మొళగు–ఓగిరం (మిరియాల పొడితో ఉడికించి కలిపిన అన్నం) అనునవియు, 4 రకముల పణ్యారం, లడ్డు, వడ, అప్పం, దోసె అనే పణ్యారాలతో శాంతి చేయబడును. అటు తరువాత, అవి స్థానబహుమానాలతో వారసత్వపు సేవకులు, పాలనయంత్రాంగం, ఆలయసేవకులు, ఆలయ గోష్ఠి వినియోగంగా అచటనున్న వ్యక్తులకు, వరుస క్రమమున పంచబడుతుంది. ఉగాది ఆస్థానములో క్రొత్త సంవత్సర ఫలాలలో కొన్ని అంశాలు ఒక మిరాశిదారుచే (వారసత్వపు సేవగా) నైవేద్యా లివ్వడానికి ముందు చదువ బడుతుంది.

ఇట్లే, శ్రీజయంతి లేక గోకులాష్టమి, కైశిక లేక ఉత్థానద్వాదశి, శ్రీరామనవమి, ఈ రోజులలో ఆలయంలో మూడు చిన్న ఆస్థానాలు నిర్వహింపబడుతుంది. కైశిక ద్వాదశి నాడు కైశికపురాణ పఠనం, కొద్దిపాటి ప్రసాదం, పణ్యారాల వినియోగం తర్వాత జరుగుతుంది.

15వ శతాబ్ది అంతానికి ఆలయం దాదాపు 50 గ్రామాలకు, యజమానియైనది. అందులో దాదాపు 20 తిరుపతి సమీపంలోనే ఉన్నాయి. తిరుమలలోని స్థానత్తార్ (ఆలయ యాజమాన్యం) ఈ గ్రామాల నుండి పంటను తమ ఉద్యోగుల ద్వారా సమీకరించాడు. ఆ విధంగా దాన గ్రామాల నుండి సేకరింపబడిన ధాన్యం తిరుపతిలోని ధాన్యాగారానికి తీసికొని రాబడింది. అది వచ్చు సమయానికి **సేనై–ముదలియార్** క్రొత్త పంటకు స్వాగతం ఇవ్వడానికి వెళ్లివస్తాడు. అప్పుడు **శ్రీకరణ మంటపం** వద్ద (నెం.121) ఒక అర్చన, నివేదన జరుగుతుంది.

తిరుపతి ఉత్తరభాగాన, **శఠకోపదాసర్ నరసింహరాయ ముదలియార్** ఒక ఆలయాన్ని నిర్మించి, అందు రఘునాథుని (శ్రీరాముని) ప్రతిష్ఠించి సాళువ నరసింహుని క్షేమాన్ని గూర్చి, ఆ స్వామికి

నైవేద్యాలకేర్పాటు చేసెను. ఇది శక సంవత్సరం 1480 లో జరిగింది. (నెం.73,74) ఆ తరువాత **ఉడైయవర్** ఆ ఆలయంలో ప్రతిష్ఠింపబడి, రఘునాథునకు నిత్యనైవేద్యం మొదటను, ఉడైయవర్‌కు తర్వాతను జరుగునట్లు యేర్పాటు చేయబడింది. ఇప్పుడు కూడ **రఘునాథుని గుడిలో**, రఘునాథుని రెండువైపుల సీతాదేవి, తమ్ముడు లక్ష్మణుడును ఉన్న ప్రదేశానికి ఉత్తరంలో ఒక చిన్న గదిలో **ఉడైయవర్** దర్శనమిస్తాడు. పూర్వమే చెప్పబడినట్లు, ఒక కొన్ని సందర్భాలలో గోవిందరాజు ఊరేగింపుగా ఈ ఆలయానికి తీసికొని రాబడి, ఇచ్చటి మంటపంలో స్నానాదికాలు చేయించి నైవేద్యాలివ్వబడుతాయి. శ్రీరామ- నవమి రోజున శ్రీరామునికి ఆలయంలోనే ఒక నైవేద్యంతో శాంతిక్రియ జరుపబడుతుంది. అపుడు ఊరేగింపు సాగుచుండగా ఆ రోజున వాని అచంచలభక్తుడైన హనుమంతుని ఆలయం వద్ద, వాని ఆలయంనుండి సుమారు ఒక వంద గజాల దూరంలో (నెం.118) మరియొక నైవేద్యం **శరణుశెట్టి మంటపం** వద్ద ఇవ్వబడుతుంది (నెం.130).

తిరుచానూరులో, **అళగియ-పెరుమాళ్** 15వ శతాబ్దిలోనే ఉన్నట్లు కనబడు చున్నది. శాసనాలలో అతనిపేరు మాత్రమే కనబడుతూ ఉంది. మరియొక దేవుని పేరులేదు. ఊరుకూడా, నేడు పిలువబడుచున్నట్లే ఈ లేఖనంలో **తిరుచానూర్** అనియే పిలువబడినట్లుంది. శక సంవత్సరం 1389లో, క్రీ.శ.1467 డిశెంబరు 27వ తేదీ తిరుపతిలోని గోవిందరాజు ఆలయ స్థానికులు (నిర్వాహకులు) తిరుమలలోని శ్రీవేంకటేశ్వరుని ఆలయంలోని పద్ధతిలోనే గోవిందరాజు ఆలయంలో కూడ ప్రసాదాన్ని వినియోగించడానికి అనుమతిని కోరుచూ సమర్పించిన వినతిని అంగీకరిస్తూ, తన ఆజ్ఞ చివరన, సాళువ నరసింహుడిట్లు సూచించాడు. స్థానత్తార్‌కు గల కర్తవ్యాన్ని గుర్తు చేస్తూ, తిరువేంగళనాథుని శ్రీ భండారం నుండి తిరుచానూరు **అలగియ పెరుమాళ దేవరు**కు, పూర్వపు ఉత్తర్వు ప్రకారం, రెండు పళ్యాల నిండుగా వెన్నను సమర్పించాలని సెలవిచ్చాడు. (నెం.30). అదే శకసంవత్సరంలో **కందాడై రామానుజయ్యంగార్,** అళగియపెరుమాళ్‌కు **నరసింహరాజ ఉడైయార్** క్షేమం కోసం నైవేద్యాన్ని యేర్పాటు చేసినట్లు కనిపిస్తుంది (నెం.33). తిరుచానూర్ ఆలయంలోని అసంపూర్ణ శాసనఖండం నెం.158లో అళగియ పెరుమాళ్‌కు ఒక నైవేద్యం సమర్పించి నట్లున్నూ, దాని కవసరమైన బియ్యం, నెయ్యి, పప్పుదినుసులు, ఉప్పు అలగియ పెరుమాళ్‌వారి శ్రీభండారం నుండి సరఫరాయగున ట్లున్నది. దీనిని బట్టి ఆ స్వామికి ప్రత్యేకంగా ఒక ధనాగారం, గిడ్డంగి ఉన్నట్లు సూచన లభిస్తూ ఉంది. తిరుచానూరులోనే ఉండే మరియొక శాసన ఖండం నెం.154 కేవలం "అళగియ-పెరుమాళ్ కొరకు" అని మాత్రమే చెబుతున్నది.

పండుగల్లో తదితర పుణ్యతిథులలోను దేవతలకు నైవేద్యాల నర్పించుటే కాక, కొందరు భక్తులు నైవేద్యాలను తమ జన్మనక్షత్రాల రోజులలో లేక తమ బంధుజనుల లేక ఆధ్యాత్మిక గురువు, లేక వేరేవారికి ఆయురారోగ్య ఐశ్వర్యాదులను కోరియో ఏర్పరచినారు. ఆలయ పద్దులు వ్రాయు **విష్ణునేశ్వర శ్రీరామన్** అనునాతడు పూర్వ ఫల్గుని రోజున అది తమ **ఆచార్యులు శొట్టై తిరువేంకట తాతయ్యంగారి కుమారుడైన కుమార తాతయ్యంగారి** జన్మనక్షత్రమైనందున, తన ముగ్గురు బంధువుల జన్మనక్షత్ర మైన ధనిష్ఠ, పునర్వసు,

స్వాతి నక్షత్రాల రోజులలోను నైవేద్యాల నేర్పరచాడు (నెం. 88), **పరవస్తు పట్టర్‌పిరాన్–జీయర్,** మొదట వేంకటేశ్వరునకును, తరువాత **ఉడైయవర్**కును, తమ గురువైన పట్టర్‌పిరాన్–జీయర్‌గారి జన్మనక్షత్రమైన పునర్వసు నక్షత్రపు రోజులలో నైవేద్యానికి యేర్పాటు చేశారు (నెం. 102). అనంతప్పర్ నారాయణన్ అను ఆలయ పద్దులు వ్రాయునతడు వేంకటేశ్వరునికి తన జన్మనక్షత్రమైన పూర్వఫల్గునీ నక్షత్రపు రోజున ప్రతి సంవత్సరం పంగుని నెలలో నైవేద్యం నర్పించే ఏర్పాటు చేశాడు (నెం. 114). ఆలయ పద్దులు వ్రాయు మరియొకరు వేరే ముగ్గురు వ్యక్తులతో కలసి పంగుని నెలలో **కుమార తాతయ్యం**గారి జన్మనక్షత్రమగు పూర్వఫల్గుని రోజున గోవిందరాజుకు నైవేద్యం నర్పించు నట్లు యేర్పాటు చేశారు (నెం. 117). పంకచ్చెల్వి పూదోటను నిర్వహించు **కోయిల్–కెళ్వి రామానుజ జీయర్** తమ శిష్యుడు **ఆరవిల్లి అనంతయన్ అభయన్** అనువాని దానంగా మొదట పెరియపెరుమాళ్ అను మూలమూర్తి వేంకటేశ్వరునకును, తర్వాత ఉడైయవర్‌కును, సంవత్సరంలో మఖా నక్షత్రమున్న 13 రోజులలో, అది తమ ఆచార్యుడైన **కందాడై అప్పన్** జన్మనక్షత్ర మైనందున, శాంతి పూజాదికముల నేర్పరచాడు (నెం. 122).

ఇదే విధంగా ప్రసాద వినియోగం కూడ కొందరు దాతలు యేర్పాటు చేసిరి. ఆయా దేవతల ప్రసాదాలలో కొంత భాగం తమ గురువులకు, అధ్యాపకులకు, తదితరులకు చెందేటట్లు యేర్పరచారు. ఇట్టి ప్రసాద దానాన్ని కొందరు ఆలయ పద్దులు వ్రాసేవారు, వారి బంధువులు కూడా, కుమార తాతయ్యంగారి ఇంటికి పంపినట్లును, **వల్లిభట్టర్ సింగప్పెరుమాళ్ అనంతాళ్వార్** (నెం. 114, నెం. 115)కును ఇట్లే యేర్పచారు. వీరిద్దరిలో 2వ వారు దాతకు 'ర' కారత్రయాన్ని బోధించిన గురువు (నెం. 116). ఆ యిద్దరు వ్యక్తులకు, వారిలోతరువాతివారైన ఎవరికి దాతలు జలతర్పణంతో సమర్పించారో (నెం. 117) వారు (నెం. 118) దాతయొక్క అధ్యాపకుడు (నెం. 119). వీరికిని మరియొకరైన **మాడపూశి అయ్యప్పిళ్ళై అనంతయ్యన్**–కును, వీరిద్దరికిని ప్రసాదాలలో భాగాలు జలతర్పణంతో ఇవ్వబడినాయి (నెం. 121).

తిరుమలకొండను ఎక్కే, దిగే యాత్రికుల సౌకర్యార్థం, సాళువరాజు కుమారుడైన **మహామండలేశ్వర సాళువ పర్వతరాజు,** ఒక మంటపాన్ని **ముళంకాల్ముతిప్పాన్ మెట్లు** దగ్గర (మోకాలి ఎత్తున ఉండి, మోకాళ్ళను బాధించేవి) ముందరి కొండ శిఖరాగ్రాన గాలిగోపురం అనబడుదానికి కొంచెము క్రిందుగా, ఒక మంటపాన్ని నిర్మించి, దానిలో దాహార్తులైన యాత్రికుల కోసం ఒక మంచినీటి చలివేంద్రను యేర్పరచాడు (నెం. 23). ఆలయ పద్దుల వ్రాయు **విఘ్నేశ్వరశ్రీరామన్** మరియొక చలివేంద్రాన్ని **పెరియ–ఈట్టి– తల్ప్పు** వద్ద యేర్పరచి, దానికి నీటి సరఫరా చేయుటకొక వ్యక్తిని నెలకు మూడు పణాల జీతంపై యేర్పరచాడు. పురట్టాశి ఉత్సవం జరుగు 10 రోజులున్ను నీరు పోయడానికి 40 పణం పారితోషికంగాను, ఈ మొత్తం పణం శ్రీభండారం చెల్లించేటట్లు యేర్పాటు (నెం. 88).

**ఈ కాలంలో వైష్ణవ ఆళ్వారులు పంద్రెండుగురు తిరుపతిలోని శ్రీ గోవిందరాజు ఆలయంలోనే ఉన్నారు. తిరుమలలోని శ్రీవేంకటేశ్వరుని ఆలయంలో ఒక్క ఆళ్వారు కూడా లేరు. రామానుజులు మాత్రమే,**

**ఉడైయవర్ మాత్రమే ప్రతిష్ఠింపబడియున్నారు. ముందటి కాలంలో క్రీ.శ.1285లో కపిలతీర్థం ప్రక్కనున్న ఆలయంలో నమ్మాళ్వార్ ఉన్నాడు. (సం.1, నెం.57, 58, పే.69,70) గోవిందరాజు ఆలయంలో ఎదురుగా నున్న వెడల్పయిన నడవ ప్రక్కగా నున్న తిరుమంగైఆళ్వార్ అక్కడ ప్రతిష్ఠింపబడిన ప్రాచీనతమ ఆళ్వార్ వారి నిత్యనైవేద్యాలకు ఏర్పాటు 3వ రాజరాజచోళుని 19వ పాలన సంవత్సరంలో క్రీ.శ.1234 లో (సం.1, నెం.40, పే.53-54) చేయబడింది.** 15వ శతాబ్ది మూడవ పాదంలో, శకసంవత్సరం 1390, క్రీ.శ.1468లో, కందాడై రామానుజయ్యంగార్ తిరుపతిబైట ఒక ఆలయాన్ని కట్టించి కులశేఖర ఆళ్వార్ మూలవిరాట్ (మూలబేరం) ను ప్రతిష్ఠించాడు. ఇది ఉత్తరమునకు పోయే మార్గాన్ని కలిపేచోట ఉంది. క్రీ.శ.1468 నవంబరులో స్థానత్తార్ పన్నులేకుండా **ఇలమాండియం గ్రామంలో** భూమిని దానం చేసి, దాని ఫలసాయాన్ని ఆళ్వార్‌కు నైవేద్యాలకై నిత్యం వినియోగించడానికి అంగీకరించాడు. మాశి నెలలో పునర్వసు నక్షత్రం ఉన్న రోజున వచ్చిన సాత్తుముఱై సందర్భంలోను, మార్గళి నెలలో వచ్చు **తిరుప్పళ్ళి-ఎళుచ్చి** రోజుల్లో కూడ (నెం.36) నైవేద్యాల కంగీకరించాడు. దాదాపు 30 సంవత్సరాల తరువాత, రామానుజయ్యంగార్ పొణ్‌భండాగారానికి (సువర్ణా గారం) యాజమాన్యం వహించినప్పుడు, జులై 1495 లో కులశేఖరుల మూలబేరానికి తన గర్భగుడిలో పునర్వసు తన జన్మనక్షత్రం 13 రోజులలో ప్రతిరోజు, తన జన్మనక్షత్రం అట్లే గోవిందరాజు ఆలయంలో నుంచబడిన వాని ఉత్సవ బేరానికి, రామానుజయ్యం గారి పుట్టిన రోజు, మాశి నెలలో చిత్తిరై రోజున నాచ్చియార్‌కు ఒక పరివట్టం (తలచుట్టు వస్త్రం) తో కూడ, పూజాది నైవేద్యాలేర్పరిచాడు. ఈ కార్యక్రమాల కోసం, ఇతర ఖర్చుల కోసం, అతడు ఆలయ ధనాగారంలో (నెం.140) 5000 పణము జమచేశాడు. ఇప్పటికే అతడు కులశేఖరప్పెరుమాళ్‌కు క్రీ.శ.1495 ఆగష్టులో నిత్యనైవేద్యమేర్పరచి ఉన్నాడు. దానితో చిత్తిరై నక్షత్రం సంవత్సరంలో ఉన్న తిథులలో వేంకటేశ్వరుని ఆలయంలోని ఉడైయవర్‌కు 13 తిరువోలక్కం (ఒక ఆస్థానంలో), మొదట వేంకటేశ్వరునికి తర్వాత స్నానాలతో మలైకినియనిన్ఱ-పెరుమాళ్‌కు సమర్పించడానికి 6500 పణాలు ఆలయానికి చెల్లించడం ద్వారా యేర్పాటు చేశాడు (సం.134).

**వీరమడక్కిప్పట్టికి** చెందిన **పళ్ళికొండపెరుమాళ్ కర్పూరం మూవరాయర్** అనునొకడు శోళమండలములోని **వెణ్ణైవాశల్** గ్రామాన్ని **తిరుమంగై యాళ్వార్** యొక్క మఠప్పురంగా, వారికై భవనాలు నిర్మించడానికి సువర్ణంతో నీటిని విడచి పెరుమాళ్ ఎన్నైయాళుమ్ - **కణ్ణన్** (నన్ను కాపాడే దేవుడు **కృష్ణుడు**) సమక్షమున, క్రీ.శ.1472 నవంబరు 15న చంద్రగ్రహణ పుణ్యసందర్భమున దానం చేశాడు. క్రీ.శ.1472 నవంబరు 27న వేంకటేశ్వరునికి **పళ్ళికొండాన్ సంధి**గా నిత్యం రెండు నైవేద్యాలు సమర్పించు నట్లును, ఆ ప్రసాదాలలో దాతభాగమైన నాల్గవ వంతును **ఎరిపెరుమానార్-జీయర్** పరము చేయునట్లును దానం జేశాడు. దీనివలన దాన గ్రామం దిగుబడిని ప్రసాదాలకు వినియోగించి పళ్ళికొండాన్- మంటపాన్ని ఆళ్వార్ ఆలయప్రాకార నిర్మాణాలను చేపట్ట వీలు కల్పించాడు. (నెం.49) దీనిని బట్టి, తిరుపతి బయట కపిలతీర్థానికి పోయే మార్గానికి అనుసంధించి ఆళ్వారుకు ఆలయమొకటి అప్పటికే కట్టబడియుందని తోస్తున్నది. **శఠకోపదాసర్**

**నరసింహరాయముదలియార్,** శక సంవత్సరం 1397 లో, క్రీ.శ.1475 అక్టోబరు 20న, ఆళ్వారు ఆలయం వద్దగల గోవిందరాజుకు, ఆళ్వారుకు జన్మనక్షత్రమైన కృత్తిక నక్షత్రం రోజున కార్తికమాసంలో, శాంతి జరిపించుట కేర్పాటు చేశాడు. అట్లే వేంకటేశ్వరుని ఆలయంనుండి ఒక అప్పపడిని, తమలపాకులను పోకచెక్కను నైవేద్యా-నంతరం తిరుపతికి కొనిరాబడినస్వామికి, ఒక వస్త్రాన్ని ఒక గంధపుముద్దయు ఆళ్వారుని **సాత్తుముఱై** కొరకు ఆ రోజున **కందాడై రామానుజయ్యం గారి** పేరునను, ప్రతి నెలలో కృత్తిక నక్షత్రమున్న రోజునను, స్వీకరించడానికి ఏర్పాటు (నెం.62).

**తిరుమంగైయాళ్వార్** తప్ప ఆళ్వారులంతా గోవిందరాజు ఆలయంలో ఎప్పుడు ప్రతిష్ఠింపబడ్డారో, ఆ వివరాలు శాసనాలలో లిఖింపబడియుండ లేదు, కాని, కొందరిని గూర్చి, పెరియాళ్వార్, నమ్మాళ్వార్, తిరుమంగై యాళ్వార్, కులశేఖరాళ్వార్, ఉడైయవర్‌లకు ఆలయాల ఎదుట వసంత మంటపంలో వారి వారి శాత్తుముఱైలు, **తిరువధ్యయనము** (ప్రబంధము నుండి వారి వారి స్తోత్రములను పఠించుట) (నెం.83) అట్లే నమ్మాళ్వార్, కులశేఖరాళ్వార్, తిరుమంగైయాళ్వార్‌లకు వారివారి **సాత్తుముఱై** రోజులలోను (నెం.130) జరిపించు నైవేద్యాల ప్రస్తావనలున్నాయి.

అదెట్లయినను, **శఠకోపదాసర్ నరసింహరాయముదలియార్,** ఆలయధనాగారంలో 5200 పణాలు నిధినేర్పరుచుట ద్వారా, మొత్తం పంద్రెండుగురాళ్వారుల, **శూడికుడుత్త- నాచ్చియార్** నామాంతరముగల **ఆండాళ్**తో కలిపి, వారి వారి జన్మ నక్షత్రాలున్న రోజులలో ప్రతి సంవత్సర-మున్ను, ఆ నక్షత్రాలున్న రోజులలో ప్రతి మాసంలోను, వేంకటేశ్వరుని ఆలయంలోని ఉడైయవర్ (రామానుజులు) ఆలయం వద్ద, సాత్తుముఱై నిర్వహించుటకేర్పాటు చేశాడు. ఆ రోజులలో ప్రతి యొక్క రోజున ప్రత్యేకించబడిన సమర్పణలను మొదట వేంకటేశ్వరునకును తదుపరి, వారి వారి వ్యక్తిగతమైన పాశురాల పఠన తరువాత, ఆళ్వారులందరి ప్రతినిధిగా, ఉడైయవర్‌కు నైవేద్యాలివ్వబడినాయి. ఈ సమర్పణలుకాక, అదనంగా, రఘునాథుని (శ్రీరాముని), ఉడైయవర్‌ను శాంతపరచుటకు చిత్తిరై నెలలో అధ్యయనం 12 రోజులును, **తిరుక్కోడి తిరునాళ్**లో కొన్ని రోజులు **మలైకినియనిన్ఱ పెరుమాళ్**కును వేర్వేరు మంటపాలలోను సమర్పణలు జరుగుతాయి. ఇవన్నియును **కందాడై రామానుజయ్యంగారి** పేరున జరిపించబడతాయి. (నెం.68).

ప్రతి ఆళ్వారు యొక్క శాత్తుముఱై మాసం, నక్షత్రం క్రమంలో ఇవ్వబడినాయి.

నమ్మాళ్వారుయొక్క ప్రతి సంవత్సర జన్మనక్షత్రము విశాఖ వైకాశిలో తిరువాయ్ మొళి పఠనముతో;

పెరియాళ్వార్ యొక్క నక్షత్రము స్వాతి అని నెలలో తిరుప్పల్లాండు, ఆయన (పెరియాళ్వార్) చెప్పిన తిరుమొళి పఠనంతో;

శూడికొడుత్త-నాచ్చియార్ నక్షత్రం పూరమ్, అనగా పూర్వఫల్గుని, ఆడి నెలలో, ఆమె రచనలు తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి పఠనంతో;

పొయ్‌గైయాళ్వార్ నక్షత్రం తిరువేణమ్ (శ్రవణము), అర్పశిలో, తిరువందాది 'వైయంతకళి' ఇత్యాది పాశుర పఠనశ్రవణములతో;

పూదత్తాళ్వార్ నక్షత్రము ధనిష్ఠ, అర్పశిలోనే, తిరువందాది శ్రవణంతో;

పేయాళ్వార్ నక్షత్రం శతయం (శతభిషము) అర్పశిలో, తిరువందాది 'తిరుక్కండేన్' యిత్యాది పాశుర పఠనశ్రవణంతో;

తిరుమంగైయాళ్వార్ నక్షత్రం కృత్తిక, కార్త్తికై నెలలో, పెరియ తిరుమొళి శ్రవణంతో;

తిరుప్పాణాళ్వార్ నక్షత్రం రోహిణి, కార్త్తికైలో, అమలనాదిపిరాన్ - తిరువాయ్‌మొళి పఠనంతో;

తొండరడిప్పొడియాళ్వార్ నక్షత్రం కేట్టై (జ్యేష్ఠ), మార్గళిలో తిరుమాలై, తిరుప్పళ్ళి- ఎళుచ్చి శ్రవణంతో.

తిరుమళిశెయ్‌ప్పిరానాళ్వార్ నక్షత్రం మఖ, తై నెలలో, తిరుచ్చంద విరుత్తం, నాన్‌ముకన్-తిరువందాది శ్రవణంతో;

కులశేఖరాళ్వార్ నక్షత్రం పునర్వసు, మాశి నెలలో, పెరుమాళ్ తిరుమొళి శ్రవణంతో;

మధురకవియాళ్వార్ నక్షత్రం చిత్తిరై (చిత్త), చిత్తిరైనెలలో కణ్ణినుణ్- శిరుత్తాంబు శ్రవణంతో;

(మకర సంక్రమణం మరునాడు) కనుప్పడి రోజున నాచ్చియార్ (ఆండాళ్) కు వేరొక నైవేద్యం పుణ్యస్నానంతోను.

ఆళ్వార్ యొక్క ప్రతి సంవత్సర జన్మదినాలు, ప్రతిమాసపు జన్మ నక్షత్రమున్న రోజులు, పండుగలు వేంకటేశ్వరుని ఆలయావరణలోని ఉడైయవర్‌మూర్తికి జరుపబడును. గానకైంకర్యములు మొదట వేంకటేశ్వరునకును తరువాత ఆళ్వారులందరి ప్రతినిధిగా ఉడైయవర్‌కునుసమర్పింపబడును. తిరుపతిలోని గోవిందరాజు ఆలయం ప్రాంగణంలో నున్న వాని ఆలయంలో నిర్వహించబడే ప్రతి శాత్తుముఱైకిని ఆ యా రోజులలో వేంకటేశ్వరునికి నైవేద్యాలివ్వబడుతాయి. ఒక అప్ప ప్రసాదం, తమలపాకులు, పోకచెక్క, ఒక పరివట్టం (ఉత్తరీయం), చందనం ఆయా ఆళ్వారులకు పంపబడుతాయి. ఈ పద్ధతిని కందాడై రామానుజయ్యంగార్ ప్రవేశపెట్టినట్లు తెలుస్తూ ఉంది. వారే 5000 పణాలు నిధినేర్పరచడం ద్వారా శ్రీవేంకటేశ్వరునకు నిత్యనైవేద్యానికి ఏర్పాటు చేశారు. ఇది చిత్తిరై (చిత్త) నక్షత్రమున్న రోజు మాశి నెలలో ప్రతి సంవత్సరం తన పుట్టిన రోజున నిర్వహించి తిరుపతిలో అలిపిరి దగ్గరున్న శూడికొడుత్త-నాచ్చియార్ వద్దకు పంపబడుతుంది. ఆమె దానిని స్వాగతించి, దానితోబాటు **అప్ప** అను నాతడొకడు యేర్పరచిన నైవేద్యములను స్వీకరించును. ఇట్టి సమర్పణలు ఆరోజున **తిరుమంజనము** (పుణ్యస్నానాలు) తరువాత, 50 పోకలు, 100 తమలపాకులు, ఒక పలం చందనం, ఒక పరివట్టం, ఒక అప్పపడి తగిన మర్యాదతో తన నాచ్చియార్, శూడికొడుత్త-నాచ్చియార్ లతో (నెం.140) స్వీకరింప బడుతుంది.

ఈ **కందాడై రామానుజయ్యంగార్** గొప్ప కార్యదక్షత, సామర్థ్యం గలవాడు. దక్షిణ భారతదేశమంతా అతడు పర్యటించి, 108 వైష్ణవ మతధార్మిక కేంద్రాలను, 'తిరుపతులు' అనబడు వానిని సందర్శించెను. వానిలో కోయిల్ అనబడు శ్రీరంగం ఆలయాన్ని, పెరుమాళ్-కోయిల్ కంచిలోని వరదరాజ-పెరుమాళ్ ఆలయాన్ని కూడా దర్శించాడు. ఈతడు తిరుమల లోను, తిరుపతిలోను గూడ రామానుజకూటాలను (ఉచిత భోజనశాలలు) స్థాపించాడు. జలాశయాన్ని నిర్మించాడు, సాళువ నరసింహునకు విన్నవించి, రామానుజకూటాల నిర్వహణకై ఒక గ్రామాన్ని దానంగా పొందాడు, వైకుంఠ ద్వారానికి, పెద్ద ముఖద్వారానికి గూడ కొంత పని చేయించినట్లు కన్పిస్తుంది. (నెం.13, నెం.14) సాళువ నరసింహుడు స్వయంగనే తిరుమలలోని ఉత్తరపు వీధిలో ఒకటి, తిరుపతిలో గోవిందరాజు ఆలయం ప్రాంగణంలో మరొకటి రామానుజ కూటాలను నిర్వహించి, ఆ రెండిటిని కంచివారైన అళగియ మణవాళ జీయర్ శిష్యుడైన రామానుజయ్యంగారి స్వాధీనంలో ఉంచాడు. ఆతడు **నిత్య సంధి** కొరకు, 12 తిరుప్పోనకం (అన్నం, పెసరపప్పు, మిరియం, ఉప్పు, నెయ్యి కలిపి వండినది) అర్పించడానికై ఆలిపురం గ్రామాన్ని ఆలయానికి దానమిచ్చి, దాత భాగమైన నాల్గవవంతు ప్రసాదాన్ని తన రామానుజకూటం శ్రీ వైష్ణవుల భోజనం నిమిత్తం ఇచ్చేటట్లు ఏర్పాటు చేశాడు (నెం.4). భోగమూర్తియగు రజతమూర్తికి **అళగిప్పిరానార్ తిరుమంజనం** అనెడు నిత్యస్నానం నిర్వహించడానికై, అనగా **సామవై** ప్రతిష్ఠించిన, పల్లవుల పాలన కాలం నాటి మణవాళప్పెరుమాళ్ స్నానానికై, బహుశః ముదలియార్ **తిరుక్కలికన్టి దాసర్ అలగప్పిరనార్** వ్యవస్థీకరించిన దాని నిర్వహణకై రామానుజయ్యం- గార్ తన సేవగా చందనపుముద్ద, పసుపు ముద్ద, ఉసిరిక ముద్ద, వీనిని, ఒక దాని తర్వాత నొకటిగా స్వామి శరీరంపై పూసి, శుభ్రజలంతో స్నానం చేయించి, ఆపై కస్తూరి, మలినంలేని కర్పూరాలను ఆ దేహంపై పూసి అట్లే ఉంచి, ఒక చిన్నవస్త్రంతో తడినార్చి 25 పోకలు, 25 తమలపాకులు, ఆ స్వామి కర్పించి, ఆ కార్యక్రమం పూర్తియైన తరువాత 4 పోకలను, 4 తమలపాకులను తనకు తిరుగ ప్రసాదంగా తన శిష్యులైన శాత్తాద-ఏకాంగి-శ్రీవైష్ణవుల ద్వారా పంప వలసిందిగా యేర్పాటు చేశాడు. ఈ శిష్యులు సాతాని యార్గా పిలువబడుచు, అవివాహితులుగా రామానుజయ్యం గారి రామానుజ కూటంలో నివసిస్తూ, అక్కడ నుండి, రామానుజయ్యంగారి ఆజ్ఞ మేరకు, శక సంవత్సరం 1386, క్రీ.శ.1465 జనవరి నుండి, పదార్థాలను ఆలయానికి తీసికొనిపోతుండేవారు (నెం.22). ఆతడు ఆలయానికి దానమివ్వ బడిన పలు గ్రామాలలో భూముల్ని బాగు చేయడానికై ఎన్నియో పంటకాల్వలను త్రవ్వించాడు. ఇట్లు అధికంగా వచ్చిన పంట ఏర్పరచాడు, దిగుబడితో దేవతామూర్తులకు మరింతగా సమర్పణ సేవలను ఏర్పరచాడు.

శక సంవత్సరం 1395, క్రీ.శ.1473 జూన్లో సాళువ నరసింహునిచే వ్యవస్థీకరింప బడిన **డోలా మహోత్సవ-అన్న-ఊంజల్ తిరునాళ్**లో, ఉత్సవ దినములైదింటను అర్పించవలసిన నైవేద్యాలు రామానుజయ్యంగారి ఆధ్వర్యంలో సిద్ధం చేయబడుతుంది (నెం.50).

రాయలు, అనగా సాళువ నరసింహరాయలుచేత కులశేఖరాళ్వారుల ప్రసన్నతకై (శాంతికై) దానమీయబడిన గ్రామాల పంట దిగుబడియు, దాత భాగంగా **రామానుజకూటాలకు నరసింహరాయలు, రామానుజయ్యం గారలచే ఏర్పరుపబడిన సంధుల నుండి సమకూరు ప్రసాదం, ఇవి యథార్థమైన అవసరాలను మించి చాలా అధికంగానున్నవనియు, ఈ అధికమైన భాగాలను రామానుజయ్యంగార్ సదుద్దేశ్యంతోనే విక్రయించి సొమ్ముగా మార్చాడు.** ఈ మిగులు మొత్తము 3000 పణాలుకాగా, శక సంవత్సరం 1417లో, శ్రీ వేంకటేశ్వరుని యొక్కయు, శ్రీ గోవిందరాజు యొక్కయు రత్నాది ఆభరణాలను ఈ ధనముతో బాగు చేయించదలచాడు. అందువలన ఈ కార్యాన్ని అమలుపరచడానికి అధికారులకు స్థానత్తార్‌కు ఒక వినతి పత్రాన్ని పంపాడు. క్రీ.శ.1495 జులై 1వ తేదీన, **తిరుమల స్థానత్తార్ చేత, శ్రీమన్ మహామండలేశ్వర ఇమ్మడి నరసింహరాయ మహారాయులు మేదినీ మీసరగండ కఠారి సాళువ బిరుదాంకితులు, రామానుజయ్యంగారు** ఆలయానికి చెందిన ఆభరణాలను అచటగల వెండి బంగారు పాత్రలను గూడ బాగుచేయించడానికి బాధ్యత వహించేటట్లు సమ్మతిస్తూ, ఒక రాయసం (రాజపత్రం) అందుకొన్నారు. వానిని స్థానత్తార్ సమక్షంలో శ్రీభండారం పద్దులలో వ్రాయించి స్వీకరించవలెననియు, దీని వలన ఆతడు పొణ్-భండారం (పొణ్, బంగారం) అను ఆలయ సువర్ణాగారానికి యజమానిగా నియమితుడైనట్లును అందున్నది. రాజపత్రం ననుసరించి, స్థానత్తార్ దాని కనుకూలంగా ఒక శిలాశాసనం వ్రాయించాడు. ఆతడు మూడు వనరుల నుండి, ఒక్కొక్క దాని నుండి 1000 పణాల చొప్పున, మొత్తము 3000 పణాలు సమకూర్చుకొని, ఆ మొత్తంతో అవసరమైన మరమ్మతులు చేయించి, ఇంకను నిల్వధనం ఉంటే, సువర్ణాగారానికి దాన్ని జమచేసి తరువాతి కాలంలో వలసిన మరమ్మతులకు వినియోగించాలని నిర్ణయం (నెం.193).

ఆలయ సువర్ణాగారానికి యజమానిగా నియమితులైన తరువాత ఒక్క నెలలో, క్రీ.శ.1495 ఆగష్టులో, రామానుజయ్యంగార్, వివిధమైన ఉత్సవాలలో వేంకటేశునకు ఎన్నో నైవేద్యాల నేర్పరచడమే గాక, గోవిందరాజులకు, కులశేఖరప్పెరుమాళ్‌కు కొన్ని చిన్న వస్తువులను సమర్పించి, తనదైన **'ఉలా'** (ఉత్సవగానం) బహుశః నలుగురు ఆలయానికి సంబంధించిన స్త్రీలు తమ తలల చుట్టును పరివట్టము ధరించి రెండు ఆలయాల లోను, మలైకినియనిన్ఱ-పెరుమాళ్ గోవిందరాజులిద్దరును మెల్లగా **కోడై- తిరునాళ్**లో రెండు ఆలయాలలోను గానం చేసే ఆచారాన్ని వ్యవస్థీకరించి, ఆ నాలుగు పరివట్టముల ఖరీదుగా 20 పణాలు చెల్లింపు ఆలయ ధనాగారము నుండి జరిగేటట్లుగా ఏర్పరచడాడు. (నెం.134) మరుసటి సంవత్సరం, క్రీ.శ.1496 డిశెంబరు 21న **కందాడై అప్పచ్చియార్ అణ్ణ,** 1500పణమును కొంత భూమిని ఇంటి స్థలములను కొనుటలో పెట్టుబడిపెట్టుద్వారా, వేంకటేశ్వరునకు రెండు అతిరసపడిని ఒకటి విడిచి ఒకటిగా శుక్రవారాలలో, స్వామి పునుగును స్నానానంతరం దేహంపై ధరించు సందర్భంగా, **రామానుజయ్యంగారు తన పేరు మీద ఉలాగానశ్రవణము తరువాత యేర్పాటు చేశాడు.** (నెం.136). స్వామికి ఒక అభిషేకం ఒకటి విడిచి ఒకటిగా లేక వెంటనే వచ్చు శుక్రవారాలు జరిగినట్లు సూచన ఉన్నది. ఆలయానికి తమ సేవల ద్వారా కందాడై రామానుజయ్యంగారి ఖ్యాతికిది శిఖరం.

ఆ కాలమున ఆలయ పరివారం 29 తరగతుల సేవకులుగా ఉన్నారు. ఇందుకుగాను వారికి వారి సేవల కొరకు పారితోషికం ఒక ప్రత్యేకమైన పండుగరోజున శ్రీభండారం నుండి చెల్లించబడునట్లు కందాడై రామానుజయ్యంగార్ యేర్పాటు చేశారు. ఇది ఆలయనిర్వాహకులైన స్థానత్తార్ మొదలు కాపలా వారి వరకును, కంసాలి, కమ్మరి, మేళగాండ్ర వరకు వర్తిస్తుంది (నెం.135). వేరొక సందర్భంలో ప్రసాదవినియోగం, ఇంధనం సరఫరా చేయువారికి, ప్రజాసౌకర్యములు చూచువారికి చెల్లింపును, ఆలయాన్ని శుభ్రం చేసేవారికి, మావటీలకు మాత్రం ప్రసాద వినియోగాన్ని అప్పటికే చేసియుండినాడు. (నెం.85) దీనిని బట్టి ఆ రోజులలో ఆలయానికి ఏనుగులుండేవని స్పష్టమౌతున్నది.

* * *

# అధ్యాయం 19

## సమ్రాట్ కృష్ణదేవరాయల కాలము

## విజయనగర కాలము-3

అసాధారణమైన విజయనగర రాజులలో కృష్ణదేవరాయలను ప్రకాశవంతమైన నక్షత్రంగా పరిగణించవచ్చును. కాని, మతాభిమానం, దైవభక్తి దక్షిణభారతదేశంలోని దేవాలయ దర్శనమూ, ఆయా దేవళం లోని దేవతామూర్తులకు ధనాన్ని, ఆభరణాలను బహూకరించడంలోను, పన్నులలో రాయితీలను, గ్రామదానాలను ప్రకటించడంలోను తెలియవస్తుంది. **తిరుమలనాథునియందు వానికిగల ప్రత్యేకప్రీతియు, ఇలవేల్పుగా భావనయు, ఆ స్వామిని ఏడుసార్లాతడు ఎంతో పవిత్రతతో దర్శించుట,** అదియును దక్షిణమునగల ఉమ్మత్తూరు, ఇక్కేరి సేనానులను, తూర్పు ఉత్తరాలలో ఒరిస్సా రాజయిన గజపతిని దండయాత్రలతో ఎదుర్కొంటూ మధ్యే మధ్యే విరామ సమయాలలో దర్శనం చేయడంలో ప్రస్ఫుటమౌతుంది. రాయలతో కొన్ని సందర్భాలలో అతని దేవేరులు తిరుమలదేవియు, చిన్నాదేవియు కలిసి దర్శించారు. ఇదికాక ఆతడు తన తెలుగు ప్రబంధం **'ఆముక్తమాల్యద'** ను వేంకటేశ్వరునకంకితమిచ్చాడు. అయినను ఆతడొక గొప్పయోద్ధ, దృఢచిత్తు డైన విజేత, తంత్రకుశలుడు, సమర్థుడైన సేనానాయకుడు, అపజయ మెఱుగని యోద్ధ, బలవంతుడైన పాలకుడు, అతి భయంకరుడైన చక్రవర్తి, సాహసి, నిష్కలంకుడు.

కృష్ణదేవరాయలకు వారసత్వంగా లభించిన విజయనగర సామ్రాజ్యం సంగమ వంశంలో చివరి రాజైన విరూపాక్షుని కాలం నుండి (క్రీ.శ.1465- 1485) క్షీణ దశకు చేరింది. కారణం, ఒరిస్సావారైన గజపతిరాజులు బహమని రాజులైన మహమ్మదీయులతో చేయి కలిపి విజయనగర సామ్రాజ్యం తూర్పుభాగాన్ని, కృష్ణానది నుండి దిగువకు నెల్లూరువరకు జయించి ఆక్రమించుకొని, తమ విజయాన్ని మరింత దక్షిణదిశగా మధురవరకు, మైసూరు భూభాగాన్నంతా, వ్యాపింపజేశారు. ఇది ప్రధానంగా కృష్ణదేవరాయల సమకాలికుడైన ప్రతాపరుద్ర గజపతి తాతగారు కపిలేశ్వర గజపతి వీరత్వం వలన (క్రీ.శ.1435-1470) మహమ్మదీయ సైన్యం సహాయంతో సాధింపబడింది. ఆతడక్కడ నుండి సేతు-రామేశ్వరానికి యాత్రకు వెళ్లినట్లు చెబుతారు (దేవ.ఎపి.రిపో.పే161 పైగల గమనిక). ఆ కాలపు అతి శక్తిమంతుడైన సేనాని సాళువ నరసింహుడు తన సైన్యాధికారియు, కృష్ణరాయుని తాతగారును అయిన తుళువ ఈశ్వర నాయకుని సహాయంతో కపిలేశ్వరునెదిరించి, ఓడించి బంధించాడు. అప్పటికిని తూర్పు, దక్షిణ ప్రాంతాలు గజపతుల పాలనలోనే ఉండేవి. మైసూరు దేశంలో, శివసముద్రం రాజధానిగా ఉమ్మత్తూరు సేనానులు పెనుకొండను స్వాధీనం చేసికొని, **'పెనుగొండ చక్రేశ్వర'** బిరుదు వహించి, వీరనరసింహుని అధికారాన్ని ఎదిరించారు. వీరనరసింహుడు కృష్ణరాయని అన్నగారు, పూర్వుడు. శ్రీరంగపట్ణానికి చెందిన ఇక్కేరి సేనానులు స్వతంత్రులైనారు. (డిటో.,పే.170. పే.158 పైగల గమనిక-1)

విజయనగర రాజ్యం చుట్టూ ఈ సంఘటనలు ఆ భూభాగాన్ని దోచుకోవడానికి సూచించేవి, కృష్ణదేవరాయని ఆగ్రహానికి కారణమైనాయి. జులై 1509 లో తాను సింహాసనం నధిష్ఠించిన కొలది రోజులలోనే (డిటో. పే. 167, పే.184, గమనిక-3, పే.219, గమనిక-1) ఆతడు దక్షిణంలో తిరుగబడిన సేనానులను అణగద్రొక్కడానికి; దక్షిణ, తూర్పుప్రాంతాలను ఏలుతున్న ప్రతాపరుద్ర గజపతి నెదుర్కోవడానికి, విస్తారమైన యుద్ధసన్నాహాలు జరిగాయి. అంతట తన ప్రాథమిక సైనిక చర్యలను దక్షిణదేశంలో వ్యూహాత్మకంగాను, తెలివిగాను, క్రీ.శ.1511 ఆరంభంలో మొదలుపెట్టాడు. ఆతడు కొంగుమండలాన్ని గజపతి తన పినతండ్రియగు పర్వత-రాహుత్త రాయడు రాజ్యపాలుడుగా పాలించుచుండడం చేత దానిని దుర్బలంగాస్పష్టంగా గ్రహించాడు. శకసంవత్సరం 1432 నాటి, (క్రీ.శ.1510-11) వాని ఈరోడ్ శాసనము ఒరిస్సా కళింగలలోని వాని భూభాగాన్ని చాలా దూరంగా ఉంది. కొంగు మండలాన్ని అంత దూరంనుండి కాపాడుకోలేడు (డిటో. పే.160, గమనిక-2) తన రాజ్యానికి సమీపంలోగల తిరుగుబాటు సేనానులను అదుపుజేసి, ఉమ్మత్తూరు, శివసముద్రాలలోని గంగరాజుపైకి దాడి వెడలి అతణ్ణి ఓడించాడు. (డిటో, పే.158, గమనిక-1) ఇది క్రీ.శ.1512 సెప్టెంబరు 22 నాటికి జరిగియుండును. కాగా, ఇక్కేరి సేనాని సంకుల నాయకుడు, శ్రీరంగపట్ణంవాడు, తానే లొంగిపోయి క్షమాభిక్షను పొందాడు. అప్పుడు బహుశః కృష్ణరాయడు పర్వత- రాహుత్తరాయనిపై మేల్నాడులో లేక మేల్కరైనాడులో, కొంగుమండలంపై దాడిచేశాడు. అప్పుడు ఆతడు ఉదయగిరికి, నెల్లూరుజిల్లా, పారిపోయి ఉంటాడు. (డిటో, పే.160, గమనిక-2).

దక్షిణ దిక్కులో ఈ తొలి సైనికచర్యల అనంతరం, తన రాజధానియగు విజయనగరానికి తిరుగుప్రయాణంలో, కృష్ణరాయలు మొట్టమొదటి సారిగా తన ఇద్దరు రాణులతో క్రీ.శ.1513 ఫిబ్రవరి 10న తిరువేంగళ నాథునకు ప్రణమిల్లినాడు, బంగారు కిరీటాన్ని సమర్పించాడు. ఈ కిరీటాలలో నవరత్నాలు పొదగబడియుండేవి. ఆపై ఒక మూడు పేటల ముత్యాలహారాన్ని, 15 బంగారు కంఠసరులను రత్నాలు పొదిగినవానిని, అయిదు రత్నాలు పొదుగబడిన ఒక పతకంతోను, 25 వెండి పళ్ళెరాలు దేవునకు కర్పూర హారతులిచ్చుటకును, సమర్పించాడు. తమ చిన్న రాణి చిన్నాజియమ్మ ద్వారా పాలు నివేదించుటకు ఒక బంగారు గిన్నెను, తమ పెద్దరాణి తిరుమలదేవి అమ్మద్వారా పాలనైవేద్యానికి అట్టిదే వేరొక బంగరు గిన్నెను, సుగంధాల కోసం ఒక బంగరు పళ్ళెరాన్ని సమర్పించాడు. (డిటో.పే.151; నెం.32 నుండి 39, 40 నుండి 49, నెం.50 నుండి 59, సం.3). ఈ ప్రథమ దర్శనం తరువాత మూడునెలలోపుగనే, రెండవసారి వేంకటేశ్వరుని దర్శించడానికి క్రీ.శ.1513 మే 2న వచ్చాడు. ఈ సారి రాణుల లేకుండనే వచ్చాడు. ఎన్నియో భూషణాలను సమర్పించాడు. కెంపులు, వజ్రాలు పొదిగిన మూడు చిన్న కిరీటాలను ఉత్సవ విగ్రహాలకు సమర్పించాడు. (దేవ, ఎపి, రిపో.పే.151; నెం.60 నుండి 63, సం.3).

3వ సారి ఆతడు వేంకటేశ్వరుని దర్శనానికై, మరల రాణులు లేకుండగనే, ఒక మాసం పక్షం రోజులలోనే మరల క్రీ.శ.1513 జూన్ 13న వచ్చాడు. అప్పుడు తన తండ్రి **నరసనాయక-ఒడయ,** తన తల్లి **నాగాజమ్మ**ల శ్రేయానికై తిరువేంగళనాథ దేవునకు నవరత్నాలు పొదిగిన ఒక ఆభరణాన్ని, ఒక కుంకుమ బరిణను, 300 తమలపాకులు, 600 పోకలను సమర్పించి, చత్రవాడి, తూరూరు, కరికంబూడు అను గొడగరనాడు లోని గ్రామాలకు దానం చేసి, తన పేరుమీద దేవునకు ప్రతి యేడు తై నెలలో (జనవరి-ఫిబ్రవరి) ఒక ఉత్సవం వానిపై వచ్చు ఆదాయంతో జరుపునట్లు వ్రాయించాడు. (నెం.64, 65, సం.3) తమిళ తై మాసంలో ఈ బ్రహ్మోత్సవం కృష్ణరాయనిచే ప్రారంభించబడేంతవరకు, వేర్వేరు నెలలలో వేంకటేశ్వరునకు నిర్వహింపబడుచున్న బ్రహ్మోత్సవాలు ఏడు, దీనితో ఇక నుండి ఎనిమిది యైనవి.

తరువాతి శాసనం సంస్కృత శ్లోకాలలోను వచనంలోను తెలుగు లిపిలో చెక్కబడి ఉంది. హరిగణేశుల ప్రార్థనలతో ప్రారంభమై, వాని వంశవృక్షం చంద్రుడు మూలంగా వర్ణిస్తూ, (ఆతడు చంద్రవంశపు రాజుల కుటుంబం వాడని సూచనగా), పురాణ వారసులను తుర్వసువరకు చెప్పి, వాని వంశంలో ప్రసిద్ధుడైన తిమ్మరాజు తుళువ వంశీయుడు దేవకిని వివాహమాడాడని, నరసభూపతి వారి కుమారుడనియు, ఆతడు “కావేరీ నదికి ఆనకట్టవేసి, శత్రువును యుద్ధంలో సజీవంగా బంధించి, వాని రాజ్యాన్ని జయించి, శ్రీరంగపట్టణాన్ని ఆక్రమించి, విజయస్తంభం నాటి” చేర, చోళ, పాండ్య రాజులను, తురుష్క సుల్తానును, గజపతిరాజును కూడ జయించెనని విశదీకరించును. ఆ నరసరాజుకు రాణి తిప్పాజీవలన వీరనరసింహుడును, రాణి నాగలాదేవి వలన కృష్ణరాయలును కలిగిరి. (దేవ, ఎపి.రిపో. పే152-155).

వేంకటేశ్వరుని ముమ్మారు దర్శించు సమయంలో కృష్ణరాయలు ఉదయగిరి కోటను ముట్టడించే నుద్దేశంతో పర్యటిస్తూ ఉండాలి. ఆ కోట నాతడు క్రీ.శ.1514 జూన్ 9 నాటికి వశం జేసికొని, ప్రతాపరుద్ర గజపతిని కొండవీడు వరకును వెంబడించాడు. (డిటో.పే.168-171).

ఆతడు ఉదయగిరి కోటను పట్టుకొనిన ఒక్క నెలలోపల, కృష్ణరాయలు వేంకటేశుని నాలుగవసారి క్రీ.శ.6-7-1514న, దర్శించి, 30,000 వరహాలతో కనకాభిషేకం జరిపించి, ముత్యాలు, కెంపులు, ఇంద్రనీలాలు పొదిగిన ఒక ముప్పేటయైన ఆభరణాన్ని, ఒక జత బంగారు కడియం లేక కడియాన్ని, వజ్రములు కెంపులు పొదగిన దానిని, సమర్పించి, పొత్తపినాడు లోని (ఇప్పటి కడపజిల్లా) తాళ్ళపాకం గ్రామాన్ని, నిత్యము వేంకటేశ్వరునకు పెద్ద ప్రమాణంలో నైవేద్యాలను సమర్పించుటకు దానం చేశాడు. (దేవ,ఎపి.రిపో.పే 157-159; నెం.66,-69 సం.3), ఈ సందర్భంలో వానితో వాని రాణులిద్దరునుండిరి. వారిలో చిన్నాజిదేవమ్మ దేవునకు ముత్యాలు, పచ్చలు, వజ్రాలు పొదిగి, కెంపుతోడి పతకాన్ని సమర్పించి, **తొండమండలంలోని ముదియూరు** గ్రామాన్ని దానినుండి వచ్చు ఆదాయంతో ఆ దేవునికి నిత్యనైవేద్యం లందునట్లు, దానం చేసెను. (నెం.70-72, సం.3). తిరుమలదేవమ్మ వజ్రాలు, కెంపులు, పచ్చలు, ముత్యాలు పొదిగిన ఒక సరపతకాన్ని బహూకరించి, **చోళింగ వరపట్టులోని పిరాట్టి-కూళత్తూరు** గ్రామాన్ని,

దానిపై వచ్చు ఆదాయంతో నిత్యనైవేద్యం దేవునకయ్యే టట్లు, దానమిచ్చాడు. (నెం.73-75, సం.3), ఈ మూడు శాసనాలలో, ఒక సత్రం, రాజు, వారి ఇద్దరు రాణుల యొక్కయు పేర్లమీద తిరుప్పణిపిళ్ళై (ఆలయపు ప్రజాహిత కార్యక్రమాల పర్యవేక్షణాధికారి) చే నిర్వహింపబడేటట్లును, అందు నిమిత్తం, ప్రసాదంలో ఒక భాగం వాని కిచ్చేట్లును, రాజుగారర్పించు నైవేద్యాలలో ఇద్దరు పురోహితులకు భాగం లిచ్చేట్లును, వ్యక్తిగతంగ తిరుప్పణిపిళ్ళైకు గూడ, యేర్పాటు చేశాడు. (దేవ.ఎపి. రెపి.పే159,206).

అటుపై ఒక సంవత్సరం మీద మూడు నెలలు గడచిన తర్వాత, ఆతడంతలో ఉదయగిరిని పట్టుకొని, దానితో సజీవంగా పర్వతుని లేక తిరుమల రౌతరాయని బంధించి, అద్దంకిని, వినుకొండను, మిగత కోటల్ని పట్టుకొని, కొండవీడు కోటను ముట్టడించి, కోటగోడల్ని బ్రద్దలుకొట్టి అక్కడి వారినందరను, **ప్రతాపరుద్ర గజపతి కుమారుడు వీరభద్రరాయడు, కుమారహంవీరపాత్రుని కుమారుడు నరహరిదేవుడు, రాచూరి మల్లూఖాన్, ఉద్దండఖాన్,** మిగత గజపతి సామంతులు మొదలగువారిని సజీవంగ బంధించి, వారికి ప్రాణభిక్షపెట్టి, అక్కడనుండి తన ఇద్దరు రాణులతో ధరణికోట-అమరావతికి వెడలి, తులాపురుష-మహాదానం (తన ఎత్తు బంగారాన్ని తులదూచి, యోగ్యులైన వ్యక్తులకు లేక ఆలయాలకు పంచుట) చేసి, తన రాణులచేత కొన్ని మహాదానాలను చేయించి, అటు తరువాత, ఆతడు తన రాజధానియగు విజయనగరానికి తిరిగివెళ్ళెను. అతడు తన సింహాసనంపై నుండి క్రీ.శ.1515 అక్టోబరు 25న ఒక రాజాజ్ఞతో తిరువేంగళనాథునకు ఒక నవరత్న-ప్రభావళిని (దేవతామూర్తికి పై భాగాన పరివేషాన్ని పోలిన ఒక ధనురాకారపు అలంకారం), నామాంతరమున మకరతోరణాన్ని (ఒక ధనురాకారపు పరివేషం, మధ్యన మొసలి తల, ముఖం గలది) నవరత్నాలు పొదిగిన, 31124 వరాహాల ఎత్తు బంగారంతో చేయబడిన దానిని, సమర్పించాడు. (నెం.76-79), సం.3, పే.159-163, దేవ.ఎపి.రిపోర్టు).

రత్నఖచితమైన ప్రభావళిని లేక మకరతోరణాన్ని బహూకరించిన రెండు నెలల లోపలనే, క్రీ.శ.1515 అక్టోబరు 25న, కృష్ణరాయలు, కళింగపైకి దండువెడలినాడు. ఇది ఒరిస్సాతో బాటుగా ప్రతాపరుద్ర గజపతికి మాతృభూమి. క్రీ.శ.1515 డిసెంబరు 21న అహోబిలాన్ని దర్శించి, క్రీ.శ.1516 జనవరి సగం గడువక మునుపే ఆతడు బెజవాడను చేరాడు. **అప్పుడాతడు కొండపల్లి దుర్గాన్ని ముట్టడించి, ప్రహరరాజ- శిరశ్చంద్ర మహాపాత్రుని, బోడజన మహాపాత్రుని, బిజిలీఖాన్‌ను, మరికొందరను సజీవంగ బంధించి,** వారికి ప్రాణహాని లేదని అభయమిచ్చి, ఒకే ఒక్కదాడిలో అనంతగిరిని, ఉంద్రకొండను, ఉర్లగొండను, తెలుంగరాజ్యం లేక తెలంగాణం (ఇప్పటి తెలంగాణ) లోని మిగత కోటలను స్వాధీనం చేసికొని **సింహాద్రి-పొట్నూరు చేరి అక్కడ విజయస్తంభం ఆవిష్కరించి** (ఇది ఒక తాటిచెట్టంత ఎత్తు అని ప్రతీతి. కొన్ని మహాదానాల చేసి, తిరిగి రాజమహేంద్రవరానికి (రాజమండ్రి) చేరి, తన రాణులైన చిన్నాదేవమ్మ, తిరుమలదేవమ్మ లిద్దరి చేతను మహాదానాలు ఇప్పించి, అటు తరువాత విజయనగరానికి మరలినాడు.

విజయనగరంనుండి ఆతడు క్రీ.శ.1517 జనవరి 2 న తిరుమల చేరి, తిరువేంగళనాథుని దర్శించి, స్వామికి కంఠమాలను, పతకాన్ని సమర్పించి, గర్భగృహం (గర్భగుడి) మీది విమానానికి పూత వేయించడానికి 30,000 వరహాలు ఇచ్చాడు. ఆ స్వామి అభిషేక, లేపనాలు ఎనిమిది రోజులకొకసారి జరుపడానికి తిరుపతి - **గొడగరనాడు** (తిరుపతి చుట్టూగల గ్రామాలు, పూర్వం కుడవూర్-నాడు అని పిలువబడెను) నుండి లభించు పన్నులు 1000 వరహాల విలువగలవి యేర్పాటు చేయబడినాయి. ఇదికాక స్వామికి ఉదయ సమర్పణల కొరతను భర్తీచేయడానికి అదే **గొడగరనాడు** నుండి 500 వరహాల మిగత పన్నుల్ని ఏర్పాటుచేసి, విజయనగరం చేరి అచటి నుండి రాజ్యాన్ని పాలిస్తుండేవాడు. ఇది కృష్ణరాయని అయిదవ వేంకటేశ్వర దర్శనం, రాణులు లేకుండ (దేవ.ఎపి.రిపో.పే.163-164; నెం.80, సం.3) ఈ యాత్ర ఆతడు మహామఖ ఉత్సవానికై కుంభకోణం మార్గమధ్యంలో జరిపింది. (దేవ.ఎపి.రిపో.పే.180).

శాసనం నెం.80 ప్రకారం కృష్ణరాయచక్రవర్తి, 5వ సారి వేంకటేశ్వరుని దర్శించి వచ్చిన తరువాత విజయనగరంనుండి పాలించే కాలంలో, మరల ఆ స్వామిని దర్శించి, తన దేవేరి తిరుమలదేవమ్మ ఒక్కరితో క్రీ.శ.1521 ఫిబ్రవరి 17న, తన శరణాగతిని ఆ స్వామికి సమర్పించుటకు అవకాశాన్ని స్వీకరించాడు. అప్పుడాతడు నవరత్న ఖచితమైన ఒక పీతాంబరాన్ని, ముత్యాలు, కెంపులు, పచ్చలు, ఇంద్రనీలాలు పొదిగిన ఒక కుల్లావు (శిరస్త్రాణాన్ని), రెండు నవరత్నఖచిత చామరాలను సమర్పించెను. తన రాణి తిరుమలదేవమ్మ ద్వారా నవరత్నఖచితమైన ఒక పతకాన్ని కూడ సమర్పించాడు. ఇవి కాక, తాను 10,000 వరహాలను ఒక పతకాన్ని దేవున కర్పించెను. **ఇది చక్రవర్తి కృష్ణదేవరాయల ఏడవ దర్శనం,** తన పెద్దరాణితో మాత్రం నెం.81 కూడ గజపతి రాజుతో వాని యుద్ధాలను సింహాద్రి-పొట్నూరు వద్ద విజయస్తంభం ప్రతిష్ఠించడం వరకు, రాజమహేంద్రవరమునకు ప్రయాణం, తన రాజధాని విజయ నగరానికి పూత వేయించడం 1518 సెప్టెంబరు 9న పూర్తియైనదని మాత్రం ప్రస్తావిస్తుంది. నెం.83-86, కేవలము పీతాంబరాన్ని, కుల్లావును, రెండు చామరాలను, 10,000 వరహాల కానుక వేంకటేశునకు క్రీ.శ.1521 ఫిబ్రవరి 17న పతాకాన్ని సమర్పించడం, తిరుమలదేవి నవరత్నపతకాల నిచ్చుట ప్రస్తావిస్తుంది. **నెం.82 తెలుగులో, సంగ్రహంగా అది కృష్ణదేవ రాయల తిరువేంగళనాథుని దివ్యవిమానానికి పూతవేయించడం అనే తమిళంలోని విషయాలనే మరల ప్రస్తావిస్తుంది.**

క్రీ.శ.9-9-1518 న, వేంకటేశ్వరుని దివ్యవిమానానికి పూత వేయించడం పూర్తియైన అయిదు వారముల లోపల, సజీవముగ ఉండే తన ఒకే ఒక పెద్దరాణి తిరుమలదేవితోను, నిస్సంశయంగా అదే సంవత్సరంలో పుట్టిన నెలల బాలుడగు తన కుమారుడు తిరుమలరాయ మహారాయనితోను తిరువేంగళనాథుని 6వ సారి దర్శించి, ప్రణామాలర్పించి, క్రీ.శ.1518 అక్టోబరు 16న ఆలయమునకు తన కుమారుడైన బాలరాజు శ్రేయానికై కొంత భూమిని దానం చేశాడు. కాని, రాజునకు దురదృష్టకరంగా విచారకరంగా ఆ బాలరాజు ఆరు సంవత్సరముల వాడైన కాకుండగనే మరణించాడు. (దేవ.ఎపి.రిపో.పే. 165-166).

శాసనాలలో లిఖించబడియున్నమేరకు, కృష్ణరాయలు తన మొదటి మూడు వేంకటేశ్వర దర్శనాలను, క్రీ.శ.10-2-1513 న, క్రీ.శ. 2-5-1513న, క్రీ.శ.13-6-1513న **ఉమ్మత్తూరు గంగరాజు, శ్రీరంగపట్నం సంకుల నాయకుడు,** మైసూరులోని, కొంగుమండలంలోని మిగత తిరుగుబాటుదారుల, బహుశః ఆ ప్రాంతానికి రాజ్యపాలుడైన (గవర్నరు) ప్రతాపరుద్రగజపతికి పిన్నతండ్రియైన **పర్వతరాహుత్తరాయ**ని పైనను జరిపిన దండయాత్రలలో విరామ సమయాలలో చేసికొన్నాడు. వాని నాల్గవయాత్ర క్రీ.శ.6-7-1514న, ఉదయగిరి కోటను 9-6-1514న స్వాధీనపరచుకొనిన నెలలోపల జరిగింది. వాని అయిదవయాత్ర క్రీ.శ. 2-1-1517 న మహామఖ ఉత్సవాన్ని కుంభకోణంలో క్రీ.శ. 6-2-1517 న చూడబోతూ మార్గంలో **ప్రతాపరుద్రగజపతి**పై యుద్ధం ముగిసిన తరువాత **సింహాద్రి-పొట్నూరు**లో క్రీ.శ.1516 మార్చి ద్వితీయ పక్షంలో విజయ స్తంభాన్ని నాటిన తరువాత జరిగింది. వాని ఆరవయాత్ర క్రీ.శ.16-6-518 న పుత్రుడు బుట్టిన కొంతకాలానికి జరిగింది. వాని 7వది చివరిది అయిన యాత్ర క్రీ.శ. 17-2-1521 న రాయచూరు వద్ద జరిగిన యుద్ధంలో ఆతడు జయించిన తరువాత సంవత్సరము - మూడు నెలలకు జరిగినది. ఇది **రాయచూరు** దగ్గర ఇప్పుడు **నిరమణూరు** (నిరమానూరు) అని పిలువబడుచున్న **నిరమణం** (నైరామన- ఆముక్తమాల్యద) వద్ద, బిజాపూరు, అహ్మద్‌నగర్, గోల్కొండ సుల్తానుల సైన్యంతో జరిగిన యుద్ధం, క్రీ.శ.1520 మే 19 న. ఈ యాత్రలన్నింటిలోను తన రాణులు ఇద్దరు, కొన్నిట ఒక్క పెద్దరాణిమాత్రం రాయల వెంటనున్నారు. ఆయా సందర్భాలలో **అమూల్య రత్నాలను, ఆభరణాలను, కిరీటాలను, శిరస్త్రాణాన్ని, పీతాంబరాన్ని, నవరత్న ప్రభావళిని లేక బంగారు మకరతోరణాన్ని, 31,124 వరహాల బరువున్న దానిని, 7500 వరాహముల బంగారు నాణెములను, చిన్న గిన్నెలను, పళ్ళెరాలను, గ్రామదానాలను సమర్పించాడు. వీటన్నింటి మొత్తం విలువ చాలా లక్షల వరహాలు అవుతాయి. ఇప్పుడు వాని విలువ ఎన్నో కోట్ల రూపాయలుంటాయి. ఇప్పుడు వానిలో నొకటియైనను వేంకటేశ్వరుని అలంకరణలో కానరాదు.**

రాయచూరు యుద్ధంతో కృష్ణరాయని యుద్ధాలు పరిసమాప్తమైనట్లే కాని, నూనిజ్ రాయలవారి **కాటూరు** దండయాత్రను ప్రస్తావించును.

(కొందరు పండితులు ఈ ప్రదేశం వెల్లూరు అని, న కయత్తూర్ అని మరేదో అనియు అనిరి. శ్రీ కె. ఈశ్వరదత్, **'శ్రీకృష్ణరాయల దండయాత్రలు'** అను వ్యాసములో, **"ఆంధ్ర ఐతిహాసిక పరిశోధన మండలి పత్రిక" (J.A.H.R.S.)**, సం.9, భాగం 4, ఏప్రిల్ 1935 (రాజమండ్రి), పే.59-60, ఆ ప్రదేశాన్ని మైసూరు రాష్ట్రంలోని తరికెన తాలూకా, **కదూరు జిల్లాలోని కాటూర్‌సీమ లోని మంగళూరుగా గుర్తించి, తుళుదేశపు జైన రాజులలో భైరస ఒడియార్‌లు చాలా శక్తిమంతు**లని, బహుశః వారు కృష్ణదేవ రాయలకు సామంతులై యున్నప్పటికీ తిరుగుబాటు ధోరణిని ప్రదర్శించియుండవచ్చు ననియును, చక్రవర్తి క్రీ.శ.13-7-1516 ప్రాంతమున తుళు దేశంలోని మంగళూరునకు భైరస ఒడియార్‌పైకి సైన్యాన్ని నడిపాడని అక్కడ తన సైన్యంతో శిబిరమేర్పాటు చేయగా, తుళు రాజు తన రాజధానిని విడిచి పారిపోయాడని వ్రాశాడు.

శ్రీ ఈశ్వరదత్తు కూడా కృష్ణరాయలు, క్రీ.శ.1516 మార్చిలో సింహాద్రి- పొట్నూరులో విజయస్తంభాన్ని ప్రతిష్ఠించిన తరువాత, **ప్రతాపరుద్ర గజపతి**పైకి మరియొకసారి కళింగ దండయాత్రను చేపట్టినాడని వ్రాశాడు. అభిప్రాయం ప్రకారం, అది క్రీ.శ.1518-1519 కాలంలో జరిగింది. (డిటో. పే.60-61).

తన పాలన కాలం పూర్వార్థంలో క్రీ.శ.1520 వరకు, ఒక దశాబ్దం అతిక్లిష్టమైన సైనిక జీవితం తరువాత, విజయనగరసామ్రాజ్యం నష్టపోయిన భాగాలను తిరిగి స్వాధీనం చేసికొని,, వానిని మరల తన పాలనలోనికి తెచ్చికొని, గజపతిరాజును బలహీనపరచి, సుల్తానులు మరెప్పుడును తాను జీవించి యుండగా తన హిందూ రాజ్యంపై దండెత్తుటకు సాహసించకుండు నట్లు వారిని భయభీతులను చేసి, కృష్ణరాయలు తన పాలనలో 2వ దశాబ్దిలో క్రీ.శ.1530 వరకు విశ్రాంతిని సంపాదించి, శాంతంగా కళలనుప్రోత్సహిస్తూ, కావ్యాలను స్వయంగ రచిస్తూ, అష్టదిగ్గజాలని పేరుగాంచిన తన ఆస్థాన కవులైన అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన, ధూర్జటి, మాదయ్యగారి మల్లన తదితరులకు, పండితులైన కొందరు మంత్రులు, సేనానులు, ముఖ్యమంత్రి యగు **సాళువ తిమ్మయ దండనాథుడు (అప్పాజీ) (అగస్త్యుని చంపూ భారతానికి వ్యాఖ్యను రచించినవాడు) మొదలగువారికి స్ఫూర్తిని ఇస్తూ ఆనందించినాడు. అప్పాజీ మేనల్లుడైన నాదిండ్ల గోపామాత్యుడు (ప్రబోధచంద్రోదయమునకు వ్యాఖ్యను రచించి, కృష్ణార్జున సంవాదాన్ని ద్విపదగా తెలుగులో వ్రాసినవాడు); బండారు లక్ష్మీనారాయణ (సంగీత సూర్యోదయమనే సంగీతశాస్త్ర గ్రంథాన్ని వ్రాసినవాడు); భానుకవి (పంచతంత్రాన్ని తెలుగులోనికి అనువదించినవాడు); కన్నడకవి తిమ్మణ్ణ (తిక్కనగారి తెలుగు మహాభారతంలోని ఉత్తరార్థాన్ని కన్నడంలోనికి** అనువదించాడు); వీరందరూ రాయలవలన స్ఫూర్తిని పొందినవారే - శ్రీ కె. ఈశ్వరదత్తు తెలుగులో రచించిన **"జీర్ణ విజయనగర చరిత్రము"** (పే.148-150; 154-155; 170-171; దేవ.ఎ.పి.రిపో. పే.184-85; పే.155, గమనిక 3). ఇతర కవులను, పండితులను కావ్యరచనకు శాస్త్రగ్రంథ రచనకు ప్రోత్సహించి, వారి కావ్యాలను, అల్లసాని పెద్దనామాత్యులు, ముక్కుతిమ్మకవి వంటి వారినుండి, అంకితం తీసుకోవడమే కాక, కృష్ణరాయడు స్వయంగ ఆముక్తమాల్యద లేక విష్ణుచిత్తీయం అనే ప్రౌఢకావ్యాన్ని తెలుగులో రచించాడు; ఇందు విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు; అట్లే సంస్కృత నాటకాన్ని **'జాంబవతీ కళ్యాణము'** అనే దానిని రచించాడు. ప్రతి సంవత్సరం వసంతర్తువులో కవి సమ్మేళనాన్ని సామ్రాజ్యపు నలుదిక్కులనుండి ఆహ్వానించి, వారికి ఉదారంగ బహుమానాలిస్తూ సత్కరించాడు. ఆతడు ప్రోత్సహించిన కళలలో కవిత్వం, నాటకం, సంగీతం, నాట్యం, శిల్పం, వాస్తు, జ్యోతిషం, ఖగోళశాస్త్రం, ఔషధ ప్రయోగం, పురాణవ్యాఖ్యానం అనేవి ఉన్నాయి. ప్రశాంత జీవనానికి కావలసిన అన్ని కళలను ప్రోత్సహించి, ఉదారంగా ధనాన్ని, గ్రామాలను దానం చేయడం చేత, ఆతడు గొప్ప 'రాయలు' గాను, అతని కాలం స్వర్ణయుగం గాను ప్రజలు స్మరించుకొంటారు.

కృష్ణరాయల సహాయకులుగ నున్నవారు పండితులు, వివేకవంతులు, సమర్థులు, నిపుణులు, వీరులు నైన మంత్రులు, సేనాపతులు, రాజ్యపాలురు. వారిలో అత్యంత ప్రముఖుడు ప్రసిద్ధుడు, వాని ప్రధాని (ముఖ్యమంత్రి) యైన సాళువ తిమ్మరుసు. ఆతడు కృష్ణరాయని అగ్రజుడైన వీరనరసింహ రాయని మంత్రిగ

సేవించి, క్రీ.శ.1509 లో అతని మరణానంతరం కృష్ణరాయని విజయనగర సింహాసనంపై 20 యేండ్లకు పై బడిన వయస్సున్న కారణంగా రాజ్యం ఏలడానికి కేవలం బాలుడైన వీరనరసింహుని కుమారుని కంటె యోగ్యుడని, ప్రతిష్ఠించాడు. ఈ సందర్భంలో వీరనరసింహుని ఆజ్ఞను సైతముల్లంఘించాడు. వీరనరసింహుడు తన ఎనిమిదేండ్ల బాలుడైన కుమారుని రాజుని చేసి, వానితో రాజ్యానికై పోటీపడకుండ ఉండేటట్లు కృష్ణరాయని కన్నులను పొడిచివేయుమని సాళువ తిమ్మని ఆజ్ఞాపించాడు. (నూనిజ్, సెవెల్ రచించిన **'ఒక విస్మృత సామ్రాజ్యము'** లో పేజి.314). తిమ్మరసు చేసిన ఈ మహోపకారం, వాని వయస్సు, పాలనానుభవం, క్షేమకరమైన మంత్రాంగం కారణాలుగా తిమ్మరసును కృష్ణరాయలు **'అప్పాజీ'** యని పెద్దగా మన్నించి సంబోధించాడు. ఈ మంత్రి విజ్ఞతగల పాలనాదక్షుడే కాక సమర్థుడైన సేనాపతి కూడ. సాళువ తిమ్మడు కొండవీడు దుర్గాన్ని వశంజేసికొన్నాడని, అందుచేత, దానికి రాజ్యపాలునిగ నియమితుడయ్యాడని, జనశ్రుతి, కాని, **రాజును, గజపతిని దండయాత్రలలో అనుసరించి పోవాలనే కోరికతో, ఆతడు తన చిన్న మేనల్లుడు, అల్లుడునగు నాదిండ్ల గోపని రాజ్యపాలునిగ నియమించి రాజుతో వెళ్లాడు.** గజపతితో యుద్ధాలు ముగిసిన కొంతకాలం తరువాత, ఆతని పూర్తిగ నోడించి కృష్ణరాయడు సింహాద్రి-పొట్నూరు వద్ద క్రీ.శ.1516 మార్చిలో విజయ స్తంభాన్ని నాటిన తరువాత, కృష్ణరాయడు క్రీ.శ.1516 చివరి రోజులలో దక్షిణ దేశానికి తీర్థయార్థ చేపట్టెననియు, అది భూప్రదక్షిణంగా నుండనెంచి (తన రాజ్యం చుట్టునొక ప్రదక్షిణం, పుణ్యక్షేత్రదర్శనం), అట్లు క్రీ.శ. 6-2-1517న **కుంభకోణంలో జరిగిన మహామఖ ఉత్సవంలో అక్కడకు చేరాడు.** ఈ యాత్రనుండి తిరిగి తన రాజధాని విజయనగరానికి వచ్చాడు. విఠల, విరూపాక్ష దేవులకు ప్రణమిల్లిన తరువాత ఒక శుభముహూర్తంలో కృష్ణరాయలు "తన రాజ బంధువులందరితో అప్పాజీని రత్నకంబళంపై కూర్చుండజేసి, నిండు దర్బారులో ఆతనికి రత్నాభిషేక సువర్ణాభిషేకాలు చేసి, విలువైన వస్త్రాలను, రత్నాలను, ఆభరణాలను బహూకరించి, మిగత అధికారులను కూడ తగినంతగా సత్కరించి, వారిని ఏనుగులపై తమ తమ ఇండ్లకు పంపాడు." (దేవ.ఎపి.రిపో. పే.178, గమనిక 1).

అప్పాజీకి సాళువ గోవిందరాజు అను తమ్ముడొకడుండేవాడు. ఆతడు వేర్వేరు ప్రాంతాలలో రాజ్యపాలునిగా విధులను నిర్వహించాడు. క్రీ.శ. 1520-21 కాలంలో, రాయచూరు యుద్ధసమయంలో అతడు విజయనగరానికి రాజ్యపాలునిగ నియమింప బడ్డాడు. (పేస్, సెవెల్ రచించిన **'ఒక విస్మృత సామ్రాజ్యము'** గ్రంథంలో పే.284).

**సాళువ తిమ్మమంత్రీంద్రుని కొక కృష్ణాంబయను సోదరియుండెను. ఆమె నారిదిండ్ల (నాదిండ్ల) తిమ్మని వివాహమాడి ముగ్గురు కుమారులకు జన్మనిచ్చెను. వీరు కోన, అప్ప, గోప అనువారు. సాళువ తిమ్మరసకు కూతుండ్లిద్దరుండిరి. వారిని తన చిన్న మేనల్లుండ్లు అప్ప, గోపలను వారికిచ్చి వివాహంచేసి, తన పలుకుబడి మీద, వారిని విజయనగర సామ్రాజ్యంలో వేర్వేరు ప్రాంతాలకు రాజ్యపాలురుగా నియమింపజేశాడు.** (దేవ.ఎపి.రిపో. పే.191-193).

ప్రధాని సాళువ తిమ్మరసయ్య, శక సంవత్సరం 1433, క్రీ.శ. 13-1-1512న వేంకటేశ్వర దేవునకు **కడపజిల్లాలోని పరాంతలూరు (పొందలూరు)** గ్రామమును దానం చేశాడు. దీనితో శ్రీవేంకటేశ్వరునకు నిత్యం ఎనిమిది **తిరుప్పోనకం** నర్పింపవలె నని ఒప్పందం. సంవత్సరంలో తన జన్మనక్షత్రమైన విశాఖనక్షత్రం ఉన్న 13 రోజులలోను 13 అతిరసపడి; సంవత్సరంలో తన భార్యయైన లక్ష్మీ అమ్మ జన్మనక్షత్రమైన అశ్విని నక్షత్రమున్న 13 రోజులలోను, 7 అతిరసపడి 7 తిరుక్కోడి – తిరునాళ్ యొక్క 7వ రోజులలోను, తన మంటపంలో 7 అతిరసపడి, అదికాక **నావలూఞ్జు లేక పున్నాగ – కులోత్సవము** (ఒక నీటి బుగ్గ దగ్గర జరుపు ఏదో ఒక ఉత్సవము) రోజున, వేసవిలోని ఉత్సవంలో ఒక ప్రత్యేక దినంలో శ్రీ గోవిందరాజుకు 8 రకాల పణ్యారాలు సమర్పించాలి. నిత్యం శ్రీవేంకటేశ్వరునకర్పించు ప్రసాదంలో ఒక భాగం సింగయ్యర్ అనేనొక శాత్తాద – శ్రీ వైష్ణవునకు ఇవ్వవలసింది. ఇతడు మంత్రిగారి తోటను దున్ని మొక్కలు పెంచేవాడు. (సం.3, నెం.21).

ప్రధాన ఆలయానికి వచ్చి, ఆ గ్రామాన్ని దానమివ్వడానికి దాదాపు 20 రోజులు ముందు, వారి భార్య లక్ష్మీ-అమ్మంగార్ క్రీ.శ.25-12-1511న, నిత్యం **వేంకటేశ్వరునకు ఒక తిరుప్పోనకాన్ని సమర్పించడానికి, దాతభాగ మైన నాల్గవవంతు ప్రసాదాన్ని అప్పయన్ అనే తన అల్లుడును, నారిదిండ్ల (నాదిండ్ల) తిమ్మరాజు కుమారుని** చేర్చేటట్లు, దానికిగాను 1200 నఝ్ఞణము నిధిగా చెల్లించినట్లున్నది. (డిటో.నెం.19)

ఈ సాళువ తిమ్మరస తమ్ముడు సాళువ గోవిందరాజు గండికోట సీమలోనున్న (కడప జిల్లాలో) మేల్పాడిని కృష్ణదేవరాయని శ్రేయానికై శక సంవత్సరం 1445, క్రీ.శ.27-8-1522 తేదీన ఆలయానికి దానమిచ్చాడు. వేంకటేశ్వరుని నిత్యం 20 తిరుప్పోనకాలతో తదితర సమర్పణలతో ప్రసన్నుని చేయవలెననియు, తాను తిరుపతిలో ప్రతిష్ఠించిన శ్రీ గోపాలకృష్ణుని 4 తిరుప్పోనకాలతోను, గోవిందరాజును ప్రతిసంవత్సరం ప్రతినెల మొదటి రోజులలో 12 అతిరసపడులతోను, వానిని వైకాశి. ఆని నెలలలోని రెండు ఉత్సవాల్లోను ఒక్కొక్క దానిలోని 13 రోజులలో 26 అతిరసపడులతోను, 2వ పడి 5వ, 7వ రోజులలో శేషవాహనం నాడు (9వ రోజులలో) రెండు బ్రహ్మోత్సవాలలో; ఇవి కాక అమావాస్య, ఏకాదశి, ఉగాది, దీపావళి, కార్తికై, ఊంజల్ ఉత్సవం, పవిత్రోత్సవం, అధ్యయనోత్సవం, కోడైతిరునాళ్, తెప్పోత్సవం, శ్రీజయంతి, ఇట్టి ప్రత్యేకదినాలలోను, సమర్పించాలని యేర్పాటు చేయబడింది (సం.3, నెం.154).

ఈ శాసనం తేది క్రీ.శ.27-8-1522, కృష్ణదేవరాయల పాలన కాలంలో సాళువ సోదరులైన తిమ్మరసయ్య, గోవిందరాజుల గూర్చి చివరి ప్రస్తావనముంది. **పేస్** ఇలా వ్రాస్తాడు : (కృష్ణరాయలకు) అత్యంత ఇష్టుడు **తెమెర్సి** (తిమ్మరస) అనునొక వయోవృద్ధుడు; మొత్తం కుటుంబం వాని శాసనం ననుసరిస్తుంది, గొప్ప రాజాధికారులకు గూడ ఆతడు సాక్షాత్ రాజంతటివాడే (సెవెల్ రచన **"ఒక విస్మృత సామ్రాజ్యము"** (పే.250), మరియు **'సాల్వతినిక' (సాళువ తిమ్మరస)** ప్రధానవ్యక్తి, భవనాన్ని ప్రవేశించి, సమస్తాన్ని పర్యవేక్షిస్తాడు, ఎందుకంటే ఆతడు రాజును పెంచి, రాజుగా చేసెను, కనుక రాజాతనిని

తండ్రితో (అప్పాజీ) సమమని భావిస్తాడు. తలంచును. రాజు అతని నెప్పుడు పిలిచినా, ప్రభూ! సాల్వతినిక!! అనియే పిలుస్తాడు, కులీనులు, సేనానులు, అందరునూ అతనికి నమస్కరింతురు. (డిటో, పే. 2-68). తిమ్మరసు తమ్ముడు గోవిందరాజుని గూర్చి అతడిట్లనును: "మేము **బిస్నగ (విజయనగర)** పట్టణానికి తిరిగివచ్చామో లేదో, ఆ ప్రాంతపు రాజ్యపాలుడు **గందరాజు (గోవిందరాజు)** అనునతడు, **సాల్వతినిక** యొక్క సోదరుడు, ఆ ప్రదేశాన్ని చూపాడు" (డిటో, పే. 284). **సెవెల్** అంటాడు కదా, డెమింగోస్, పేస్ చెప్పిన ఈ కథ "బహుశః క్రీ.శ. 1520-22 లో వ్రాయబడింది" అని. ప్రధాని తిమ్మరసయ్యంగార్ గురించి శక సంవత్సరం 1446 (క్రీ.శ. 1524) లో, ఎవరో ఒక దాత శ్రీకృష్ణుని తిరుపతిలో గోవిందరాజు బ్రహ్మోత్సవంలో 5వ రోజున, ప్రధాని శ్రేయస్సుకు ఆరాధించుట కేర్పాటు చేసిన సందర్భంగా ఇది వినబడుతూ ఉంది. (సం. 3, నెం. 166). కృష్ణరాయని పాలన కాలంలో సాళువ తిమ్మరస గూర్చిన ప్రస్తావన చివరిది. నూనిజ్ అంటాడు : వానికి, వాని సోదరునికి తదితర బంధువులకు ఏదో గొప్ప ఆపద సంభవించినది.

**కృష్ణదేవరాయలకు తన పెద్ద భార్య తిరుమలాంబవలన ఒక కుమారుడు కలిగాడు. ఆ శిశువుకు తిరుమలరాయుడని పేరుపెట్టి, వారితో కలిసి క్రీ.శ. 1518 అక్టోబరు 16న వేంకటేశ్వరుని దర్శించి, తన కుమారుని యోగక్షేమాల కొరకు కొంత భూమిని దానం చేశాడు.** (దేవ.ఎపి.రిపో. పే. 165) ఇది వేంకటేశ్వరుని 6వ దర్శనం. విజయనగర సింహాసనాన్ని తన కుమారుడే అధిష్ఠించాలనే కోరికతో, రాజు తన కుమారుని రాజుగా ప్రతిష్ఠించి, వానికి తానే మంత్రియై రాజ్యాన్ని పాలిస్తూ, సాళువ తిమ్మనను తనకు సలహాదారుగా నియమించుకొన్నాడు; "ఈ మార్పులతో రాజు ఎనిమిది నెలలపాటు కొనసాగిన ఉత్సవాలను గొప్పగా నిర్వహించాడు; ఈ కాలంలో **రాజకుమారుడు వ్యాధిగ్రస్తుడై మరణించాడు" వాని మరణం తరువాత కృష్ణదేవ రాయలను తన కుమారునకు సల్లవతినిక (సాల్వతిమ్మరసు) కుమారుడు విషమిచ్చి చంపెనని తెలిసింది.** తనకు తెలిసినది సత్యమని గట్టిగా నమ్మి, కోపంతో సాల్వతినిక (సాల్వతిమ్మరసు)ను, వాని కుమారుని, వాని సోదరుని, మరెందరనో అతని బంధువులను పిలువనంపి, రాజ్యంలోని పలుప్రముఖులు, నాయకు లందరుండగా, వానితో ఇట్లన్నాడు:- నేను తమరినెప్పుడు గొప్ప మిత్రునిగానే భావించాను. తమరు రాజ్యపాలురుగ ఈ నలువదేండ్లు నున్న ఈ రాజ్యాన్ని తమరే నాకిచ్చారు. ఆ కారణంగా నేను మీకు ఋణపడి లేను, ఎందుకంటే, తమరు ఆ విధంగా చేయడంలో తమ కర్తవ్యాన్నొక విధంగా నిరోధించారు. నా సోదరుడు, నీ రాజైయుండి నిన్ను నా కన్నులు పొడిపించుమని ఆజ్ఞాపించాడు. కానీ, నీవు వాని ఆజ్ఞను పాలించలేదు, విధేయత చూపలేదు, అందుకు బదులు నీవు వారిని వంచించి ఒక మేక కన్నులను పొడిచావు: వాని ఆజ్ఞను పాలించని కారణంగా నీవు రాజద్రోహివైనావు. నీతోబాటు నేనెవరికింత మేలుచేసితినో అట్టి నీ కుమారులు గూడ. నా కుమారుడు విషప్రయోగంతో నీచేతను, నీ కుమారులచేతను చంపబడెనని నాకిప్పుడు తెలిసినది. ఆ కారణంగా మీరందరు నిచట బంధింపబడినారు". "ఈ మాటలతో అతడు లేచి వారిని పట్టుకొనెను, ఈ సందర్భంలో ఎన్నో, గుఱ్ఱాలతో దేశంలో అప్పుడుండే పోర్చుగీసువారి సహాయాన్ని కోరాడు; వారట్లు తండ్రిని కొడుకులను బంధించగా, వారు మూడేండ్లు

కారాగారంలో ఉన్నారు. రాజు నరసింగుని కుమారుని పెనగుండి (పెనుగొండ) పట్టణంలోని పూదోటలో, రాజైన తన తండ్రి ఆజ్ఞపై, ద్రోహముగా చంపెనో, అట్టి **కొడిమెరాడొ** కుమారునొకనిని మంత్రిగా చేసెను" నూనిజ్ ఇంకా ఇట్లు వ్రాశాడు: "తరువాత కొద్ది కాలానికే, సాల్వతినిక (సాల్వతిమ్మరసు) కుమారుడైన **తిమదనాయక్** చెరనుండి తప్పించికొని, దొంగలు, దోపిడీదారులు తప్ప వేరెవ్వరుండని, ఒక పర్వత శ్రేణికి పారిపోయెను; అక్కడనున్న ఒక కోటలో ఒక సేనానియైన వాని బంధువునుండి వానికి చేయగలిగినంత సహాయము చేసెను. అక్కడనుండి ఆతడు రాజు కృష్ణరాయలతో ఎట్టి యుద్ధము చేసెననగా, రాజు పెద్ద సైన్యమును, తన మంత్రిని **అజబోయిస్సను** సేనాపతిగా వానిపైకి పంపవలసి వచ్చెను. ఆతడు అన్ని వైపులనుండి ముట్టడించి, వానిని పట్టుకొని, బందీగా రాజు వద్దకు తెచ్చెను. అంతట **రాజు వారందరిని, సాల్వతినిక యను అతని తండ్రిని, అతని వేరొక సోదరుని, చెరనుండి తన సమక్షానికి రప్పించి, వారినందరను శిక్షాస్థలానికి పంపి, కన్నులు పొడిపించెను, ఎందుకనగా ఈ దేశంలో బ్రాహ్మణులను చంపక ఏదేనొక శిక్షవిధించి బ్రతుకనిత్తురు.** అట్లు మరల వారిని చెరసాలలో నుంచెను. అక్కడ **తిమదనాయక్** మరణించెను. వాని తండ్రి **సల్వతినిక** చెరలోనే తన వేరొక కుమారుడైన **గందర్జ**తో నుండెను (సెవెల్ రచన **"ఒక విస్మృత సామ్రాజ్యము",** పే.359–369).

నూనిజ్ ఈ దురదృష్టకరమైన సన్నివేశాన్ని వివరంగా వర్ణించాడనటంలో సందేహం లేదు కాని, ప్రాథమికమైన సందేహమేమన సాళువ తిమ్మరసుకు కుమారుడొకడున్నాడా!? అన్నదే! ఎందుకంటే, తిమ్మరుసుకు ఇద్దరు కుమార్తె లనియు వారినాతడు తన ఇద్దరు మేనల్లుండ్లకిచ్చి వివాహం జేసెననియు, అల్లుండ్లపేర్లు అప్ప, గోప అనియు చెప్పబడింది. **కుమారుల ప్రసక్తియే లేదు. ఆతడు 'కుమారులు' అన్న పదమును బహుశః 'అల్లుండ్లు' అను అర్థములో ప్రయోగించినట్లు భావించవచ్చు.** (దేవ.ఎపి. రిపో. పే. 191) రెండవ విషయము, వాని అల్లుండ్లు అంత నిర్దయులు, సాహసులు, ధైర్యశాలురై, దాని ఫలితాలెంత దారుణంగ తమను బాధించునో ముందు వెనుకలు ఆలోచించకుండ అంతటి దారుణమైన నేరమును చేసి ఉంటారా? అనేది. తమకు అంతటి అధికారం లభించుటకు కారణమైన తమ మామనెంత బాధించునో యోచింపరా!? కృష్ణరాయని పెంచి, కండ్లు పొడిపించక రక్షించి, విజయనగర సింహాసనంపై ప్రతిష్ఠించిన సాళువ తిమ్మరసును రాజద్రోహి యని యే కారణంగా నిందించెనో, తన సోదరుడు వీరనరసింహుని ఆజ్ఞనుల్లంఘించడం అనేది, అదే నేరానికి రుజువుగా కన్పించెననడం కూడా సందేహాస్పదమే కాదు, హాస్యాస్పదం కూడా. ఏది యెట్లున్నను, ఆ ఇద్దరు సాళువ సోదరుల గురించి కృష్ణరాయని పాలన కాలంలో క్రీ.శ.1530 వరకు గల ఆ ఆరు సంవత్సరాల చరిత్రలో ఎచ్చటనూ శాసనాలలో గాని ఇతరత్ర సమాచారంగాని కన్పించక పోవడంచే, వారు రాజోద్యోగాలలో లేరనియు, చెరసాలలో బంధింపబడిగాని లేక సాధారణమైన వ్యక్తులుగా జీవితం గడిపారని అనుకోవడానికి అవకాశమేర్పడుతున్నది. వారి కన్నులు పొడిపించబడినట్లు కూడ దాఖలాలు లేవు. వారు మరల కృష్ణరాయల సవతి తమ్ముడు, తన తరువాత రాజైనవాడు అయిన అచ్యుతరాయల పాలన కాలంలో కన్పిస్తారు.

బాలరాజైన తిరుమలరాయనిపై విషప్రయోగం గూర్చిన నిందను సాళువ తిమ్మరసను గూర్చి రాయలకు కల్పించి చెప్పినది **ముఖప్పాళము నాగమనాయకుడు** అని యొక ప్రవాదముంది. అతడు తాను మధురకు రాజ్యపాలుడై (గవర్నర్) ఉండగా రాజుపై తిరుగబడినాడు. తన కుమారుడైన విశ్వనాథనాయకునిచే ఓడింపబడి, బంధింపబడి తేబడి, రాజుచే క్షమాభిక్షను తర్వాత పొందినవాడు. బాలరాజైన తిరుమలరాయుడు యథార్థంగ విషప్రయోగానికి గురియై యుండి ఉంటే, ఆ పని వాని ఇద్దరు పెద్దన్నలలో ఒకరు చేసియుండవచ్చును. **వీరిద్దరు అచ్యుతరాయని బావమరుదులు. సలకరాజు పెరియ – తిరుమలరాజు మరియు సలకరాజు శిరు – తిరుమలరాజు అనువారు. రాజ్యాధికారం హస్తగతం కావలెనని వారిద్దరి గొప్ప కోరిక,** ఎందుకంటే తద్వారా తాము అనధికారంగ పెత్తనం చేసి రాజ్య పరిపాలన వచ్చునని వారి తలంపు. “అట్టి అధికారంతోను, వారి తలబిరుసు ప్రవర్తనతోను, అచ్యుతరాయని సామంతుల విధేయతను, సానుభూతిని దూరంచేయగా, వారసత్వం వివాదాస్పదమై అచ్యుతరాయల మరణం సంభవించింది”. (దేవ.ఎపి.రిపో. పే. 230).

**కృష్ణరాయలు నిజంగానే, కనీసం, సాళువ తిమ్మరసను, అతని సోదరుడు గోవిందరాజును, మేనల్లుండ్లు నాదిండ్ల అప్ప, గోపలను ఆ చెప్పబడిన వాని కుమారులు విషప్రయోగ నేరంపై చెరసాలలో నుంచినట్లయిన, ఆ చర్య కోపావేశంలో, వివేకించకుండ, తొందరపడి చేసినదిగా కన్పించును.**

శక సంవత్సరం 1445, క్రీ.శ. 12-1-1524 **శ్రీమత్ బ్రహ్మణ్యతీర్థ శ్రీపాద ఉడైయార్** వారి శిష్యుడైన మధ్వాచార్య శ్రీమత్ వ్యాసతీర్థ శ్రీపాద ఉడైయర్ వారికి కృష్ణదేవరాయలు తిరుమలలో మూడు ఇంటి స్థలాలు స్వామి పుష్కరిణికి ఉత్తరాన, ఒక ఇంటి స్థలం తిరుపతిలో గోవిందరాజుల ఆలయానికి ఉత్తరపు వీధిలోను, అక్కడ మఠముల నిర్మాణానికై దానం చేసి, తన దాత భాగం ప్రసాదాన్ని, తాను ఆ ఇద్దరు దేవతామూర్తులకై యేర్పరచిన దానిని, అక్కడివారి కాహారంగా ఇవ్వడానికి యేర్పాటు చేశాడు. (సం. 3. నెం. 157, 158, 159). వ్యాసతీర్థులు స్వయంగ 14000 నఖ్ఖణాలు చెల్లించి వేంకటేశ్వరునికి ఎనిమిది బ్రహ్మోత్సవాల కాలంలో, తదితర ఉత్సవాల్లోను, మరికొన్ని శుభమైన, మతసంబంధమైన సందర్భాల్లోను నైవేద్యముల కొరకు మొత్తం 354 అప్పపడిని యేర్పాటు చేశాడు. ఇట్లే, గోవిందరాజునకు నిత్యం సమర్పణకై **శీయలపాండూరు గ్రామాన్ని** క్రీ.శ. 8-11-1524న (డిటో.నెం. 165); మరల గోవిందరాజునకు పౌర్ణమి రోజులలో నివేదనలకై క్రీ.శ. 2-4-1528న ఒడ్డంపైటులు గ్రామాన్ని (నెం. 175) దానం చేశాడు. ఈ మధ్వ గురువు వ్యాసతీర్థులు గొప్ప సంస్కృత పండితుడు, మతధార్మిక రచనలెన్నియో చేసినవాడు, కొన్ని ఉపనిషత్తుల వ్యాఖ్యలను రచించినవాడు (డిటో పే. 328). **“తిరుపతి ఆలయంలో జరిగిన కొన్ని దురదృష్టకర సంఘటనల కారణంగా (అనగా, శ్రీవేంకటేశ్వరుని ఆలయంలో), ఈ ఆచార్యుడు కొన్ని సంవత్సరములక్కడనే ఉండవలసి వచ్చింది, 12 సంవత్సరాలని వ్రాయబడింది”.** అప్పుడతడు “చంద్రగిరి లోని సాళువ నరసింహుని దర్బారుకు వెళ్ళాడు”. అప్పటి ఆలయ పూజారి యైన **శిట్టప్ప అయ్యన్** అనువానిచే దేవుని నగలు కొన్ని దొంగిలింప బడినట్లును, ఆ నేరమున కా నంబికి తిరుమల తిరుపతులలో గల యిండ్లు ఆలయానికి

స్వాధీనమగునట్లు సాళువ నరసింహుడు ఆజ్ఞాపించెననియు, తర్వాతి కాలంలో కృష్ణరాయలు ఆ యిండ్లనే వ్యాసతీర్థులకు మఠాలు కట్టుకొనుటకై ఇచ్చెననియు ఉన్న విషయం తప్ప శాసనాలలో మరెట్టి దుస్సంఘటనల ప్రస్తావనా లేదు. (షం.3 నెం.157-159). బహుశః సాళువ నరసింహుని కాలంలో ఈ సమయానికి వ్యాసతీర్థులు ఆలయ పూజారిగా వ్యవహరించి యుండవచ్చును. **కుహూయోగ** సందర్భంగా విజయనగర సామ్రాజ్యాన్ని అతడు కొంతకాలం పాలించినట్లు చెప్పబడింది. ఈ యోగం కొన్ని గ్రహముల కూటముల వలన యేర్పడు దేశాన్ని పాలించు రాజులకు ప్రాణాంతకమైన దనియు, ఇది రాయచూరు యుద్ధానికి ముందు ఒక అమావాస్యనాడు యేర్పడిన దనియు, అప్పుడు కృష్ణరాయలు సింహాసనాన్ని త్యజించి తాత్కాలికంగా వ్యాసరాజును రాజు జేసెననియు చెప్పబడింది. అందువలన ఆచార్యునికి వ్యాసరాట్ అనే పేరు ఏర్పడింది. (దేవ.ఎపి. రిపో.పే. 166-167; 207-211).

కృష్ణరాయని పాలన కాలం మొదటనే తిమ్మరసు శ్రీవేంకటేశ్వరుని కైంకర్యాలకై క్రీ.శ.13-1-1512న **పరాంతలూరు** గ్రామాన్ని దానం చేశాడు; ఒక పీతాంబరాన్ని బహూకరించాడు; అతని సోదరుడు గోవిందరాజు ఆ దేవుని నిత్యనైవేద్యములకును, శ్రీ గోవిందరాజునకు ఉత్సవ సందర్భాలలోను నైవేద్యాలకై, కృష్ణదేవ మహారాయల యోగక్షేమముల కోరి, క్రీ.శ.1522 ఆగష్టు 27న గండికోట సమీపంలోగల మేల్పాడి గ్రామాన్ని దానం చేశాడు. (నెం.154, సం.3). మరల తన అల్లుడగు పెండిలి కొడుకు చెన్నయ్యర్ ద్వారా వేంకటేశ గోవిందరాజులిద్దరికి నైవేద్యాల కొరకు **ఉరవకొండసీమలో** గల **హనుమనిగుంట** గ్రామాన్ని క్రీ.శ.20- 11-1524న దానం చేశాడు. (డిటో.నెం.163).

**అచ్యుతరాయలపాలన కాలంలో, తిమ్మరసు తన తమ్ముడు సాళువ గోవిందరాజునకు సంబంధించిన, దాత భాగం నాల్గవవంతు ప్రసాదాన్ని 4600 పణాలకు క్రీ.శ. 26-2-1536న తాళ్ళపాకం తిరుమలయ్యంగార్, అన్నమయ్యంగార్ (అన్నమాచార్య) కుమారునకు విక్రయించెను. (సం.4, నెం.72). తరువాత, సాళువ సోదరులిద్దరు కలిసి అదే తాళ్ళపాక తిరుమలయ్యంగార్‌కి, తిరుపతిలోని శ్రీ గోవిందరాజుని ప్రసాదంలో దాతభాగమైన తమ నాలుగవ వంతు ప్రసాదంలో 5203 పణాలకు విక్రయించినట్లు విక్రయదస్తావేజును నమోదు చేయించారు. (డిటో, నెం.74).** మరల క్రీ.శ.28-12-1536న రాచిరాజు కుమారుడైన సాళువ తిమ్మరస, తాను శ్రీవేంకటేశ్వరునకు యేర్పరచిన నిత్యనైవేద్యంలోను ప్రత్యేక సందర్భాల నైవేద్యములోను దాత భాగంగా తనకు వచ్చు నాలుగవ వంతు ప్రసాదాన్ని 1900 పణమునకు, దానిని దానవిక్రయాది హక్కులతో విక్రయదస్తావేజును వ్రాయించాడు. కాని, అతడొక షరతు పెట్టాడు; **శ్రీవేంకటేశుని సన్నిధిలో తన సంకీర్తనాలను పాడుటకు ఆతడు తిరుమల లోనే స్థిరనివాసం చేయవలెననునది ఆ షరతు.** (డిటో.నెం.93). ఈ లావాదేవీలలో తిమ్మరస ఒక సాధారణ వ్యక్తిగా, రాచిరాజు కుమారునిగా, ఎట్టి బిరుదులు, అధికార చిహ్నాలు లేకుండ కనబడుతాడు. తరువాత శక సంవత్సరం 1463, క్రీ.శ.1541 నవంబరు 5న, వాని తమ్ముడు గోవిందరాజు శ్రీ గోవిందరాజస్వామికి నిత్యమూ, వేరు సందర్భాలలోను నైవేద్యాల యేర్పాటుకై ఒక గ్రామాన్ని దానం చేశాడు; అట్లే సంవత్సరంలో మార్గశీర్షనక్షత్రమున్న 13

రోజులు నైవేద్యాలకు గూడ ఇది ఉద్దేశింపబడింది. (డిటో.నెం.166). ఇది అచ్యుతరాయల జన్మ నక్షత్రం. ప్రతినెలలో ఆ నక్షత్రమున్న రోజులలో తాళ్ళపాకం తిరుమలయ్యం గార్ (డిటో.నెం.6), భండారం శిఋతిమ్మయ్యర్ (డిటో.నెం.36), తదితర దాతలు, రాజుగారికి విధేయులైనవారు, వేంకటేశ్వరునకు నైవేద్యాలకై ఏర్పాటు చేసిరి. అట్లే, సాళువ గోవిందరాజు కూడ అచ్యుతరాయలకు విధేయుడై యుండవచ్చును. **తనను, తన అన్నను చెరసాలనుండి విడుదల చేసినందుకు, మరల రాజ్యపాలునిగనో లేక మరియొక ఉన్నతాధికారిగనే నియమించినందుకు ఈ విధేయత కావచ్చును. అయితే అసలు వీరు కృష్ణరాయలచేత బంధింప బడిరనుట నిజమైనప్పటి మాట ఇది.** క్రీ.శ.5-11-1541న సాళువ గోవిందరాజు చేసిన గ్రామదానం, అచ్యుతరాయల పాలన ముగియడానికి ముందు సంవత్సరం, బహుశః ఆ రాజు పాలనలో తొలిరోజులలోనే ఉన్నతాధికారాన్ని ఆతడు పొంది ఉంటాడు. ఆయనకు **మహాప్రధాని, శిరఃప్రధాని** అను బిరుదులివ్వ బడినవి (దేవ.ఎపి.రిపో.పే.195). ఇట్లే వాని పెద్దన్న సాళువ తిమ్మరస, అచ్యుతరాయల సూచన లేక ఆజ్ఞమేరకు, **మలైకినియనిన్ఱ పెరుమాళ్** ఉత్సవవిగ్రహాలకు నైవేద్యాల నిమిత్తము 8 బ్రహ్మోత్సవాల 7వ ఉత్సవ దినాలలో వేంకటేశ్వరుని పేరున జరుపబడుచున్న వానిలో, **మల్లాపురం గ్రామాన్ని** క్రీ.శ.1537 జనవరి 2న దానము చేసెను; ప్రతినెల ఒక కొంత జీతమును పూదోటను పరిరక్షించినందుకును, దాత భాగమైన అప్పైప్రసాద నైవేద్యములోని నాల్గవవంతు ప్రసాదాన్ని, చందనాన్ని, అప్పయన్ ఒక్కరికి మాత్రం చేర్చునిమిత్తం, చెల్లించేటట్లు ఒప్పందం వ్రాశాడు. (సం.4, నెం.89). **ఈ దస్తావేజు శ్రీమన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప అచ్యుతరాయ మహారాయలు పాలించుచుండగా నమోదు చేయబడినది.** అప్ప-ప్రసాదమును అందుకొన్న అప్పయన్ బహుశః సాళువ తిమ్మరసుయొక్క పెద్ద మేనల్లుడును, అల్లుడును అగు నాదిండ్ల అప్ప అయి యుండును. ఇతనికే తిమ్మరసు భార్య లక్ష్మీ అమ్మ ఇంతకు ముందు దాత ప్రసాద భాగాన్ని, కృష్ణరాయల కాలంలో తొలినాళ్లలో, క్రీ.శ.1511 డిశెంబరు 25న, వేంకటేశ్వర నైవేద్యం విషయంలో, అందించు నట్లున్నది (నెం.19, సం.3), దాత సాళువ తిమ్మరసుగా భావించబడినది కూడ. పైగా, ఈ ఇద్దరి పాలన కాలములలో **అప్పాపిళ్ళై** అను నొక్కడు తప్ప వేరొక **అప్పయన్** కనరాడు. ఈ అప్పయన్ కూడ శ్రీవేంకటేశ్వరునకు, గోవిందరాజునకు, కృష్ణరాయల కాలములో, శక సంవత్సరము 1437, క్రీ.శ. 4-8-1515న, నైవేద్యాలు ఏర్పాటు చేశాడు. (షం.3, నెం.104).

**తాళ్ళపాక తిరుమలయ్యంగార్ అన్నమయ్యంగార్ రెండవ కుమారుడు అన్నమయ్య పెద్ద కుమారుడైన నరసింగయ్య కవి, సంగీతజ్ఞుడు అన్న సూచన ఒక తెలుగు పద్యములో కనిపించును. కాని ఆతడు పిన్నవయసులోనే కుటుంబమును వదలి వెళ్ళినాడు.** శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో సంకీర్తన సేవను అన్నమయ్య ప్రారంభించెను. ఇది తన 16వ యేటనే అనగా, శకసంవత్సరం 1346, చాంద్రమాన క్రోధినామ సంవత్సరంలో, క్రీ.శ.1424లో, తిరువేంగళనాథుని సాక్షాత్కారం కలిగినప్పుడు జరిగింది. అతడు దానినట్లే శకసంవత్సరం 1424, దుందుభి నామ సంవత్సర ఫాల్గుణ బహుళ ద్వాదశి పర్యంతం (క్రీ.శ.23-22-1503) కొనసాగించాడు. ఈ తరువాతి తేదినుండి వాని కుమారుడైన పెద్ద తిరుమలయ్యంగార్ వారి సంకీర్తన

సేవ ప్రారంభమైనది. వాని తండ్రి మరణశయ్యనుండి వానిని రోజుకొక్క సంకీర్తనాన్నైనా వ్రాసి వేంకటేశ్వరుని సన్నిధిలో గానం చేయడమనే పవిత్ర కర్తవ్యాన్ని పాలించుమని ఆదేశించెను. (దేవ.ఎపి. పే.280, 283). **అన్నమాచార్యుడు 32000 సంకీర్తనలను రచించినట్లును, అవి తాటియాకులపైన, వ్రాయబడినట్లును, వాని నాల్గవ మనుమడైన చిన్నన్న లేక చిన్న తిరువేంగళనాథుని "అన్నమాచార్య చరిత్రము" అను దానిలో చెప్పబడింది.** కాని, రాగిరేకులపై చెక్కబడిన సంకీర్తనలు 3000. వీనిలో అన్నమయ్య వాని కుమారుడు పెద్ద తిరుమలాచార్య, వాని పెద్ద మనుమడు చిన్న తిరుమలాచార్యులందరి కీర్తనలున్నవి. అన్నమయ్య రచనలొక 10,000-12,000 ఉండవచ్చును. సాళువ నరసింహుడు వాని రాజపోషకుడు. వాని అభిమానము, పలుకుబడి కారణముగనే అన్నమయ్య వేంకటేశ్వరుని ఆలయగాయకునిగాను సంకీర్తనాచార్యునిగాను స్థానాన్ని పొంది ఉంటాడు. వాని తర్వాత, వాని కుమారుడు పెద్ద తిరుమలయ్యంగార్ ఆ స్థానమునాక్రమించెను. వాని తర్వాత వాని కుమారుడు పెద్ద తిరుమలయ్యంగార్ ఆ స్థానము నాక్రమించి సంగీతవేత్తగా సేవ చేశాడు. వాని పెద్ద కుమారుడు చిన్న తిరుమలాచార్య, వాని అయిదుగురు కుమారులలో, ఆ వారసత్వాన్ని నిర్వహించాడు. వారిద్దరు సంకీర్తనములను రచించారు. అవి రాగిరేకులపై చెక్కబడినాయి.

**అన్నమాచార్యుడు క్రీ.శ.1503 లో పరమపదించాడు.** వాని కుమారుడు పెద్ద తిరుమలాచార్యుడు కృష్ణరాయలు, అచ్యుతరాయలు, సదాశివరాయలు అను ముగ్గురి పాలన కాలములోనూ జీవించియుండెను. **కృష్ణరాయలు, వేంకటేశ్వరుని యేడుసార్లు దర్శించినప్పటికిని, పెద్ద తిరుమలాచార్యుడను ఈ సంకీర్తనాచార్యుని గమనించినట్లే లేదు.** కాని, అచ్యుతరాయలు, సదాశివరాయలు, ఇద్దరును ఆతని కగ్రహారములను బహూకరించిరి. కృష్ణరాయలు తాను స్వయముగ పండితుడు, కవి అయి యుండి, సాహిత్యమును తదితర కళలను పోషించెను; ప్రతి సంవత్సరం వసంతర్తువులో కవి పండిత సభల నేర్పాటుచేసి, వారికి ఉదారంగ బహుమతులిచ్చాడు. ఇది భువన విజయమను దర్బారులో సాగినాయి. కృష్ణరాయని కాలంలో ఒకే ఒక్క సందర్భంలో మాత్రమే పెద్ద తిరుమలయ్యంగార్ మన దృష్టికి వచ్చును. ఆ సందర్భమిది : శక సంవత్సరం 1439, **క్రీ.శ.30-11-1517న వేంకటేశునికి నిత్యం ఒక తిరుప్పోణకం నైవేద్యం సమర్పించడానికై ఆతడు 1500 నఖ్ఖణాలు ఆలయ ధనాగారమున చెల్లించిన సందర్భం (సం.3, నెం.122).**

చాలామంది కృష్ణరాయని అధికారులు వేంకటేశ్వరునకు, గోవింద రాజునకు, తదితర దేవతలకు, ఆళ్వారులకు నైవేద్యాలకై యేర్పాట్లు చేసినట్లు తెలియవచ్చును.

**మహానాయంకరాచార్య** (ఉన్నతుడైన సేనాపతి) **పెరియ - ఓబళ నాయక్కర్ రామానాయక్కర్,** క్రీ.శ.4-9-1504న, కృష్ణరాయని పెద్దన్న వీరనరసింహరాయల పాలన కాలమున, వేంకటేశ్వరునకు నిత్యనైవేద్యాల నర్పించుటకు **కడలూరు గ్రామాన్ని** దానం చేసి, ఒక పంటకాల్వను గూడ త్రవ్వించాడు. (సం.3, నెం.1), మరల క్రీ.శ.14-7-1512న, కృష్ణరాయని పాలనలో, ఆతడు గరుడునికి నిత్యనైవేద్య, ఘృతదీపాలను వేంకటేశ్వరునకు కొన్ని సందర్భాలలో నైవేద్యానికి, గోవులను, **శంగోడిపల్లి గ్రామానికి**

దానం చేశాడు. (డిటో.నెం.225) తరువాత క్రీ.శ. 8-1-1514న ఆతడు 200 గోవుల దానమును, వాని పాలనుండి మీగడను తీసి ప్రతిరాత్రి ప్రొద్దు పోకుండ నైవేద్యము చేయుటకై బహూకరించి, తన దాత భాగమైన మీగడ ప్రసాదాన్ని తన రామానుజకూటానికి పంపునట్లేర్పాటు చేశాడు. (నెం.88).

కౌండిన్యగోత్రుడు, ఆపస్తంబసూత్రుడు, మహీపాలకుల **కాలచ్చేరి** లేక **ఉత్తిరమేరూర్ వాస్తవ్యుడునైన కరవట్టుప్పిళియాళ్వార్ కుమారుడు అప్పాపిళ్ళై** తన స్వంత ఖర్చుమీద ఒక ఆలయ గ్రామంలో పంట కాల్వను త్రవ్వించి, దానివలన పెరిగిన ఫలసాయంనుండి వేంకటేశ్వరునికి నిత్యనైవేద్యం జరుగునట్లు క్రీ.శ.19-5-1506న ఒక ఒప్పందాన్ని వ్రాయించాడు. (డిటో.నెం.6); క్రీ.శ.30-12-1506 న గోవిందరాజునకు వానికి వైకాశి, ఆని నెలల్లో జరుగు రెండు బ్రహ్మోత్సవాలలోను 12 రోజులలో, ఇతర పండుగలలోను ప్రత్యేక దినాలలో (నెం.9) నైవేద్యాలకై 3180 నఙ్బణాలు చెల్లించెను; మరల క్రీ.శ.18-7-1506న 7800 నఙ్బణము చెల్లించి, **అన్న-ఊంజల్ తిరునాళ్ లేక డోలోత్సవాన్ని, వీరనరసింహ మహారాయుని క్షేమానికై, గోవిందరాజునకు ఎనిమిది రోజులపాటు అనేక నైవేద్యాలతో (సం.13) జరిపించునట్లు వ్యవస్థీకరించాడు.** క్రీ.శ.1509లో ఒక ఆలయాన్ని నిర్మించి, పవిత్రీకరించి, అందు హనుమాని ప్రతిష్ఠించి వాని నిత్యశాంతికై (నెం.17) యేర్పాటు చేసెను. చివరగా క్రీ.శ.7-4-1511న వీరకృష్ణరాయమహారాయని యోగక్షేమానికై **పడైవీడు రాజ్యంలోని వీరకంపనల్లూరు గ్రామాన్ని** దానం చేసి ఏడు బ్రహ్మోత్సవాలలో ప్రతియొక్క దానిలోను 12 రోజులు వేంకటేశ్వరునకు నైవేద్యాలు జరుగునట్లు యేర్పాటు చేసెను. వీనితోబాటు ప్రత్యేక నైవేద్యాలు కొన్ని రోజులలోను, తన జన్మనక్షత్రం వచ్చే పన్నెండు రోజులలోను, ప్రతి నెల, సంవత్సరమంతా తన మంటపంలో ఏడు రోజులును, మొత్తం 207 అతిరసపడికి ఏర్పాటు (నెం.18). అప్పాపిళ్ళై సోదరుడు మన్నార్‌పిళ్ళై క్రీ.శ. 27-6-1512న, తిరుపతిలోని తిరుమంగైయాళ్వార్‌కు నిత్యనైవేద్యానికి, తన జన్మనక్షత్రం నాడు గోవిందరాజుకును నైవేద్యానికై 1000 నఙ్బణం చెల్లించే యేర్పాటు చేశాడు. (నెం.23); మరల క్రీ.శ. 20-12-1512న 1200 నఙ్బణం చెల్లించి తిరుమలలోని ఉత్సవమూర్తులకు అధ్యయన దినోత్సవాలలో ఒకరోజున నైవేద్యాలకు యేర్పాటు చేసెను. (నెం.29); ఆతడు మరియు కొన్ని నైవేద్యాలకై 360 పణము చెల్లించాడు. (నెం.30) **ఎల్లప్ప నాయక్కర్** కుమారుడైన తిరుమలై నాయక్కర్ క్రీ.శ.1512లో గోవిందరాజు ప్రసన్నత కోసం ఒక పంట కాల్వను త్రవ్వించాడు. (నెం.27). **జిల్లేళ్ళ బసవ నాయక్కర్** కుమారుడును **గట్టికై దళవాయ్ దాది నాయక్కర్** మనుమడునైన **తమ్మునాయక్కర్** వేంకటేశ్వరునకు నిత్యనైవేద్యానికై క్రీ.శ. 30-12-1513న 1200 నఙ్బణాలు చెల్లించి, యేర్పాటు చేశాడు. (నెం.87)

**నారాయణ దేవర** అనే నామాంతరంగల **నారాయణయ్యన్,** తత్వాది తిమ్మణయ్యన్ కుమారుడు, గౌతమగోత్రుడు, ఆపస్తంబసూత్రుడు, **అగరంకంపసముద్రం వాస్తవ్యుడు,** క్రీ.శ.26-7-1514న, తనకు శ్రోత్రియ గ్రామాలుగా ఇవ్వబడిన సైనిక మొఖాసా భూముల్లో ఒకటియైన **తివలైపూండిని,** వేంకటేశ్వరునకు నిత్యం మూడు నైవేద్యము లర్పించడానికి ఆలయానికి దానం చేశాడు. (నెం.90); వేంకటేశ్వరునకు

నిత్యం మూడు హరివాణములు (పళ్లాల ఆహారం) సమర్పించడానికై, అదే తేదీన అలాంటిదే **గంగలపూండి గ్రామాన్ని** కూడా వ్రాసి ఇచ్చాడు. (నెం.91)

**కరణీక** (ఆదాయ వ్యయాలను వ్రాసేవాడు) **బసవరస,** గౌతమగోత్రుడూ ఆశ్వలాయనసూత్రుడూ అయిన **సోమరస** కుమారుడు, **తిరుప్పేరూర్ వాస్తవ్యుడు,** ఒక క్రొత్త కాలువను ఒక ఆలయ గ్రామంలో త్రవ్వి, దానివలన పండిన ధాన్యం ప్రోగుచేసి ఆలయధాన్యాగారంలో చేర్చునట్లేర్పాటు చేశాడు. ఆ పంట సందర్భంగా, కృష్ణరాయ మహారాయని క్షేమానికై, క్రీ.శ. 122-9-1515న, ఉత్సవమూర్తులకు, సేనై-**మొదలియార్‌కు** తన పూదోట లోని మంటపంలో పుణ్యస్నానాలతో వసంతోత్సవంలో 12వ రోజున ప్రత్యేక పూజానైవేద్యాలు నేర్పాటు చేశాడు. (నెం.105). మరియొక **కరణికుడును అట్టవణై** (పన్నులు వసూలుచేయు అధికారి) అయిన **బసవరస, చండికై హోబళదేవ లేక ఓబళదేవ (అహోబళదేవ) కుమారుడు,** కౌండిన్య గోత్రుడు, ఆశ్వలాయనసూత్రుడు, ఋక్‌శాఖా (ధ్యాయి), 6100 నఱ్ఱుణము చెల్లించి, వేంకటేశ్వరునకు చాంద్రమాన విషు సంవత్సరం శక సంవత్సరం 1443 (క్రీ.శ. 1521)న, భేటాణికై, మినపప్పు, గోధుమలు, జీలకఱ్ఱ, నెయ్యి కలిపి చేసిన ఒక విచిత్రమైన పద్ధార్థాన్ని నైవేద్యం చేయడానికి ఏర్పరచాడు. (నెం.148); మరల క్రీ.శ.21-9-1528న, 6640 నఱ్ఱుణాలు చెల్లించి వేంకటేశ్వరుని ఆలయంలోని తిరుమామణి మంటపంలో ఉత్సవమూర్తులకు స్నాన నైవేద్యాల కేర్పాటు చేశాడు. (నెం.177).

**ఊడియం ఎల్లప్ప నాయక్కర్,** గోవిందరాజులకు నిత్య నైవేద్యాలకు, కొన్ని రోజులలో 24 అతిరసపడి (నెం.106) కొరకును 4600 నఱ్ఱుణాలను చెల్లించి ఏర్పాటుచేశాడు; ఇది కాక **కఱ్ఱులైప్పట్టు, నెల్వాయ్, కొళ్ళిదూంబై** అను మూడు గ్రామాలను క్రీ.శ.2-6-1516న కృష్ణరాయ మహారాయల క్షేమానికై, వేంకటేశ్వరునకు ప్రతిరోజూ, 8 నైవేద్యాల నర్పించుటకు దానం చేశాడు. (నెం.109); మరల క్రీ.శ.29-3-1527న, తన దానంగా అతిరథం, సత్రాన్ని నిర్మించాడు. అతడప్పుడొక వాసల్ (ద్వారపాలకుడుగ) గా ఉండేవాడు. (నెం.168).

వశిష్ఠగోత్రుడు, ఆశ్వలాయనసూత్రుడు, **శివసముద్ర వాస్తవ్యుడు అయిన తిప్పరస కుమారుడైన త్ర్యంబకదేవుడు,** నిత్యం వేంకటేశ్వరునకొక నైవేద్యాన్ని 30 నాయక - **తళిగై** (విశిష్ట నైవేద్యం) మార్గళి నెలలో తిరుప్పళ్ళి-ఎళుచ్చి ముప్పై రోజులును; ఎనిమిది **నాయక-తళిగై** బ్రహ్మోత్సవంలో ఎనిమిది కళ్యాణోత్సవాల దినాలలో (అనగా ఐదు రోజులు); ఏడవ రోజులెనిమిదింటను; ఎనిమిదవ రోజు ఎనిమిది అతిరసపడి; రథోత్సవం మూడు రోజులలో మూడు అతిరసపడి; శ్రీజయంతి నాడొక నాయక-తళిగై; కార్తికై పండుగనాడొక అతిరసపడి; **పాడియవేట్టై** (పార్వేట) నాడొక అతిరసపడి (నెం.116) నైవేద్యానికై **మొరండై గ్రామాన్ని** క్రీ.శ.12-10-1517న దానం చేశాడు.

బాహూర్ మల్లరస, నాగరస కుమారుడు క్రీ.శ.14-10-1518న 360 నఱ్ఱుణము చెల్లించి, మలైకినియనిన్ఱ - పెరుమాళ్ ఉత్సవమూర్తిని వాని మంటపంలో, పూదోటలో ఎనిమిది బ్రహ్మోత్సవాలలోని

ఏడు రోజులును, గోవిందరాజుకు రెండు బ్రహ్మోత్సవాలలోని ఏడు రోజులును, మరి రెండు రోజులలోను ఒక ప్రత్యేకమైన పణ్యారాన్ని (శీద్రై) ఏర్పాటు చేశాడు. (నెం.127, నెం.1228, నెం.129).

భారద్వాజ గోత్రుడు, ఆశ్వలాయనసూత్రుడు, ఋక్‌శాఖి అయిన తిమ్మరసయ్యం గారి కుమారుడైన రాయసం (లేఖకుడు, కార్యదర్శి) **కొండమరసయ్య** క్రీ.శ. 17-4-1519 న ఉదయగిరి పరగణాలలోని నెల్లూరు సీమలోని **ములుంబూండి** గ్రామాన్ని వేంకటేశ్వరునకు నిత్యం 18 నైవేద్యములర్పించుటకై దానం చేశాడు. ఆ ప్రసాదాలలోని దాత భాగమైన నాలుగవ వంతును తిరుమలలోని తన సత్రానికి అందించేటట్లు ఏర్పాటు చేశాడు. (నెం.130, నెం.131).

**అడైప్పం** (ఆకు వక్కలు పట్టుకునేవాడు) **బైయప్పనాయకర్,** తిమ్మప్ప నాయకర్ కుమారుడు, కాశ్యపగోత్రుడు, క్రీ.శ.16-4-1519న వేంకటేశ్వరునకు నిత్యం 6 నైవేద్యాలను, కృష్ణరాయ మహారాయల తిమ్మనాయకర్ (బహుశః వాని తండ్రి తిమ్మప్ప నాయకర్) క్షేమానికై ఏర్పాటు చేశాడు. (నెం.135).

భారద్వాజగోత్రుడు **శంకరదాసు కుమారుడైన సుబుద్ధి రామదాసు** కాశ్యపగోత్రుడైన భీమయకుమారుడు **అంబికాముడు** (అమృత-) శలా, ఈ ఇద్దరును పూర్వము ప్రతాపరుద్ర గజపతిని సేవించినవారు. అతని ఓటమి తరువాత కృష్ణరాయడు కొలువులో చేర్చికొని వారికి మాన్యాలనిచ్చి, వారిని మొఖాసాదారులుగా చేశాడు. **రామదాస తండలం గ్రామమును, అంబికాముడశిలా తడపాళం గ్రామాన్ని** ఆలయానికి దానం చేసి, వేంకటేశ్వరునికి ప్రతిదినం 3 నేవేద్యాలను, 2 దీపాలను, 2 పూలదండలను సమర్పించేటట్లు యేర్పరచాడు. దాత భాగమైన ప్రసాదాన్ని పూదోటను సంరక్షించే రామానుజకూటం నిర్వాహకులకు అందించాడు ఏర్పాటు చేశాడు (నెం.147).

**పూతలపట్టు గ్రామమునకు చెందిన శూరప్పరెడ్డి తమ్మురెడ్డి కుమారుడైన శీనప్పరెడ్డి,** తక్కినవారూ పిళ్ళై తిరుప్పణి భండారత్తార్ (ఆలయపు ప్రజాకార్య సంఘం) తో క్రీ.శ.17-1-1527న ఒడంబడిక చేసికొని, మెట్ట, మాగాణి భూముల్ని సూర్యగ్రహణం రోజున కృష్ణదేవమహారాయని క్షేమానికై బహూకరించడంద్వారా వేంకటేశ్వరునకు నిత్య నైవేద్యానికి, ఎనిమిది అతిరసపడి, మలైకినియనిన్ఱ పెరుమాళ్‌కు ఎనిమిది బ్రహ్మోత్సవాలలో ప్రతి దానిలోని ఏడవ ఉత్సవంనాడు ఆ దేవుని మంటపంలోను, మరి రెండు సందర్భాలలో మరి రెండున్ను ఏర్పాటు చేశాడు. ఈ ఒడంబడిక చేసిన సంఘం, దాతయొక్క తిరుమల పూదోటను పరిరక్షించినవారు, వారికి దాత భాగమైన ప్రసాదాన్ని అందించునట్లు ఏర్పాటు చేశాడు (నెం.167).

శకసంవత్సరం 1449, చాంద్రమాన సర్వధారిలో (క్రీ.శ.1527) బాగిల (ద్వారపాలకుడు)... పతి ఆడియప్ప మరియు... అయ్యదేవ అనువారు ఒక మఠాన్ని, ఒక మంటపాన్ని నిర్మించిరి. (నెం.169).

క్రీ.శ.7-8-1512న **బాగిల అవసరద నరసయ్య,** వాని సోదరుడు అవసరద **తిమ్మయ్య (వాకిటి కావలి తిమ్మన),** వాని సోదరుడు **నరసయ్య,** వారి తల్లి బసవమ్మ తిరువేంగళనాథదేవ ఆలయంలో

అనంత శరణ్యం అర్పించినట్లు వ్రాయబడింది. (నెం.26). వారు మహారాజుగారి భవనం ముందు వాకిట ఆజ్ఞలకై వేచియుండేవారు.

**కందనవోలుక్కరాజ ఓబయ్యన్ కుమారుడు ఓబళయ్యన్** క్రీ.శ. 31–10–1517న 1860 నఖ్ఖణము చెల్లించి, వేంకటేశ్వరునకు ఒక నైవేద్యం ప్రతిరోజును, ఎనిమిది అప్పపడి బ్రహ్మోత్సవాలలో శేషవాహనం రోజున, మరియొక రోజు మరియొకటి అర్పించునట్లు ఏర్పరచాడు (నెం.120).

నెడుంగన్‌రాంకు చెందిన పెరుమాళ్ 1500 నఖ్ఖణాలు చెల్లించి వేంకటేశ్వరునికి, చాంద్రమాన సర్వధారినామ సంవత్సరానికి సరియైన శక సంవత్సరం 1450లో (క్రీ.శ.1528) లో, ఒక నిత్య నైవేద్యం ఏర్పాటు చేశాడు. అప్పుడు శ్రీకృష్ణరాయ మహారాయలు పాలిస్తుండేవాడు (నెం.180).

విజయనగరంలో కృష్ణరాయల రాజమహలుకు సంబంధించిన నాట్యశాలకు సంగతమైన **రంజకం శ్రీరంగరాజు రంజకం తిరుమలనాథుని కుమారుడు. ఆతడు ఇఱలప్పూండి గ్రామమును** ఆలయానికి క్రీ.శ. 29–12–1514నన దానం చేశాడు. దీనివలన వేంకటేశ్వరునికి నిత్యనైవేద్యం కలుగవలెనని ఏర్పాటు. ఆతడట్లే 545 తులాల వెండి పళ్ళెరాన్ని (బహుశః) నైవేద్యం నుంచుటకు బహూకరించాడు. (నెం.99, నెం.100). **'రంజకంకుప్పాయి'** అనే పేరు గల అతని కుమార్తె 1000 నఖ్ఖణాలు క్రీ.శ. 27–6–1512న చెల్లించి, వేంకటేశ్వరునకు నిత్యనైవేద్యం అర్పించి, దాతభాగమైన నాల్గవవంతు ప్రసాదం ఆలయ ధనాగారమునకు చెందేటట్లు వ్రాసియున్న పూదోటను పోషించే వ్యక్తికి అందునట్లు ఏర్పాటు చేశాడు (నెం.24). క్రీ.శ.122–10– 1517న ఈ **కుప్పాయి అనే పేరుగల కుమార్తె తిరుమల – అమ్మన్** 3000 పణాలు చెల్లించి, నిత్యం వేంకటేశ్వరునికి దోశై నివేదించడానికి ఏర్పాటు చేసింది. (నెం.117), (దేవ.ఎపి. రిపో.పే.185, 205 కూడ.) **నల్లగంగమ్మ కూతురు పేరు ఎక్కడి తిమ్మమ్మ** క్రీ.శ. 4–10–1518న 1500) పణాలు చెల్లించి, వేంకటేశునికి కృష్ణరాయని క్షేమానికై (నెం.124) నిత్యనైవేద్యం నేర్పరచాడు. బహుశః ఆమెకూడ రాజభవనానికి సంబంధించిననాట్యగత్తెలలో నొకరు కావచ్చు.

ప్రభువులు సేవకులు కాక, కొందరు మతధార్మికపరులు, వర్తకులు, తదితరులు కూడా ఆ దేవతామూర్తుల, ఆళ్వారుల నైవేద్యాలకు ఏర్పాటు చేశారు.

**కృష్ణరాయల పురోహితుడును, ఎన్నో యజ్ఞాలు చేసినవాడును, అయిన రంగదీక్షితుల కుమారుడైన యజ్ఞనారాయణభట్టు** క్రీ.శ.10–7– 1514న 1000 నఖ్ఖణాలు చెల్లించి, తాను చక్రవర్తితో అతని నాల్గవయాత్రలో క్రీ.శ.6–7–1514న కలిసి తిరుమలను దర్శించినప్పుడు, వేంకటేశ్వరునికి ఎనిమిది నిత్యనైవేద్యాలు సమర్పించేటట్లు ఏర్పరచాడు. (నెం.89). మరల క్రీ.శ.9–3–1522న 1850 నఖ్ఖణాలు చెల్లించి వేంకటేశ్వరునికి తన తండ్రియైన రంగనాథదీక్షితర్ జన్మనక్షత్రమైన పునర్వసు నక్షత్రం సంవత్సరంలో వచ్చు 13 తిథులలోను, ప్రతి తమిళమాసపు మొదటి రోజున, ప్రతి అమావాస్యనాడు (నెం.152) ప్రత్యేక పూజానైవేద్యాలను ఏర్పాటు చేశాడు (సం.2, నెం.129).

తిరుచ్చుకనూరు (తిరుచానూరు) లో నివాసముండేవారు వివిధ గోత్రాలకు చెందిన 108 మంది కుటుంబాలని ఊహ. ఈ 108 వ్యక్తులును గ్రామసభ లేక పరిపాలనా సమితిగా, వారిలో నొకరు ఎన్నుకొనబడిన అధ్యక్షుడుగా ఉండేవాడు. క్రీ.శ. 6-11-1494న ఈ సభలోని సభ్యులు కొందరు, శ్రీ వేంకటేశ్వరునకు, శ్రీ గోవిందరాజునకు సాళువ నరసింహుని కాలంలో, ఏర్పరచిన నైవేద్యాలలో, ఈ సేవకు నూట్రెన్మార్ ఉభయం, అనగా 108 మంది ఉభయం అనియు, నూట్రెన్మార్ తిరువోలక్కం, 108 మంది చేసిన నైవేద్యాలు ఆస్థానంలో పంచడానికై గుర్తించబడింది. వారికొక **నూట్రెన్మార్-మఠం** కూడ ఉంది. అదియే వారి మఠపెద్దయైన **తూప్పిల్ వెన్టి-అణ్ణన్ వరదరాజర్** నివాసం నెం.144, నం.3 ఇలా వ్రాయబడింది: శుకమహర్షి దయవలన 108 మంది పుణ్యాత్ములు పండితులునైన బ్రాహ్మణులు పద్మంనుండి జన్మించిరి, వారు శుకగ్రామవాసులైరి. **(శుకనూర్, తిరుశుకనూర్, తిరుచ్చుకనూర్);** వారు శ్రీవేంకటేశునికి గరుడుని వంటి భక్తులు. ఒకప్పుడు శ్రీనివాసుడనే ఒక వ్యక్తి ఆ గ్రామానికి వచ్చి, వేంకటేశ్వరునికి ఉత్సవం జరుపుట కేర్పాటు చేశాడు; పద్మతీర్థానికి అన్ని ప్రక్కల మెట్లు యేర్పరచాడు; స్వామి నారాయణుడు ఊరేగింపు బయలు దేరినపుడు మానవులా వాహనాలను మోయవలసి ఉంటుంది.

పూర్వకాలంలో, శుకనూర్ సభైయార్(సభాపతి) తిరుమలపై వేంకటేశ్వరునికి సంబంధించిన అన్ని లావాదేవీలను నిర్వహించాడు. ఆలయంలో కార్యనిర్వాహక సమితి ఒక 12 మందితో ఏర్పరచేటప్పుడు కూడ **తిరుచ్చుకనూర్సభ,** స్థానత్తార్‌కు ముగ్గురు సభ్యుల ప్రాతినిధ్యం ఉండేది. తిరుపతి శ్రీవైష్ణవులు నలుగురు, ఇద్దరు జీయర్‌లు లేక మఠాధిపతులు, ఒక నంబి లేక అర్చకుడు, ఇద్దరు లెక్కలు చూచువారు (తిరునిన్టఊర్, ఇప్పటి తిన్ననూర్, మద్రాసు దగ్గర, అక్కడి అసలు గ్రామస్థులు), వీరు మిగత నియమితులైన స్థానత్తార్ సభ్యులు (సం.1, నెం.187), వేంకటేశ్వరుని తిరుమల దేవళము, తిరుపతిలోని గోవిందరాజు దేవళంలో కూడ ఈ స్థానత్తార్ సర్వవిషయాలను నిర్వహించాడు.

వీరి నియామకాలు గౌరవ నియామకాలు, కాని వారు ఆలయాలలో దేవతామూర్తులకు నివేదించిన ప్రసాదంలో భాగాన్ని స్వీకరించడానికి అర్హులే. ఇదియే పారితోషికం, వారి జీవిక. 13వ శతాబ్దివరకు ఈ కొద్దిపాటి ప్రసాదంతో వారికి జీవితం దుర్భరమై ఉండేది; కాని ఆ తర్వాత ప్రసాద నివేదనలు పెరుగుతూ పోయే కొలది, భక్తులు వివిధాలైన రుచికర పదార్థాలను సమర్పిస్తూ ఉండగా, వారి పారితోషికం ప్రమాణంలో వృద్ధియై, దానినంతను తామే భుజించలేనంతగా పెరిగి, ఆ కారణంగా, వారి భాగంగా వచ్చిన ప్రసాదంలో కొంత పెద్దమొత్తం ధనానికి బాడుగకు ఒప్పందం కుదుర్చుకోవడం ప్రారంభమైంది. ప్రసాదానికి తోడు, ఉత్సవాలలో వారి సేవలకై బహుమతులుగా చిన్న చిన్న మొత్తాల ధనాన్ని స్వీకరించే వారు.

అట్టి పారితోషికాలను గోవిందరాజు ఆలయధనంగా నర్పించి క్రీ.శ. 23-1-1512న, తిరుచ్చుకనూర్ సభైయార్ అందరును కూడి గోవిందరాజుకు, **కరుణాకర - పళ్ళికొండ - పెరుమాళ్‌కు (దయగల శయనించిన దేవుడు),** శ్రీకృష్ణునికి, శ్రీరామునికి ప్రతిదినం, వారు ప్రతిష్ఠించిన హనుమాన్‌కు ప్రతి శనివారమూ, మరికొన్ని రోజులలో వారికిన్నీ వేంకటేశ్వరునకున్ను, 40 నైవేద్యాల కేర్పాటు చేశారు. ఆలయంలోని పనివారికి కొంతధనం చెల్లింపులు, ప్రసాదం కూడ యేర్పరచారు (సం.3, నెం.20).

సభైయార్‌లో ఒకరైన దేవ్యత్తాన్- అరశు, క్రీ.శ.20-11-1516న, 310 నాఱ్పణము చెల్లించి మలయప్పకు పూదోటలోని మంటపంలో పురట్టాశి, తై, పంగుని బ్రహ్మోత్సవాలలో ఏడవ రోజులలోను, ఎనిమిదవ రోజులలో రథముపైనను, ఈ పై జెప్పిన మూడు ఉత్సవాలలో ప్రత్యేక నైవేద్యానికి కేర్పాటు చేశాడు (నెం.113).

తిరుచ్చుకనూర్ సభలో సభ్యుడైన **శ్రీరామయ్యర్** 300 నాఱ్పణము క్రీ.శ. 20-9-1527న చెల్లించి మలయప్పకు శేషవాహనం రోజున 8 బ్రహ్మోత్సవములలో తన మంటపం వద్ద 8 దోశై-పడి, శ్రీకృష్ణునకు వానిలోని ఐదవ రోజులలో ఎనిమిదవ పడి; వానిలో మూడింట[1] మూడవ పడి రథంపై ఒకటి ముక్కోటి ద్వాదశినాడు, ఒకటి డోలోత్సవంనాడు, మరియొకటి పార్వేటనాడు, ఒకటి కార్తికై దీపోత్సవంనాడు, ఒకటి ఉగాదినాడు, ఒకటి దీపావళినాడు, మొత్తము 25 దోశైపడి (నెం.172) నైవేద్యం నేర్పరచాడు.

అనుసంధానం తిరువేంకట జీయర్ 2000 పణాలు క్రీ.శ.19-9- 1504న చెల్లించి వేంకటేశ్వర గోవిందరాజులిద్దరకు నైవేద్యాలు ఏర్పాటు చేశాడు. (నెం.2).

**శ్రీవణ్-శఠకోపజీయర్** శిష్యుడైన **శ్రీమన్నారాయణ జీయర్, అహోబిల మఠాధిపతి,** వేంకటేశ్వరునకొక ప్రత్యేక దినంలోను, గోవిందరాజునకు స్వామి బ్రహ్మోత్సవాలు రెండిట ఒక్కొక్క రోజుగాను, ఇతర దినములలో నమ్మాళ్వార్, తిరుమంగైయాళ్వార్, కులశేఖరాళ్వార్, ఉడైయవర్ (శ్రీరామానుజ) ప్రత్యేక దినాలైన వారి అధ్యయనోత్సవాల లోను నైవేద్యాలకు 1860 నఱ్పణాలు క్రీ.శ.20-8-1516న చెల్లించి ఏర్పాటు చేశాడు. (నెం.110) మరియొక 3800 నఱ్పణాలు నాతడు క్రీ.శ.7-11-1516న చెల్లించి, గోవిందరాజుకు ప్రతీదినంలో ఒక దోశైపడి, ఒకప్రత్యేక దినంలో వేంకటేశ్వరునకు ప్రత్యేక నైవేద్యాలను ఏర్పాటు చేశాడు.(నెం.114). ఈ లేఖనంలో శ్రీమన్నారాయణ జీయర్ **"వేదాంతాచార్య"** బిరుదమునకర్హుడని వ్రాయబడింది.

'వేదాంతాచార్య' బిరుదాంకితుడు, **వెళ్‌మాలైయిట్టపెరుమాళ్** కుమారుడు నైన **కందాడై దొడ్డైయంగార్,** క్రీ.శ.13-4-1519న, 2520 నఱ్పణము చెల్లించి, **మలైకునియనిన్ఱ పెరుమాళ్**కు శ్రీ వరాహస్వామి ఆలయంవద్ద ఎనిమిది బ్రహ్మోత్సవములలోను ఒక్కొక్క దానిలో అయిదు రోజుల చొప్పున, రోజుకు ఒక్క నైవేద్యం చొప్పున నలభై నైవేద్యాలను ఏర్పరచాడు; రథోత్సవం మూడు రోజులలో, మరియొక రోజున్ను మూలమూర్తి వేంకటేశ్వరునికి, పెరియ పెరుమాళ్‌కు; కృష్ణరాయ మహారాయలు తై మాసంలో ప్రారంభించిన బ్రహ్మోత్సవంలో 6వ రోజు డోలపై; అందు [2] ఏడవ రోజు రథంపై; తొమ్మిదవ రోజు తీర్థవారి సందర్భంలో; పదవ రోజున్ను; విడాయాట్టిరోజున్ను; ఇతర దినాలలోను; గోవిందరాజుకు ఆని ఉత్సవంలో రథంపై;

---

1. గడచిన రోజులలో పురట్టాశి, పంగుని బ్రహ్మోత్సవములలో మాత్రమే రెండు రథోత్సవములు మిగత 5 నెలలో లేవు. కృష్ణరాయలు తై మాసములోనొక బ్రహ్మోత్సవము నేర్పరచుటతో ఎనిమిది రథోత్సవములు మూడైనాయి.

2. ఈ శాసనములో రథోత్సవము 7వ నాడనియున్నది. కాని అది 8వ నాడు జరుగుట సాధారణము. విడయాట్టి కూడ 8వ నాడే జరుగును. శాసనము చెక్కునప్పుడు పొరబాటు దొర్లియుండును.

ఆళ్వారు ఆలయ సమీపంలో మంటపం వద్ద **తణ్ణీర్ అముదు** మార్గాన్ని శుభ్రం చేసే రోజున; తదితర సందర్భాలలోను (నెం. 142) ఈ యేర్పాటు. ఈ మాధవయ్యంగార్, కందాడై రామానుజయ్యంగార్ తరువాత రామానుజ కూటాల నిర్వాహకుడిగా తిరుపతి **కూఱు-శెయ్‌వార్‌గళ్** పక్షంలో క్రీ.శ.2-4-1522న ఒక ఒడంబడికను వ్రాసి ఇచ్చాడు. దీని ప్రకారం రామానుజ కూటాల యజమానులు, పూర్వం ఈ భోజన సంస్థలకు ఈ పేర్కొనబడిన అధికారులచే భూములు దానంగా ఇవ్వబడిన దాని బదులుగా, ఆ దానభూముల ఆదాయం ఉపయోగించి ప్రతి సంవత్సరం దేవతలకు మూడు అప్పపడి నివేదించడం నియమంగా చేయబడింది. (నెం. 153).

క్రీ.శ. 19-9-1508న, నరసింహరాయ ముదలియార్ రామయ్యన్, తిమ్మయ్యన్, ఇద్దరూ కలిసి 1900 నఱ్ఱుణాలు మూలధనంగా నిక్షేపించారు. దీనిపై వచ్చే వడ్డీతో, ఆలయంలో తిరుమామణి మంటపంలో వేంచేసిన మలయప్ప ఉత్సవమూర్తికి, ఏడు అతిరసపడిలో స్వామి తిరువనంతాళ్ (శేష) పై ఊరేగి మరలివచ్చిన తరువాత, తొమ్మిదవ ఉత్సవదినంలో **తిరుక్కొడి తిరునాళ్** (బ్రహ్మోత్సవం) ప్రతి సంవత్సరం వేంకటేశ్వరునికి జరుపు యేడింటిలోను; **తిరువాళి ఆళ్వాన్** (సుదర్శన చక్రం) కు మలయప్పన్‌కున్ను పుష్కరిణి (**తిరుక్కోనేరి**) తీరంలో వారు నిర్మించిన మంటపం వద్ద, పుణ్యస్నానాంతరం సాగునపుడు తీర్థవారిమంటపం నొద్ద ఆ ఉత్సవాల తొమ్మిదవ రోజులలో ఏడు అతిరసపడిని; మరియొక ఏడు అతిరసపడిని ఆలయపదార్థ భండారం ఎదురుగా ఏడు ఉత్సవాల కాలంలోను; నాలుగు అతిరసపడిని పవిత్రోత్సవం మొదటి నాలుగురోజులున్ను; ఒక అతిరసపడి మార్గళిలోని ముక్కోటి ద్వాదశినాడు **వేంకటత్తురైవర్** (ఉగ్ర శ్రీనివాస) కు; ఒక అతిరసపడి మూలవిరాట్ వేంకటేశ్వరునికి; ఒక తిరువోలక్కం సేనైమొదలియార్‌కు అతని జన్మనక్షత్రం **పూరాడమ్** నాడు అర్పశి నెలలోను, ఒక అప్పపడి మొదట వేంకటేశునికి నివేదించి ఆ తరువాత తిరుపతికి తెచ్చి **సేనైమొదలియార్** కున్ను; తిరుపతిలో రెండు ఉత్సవాలలో గరుడుని పతాకానికి నివేదనాన్ని, మరిఇతర దినములలో గోవిందరాజుకు, **రఘునాథునకున్ను** (నెం. 15) నైవేద్యాలకై యేర్పరచాడు.

**ఉద్దండరాయర్ ఉలగప్ప, తిరుపతి శ్రీవైష్ణవులలో నొకరు,** ఒక అతిరసపడిని 7 బ్రహ్మోత్సవాలలోని యేడు యేడవరోజులలో తిరుమల లోని ఆ దేవుని మంటపంలో **మలయప్పకు; ఉగాది రోజులలోను దీపావళి రోజులలోను** సేనై-ముదలియార్ (విష్వక్సేనునికి) కు నైవేద్యం సమర్పించ-దానికై క్రీ.శ.12-10-1506న 680 నఱ్ఱుణం నిధినేర్పరచెను. తిరుపతిలోని గోవిందరాజుకు కూడా ప్రత్యేక దినాలలో (నెం. 8) నైవేద్యానికై కూడ వేంకటేశ్వరునికి నిత్యనైవేద్యానికి, మలయప్పకు ఏడు బ్రహ్మోత్సవాలలో తొమ్మిదవ రోజులలోను, గోవిందరాజుకి, తిరుపతిలోని శ్రీరామునికి కొన్ని ప్రత్యేక దినాలలోను నైవేద్యానికై 2075 నఱ్ఱుణం క్రీ.శ.19-9-1508 న చెల్లించెను (నెం. 14) ఈ మధ్యకాలంలోనాతడు 1320 నఱ్ఱుణాలు క్రీ.శ.2-6-1507 చెల్లించి, వేంకటేశ్వరునకు నిత్యనైవేద్యం, తిరుపతిలోని శ్రీరామునికి, శ్రీ సుదర్శనునికి ప్రత్యేక దినాలలోను నైవేద్యం నేర్పరచాడు. (నెం. 10).

తిరుపతిలోని వైశ్యులు కొందరు పెద్దమొత్తాలను ఆలయానికి వివిధ నైవేద్యాలను వివిధ సందర్భాలలో దేవతామూర్తులకర్పించడానికై చెల్లించిరి. **ధర్మపురం శిట్టము శెట్టి** క్రీ.శ. 1-3-1506న 3500 నఱ్ఱుణాలు

చెల్లించి, వేంకటేశ్వరునికి పులుగుకాప్పుతో స్నానానంతరం, నామాన్ని తీర్చడానికి మంచి కర్పూరాన్ని, కస్తూరిని సరఫరా చేయడానికి, **అలర్‌మేల్– మంగై– నాచ్చియార్‌కు (వక్షస్థలలక్ష్మి)** కూడా పునుగునలందిన పిదప స్నానం చేసిన తరువాత నైవేద్యాలకై ఒక నాయక తళిగైయును, ఒక అప్పపడియును ఏర్పాటు చేశాడు. (నెం.4). ఆ తర్వాతి కాలంలో ఆలయానికి చెందిన తిరుమనేరి గ్రామంలో ఒక పంటకాల్వను త్రవ్వించాడు. ఉత్సవాలలో ప్రత్యేక దినాలలో వేంకటేశ్వరునికి, గోవిందరాజుకు, శ్రీకృష్ణునికి, సుదర్శనునికి, శ్రీరామునికి వేర్వేరు సందర్భాలలో నైవేద్యానికై 14,590 నఖ్ఖణాలు చెల్లించాడు (నెం.118).

**తిప్పుశెట్టి** క్రీ.శ.4–10–1507న 8305 పణాలు చెల్లించి, మలయప్ప, గోవిందరాజు, రఘునాథుడు, కులశేఖరాళ్వార్, నమ్మాళ్వార్, తిరుమంగై యాళ్వార్, ఉడైయవర్ (శ్రీరామానుజులు), **నరసింహస్వాములకు** సూచింప బడిన తేదీలలో నైవేద్యాలు ఏర్పరచాడు (నెం.11).

**పచ్చై లింగుశెట్టి,** మరికొందరు వైశ్యవర్ణానికి చెందిన కోమటివారు క్రీ.శ. 31–10–1508న 5030 నఖ్ఖణాలు చెల్లించి, **వేంకటేశునికి ఒక నిత్యనైవేద్యం;** మలయప్పకు ఏడు ఉత్సవాలలో ప్రతిదానిలో ఏడవ రోజునను, అధ్యయనోత్సవంలో ఒక ప్రత్యేకదినంలో మలయప్పకు కోమటిపీఠం దగ్గరా; సేనై–ముదలియార్‌కు వేర్వేరు దినాలలోను; **తిరుపతిలోని రఘునాథునకు** అధ్యయనోత్సవం ఏడవ రోజులో; నైవేద్యాలు ఏర్పరచాడు (నెం.16).

**పప్పుశెట్టి అయ్యన్** క్రీ.శ.15–9–1512న, 2500 నఖ్ఖణాలు చెల్లించి, తన జన్మనక్షత్రం వచ్చే 13 రోజులు, తన తండ్రి జన్మనక్షత్రం వచ్చే పదమూడు తిథులలోను, తన తల్లి జన్మ నక్షత్రం వచ్చే తేదీలు 13నను, వేంకటేశ్వరునికి నైవేద్యాలను; గోవిందరాజుకు ప్రత్యేక నైవేద్యాలు వైకాశి, ఆని మాసాలలోని రెండు ఉత్సవాలలోను ఒక ప్రత్యేక దినానికి; శ్రీనివాసపురంలోని నరసింహ స్వామి ఆలయంవద్దగల కృష్ణునకు బ్రహ్మోత్సవాలు రెండింటను రెండు రోజులు; వసంతోత్సవం ఏడవ రోజున ప్రతి సంవత్సరం, గోవిందరాజుకు ఆరవ రోజులలోను, వైకాశి, ఆని ఉత్సవాలలో తొమ్మిదవ రోజున శేషవాహనం నాడున్ను; తిరువధ్యయనం నమ్మాళ్వార్, తిరుమంగైయాళ్వార్‌లకు జరిపే ప్రత్యేక దినాలకు, ప్రత్యేక దినాలలో **రఘునాథ ఉడైయవర్**లకున్ను నైవేద్యాల ఏర్పాటు చేశాడు (నెం.28).

**కొండుశెట్టి,** తనకు కృష్ణరాయచక్రవర్తి, తాను చేసిన కొన్ని సేవలకై అంబలికగా నిచ్చిన **చింతయపల్లి గ్రామం**లోని సగభాగం, మిగత సగభాగం **శ్రీ కాళహస్తీశ్వరునికి** క్రీ.శ.27–11–1517న దానం చేయబడి ఉండగా, వేంకటేశ్వరునకు రెండున్ను, గోవిందరాజు కొకటి దధ్యోదనంనైవేద్యములను; వేరు సందర్భంలో వేరుగా గోవిందరాజులకై నైవేద్యాలకు, వ్రాసి ఇచ్చాడు. (నెం.119)

**శరణుశెట్టి** క్రీ.శ.16–8–1527న, వేంకటేశ్వరునికి నిత్యం ఒక నువ్వులపొడి కలిపిన నైవేద్యం; వానికి జరుగు ఎనిమిది బ్రహ్మోత్సవాలలో ఏడవ రోజులలో ఎనిమిది సీదైపడి; **మార్గళిలోని తిరువ్వళ్ళి–ఎళుచ్చి** ముప్పై రోజులు ముప్పై నైవేద్యాలు; గోవిందరాజుకు ఏడవ ఉత్సవ దినాలలో ప్రత్యేక నైవేద్యాలు, ఎనిమిదవ ఉత్సవ దినాలలో బ్రహ్మోత్సవాలలో, వైకాశి, ఆని మాసాలలో రథంపైనను; ఇతర దినాలలోను; శ్రీరామునికి ఒక ప్రత్యేక దినంలో ఒక **సీదైపడి** నైవేద్యం ఏర్పరచాడు (నెం.171).

కొద్దిమంది ఆలయపు లెక్కలు వ్రాయువారు కూడ దేవతా మూర్తులకు నైవేద్యాలేర్పరచారు కాని, అవి చాల చిన్న విషయాలు.

వారిలో విల్లియార్ డెబ్బై నఱ్ఱణాలు క్రీ.శ.2-1-1530న చెల్లించి, **మార్గళి- నీరాట్టోత్సవానికి శూడిక్కుడుత్తనాచ్చియార్** (శ్రీ ఆండాళ్, గోదాదేవి, పండ్రెండుగురు వైష్ణవ-ఆళ్వారులలో ఒకరైన స్త్రీ-ఆళ్వార్, పెరియాళ్వార్ కుమార్తె) కు 24వ రోజైన మార్గళి నుండి ఏడురోజులు, మకరసంక్రమణం రోజువరకు (దాదాపు జనవరి 15), 23వ రోజు రాత్రి అంకురార్పణతో, అధివాస తిరుమంజనంతో, చివరి కనుమ రోజున వేరొక తిరుమంజనంతో, గోవిందపుష్కరిణి (లేక కృష్ణరాయకోనేరి నెం.194 లో నమోదైనట్లు) తీరంలో నిర్మించిన మంటపంలో వ్యవస్థీకరించాడు. (నెం.181). ఆమె ఆలయం చిన్న గది, గోవిందరాజు ఆలయ ముఖమంటపం దక్షిణపు మూల ఉంది. గోవింద పుష్కరిణి అనేది, ఇప్పుడు గోవిందరాజు ఆలయం ఎదురుగా ఉండే చెరువు కావచ్చు. ఇది దేవస్థానం సత్రానికి పడమట ఉంది. ఆలయ విచారణకర్తచే ఇది పునర్నిర్మితమైంది. వారి పేరు కీ.శే. **శ్రీమహంత్ ప్రయాగదాసజీ.** అంతకు ముందరక్కడ పెద్ద గుంటవంటి ఖాళీ స్థలముండేది. ఊతిమెట్లు చాలాకాలము క్రిందటే పడిపోయినాయి. ఆండాళ్‌వారి ఉత్సవం ఈ గోవింద పుష్కరిణి చెంతనే, అది శిథిలమయ్యేంతవరకు, జరిగి ఉంటుంది. ఆ తరువాత శ్రీరామ ఆలయానికి పడమట, తిరుపతి ఉత్తర భాగంలో, తాపీపని మంటపం వద్దకు మారి ఉంటుది. **నేటి రోజులలో ఉదయమే ఈ మంటపానికి ఆండాళ్ ఊరేగింపుగా కొనిరాబడి, ఆ రోజంతా అచటనే ఉండి, శ్రీరంగవాసుడగు శ్రీరంగనాథుని, తనను భార్యగా స్వీకరించుటకు ప్రార్థిస్తుంది.** తిరుపతిలోని శ్రీ గోవిందరాజు వలెనే శయనించి ఉంటాడు. తరువాత ఆమె మరల సాయంత్రంలో ఆలయానికి తీసికొని పోబడుతుంది. భోగి పండుగనాడు, సంక్రాంతికి ముందురోజున, ఆమె ఊరేగింపుగా పురవీధులలో త్రిప్పబడుతుంది. ప్రతిరోజున్నూ శ్రీరాముని, గోవిందరాజును, ఆలయాలలో మంటపం వద్ద ఆమెకు నైవేద్యం అర్పింపబడుతుంది. కనుమరోజు సంక్రమణం తరువాతిరోజు, ఆమెకు గోవిందరాజుతో కళ్యాణం జరుపబడుతుంది.

ఈ రీతిగా కృష్ణరాయని కాలంలో ఏడు వేర్వేరు నెలలలో శ్రీవేంకటేశ్వరునికి జరుపబడిన బ్రహ్మోత్సవాలకు, తై మాసంలో చక్రవర్తియే ప్రారంభించిన మరియొకటి కలిసి, మొత్తం సంవత్సరంలో ఎనిమిది అయినాయి. మిగత ఉత్సవాలు మార్పు లేక అట్లే ఉన్నాయి. నిత్యనైవేద్యాల విషయంలో మాత్రం, వివిధ ఉత్సవాలలోను, తదితర పుణ్య, శుభ తిథులలోను ఎందరో భక్తులచే వైభవోపేతమైన ఏర్పాట్లు చేయబడినాయి. ఇవి ముందున్న వానితో చేరాయి. ఇక చివరగా మార్గళినీరాడ-తిరుక్కళ్యాణం, శ్రీవిల్లిపుత్తూర్‌లో తను కన్యగా నుండగా ముందుగా తానలంకరించుకొన్న పూవులను తరువాత ఆ స్వామికి సమర్పించిన ఆండాళ్, శూడిక్కొడుత్తనాచ్చియార్, కళ్యాణం ఒక ఆలయ లెక్కలు వ్రాయునతడు వ్యవస్థీకరించాడు, ఆలయంయొక్క భూ సంపద కృష్ణరాయలును అధికారులు కొందరును దానం చేసిన భూములతో చేరి వృద్ధి చెందింది. వేంకటేశ్వరునికి గాని గోవిందరాజునికి గాని నిత్యం ఒక తిరుప్పోనకం సమర్పించడానికి తగినంత వడ్డీ వచ్చే మొత్తం 1500 నఱ్ఱణాలకు పెరిగింది, పూర్వము అది 1000 నఱ్ఱణాలుగా ఉండేది.

* * *

# అధ్యాయం-20

## చక్రవర్తి అచ్యుతరాయల కాలం

## విజయనగర కాలము-3

**వీరనరసింహరాయలకు, కృష్ణదేవరాయలకు సవతి తమ్ముడైన అచ్యుత రాయలు విజయనగర సింహాసనానికి కృష్ణరాయల వారసుడయ్యాడు. అతని తండ్రి తుళువ నరసనాయకునకు నలుగురు కుమారులు, తిప్పాజీ లేక తిమ్మాంబవలన వీరనర సింహుడును; నాగలాంబ వలన కృష్ణరాయడును; ఓబాంబవలన లేక ఓబచ్చియమ్మ వలన అచ్యుతరాయ, రంగరాయలును కలిగారు.** రంగరాయడు పిన్నవయసుననే మరణించాడు. వాని కుమారుడు సదాశివరాయడు అచ్యుతరాయల తరువాత విజయనగర సామ్రాజ్యాన్ని పాలించాడు.

**నూనిజ్** లేఖనం ప్రకారం "కృష్ణరావ్ (కృష్ణరాయ) రాజుగా చేయబడిన వెంటనే, రాజ్యంలో అందరూ వానికి విధేయులైన వెంటనే, **సాల్వతిని (సాళువ తిమ్మ),** వాని సోదరుడు బుస్‌బల్రాన్ (భుజ బలరాయలు), నామాంతరంతో వీరనరసింహరాయల లాగా, అతనికిని మంత్రియై ఉండి, ఆలస్యం చేయక, వాని సోదరుడైన **బుస్‌బల్రావ్** కుమారుని, వాని ముగ్గురు సోదరులతో సహ **చావోదిగరి (చంద్రగిరి, తిరుపతి వద్ద)** కోటకు పంపాడు; ఆతడు మరణించేదాకా అక్కడే ఉండినాడు (సెవెల్ రచన, **"ఒక విస్మృత సామ్రాజ్యము"** పే.315-316).

(**నూనిజ్** ప్రకారం రాజు **'నరసిమ'** (తుళువ నరసనాయక) "అయిదుగురు కుమారుల తండ్రిగా మరణించెను, ఒకడు **బుస్బల్రావ్,** రెండవాడు **క్రిస్నరావ్,** మరియొకడు **తెతరావ్,** ఇంకొకడు **రమిగుప,** చివరివాడు **ఔమిస్యుద్య**" (డిటో, పే.314) నరసనాయకుని కుమారులు నలుగురు మాత్రమే, తెలిసిన మేరకు, నూనిజ్ వ్రాసినట్లు అయిదుగురు కాదు; చివరి మూడు పేర్లను గుర్తించడం అసాధ్యం. మరల నూనిజ్ ఇట్లుంటాడు; కృష్ణరాయలు తన అనారోగ్యం వలన మరణించడానికి పూర్వం" అతడు తన ముగ్గురు సోదరులలో, ఎవరు తన పట్టాభిషేకం సమయంలో **చందిగిరి (చంద్రగిరి)** కోటకు బందీలుగా పంపబడ్డారో, వారితో పంపబడిన తన మారుతల్లి కుమారుడు, రాజు **బుస్బల్రావ్** కుమారుడైన తన సోదరుడు, యే **అచేతరావ్** (అచ్యుతరాయ) ప్రస్తుతము పాలించు చున్నాడో, వానినే రాజు చేయాలి; మిగతవారికంటే ఆతడే ఇందుకు తగినవాడని నాకు తోచుటే కారణం... అనుచు ఒక మరణశాసనాన్ని వ్రాయించాడు. వాని మరణం తరువాత **సల్వనయ్** (సాళువ తిమ్మకాదు) రాజ్యానికి మంత్రియై, రాజు **అచితరావ్** (అచ్యుతరాయలు) **చందిగిరి** (చంద్రగిరి) కోటలో నిర్బంధం నుండి వచ్చేవరకు రాజ్యమును పాలించాడు... ఆ రాజు **అచ్యుతరావ్** (అచ్యుతరాయ), సింహాసనం నధిష్ఠించిన తరువాత, వ్యసనాల పాలై నియంతగా మారిపోయాడు. దుర్మార్గచరులును, భోగులును అయిన తన బావమరదులిద్దరు కోరింది తప్ప ఇంకేదీ ఆతడు చేయలేకపోయాడు". (డిటో. పే.367).

ఇందుచేత, అచ్యుతరాయలు చంద్రగిరి కోటలోని నిర్బంధం నుండి కృష్ణరాయల మరణానికి కొద్ది కాలం ముందుగనే విడుదలై వచ్చి రాజ్యపాలనం చేపట్టాడని తెలుస్తున్నది. ఆతడు ముమ్మారు పట్టాభిషిక్తు డయ్యాడు: మొదటిసారి, తన విడుదల వెంటనే, తిరుమలపై శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో **"ఆతడు శ్రీవేంకటేశదేవుని చేతిలోని శంఖం నుండి జలధారలో స్నానమైనప్పుడు"; రెండవసారి, శ్రీకాళహస్తిలో శ్రీకాళహస్తీశ్వరుని సన్నిధిలో క్రీ.శ.1529 అక్టోబరు 21న; చివరగా మూడవసారి సకల వైభవములతో లాంఛనములతో రాజధాని నగరమైన విజయనగరంలో క్రీ.శ.1529 నవంబరు 20న (దేవ.ఎపి.రిపో.పే.220).**

తిరుపతిలో అతడు చేసిన మొదటి ఉదార సేవ కపిలతీర్థం అనబడు నీటి సరస్సును బాగుచేయించుటకు సంబంధించినది. ఇది తిరుపతికి ఉత్తరాన సుమారు ఒక మైలు దూరంలో పర్వతపాదంలో ఉంది. ఇది శ్రీ కపిలేశ్వరుని ఆలయానికి క్రింది భాగంలో ఉంది. దీనికి నల్లఱాతి మెట్లతో అంచెలంచెలుగా నీటివద్దకు దిగుటకు మార్గాన్ని సుకరం చేశాడు. వీనితో బాటు రెండు వరుసలుగా సంధ్యావందన మంటపాలు మెట్లపై భాగాన్ని తూర్పు పడమర దిక్కులలో కట్టించి, ఈ తిరువేంగళ నాథుని దివ్య తటాకానికి చక్రతీర్థం లేక ఆళ్వార్ తీర్థం అని నామకరణం చేసి, సుదర్శనచక్రం చెక్కబడిన ఱాతిపలకల్ని నాలుగు దిక్కులలోను, మంటపం నాలుగు మూలలా స్థాపించాడు (సం.4, నెం.8, నెం.9, నెం.10).

**అచ్యుతదేవరాయలు శ్రీవారిని ప్రథమంగా దర్శించడం :**

**ఆతడు వేంకటేశ్వరుని దర్శించడానికి మూడుసార్లు వెళ్ళాడు. క్రీ.శ.1533 జనవరి 31న ఆతడు మొట్టమొదటిసారిగా దర్శించినప్పుడు, అసాధారణమైన కపిల-పశు పూజ (గోధుమవన్నెగల బంగారు గోవులు), ఆలయం వద్ద స్వర్ణవర్షాన్ని నిర్వహించి,** బహుమూల్యంగల రత్నాదులను, ఆభరణములను, ఒక **కఫా** (ఉత్తరీయము) రత్నాలు పొదిగిన దానిని, ఒక రత్నఖచిత (మకుటం) కుట్టాన్ని, నాలుగు బాహువలయాలను (భుజకీర్తులు), ఒక కంఠహారాన్ని, తలకు, కన్నులకు, మెడకు, బొమ్ముకు అలంకార భూషణాలను సమర్పించి, స్వయంగ తానే ఆ దేవునకు అర్చన చేసికొన్నాడు; అర్చకులు స్వామి అష్టోత్తర సహస్రనామములను పఠించారు; వాని **రాణి వరదాజీ-అమ్మ, కుమారుడు కుమార-వేంకటాద్రి** ఆ క్రియాకలాపాలను చూచేవారు (డిటో, నెం.16, నెం.17).

**అచ్యుతదేవరాయల ద్వితీయ దర్శనం :**

**వారి రెండవ దర్శనం క్రీ.శ.1535 డిశెంబర్ 26న జరిగింది.** అప్పుడాతడు వేంకటేశ్వరునకు, **అలర్‌మేల్‌మంగై నాచ్చియార్** (పద్మావతి) సమేతంగా, అయిదు రోజులు లక్ష్మీదేవి మహోత్సవాన్ని వ్యవస్థీకరించాడు. దాని ఖర్చుల నిమిత్తం ఉత్తరాయణం, 300 రేఖై-పొన్, **కొండవీటిసీమ**లోని గ్రామాలనుండి ఆదాయాన్ని ఏర్పాటు చేశాడు. (నెం.54). ఈ శాసనంలో ఈ ఉత్సవం ఏ నెలలో, ఏ తిథులలో నిర్వహించాలో, ఈ వివరాలు పొరబాటున వదిలివేయబడ్డాయి. దానిని సరిదిద్దుకొను ఉద్దేశం

ఒక అనుబంధంలో కన్పిస్తుంది (నెం.55). కాని, ఇందులో కూడ మాసం చెప్పబడలేదు; అయినను ఉత్సవం, అంకురార్పణానికి ఉత్తిరట్టాది రోజు నుండి ఉత్సవం ముగిసేవరకు రోహిణి దినం వరకు, ఆరు రోజులు మాత్రమే, ఏడు రోజులు కాదు. ఈ ఉత్సవంలో మలయప్పకు ఆతడు నిర్మించిన ఏడు మంటపాల వద్దను 40 నైవేద్యాలను, 5 రకాల పణ్యార్థాలను సమర్పించేటట్లు ఒప్పందం. ఈ ఏడు మంటపములు ఇవి : **అచ్యుతరాయ స్వామి మంటపము, వరదరాజస్వామి - అమ్మన్ మంటపం, అచ్యుతరాయ-అంకణ మంటపం, వరదాజి-అమ్మన్-అంకణ మంటపం, కుమార-చిక్క- వేంకటాద్రి-ఉడైయార్-అంకణ మంటపం, నరసనాయక్కర్-అంకణ మంటపం, ఓబలాచ్చి-అమ్మన్-అంకణ మంటపం, చివరి రెండు పేర్లు వాని తండ్రి నరసనాయకునకు, తల్లి ఓబలాచ్చి, ఓబచ్చి, అమ్మన్ లేక ఓబాంబికకు సంబంధించినవి.**

**క్రీ.శ.1535 డిసెంబరు 26వ తేదీ**, అచ్యుతరాయలు లక్ష్మీదేవి మహోత్సవాన్ని ప్రారంభించిన రోజున, ఆతడు రఘునాథునకు గూడ ఒక ఉత్సవం నేర్పరచెను. **నాచ్చియార్ (సీతాదేవి), ఇళైయ-పెరుమాళ్ (లక్ష్మణుడు),** స్పష్టంగా ఇవి వేంకటేశ్వరుని ఆలయంలోని మూర్తులే, వీరికి, ప్రతి సంవత్సరం **పునర్వసు నక్షత్రం** వచ్చు 13 రోజులలో ప్రతిరోజున్ను, అది శ్రీరాముని జన్మనక్షత్రం కనుక, వారికి అభిషేకాలకు, పణ్యారం, నైవేద్యాలు, 13 రోజులున్ను ఊరేగింపుల జరుపుటకేర్పాటుగా, అదనంగా 60 రేఖై-పొన్ **ఉత్తరాయంగా కొండవీటి-సీమకు** చెందిన అదే గ్రామాలనుండి ఆదాయం ఏర్పరచాడు. (నెం.58). చివరి చేర్పుగా (నెం.58-ఎ), 2 రకాల పణ్యారం, చందనం, కర్పూరం, కస్తూరి సమర్పించడానికి స్థానత్తార్ అంగీకరించాడు.

వేంకటేశ్వర స్వామిని రెండవసారి దర్శించడానికి అచ్యుతరాయలు వెళ్ళిన ఆ పై జెప్పిన తేదీన, ఆతడు తన అధికారులు కొందరితో కలిసి వెళ్ళినట్లు తోచును. **రామభట్టరయ్యన్, రాయసం రామచంద్ర దీక్షిత, మలైయప్పరయ్యన్, తన ఇద్దరు తాంబూలకరండవాహికలు అడైప్పం రుక్మిణి-అమ్మన్, అడైప్పం పర్మాదమ్మన్,** వీరందరును వేంకటేశునకు నైవేద్యాలను అర్పించారు. **రామభట్ట** ఒక అగ్రహారాన్ని స్థాపించి, దానిలో **శ్రీరామ విగ్రహాన్ని** ప్రతిష్ఠించాడు (నెం.61, నెం.60, నెం.57, నెం.56).

**అచ్యుతదేవరాయల తృతీయ దర్శనం :**

**క్రీ.శ.1537 జనవరి 12వ తేదీ అచ్యుతరాయలు మూడవసారి దర్శించినట్లు ఆతని అధికారులొక ఆర్గురు ఆ తేదీన తిరుమలలో నుండుటను బట్టియు, వారిలో ప్రతియొక్కడు 15,000 నఱ్ఱణాలు చెల్లించి మలయప్పకు ప్రతి సంవత్సరం 300 అప్పపడి ఏర్పాటు చేయడాన్ని బట్టి భావించవచ్చును. ఆ ఆర్గురు అధికారులు వీరు - అడైప్పం విశ్వనాథ నాయకుడు** (నెం.81); **కృష్ణప్ప నాయకుడు** (నెం.82); **భాచ్చరసయ్య లేక రామయ భాస్కరుడు** (నెం.83); **రామాభట్టర్ అయ్యన్** (నెం.84); **ఇమ్మడి ఎల్లప్ప ఉడైయార్** (నెం.86); **సలకరాజు శింగరాజు** (అచ్యుతరాయల ముగ్గురు బావమరదులలో చిన్నవాడు) (నెం.88). పైగా, నెం.89లో ఆ దస్తావేజు ఆ తేదీన 12-1-1537న అచ్యుతరాయ మహారాయల సూచనమేరకు వ్రాయబడినట్లుంది.

ఈ నెం. 89లో, చక్రవర్తి చొరవవలన ఆ కాలంలో జరుపబడుచున్న వేంకటేశ్వరుని బ్రహ్మోత్సవం లెనిమిదింటిలో ప్రతియొక్కదానిలో ఏడవ రోజున ఒక అప్పపడి నైవేద్యానికై మల్లాపురం గ్రామాన్ని దానంచేసి దాతభాగం ప్రసాదాన్ని అప్పయ్యన్ అనునొకనికి అందించునట్లు ఒప్పందం వ్రాయించిన ఆ దాతపేరు **సాళువ తిమ్మరస** అనీ, దాత భాగాన్ని స్వీకరించేవాడు వాని పెద్ద మేనల్లుడును అల్లుడును అయిన **నాదిండ్ల అప్ప** అనియు భావించబడుతోంది.

ఈ మధ్యకాలంలో, **అచ్యుతరాయల రాణి వరదాజీదేవి-అమ్మన్** క్రీ.శ. 1534 ఏప్రిల్ ఐదవ తేదీన వేంకటేశ్వరునకు తన వందనాలను సమర్పిస్తూ, ఆ స్వామికి మొత్తం 920 రేఖైపొన్ (బంగారు నాణాలు బహుశః వరహాలు) ఆదాయం వచ్చు ఆరు గ్రామాలను నిత్యపూజ, ఇరవై నైవేద్యాలతో, ఐదు రకాల పణ్యారాలతో, తన పేరున మునుపు ఏర్పాటైన కృష్ణరాయల అవసరము, అచ్యుతరాయల అవసరముల తరువాత జరుగునట్లు ఏర్పాటుకై దానం చేసింది. (నెం.29). కొంత కాలం తరువాత గోవిందరాజుకు ఆ దేవుని బ్రహ్మోత్సవములలోను తదితర సందర్భాలలోను; తిరుపతిలోని తన మంటపంలో వేంచేసి యుండగా **అలమేల్మంగై-నాచ్చియార్** (వేంకటేశ్వరుని దేవేరి) కు కార్తికమాసములో ఉత్తిరాడమ్ (ఉత్తరాషాఢ) నక్షత్రమున్న రోజున; పద్మసరస్సు తీరంలో **సుందరరాజునకు; తిరుమంగైయాళ్వార్, శూడిక్కొడుత్త - నాచ్చియార్** (ఆండాళ్) లకు తిరుపతిలోను (నెం.97) నైవేద్యాలు ఏర్పాటుచేసెను.

అచ్యుతరాయలు, కపిలతీర్థానికి **శ్రీ కపిలేశ్వరుని** ఆలయానికి దక్షిణదిశగా కొద్ది దూరంలో, పూర్వము **కోట్టూరు గ్రామము**న్న చోట, గాలిగోపురంతోను, ఒక పెద్ద ఊతిమెట్ల బావితోను, ఒక ఆలయాన్ని నిర్మించి, అందు తన పేరు తోచునట్లు శ్రీ **అచ్యుత పెరుమాళ్**ను ప్రతిష్ఠించి, దాని చుట్టు 120 గృహాలను నిర్మించాడు. ఇందుకు శ్రీవేంకటేశ్వరుని ధనాగారానికి నష్టపరిహారంగా ఆ స్థలానికై 2400 నఖ్ఖణాలు సమర్పించాడు. ఆ గృహాలను బ్రాహ్మణులకు, అందుండి వారు క్రొత్త ఆలయంలో సేవలు చేయడానికి వీలుగా సమర్పించాడు. ఈ 120 దానగ్రహీతలలో 100 మందికి ఆ గృహాలలో ఉండటానికి లేక అద్దెకివ్వడానికి, విక్రయించడానికి, తాకట్టు పెట్టడానికి, లేక వేరొకరికి బహూకరించడానికి స్వేచ్ఛనిచ్చి ఉన్నారు. మిగత ఇరవై మందికి ఈ హక్కులేదు. ఈ క్రొత్తగుడిలో పూజాదికం కొనసాగడానికి **పరిత్తిపుత్తూర్** (మద్రాసు రైలుమార్గంలో పుత్తూరు దగ్గర) గ్రామాన్ని దానం చేసి, దానిని ఇరవై భాగాలు చేసి, వానిని ఆ 20 మందికి కుటుంబం నిర్వహణ, సేవ నిరంతరాయగా కొనసాగటానికి కేటాయించాడు. (నెం.123). ఇది క్రీ.శ.1539 ఫిబ్రవరి 8వ తేదీతో ఉంది. కాని అంతకు రెండేండ్ల ముందుగనే క్రీ.శ.1537 జనవరి 17న **చంద్రగిరికి** చెందిన నామిశెట్టి అను దాత, తిరుపతిలోని అచ్యుతపెరుమాళ్, గోవిందరాజులకు తన మంటపంలో నైవేద్యం ఉత్సవ నిర్వహణం జరుగునట్లు ఏర్పాటు చేశాడు. (నెం.92). దీనినిబట్టి అచ్యుతపెరుమాళ్ 1537 జనవరికి ముందే ప్రతిష్ఠింపబడినట్లున్ను, **అచ్యుతరాయల శాసనం నెం.123 కేవలం పూర్వమే జరిగిన సంఘటన కొంతకాలం తరువాత శాసనబద్ధం చేయబడినట్లును స్పష్టమౌతున్నది.** 15-8-1538 నాటి నెం.108లో అచ్యుతరాయల సత్రానికి, అచ్యుత పెరుమాళ్ నైవేద్యాలకున్ను

అచ్యుతపెరుమాళ్ శ్రీభండారంనుండి పదార్థాలను అందించడానికి, నివేదించిన ప్రసాదాన్ని ఒక వ్యక్తికిచ్చేటట్లును ఉన్న ఒక యేర్పాటును ప్రస్తావిస్తూ ఉంది. ఆలయంలో పదార్థాల భండారమొకటి, ఒక సత్రమూ, **అచ్యుతరాయపురం**లో ఏర్పరచినట్లు తోస్తుంది. ప్రస్తుతం, ఆ ఆలయంగాని, **అచ్యుతపెరుమాళ్ మూర్తి**గాని, ఆ ఇంటిస్థలాలు గాని జాడలేదు, చెత్త తప్ప, గోపురమూ, ఒక పెద్ద బావీ నిరాదరణకు గురియై ఉన్నాయి. 16వ, 17వ శతాబ్దాలలో మహమ్మదీయ సేనలు, మహమ్మదీయ రాజ్యములు రెండిటి కలయిక వలన బలపడి **క్రీ.శ.1565 లో తాలికోట యుద్ధము**లో విజయనగర సైన్యము ఓడినపుడు, ఆ ఆలయమూ, ఆ ఆలయ దేవతామూర్తిని, ఆ ఇండ్లను నాశనం చేసి ఉంటారు.

తిరుమలలోను, తిరుపతిలోను ఆలయాలలో నిర్వహించబడుచున్న ఉత్సవాలకు ఆడంబరాన్ని సమకూర్చి వాని వైభవాన్ని వృద్ధిచేసే ఉద్దేశంతో, మరింత ప్రజాకర్షణ కలిగించి మరింతమంది ఉత్సవాలకు వచ్చేటట్లు చేసి వారికి అధికానందాన్ని కల్గించడానికి, **అచ్యుతరాయడు తన విజయనగర రాజమహలులోని నాట్యశాలనుండి ఆలయానికి కొందరు నాట్యకత్తెలను తమ కళానైపుణ్యాన్ని బహిరంగంగా ప్రదర్శించి వేంకటేశ్వరునికి సేవలర్పించుటకు ఆధికారంగా పంపాడు.** ఆ నాట్య బృందాలలో ఒకరు **ముద్దు-కుప్పాయి**, కృష్ణరాయని దర్బారుకు సంబంధించిన **కుప్పసాని చిన్నకూతురు**, శ్రీ రంగరాజు మనుమరాలు, **"విద్వత్సభారాయ రంజకం"** అను బిరుదు పొందినది. కృష్ణరాయడు స్వయముగనే మహాపండితుడని ఆతడు రచించిన తెలుగుకావ్యం "ఆముక్తమాల్యద" వలన తెలుస్తుంది. ఆతడే **'విద్వత్-సభ'** కు అధ్యక్షుడనియు, వాని **'రంజకులు'** శ్రీ రంగరాజు ఆతని కుమార్తె **కుప్పసాని**ని ఆ నాట్యబృందానికి గురువులు; కనుక వారిద్దరికి **'రంజకం'** అని బిరుదు. (దేవ.ఎపి.రిపో.పే.185; 205). విజయనగరం నుండి వేంకటేశ్వరుని ఆలయంలో నట్టువగా సేవించుటకు పంపబడిన **ముద్దుకుప్పాయి**కి తిరుపతిలోని గోవిందరాజు ఆలయమునుండి నిత్యం ఆమె మనుగడకై ప్రసాదాన్ని అందించేటట్లు ఆజ్ఞాపించాడు. ఈ ఆజ్ఞను స్థానత్తార్ క్రీ.శ.6-6- 1531 నుండి అమలుచేశాడు. (నెం.11). మరియొక నట్టువరాలు అట్లే విజయనగరంనుండి వేంకటేశ్వరుని ఆలయానికి అధికారికంగా అచ్యుతరాయలచే పంపబడింది **హనుమసాని, ఉద్దైడ తిమ్మయ్య కుమార్తె.** ఆమె తిరుమలపై ఒక పూదోటను పెంచి, దానిలో ఒక మంటపాన్ని నిర్మించి, క్రీ.శ.30-1-1540న ఆలయ ధనాగారానికి 820 నఱ్ఱణాలను చెల్లించి, దానిపై వడ్డీతో మలయప్పకు ఆ కాలంలో జరుపబడుతున్న పది బ్రహ్మోత్సవాలలోనూ ప్రతియొక్క దాని ఏడవ రోజు; విజయదశమి రోజు మరి రెండు రోజులూ; గోవిందరాజు ఆలయంలో ప్రవేశ గోపురం ప్రక్కన మొదటి అంతస్థులో నెలకొనియున్న **శ్రీ సుదర్శనునికి కృత్తిక నక్షత్రము**న్న రోజున చిత్తిరై నెలలోను నైవేద్యాలు ఏర్పాటుచేస్తే ధనవంతురాలనిపిస్తుంది (నెం.142).

తిరుమల, తిరుపతిలోని రెండు ఆలయాలకు అనుబంధంగా ఉన్న నట్టువరాండ్రు మరికొందరున్నారు., వారు నృత్యసేవతోబాటు దేవతామూర్తులకు నైవేద్య కైంకర్యాలు కూడ చేశారు. **లింగసాని, తిరువేంకటమాణిక్కం అను తిప్పసాని కుమార్తెలు,** క్రీ.శ.30-4-1540న 1650 నఱ్ఱణాలు చెల్లించి, మలయప్పకు పన్నీటి పాత్రను కర్పూరంతో కూడ వసంతోత్సవం ఇరవై రోజులు ప్రతిరోజు; గోవిందరాజు గుడిలో ప్రవేశం వద్ద

గోపురాలయంలో వేంచేసియున్న సుదర్శనునకు ఆని నెలలో కృత్తిక నక్షత్రమున్న తిథిరోజు ఒక దోశైపడి సమర్పించునట్లు ఏర్పాటు చేశాడు. కొంతకాలం తరువాత వారు మరియొక 900 నఱ్ఱణాలు పన్నీటి పాత్రల, నైవేద్యానికై చెల్లించారు. (నెం.233). అట్లే, ఎక్కువ కుమార్తె నాచ్చి, తిరుమల తిరుపతుల నట్టువరాండ్రలో ఒకరు, వేంకటేశ్వరునికి చాంద్రమాన క్రోధననామ సంవత్సరంలో ఒక కొన్ని నైవేద్యాలు సమర్పించడానికి ఏర్పాటు చేశాడు (నెం.185).

క్రీ.శ.26-12-1535, అచ్యుతరాయలు వేంకటేశ్వరుని దర్శింప వచ్చిన కాలంలో, వేంకటేశ్వరునికి లక్ష్మీదేవి మహోత్సవాన్ని, శ్రీరామునికి పునర్వసు నక్షత్రం వచ్చు 13 రోజులలోను (నెం.58) ఉత్సవాన్ని ఆతడు వ్యవస్థీకరించేటప్పుడు, వానితోబాటు తాంబూలకరండ వాహినులిద్దరు స్త్రీలు కూడ, **అద్దైప్పం పర్మాదమ్మ, అద్దైప్పం రుక్మిణియమ్మ** (నెం.56,57) ఉండిరి. వారిద్దరి పక్షంలో స్థానత్తార్ 132 రేఖై పొన్ ఖర్చు చేసి పదకొండు అప్పపడి, పదకొండు అతిరసపడి మలయప్పకు తొమ్మిది బ్రహ్మోత్సవాలలోను; ఏడవ రోజులలోను మరి రెండు రోజులలోను నైవేద్యాలు అర్పించడానికి; 20 రేఖైపొన్ పూదోటకై స్థలం కోసం; పద్దెనిమిది రేఖైపొన్ ఊతిగోడల ప్రహరీ నిర్మాణానికి; పద్దెనిమిది రేఖైపొన్ ముగ్గురు తోటమాలీలకు సంవత్సర జీతాన్ని నెలకు ఒక రేఖై ఐదు పణాలు చొప్పున చెల్లించడానికి, నూట ఎనభై రేఖైపొన్ తోటకొరకు రకరకాల మొక్కలను కొనడానికి; నూట యాభై రేఖైపొన్ యిద్దరిలో ప్రతియొక్కరి పక్షమున ఒప్పుకున్నాడు. వారు ఆ ధనాన్ని చెల్లించినట్లు తెలియడం లేదు. కాని, 1036 రేఖైపొన్ ఖర్చు వారి పక్షంలో ఆలయ ధనాగారానికొక ఉపకారంగా తోస్తుంది.

అదే రీతి స్థానత్తార్ అట్టి స్వచ్ఛందమైన ఖర్చును **ఆరవీడు లక్ష్మీఅమ్మన్** విషయమునగూడ భరించాడు. తాను వేంకటేశ్వరుని దర్శించినప్పుడు, అచ్యుతరాయ మహలులో దాసిగానున్న స్త్రీలలో ఒకరు. ఆమె పక్షమున పూదోటకు స్థలమును కొనుటకై ఇరవై అయిదు రేఖైపొన్; దానిలో ఒక మంటపాన్ని నిర్మించడానికై యాభై రేఖైపొన్; తోటమాలీలకై, మలయప్పకు పది బ్రహ్మోత్సవములలో, మరికొన్ని ఇతర రోజులలోను నైవేద్యాలకై ఆరు రేఖైపొన్ ఖర్చు చేయబడింది. (నెం.125)

**నూనిజ్** ఇలా అంటాడు : "వాని (కృష్ణరాయని) మరణం తరువాత **సాల్వనాయ్** రాజ్యానికి మంత్రియై, రాజు అచితరావు తాను ఉంచబడిన **చందియగిరి కోటనుండి** వచ్చేంత వరకు రాజ్యపాలన చేశాడు. (సెవెల్.పే. 367)". రాజ్యానికి మంత్రియై తాత్కాలికంగా దానిని పాలించిన **'సాల్వనాయ్', నూనిజ్** ముందే చెప్పినట్లు కృష్ణరాయలచే తనవారితో కూడ కండ్లు పొడిపించబడి బంధింపబడిన ఆ సాళువ తిమ్మరస కాడేమో. కృష్ణరాయడప్పుడు "**కొండిమిరాది** కుమారులలో నొకనిని మంత్రిగా చేశాడు. ఆతడే రాజు నరసింగుని (సాళువ నరసింహుని) కుమారుని **పనగుండి** (అనంతపూరు జిల్లాలోని **పెనుగొండ**) లో తోటలో, తండ్రియైన రాజు (తుళువ నరసనాయక) ఆజ్ఞతో, నమ్మకద్రోహంతో చంపినవాడు" (డిటో.పే.360). ఈ **'కొండమిరాది'** యు వాని కుమారుడున్ను చారిత్రకంగా తెలిసిన వారెవ్వరును కారు.

'సాల్వనాయ్' కూడ (సాళువ నాయకుడు, బహుశః **తిరువాన్‌కూరు**కు పారిపోయిన వాడు, అచ్యుతరాయలు తన బావమరదుల సైనిక చర్యలద్వారా లొంగదీసినవాడు కాడు).

క్రీ.శ.1541 నవంబరు 5 నాటి నెం.166లో **సాళువ తిమ్మయ్య** అచ్యుతరాయలచే, తన తమ్ముడు **సాళువ గోవిందరాజు**వలెనే, మంత్రిగా నియమితుడైనట్లుంది. అందు గోవిందరాజులకు ఇతర సమర్పణలతోబాటు, అచ్యుతరాయల జన్మనక్షత్రమైన మృగశీర్ష నక్షత్రం సంవత్సరంలో వచ్చు 13 రోజులలో ప్రతిరోజున్ను ఒక అప్పపడి నైవేద్యానికి ఏర్పాటు చేయబడిన ట్లున్నది. దీనిని బట్టి చక్రవర్తి కాతడు విధేయతను ప్రకటించి నట్లుంది. కనుక, ఆతడు కృష్ణరాయని కాలంలోవలె ప్రధానిగా, పలుకుబడిగల వాడుగా, గౌరవనీయుడు కాడనిపిస్తాడు. ఎందుకంటే, అచ్యుతరాయుల కొలువులో అతని బావమరదులు సలకరాజు లేక పెద్ద తిరుమలరాజున్ను శిరు లేక చిన్న తిరుమలరాజున్ను, వీరిద్దరు వానిపై ఎంతో ప్రభావాన్ని చూపారు; కాగా, పెద్ద బావమరది **"ప్రధాన తిరుమల రాజు"** అను హోదా కలిగి యుండెనని 1922 నకు చెందిన నెం.681 మద్రాస్ ఎపి.రిపో. చెబుతుంది. కనుక, వారిలో ఒకడు కృష్ణరాయల కుమారుడైన బాలరాజు తిరుమలరాయ మహారాయల మరణాన్ని విషప్రయోగంచే, అని **నూనిజ్** చెప్పినట్లుగా వ్రాసి, ఈ కథ యథార్థమే అయితే, తద్వారా అచ్యుతరాయలు విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించడానికి, కృష్ణరాయల మరణానంతరం బాటపరచి ఉంటాడు. ఆతడు "వ్యసనానికి, దురాగతానికి బానిసయై ఉండేవాడు." **నూనిజ్** ఇంకా ఇలా అన్నాడు: "తన బావమరదులిద్దరు చెప్పినది తప్ప మరేదియు చేయలేదు. వారు చెడ్డ బుద్ధిగలవారు, నికృష్టులు." అచ్యుతరాయల గురించి నూనిజ్ వ్రాసిన దుర్వ్యాఖ్యలట్లుండగా, చక్రవర్తి జనప్రియుడును, మాన్యుడును అయినట్లు, వాని క్షేమం కొరకు, వాని కుమారుని క్షేమం కొరకు వాని అధికారులు కొందరు, అన్యదాతలు దేవతామూర్తికి నైవేద్యాలు అర్పించడాన్ని బట్టి, వాని ధర్మానికి (నెం.1), వాని పుణ్యానికై (నెం.77;79;101), వాని జన్మనక్షత్రమైన మృగశీర్ష (నెం.6;36), చక్రవర్తి క్షేమానికై, మహారాణి **బాలరాజైన వేంకటాద్రి ఉడయర్** (నెం.79), అనేటి ప్రసంగాలను బట్టియు, చాలా శాసనాలు అచ్యుతరాయలు శాసించుచుండగా" అనుచు ప్రారంభమైన దానిని బట్టియు, భావింపదగి యున్నది.

**ఈ ఇద్దరు సలకరాజు తిరుమలరాజులునూ, వారి తమ్ముడు సలకరాజు సింగరాజుతో కూడ అచ్యుతరాయల దేవేరి వరదరాజియమ్మకు సోదరులు, తిమ్మరాజు సలకరాజు కుమారులు. సలకరాజ కుటుంబసభ్యులు ఈ నలుగురును, తండ్రి, ముగ్గురు కొడుకులు, అచ్యుతరాయని పరిపాలన కాలంలో జీవించినవారు.** తండ్రియైన మహామండలేశ్వర తిమ్మరాజ సలకరాజు శిట్టీట్టము (కొండపైకి నిట్టనిలువుగ ఎక్కవలసిన కొద్దిదూరము, చిట్టెక్కుడు) వద్ద ఒక మంటపమును నిర్మించి, దానిలో ఒక చలివేంద్రము నడుపుటకై 21-8-1533న 600 నఱ్ఱణాలు చెల్లించాడు. (నెం.25) సలకరాజు పెరియ-తిరుమలయ్య దేవ మహారాజుల దేవేరి పెరియ- కొమ్మమన్ క్రీ.శ.3-7-1534న 1300 నఱ్ఱణాలు తన ఆచార్యుడగు **కోయిల్ కందాడై అణ్ణన్**గారి ఉభయంగా చెల్లించాడు. దీనితో మలయప్పకు తొమ్మిది బ్రహ్మోత్సవములలో

ఏడవ ఉత్సవదినాలలో **వరదనారాయణన్ మంటపం** అని పేరుగల పూదోటలోని తన మంటపంలోను; వేరు మంటపాలలో ఈ ఉత్సవాలలో కొన్ని **గోవిందరాజుకు తీర్థవారి** రోజులలో వైకాశి, ఆని బ్రహ్మోత్సవాలలోను; ముగ్గురు ముదల్-ఆళ్వారుల ఆలయాల ఎదురుగా **తణ్ణీర్-అముదు ఉత్సవాల**లోను; ముదల్- ఆళ్వారులకు, పొయ్గై-ఆళ్వార్ జన్మనక్షత్రం శ్రావణమున్న రోజున, పూదత్తాళ్వార్‌కు ధనిష్ఠ రోజున, పేయాళ్వార్‌కు శతభిష రోజున, అర్పశి నెలలో (నెం.31) నైవేద్యముల కేర్పాటుచేశాడు. [1]పెరియ తిరుమలరాజు రాణి తతుక్కోణమ్మ వేంకటేశ్వరుని నిత్యనైవేద్యాలకై క్రీ.శ.17-2- 1536న 150 వరహాలు చెల్లించింది (నెం.66).

ఈ సోదరులలో అందరికంటె చిన్నవాడైన సింగరాజు క్రీ.శ. 12-1-1537న 1500 నర్భణాలు వేంకటేశ్వరునకు 300 అప్పపడి నైవేద్యానికై అర్పించాడు. దీనిలో పదమూడవ పడి, అంకురార్పణం రోజునుండి విడాయాట్టి రోజువరకుగల పది బ్రహ్మోత్సవాలలోను, ప్రతియొక్కదానిలోని పదమూడు రోజులల్లో; 20 పడి, కోడైతిరునాళ్ ఇరవై రోజులున్ను; తొమ్మిదవ పడి తెప్పోత్సవం తొమ్మిది రోజులున్ను మిగత ఉత్సవాల రోజులలోను పుణ్య తిథులలోను (నెం.88) అర్పించే ఏర్పాటు. మరల అతడు క్రీ.శ.1062-1542న 15000 మలయప్పకు ప్రతి సంవత్సరం 300 అప్పపడి అదనంగా అర్పించడానికై చెల్లించబడింది (నెం.170).

నెం.168, **సలకరాజు శిఱు-తిరుమలరాజు అచ్యుతరాయ మహారాయల పట్టమహాదేవియార్ (పట్టమహిషి) వరదాజి అమ్మచేత ధర్మంగా తిరుమల**పై వేంకటేశ్వరుని శ్రీభండారం నిర్వాహకుల నుండి క్రీ.శ.1541 డిశెంబరు 21న క్రయం పొందిన భూమిపై వరదాజి-అమ్మన్ పేరుపెట్టబడిన ఒక వీథి, ఇరుప్రక్కల బారులతో నిర్మించబడిన దానిని ప్రస్తావిస్తుంది.

అచ్యుతరాయల పాలనలోని ఈ కాలంలో, ఆలయానికి ముప్పై ఐదు గ్రామాలు, కొన్ని క్షేత్రాలు దానం చేయబడినట్లు కనిపిస్తూ ఉంది. రాణి వరదాజి - అమ్మన్ మొత్తం 920 రేఖైపొన్ (బంగారు వరహాలు అయి యుండవచ్చు.) సంవత్సరాదాయం లభించే ఆరు గ్రామాలును శ్రీవేంకటేశ్వరుని ప్రసన్నతకై ఇరవై నైవేద్యాలను, ఐదు రకాల పడుల్ని (పణ్యారం, తీపి-ఉప్పు రుచిగల అప్పం, అతిరసం, సుగియ, వడ, దోశ, శిడై మొదలగు తినుబండారాలను) సంవత్సర మంతా ప్రతి రోజున్ను సమర్పించునట్లేర్పరచాడు. ఒక పన్నెండు గ్రామాలను అత్యధికంగా దానం చేసిన దాత తాళ్ళపాకం పెద్ద తిరుమలయ్యం- గార్. వీరు సాళువ నరసింహుని కాలంలో, ఆలయానికి చెందిన మొట్టమొదటి సంకీర్త నాచార్యుడైన అన్నమయ్యంగార్ కుమారుడు. ఆ దానంయొక్క ఉద్దేశం, దాదాపు యాభై నైవేద్యాలను, మరికొన్ని పడులను ప్రతిరోజున్ను కొన్ని ఉత్సవకాలాల్లో శ్రీవేంకటేశ్వరునికి సమర్పించడం. అదికాక, ఆతడు వేంకటేశ్వరునికి తమిళ నెలయైన ఆనిలో ఒక క్రొత్త బ్రహ్మోత్సవం నిర్వహించడానికై 2000 వరహాలను చెల్లించాడు (నెం.129).

---

1. పెరియ తిరుమలరాజుగారి రాణి పేరు నెం.31లోను, నెం.66లోను వేరుగా ఉంది. ఆమె సరియైన పేరు 'కోనమ్మ' అయి ఉంటుంది. ఈ శాసనాలు చెక్కేటప్పుడు పొరబాటు జరిగి ఉంటుంది.

అచ్యుతరాయల కార్యదర్శి రాయసం తిమ్మరసయ్య, గోవిందరాజుకు, నిత్యం 16 నైవేద్యాలను, ఒక పడి సమర్పించడానికి 3 గ్రామాలను దానం చేశాడు (నెం.111). **చంద్రగిరి వాస్తవ్యుడైన భూతనాథ రామాభట్ట** క్రీ.శ.25-1-1541న, సంవత్సరానికి 150 రేఖై-పొన్ ఆదాయమిచ్చే **అలంబాక్కం గ్రామాన్ని** దానం చేసి, అనుదినం రెండు నైవేద్యాలను, ఒక దోశై-పడిని సమర్పించడానికి 3600 నఱ్ఱుణాలు చెల్లించాడు (నెం.154). ఒక శ్రోత్రియ బ్రాహ్మణుడు, పూర్వం రామాభట్ట తనకు దానమిచ్చిన **వళితిరట్టి గ్రామాన్ని**, క్రీ.శ.17-6-1534న శ్రీవేంకటేశ్వరునికి నిత్యం 14 నైవేద్యాలు అర్పించేటట్లు, ఆలయానికి దానం చేశాడు. **రామాభట్టు బంధు వగు భూతనాథ ఎల్లప్పయ్య,** క్రీ.శ.8-12-1541న, 18 నిత్యనైవేద్యాలకై రెండు గ్రామాలను దానం చేశాడు. (నెం.167) **దళవాయి తిమ్మరసయ్య,** క్రీ.శ.31-12-1540న, సంపురం గ్రామదానాన్ని, 15,000 నఱ్ఱుణాలు చెల్లింపుద్వారా, ఇరవై ఎనిమిది నైవేద్యాలను, మరికొన్ని ప్రత్యేక నైవేద్యాలను సమర్పించుటకేర్పాటు చేశాడు. (నెం.153). **పెనుకొండ వీరప్పణ్ణ పాశిలగల పాడు గ్రామాన్ని** వ్రాసి యిచ్చి, 200 రేఖై-పొన్, అచ్యుతరాయల పుణ్యమునకై ఎనిమిది నిత్యనైవేద్యాలను క్రీ.శ.15-12-1536న యేర్పరచాడు. (నెం.77) మరల క్రీ.పూ.22-16-1538న 6000 నఱ్ఱుణాలు చెల్లించి, మరియు నాలుగు నైవేద్యాలు నేర్పరచెను. (నెం.101); క్రీ.శ.4-1-1539న (నెం.119) 2000 రేఖై-పొన్ చెల్లించి, పెద్ద వెండి పళ్ళెరాన్ని నైవేద్య పదార్థాలు పెట్టడానికోసం సమర్పించాడు. క్రీ.శ. 27-1-1541న ఒక పెద్ద వెండి గిన్నెను సమర్పించాడు. (నెం.141) అయిదో రోజున, మిగత అధికారుల లాగానే, సంవత్సరానికి 300 అప్పపడి నైవేద్యానికై 15,000 నఱ్ఱుణాలు చెల్లించాడు. (నెం.158) చివరిగా క్రీ.శ.23-2-1542న 600 రేఖై-పొన్ చెల్లించి వేంకటేశ్వరునికి అదనంగా ఐదు నిత్యనైవేద్యాలేర్పరచాడు. (నెం.172) రాయసం రామచంద్ర దీక్షితర్ క్రీ.శ.1-7-1533 న **తామర పాక్కం గ్రామాన్ని** దానం చేసి, వేంకటేశ్వరునికి ఎనిమిది నిత్యనైవేద్యాలను, **మలయప్ప**కు వేర్వేరు ఉత్సవాలలో పణ్యారాన్ని అర్పించడానికి కేర్పరచెను. (నెం.23).

అచ్యుతరాయల భవనంలో ఉద్యోగియైన మల్లయ్య క్రీ.శ.24-7-1541న నైవేద్యాలకై ఒక గ్రామాన్ని అర్పించాడు (నెం.164). **శాలైపాక్కం నాగయ్య** క్రీ.శ.29-12-1530 న (నెం.7) ఒక గ్రామం సమర్పించాడు. **మలైయప్ప- రయ్యన్** క్రీ.శ.26-12-1535న (నెం.60) **పంచవన్మాదేవి గ్రామాన్ని** అర్పించాడు. **పిళైపొరుట్టార్ పిళ్ళై, గోపాలశెట్టి** కులానికి చెందినవాడు, పడైవీడు సీమలోని 5 గ్రామాలను క్రీ.శ.1535లో దానమిచ్చాడు. (నెం.48), క్రీ.శ.6-1-1536న, **గోవింద పండితుడు గండికోటసీమలోని అచ్యుతరాయపురాన్ని** దానమిచ్చాడు (నెం.62). క్రీ.శ.24-11-1538న 700 రేఖై-పొన్ సంవత్సరాదాయము ఇచ్చే ఒక గ్రామాన్ని **వేంకటాద్రి అయ్యన్** సమర్పించాడు. (నెం.115). వేంకటాద్రి అయ్యన్ క్రీ.శ. 1-5-1540న **గొల్లపల్లి** నిచ్చాడు (నెం.148). శ్రీవేంకటేశ్వరుని సమక్షంలో **అవులాలి (తిరుపతి వద్దగల అవిలాల)** గ్రామస్థులు భూముల్ని దానం చేస్తూ దస్తావేజు నొకటి వ్రాయించారు (నెం.189).

అచ్యుతరాయల ధర్మంగా **కుమార రామనుజయ్యంగార్** క్రీ.శ. 14-1-1530న ఒక కొయ్యరథాన్ని, **శ్రీ రఘునాథుని తిరుపతి ఊరేగింపు** కొరకు, చేయించి యిచ్చెను. (నెం.1).

**పెరియ పెరుమాళ్ కుమారుడైన నారాయణన్** అనే **నేరట్టూర్** వాస్తవ్యుడు, క్రీ.శ.1530లో, గోవిందరాజు ఆలయంలో వంటపని కొరకు నీరుంచుటకై ఒక పెద్ద ఊాతి తొట్టిని సిద్ధపరచాడు. (నెం.2).

ఒక **సంకీర్తన - భండారం** (ఒక చిన్నగది. అందులో రెండు ప్రక్కలా చెక్కబడిన రాగిరేకులపై దాదాపు 3000 సంకీర్తనలు, తాళ్ళపాక వాగ్గేయకారు లవి, మూడు తరాలవారికి, అనగా, **అన్నమాచార్యుడు, ఆయన కుమారుడు పెద్ద తిరుమలాచార్యుడు, ఈ రెండవవ్యక్తి పెద్దకుమారుడు చిన్న తిరుమలాచార్యుడు,** ఇవి నిక్షేపించబడి సంరక్షించబడినాయి. వాటిని మొదట దాచియుంచబడి, నాలుగు శతాబ్దాల కాలం, సుమారు 16వ శతాబ్ది మధ్యకాలం నుండి తిరుపతిలోని దేవస్థానం కార్యాలయానికి, నేను ఎత్తి వ్రాయించి ప్రకటించుటకు, తరలించు వరకు, అట్టేయున్నవి) క్రీ.శ. 31-10-1530 నాటి తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యంగారి శాసనంలో దృష్టికి వస్త్రములు, వస్తువులు, చిన్నపాత్రలు, బంగారం, వెండి, ఆభరణాలు వహించే పాత్రకు ఎదురుగా, విమాన ప్రదక్షిణంలోని **తిరుమామణి మంటపంలో** ఉన్నది. ఈ శాసనం (నెం.6) ప్రకారం, అచ్యుతరాయలు వ్యవస్థీకరించిన ఉత్సవం, స్పష్టంగా క్రీ.శ. 26-12-1535న (నెం.54), అనగా, నెం.6లో దాని ప్రస్తావనకు అయిదేండ్ల తరువాత, నమోదైన లక్ష్మీదేవి మహోత్సవం, మలయప్పకు ఉత్సవంలో ఒకరోజు ఒక అతిరసపడి సమర్పించుటకు యేర్పాటైనది. తరువాత కాలంలో **పెద్ద తిరుమలాచార్యుడు,** వారి కుమారుడు ఈ గది కెదురుగా మరికొన్ని నైవేద్యాల కేర్పాటుచేశారు. (నెం.155).

ఈ కాలంలో రెండు క్రొత్తమూర్తులు **భూతనాథ రామాభట్ట** చేత ప్రతిష్ఠింప బడినాయి: ఒకటి శ్రీ రఘునాథునిది, తిరుపతికి పడమటి పొలిమేర ప్రదేశమైన **తిరువేంకటపురములో** నెలకొన్న ఆ స్వామి ఆలయంలో; ఈ స్వామికి ఒక నైవేద్యం సమర్పించడానికై క్రీ.శ.26-12-1535న ఏర్పాటు చేయబడింది (నెం.61); మరియొకటి గోపాలకృష్ణుని మూర్తి, **వాదిరాజ పురంలోని** తన తోటలో, తిరుపతికి మరియొక పొలిమేర, ప్రతిష్ఠించి ఆ స్వామి సన్నిధిలో నిత్యం దీపాలు వెలిగించి నైవేద్యాన్ని సమర్పించడానికి క్రీ.శ.7-1-1537న ఏర్పాటు చేయబడింది (నెం.94). ఆతడు గోవిందరాజులకు పంగుని-ఉత్తిరం రోజున (పంగుని నెలలో ఉత్తరఫల్గుణి నక్షత్రమున్న రోజు) పుణ్యస్నానాలు, విస్తారమైన నైవేద్యాలతోను, రాత్రివేళలో కాగడాల వెలుగులో ఊరేగింపును, మరల పుణ్యస్నాన, వివిధ నైవేద్యాలతోను, శ్రీరామునకొక ఆస్థానం తెప్పోత్సవం జరిగే రోజున, ఇట్లొక ఉత్సవాన్ని వ్యవస్థీకరించాడు (నెం.18).

ఈ కాలంలో కొన్ని క్రొత్త ఉత్సవాలు కూడ ప్రారంభించబడినాయి. అచ్యుతరాయలచే స్వయంగా శ్రీవేంకటేశ్వరునకు **అలమేల్మంగై నాచ్చియార్** (పద్మావతీదేవి) సహితముగా లక్ష్మీదేవి మహోత్సవం క్రీ.శ.26-12-1535న వ్యవస్థీకరించబడింది. ఇది మతధార్మిక కార్యకలాపాలన్నింటితోను అయిదు రోజులపాటు జరుపబడుతుంది (నెం.54), కాని దీనిని ఏ నెలలో జరుపవలె నన్న విషయం మాత్రం

వదిలివేయబడింది. ఒక అనుబంధంలో (నెం.55), ఈ ఉత్సవ దినముల సంఖ్య ఏడుకు పెంచబడింది, కాని, ఇప్పుడు కూడ నెలను చెప్పలేదు. **ఉత్తిరాది (ఉత్తరాభాద్ర)** నక్షత్రమున్న రోజున అంకురార్పణం మొదలు రోహిణి నక్షత్రమున్న రోజున శాత్తుముఱై వరకు గల ఏడు రోజులుగా ఉత్సవదినాలు చెప్పబడినాయి. ఈ రెండు నక్షత్రాల మధ్య గల రోజులు 6 మాత్రమే, 7 కాదు. మొదట చెప్పబడినట్లు 5 రోజులలో ప్రతిరోజు, ఐదు రకముల పణ్యారం, అనగా ఒక అప్పపడి, ఒక అతిరసపడి, ఒక వడపడి, ఒక గోధిపడి, ఒక సుగియపడి, వీనిని నైవేద్యంగా ఉత్సవమూర్తులకు అచ్యుతరాయలు నిర్మించిన ఏడు మంటపాలలో అనగా **అచ్యుతరాయస్వామి మంటపం, వరదరాజి- అమ్మన్ స్వామి మంటపం, అచ్యుతరాయ- అంకణ మంటపం, వరదరాజి-అమ్మన్-అంకణ మంటపం, కుమారచిక్క వేంకటాద్రి ఉదయ-అంకణ మంటపం, నరసనాయక అంకణ మంటపం, ఓబళాచ్చి అమ్మన్ అంకణ-మంటపం, సమర్పించుటకు ఏర్పాటైనది.** మొదటి నాలుగు తన, తన రాణి పేర్లపై ఉన్నాయి, అయిదవది రాజకుమారుని పేర, ఆరవది వాని తండ్రిపేర, ఏడవది తల్లి ఓబలాంబ లేక ఓబాంబ పేరున ఉన్నాయి.

ఇదే విధమైన ఒక పెద్ద ఉత్సవం, బ్రహ్మోత్సవం, శ్రీవేంకటేశ్వరునికి తాళ్ళపాక పెరియ (పెద్ద) తిరుమలయ్యంగార్ (తిరుమలాచార్య తిరుమలయ్య లేక తిమ్మయ్య) ఆని (జూన్ ద్వితీయార్థం) నెలలో, వేంకటేశ్వరుని జన్మనక్షత్రమైన శ్రవణం నక్షత్రంరోజున అంకురార్పణంతో మొదలై, **శతయం (శతభిషక్ రోజు)** తిరుమలై (తిరుక్కోడి, పతాకావిష్కరణ, బదులు తప్పుగా వ్రాయబడింది), తీర్థవారి (పుణ్యస్నానాలు) దాత జన్మనక్షత్రమైన మృగశీర్ష రోజున, ఇట్లు మొత్తం విడాయాట్టి వరకు 13 రోజులు జరుపడానికి ప్రారంభించబడింది. మరల, శ్రవణం నుండి మార్గశీర్ష వరకు లెక్కించిన పదకొండు రోజులే తప్ప పదమూడు కాదు; కాగా విడాయాట్టి కలిపి పన్నెండు రోజులు, పదమూడు కావు. తమిళనెల ఆనిలో తనచే వ్యవస్థీకరించబడిన ఈ క్రొత్త ఉత్సవమునకు అగు ఖర్చుల నిమిత్తమున్ను, ఈ కాలంలో జరుగు పది బ్రహ్మోత్సవములలో నేర్పరచిన నైవేద్యాల కొరకు, మరికొన్ని వివిధాలైన డబ్బు చెల్లింపుల కొరకు, క్రీ.శ.17-3-1539న 2000 వరహాలు మూలధనంగా చెల్లించబడినాయి. ఎనిమిదవ పంక్తిలో ఇట్లుంది : 10 బ్రహ్మోత్సవాలలోను ఉత్సవదినం మొదటి రోజు నుండి, స్పష్టంగా, ధ్వజారోహణం రోజునుండి, పుష్పయాగం వరకు (వేంకటేశ్వరుని మూర్తినంతయు సుగంధభరితమైన పుష్పాలతోను మాలలతోను కప్పి వేయడం) 10 రోజులు, కాని, పనివారికి తదితరులకు, అవసరమైన పనులు చేయడానికి ఆని బ్రహ్మోత్సవంలో పన్నెండు రోజులకు పారితోషికా లివ్వవలసి ఉంటుంది. పురట్టాశి, కార్తికై, తై, పంగుని బ్రహ్మోత్సవాలలో మూడు రథాలను లాగడానికి, మొదటి రథం మలయప్ప, ఆయన దేవేరుల ఉత్సవ విగ్రహాలకు, రెండవ రథం బ్రహ్మకు, మూడవ రథం **విష్వక్సేనునికి (సేనైముదలియార్)** మూడు సుగియపడి, మూడు పళ్ళెరముల నిండుగా చక్కెర కలిపిన వెన్న, వారిద్దరకు వేర్వేరుగా సమర్పించుటయు; మార్గళి (ధనుర్మాసం) నెలలో **తిరుప్పళ్ళి ఎళుచ్చి** ముప్పై రోజులలోను ముప్పై తిరుప్పోనకం సమర్పించాలి. దాత, తనచే పుష్కరిణీ తీరంలో నిర్మించబడిన స్తంభంపై ప్రతి గురువారం దీపాన్ని వెలిగించడానికి, ముక్కోటి ద్వాదశినాడు పుష్కరిణీ తీరంలో ముప్పైరెండు దీపాలు వెలిగించడానికి కూడా, ఏర్పాటు చేయబడినాయి.

**తిరువేంగళనాథుని కీర్తిస్తూ, శృంగారసంకీర్తనలు పాడిన తాళ్ళపాక అన్నమయ్య కుమారుడు పెద్ద తిరుమలయ్య, పురాతనమైన పవిత్ర కోనేరిని (పుష్కరిణి) క్రొత్త నల్లఱాతితో నిర్మించాడు,** దానిచుట్టూ అంకణ మంటపాన్ని, మధ్యలో ప్రదక్షిణలకు నడవతో మంటపము కూడ వేంకటేశునికి ఇతర వస్తువులను సమర్పించినట్లు, ఈ ఉదార కైంకర్యాలను శక సంవత్సరం 1454 (క్రీ.శ.1532) (నెం.20) లో లిఖించబడింది. (నెం.41) లో వేంకటాధీశుని స్తుతిస్తూ శృంగార సంకీర్తనలు పాడిన **తాళ్ళపాక అన్నమాచార్యుని కుమారుడు తిమ్మయ్య చేసిన ఈ కైంకర్యాలు కొన్ని తెలుగులో సీసమాలికలో శకసంవత్సరం 1454 (చాంద్రమాన నందన సంవత్సరం) వైశాఖపూర్ణిమ రోజున మరల పునశ్చరణ చేయబడినవి;** అవి ఇవి : క్రొత్తఱాళ్ళతో కోనేరిని పునర్నవం చేయడం, అంకణ గోపుర ద్వారాల లోకస్తుత్యుడైన భూవరాహ (వరాహస్వామి భూదేవిని వామోరు భాగంలో వహించిన)... చుట్టుగోడలు చంద్రతారక లున్నంత వరకు నిలిచియుండేటట్లు తానే కట్టించినవి. మరల నెం.40 లో తమిళ పద్యాలలో, చాంద్రమాన మన్మథనామ సంవత్సరంలో, శక సంవత్సరం 1457లో, వైకాశినెలలో పూర్ణిమనాడు, క్రీ.శ.17-5-1535న, **తాళ్ళపాక అన్నమయ్యంగార్ కుమారుడు తిరుమలయ్యంగార్ చేసిన ఉదారసేవలు చెప్పబడినవి;** ***తంబిరాం-వడమలైక్కయాయ్-పరయేమామం-పాళంకోనేరియై-పుడుక్-కల్పడియుమ్*** (స్వామివారి ఉత్తరపు కొండను అలంకరించు పురాతన పవిత్ర కోనేరుకు (క్రొత్త ఱాతిమెట్లను పునర్నిర్మించాడు) **నీరాళి మంటపం**యొక్క పునర్నిర్మాణం (కోనేటి నడుమ నీటిలోనున్న మంటపం); *పక్కల్* ***అంకణముమ్*** (కోనేటి చుట్టు వేదికయు; వరాహస్వామి వారి ప్రాత దేవళము చుట్టు మంటపం; తూర్పు (ముఖ) గోపురం; చివరి పంక్తి, ***కోనేరి యంకణముమ్, జ్ఞానప్పిరాన్ మదిళ్ గోపురమే*** వారు 3వ, 4వ పంక్తులలో దాతయు ఆతని కుమారులును గొప్ప వారికిని సామాన్యులకును ఆనందమునిచ్చు, తేనెవలె తియ్యనైన, సంకీర్తనలను రచించినట్లు చెప్పబడినది.

వేంకటేశ్వరుని ఆలయపు ప్రవేశ గోపురం క్రిందవైపు ప్రక్కలను, ద్వారము ప్రక్కల స్తంభములపైన చెక్కబడిన ఆ మూడు శాసనాలు (నెం.20, నెం.40, నెం.41) చాలా శిథిలమైనవి; కారణం, బహుశః ప్రవేశమార్గం దాని పైగల గోపురం పునర్నిర్మితమగుట. కనుక పూర్తి వివరాలు లేవు. నెం.40 లో చాంద్రమాన మన్మథనామ సంవత్సరం, శక సంవత్సరం 1457, దానికి సరియైనదని వ్రాయబడింది; అట్లే, అదే వైశాఖ లేక వైకాశి-పూర్ణిమ లేక పౌర్ణమి. నెం.20, నెం.41లలో విషయాలు పునశ్చరణ నెం.40లో ఉండగా, శక సంవత్సరం 1454 వైశాఖ పూర్ణిమ స్పష్టంగా (చాంద్రమాన నందన సంవత్సరానికిని క్రీ.శ.1532కున్నూ), తరువాతి చాంద్రమాన, శక సంవత్సరాల ప్రస్తావనకు అవసరం లేదు. అవే విషయాలను అదే పౌర్ణమి నాడు నమోదు చేయడానికి కారణం తెలియడం లేదు. శక సంవత్సరం 1454లో పూర్ణిమ వచ్చిన వారంలోనే ఇదియు కాకపోవచ్చు. 'మన్మథ' సంవత్సరం 'నందన' కు బదులు తప్పుగా వ్రాయబడి ఉండింది. అట్లే 'శక 1457' 'శక 1454' కు బదులు దొర్లిన తప్పు అయి ఉంటుంది.

(నెం.41లోని తెలుగు ద్విపద, "అన్నమాచార్యచరిత్ర" లో పే.98పై ఒక లిఖితప్రతిలో పూర్తిగా అచ్చుయి ఉన్నది. ఇందులో కోనేరి పునర్నిర్మాణాన్ని గురించి, వేదిక నిర్మాణాన్ని గురించి, గోపురాలు, నడవ, చుట్టు మండపం, భూవరాహస్వామి చుట్టుగోడ, వీటి గురించి ఉన్నాయి, కాని నీరాళి- మంటపం నెం.40 లో గుర్తించబడ లేదు.

క్రీ.శ.27-3-1532న పెద్ద తిరుమలయ్యంగార్, సాళువ నరసింహుని కాలంలో, వాని పేరున సాగుచున్న, అళగప్పిరానార్ వ్యవస్థీకరించిన, నిత్యపుణ్యస్నాన సమయాలలో ప్రతిరోజు కూడా వేంకటేశ్వరునకు మూడు యజ్ఞోపవీతాలను అర్పించుట ద్వారా; పులుగు కాప్పు రోజున, ఎనిమిది రోజుల కొకసారి ప్రతి శుక్రవారం జరుగుదానిలో, ఒక పన్నీరు-చెంబు సమర్పించుట ద్వారాను, దాతభాగమైన నివేదిత ప్రసాదాన్ని, జీర్ణమైన యజ్ఞోపవీతాలతో స్వీకరించడానికి, స్వామికి సంకీర్తన వినిపించేటప్పుడు పది పోకలు, ఇరవై తమలపాకులు, ఖాళీ పన్నీటిబుడ్డిని స్వీకరించడానికి అర్హతను పొందాడు. (నెం.14).

ప్రతి శుక్రవారం శ్రీవేంకటేశ్వరునకు పునుగు నూనె పూసి పుణ్యస్నానం చేయించే ఆచారముండే అదే సందర్భంలో, **భండారం శిఱు-తిమ్మయ్యర్, భండారం అప్పరసర్** కుమారుడు, స్వామికి ప్రతి శుక్రవారం ఒక **వడపడి నైవేద్యం** నేర్పరచి, అచ్యుతరాయని జన్మనక్షత్రమైన మృగశీర్ష నక్షత్రము ఏర్పరచాడు. 13 రోజులలో ప్రతిరోజు కూడ ఒక వడపడి నైవేద్యం ఏర్పరచాడు (నెం.36).

**పెద్ద తిరుమలయ్యంగారికి కుమారులైదుగురు. వారు: 1. చిన్న తిరుమలయ్యంగార్ 2. అన్నయార్య 3. పెద్ద తిరువేంగళనాథుడు నామాంతరమున తిరువేంగళనాథుడు, తిరువేంగళ, తిరువేంకటప్ప 4.చిన్న తిరువేంగళనాథుడు, నామాంతరమున చిన్నన్న, తిరువేంకటనాథుడు, తిరువేంగళనాథుడు, తిరువేణాదర్, తిరువేణాదయ్యర్, వేంగళార్యుడు, వేంకటేశ దీక్షితుడు 5. కోనేటి తిరువేంగళనాథుడు, నామాంతరమున కోనేటి తిరువేంగళనాథయ్యంగార్, కోనేటి వేంగళనాథుడు, కోనేటి వేంకటనాథుడు. ఈ అయిదుగురు కుమారులందరున్ను,** పెద్దవాడైన చిన్న తిరుమలయ్యంగార్ నామాంతరంగా చిన్న తిరుమలాచార్యుల కుమారుడైన తిరువేంగళప్ప, నామాంతరంలో తిరువేంగళదీక్షితుడు, తిరువేంకటయ్యతో కూడ; తిరువేంగళదీక్షితులని నామాంతరంగల తిరువేంగళప్ప, 4వ చిన్నతిరువేంగళనాథుడు లేక చిన్నన్న, వీరందరును తండ్రి పెద్ద తిరుమలయ్యంగార్, తాత అన్నమయ్యంగార్‌ల వలెనే శాస్త్రాలలో, వేదాంతంలో, తమిళ దివ్యప్రబంధంలో, కళల్లో, కవిత్వంలో, సాహిత్యంలో, సంగీతంలో, యోగంలో, కొన్ని ప్రాకృత భాషలలోను (మాగధి వంటి మాండలికాలు) మహోన్నత విద్వాంసులు.

చిన్న తిరుమలాచార్యుల పెద్ద కుమారుడు, తన తండ్రి తాతలవలెనే వేంకటేశ్వరుని సేవకు తనను తాను అంకితం జేసికొని ఆ దేవుని స్తుతించే సంకీర్తనల్ని వ్రాసి ప్రతిరోజు ఆ స్వామి సన్నిధిలో గానం చేసేవాడు. అతని కుమారుడు తిరువేంకటయ్య **అమరసింహుని 'నామలింగానుశాసనం'.** సాధారణంగ 'అమరం' అనబడు సంస్కృత నిఘంటువుకు, సుభాషిత సాయణాచార్యుల **'సుధానిధి'** అనుదానికిని తెలుగులో సుబోధమగు వ్యాఖ్యానాన్ని రచించాడు.

చిన్నన్న అని నామాంతరముగల 4వ కుమారుడైన చిన్న తిరువేంగళ నాథుడు తెలుగులో **1. అన్నమాచార్య చరిత్ర** (తన తాతగారి జీవితము) **2. పరమయోగి విలాసము 3. అష్టమహిషీ కళ్యాణము 4. ఉషాపరిణయము,** అను వీనిని రచించెను. అతని కుమారుడు తిరువేంగళప్ప **'శృంగార అమరు కావ్యం'** అను సంస్కృత శృంగార శతకాన్ని తెలుగులోనికి **'ఆంధ్ర అమరుక శతకము'** అను పేరున అనువదించాడు.

**పెద్దతిరుమలాచార్యుల పెద్దకుమారుడు చిన్నతిరుమల అయ్యంగారు కల్యాణ వేంకటేశ్వర దేవాలయాన్ని పునరుద్ధరించారు.**

అదిగాక, పెద్ద **కుమారుడైన చిన్న తిరుమలాచార్య లేక చిన్న తిరుమ లయ్యంగార్ శిథిలమైయున్నతన సర్వమాన్యాగ్రహారమైన మంగాపురం గ్రామంలోగల కళ్యాణ వేంకటేశ్వరాలయానికి పునర్నవంగా చేశాడు.** ఈ మంగాపురం తిరుపతికి పడమట ఆరుమైళ్ళ దూరంలో, **వికల్య** అను యేటి ఒడ్డున ఉన్నది. ఇందు శ్రీవేంకటేశ్వరుని, వాని ఇద్దరు నాచ్చియార్లైన శ్రీదేవి భూదేవులను, అనంత, గరుడ, విష్వక్సేనాది పరివారాన్ని, ఆళ్వారులను ఉడైయవర్ (రామానుజ) ను, పూర్వాచార్యులను, తన ఆచార్యుని, తన తాతగారైన అన్నమాచార్యుని, క్రీ.శ.1540 మార్చి 22న ప్రతిష్ఠించి, ఆళ్వారుల సన్నిధిలో పద్యపఠనాన్ని, నేవైద్యాలను, జీయ్యర్, ఆచార్య పురుషులు, తక్కిన శ్రీవైష్ణవులకు, దైవారాధనం పుత్ర పౌత్రాది పర్యంతం సూర్యచంద్రులున్నంతవరకు సాగే ఉద్దేశంతో, పంచి యిచ్చునట్లేర్పరచాడు. (నెం.144) ఒక పూరకంలో (నెం.145) వైష్ణవ ఆళ్వారుల, ఆచార్యుల జన్మనక్షత్రాలను, ప్రధాన దైవం (పెరుమాళ్) యొక్క ఊరేగింపులు రెండు. దశమినాళ్లు, రెండు ఏకాదశులు, ఒక పూర్ణిమ, ఒక అమావాస్య దినాలలో ప్రతినెల పెద్ద వీధులలోను రోహిణి, మృగశిర, ఆరుద్ర, పుబ్బ, ఉత్తర, హస్తా నక్షత్రాలున్న రోజులలోను, ఇతర దినాలలోను చిన్న వీధులలోను నిర్వహించడానికి కోరి తగిన యేర్పాటు చేశాడు.

అదృష్టవశాత్ ఈ ఆలయం స్వర్ణముఖీనదికి ఉత్తరాన రహదారికి దూరంగా కంటికి కానరానట్లుండటంవలన, **క్రీ.శ.1565లో తళ్లికోట యుద్ధంలో ఈ ప్రాంత భూభాగాన్ని విధ్వంసం చేసిన మహమ్మదీయసేనల చేతులలో పడకుండ తప్పించికొన్నది. తిరుపతికి ఉత్తరానగల అచ్యుతరాయల పురమూ, అచ్యుతపెరుమాళ్ ఆలయమూ అలా కాదు. కాని ఏదో విధంగా ఎప్పుడో తెలియని కాలంలో ఆ ఆలయంలో పూజ ఆగిపోయింది,** ఆలయమూ నిరాదరణకు గురియైంది. సుమారు 50 సంవత్సరాల క్రిందట ఒక భక్తురాలు పూవులతో నామమాత్రపు పూజను ప్రారంభించి కొన్ని సంవత్సరాలపాటు కొనసాగించింది. అటు తరువాత ఒక బ్రాహ్మణ భక్తుడు, శ్రీ సుందరరాజస్వామి, నిత్యపూజను తన బాధ్యతగా ఐచ్ఛికంగా స్వీకరించాడు. ఇది కొందరు ప్రజలను ఆలయాన్ని సందర్శించేటట్లు ఆకర్షించింది. తరువాత తిరుపతి దేవస్థానం ఆ ఆలయ యాజమాన్యాన్ని చేపట్టి, తిరుమలపై నెలకొన్న ప్రసిద్ధుడైన వేంకటేశ్వరునికి జరిపించేటంత విస్తరంగా అదే రీతిలో నిత్యపూజ జరిపిస్తూ, దాని మాహాత్మ్యాన్ని విస్తరింపజేశాడు. ఆ ఆలయమూ, ముఖగోపురమూ తూర్పుభాగం మరమ్మత్తు ఇటీవల చేయబడి, చక్కగ నిర్వహించబడుతోంది.

**4వ కుమారుడైన చిన్నన్న కుటుంబం వాడైన సూర్యనారాయణయ్య, కడప జిల్లాలోని రాయచోటి (రాచవీడు) వాస్తవ్యుడు తిరుపతికి వచ్చి 25 సంవత్సరాల క్రిందట అక్కడనే స్థిరపడ్డాడు.** అన్నమాచార్యుడు తాను జీవించి యుండగా పూజించుచుండిన ఒక చిన్న రాగి వేంకటేశ్వరమూర్తిని తనతో తెచ్చాడు. ఈ మూర్తి నాతడు మంగాపురం ఆలయానికి బహూకరించాడు. ఇప్పటికిని అది అక్కడే యున్నది. ఈ సూర్యనారాయణయ్య తానే 1940 లో వ్రాతబడిన తాటియాకు లిఖిత గ్రంథంనుండి కాగితంమీద చూచి వ్రాసికొన్న **"అన్నమాచార్య జీవిత చరిత్రము"** అను వారి 4వ కుమారుడైన చిన్నన్న రచించిన గ్రంథమూ, పద్మశాలీలు, వారి **శిష్యులైన ఒక వర్గపు సాలెవారు, చిన్నన్నకు వ్రాసిన దానపత్రపు రాగిరేకున్నూ, తిరుపతి దేవస్థానము వారి ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీకి సమర్పించాడు.** ఈ రాగిరేకులో తిరుపతికి సుమారు 4 మైళ్ళు పడమట, తిరుపతి నుండి చంద్రగిరి పోవు రహదారికి ఉత్తరాన, చిన్నన్న వేంకటేశ్వరునకు నిర్మించిన ఆలయాన్ని గూర్చి ఉన్నది. ఈ రాగిరేకు దానపత్రం తిరుపతి దేవస్థానం పత్రికలో ముద్రితమైనది.*1

పై జెప్పిన ఆ రాగిరేకు శాసనం కథనం ప్రకారం, **పద్మశాలి, జాంద్రలు అను రెండు నేతపనివారిలోని శాఖల మధ్య తమలో శ్రీ అలమేల్మంగ పుట్టినింటివారెవరు? అను విషయమై ఒక వాగ్వాదమేర్పడి, వారిద్దరున్నూ తాళ్ళపాక చిన్నన్నను మధ్యవర్తిత్వం నెఱపుమని కోరారు. ఆతడు ఆ దేవిని కొన్ని క్షణాలు ధ్యానించి, ఆమె ముఖతః సమాధానాన్ని విని, పద్మశాలియే ఆమె పుట్టినింటివారని ఆతడు ప్రకటించాడు. తమకు అనుకూలంగా ఈ నిర్ణయమున్నందుకు మహదానందభరితులై పద్మశాలి వారు ఆయన పాదాల చెంత 20,000 వరహాలను బహుకృతిగా సమర్పించారు.** ఆ ధనంతో **ఆళ్ళగట్టు** లేక **బలపపుగని-ఊయి** అనే స్థలాన్ని **చంద్రగిరి**కి తూర్పున ఒక మైలు దూరంలో కొని, అక్కడ ఆలయాన్ని నిర్మించి, పూజకగు ఖర్చుల నిమిత్తం, మిగత కార్యకలాపముల నిమిత్తము దేవునకు మగ్గం ఒక్కొక్క దానికి ఒక్క బంగారు రూకను సంవత్సరానికి, అట్లే, ప్రతియొక్క వివాహంలోను ఒక రూక చొప్పున సేకరించి ఆ ధనమును తమ మతగురువుయొక్క దైవమైన **తిరువేంగళనాథస్వామి**కి సమర్పించుటకు సమ్మతించిరి; ఆతడు తమకు గురువున్ను, తాము వారికి శిష్యులున్న అయి యున్నందున, ఆ ధనమునట్లే సూర్యచంద్రులున్నంత కాలము తామున్ను తమ వారసులున్ను సమర్పించు బాధ్యతను వారు స్వీకరించిరి. ఈ దస్తావేజు శకసంవత్సరం 1463 (1465కు తప్పుగా), చాంద్రమాన శుభకృత్ సంవత్సర కార్తిక పౌర్ణమి (నవంబరు 1543 క్రీ.శ.) రోజున వ్రాయబడింది. ఈ ఆలయం కూడ, తిరుపతికి ఉత్తరంలో గల **అచ్యుత పెరుమాళ్ ఆలయం**

---

*1 ఎ) చిన్నన్న తామ్రశాసన ప్రతికృతి మొదట శ్రీ సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'టిటిడి ఎపిగ్రాఫికల్ రిపోర్టు' (1932) గ్రంథం చివర ముద్రితమైంది.

బి) ఈ శాసనాన్ని పరిష్కరించి, విశేషాంశ వివరణలతో ఆంగ్లంలో ప్రకటించిన వారు శ్రీ మానవల్లి రామకృష్ణకవి గారు, Journal of Sri Venkateswara Oriental Institute (JSVOI) , Tirupati, Vol.2, No.1, 1941.

సి) మానవల్లివారి పరిష్కరణ తర్వాత ఆచార్య కె.జె.కృష్ణమూర్తి, చిన్నన్న తామ్రశాసనాన్ని శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనా సంస్థ, స్వర్ణోత్సవ సంచికలో (1989) అనేకానేక విశేషాంశాలతో వివరించి ప్రచురించారు.

గురియైన దురదృష్టానికి గురియైంది. రహదారి ప్రక్కన ఆచ్ఛాదనయైన లేకుండ ఉన్నందున, ఇది కూడ మహమ్మదీయుల సేనలచే క్రీ.శ. 1565లో తళ్లికోట యుద్ధానంతరం, అపవిత్రము చేయబడి విధ్వంసం చేయబడియుండును. నేడు ఆ స్థలంపై పాడుబడిన మట్టిదిబ్బలు, చెత్తచెదారము, పిచ్చిమొక్కలు మాత్రమున్నది.

క్రీ.శ.31-1-1537న, **తిప్పుశెట్టి,** కుమారుడును **చంద్రగిరి పొలిమేరయైన కృష్ణరాయపట్టణం వాస్తవ్యుడు**ను అయిన **నామిశెట్టి,** విజయదశమి రోజున అంకురార్పణం ఆలయంలో చేసి గోవిందరాజుకు పుణ్యస్నానాలు నైవేద్యాలు తిరుపతి లోని దాతయొక్క పూదోట మంటపంలో, స్వామి శమీ వృక్షంపై బాణాలు వేయడానికి వెడలేటప్పుడు నిర్వహించునట్లొక ఉత్సవం ఏర్పాటుచేశాడు. శాసనంలో ఈ రోజు శ్రీలక్ష్మీదేవి ఉత్సవం స్వామికి జరిపిన మరుసటి రోజుగనూ, **శాత్తుముఱై** ఉన్న ఆరు రకముల పణ్యారాలున్ను దాతయొక్క మంటపంవద్ద సమర్పించవలసిన రోజు, ఊరేగింపు గోవిందరాజులకు అశ్వవాహనంమీద, స్వామి దేవేరులిద్దరకు పల్లకి, **విష్వక్సేనునికి** (సేనై ముదలియార్) **అశ్వవాహనము**, ఈ రీతిగా జరపాలి. (నెం. 95).

ఆలయంయొక్క పద్దులు వ్రాసే **పెరియశోలై** వసంతోత్సవాన్ని ఉత్తరాభాద్ర నక్షత్రమున్న రోజునుండి కృత్తిక రోజువరకు అయిదు రోజులు తమిళ నెల పంగునిలో ప్రారంభించాడు. ఇందు ఆలయంలో అంకురార్పణం, పుణ్యస్నానాలు, నైవేద్యాలు దాత మంటపంలో, 8 వీథులగుండా ఊరేగింపులు జరుపబడుతుంది. బహుశః ఖాళీగానున్న వాహనాలను ఆలయంనుండి దాత మంటపానికి మోసి తెచ్చినందుకున్ను, గోవిందరాజులు, ఆయన దేవేరులిద్దరి యొక్కయు ఉత్సవ విగ్రహాలను మంటపం నుండి మరల ఆలయానికి ఎనిమిది వీథుల వెంట ఊరేగింపుగా మోయడానికి, మంటపానికి అలంకరించటానికి, కైక్కోళలకు (ఆలయ సేవకులకు) వేర్వేరుగా పారితోషికాలు చెల్లింపబడినాయి. వైకుంఠ విమానాన్ని ఊరేగింపుగా మోసినందుకు ఐదు పణాలు చెల్లింపబడినాయి. ఉత్సవపుఖర్చుల మొత్తంగా దాత 3000 నఱ్పణాలు మూలధనంగా చెల్లించి, దానినుండి లభించే ఆదాయాన్ని వెచ్చించి చెఱువులు, పంట కాల్వలు ఆలయానికి ఈనాముగా ఇవ్వబడిన గ్రామాలలో త్రవ్వించి, అలా లభించిన అధిక దిగుబడి వలన వచ్చే ధనంతో, ఈ ఉత్సవఖర్చులు భరించేటట్లు యేర్పాటు చేశాడు. ఇది క్రీ.శ.1539 మార్చి 17న వ్రాయ బడినది. (నెం.127).

**సాళువ తిమ్మరస తమ్ముడు సాళువ గోవిందరాజు** శ్రీగోవిందరాజ స్వామికి తెప్పోత్సవం నారంభించినట్లు చెప్పబడింది. ఆ సందర్భంలో ఎవరో ఒక దాత స్వామికి ఒక నైవేద్యాన్ని, ఇతర దినాలలో నైవేద్యాలను ఏర్పాటు చేశాడు. (నెం.133).

ఆలయపు పద్దులు వ్రాయు మరియొకరు **శిట్టయన్** అనబడు **అనంతాళ్వార్ కుప్పయన్,** క్రీ.శ.9-6-1539న, తిరుపతిలోని గోవిందరాజుకు **ఆడి-అయనమ్ నాడు (కటక-సంక్రమణము, దక్షిణాయన పుణ్యకాలం, 15 జూలై ప్రాంతంలో హిందూ పంచాంగానుసారం వచ్చునది),** ఆలయంలో

అంకురార్పణం, తిరుమంజనం, గోవిందరాజుకు,నాచ్చిమార్, సేనై ముదలియార్, సందర్శకులకు నైవేద్యాలున్ను, గోవిందరాజుకు, గరుడాళ్వార్‌కు, గజేంద్రాళ్వార్‌కు పూలదండలతో అలంకారం, భాగవత పురాణంలోని గజేంద్రమోక్షం ఉపాఖ్యానానికి సంబంధించిన పద్యపఠనం మంటపంలోను, అక్కడనుండి కాగడాలతో ఎనిమిది వీథులగుండా ఆలయానికి ఊరేగింపు, ఈ విశేషాలతో **గజేంద్రమోక్షం** ఉత్సవాన్ని జరుపడానికి ఏర్పాటు చేశాడు. ఆలయము నెదుట సంకేతరూపమైన ఒక నీటి గుంటను, బహుశః మొసలి బొమ్మతో కూడ, యేర్పరుపబడింది. ఊరేగింపులో టపాసులు కాల్చారు. ఊరేగింపు ఆలయాన్ని చేరిన వెంటనే, **గరుడవాహనం నంబియార్** చేత చక్కగ అలంకరింపబడి సిద్ధంగ నుంచబడింది. గోవిందరాజు అధిరోహించడానికి, అప్పుడే ఆలయపు ఏనుగు ఆ నీటిగుంటవద్దకు కొని రాబడి అందులోనికి దింపబడడం లాంఛనంగా దాని కాలిని మొసలి బొమ్మ పట్టుటయు, గోవిందరాజు గరుడునెక్కి సుదర్శనం ధరించి, దానిని మొసలివైపు విసరి సంహరించడం, అలా గజేంద్రుని దాని పట్టునుండి విడిపించడం, గజేంద్రునాశీర్వదించి మోక్షమివ్వడం (నెం. 135) జరిగింది. ఇది ఆలయపు పద్దులు వ్రాయునతనియొక్క భావనారూపమైన కల్పన, గజేంద్రమోక్షణ పురాణకథ చూచువారి కది వినోద విజ్ఞాన దాయకం, ఆలయ ద్వారంలో దానిని పఠించడం తోడవుతుంది.

**గోపాలశెట్టి** కులానికి చెందిన **ఎల్లప్ప పిళ్ళై** అనే వ్యక్తి క్రీ.శ.3–8–1541న, వేంకటేశ్వరునకు ముక్కోటి–ఏకాదశి ఉత్సవాన్ని, ముందటి దశమి నుండి మరునాడు ద్వాదశి వరకు మార్గళి నెలలో శుక్ల పక్షంలో, దశమినాడు అంకురార్పణంతో, పుణ్యస్నానం, నైవేద్యాలు, తీర్థవారి పుష్కరిణి తీరంలో; ముక్కోటి ద్వాదశి రోజున మలయప్ప, నాచ్చియార్, సుదర్శనులను వరాహస్వామి ఆలయం చెంత జరుగునట్లు యేర్పాటుచేశాడు. మూడు రాత్రులున్ను నైవేద్యాల యేర్పాటున్నది. (నెం. 165).

**కందాడై (కుమార) – రామానుజయ్యంగార్, తిరుమల తిరుపతులలో రామానుజ కూటాలను, పెద్ద కందాడై రామానుజయ్యంగార్ తరువాత ఆలయ సువర్ణాగారాన్ని నిర్వహించేవారు,** వీరికి చెందినది నెం.3. తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యంగార్, అన్నమయ్యంగార్ కుమారుడు, వీరికి చెందినది నెం.6. ఈ రెండింటిలోను ఉత్సవాలు, పర్వదినాలు, దాతలు సాధారణంగా దేవునకు సమర్పణలు చేసే తదితర దినాలు, అట్లే ఆళ్వారులను, ఆచార్యులను అర్చించే రోజులు, అన్నీ సంపూర్ణంగా పట్టిక ఇవ్వబడినాయి.

**ఉత్సవాలు :** తిరుక్కోడి–తిరునాళ్ లేక బ్రహ్మోత్సవాలు, కోడై తిరునాళ్ లేక వేసి ఉత్సవం, ఊంజల్–తిరునాళ్ లేక డోలోత్సవం, పవిత్రోత్సవం లేక శుద్ధిపరచు ఉత్సవం, మహాలక్ష్మీదేవి ఉత్సవం, అధ్యయనోత్సవం, వసంతోత్సవం, మార్గళి–నీర్– ఉత్సవం. ఇది శూడిక్కొడుత్తనాచ్చియార్ లేక ఆండాళ్ లేక గోదాదేవికి సంబంధించింది.

కొందరు దేవతలు జన్మనక్షత్రాలైన కారణంగా, కొన్ని రోజులు పవిత్రదినాలైనాయి – శ్రీరామనవమి: నవమి శ్రీరాముని జన్మతిథియు పునర్వసు జన్మనక్షత్రమును; శ్రీజయంతి, శ్రీకృష్ణుని జన్మదినము;

వసంతపూర్ణిమ జన్మదినం; శ్రవణం వేంకటేశ్వరుని జన్మదినం; ఉత్తిరం లేక ఉత్తరఫల్గుణి (నెం.97లో చెప్పినట్లు ఇది ఉత్తరాషాడ అయి ఉండాలి), అలమేల్మంగ లేక పద్మావతీదేవి జన్మదినం; అర్పశి నెలలో పూర్వాషాఢ సేనైముదలియార్ లేక విష్వక్సేనుని జన్మనక్షత్రం; వైకాశిలో అనూరాధ గోవిందరాజుని జన్మదిన నక్షత్రం; హనుమజ్జయంతి వైశాఖలోని కృష్ణపక్షంలో దశమి రోజు.

ఇట్లే, వైష్ణవుల ఆళ్వారుల, రామానుజాది ఇతర ఆచార్యులు జన్మదినాల లోను, జన్మనక్షత్రాలలోను వారికి నైవేద్యా లర్పింప బడును. ఆడి–అయనం, మకర సంక్రమణం, ప్రతియొక్క తమిళనెల మొదటిరోజు, అమావాస్యలు ముఖ్యంగా తై–అమావాస్యలు మరికొన్ని ప్రత్యేకదినాలు ప్రధానదేవతలకు నైవేద్యములర్పిస్తారు.

ఉగాది (చాంద్రమానాన్ని బట్టి చైత్రమాసపు మొదటిరోజు, తెలుగు సంవత్సరాది), దీపావళి రెండున్ను పండుగ రోజులు. 25 దశమి, 25 ఏకాదశి, 25 ద్వాదశి, 13 పౌర్ణమి రోజులు, కార్తీకమాసంలో కృత్తికరోజు, ఉత్థానైకాదశి, ద్వాదశి లేక క్షీరాబ్ధి ద్వాదశి, కార్తికమాసంలో విష్ణువు యోగనిద్రనుండి మేల్కొనునని విశ్వసించురోజు. (దీనికి **కైశిక ద్వాదశి** అని కూడ పేరు, ఆనాడు **కైశికపురాణం** ఆలయాలలో చదువబడుతుంది) **ముక్కోటి లేక వైకుంఠ ఏకాదశి,** ముక్కోటి ద్వాదశి పుష్యమాసంలో, అప్పుడు వేంకటత్తూరైవార్, ఉగ్రమూర్తి లేక వేంకటేశ్వరుడు వీథులగుండా ఊరేగింపుగా సంవత్సరమునకొకసారి తీసికొని పోబడి మరల సూర్యోదయమునకు ముందుగనే ఆలయానికి కొనిరాబడును. ఉత్థాన ఏకాదశినాడు స్వామికి నైవేద్యము లివ్వబడుతుంది. ముఖ్యంగా **ముక్కోటి ద్వాదశినాడు** అచ్యుతరాయల అధికారులచే ప్రత్యేక నైవేద్యాలు సమర్పించబడింది.

ఈ రోజులు కాక, కొందరు దాతల, వారి బంధువుల, గురువుల, చక్రవర్తి అచ్యుతరాయలయొక్క జన్మనక్షత్ర దినాలు, పాడియావేట్టై, కనువు, (మకర సంక్రమణం తరువాతి రెండు రోజులు), సహస్ర కలశాభిషేకం, ఇవి కూడ దేవతామూర్తులకు నైవేద్య సమర్పణలకు తగిన సమయాలైనవి.

అచ్యుతరాయల పాలనారంభమున, తమిళ నెలలగు ఆడి, ఆణి, పురట్టాశి, అర్పశి, కార్తికి, తై, మాశి, పంగుని, చిత్రి అను వానిలో నిర్వహింపబడు 9 బ్రహ్మోత్సవములు మాత్రమే ఉన్నవి (నెం.87, నెం.110). వానిలో ప్రతియొక్క దాని పన్నెండు లేక పదమూడు రోజులు, మరీ ప్రముఖంగా ఐదవ, ఆరవ, ఏడవ, ఎనిమిదవ రోజులలో ఉత్సవాలలోను 8వ రోజులలో ఉత్సవ విగ్రహాలకు నైవేద్యం లేర్పరుపబడినాయి. ఈ 9 ఉత్సవాలలోను 8వ రోజులలో రథోత్సవాలున్నట్లు కనబడదు, కాని, రథం ఉపయోగించడానికి పురట్టాశి, కార్తికి, తై, పంగుని అను నాలుగు నెలలు ప్రత్యేకించబడినాయి (నెం.82, 83, 84, 87) ఎట్లైనను, నెం.3 ప్రకారం ఆడి, ఆవణి, అర్పశి, మాశి, చిత్తిరై నెలలో రథంపై నూరేగింపులు జరుగుచున్నాయి. పురట్టాశి, తై మాసాలలోను, తరువాతి కాలంలో వ్యవస్థీకరింపబడిన ఉత్సవం **లక్ష్మీదేవి మహోత్సవం**లోను రథం ఉపయోగించ బడినాయి. (నెం.54;55 క్రీ.శ.26–12–1535 నాటిది, ఈ క్రీ.శ.31 మార్చి 1530 నాటి నెం.3లో ప్రస్తావించబడినవి) ఇది అచ్యుతరాయలచే వ్యవస్థ చేయబడి (బ్రహ్మోత్సవంగా

పరిగణింప బడుతున్నవి. మొత్తము ఎనిమిది బ్రహ్మోత్సవాలు, ఒక రథోత్సవమూ ఇట్లా కార్తికి, పంగునిలలో జరుపు ఉత్సవాలను కలుపుకొని, శాసనం నెం.3లో చెప్పబడినట్లు బ్రహ్మోత్సవాలు 9 కాక 10 అవుతుంది. క్రీ.శ.17-3-1539న,న ఆని నెలలో తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యంగార్ ప్రారంభించిన బ్రహ్మోత్సవములు తొమ్మిది కాక పది అవుతుంది క్రీ.శ.17-3-1539న, ఆని నెలలో తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యంగార్ ప్రారంభించిన బ్రహ్మోత్సవంతో యథార్థ బ్రహ్మోత్సవాల సంఖ్య 10 కి పెరిగినది. ఈ ఆని ఉత్సవంలో, **నాగరపండితునిచే,** క్రీ.శ.6-12-1539న, తన మంటపంలో ఉత్సవమూర్తులకు నైవేద్యం లేర్పాటుచేయ బడినాయి (నెం.140). క్రీ.శ.31-12-1540 నాటి నెం.153, 10 బ్రహ్మోత్సవాలను పేర్కొంటారు.

**బ్రహ్మోత్సవాలు కళ్యాణోత్సవాలుగా పరిగణింపబడింది.** శ్రీకృష్ణుడు మోహిని అవతారమెత్తి వీథులగుండ ఊరేగించబడ్డాడు. నైవేద్యాలందుకొను 5వ రోజు యథార్థంగ వివాహదినమని భావించబడింది (నెం.87; 69). 8వ రోజు రాత్రి అశ్వవాహనం (నెం.69), 9వ రోజు రాత్రి శేషవాహనం వినియోగించబడింది.

సాధారణంగా, ఊంజల్ లేక డోలోత్సవం, పవిత్రోత్సవం, వసంతోత్సవం లేక దమనారోహణ-వసంతోత్సవం, ఉత్సవ విగ్రహాలను సుగంధిలమైన దమనమనే పత్రితో పూర్తిగా నలంకరించబడుతుంది. ఇవి 5 రోజులు జరుపబడింది. (నెం.3; ఆ6; 84; 152; 153); తెప్పోత్సవము 9 రోజులు జరుపబడింది. (నెం.23;24;59;140). **మహాలక్ష్మీదేవి ఉత్సవం 16 రోజులు నిర్వహింపబడినట్లు చెప్పబడింది. (నెం.3).**

నెం.235 ప్రకారం, దేవతామూర్తిని వైకుంఠనాదన్, అనగా వైకుంఠనాథ (విష్ణువు)గా భావించి, వైకాశి ఉత్సవంలో 9వ రోజున నైవేద్యాలర్పింపబడినాయి. వైకాశి బ్రహ్మోత్సవం ఒక్క గోవిందరాజుకు మాత్రమే జరుపబడెను. కాబట్టి విష్ణు భావన గోవిందరాజునందే చేసేవారు.

**శ్రీవరాహస్వామిని జ్ఞానప్పిరాన్‌గా (జ్ఞానప్రద, జ్ఞానదాయక) భావించి,** మార్గళి నెలలోని ఉత్సవమైన తిరుప్పళ్ళి-ఎళుచ్చి 30 రోజులున్ను నైవేద్యాలు సమర్పించ బడుటకు తగిన యేర్పాట్లు చేయబడినాయి. (నెం.138).

**యాదవ నారాయణన్, 13వ 14వ శతాబ్దులకు చెందిన యాదవరాయ ప్రాదేశిక సేనానులకు పూర్వుడైన వాని దైవీకృత రూపం,** అప్పుడు గోవిందరాజు ఆలయంలో ప్రతిష్ఠించబడింది. (నెం.114), సుదర్శనునితో కూడ, ఆలయ ముఖగోపురం వద్ద వాని ప్రతిష్ఠను గూర్చి చెప్పునట్లు తోస్తున్నది.

రథసప్తమి రోజున, గోవిందరాజు ఆలయంలో, **చిత్రకూట మంటపం**లో గోవిందరాజుకు, నాచ్చియార్‌కు, సేనైమొదలియార్‌కు పుణ్యస్నానాలు, నైవేద్యాలు సమర్పించబడినాయి. (నెం.118). ఆలయం నెదుటగల ఈ మంటపం దాని పై కప్పున్ను గోడలున్ను, చిదంబరంలోని గోవిందరాజు ఆలయాన్ని అనుకరించి, శ్రీరామసీతా లక్ష్మణుల అరణ్యవాస సందర్భంగా వారి కుటీరం వలె, చిత్రించబడింది; కనుక దానికాపేరు వచ్చింది.

వేంకటేశ్వరుని ఆలయార్చకులలో ఒకరైన **అప్పయ్యన్** అను నామాంతరముగల **మలై నిన్హామ్ భట్టర్ కుమారుడైన వేంకటత్తురైవర్,** క్రీ.శ.17-9-1539న, శ్రీలక్ష్మీదేవి ఉత్సవంలో ధర్మదర్శనం సందర్భంగా తాము చేసిన సేవలకు పారితోషికంగా విధులను నిర్వహిస్తున్న నంబియార్‌లకు అందరకు కలిసి ఆలయ ధనాగారం నుండి రావలసిన 130 పణాలలో తన భాగమైన 60 పణాలను సరిచేసి 50 పణాలను చెల్లించాడు. 10 బ్రహ్మోత్సవాలలో 3 రోజులు ముప్పాతిక రోజులున్ను ప్రధానార్చకుడుగా నున్నందుకు తనకు రావలసిన తన భాగంతో కలిపి దేవతామూర్తులకు కైంకర్యాలు చేయుటకేర్పాటు చేశాడు. (నెం.136). ఈ **నంబి వేంకటత్తురైవర్,** వేరొక నంబి **మలైనిన్ల పెరుమాళ్**‌తో కలిసి క్రీ.శ.9-11-1539న 150 పణాలు రొక్కంగా చెల్లించాడు. దీనితో తనకు ప్రతిమాదక్షిణ క్రింద రావలసిన 25 పణాలను, నామార్చన (వేంకటేశుని అష్టోత్తర సహస్రనామావళిని) చదివినందుకు పారితోషికంగా తనకు రావలసిన 20 పణాలును, వెరశి 195 పణాలు మొత్తమూ మూలధనంగా నుంచి, వేంకటేశ్వరునకు, వరాహస్వామికి, మిగత దేవతామూర్తులకు సేవల నేర్పాటుచేశాడు. (నెం.138). ఆ కాలంలో, నంబియార్ (అర్చకుడు, నిర్వాహకసమితి సభ్యులు 12 మందిలో ఒకడుగా) తన భాగంగా లభించే ప్రసాదం మీదనూ, ఆలయంలో జరిగే వివిధ ఉత్సవాలలో చేసే సేవలకు పారితోషికంగా ధనరూపంగ వచ్చు దాని మీదను మాత్రమే ప్రధానంగా ఆధారపడి జీవించాడు. తరువాతి కాలంలో నంబియార్‌లు, పూర్వం ఆలయానికి దానమీయబడిన కొన్ని గ్రామాలను దేవదాయంగా పొందిరి. కనుక ధనరూప పారితోషికం నిషేధింపబడినట్లు తోస్తుంది. ఐనను ప్రసాదంలో భాగముంది; నెలసరి వెచ్చాలు, చిల్లర డబ్బులు, ముడిబియ్యం కూడా ఇవ్వబడినాయి.

ఈ ముడిబియ్యం కొలువు శ్రీనివాసులుకు తిరుమామణి మంటపం ముంగిట ప్రతి ఉదయం తోమాలసేవ తరువాత అర్చనకు ముందు నివేదింపబడుతుంది. ఈ నైవేద్యం పంచాంగ శ్రవణం, ముందటిరోజు తాలూకు జమ-ఖర్చులను స్వామి వినునప్పుడు జరుగుతుంది. **ఈస్ట్ ఇండియా కంపెనీ** అధికారం క్రింద ఆలయమున్నప్పుడు, ఆ కాలంలో జరుగుచున్న ఉత్సవములన్నీ నిషేధింపబడి, దాదాపు 200 ఆలయ గ్రామాలు కూడ స్వాధీనం చేసికొనబడుతాయి. ఈ కారణంగా ఆలయానికి గ్రామములనుండి వచ్చే ఆదాయం నిల్చిపోయినది. కాగా, ఆలయ కార్యక్రమాలన్నీ పూర్తిగా యాత్రిక భక్తులు సమర్పించే ధనం మీదనే ఆధారపడక తప్పని స్థితి కలిగింది. పై పెచ్చు, నిల్వయున్న నాలుగులక్షల రూపాయల ధనం కూడ ప్రభుత్వ నిధులలో జమ చేయబడినాయి. **జీయర్‌లు తప్ప, స్థానత్తార్ సభ్యులందరు తొలగింపబడ్డారు. చంద్రగిరికి చెందిన ప్రభుత్వ తహశీల్దార్ పర్యవేక్షణలో, ఆలయ కార్యకలాపాలను నిర్వహించడానికి కొద్దిపాటి జీతంతో ఒక పారుపత్యదారు నియమింపబడ్డాడు. అట్లే, ప్రసాదంలో భాగాలతోను, కొద్దిపాటి జీతంతోను పనిచేయు పరిచారకులు గూడ తొలగించబడ్డారు.**

క్రీ.శ.9-10-1538న, **తొండమండలం, పుఆమండలం, ఉళమండలాలకు** చెందిన **నేతపనివారు** విజయనగరం, మగధ (మధురై?) పట్టణం, విదురప్పట్టణం, పూరణపుప్పర్ లకు చెందిన నేత పనివారలకు అనుకూలంగా, వారొక ప్రత్యేకమైన నమూనాలోనే వస్త్రాలను నేయునట్లును, దానికే కట్టుబడియుండునట్లును,

ఇందుకు తప్పిన వారినుండి జరిమానాగా 12 పొన్-వరహాలు తిరుపతి - కాంచీపురముల మధ్య ఏ ప్రదేశమునైనను, అంతకు దక్షిణముగా ఇంకను దూరముననైనను వసూలుచేసి ఆ మొత్తాన్ని శ్రీవేంకటేశ్వరుని శ్రీ భండారంలో జమచేయునట్లును ఒక ఒప్పందాన్ని ఱాతిపై వ్రాయించారు. (నెం.112).

**గమనిక : శ్రీనివాసమంగాపురము**

సంపుటి 1, నెం.199 నుండి 203 వరకు తెలియవచ్చునది **సిద్ధకుట్టై స్థలము** అను నామాంతరముగల **శ్రీనివాసపురము తిరువేంగడకోట్టం**కు చెందిన **వైకుందవళ నాడు**లో నున్నది. 2వ దేవరాయల పాలన కాలంలో అది శ్రోత్రియంగా ప్రకటింపబడి వేదపారాయణాన్ని శ్రీ తిరుమల తిరుపతిలో ఉద్ధరించుటకుద్దేశింప బడింది. ఇప్పుడు **కొటాల** ఒక చిన్న గ్రామమే యైనప్పటికిన్ని, అసలు అది తాలూకా కేంద్రంగా ఉండేది. ఇది చంద్రగిరికి పశ్చిమోత్తర దిక్కున రెండుమైళ్ల దూరముననను, **ఎగువరెడ్డివారి పల్లికి** పడమట ఉన్నది. ఇచ్చట ఇప్పుడొక పాడుబడిన, ఎత్తైన గోపురం చూడవచ్చు. సంపుటి 4, నెం.144 & 145లో వేదపారాయణదారుల శ్రీనివాసపురం (క్రీ.శ.1433) తాళ్ళపాక వాగ్గేయకార కవుల అలమేలు మంగాపురంగా మారింది (క్రీ.శ.1540). దీనినిబట్టి ఒకనాటి గ్రామం అదృశ్యమై, దాని స్థానంలో ఒక క్రొత్త గ్రామం వెలిసి యున్నట్లును, కాలవ్యవధి 107 సంవత్సరములనియు, కారణం జలప్రళయమనియు గ్రాహ్యం.

మహమ్మదీయ సేనలు ఆలయాన్ని విధ్వంసం చేసినట్లు (క్రీ.శ.1790) తోచును. ఆ కారణం చేతనే **శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి** మకరతోరణం, దేవతలు, ఆళ్వారుల చిన్న ఆలయాలన్నియును అదృశ్యమైనవి. ఒకప్పుడు ఒక సభలో చిన్నన్న ప్రార్థించగా సాక్ష్యమిచ్చిన పద్మావతీదేవి ఆలయం గూడ వానిలో నొకటి. అటు తర్వాతి కాలంలో అలమేలు మంగాపురమనే పేరుతో, అలమేలు మంగతాయారు ప్రతిష్ఠింపబడినందున, తిరుచానూరు ప్రసిద్ధమైంది. చిన్నన్న ఆలయం, **'తిమ్మప్పాలయము'** నకు గూడ ఇదే గతి పట్టినది. (ఇది చంద్రగిరి వద్ద తొండవాడలో గల వేంకటేశుని ఆలయం). దాని చుట్టు గల మిగత ఆలయాలకు అదే గతి.

కళ్యాణవేంకటేశ్వరుడు స్వప్నదర్శనమిచ్చి ఆజ్ఞాపించగా, ఆరాధన నారంభించినది శ్రీ సుందరరాజస్వామి దాదాపు 30 సంవత్సరములా స్వామిని సేవించి 1-22-1979వ తేదీ పరమపదించారు. 29-4-1967న తిరుమల తిరుపతి దేవస్థానం ఆ ఆలయం బాధ్యతను స్వీకరించి, మరమ్మత్తుల తరువాత, 22-2-1981న, ప్రతిసంవత్సరం జరుగు సాక్షాత్కార వైభవోత్సవానికి అదనంగా మొట్టమొదటి బ్రహ్మోత్సవాన్ని ప్రారంభించాడు. నూత్నచైతన్యానికి మార్గం సుగమం చేస్తూ, 14-2-1981న, **శ్రీనివాసమంగాపురపు పొలిమేరపై వికల్య (దేవలతీర్థం) (కళ్యాణి) నదికి పశ్చిమ తీరంలో గల ఒక తోటలోనికి వేదపాఠశాల మార్చబడింది.** - గోపీకృష్ణ

* * *

# అధ్యాయం-21

## సమ్రాట్ సదాశివరాయల కాలం
## (సంపుటి 5, తి.తి.దే. శాసనాలు)

### విజయనగర కాలం-3

సమ్రాట్ సదాశివరాయ మహారాయలు కాలంలో శ్రీవేంకటేశ్వరునకు, శ్రీ గోవిందరాజుకు చేయబడుచున్న అనేకమైన ఉత్సవాలు కొద్దిపాటి మార్పులతో కొనసాగించబడినాయి; కొన్ని క్రొత్తవి కూడ ప్రారంభించబడినాయి.

అచ్యుతరాయల కాలంలో వేంకటేశ్వరునికి జరుగుచున్నట్లు గమనించబడిన 10 బ్రహ్మోత్సవములున్ను సదాశివరాయల కాలంలో ప్రసిద్ధిగ కొనసాగినాయి. ఈ విషయం అనేక శాసనాలలో (నెం.13;38; 46;129, సం.5) ప్రస్తావించబడినాయి, కాని సం.5, నెం.176, ఇదే చివరిది, 11 **తిరుక్కోడి-తిరునాళ్ లేక బ్రహ్మోత్సవాలను ప్రస్తావించింది.**

అట్లే, గోవిందరాజుకు వైకాశి, ఆని నెలలలో నిర్వహించబడే రెండు బ్రహ్మోత్సవాలు మొదటి రెండు లేక మూడు సంవత్సరాలు కొనసాగించబడగా, క్రీ.శ.1545లో, మాశి మాసంలో మూడవ బ్రహ్మోత్సవమొకటి ప్రారంభింపబడినట్లు తెలుస్తున్నది. మొదటిసారి ఈ ప్రసక్తి క్రీ.శ.1545 జులై 3వ తేది నాటి నెం.47లోను, తరువాత క్రీ.శ.1545 జులై 15 నాటి నెం.53 లోను, వెంటనే క్రీ.శ.1545 జులై 16 నాటి నెం.54లోను, ఆ పైన నెం.92;99;141 లలోను కన్పించును. కాని క్రీ.శ.1545 మార్చి 6 నాటి నెం.38 లో **వైకాశి, ఆని నెలలలోని రెండు బ్రహ్మోత్సవాలే చెప్పబడినాయి.** కనుక మాశి నెలలోని బ్రహ్మోత్సవం, క్రీ.శ.1545 మార్చి-జులై నెలల మధ్యకాలంలో, బహుశః జూలై 3న తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యంగార్ స్వయంగా (నెం.47) ప్రారంభించి ఉంటాయి. **క్రీ.శ.1562 జూలైలో నాల్గవ బ్రహ్మోత్సవము వ్యవస్థీకరించ బడెను.** (నెం.171).

నెం.129, వేంకటేశ్వరునికి వేర్వేరు నెలలలో వివిధ బ్రహ్మోత్సవాలను భావించి ప్రారంభించిన వారి పేర్లను, ఈ క్రింది విధంగా, పొందుపరచబడింది:-

1. తిరుమల ఆలయ పద్దులు వ్రాయువారు, ఆవణి నెలలో;
2. కాడవన్ పెరుందేవి, సుందరపాండ్యుని దేవేరి, ఆదిబ్రహ్మపేరున, పురట్టాశిలో;
3. విజయనగరవాసియగు దేవరాయ మహారాయలు, అర్పశిలో;
4. బుక్కరాయమహారాయలు కార్తికైలో;
5. కృష్ణరాయ మహారాయలు తైలో;
6. అరియన్ (హరిహరరాయ మహారాయ) మాశిలో;

7. వీరనరసింగయాదవరాయలు పంగునిలో;
8. ఆలయ పద్దులు వ్రాయువారొకరు చిత్తిరైలో;
9. తాళ్ళపాక (పెద్ద) తిరుమలయ్యంగార్ ఆనిలో;
10. తిరుమలరాజ ఎట్టితిమ్మరాజ (నెం.99లో) అను పేరుగల రామరాజ చిన్న–తిమ్మరాజు, ఆని నెలలో రెండవ బ్రహ్మోత్సవం.

ఈ పట్టికలో ఆని నెలలో రెండు బ్రహ్మోత్సవములు నిర్వహింపబడినట్లు కనబడుతోంది. వీనితో **మొత్తం అచ్యుతరాయల కాలంనాటి రెండు శాసనాలలో** (నెం.86; నెం.110, సం–4) **తొమ్మిది బ్రహ్మోత్సవములు లెక్కించబడినాయి.** నెం.174 (సం.4) లో, ఆడి నెలలోని ఉత్సవంతో మొదలిడి, ఆవణి, పురట్టాశి, అర్పశి, కార్తికి, తై, మాశి, పంగుని నెలలోని ఉత్సవాలతో చిత్తిరై ఉత్సవాన్ని, **తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యంగార్ (నెం.174, సం.4) వ్యవస్థీకరించిన ఆని ఉత్సవాన్ని కలిపి, మొత్తం 10 బ్రహ్మోత్సవాల లెక్క ఉంది.** ఆ కారణంచేత, ఆడి బ్రహ్మోత్సవం సదాశివ రాయలకాలంలో వాడుక తప్పినట్లు తోస్తుంది. అట్లైనను, నెం.153; 161; 175 (సం.5) లలో 11 బ్రహ్మోత్సవాలు గుర్తించబడినాయి.

మొట్టమొదటి శాసనములలో (సం.1, నెం.125న్ను మిగతవి), ఆడి మొదలు చిత్తిరై వరకు 7 బ్రహ్మోత్సవాలున్నట్లు చెప్పబడినాయి. ఈ ఏడింటి లోను, సామవై క్రీ.శ.614లో, పురట్టాశి, మార్గళిలలోని రెండుత్సవాలను ఆరంభించినట్లు తెలుస్తున్నది (సం.1, నెం.8; నెం.9); **ముల్లై తిరువేంకట జీయర్** మాశిలో, హరిహర–2 పేరున క్రీ.శ.1388 జనవరిలో (1–185; 186); దేవరాయ–2 చాంద్రమాన ఆశ్వయుజ మాసంలో క్రీ.శ.1429 డిశెంబరులో (1–1922). అశ్వయుజమాసం పురట్టాశి, అర్పశి సగం – సగంగా ఉంటుంది కనుక, పురట్టాశిలో అప్పటికే సామవై ప్రారంభించిన ఉత్సవముంది కనుక, దేవరాయ–2 వారి ఆశ్వయుజ ఉత్సవం అర్పశిలో, 5–1229లో ఉన్నట్లు, జరుపబడి ఉంటుంది. ఈ అయిదు బ్రహ్మోత్సవాలు కాక, మరి రెండు ఇతర నెలలోని బ్రహ్మోత్సవాలు చెప్పబడినవి; చిత్తిరై (1–74; 75; 61), పంగుని (1–220–221), వీని నెవరు ప్రారంభించారో చెప్పబడలేదు. ఇవి మొత్తం 7 ఉత్సవాలైనాయి : పురట్టాశి; మార్గళి; ఆడి; మాశి; ఆశ్వయుజ (అర్పశి); చిత్తిరై; పంగుని. కృష్ణరాయలు తై నెలలో క్రీ.శ.1513 జూన్‌లో (3–64; 65) ఒక బ్రహ్మోత్సవం నారంభించాడు. ఈ తై ఉత్సవం కృష్ణరాయ మహారాయలచే యేర్పరుప బడినట్లు 3–142లో చెప్పబడింది. క్రీ.శ.1535 డిశెంబరులో అచ్యుతరాయలు లక్ష్మీదేవి మహోత్సవాన్ని వ్యవస్థీకరించాడు. (4–54). క్రీ.శ.1539 మార్చిలో తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యంగార్ ఆని నెలలో ఒక బ్రహ్మోత్సవం నారంభించాడు. (4–100;129). ఈ మొత్తం 10 బ్రహ్మోత్సవాలగును. క్రీ.శ.1537 జనవరి నాటి 4–110, 9 బ్రహ్మోవత్సవాలను ఆడి, ఆవణి, పురట్టాశి, అర్పశి, కార్తికి, తై, మాశి, పంగుని, చిత్తిరై నెలల్లో జరుగుచున్నట్లు చెప్పింది. కాని క్రీ.శ.1542 మార్చి నాటి 4–174 పది బ్రహ్మోత్సవాలను ఆని నెలను కలిపి పై తొమ్మిదితో చెప్పింది. ఈ రెండు జాబితాలలోను రెండు క్రొత్త

ఉత్సవాలు ఆవని, కార్తికి నెలల్లో జరుగుతున్నట్లు తెలుస్తున్నది. **మార్గళిలో సామవై వ్యవస్థ చేయబడినది,** ఆడిలో తిరువేంకటనాథ యాదవరాయలచే అచ్యుతరాయలచే లక్ష్మీదేవి మహోత్సవం లెక్కలోనికి రాలేదు. కనుక ఈ మహోత్సవం బ్రహ్మోత్సవంగా లెక్కపెట్టబడలేదేమో, అందుచేతనే ఈ జాబితాలలో చేర్చబడలేదనిపిస్తుంది. **సామవై యేర్పాటు చేసిన మార్గళి బ్రహ్మోత్సవం,** 13వ శతాబ్దిలో మార్గళిలో, సంపూర్ణంగా వైష్ణవాచారాన్ని, ఆరాధనను ఆలయంలో ప్రవేశపెట్టే నుద్దేశంతో, ప్రారంభించబడిన అధ్యయనోత్సవం, తిరుప్పళ్ళి-ఎళుచ్చి ఆక్రమించి త్రోసివేసి ఉంటుంది.

**కాడవన్ పెరుందేవి** ప్రస్తావన నిస్సంకోచంగా పల్లవరాకుమారి సామవై గురించినదే, పురట్టాశి బ్రహ్మోత్సవాన్ని ఆరంభించి ఆమె గురించిందే. ఆమె సుందరపాండ్యుని రాణిగా (5-129) చెప్పబడటం ఆలయపద్దులు వ్రాయువాని తప్పుడు వ్రాతయు, దానిపై అధికారముద్రవేసిన స్థానత్తార్ పొరబాటు. వారిద్దరకున్ను చారిత్రక విషయపరిజ్ఞానమున్నట్లు కన్పడదు. ఎందుచేతనంటే, శాసనాలు నెం.8; నెం.9. సం-1 రెంటిలో ఆమెను **శక్తివిటంకన్ లేక శ్రీ కాడపట్టిగళ్ రాణియు, పల్లవ-పెఱ్ఱైయర్ కుమార్తె, కాడవన్-పెరుందేవి యను బిరుదుగల సామవై గను స్పష్టంగా ఉంది.** కనుక ఆమె ఒక పల్లవమంత్రి కుమార్తెయు, ఒక పల్లవరాజు భార్యయు అగును. పాండ్య ప్రభువైన మొదటి సుందరపాండ్యుని, బహుశః **మొదటి జటావర్మన్ సుందరపాండ్యుని** (క్రీ.శ.1251-1275), రాణి కాదు, ఆలయాన్ని సందర్శించి, రెండు ప్రాంతాల ఇనాములను పునఃప్రాణితంచేసి, విమానంపై హేమ కలశాన్ని స్థాపించిన (1-49; 43-56) అతని రాణి కాదు. పైగా, కాలక్రమాన్ని బట్టి ఈ రాణి-బంధుత్వము సరిపోదు. ఎందుకంటే **కాడవన్-పెరుందేవి** 8వ శతాబ్దిలో జీవించినది కాగా, సుందరపాండ్యుడు 13వ శతాబ్దివాడు. ఆలయ-యజమానులు తమ వినికిడిలోని విషయాన్ని గుర్తుదెచ్చికొని, సుందరపాండ్యుని పేరుతో కాడవన్-పెరుందేవిని జత గూర్చినారు కాబోలు! ఇది సమన్వయం లేని వ్రాతలు తెలుస్తోంది.

1-178లో ఆలయానికి ఒక గ్రామమును బుక్కరాయలు ఇనాముగా నిచ్చినట్లు తెలుస్తోంది. ఆతడు కార్తికిలో నొకబ్రహ్మోత్సవాన్ని పారంభించినది కొత్త సమాచారమే; ఈ ఉత్సవాలను ఆవణిలోను చిత్తిరైలోను ఆలయపద్దులు వ్రాయువారు వ్యవస్థీకరించా రనే విషయం కూడా క్రొత్త సమాచారమే.

**వీరనరసింగదేవ యాదవరాయలపేరు** నుట్టంకించిన నెం.84 నుండి నెం.94 వరకు గల మొదటి సంపుటి శాసనాలలో, ఆతడు వేంకటేశ్వరునకొక బ్రహ్మోత్సవం నారంభించినట్లు ప్రస్తావనలేదు. ఆతడు దానిని పంగునిలో ప్రారంభించినట్లున్నది కూడ (5-129) క్రొత్త సమాచారమే. అతని రాణి గోవిందరాజులకు వాని 30వ పాలన వత్సరంలో (క్రీ.శ.1239) ఆని బ్రహ్మోత్సవాన్ని వ్యవస్థ చేశాడు.

**తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యంగార్ చేత ప్రారంభింపబడిన బ్రహ్మోత్సవం గురించిన మొదటి ప్రస్తావన క్రీ.శ.1537 అక్టోబరు నాటి 4-100 లో కన్పిస్తుంది.** ఇందులో శిథిలభాగంలో నెల కాలం లుప్తమై పోయింది. అది ఆని నెలయని క్రీ.శ.1539 మార్చినాటిదని స్పష్టమగును.

నెం.153; 161; 176లలో చెప్పబడిన నెం.99 (సం.5) లో బ్రహ్మోత్సవాలలో దేవతల ఊరేగింపులలో కొన్ని వాహనాలు ఉపయోగించబడినట్లు ఇట్లున్నది : 2 ఉత్సవపు దినం రాత్రి వేళ హంసవాహనం, 3వ నాటి రాత్రి సింహవాహనం, 8వ నాటి రాత్రులలో అశ్వవాహనం, 9వ నాటి రాత్రులందు శేష వాహనం, 7వ రోజు రాత్రులలో గోవిందరాజు మదనగోపాలవేషాన్ని ధరిస్తాడు.

**కొన్ని శాసనాలలో ప్రస్తావించబడినట్లు బ్రహ్మోత్సవం కల్యాణోత్సవంగా పరిగణింపబడినది.** అయినప్పటికిని తాళ్ళపాక సిఱు (చిన్న) తిరుమలయ్యంగార్, పెద్ద తిరుమలయ్యంగార్ కుమారుడు, క్రీ.శ.17-8-1547న, 150 రేఖైపొన్ సంవత్సరాదాయాన్ని ఇచ్చే నెడియం గ్రామాన్ని సగభాగాన్ని మాన్యంగా నిచ్చి, ఆ ఆదాయం నుండి అవసరమైన ఖర్చులు చేస్తూ, గోవిందరాజులకు చిత్తిరై నెలలో రోహిణి నక్షత్రమున్న రోజు శాత్తుముఱైగా, రేవతీ నక్షత్రమున్న రోజు ప్రారంభించి అయిదు రోజులు (నెం.9, సం.5) వైవాహికోత్సవాన్ని వ్యవస్థచేశాడు. గోవిందరాజునకు వాని ఇద్దరు నాచ్చియార్‌లకు (శ్రీదేవి, భూదేవి యనుదివ్య దేవేరులు) తిరుమంజనాన్ని నైవేద్యాన్ని అంకురార్పణం రోజున తిల్లైక్కు-వయ్‌త్తన్-మంటపంలో ఆలయానికి ఎదురుగా జరపాలి. (ఈ విశాలమైన నడవ తిల్లై పేరున ఉన్నది. ఈ తిల్లై లేక చిదంబరం గోవిందరాజు ఆలయాన్ని నిర్మించిన యువతిగా భావింపబడుచున్నది). దీనిని మొదటి రోజు పెందలకడనే జరపాలి. తరువాత గరుడవాహనంపై గోవిందరాజును, పల్లకిలో నాచ్చియార్‌ను ఊరేగించి, అటు తర్వాత డోలలో కూర్చుండ జేసి, కొందరు దేవతామూర్తుల నర్చించి, మధ్యాహ్నసమయంలో గోవిందరాజు పాదాలను పాలతో కడిగి, ఆతడు డోలపై కూర్చుని యుండగా, ఒక దేవేరి **హంసవాహనం** మీద, వేరొకదేవేరి **చాతకపక్షివాహనం** పైననుండగా, **(చాతకము కోయిల భేదము, వర్ష బిందువులనే త్రాగుననియు, వెన్నెల కిరణములను ఆహారంగా గ్రహించునని భావించ బడింది)** గోవిందరాజున్ను, వారి దేవేరులిద్దరును సుగంధిలమైన పూలమాలలు మార్చికొన్న వెంటనే జరిపించాలి. రెండవరోజు సాయంకాలంలో వివాహితులైన ఆ ముప్వురును ధ్రువనక్షత్రాన్ని దర్శిస్తారు. అప్పుడు వసంతపు టూరేగింపు, వారి వస్త్రాలపై చందనం పూర్తిగా చల్లబడియుండగా, జరుగుతుంది. ఆ చందనం ఆలయకార్యవర్గం తదితర పరిచారకుల మధ్య పంచబడుతుంది. మరల పుణ్యస్నాననైవేద్యముల తరువాత సాయం సమయంలో వారికి రెండవ ఊరేగింపు శేషవాహనంపై వీధుల గుండ 2వ రోజు రాత్రి జరుపబడుతుంది. నిత్యకృత్యంగా జరుపబడే పుణ్యస్నాననైవేద్యాలు, వైకుంఠవిమానంలో (ఒక దీర్ఘచతురస్రాకారపు గోపురం. విష్ణునివాసమగు వైకుంఠంలోని గోపురానికి ప్రతీకగా భావించబడుతుంది) ఆ ముగ్గురు దేవతామూర్తులకు 3వ నాడు కూడ ఊరేగింపుతోసహా ఉత్సవం జరుపబడుతుంది. నిత్యకార్యకలాపాలు, నైవేద్యాల తరువాత, ఆ రాత్రి ఆ ముగ్గురు దేవతల ఊరేగింపు హనుమాన్ వాహనంపైనున్న గోవిందరాజుతో జరుపబడుతుంది. ఆ దేవుని ఇద్దరు దేవేరుల పల్లకిలో అనుసరిస్తారు. ఇలా ఈ మానవుల వైవాహికాలలో కన్పించు ఆచారవ్యవహారాలు దేవతల వైవాహిక కాలంలో కన్పిస్తుంది.

**వేంకటేశ్వరుని కోసం జరుపబడే బ్రహ్మోత్సవానికి సంబంధించిన ఒక క్రొత్త ఆచార క్రియను ప్రవేశపెట్టినట్లు కనబడుతుంది.** ఆ దేవుని దర్శింపవచ్చిన భక్తుల ప్రవాహంవలన యేర్పడిన మట్టి, దుర్వాయువులను శుద్ధి చేయుటకు మంచి గంధం, కర్పూరం కలిసిన ద్రావణంతో ఆలయపు గోడలను ఆవరణను ప్రక్షాళనం చేయునదే **కోయిల్-ఆళ్వార్ – తిరుమంజనమ్ (ఆలయం, ఆలయాన్ని అంటియున్న భాగాలు, ఆళ్వార్ అనబడే పవిత్రమూర్తి, వీని స్నపనం)** క్రీ.శ.19-10-1544న తిరుపతికి చెందిన వర్తకుడు **వంగీపురం నారాయణశెట్టి** అనునాతడు ఈ ప్రక్షాళన కేర్పాటు చేసినట్లు ప్రకటించు సం.5లోని నెం.25, ప్రక్షాళన క్రమాన్ని గూర్చి లేదా అది జరుపవలసిన ప్రత్యేక బ్రహ్మోత్సవాలు లేక తదితర ఉత్సవ సందర్భమేదియో స్పష్టం చేయలేదు. ఈ క్రియాకలాపాలు ఇప్పటికీ వాడుకలో ఉంది. ఇది నేడు వాడుకలోనున్న ఒకే ఒక్క బ్రహ్మోత్సవం ప్రారంభించడానికి రెండు లేక మూడు రోజులు ముందుగా జరుపబడుతోంది. ఆ సందర్భంలో మూలమూర్తి, ఉత్సవ విగ్రహాలు పూర్తిగా కప్పివేయబడి, ఆలయపు గోడలున్న, గదులున్న తిరుమహామణి మంటపం వరకు నీటితో కడిగి కర్పూరం కలిపిన మంచి గంధం పూత బూసి, ఆ తరువాత నేల కడుగబడుతుంది. ఈ ప్రక్రియ పూర్తియైన తరువాత, దైవదర్శనానికి భక్తులు అనుమతించబడుతారు.

పై జెప్పబడిన దాత ఆ **నారాయణశెట్టియే దమనారోహణ-వసంతోత్సవాన్ని గోవిందరాజులకు జరిపించుటను వ్యవస్థ చేశాడు.** అప్పుడా స్వామి సువాసనగల దమనంతో పూర్తిగ కప్పబడి, వసంతర్తువులో అయిదురోజులపాటు స్వాతి నక్షత్రముండే రోజున అంకురార్పణతో ఉత్తిరం నక్షత్రమున్న (ఉత్తరాషాఢ) రోజున పంగుని (మార్చి-ఏప్రిల్) నెలలో శాత్తుముఱై (చివరిరోజు) అగునట్లు, ఉత్సవం జరుపబడుతుంది (నెం.25). ఉత్సవం, అలిమేలు మంగ లేక పద్మావతి, వేంకటేశ్వరుని భార్య, జన్మనక్షత్రం ఉత్తరాషాఢ కనుక ఆ నక్షత్రమున్న రోజున ఉత్సవం ముగింపు చేయుట సర్వసమ్మతం. ఉత్సవం 5 రోజులు సాగుతుందని చెప్పబడినప్పటికీ, స్వాతి-ఉత్తరాషాఢ నక్షత్రాల మధ్య కాలం యథార్థంగా ఏడు రోజులవుతుంది.

ఆ దాత వేంకటేశునకు, గోవిందరాజుకు, సుదర్శనునకు వేర్వేరు సందర్భాలలో నైవేద్యాలు ఏర్పాటు చేశాడు. వనభోజనం కోసం అప్పటికే చేయబడిన నైవేద్యాలకు మరింత చేర్చి కార్తికి నెలలో శ్రవణం నక్షత్రమున్న రోజున జరుగునట్లు ఏర్పరచాడు (నెం.66). **నారాయణశెట్టి, అతని కుటుంబసభ్యులు కలసి అన్ని పద్దుల ఖర్చుల నిమిత్తం ఆలయధనాగారంలో మూలధనంగా 487900 పణము చెల్లించారు** (నెం.25). అటువంటి భోజనం వేరొకటి తిరుమలలో క్రీ.శ.25-10-1537న తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యంగార్‌చే తన బంధువుల కొరకును, శ్రీవైష్ణవుల కొరకును కార్తికై మాసంలో ఏర్పాటు చేయబడింది (నెం.100, సం.4).

తిరుపతికి చెందిన మరియొక వర్తకుడు **కాళత్తిశెట్టి** క్రీ.శ.31-12-1543న వేంకటేశ్వరునకును జ్ఞానప్పిరాన్ ప్రతిరోజు తిరుమంజనం, అటు తరువాత దీపదర్శనం జరుగునట్లేర్పాటు చేసి, శ్రీనివాసపురాణాన్ని

చదివిన బ్రాహ్మణునికి నెల నెల ఒక రేఖైపొన్ చెల్లించుటకును, ఆతడే **మలైకినియనిన్త-పెరుమాళ్‌కు** వారి ఇద్దరు నాచ్చియార్‌లతోకూడ ముక్కోటి ద్వాదశినాడు ఉదయం వరాహస్వామి ఆలయం నెదుట మంటపంలో తిరుమంజనం, మహానైవేద్యాలను ఏర్పాటు చేశాడు (నెం.10, సం.5).

(ఈ శ్రీనివాసపురాణం ఏమిటో తెలియడంలేదు. తప్పక అది శ్రీనివాసుని గూర్చిన ఒక పురాణగాథ, లక్ష్మీనివాసమైన విష్ణు-వేంకటేశ్వరుని కుడి ఛాతికి సంబంధించింది అయి ఉంటుంది. కాని అది **'వేంకటాచల మాహాత్మ్యం'** అగునో లేక వేరొక రచనయో శాసనంలో చెప్పబడలేదు).

నెం.16 లో **శెవ్వరాయవడమలై అప్పర్** కుమారుడైన ఒకానొక **నాగప్పయ్యన్,** తన ధర్మము క్రింది (కైంకర్యం) ఒక ఊతిరథాన్ని నిర్మించినట్లున్నది.

చాలా బ్రహ్మోత్సవములలో 9 రోజులలో ఉత్సవ విగ్రహాలకు తైలం పసుపు పూస్తారు. దీనిని **తిరుచూర్ణకాప్పు** లేక **చూర్ణాభిషేకం** అంటారు. వీధులవెంట ఊరేగింపులో ఈ పసుపును భక్తులకు పంచుతారు. నెం.41లో ఈ లేపన కార్యక్రమం, ఆ సమయంలో వేంకటేశ్వరునకు నైవేద్యాల ఏర్పాటును గురించి చెప్పబడింది.

**అచ్యుతరాయల కాలంలోను, సదాశివరాయల కాలంలోను క్రీ.శ.3-7-1545న తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యంగార్ వేంకటేశ్వరునకు బ్రహ్మోత్సవాన్ని వ్యవస్థచేసి, ఆ ఉత్సవములో ఉత్సవవిగ్రహముకును వేంకటేశ్వరునకును వేర్వేరు రోజులలో నైవేద్యాలను అధికం చేసి, చాల మందికి వారి వారి సేవలకై పారితోషికాలను చెల్లించు యేర్పాటు చేశాడు** (నెం.47, సం.5). పైగా ఆతడు వసంతోత్సవం 20 రోజులున్ను ప్రతిరోజు సంకీర్తన భండారానికి ఒక ఇడ్డలిపడి నైవేద్యం నేర్పరచెను. (సంకీర్తన - భండారము అనునది నల్లఊతిపలకల పేర్పుతో యేర్పాటుచేసిన ఒక చిన్న పెట్టె వంటి నిర్మాణం ఇది తూర్పున శ్రీరామానుజుల ఆలయంలోనికి చొచ్చుకొని వచ్చి ఉన్నది. వేంకటేశ్వరుని హుండి (భక్తుల మ్రొక్కుబడులు చెల్లించు పాత్ర) కి ఎదుట విమానప్రదక్షిణానికి ఉత్తరపు వేదికపై, ఆలయంచుట్టు ఉంది. **దీనిలో వేంకటేశ్వరాలయ ప్రథమ సంకీర్తనాచార్యుడైన తాళ్ళపాక అన్నమాచార్యులు రచించినవి.** ఆ స్వామి సమక్షంలో పాడిన సంకీర్తనలు రాగిరేకులపై వ్రాయబడినవి. **అతని రెండవ కుమారుడైన చిన్నతిరుమలయ్యంగారున్ను రచించి పాడినవి.** ఈ శతాబ్దపు రెండవ దశకంలో దేవస్థానంవారి కార్యాలయం, తిరుపతిలో వానినచ్చొత్తించుటకు శుద్ధప్రతిని సిద్ధం చేసేనిమిత్తం, తరలింపబడినవి. రాగి రేకులపై లిఖింపబడిన ఆ సంకీర్తనముల భండారం సంగీత దేవతగా భావింపబడి నైవేద్యం లివ్వబడుచున్నది.

ఆతడు **శ్రీ అలమేల్ మంగ నాచ్చియార్‌కు సంవత్సరంలో వచ్చు 53 శుక్రవారములున్ను, మృగశీర్ష నక్షత్రమువచ్చు 13 రోజులున్ను పుణ్యస్నానము లేర్పాటు చేశాడు.** ఆ సమయాలలో తాము రచించిన సంకీర్తనలను పాడుటకు ఇద్దరు సంగీతవిద్వాంసులను 16 రేఖైపొన్ పైన 8 పణాలు సాంవత్సరిక భృతిగా చెల్లించి, ఆ 66 రోజులున్ను పసుపు ఇచ్చేటట్లు ఏర్పాటు చేయబడింది. శ్రీ రామానుజుడు రచించి

బోధించిన విశిష్టాద్వైత వేదాంత సిద్ధాంతానుసారి శ్రీ భాష్యమును ఒక వైష్ణవ పండితుడు తిరుమంజనము 66 రోజులు పఠించగా, అతనికి 6 రేఖైపొన్ సంవత్సరానికి (నెలకు 5 పణాల వంతున) చెల్లించునట్లు ఏర్పాటు చేశాడు.

**పెద్ద తిరుమలయ్యంగార్ తిరుపతిలో గోవిందరాజులకు ఏకకాలంలో తాంబూలం, పసుపుపొడి తిరుమగళుడన్-వరువార్-తిరుమంజనం సమయంలో** ప్రతి దినమూ యజ్ఞోపవీతత్రయంతో సమర్పించడానికి, ఇద్దరు సంగీత విద్వాంసులచే నిత్యస్నపన సమయంలో సంకీర్తన గానానికి, పారితోషికంగా 15 రేఖైపొన్ పైన 8 పణాలు ప్రతి సంవత్సరానికి, అనగా వారిద్దరకును నెలకు 1 రేఖైపొన్ పైన 4 పణాలు చొప్పున, అంటే సంవత్సరానికి 6 రేఖైపొన్ చెల్లించడానికి యేర్పాటు చేశాడు.

అన్ని పద్దులమీద, అర్పణలు వివిధ సేవలకు నెలజీతాలు, మొత్తం ఖర్చు 280 రేఖైపొన్‌గా లెక్కింపబడింది. కాగా, ఇందు నిమిత్తం ముందొక సంవత్సరాదాయం 280 రేఖైపొన్‌గా నున్న ముత్యాలపట్టును దానంగా ఇచ్చాడు. ఆ విధంగా సేవలన్నీ ఉద్దేశించిన రీతిలో కొన్ని సంవత్సరాలు కొనసాగాయి. అంతట నేదో తెలియని కారణం వలన ఆ మాన్యగ్రామాల యొక్క ఆదాయం నిలిచిపోయింది. అంతట పెద్ద తిరుమలయ్యంగార్ రొక్కంగా 157 రేఖైపొన్ పై 3 1/2 పణము సంవత్సరమునకు చెల్లించి అర్పణలు తదితర సేవలు జరిపించి, పైన చెప్పబడిన మిగత సేవలను రద్దు చేశాడు. **సదాశివరాయలు సింహాసనమధిష్ఠించినప్పుడు, తిరుమలాచార్యుడు దానగ్రామాదాయం తిరిగి స్వామికి వచ్చునట్లు విజ్ఞాపన చేసి సదాశివరాయల యొక్కయు, వారి బావమరదియు** ముఖ్యమంత్రియునైన ఆరవీడు వంశపు అళియ రామరాజు యొక్కయు ఆజ్ఞ సంపాదించాడు. అప్పుడాతడు ఆ గ్రామంలోని చెఱువు మరమ్మతులకు 100 రేఖైపొన్ వెచ్చించి, ఆ ముత్యాలపట్టు గ్రామాధిపత్యాన్ని శ్రీవేంకటేశ్వరుని ఆలయానికి బదలీచేసి తన శిష్యుడు చెల్లించిన 70 రేఖైపొన్ తోడుగా తాను 36 రేఖైపొన్ ఆలయధనాగారానికి చెల్లించి, పూర్వపు సేవలన్నిటిని మరల కొనసాగేటట్లుగా చేసి, గరుడ పతాకాన్ని ధ్వజారోహణం చేయించి, వైకాశి, ఆని, మాశి నెలలోని మూడు బ్రహ్మోత్సవాలను గోవిందరాజుకు ఆరంభించనప్పుడు, మరల ఆ మూడు బ్రహ్మోత్సవాల ముగింపువేళ పతాకాన్ని అవరోహణ చేయించునప్పుడును అదనంగా అర్పణలు జరుగునట్లు ఏర్పాటు చేశాడు.

**సదాశివరాయలు కొలువులో మంత్రిగా రాజ్యపాలుడుగా ఉన్న బయకార (వాగ్గేయకార) రామప్పయ్య కుమారుడగు పెరియ తిమ్మరసయ్య చేత పూర్వరాజు కాలంలో ఆలయానికి దానమీయబడిన కొండవీడు సీమలోని చీరాల, పేరాల, ఆండుపల్లి అనే మూడు గ్రామాల నుండి వచ్చే ఆదాయం ఇట్లే నిలిపివేయబడటం** నెం.17 (సం.5) లో ఉట్టంకించబడింది. వాని స్థానంలో రామప్పయ్య వానితో సమానమైన ఆదాయాన్ని, 150 రేఖైపొన్ ఇచ్చునట్టి **కుళత్తూరు గ్రామం**లో సగభాగాన్ని దానం చేసి, తన తండ్రిచేత గోవిందరాజులకు యేర్పరుపబడిన నిత్య కైంకర్యాలను మరల వ్యవస్థ చేశాడు. అది కాక, ఆతడు గోవిందరాజులకు,

సుదర్శనునికి, **తిరువిరుందపెరుమాళ్‌కు, శూడిక్కొడుత్త- నాచ్చియార్‌కు** (ఆండాళ్, గోదాదేవి) అచ్యుత పెరుమాళ్‌కు వారి దేవేరు లిద్దరికి తన పేరు మీదను, తన దగ్గరి బంధువుల పేర్ల మీదను కైంకర్యాలకై మొత్తం 800 రేఖైపొన్ ఆదాయం వచ్చే కొండవీడు పరగణాలలోని **కొప్పోలి, పరచ్చూర్** గ్రామాలను, గండికోట సీమలోని **కారుచ్చూర్, కుప్పాయినిగుంట** గ్రామాలను, మొత్తం నాలుగు గ్రామాలను అదనంగా దానం చేశాడు. మరికొన్ని ఉదాహరణలు కూడ ఇట్టివే, ఆలయమునకు దానమీయబడిన గ్రామాల ఆదాయాన్ని నిలిపి వేసినవి, దృష్టికి వస్తాయి. వేంకటేశ్వరునకు నిత్యకైంకర్యాలకు **నాగర పండైయార్** చేత యేర్పరుపడిన అర్పణలు కొసాగుటకై సదాశివరాయలచే దానమీయ బడిన ఒక గ్రామపు ఆదాయం నిలిచిపోయింది. దానికి బదులు **నాగర పండైయార్ తిప్పణపురము గ్రామంలో సగభాగాన్ని దానమిచ్చి కైంకర్యాలను కొనసాగించాడు** (నెం.77, సం.5) వేంకటేశ్వరునికి వసంతోత్సవం జరుపడానికి పెండ్లికొడుకు తిమ్మరాజు మూడు గ్రామాలను దానం చేశాడు (నెం.83) కాని, వాని నుండి ఆదాయం ఆగిపోయింది. వాని స్థానమున ఆతడు మరియొక గ్రామాన్ని ఆ ఉత్సవం కొనసాగింపజేయడానికి క్రీ.శ.15-2-1554న దానం చేశాడు (నెం.151). **తిరువేణాదయ్య అనే నామాంతరంగల తాళ్ళపాక తిరువేంగళనాథుడు, పెద్ద తిరుమలయ్యంగారి కుమారుడు వేంకటేశ్వరుని వైవాహికోత్సవానికి మల్లవరం దానమిచ్చాడు** (నెం.71). **దాని ఆదాయం. దానికి బదులాతడు (క్రీ.శ.19-2-1554న దేవరాయపల్లిని దానము చేసి, వైవాహికోత్సవమును మరల జరుగునట్లేర్పరచెను.** (నెం.153).

అదే తేది, క్రీ.శ.1545 జులై 3న, పెద్ద తిరుమలయ్యంగార్ ఆలయ ధనాగారంలో 2860 పణాలు నిక్షేపించి, పూర్వం తానే ఏర్పరచిన వనభోజనం సందర్భంగా, 62 దధ్యోదనము, ఇతర నైవేద్యములు కొనసాగిస్తూ, 12 వడపడిని ఉత్సవ విగ్రహాలకు, ఆలయ కార్యనిర్వహణ సమితి సభ్యులు 12 మంది పేరున నిర్మింపబడిన 12 మంటపాలలో అదనంగా నివేదించేటట్లు ఏర్పరచాడు. (నెం.47ఎ)

**ఆరవీడు బుక్కరాజ రామరాజ తిమ్మరామయ్య కుమారుడైన శ్రీమన్ మహామండలేశ్వర విఠలేశ్వర మహారాజు వేంకటేశ్వరునకు వైకాశి నెలలో రోహిణీ నక్షత్రం రోజు శాత్తుముత్తైతో సంపన్నమయ్యేటట్లుగా, అది వారి జన్మనక్షత్రమైనందున, అయిదు రోజులు జరిగేటట్లు పల్లవోత్సవాన్ని వ్యవస్థ చేశాడు.** ఆ సందర్భంలో లెక్కలేనన్ని నైవేద్యాలు, 6 వగైపడి (రకరకముల తినుబండారాలు : వడపడి, అతిరసపడి, అప్పపడి, గోధిపడి, సుగియపడి, దోశపడి) ఆ అయిదు రోజులలో ప్రతి దినము మరియొక 3 నైవేద్యాలు, ఒక అప్పళంపడి, రెండు కుండల మజ్జిగ సంవత్సరంలో ప్రతి దినం వేంకటేశ్వరదేవునకు అర్పించేటట్లు వ్యవస్థ చేశాడు. దానికయ్యే ఖర్చులకై సంవత్సరానికి 1000 రేఖైపొన్ మొత్తం ఆదాయం వచ్చేటట్లు మూడు గ్రామాలను దానం చేశాడు. పురట్టాశి నెలలో జరిగే బ్రహ్మోత్సవానికి వచ్చిన యాత్రికులకును, మజ్జిగ నందించు చలివేంద్రాలను నిర్వహించినందుకు వస్త్ర బహూకరణ కేర్పాటు చేశాడు. ఆలయ పరివారం అందరికి స్థానత్తార్, నంబియార్ (ఆలయ అర్చకులు) నుండి సాధారణ పనివారి వరకు, జీతాలు బహుమానాలు ఇచ్చుటకును **వేదాలు, తిరువాయ్‌మొళి,** పఠించేవారికి **తిరువేంకటమాహాత్మ్యం**

**(వేంకటాచలమాహాత్మ్యం) చదివేవారికి, ప్రధానమైన ఉత్సవాలకు ముహూర్త నిర్ణయం చేసే జ్యోతిష్కులకును పారితోషికాలను ఇవ్వడానికి కూడ యేర్పాటు చేసెను.** వేంకటేశ్వరునికి నిత్యకైంకర్యాలకు పల్లవోత్సమును చక్కగ నిర్వహించడానికి ఆ దానగ్రామాల నుండి లభించు 1000 రేఖైపొన్ ఆదాయాన్ని పూర్తిగ వెచ్చించుటకు స్థానత్తార్ బాధ్యతవహించాడు.

**పొట్లపాడి తిమ్మరాజయ్య** క్రీ.శ.15-7-1545న ఆలయధనాగారానికి 13,220 నఱ్ఱణాలు చెల్లించాడు. **సదాశివరాయ అళియ రామరాజయ్యల క్షేమాన్ని అపేక్షించి నిత్యం వేంకటాచల మాహాత్మ్యాన్ని అళగప్పిరానార్ తిరుమంజనానికి** (స్నానానికి) వేంకటేశ్వరునకు చేయించు సమయమున పఠించుటకును, ఆ కార్యక్రమం జరుగుచున్నప్పుడు, నిత్యం చేయు 4 నైవేద్యాలను వసంతోత్సవంలో చేసే 20 నైవేద్యాలు కాక, చందనాన్ని, శుభ్ర కర్పూరం, తాంబూలం, ఒక అతిరసపడి కూడా సమర్పించడానికి ఆ ధనంతో యేర్పాటైనది (నెం.53). అచ్యుతపెరుమాళ్, వరదరాజ పెరుమాళ్, గోవిందరాజులకు వేర్వేరుగా నిత్యం చేసే తిరుమంజనం సమయంలో వేంకటాచల మాహాత్మ్యాన్ని పఠించేటట్లును, దానికి అవసరమైన పదార్థాల సేకరణ కోసము, పాఠకులకు పారితోషికంగా ఇవ్వడానికి ఆ ధనంనుండి ఏర్పాటు చేశాడు. అదికాక, వేంకటేశ్వర గోవిందరాజులకు వారి వారి బ్రహ్మోత్సవాలలోను ముక్కోటి ద్వాదశి, మకర సంక్రమణం, ఉగాది, దీపావళి రోజులలో ఆండాళ్ లేక గోదాదేవికి ఆమె మార్గళి-నీరాట్టోత్సవం సమయంలోను కైంకర్యాల నేర్పరచాడు. వసంతోత్సవం సమయంలో గోవిందరాజున్ను వారి దేవేరులున్ను ఊతిరథంపై నూయెలలో తన ఆలయం నెదుట ప్రతి దినమున్ను 20 రోజులపాటు ఆసీనులై ఉంటే, **పన్నీరు చల్లి, కర్పూర చందనాలులలది, ఉడికించి తాలింపువేసిన పెసలను అల్పాహారంగా అవసర నైవేద్యమిత్తురు.**

తిరుమలలోని ఊతిరథంపై గూడ ఇట్టి ఊయెల నొకదానిని యేర్పరచి, ఆలయానికి చెందిన యువతులిద్దరు, **లింగసానియును తిరువేంకటమాణిక్కమున్ను** అందు ఉత్సవవిగ్రహాలు వసంతోత్సవం 20 రోజులు కూర్చుండుటకును, చివరిరోజున వారికి కైంకర్యం లర్పించడానికి ఏర్పాటైనది. (నెం.32). సదాశివరాయ మహారాయలు, అళియ రామరాజదేవమహారాజు, **ఆరవీడు బుక్కరాజ శ్రీరంగరాజు** కుమారుడు, క్రీ.శ.19-1-1545న, గోవిందప్పెరుమాళ్‌కు, **పొట్లపాటి రామరాజు** కుమారుడైన తిమ్మరాజు చేసిన యేర్పాటుననుసరించి, అంగరంగవైభవం (శరీరాలంకరణ), ద్వాదశి రోజున (ముక్కోటి ద్వాదశి నాడు) గోవిందరాజుకు తిరుమంజనం కైంకర్యములున్ను, గరుడ వాహనంపై తాను, పల్లకిలో **నాచ్చియార్, సేనై-మొదలియార్‌తో** కూడి ఊరేగింపు, హనుమానునకు గూడ మకర సంక్రమణం రోజున తిరుమంజన కైంకర్యాలును, వేంకటేశ్వరుని సన్నిధిలో వారి తిరుమంజనం వేళ అనుదినం తిరువేంకటమాహాత్మ్య పఠనం, గోవిందరాజు సమక్షంలో కూడ ప్రతిదినం యేర్పరుపబడింది. మాహాత్మ్యం పఠించు వారి జీవితానికై పొట్లపాడి తిమ్మరాజు తిరుమంజనం నిర్వహించడానికి నిక్షేపించిన 50 పణాలు నుండి చెల్లింపు జరుగును.

**తిమ్మ ఉదయగిరి నరసింహభట్టర్ కుమారుడు, పొట్లపాడి తిమ్మరాజు కుమారుడు ఆత్రేయగోత్రుడైన ఆరవీటి బుక్కరాజు మనుమడైన ఉదయగిరి దేవరాయభట్టర్,** క్రీ.శ.25-3-1546న **గోవిందరాజసన్నిధి**

**వీధి తూర్పు మూలనున్న హనుమానుని** ఆలయంలో **శ్రీవిఠలేశ్వరస్వామి** విగ్రహాన్ని ప్రతిష్ఠించి, తనచే క్రొత్తగా యేర్పరుపబడి **విఠలేశ్వరపురమని పేరుపెట్టబడిన గ్రామాన్ని,** దానితో కొంత పొలమును, ఒక పంట కాల్వను దానం చేసి స్థానత్తార్‌కు **తిరుపతిలోని కోమటి కులజుల నుండి** ఈ 10 రేఖైపొన్, **తిరుపతి వర్తకుల** నుండి ఈ10 రేఖై-పొన్, కొత్తపాళయం వారగు వర్తకుల నుండి 10 రేఖై-పొన్, మొత్తంగా 30 రేఖై-పొన్ వారిచే దైవసాక్షిగా అంగీకరింపబడి ప్రతిష్ఠింపబడిన **విఠలేశ్వరుని సేవకై** నీటితో ధారాదత్తం చేయబడిన దానిని స్వీకరించుటకు అనుమతి నీయబడింది. ఈ ధనంతో గోవిందరాజుకు సంవత్సరంలో వచ్చే 52 శనివారాలలోను, 13 శ్రవణ నక్షత్రపు రోజులలో, శ్రీజయంతి, దీపావళి, కార్తికై, **మకరసంక్రమణం, రథసప్తమి, ఆడి-అయనము** తదితర శుభతిథులలోను కైంకర్యాలను, తిరుమంజనాన్ని, అల్పహారాన్ని ఏర్పాటు చేయాలని, గోవిందరాజుకు ఆతని మూడు బ్రహ్మోత్సవాల సమయంలో, శ్రవణా నక్షత్రంవారు, కార్తీక మాసం వనభోజనం రోజుతో కలసి మరికొన్ని రోజులలోను ఏర్పాటు, కార్తిక మాసంలో కృత్తికానక్షత్రంనాడు **తిరువీళి ఆల్వాన్ (సుదర్శన చక్రం) ఆళ్వార్ తీర్థం (కపిలతీర్థం)** నకు తిరుమంజనానికై కొనిపోబడి అక్కడ ఒక మనోహరపడి నైవేద్య మీయబడుతుంది. అట్లే గోవిందరాజు అదే ఆళ్వార్‌తీర్థానికి మకర సంక్రమణంనాడు కొనిపోబడి ఒక మనోహరపడి నివేదించబడుతుందని చెప్పబడింది. ఈ శాసనంలో, **తిరుచ్చుకనూర్ (తిరుచానూరు)** నకు ఒక ప్రతినామం (రెండవపేరు) **వరదరాజపురం** అని చెప్పబడింది (నెం.66, సం.5).

**తాళ్ళపాక పెద్ద తిరుమలయ్యగారి 4వ కుమారుడైన తిరువేంకటనాథుడు కొండవీడు సీమలోని శేందలూరు గ్రామాన్ని మల్లవరాన్ని దానం చేశాడు. శెందలూరుపై సంవత్సరాదాయం 500 గట్టి వరహాలు (వరహా ముద్రగల కల్తీలేని బంగారు నాణేలు), మల్లవరంపై 120 గట్టి వరహాలు ఆదాయం వస్తుంది.** ఇది క్రీ.శ.17-7-1546 నాటి దానం. ఈ మొత్తం ఆదాయం నుండి వేంకటేశ్వరునికి అనూరాధా నక్షత్రం రోజు నుండి ఉత్తిరాడం (ఉత్తరాషాఢ) నక్షత్రదినంలో పూర్తియగునట్లు పంగుని (మార్చి-ఏప్రిల్) నెలలో అయిదు రోజులు వైవాహికోత్సవం జరపడం ఉద్దేశం (నెం.71). వాని అన్నగారు శిఱు (చిన్న) తిరుమలయ్యంగార్ క్రీ.శ.17-8-1547న దానిని ప్రారంభించాడు (నెం.99) నూనెపూత, పుణ్యస్నానం వీధులలో ఊరేగింపు తరువాత ఊయెలలూగడం, మలైకినియనిన్ఱ పెరుమాళ్ ఊయెలపైనను, **ఒక దేవేరి హంసవాహనంపై మరియొకరు చాతకపక్షివాహనంపై కూర్చొని ఉండగా పూమాలలను మార్చుకోవడం,** ఆపై మలయప్ప పవిత్రపాదాలను పాలతో కడగడం హోమము (నెయ్యి అన్నము కలిపి పీఠంపైన అగ్నిలో వ్రేల్చుట), ఇత్యాది మానుష వైవాహిక కార్యకలాపాలన్నీ జరగాలి. ధ్రువదర్శనం తొలి సంధ్యవేళలో, చందనవసంతోత్సవము తదితర ముచ్చటలు కూడా ఉండాలి.

దాత ఉత్సవవిగ్రహాలకేర్పాటు చేసిన కైంకర్యాలు కాక, ఆతడు వేంకటకృష్ణ విగ్రహానికి, అలర్‌మేల్‌మంగై నాచ్చియార్‌కు, అర్పశి నెలలో శ్రవణా నక్షత్రమున్న తిథినామ వరాహస్వామికి, చిత్తిరై నెలలో మృగశీర్ష నక్షత్రమున్న రోజున పెరియపెరుమాళ్ (మూలమూర్తియైన వేంకటేశ్వరుని విగ్రహం) కు, **ఇది పెరియ**

**తిరుమలయ్యంగారి తండ్రి జన్మనక్షత్రమై నందున; తమ తల్లిగారైన తిరుమలమ్మగారి ప్రతి సాంవత్సరిక శ్రాద్ధదినంలో అర్పశి నెలలో; ఆని నెలలో తమ మూడవ అన్నగారైన తిరువేంకటప్పగారి సాంవత్సరిక శ్రాద్ధదినమున; తమ పెద్ద తండ్రియైన తాళ్ళపాక అన్నమయ్యగారి జన్మనక్షత్రమైన విశాఖ రోజున వైకాశి నెలలోను** (నెం.71) **అర్చనలకు యేర్పాటు చేశాడు.** తాళ్ళపాక తిరువేంకటనాథుని పెద్దన్నయైన చిన్న (శిఱు) తిరుమలయ్యంగార్ దాతయై క్రీ.శ.17-8-1547న (నెం.99) గోవిందరాజుల ఆలయపు మొదటి గోపురంలో ఆలయమందున్న సుదర్శనునికి మృగశీర్ష నక్షత్రమున్నరోజు వైకాశిలో, పొరపాటుగా చిత్తిరైకి బదులుగా (ముందు చెప్పబడినట్లు) వ్రాయబడింది, అది వారి తండ్రిగారైన పెరియ తిరుమలయ్యంగారి జన్మ నక్షత్రమైనందున, ఒక మనోహరపడి అర్పించడానికి, మరియొక మనోహరపడిని గోవిందరాజుకు చిత్తిరై నెలలో చిత్తిరై నక్షత్రం రోజున, అది తన జన్మనక్షత్రమైనందున, అనగా చిన్న తిరుమలయ్యంగారిది, అర్పించునట్లు ఏర్పాటు చేయబడింది.

ఈ శిఱు తిరుమలయ్యంగారు ఆలయానికి క్రీ.శ.17-8-1547న నెడియం గ్రామంలో సగభాగాన్ని దేవదాయంగా ఇచ్చాడు. ఈ గ్రామార్థంలో సంవత్సరానికి 150 రేఖై-పోన్ ఆదాయం వస్తుంది. దీనితో నాతడు గోవిందరాజుకు అతని భార్యలిద్దరితోను చిత్తిరై నెలలో రోహిణీ నక్షత్రయిచ్చే రోజున శాత్తుముఱై (ముగింపు) జరిగేటట్లు తత్సంబంధి కార్యకలాపాలు, స్నానాలు, నివేదనలు, ఊరేగింపులు, ధనబహూకృతులు, వివిధ సేవల జేసినవారికి జీతాలు ఇత్యాదులతో అయిదు రోజుల పాటు వైవాహికోత్సవం జరిగేటట్లు వ్యవస్థ చేశాడు. అదే సమయంలో అతడు **వీడుమపాక్కం గ్రామాన్ని కూడ దానం చేశాడు.** దీనిపై సంవత్సరాదాయం 200 రైఖైపోన్ కాగా దానిని వినియోగించి గోవిందరాజుకు **ఆళ్వార్-తీర్థంలో తీర్థవారి** మంటపంలో కొలువైయున్న **లక్ష్మీనారాయణ పెరుమాళ్‌కున్ను, తిరుపతిలోగల కత్తారి హనుమాన్ ఆలయంలో తానే ప్రతిష్ఠించిన నరసింగపెరుమాళ్‌కు వైకాశి, ఆని, మాశి** నెలలో గోవిందరాజుకు జరుగు మూడు బ్రహ్మోత్సవాలలో వేర్వేరు రోజులలోను మరికొన్ని పుణ్యతిథులలోను, **సాళువ గోవిందరాజు అను ప్రధాని సాళువ తిమ్మరస (అప్పాజి) చిన్న తమ్ముడును,** పరగణాపాలకుడును, మంత్రియునైన ఆతడారంభించిన తెప్పోత్సవం రోజు, **ఆండాళ్ లేక గోదాదేవికి మార్గళి-నీరాట్టం** ఉత్సవం 8 రోజులు, విఠలేశ్వర పెరుమాళ్, రఘునాథ లేక శ్రీరాముడు, అచ్యుత పెరుమాళ్‌లకు ప్రత్యేక సందర్భాలలో, తిరుచానూరులోని వరదరాజు పెరుమాళ్‌కు ఉగాది, దీపావళి, **పాడియవేట్టై** పండుగ రోజులలో, తై, పంగుని బ్రహ్మోత్సవాలలో రెండు రథోత్సవముల లోను, **విడాయాట్టి** రోజులలోను నిత్యనైవేద్యాలను ఏర్పరచాడు. మరికొన్ని అర్పణలుగూడ గోవిందరాజుకు వసంతోత్సవం 5వ రోజు చివరి రోజుల్లో రథంపై ఊరేగింపు తరువాత, రథాలంకరణకు, జీతం, రథములాగుటకు, పతాకాన్ని మోయడానికి, గొడుగు, కాగడాలు పట్టినందున జీతాలు ఏర్పరచాడు.

పైన చెప్పబడిన చిన్న **తిరుమలయ్యంగారి ఏర్పాట్లతో బాటు వాని కుమారుడు తిరువేంకటయ్యన్** 41 రైఖై-పొన్ చెల్లించి ఉత్సవ విగ్రహాలకు వేంకటేశ్వరునకు **ఎట్టి-తిమ్మరాజు నామాంతరం గల**

**తిరుమలరాజు** యేర్పరచిన ఆని-బ్రహ్మోత్సవంలో 5వ, 8వ, 9వ రోజులలోను; వారి తండ్రి యేర్పరచిన ఉటి-అడి రోజున ఉత్తరపు వీధిలోను కైంకర్యం లర్పించుట కేర్పాటు చేశాడు. అదే సమయంలో **కందాడై అప్పన్ పుణ్ణియం గ్రామం**లో సగభాగం దానం చేశాడు. దాని వలన 60 రేఖై-పొన్ సంవత్సరాదాయం రాగా, దానితో పురట్టాశి, కార్తికై, తై, పంగుని బ్రహ్మోత్సవాలలోను, **తాళ్ళపాక పెరియ తిరుమలయ్యంగార్,** ఎఱ్ఱ-తిమ్మరాజులు ప్రారంభించిన ఆని-బ్రహ్మోత్సవాలలో వైకాశి, ఆని, మాశి నెలల్లో 9వ రోజులలో గోవిందరాజులకు శేషవాహనంపైన, ప్రత్యేక దినాలలో ఆండాళ్, రామానుజ, సుదర్శనులకు నివేదన లందించడానికి ఏర్పాటు చేశాడు.

**ఆరవీడు నారప్పరాజు కుమారుడైన శ్రీమన్ మహామండలేశ్వర పొట్లపాడి రంగరాజు,** క్రీ.శ.13-10-1546న, **తిరుపతిలోని వానమామలై జీయర్ మఠం** ప్రక్కన ఒక ఆలయంలో **తిరువేంకటముడైయాన్** (వేంకటేశ్వరుడు) విగ్రహాన్ని ప్రతిష్ఠించి, గోవిందరాజుల ఆలయ పాకశాల నుండి స్వామి రాత్రి నైవేద్యాలకు ప్రతి రాత్రీ ఏర్పాటు చేశాడు (నెం.79). ఇది కాక వేంకటేశ్వరునకు ప్రతి సంవత్సరం 2920 నైవేద్యాలకున్ను ఏర్పాటు చేశాడు, అట్లే గోవిందరాజుకు 370 రేఖైపొన్ ఆదాయాన్నిచ్చే **రాచ్చేఱులు గ్రామాన్ని** దానం చేశాడు. అదే తేదిన, క్రీ.శ. 13-10-1546న **కోయిల్-కెళ్వి వానమామలై రామానుజ జీయర్** 2000 నఖ్బణాలు చెల్లించి అదే వేంకటేశ్వర విగ్రహానికి ఆ రోజు కైంకర్యాల నేర్పాటు చేశాడు. ఆ విగ్రహాన్ని ఈ జీయర్ గారే ప్రతిష్ఠించి రాత్రి వేళల స్వామి ఆలయంలో దీపాల నేర్పరచాడు (నెం.80).

తిరుమల ఆలయంలో 14 పద్దులు వ్రాయువారందరూ వేంకటేశ గోపాలకృష్ణుడు, వారి దేవేరు లిద్దర ప్రతిమల్ని తిరుపతిలోని వారి మంటపంలో ప్రతిష్ఠించినట్లున్నదని, క్రీ.శ.25-10-1546న మూలధనంగా ఒకే పద్దులో 2575 నఖ్బణాలు చెల్లించి, ప్రతి రాత్రి వారి కైంకర్యాలకు, వారి సన్నిధిలో దీపాలు పెట్టడానికి, సంవత్సరంలో కృష్ణుని జన్మనక్షత్రమగు రోహిణి వచ్చు 13 రోజులలోను, 14 వేర్వేరు దినాలలో పద్దులు వ్రాయు పదునల్గురి పేర్లతో ఆ సేవలు జరుగునట్లేర్పాటు చేయబడింది. నిత్యకైంకర్యాలను, ప్రత్యేక కైంకర్యాలను గోవిందరాజు ఆలయ పాకశాలలో సిద్ధపరచి ఉత్తరపువీధిలోని మంటపానికి చేర్చబడి, అక్కడ నివేదించబడవలెనన్నది యేర్పాటు చేయబడింది (నెం.82).

**ఉదయగిరి నరసింహభట్టర్ కుమారుడు దేవరాయభట్టర్** తిరుపతికి చెందిన వర్తకుల నుండి ఒక ఒప్పందాన్ని రాబట్టాడు. ఇది శ్రీవేంకటేశ్వరునికి ఉదకపూర్వక ధారాదత్తం చేయబడింది. దీని ప్రకారం వారు ప్రతి సంవత్సరం దాదాపు 1250 రేఖైపొన్ చెల్లిస్తారు. క్రీ.శ.6-3-1547న ఆలయస్థానత్తార్ ఆ ధనాన్ని ఆ వర్తకుల నుండి సమీకరించడానికి అధికారాన్ని పొందింది. ఇలా స్వీకరించిన ధనాన్ని పూజాద్రవ్యాలను, కైంకర్యాలుంచిన దీపాలను, పూలను నిత్యం సమకూర్చుకోవడానికి, తిరుపతిలో తాను ప్రతిష్ఠించిన **శ్రీ విఠలేశ్వర పెరుమాళ్**నకు ఉత్సవాలను నిర్వహించడానికి, వస్తుసామగ్రికై ఆలయ పరిచారకులు, కావలివారు, రక్షక భటులు, మావటివారు, పూదోటల మాలీలు, సంబారములను తిరుపతి

నుండి తిరుమలకు చేర్చువారు, సంగీత విద్వాంసులు సహస్రనామ (1008 భగవన్నామాలు) పఠనం అర్చన సమయాలలో చేసేవారు, వేదపారాయణం చేసేవారు, విఠలేశ్వరాలయ ముఖద్వారం వద్ద, పర్వతపాదం వద్ద తనచే యేర్పాటు చేయబడిన రెండు చలివేంద్రాలలోని నీటిని అందించేవారు, వీరందరకు జీతాలు చెల్లించడానికి వెచ్చించవలసి ఉంటుంది (నెం. 89).

**శొట్టై ఈట్టూర్ తిరుమల నంబి కుమార తాతయ్యంగారి కుమారుడైన శ్రీనివాసయ్యంగార్** క్రీ.శ. 3-6-1547 తనకు పూర్వం సదాశివరాయ మహారాయలు దానం చేసిన, 2000 చక్రంపొన్ సంవత్సరాదాయం ఇచ్చు **జగదాభిగుత్తిసీమలోని పెరియ-ఇక్కలూర్ గ్రామాన్ని** దానం చేసి, వేంకటేశ్వరునికి, మాశి నెలలో పునర్వసు నక్షత్రతిథి నుండి పూరమ్ (పూర్వఫల్గుని) నక్షత్ర తిథి వరకు 5 రోజులు పల్లవోత్సవం (చివురాకులతో చేసేది, కాని ఆకుల ప్రస్తావనలేదు) నిర్వహించనారంభించాడు. ఉత్సవం చివరి రోజున తిరుచ్చి, వైకుంఠవిమాన వాహనాలను **సభైయార్ (తిరుచానూరు పాలక సంఘుసభ్యులు)** స్వయంగా మోసి అందుకు ప్రతిఫలంగా ఒక్క రేఖను స్వీకరించాలని యేర్పాటు చేయబడింది. **తిరువేంకట మాహాత్మ్యాన్ని (వేంకటాచలమాహాత్మ్యం)** పఠించుట, 2 పణాలు పారితోషికంగా వేంకటత్తురైవార్‌కు చేస్తారు. ఈయుణ్ణి అప్పన్ ఆ ఉత్సవాలకు ముహూర్తం నిశ్చయించాడు. అందుకు వారికి 2 పణాలు ప్రతిఫలం ముట్టింది. తిరుపతిలోని వేంకటేశ్వరుని మూర్తికి, **పొట్లపాడి తిమ్మరాజు ఆళ్వార్ తీర్థం** దగ్గర 4వ గుహలో ప్రతిష్ఠించిన దానికి కైంకర్యం లేర్పాటు చేయబడింది. అట్లే గోవిందరాజుకు వారి దేవేరులకు స్వామి బ్రహ్మోత్సవాలలో మాశి నెలలో, 13 రోజులు కైంకర్యాల కేర్పాటు చేయబడింది. **మాశిలో తీర్థవారి** నాడు శ్రీవారికి మరిన్ని కైంకర్యాలు. అదే తీర్థము చెంత **నమ్మాళ్వార్ ఆలయం**లోని శయ్యాగారంలో కూర్చొని యుండగా, అచటనే తీర్థవారి నాడు వైకాశి బ్రహ్మోత్సవంలో, రాయర్ మంటపంలో వేంచేసి యుండగా, **గోవిందరాజులకు విఠలేశ్వరునకు** జరుపు వైకాశి బ్రహ్మోత్సవాలలో విడాయాట్టి రోజులలో విఠలేశ్వరుని ఆలయంలో కూర్చొని యుండగాను కూడ కైంకర్యాల కేర్పాటు చేశాడు. మాశి బ్రహ్మోత్సవంలో 3 రథాలు లాగబడునని చెప్పబడింది (నెం. 92).

**సూర్యవంశపు కంపరాజు కొడుకు పెండ్లికొడుకు తిమ్మరాజు,** క్రీ.శ. 8-6-1547న, **ఎఱ్ఱ తిమ్మరాజు** నుండి తాను పూర్వం గ్రహించిన మూడు గ్రామాలను ఆలయానికి సమర్పించాడు. వానిపై సంవత్సరాదాయం మొత్తం 200 రేఖైపొన్. ఈ ధనంతో వేంకటేశ్వరునికి వసంతోత్సవం మాశి నెలలో విశాఖ నక్షత్రతిథి అంకురార్పణ నుండి శ్రవణా నక్షత్రతిథి వరకు (7 రోజులు లెక్క) **ఐదు రోజులు ధార్మిక కార్యకలాపాలతో, తిరుమంజనం, కైంకర్యాలు, వివిధ సేవలకై జీతాల చెల్లింపు** (నెం. 93) నిర్వహించాలి.

కాశ్యపగోత్రుడు, ఆపస్తంబసూత్రుడు, యజుశ్శాఖాధ్యాయీ అయిన **పొత్తప్ప నాయకుని కుమారుడు సూరప్పనాయకుడు,** క్రీ.శ. 10-5-1551న వేంకటేశ్వరునకు **సహస్రనామార్చన ఉత్సవం మఖా నక్షత్రతిథి అధివాసం** (ఉత్సవ ప్రదేశమున విగ్రహముంచుట) ఉత్తిరం నాడు మొదలు చిత్త నక్షత్రం నాడు ముగింపు

వరకు 5 రోజులు జరుపబడటానికై సంవత్సరానికి 400 రేఖైపొన్ ఆదాయం ఇచ్చే ఒక గ్రామాన్ని దానం చేశాడు. ఇందు వేంకటేశ్వరుని మూలమూర్తికి సంవత్సరం పొడుగున నిత్యం నాలుగు నైవేద్యాల ఏర్పాటు కూడ ఉంది (నెం.127).

నెం.94లో **కోయిల్-ఆళ్వార్-తిరుమంజనం** ప్రస్తావనముంది. దానిలో అంతర్లీనమై 10 మనోహరపడి వేంకటేశునికి ఆ సందర్భంలో ఏర్పాటు చేయటం ద్వారా 10 బ్రహ్మోత్సవాలు స్వామికి నిర్వహించడానికి ముందుగా ఆలయంలోపలి గోడలను, నేలను కర్పూరమిళితమైన చందనంతో కడిగి, తుడిచి, అలదడం ఉంది. ఇది ముందే చూచిన నెం.25 లో స్పష్టంగా లేదు.

**తిరుపతిలోని కోమటి వర్గం జనార్ధన పెరుమాళ్‌ను ప్రతిష్ఠించినట్లు చెప్పబడింది.** క్రీ.శ.24-11-1547న, **ఆరవీడు రామరాజు తిమ్మయదేవ మహారాజు కుమారుడు పొప్పు తిమ్మయ మహారాజు** స్వామి సన్నిధిలో పుణ్యతిథుల్లో దీపాలు వెలిగించడానికి నిత్యనైవేద్యాలకు ఏర్పాటు చేశాడు. (నెం.101).

**తిరుపతిలోని భాష్యకారర్ వీధిలో (గోవిందరాజుల ఉత్తరమాడ వీధి) మదనగోపాల పెరుమాళ్ ఎప్పుడో ప్రతిష్ఠింపబడినట్లు చెప్పబడినది.** పొత్తరాజు కుమారుడు మల్ల వరదరాజు క్రీ.శ.5-1-1544న స్వామికి **శ్రీజయంతి (కృష్ణజయంతి)** నాడు ఒక అప్పపడి నైవేద్యం ఏర్పరచాడు (నెం.11).

**తిరువేంకట గోపాలకృష్ణుడు,** వాని భార్యలిద్దరు (రుక్మిణి, సత్యభామ) ఆలయ పద్దులు వ్రాయువారిచే అదే **భాష్యకారర్** తిరువీథిలో తూర్పుప్రక్క నిర్మింపబడిన మంటపంలో ప్రతిష్ఠింపబడిరి. వారిలో ఒకరిచే క్రీ.శ. 25-10-1546న రాత్రి కైంకర్యాలకు గోవిందరాజు ఆలయ పాకశాలలో సిద్ధం చేయడానికి ఏర్పాటు చేయబడింది. స్వామి తిరుమంజనానికి, రోహిణి నక్షత్రం గల 13 రోజులలో నైవేద్యాలకు ఏర్పాటు చేశాడు (నెం.82). పైగా, పద్దులు వ్రాసే పద్నాలుగు గణకులు 14 ప్రత్యేక సందర్భాలలో గోపాలకృష్ణునికి వేంకటేశ్వరునికి నైవేద్యాలు ఏర్పరచారు.

**నంద్యాల నారసింగరాజు కుమారుడు నంద్యాల నారపరాజు, గోవిందరాజు ఆలయం** వద్ద నుండి ఇద్దరు ద్వారపాలకుల రాతి విగ్రహాలను చెక్కించి స్వామివారి ఆలయం ప్రవేశద్వారం వద్ద వారిని నిలిపి, క్రీ.శ.18-3-1549న రెండు గ్రామాలను దానం చేయడం ద్వారా వారి నిత్యపూజాకైంకర్యాలను ఏర్పాటు చేశాడు.

**ఆరవీడు రామరాజ కోనేటిరాజు కుమారుడు ఆరవీడు కొండరాజు,** నమ్మాళ్వార్ (పంద్రెండుగురు వైష్ణవ ఆళ్వారులలో నొకడు) **విగ్రహాన్ని చెక్కించి,** తనచే నిర్మింపబడిన రామానుజకూటంలో, ఉత్తర మాడవీధిలో వైష్ణవయాత్రికులకు ఉచిత భోజనానికై ఉద్దేశింపబడిన సత్రంలో దానిని ప్రతిష్ఠించి, క్రీ.శ.2-10-1550న 10 గ్రామాలను దానమిచ్చాడు. వాటిపై వచ్చే 5713 రేఖై-పొన్ సంవత్సరాదాయముతో

నమ్మాళ్వార్‌కు 125 నైవేద్యములను సుగంధద్రవ్యాలు, నంజుళ్ళు, పెరుగు, నెయ్యి, నూనె, చందనం, తమలపాకులు, పోకలు, వీటితోకూడ నిత్యం సమర్పించి, ఆ మొత్తాన్ని రామానుజ కూటానికి వచ్చే వైష్ణవయాత్రికులకు పంచడానికి ఏర్పాటు చేశాడు (నెం.125)

**ఆరవీడు కొండరాజు స్థాపించిన ఈ రామానుజకూటానికి మేలు కలగడం కోసం సదాశివరాయచక్రవర్తి మకరసంక్రమణం రోజైన క్రీ.శ. 15-1-1554న, విజయనగర సామ్రాజ్యంలోని వేర్వేరు పరగణాలలో చెల్లించవలసిన 12 పన్నులను దానమిచ్చాడు.** ఈ మేరకొక రాయసాన్ని ఆయా పరగణాల పాలకులకును, నాడుల పెద్దలకును, వేంకటేశ్వరాలయ స్థానత్తార్‌కును, ఆ పన్నులను వసూలుచేసి పైజెప్పిన రామానుజ కూటానికై వినియోగించేటట్లు రాజాజ్ఞనంపెను. క్రీ.శ.2-7-1554న స్థానత్తార్ ఈ రాజాజ్ఞను ఒక ఱాతిపై చెక్కించాడు. దీని ప్రకారం రామానుజకూట నిర్వాహకుల పక్షంలో పన్నులను వసూలు చేసి, అందు భోజన సౌకర్యాన్ని కల్పించడం కొనసాగింపబడింది. సదాశివరాయచక్రవర్తి హంసముద్రగల 200 వృషభాలను తిరుమల, తిరుపతి ఆలయాలలోని నమ్మాళ్వార్ రామానుజ కూటములో సంబారాలను, తదితర వస్తువులను చేరవేయడంలో ఉపయోగించేటట్లు బహూకరించాడు (నెం.154)

సదాశివరాయలు దానమిచ్చిన పన్నెండు పన్నులకు తోడు, ఈ రామానుజకూటం బహుమతిగా ప్రసాదాన్ని కూడా పొందాను. దీనిని **ఆరవీడు బుక్కరాజ రామరాజ శ్రీరంగరాజుని కుమారుడైన ఆరవీడు రామరాజయ్య దానం చేశాడు.** క్రీ.శ. 11-11-1554న ఆతడు 4000 రెఖైపొన్ సంవత్సరాదాయాన్ని ఇచ్చే నాల్గు గ్రామాలను దానమిచ్చాడు. దాని నుండి ప్రథమ ప్రసాదంగా, దధ్యోదనావసరం వెనువెంటనే వేంకటేశ్వరునకు 200 **వెళ్ళైతిరుప్పోనకం ప్రతిరోజు నివేదించేటట్లు,** ఈ 200 నైవేద్యాలలో నాల్గవవంతు దాతభాగం స్థానంలో గోవిందరాజుకు నివేదించిన ప్రసాదంలో దాని సమభాగాన్ని నిత్యం నమ్మాళ్వార్-రామానుజ కూటానికి ఇచ్చేటట్లుగా, దానిని దాత **రామరాజయ్య, కొండరాజయ్య** ఉభయంగా వ్యవస్థ చేయబడినట్లు అదనంగా 50 పొంగల్-తళిగ-ప్రసాదాన్ని నిత్యం **గోవింద రాజాలయం**నుండి **'ఆరవీడు రామరాజయ్య'** దానంగా అక్కడి శ్రీవైష్ణవ యాత్రికులకు లభించింది (నెం.155).

పెద తిరుమలయ్యంగారి 4వ కుమారుడు, చిన్నన్న అను నామాంతరం గలవాడునైన **తాళ్ళపాక తిరువేణాదర్** క్రీ.శ.13-1-1558న కోట్టూరు గ్రామాన్ని దానమిచ్చి, తనచే క్రీ.శ.1546 జులై 17న వ్యవస్థ చేయబడి (నెం.71) మరల క్రీ.శ.1554 ఫిబ్రవరి 19న (నెం.153) **దేవరాయపల్లిని మల్లవరానికి బదులుగా, దాని ఆదాయం విఫల మైనందున,** దానం చేయడం ద్వారా కొనసాగించబడిన పెండ్లి తిరునాళ్ (వైవాహికోత్సవం) లో అదనంగా కార్యకలాపాలకు నైవేద్యాలకును ఏర్పాటు చేశాడు. ఈ క్రొత్తగా ఇవ్వబడిన దానగ్రామం వలన అధికంగా లభించే 330 రేఖైపొన్ ఆదాయాన్ని మూడు ఉత్సవమూర్తుల విగ్రహాలకు ఉత్సవబేరం చందన మలదడానికి, వారి ముఖాలకు శుద్ధకర్పూరాన్ని, వారి ముఖంపై నుండు నిలువు గుర్తులకు కస్తూరికి, వారి వస్త్రాల సువాసనకై చల్లు పన్నీరుకు, ఉత్సవం ఐదవ రోజున రాధాసమేతుడై

స్వామి ఊరేగింపుగా తన ఇంటివద్దకు వచ్చినప్పుడు ఆరగింపునకై ఒక దోశపడియును, దానితో గూడ గరుడ పతాకాన్ని ధ్వజం పైకెత్తేటప్పుడు, మూడు మూర్తులకు తిరుమంజనం, నైవేద్యాలు; వారు తన మంటపంలో, చిత్తిరై నెలలో, తన తండ్రిగారైన పెరియ తిరుమలయ్యంగారి జన్మనక్షత్రమైన మృగశీర్ష రోజున కూర్చొనియుండగా తాంబూలానికి, వసంతోత్సవంలో సంకీర్తనలు పాడేటప్పుడు 20 రోజులలోను, వేంకటేశ్వరునికి, గోవిందరాజుకు ప్రత్యేక సందర్భాలలో, వైకాశి, ఆని మాశి నెలలలో జరుగు మూడు బ్రహ్మోత్సవాలలో తిరువాళి ఆళ్వార్ (సుదర్శన చక్రం) ఆలయములో కూర్చొని యుండగా నైవేద్యాదులు సమర్పించడానికి, ఈ తిరువాళి ఆళ్వాన్ (సుదర్శన చక్రం) విగ్రహానికి 2190 **వెళ్ళైతిరుప్పోనకం** (పొంగల్) నైవేద్యానికి వినియోగించే ఏర్పాటు చేశాడు. ఈ మూర్తిని తానే పోత పోయించి, తిరుపతిలోని గోవింద పుష్కరణి పశ్చిమ తీరంలో తానే నిర్మించిన ఆలయంలో ప్రతిష్ఠించాడు. ఈ స్వామికి ఉదయం 2 నైవేద్యాలు, మధ్యాహ్నం రెండు, రాత్రి రెండు ప్రతిసారి పూజ తరువాత చందనం తాంబూలంతోను, దీపాలకు నువ్వులనూనె, ప్రతి శనివారం తిరుమంజనం, మిగత శుభతిథులలో కూడ ఇట్లే జరుపవలెను (నెం.159) ఆతడీవిధంగా సుదర్శనుని పరమభక్తుడని తెలుస్తుంది.

**ఆరవీడు బుక్కరాజు రామరాజు శ్రీరంగరాజు కుమారుడు తిరుమలయ్య రాజు (తిరుమలరాయలు), తన పేరిట ప్రసిద్ధమైన తిరుమలరాయ మంటపాన్ని నిర్మించాడు.** ఇది దక్షిణంలో ధ్వజస్తంభం ఎదురుగా **సంపంగి ప్రదక్షిణం** మొదలగుచోట వేంకటేశ్వరుని ఆలయములో ఉన్నది. ఇది క్రీ.శ.15-12-1561న నిర్మింపబడింది. ఆలయానికి అతడు 16,500 పణాలు మూలధనంగా చెల్లించాడు. పండుగలు, ఉత్సవాలు, సేవలు, నైవేద్యాలు, వీటికయ్యే ఖర్చును ఈ నిధిపై వచ్చు వడ్డీతో నిర్వహించాలని ఉద్దేశం. ప్రతి నెలలోను, సంవత్సరంలో కొన్ని పవిత్ర దినాలలో, తన మంటపంలో ఉత్సవ విగ్రహాలకు కైంకర్యాలను ఏర్పరచాడు. మొత్తము 439 **అతిరసపడి నైవేద్యాలు** 439 రోజులలో సమర్పణ (నెం.168). ఈ తిరుమలరాయ మంటపం పూర్వం సాళువ నరసింహునిచే నిర్మింపబడిన మంటపానికి పెద్దదైన రూపంగా భావించ వచ్చును.

**శొట్టై ఏట్టూర్ తిరుమలనంబి శ్రీనివాసయ్యంగార్** ఆలయానికి క్రీ.శ.28-7-1562న ఏదేని యొక గ్రామాన్ని దానమిచ్చాడు. శ్రీవేంకటేశ్వరుని 10 బ్రహ్మోత్సవాలలోను ప్రతి యొక్క దానిలో 13 రోజులున్ను తదితర ఉత్సవాలలోను, ప్రతి మాసంలోను ప్రత్యేక శుభతిథులలో వివిధ నక్షత్రాలున్న తిథులలో సంవత్సరమంతటిలో, అట్లే, గోవిందరాజుకు నిత్యం 4 తిరుప్పోనకం, చందనం, తాంబూలం, శుద్ధకర్పూరాలతోను, మొత్తము 436 అతిరసపడి ప్రతి సంవత్సరం వేంకటేశ్వరునకున్ను, 1460 తిరుప్పోనకం గోవిందరాజుకున్ను (నెం.171) జరుపాలి. ఈ దాత శ్రీనివాసయ్యంగార్ గోవిందరాజునికి ఒక క్రొత్త బ్రహ్మోత్సవం వ్యవస్థ ఏర్పరచాడు. ఇది ఆర్ద్ర నక్షత్రము రోజున అంకురార్పణం చేసి విశాఖ నక్షత్రంనాడు తీర్థవారి (పుణ్యస్నానములు) తో 10 రోజులు జరుపవలసినది, కాని దీనిని యే నెలలో జరుపవలెనో చెప్పబడలేదు. ఈ గోవిందరాజునకు ప్రతి సంవత్సరం 4 బ్రహ్మోత్సవాలు జరుపబడుతుంది.

తిరుపతిలోని **నాయనార్ కపిలేశ్వరం ఉడైయనాయనార్** (ఉత్తరాన పర్వతపాదాన గల కపిలేశ్వరస్వామి) ఆలయస్థానత్తార్ (నిర్వహణ సంఘం) క్రీ.శ. 30-1-1563న ఆలయదాసీలలో ఒకరైన శెవ్వసాని పక్షంలో ఈ ఊతిశాసనము వ్రాయించాడు (నెం.172). అందులో ఇలా వ్రాయబడి ఉంది : కపిలేశ్వరుని ఆలయప్రాకారపు గోడలు, పాకశాల పిడుగుపాటువలన పడిపోయినవి, కాగా, రాచవీడునాయకుని ఆజ్ఞపై ఆమె వానిని మరల కట్టించి, విఘ్నేశ్వరుని ప్రతిమనొకదానిని ఆలయంలోని నృత్యమంటపంలో ప్రతిష్ఠించి, ఈ నూత్న ప్రతిష్ఠితుడైన విఘ్నేశ్వరునకు నిత్యం పుష్పమాలతో, కైంకర్యాలతో, సాయంకాల దీపంతో అర్చన జరుపడానికై 200 పణాలు చెల్లించెను. ఈ **కపిలేశ్వరాలయం** మొదట 13వ శతాబ్దిలో దృష్టికెక్కింది. ఇది స్వతంత్రంగ తనవారైన కార్యనిర్వాహకులు లేక ధర్మకర్తలతో నడుస్తున్నన్నట్లు కన్పడును.

**కామరనప్పయ్య కుమారుడు కరణిక అప్పలయ్య రథసప్తమి** రోజున మకర (తై) మాసంలో ఐదవ సౌరదినమైన శుక్లపక్ష దినంలో అంకురార్పణ, హోమ, తిరుమంజనాలతో **మలైకునియనిన్ఱ పెరుమాళ్‌కున్న** స్వామివారి ఇద్దరు నాచ్చిమార్‌లకున్ను, కైంకర్యాలు, ఉదయం పెందలకడనే సూర్యప్రభపై ఊరేగింపు, మరియొక ఊరేగింపు, తీర్థవారి వరాహస్వామి మంటపపాదంలో సుదర్శనునికి కైంకర్యాలు, మరల తిరుమంజనం, నైవేద్యాలు, మరల రాత్రివేళ వైకుంఠవిమానంపై ఊరేగింపు, ఈ కార్యక్రమంతో ఒక ప్రత్యేక ఉత్సవాన్ని వ్యవస్థ చేశాడు. అదే సమయంలో ఆతడు గోవిందరాజుకు పల్లవోత్సవం ఉత్తిరట్టాది నక్షత్రతిథి నుండి కృతిక నక్షత్ర తిథి వరకు చిత్తిరై నెలలో పుణ్యస్నానాలు, **తిల్లైక్కు వాయ్‌త్తాన్ మంటపం**లో నివేదనలు, శేషవాహనంపై మొదటి రాత్రి, తిరుచ్చిపై రెండవ, మూడవ, నాల్గవ రోజులలో, వైకుంఠవిమానంపై 5వ రోజు రాత్రులలో ఊరేగింపులు, మొదటి నాలుగు రాత్రులు నాలుగు వీధులలో, ఎనిమిది వీధులలో 5వ నాటి రాత్రి జరిగేటట్లు ఏర్పాటు చేశాడు (నెం.173).

**మలైనిన్ఱాన్ భట్టర్ అప్పయ్యన్ కుమారుడు వేంకటత్తూరైవార్ ఒక పశుబంధం ఉత్సవాన్ని** తిరుపతిలో క్రీ.శ.26-11-1545న,న 8 నైవేద్యాలతో సహ ప్రారంభించి, అందుకై 185 పణాల్ని మూలధనంగా చెల్లించాడు (నెం.60).

నైవేద్యాలు వేంకటేశ్వరునికి ప్రతిరోజు వందల సంఖ్యలో ఏర్పాటు చేయబడినాయి, వేరు రోజులలో గూడ; ఉత్సవ విగ్రహాలకు పలు ఉత్సవాలలోను, తదితర సందర్భాలలోను, గోవిందరాజుకు ప్రతిరోజు ద్విదశకాల సంఖ్యలో, ఉత్సవాలలోను ప్రత్యేక శుభతిథులల్లోను యేర్పరుపబడినాయి. దేవతామూర్తులకు నివేదింపబడిన పదార్థాలలో నాల్గవవంతు సాధారణంగా దాతకు ప్రసాదంగా ఇవ్వబడింది. మిగత మూడు వంతులు పంచబడెనని చెప్పబడింది. ఈ పంపిణి నిర్దిష్టంగా పన్నిద్దరు **స్థానత్తార్‌లకు, ఆలయ పరిచారకులకు, చెప్పబడింది. కనుక అది పోగా మిగిలిన ప్రసాదం మాత్రమే యథార్థంగా ఆలయానికి వచ్చే యాత్రికులకు పంచబడింది. స్థానత్తార్ ఆలయ పరివారం, పరిచారకులు, ఎవ్వరుగాని రొక్కంగా జీతమివ్వబడుట లేదు. వారు నిత్యం తమకు లభించు ప్రసాదం కొరకును, ఉత్సవాలలోను, తదితర ప్రత్యేక సందర్భాలలోను**

**వారికి లభించు పారితోషికాలు బహుమతులు కొరకును మాత్రం సేవ చేశారు.** వారికి లభించు ఈ ధనం దాతలు నిక్షేపించిన నిధులపై వడ్డీల రూపంలో, లేక దాన గ్రామాల నుండి లభించింది. 13వ శతాబ్దంలో దేవతలకు నైవేద్యాలు తక్కువగను, ఆలయ సేవకులందరకు ప్రతి రోజున్ను పూర్తి భోజనానికి చాలినంతలేనప్పుడు స్థానత్తార్ వీరనరసింహయాదవరాయనికి విన్నపం పంపి, అదనంగా నైవేద్యాలకు అవసరమైనంత ధాన్యం ఇచ్చే భూములను మాన్యాలుగా పొందాడు, దానిని అలా అందరికీ పంచాడు. తరువాతి కాలంలో, భక్తులర్పించిన నైవేద్యాలు చాలా పెద్ద ప్రమాణాల్లో పెరిగినాయి. తత్ఫలితంగా ఆలయ పరివారానికి పంచబడు ప్రసాదాలు కూడ ప్రామాణంలో పెరిగాయి. దానిలో చాలా మొత్తం వారిలో ప్రతి యొక్కరికి అవసరాన్ని మించిందై ఉండినది. కాగా, ఆ అధికమొత్తాలను అమ్ముజూపి ఉంటారు. దానిని ఒక ఒప్పందం ప్రకారం క్రయంపొందువారు కూడ ముందుకు వచ్చి ఉంటారు.

**ఇట్లు, క్రయం పొందిన ప్రసాదక్కారర్-మహామేడంగళ్, తిరుమల తిరుపతులలో కలిపి పదునొకండుగురు వేర్వేరు మొత్తాలను చెల్లించారు. ఆ మొత్తం 3250 పణాలు క్రీ.శ.6-2-1547న ఆలయధనాగారానికి చెల్లించి, తిరుపతిలోని విఠలేశ్వరునికి గోవిందరాజుకు వేర్వేరు సందర్భాలలో నైవేద్యాలు ఏర్పరచారు** (నెం. 88).

తిరువడి రాజ్యమును (తిరువాన్కూరు, ట్రావన్‌కూర్, రాజ్యము) పాలించు **తిరువడిరాజు** క్రీ.శ. 14-9-1557న, శ్రీమన్ మహామండలేశ్వర రామారాజ తిమ్మయదేవ మహారాజు కుమారుడైన **విఠలరాజు** క్షేమానికై సంవత్సరానికి 350 రేఖై-పొన్ ఆదాయం ఇచ్చే, తామ్రపర్ణీనది తీరంలో గల కుళయపాట్టం గ్రామంలో సగభాగాన్ని దానమిచ్చాడు. దీనితో వేంకటేశ్వరునకు 12 తిరుప్పోనకం, గోవిందరాజుకు 12 తిరుప్పోనకం అనుదినం నైవేద్యాల కేర్పాటు చేశాడు. ఈ గ్రామపు మిగత సగభాగం పూర్వమే తిరుపతిలోని **శూడిక్కొడుత్త నాచ్చియార్‌కు** ఆమె మార్గళి-నీరాట్టం ఉత్సవానికిని శుక్రవారపు ఉత్సవానికిని దేవదాయంగా ఇవ్వబడింది (నెం. 158). నివేదించబడిన పదార్థంలో దాత భాగమైన ప్రసాదాన్ని **తిరువేంకటనంబి తిమ్మయ్యర్** కుమారుడు వత్సగోత్రజుడు, వైఖానససూత్రుడు, ఆలయపూజారియైన **శ్రీనివాసన్‌కు** బదలాయించబడింది.

దేవతామూర్తికి నైవేద్యాల నేర్పరచినవారు కేవలం ధనవంతులే కారు. పరిమితమైన ఆదాయం గలవారు కూడ తమ తమ పద్ధతులలో భగవంతుని కర్పించుటకు ప్రయత్నించారు. ఆలయదాసీజనం కూడ తమ ప్రయత్నం తాము చేశారు. ఆలయ ప్రవేశంవద్ద ఉండు కాపలావారు సైతం స్వామికి 10 బ్రహ్మోత్సవాలలో ఉత్సవవిగ్రహాలకు 7వ రోజులులోను, పెరియపెరుమాళ్, వేంకటేశ్వరుని మూలమూర్తికి ఉగాది నాడును నైవేద్యాలను ఏర్పాటు చేశారు (నెం. 70).

కొద్దిమంది భక్తులు, పవిత్రబుద్ధితోను దూరప్రయాణం చేసివచ్చే యాత్రికులపై దయతోను, తిరుపతిలో చాలాచోట్ల పర్వతపాదాన, కొండకువచ్చే త్రోవలో తూర్పునగల ఒక గ్రామంలోను, తిరుమలపైనను గూడ

చలివేంద్ర లేర్పరచారు. **తిరుపతి వర్తకులలో ఒకడైన నామిశెట్టి,** ఆలయ ధనాగారంలో కొంత రొక్కాన్ని చెల్లించి పురట్టాశి– బ్రహ్మోత్సవానికి వచ్చే యాత్రికులకు అధికప్రయాణంలో మజ్జిగనందించి సేవించున ట్లేర్పాటు చేశాడు (నెం. 39). **ఉదయగిరి నారసింగభట్టర్ కుమారుడు దేవరాయభట్టర్,** ఆలయధనాగారానికి 1600 నబ్బణాలు చెల్లించి, రెండు చలివేంద్రలను, ఒకటి తానే ఉత్తరపు వీధిలోని **వ్యాసరాయమంటపానికి** పడమట కట్టించిన మంటపం చెంత, నీటినందించువారికి నెల జీతాలతో పాటు నిత్యం దాతభాగం ప్రసాదంలో కొంత స్థానత్తార్‌కు ఇచ్చునట్లున్ను, పురట్టాశి బ్రహ్మోత్సవానికి అధికంగా నీటిని అందించి నందుకు అదనపు చెల్లింపు, కుండలు చేసి యిచ్చిన కుంభకారులకు చెల్లింపు, రెండవ చలివేంద్రం తానే కట్టించిన మంటపాలలో మంగలం గ్రామానికి, తూర్పువైపు నుండి పర్వతపాదానికి కాల్నడకదారిలో, వారికి నెలసరి జీతాలతోను, ఈ రెండు చలివేంద్రాలు పర్యవేక్షకునికి సంవత్సరానికి ఒక రేఖైపొన్ చెల్లింపున్ను ఏర్పరచాడు (నెం. 61). **ఆలయపు లెక్కలు వ్రాయువారిలో నొకడైన దామోదరన్** తిరుమలపై నొక చలివేంద్రను ప్రారంభించి, దానిలో సేవచేసినవానికి దేవుని ప్రసాదంలో ఒక భాగాన్ని ఇచ్చేదీయ ఏర్పాటు చేశాడు (నెం. 105). తిరుమలలో తెరచిన వేరొక చలివేంద్రను నిర్వహించువారికి ఎల్లప్ప నాయకుడు వేంకటేశ్వరునకు సమర్పించిన నైవేద్యాలలో ఒక కొంత భాగంనిచ్చునట్లేర్పాటు గావించాడు (నెం. 130)

**పొట్లపాడి తిమ్మరాజు, స్థానత్తార్, ఉమ్మడిగా ఆలయ దాసీలలో ఒకరైన తిప్పసాని కుమార్తెయగు తిరువేంకటమాణిక్కమును, ఆలయానికి ఆమె చేసిన సేవల గుర్తింపుగా, ఒక దండిగై (పల్లకి) ని బహూకరించి గౌరవించారు. పల్లకి అనేది ఔన్నత్యమునకు సంకేతం.** ఇందుకు కారణం తిరువేంగడముడైయాన్ అలమేల్మంగలు ఆమెను **'తిరువేంకటమాణిక్కం'** బిరుదుతో సత్కరించారట. స్థానత్తార్ ఒక ధర్మశాసనం కూడా వేయించాడు. దాని ప్రకారం, ఆమె పక్షంలో తిరుమల ఆలయం నుండి ఆమె పూదోటకు అలర్మేల్మంగై నాచ్చియార్ పూదోటకు, మాలిగనున్న వానికి ఒక పూర్తి ప్రసాద–తళిగై ఇవ్వబడింది. అట్లే తిరుపతిలోని ఆమె నివాసానికి ఒక పూర్తి ప్రసాదం గోవిందరాజు ఆలయం నుండి ప్రతిరోజు చేర్చవలెను (నెం. 74).

**తిరుమలరాజు** రాజప్రాసాదమున సేవలోనున్న **కుమారమంగలం** వాస్తవ్యు లిరువది యొక్కరిని వేంకటేశ్వరుని ఆలయానికి బదలీ చేసి, క్రీ.శ. 27–7–1552న, ఆలయం ప్రతిరోజు వారిలో ఒక్కొక్కరికి ఒక్క ఉరి నెయ్యి (ఒకానొక కొలకు పేరు) నిచ్చునట్లాజ్ఞాపించబడింది (నెం. 135)

నెం. 168, నెం. 171లలో దాతలచే మూడు ఉత్సవమూర్తులకు తిరుమలలో వేంకటేశ్వరునకు నిర్వహించబడిన వివిధ ఉత్సవములు, వాని సమయాలు ఈ క్రింద పొందుపరుచబడినాయి.

**10** **బ్రహ్మోత్సవములు** ఒక్కొక్కటి 14 రోజులు సాగేవి. 14 రోజులలో ప్రతిరోజు ఉత్సవవిగ్రహాలు తిరుమలరాయడు నిర్మించిన ఊంజల్ మంటపంలో కూర్చొని యుండగా, ఇది సాళువ నరసింహుని మంటపాన్ని బాగుచేయించి పెద్దదిగా చేయబడిన సంపంగి ప్రదక్షిణం, ధ్వజస్తంభమున కెదురుగా గల రెండవ ప్రదక్షిణము.

**అన్న-ఊంజల్ తిరునాళ్** (హంసాకారపు ఉయ్యాలపై మూడు ఉత్సవమూర్తుల నూగించుట) 5 రోజులు సాగింది. దీనిని సాళువ నరసింహుడు (క్రీ.శ. 15-6-1473న) వ్యవస్థ చేశాడు (నెం.50, సం॥).

**పవిత్రోత్సవము** 5 రోజులు సాగునది (సాళువ మల్లయదేవ మహారాజు క్రీ.శ. 18-1-1464న వ్యవస్థ చేశాడు (నెం.18, సం॥).

**సహస్రనామార్చనోత్సవము** (యథార్థంగా, అష్టోత్తరసహస్రనామ వేంకటేశ్వరుని 1008 నామాల నుచ్చరించి అర్చించుట), 5ఆ రోజులు సాగును. ప్రస్తుతము ఈ 1008 నామాలు ఉదయార్చనలో చెప్పబడుచున్నాయి, పూలతో తులసితో ప్రతిరోజు అర్చన, బహుశః 16వ శతాబ్దములో ఇది వ్యవహారంలో లేదు; అష్టోత్తర శతనామాలే, 108 పేర్లు చెప్పబడినాయి, ఆ కారణంగానే ఆ కాలంలో 1008 పేర్లతో అర్చన క్రొత్తగా ప్రారంభింపబడింది.

**సహస్రకలశాభిషేకోత్సవము** ఒక్క రోజు మాత్రమే. ఇది ఆర్జిత సేవ అనగా భక్తుడు అందుకు నిర్ణీతమైన ధనము చెల్లించి చేయించునది, ఆలయ నిత్యసేవలలో ఒకటి కాదు. ఇప్పుడు దానికై చెల్లించవలసినది రు.2500/-లు నెం.171 లో వేంకటత్తురైవర్ (ఉగ్రశ్రీనివాసుడు) కు ఈ రోజున అర్చన ప్రస్తావించబడినది.

**అధ్యయనోత్సవము** 25 రోజులు సాగునది (మార్గళి నెలలో తమిళ ప్రబంధంలోని ఎన్నో భాగాల పఠనంతో సాగేది).

**వసంతోత్సవం** 5 రోజులు, తిరుమలరాజయ్య వ్యవస్థ చేసింది.

**దమనారోహణ వసంతోత్సవం,** ఆని నెలలో 5 రోజులు సాగేది. మూర్తుల బేరాలను (విగ్రహాలను) సుగంధిలమైన దమనపత్రితో కప్పుతారు.

**ఊంజల్ ఉత్సవం** 9 రోజులు.

**పెండ్లి తిరునాళ్ లేక వైవాహికోత్సవం** 5 రోజులు (తాళ్ళపాక తిరువేంకట నాథుడు, నామాంతరం చిన్నన్నచే వ్యవస్థీకరించబడింది, క్రీ.శ.17-7-1546, నెం.71, సం.5).

| | |
|---|---|
| **లక్ష్మీదేవి ఉత్సవం** | 5 రోజులు |
| **కోడై-తిరునాళ్ వేసవి ఉత్సవం** | 20 రోజులు |
| **తెప్పోత్సవం** | 9 రోజులు |
| **పల్లవోత్సవం** | 5 రోజులు |
| **ఫలోత్సవం** | 3 రోజులు |

**అధ్యయనోత్సవం** ఉడైయవర్‌కు (రామానుజ) 6 రోజులు.

ఈ 15 ఉత్సవాలు, 10 బ్రహ్మోత్సవాలు కాక, విశేష తిరునాళ్, ప్రత్యేక లేక అధిక ఉత్సవములు అనబడుతుంది.

సంవత్సరంలో ప్రతి నెలలోను ప్రత్యేక పూజానైవేద్యములు వివిధ దేవతామూర్తుల కర్పించు రోజులున్నాయి, వానిని తింగళ్–దివసం అంటారు. ఆ వివరా లివి :–

**12 మాససంక్రమములు** 12 తమిళ నెలలో ఒక్కొక్క దానిలో మొదటి రోజులు 12, నెల నెల వచ్చు అయనాలు

**13 అమావాస్యలు**

**13 పౌర్ణిమలు**

**25 దశమి తిథులు**

**25 ఏకాదశి తిథులు**

**25 ద్వాదశి తిథులు**

**13 రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తరఫల్గుణి, మూల, పూర్వాషాడ, ఉత్తరాషాడ, శ్రవణం** మొదలగు నక్షత్రములున్న తిథులు.

ఇట్లే విశేషదినాలు, సంవత్సరంలో ఒక్కరోజు పండుగలు. దేవతల కారోజులలో పూజానైవేద్యములర్పింపబడును. ఉదాహరణకు, **శ్రీజయంతి, ఉటి–అడి, ఉత్థాన ద్వాదశి, అర్పశి పూర్వాషాఢ, దీపావళి, కార్తికై, మకర సంక్రమము, పాడియవేట్టై, తై–పూశం, తణ్ణీర్ అముదు, ఉగాది, శ్రీరామనవమి, వైకాశి–విశాఖ, మాశి–మఖ.**

ఈ రోజులుకాక, కొందరు భక్తులు ప్రత్యేక పూజలకు, నైవేద్యాలకు పండుగరోజులకు కూడ యేర్పాటు చేశారు, వారి జన్మనక్షత్రతిథులలో ఊరేగింపులకు గూడ యేర్పాటు చేసిరి.

* * *

## అధ్యాయం-22

### ఆరవీడు వంశరాజులు-వారి తదనంతరం
### (6వ సంపుటి-మొదటిభాగం-తి.తి.దే. శాసనాలు)

తిరుమలేంద్ర (తిరుమల మహారాయలు) వంశానుక్రమణిక యెంతో అసమగ్రమైన, ఛిద్రమైన శాసనం (ఆరవ సంపుటి, సంఖ్య.1 మొదటిభాగం) తెలియజేస్తోంది. అతడు అత్యంబరగండ అనే పేరు బిరుదంగా కల్గిన ఆరవీడు బుక్కవంశానికి చెందినవాడు. అతని రాజచిహ్నం వరాహం. అతని రాణి వల్లాంబిక (బల్లాంబిక) వలన అతనికి రామరాజు అనే కుమారుడు కలిగాడు.

**కళ్యాణ పురప్రభువు శ్రీరంగరాజు, రామరాజు కొడుకు. దానధర్మాలవల్ల,** ధార్మిక ప్రవర్తనవల్ల, రామరాజు మంచి కొడుకుని కన్నాడు. ఈ రామరాజు అరవైనాలుగు కళలలో ఆరితేరినాడు. **చాలిక్కి నారాయణ***1, **నానావర్ణ శ్రీమండలీకగండ, రాయరాహుత్తమిండ బిరుదాంకితుడు. తిరుమలాంబను పెండ్లాడాడు.** తిరుమలేంద్ర రామరాజుకు సోదరుడు. క్రీ॥శ॥ 15-12-1561న వేంకటేశ్వరస్వామిసేవలో **డోలా-మహోత్సవం** ప్రారంభించాడు. వెంగళాంబను పెండ్లాడి ఆమెద్వారా రఘునాథ, శ్రీరంగ, రామరాజు, వేంకటాద్రి అనే నలుగురు కుమారులను కన్నాడు. తిరుమలేంద్ర*2 అందరు రాజులనూ జయించాడు. వారిలో **తురుష్క ప్రభువు తులుక్కాణమ్ అల్లా** కూడా వున్నాడు.

దీనికి రెండు రోజులముందు, అంటే క్రీ॥శ॥ 15-12-1561 న యీ తిరుమలయ్యరాజు 16500ల పణాలు పదిబ్రహోత్సవాలలో ఉత్సవ మూర్తుల నివేదనలకై దేవాలయానికి దానమిచ్చాడు. ఒక్కొక్క బ్రహ్మోత్సవం 14 రోజులు (140 అతిరసపడితో), 15 యితర పండుగలు - 110 రోజులకు 110 అతిరసపడిలో, 15 నక్షత్రాల గమనంతో, అమావాస్య, పున్నమిలతో మొత్తం 217 రోజులు (217 అతిరసపడితో); సంవత్సరంలో 11 పర్వదినాలు (11 అతిరసపడితో), కాని 5వ సంపుటి, సంఖ్య 168లో చెప్పబడినవి మొత్తం 439 రోజులు, 439 అతిరసపడులు (నిజానికి వాటి మొత్తం 478). మిగిలిన 39 రోజులు వేరే పర్వదినాలతో కలపడం జరిగింది. అదే సమయంలో అదే రోజున 5 రోజులు జరిపే వేంకటేశ్వరస్వామి వారి వసంతోత్సవానికి కూడా నాందిపలికాడు.

---

*1. **'చాళుక్యనారాయణ'** అనే యీ బిరుదు బహుశా తూర్పుచాళుక్యులతో, యాదవరాయల వంశంతో ఆరవీడు వంశానికున్న సంబంధాన్ని తెలియజేస్తోంది. తూర్పుచాళుక్యుల అధికారం తిరుపతికి ప్రత్యక్షంగా విస్తరించలేదు. కాని యాదవరాయవంశం యీ ప్రాంతాన్ని పరిపాలించింది. బహుశా ప్రప్రథములైన యాదవరాయ ప్రభువులకాలంలోనే గోవిందరాజస్వామివారి గుడిలో **'చాళుక్యనారాయణన్‌గళ్'** (మరక్కాల్) అనేపేరుతో ఒక తూకం ప్రవేశపెట్టబడింది.

*2. ఇది అతిశయోక్తి మాత్రమే అయి వుండాలి. ఎందుకంటే క్రీ॥శ॥ 1565లో జరిగిన తళ్ళికోట యుద్ధంలో తన జ్యేష్ఠసోదరుడైన అళియరామరాజు మరణానంతరం అతను సదాశివరాయలను తనతోబాటు తీసుకుని పెనుకొండకు పారిపోవలసి వచ్చింది.

చాలాకాలంముందే అంటే క్రీ॥శ॥ 27-7-1552 నాటికే చంద్రగిరి నుండి రాజభవనానికి నెయ్యి సరఫరా చేసే 21 మంది కుమార మంగళంపల్లె వాసుల సేవల్ని శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయానికి బదిలీచేసి, వారివంతు నెయ్యి సరఫరా చేయవలసిందిగా అదేశించాడు.

క్రీ॥శ॥ 27-11-1579లో **సదాశివరాయలకాలంలో అళియరామరాజు** నిర్ణయించిన రీతిలో **కొమాండూరు అప్పావయ్యంగారి కుమారుడు అప్పయ్యర్** అలమేలుమంగాసమేత శ్రీ వేంకటేశ్వరస్వామి సేవలో నివేదనలు ('అవసరం'తో సహా)కు ఏర్పాట్లు చేశాడు. (సంఖ్య.2).

శకసంవత్సరం 1504-చిత్రభాను సంవత్సరం క్రీ॥శ॥ 11-11-1583న శ్రీ రంగదేవమహారాజావారి పాలనలో **విజయనగరవాసి, తమ్మునాయకుని కుమారుడైన తిల్లప్పనాయకుడు,** తిరుపతిలో తాను నిర్మించిన మంటపంలో గోవిందరాజుకు **'పాడియవేట్టై'** రోజున అభిషేకాలకు, నివేదనలకూ సరిపడే ద్రవ్యం యేర్పాటుచేశాడు. 'మాసి' మాసంలో గోవిందరాజు జన్మ నక్షత్రం 'మృగశీర్షా' రోజు ఉత్సవాలకు, అభిషేకాదులకు కూడా. గోవిందరాజు, ఆండాళ్, సేనైముదలియార్, రామానుజ మంటపంలో వేంచేసి వుండగా, రాత్రి ఊరేగింపుగా కాగడాల వెలుగులో అశ్వవాహనంపై గోవిందరాజు, యిద్దరు 'నాచ్చియార్'లు, గోదాదేవి (ఆండాళ్), సేనై ముదలియార్, పల్లకీలో రామానుజులు వస్తారు (సంఖ్య.3)

**క్రీ॥శ॥ 25-9-1583లో అయ్యావయ్యంగార్, తోలప్పాచార్య మనుమడూ అయిన ఏట్టూర్ తిరుమల కుమార తాతాచార్య నాలుగు పల్లెలు దేవాలయానికి దానమిచ్చాడు.** వాటి వార్షిక ఆదాయం సగటున 720 రేఖైపొన్నులు (బంగారునాణాలు). అతనే శ్రీరంగదేవ మహారాయల పరిపాలనాకాలంలో స్వామికి ప్రతి ఉదయం రెండుసార్లు నివేదనకు యేర్పాటు గావించాడు. 'అర్పశి' మాసంలో జరిగే బ్రహ్మోత్సవాన్ని పునరుద్ధరించాడు. లేకుంటే ఉత్సవం కొనసాగేదేకాదు. పునరుద్ధరణ పిమ్మట ఉత్సవం 12 రోజులవరకు కొనసాగేది. ప్రతినిత్యం అనేకచోట్ల రకరకాల నివేదనలలో మొత్తం 1512 'తిరుప్పోణకం' నివేదనలలో ఉత్సవ మూర్తులకు అనేక పణ్యారాల (ఉపాహారాలు)తో, ఆరు రకాల 'పగై-పడి' వేంకటేశ్వరుని మూల విరాట్టుకు ముఖ్యంగా గురువారంనాడు (అర్పశి బ్రహ్మోత్సవం ప్రారంభమయ్యే ముందుగానే), పువ్వుల కిరీటంలో అలంకారం, స్వామివారి తిరుమంజనానికి పెద్దయెత్తున సుగంధద్రవ్యాలు, అనేక రకాల నివేదనలు, ముందుగా వచ్చే అనేక శుక్రవారాలకై యేర్పాట్లు గావించాడు. హంస, గరుడ, గజవాహనాలు మాత్రమే ఊరేగింపుకి వాడేవారు. బ్రహ్మోత్సవాలలో మరొక విశేషం దేవాలయంలో జమాఖర్చులు వేసేవారు. ఖర్చుల పట్టికలు తయారు చేసేవారు. వారికి చందనమిచ్చి గౌరవించేవాడు. కైశికపురాణ శ్రవణం పిదప దాత మలయప్ప, కృష్ణులకు 'ఉటి-అడి' రోజున, వేంకటేశ్వరస్వామికి ఉత్థాన ద్వాదశిరోజున నివేదనలకు యేర్పాట్లు చేశాడు.

అంతవరకు ఉత్సవమూర్తులకు తిరుపతికి చుట్టుప్రక్కలనున్న ఊరి శివార్లలోని వివిధ వేదికలకు తీసుకొని వెళ్ళేవారు. కాని, తిరుపతి దగ్గర అవిలాల (దానంగా యివ్వబడిన వొకగ్రామం) గ్రామ నివాసి

వొకరు రెండు లేక మూడు ప్రత్యేక దినాల్లో ఉత్సవమూర్తులను తన గ్రామానికి వచ్చేలా క్రీ॥శ॥ 18-10-1584న యేర్పాట్లు గావించాడు. దీనికోసం, తిరుమంజనంకొరకు, గ్రామంలో యేర్పరచిన మంటపంలో అనేకమైన నివేదనలకై యేర్పాట్లు చేశాడు. అంతవరకు కూప్పుచంద్రపేట అనే సమీప గ్రామంలో గోవిందరాజు ఉత్సవమూర్తులకు పున్నమిరోజున అనేక నివేదనలతో అటువంటి ఊరేగింపు యేర్పాట్లు ఉండేవి.

**నారాయణ కుమారుడు అవసరం చెన్నప్ప క్రీ॥శ॥ 22-4-1586 న 'ఆడి' మాసంలో జరిగే బ్రహ్మోత్సవాలలో గరుడధ్వజం ఆరోహణ చేసినప్పుడు మూడురోజులపాటు, అదే మాసంలో 'పునర్వసు' రోజున ఉత్సవమూర్తులకూ నివేదనలు యేర్పాటు చేశాడు.** అదే 'విడాయాట్టి' రోజున సేనై ముదలియార్, భాష్యకార్ (రామానుజులు)లకు కూడా తిరుమల మంటపంలో నివేదనలకు యేర్పాటు చేశాడు (సంఖ్య.7) అర్పశి బ్రహ్మోత్సవం (సంఖ్య.5) క్రీ॥శ॥ 25-9-1583 నాటినుండి తిరిగి ప్రారంభించినట్టే, శిలాశాసనానికి (సంఖ్య.7) ముందే 'ఆడి' బ్రహ్మోత్సవం (బహుశా కొంతకాలం జరగలేదేమో) పునఃప్రారంభించినట్టుంది. ఈ బ్రహ్మోత్సవం సదాశివరాయల కాలంలోని కొన్ని శాసనాలలో ప్రస్తావించబడింది.

సర్వధారినామ శకసంవత్సరం 1510లో (క్రీ॥శ॥1588) శ్రీ రంగదేవ మహారాయలు పరిపాలిస్తూ వుండేవాడు. అతని పిమ్మట శకసంవత్సరం 1514లో నందనరాజు (క్రీ॥శ॥ 14.7.1512 నుండి-సంఖ్య.9) విజయనగర సామ్రాజ్యమేలేనాడు ఆ రోజునుండి **విజయనగర సామ్రాజ్యంలో వొక వర్తకుడైన తిమ్మప్ప నాయకుడు స్వామివారి తిరుమంజనానికి, గోవిందరాజస్వామి వారి ఉత్సవాలకు, నివేదనలకు ('నాచ్చియార్', సేనై ముదలియార్, రామానుజులతోసహా) 12రోజులు జరిగే రామానుజ** అధ్యయనోత్సవం సందర్భంగా; గోవిందరాజస్వామి వారి మొదటిరోజు, రథోత్సవంనాటి నివేదనలకు (వారికి వైకాశి, ఆని, ఆవణి మాసాలలో మూడుసార్లు జరిగే బ్రహ్మోత్సవాలలో); మార్గళి-నీరాట్టోత్సవంలో రథం అధిరోహించి వుండగా ఆండాళ్‌కు; చిత్తిరై మాసంలో నాలుగు రోజులపాటు జరిగే పుష్పాలంకరణ పండుగలో అభిషేకాలకూ, నివేదనలకూ, దాతల మంటపానికి పోయే ఊరేగింపులకూ; వైకాశి, ఆని, ఆవణి, మాసి మాసాలలో వచ్చే బ్రహ్మోత్సవాల చివర, తెప్పోత్సవంనాడు, వేసవి పండుగరోజున, **తీర్థవారి రోజున గోవిందరాజస్వామి వారికి ఆళ్వార్ తీర్థంలో, కపిలతీర్థంలో జరిగే మజ్జన, అభిషేకాదులకు; మార్గళిలో వచ్చే ముక్కోటి ఏకాదశి (తులసీ మాహాత్మ్యం)** రోజున గోవిందరాజస్వామి వారికి జరిగే అభిషేకం, నివేదనలకు; వసంత తిరునాళ్ (వసంతోత్సవం)లో మూడవ రోజున జరిగే కార్యక్రమాలకు, యేర్పాట్లు గావించాడు. రామానుజుల అధ్యయనోత్సవంలో గుడి వెలుపల ద్వారంవద్ద గోవిందరాజులు, నాచ్చియార్, **ఎంబెరుమానార్ (రామానుజులు)**లకు గోవిందరాజుల గుడి ఆదాయం, ఖర్చుల వివరాలు నివేదించబడతాయి.

తిరుపతికి ఒకటిన్నర మైళ్ళదూరంలో వున్న రామాపురం గ్రామంలో, నగరత్తార్ (బేరిసెట్టి కులస్థులు) లలో వర్తకులలో వొకడైన తంబిసెట్టి కొడుకు శిలంబిడైయార్ శెట్టి క్రీ॥శ॥ 19-4-1596 న తిరుపతిలో

పడమరనున్న పెరియరాజు వీథిలోని వొకమంటపంలో **శ్రీ వరదరాజపెరుమాళ్,** నాచ్చియార్, తిరుక్కచ్చినంబియొక్క ప్రతిమలు ప్రతిష్ఠించాడు. వేంకటపతిదేవ మహారాయ పాలనలో, శ్రవణ నక్షత్రం (వరదరాజు జన్మనక్షత్రం, వేంకటేశ్వరస్వామి వారిదికూడా) మొదలు 13 రోజులు, శ్రీజయంతి, దీపావళి, కార్తిగై, తైపూసం, వైకాశి విశాఖరోజుల్లో, మార్గళిలో 30 రోజులు; గోవిందరాజులకు ప్రత్యేకమైన రోజుల్లో నెయ్యి తయారుచేసే గేదెల యజమానులుండే వీథిలోని మంటపంలో వున్న గోవిందరాజులకు; వైకాశి బ్రహ్మోత్సవం చివర **కపిలతీర్థంలో తీర్థవారి** తరువాత 10వ రోజున ఉత్సవంలో తెప్పోత్సవం సందర్భంగా **ఆళ్వార్ తీర్థానికి** బయలుదేరేముందు అన్ని నివేదనలూ యేర్పాటు చేశాడు. విజయదశమిరోజున గోవిందరాజస్వామివారికి ఆయన జన్మస్థలమైన రామాపురానికి తీసుకొనిపోయి అక్కడ దాతల మంటపంలో నివేదనలతో వారిని ఆరాధించేవారు (సంఖ్య.12). పడమటనున్న రాజవీథిని యీనాడు "బేరివీథి" అనే పేరుతో పిలుస్తున్నారు. **బేరిసెట్టి కులస్థులు ఎక్కువగా ఆ వీథిలో వుండటంవల్ల ఆ వీథికి "బేరివీథి" అని పేరు వచ్చింది. ఆ కులస్థులు తిరుక్కచ్చినంబిని తమ కులస్థుడైన ఋషిలా భావిస్తారు**. దాత కూడా 'బేరిసెట్టి' అయివుండవచ్చు. గోవిందరాజస్వామివారికి కోడైతిరునాళ్ళలో పదవరోజున కపిలతీర్థంలో జరుగుతుండే తెప్పోత్సవం, తరువాత కాలంలో నిలిపివేశారు. ఇప్పుడు డిసెంబర్ రెండవ పక్షంలో వచ్చే కృత్తిక, రోహిణి, మృగశిర నక్షత్రాలతో కూడిన రోజుల్లో, మార్గళిలోని శుక్లపక్షంలో మూడు రోజులపాటు **కపిలేశ్వరంలో** మాత్రమే యీ ఉత్సవం జరుగుతున్నది.

క్రీ॥శ॥ 31-3-1606 న **విజయనగరవాసి అయిన బొక్కసం కృష్ణయ్య** వేంకటేశ్వరస్వామివారి పదకొండు బ్రహ్మోత్సవాలలో (ఆవణి మాసంలో జరిగే బ్రహ్మోత్సవంతోసహా) కొన్ని ప్రత్యేకదినాల్లో వేంకటేశ్వరస్వామివారి నివేదనలకు ఏర్పాట్లు గావించాడు. హనుమంతుని ఆలయానికి ముందున్న మంటపంలో తెప్పోత్సవంనాడు గోవిందరాజస్వామివారికి కూడా యీ విధంగానే ఏర్పాట్లు గావించాడు. దేవాలయాని కెదురుగాను, దేవస్థానపు సత్రానికి చేరువలోనూ వున్న గోవింద పుష్కరిణి ఒడ్డున హనుమంతుని ఆలయం కట్టించింది కూడా అతనే. అనేక శతాబ్దాల క్రిందట శిథిలమై, **దేవాలయ 'విచారణకర్త'లలో ఆఖరివాడైన కీర్తిశేషులు శ్రీ మహంత ప్రగడచేత పునర్నిర్మించబడింది.** (50 సంవత్సరాలనాటి ఒక సత్రంతోసహా). కొడై తిరునాళ్ళలో 20వరోజు స్వామివారికి, గోవిందరాజస్వామికి, నాచ్చియార్‌కి, వైకాశి, ఆని బ్రహ్మోత్సవాలలో ఆలయమంటపంలో నివేదనలు ఏర్పాటు చేయబడేవి. ఆ రోజులలో గోవిందరాజస్వామివారి తెప్పోత్సవం గోవింద పుష్కరిణిలో నిర్వహించబడుతూ ఉండాలి. పొరబాటుగా 'కపిలతీర్థంలో' అని వ్రాయబడిందేమో! ఇప్పుడు కీర్తిశేషులైన విచారణకర్త (కార్యనిర్వహ ణాధికారి) చేత ప్రారంభింపబడిన, పునర్నిర్మింపబడిన తటాకంలో జరుప బడుతోంది. అయిదు రోజులు కృష్ణుడికి, మొదటి రాత్రినాడు ఆండాళ్‌కి (గోదాదేవికి), రాములవారికి, సీతాదేవికి, రెండవ రాత్రినాడు; గోవిందరాజ స్వామివారికి మూడవనాడు రాత్రి (మాఘమాసంలో పున్నమినాడు); పున్నమి తరువాత వచ్చే రెండు రోజులలోను ఉత్సవం జరుగుతుంది.

విజయనగరంలోని మాల్యవంత పర్వతంపై విజయనగర సైన్యంలో *[1]అధికారి అయిన **లక్కప్ప నాయకుని కొడుకు హనుమయ్యర్ అణ్ణన్‌గార్,** క్రీ॥శ॥ 28-11-1606 న ప్రతినిత్యం వేంకటేశ్వరస్వామివారికి, అలమేలుమంగ-నాచ్చియార్‌కి ఉదయం దధ్యోదనం నివేదించే సమయంలో 5 రకాల తీపివంటకాలు ఉండేలా యేర్పాటు చేశాడు. ఈ నివేదనకు చక్రవర్తి వేంకటపతిదేవమహారాయలు, అతని దేవేరి కృష్ణాజీ అమ్మన్‌ల శ్రేయస్సుకొరకు ఉద్దేశించబడింది. దీనికి కావలసిన ద్రవ్యం వొకగ్రామం, వొక తటాకం, మూడు నీటిపారుదల కాలువల ఆదాయంలో నాల్గింట మూడువంతులు- అంటే 365 రేఖాపొన్నులు (365 బంగారునాణాలు), మిగిలిన నాలుగవవంతు అధికారుల జీతభత్యాలకు లభించింది (సంఖ్య. 14)

**నారాయణ దాసరి నాయకుడు గోవింద పుష్కరిణి వొద్దున నిర్మించిన మంటపంలో రఘునాథుని విగ్రహం ప్రతిష్ఠించాడు.** క్రీ॥శ॥ ఏప్రిల్ 1606లో రఘునాథుని నిత్య నివేదనకు, పునర్వసు నక్షత్రంతో కూడిన 13 రోజులలోను, రాత్రిపూట దీపాలకు, తిరుపతిలోని రామానుజకూటమికి వచ్చిన తీర్థ యాత్రికుల అన్నదానానికి యేర్పాట్లు చేయడమేకాకుండా గోవిందరాజ స్వామివారికి వైకాశిలో కొన్ని రోజులలో, ఆని బ్రహ్మోత్సవం, మిగిలిన రోజులలో (వైకాశి బ్రహ్మోత్సవం, ముకుంద మోక్షం పండుగప్పుడు), గోవిందరాజు ఆలయంలో మార్గళిమాసంలో 30రోజులు వెలుపలి స్తంభం దగ్గర, తానే ప్రతిష్ఠించిన పట్టాభి వేంకటేశ పెరుమాళ్‌కు మంటపంలో నిత్యసేవలకు, సూడికొడుత్త నాచ్చియార్ (ఆండాళ్) సేవలకు (చిత్తిరై - విషురోజున), యింకో రెండు రోజులకు యేర్పాట్లు గావించాడు.

సంఖ్య. 16 చక్రనేమి క్రమంలో వచ్చే ప్రమాదీచనామ సంవత్సరం శాలివాహన శకం 1535 అంటే క్రీ॥శ॥ 1613 సంవత్సరం. వేంకటపతి దేవమహారాయల పరిపాలనాకాలంలో గోవిందరాజస్వామివారికి జరిగే వైకాశి, ఆని, మాసి-యీ నాలుగు బ్రహ్మోత్సవాలలో గరుడుడు చిత్రించ బడిన ధ్వజం ఆరోహించినపుడు, వేసవి ఉత్సవంలో రెండవరోజున, గోవిందరాజులకు మొదట; కార్తీకమాసంలో కృత్తికా నక్షత్రంలో కూడి వున్నరోజున తిరుమంగై ఆళ్వార్‌కు (ఆళ్వార్ జన్మనక్షత్రంనాడు), కృత్తికా నక్షత్రంతో కూడిన సంవత్సరంలోని 13 రోజులలోను; రథంలో ఊరేగింపు తరువాత, దేవాలయానికి వెళ్ళేముందు రథమంటపంలో కూర్చునివున్న గోవిందరాజులకు,'నాచ్చియార్'కు, 'తిరుచ్చి' లోని యిద్దరు 'నాచ్చియార్'లకు, పల్లకీలోని గోవిందరాజులకు నివేదనలు యేర్పాటు గావించాడు.

---

1. క్రీ॥శ॥ 1565లో జరిగిన తళ్ళికోట యుద్ధానికి ముందు విజయనగర సైన్యం మాల్యవంతపర్వతంపై వుండటం పరిపాటిగా వుండేది. తళ్ళికోట యుద్ధంలో అళియరామరాజు అసువులు కోల్పోయాడు. అతని తమ్ముడు తిరుమలరాజు, చక్రవర్తి సదాశివరాయలతో కలిసి, పెనుకొండ పారిపోయాడు. విజయనగరాన్ని ముస్లింల చేతిలో వినాశనానికి వదిలేశాడు. దాత తండ్రి లక్కప్పనాయకుడు యీ శిలాశాసనానికి 50 సంవత్సరాలు ముందే మాల్యవంత పర్వతం మీద సైన్యాధికారిగావుండి వుండవచ్చు.

**ఆపస్తంబ సూత్రుడు, భారద్వాజస గోత్రుడైన నోట్టక్కార కోనప్పయ్యర్ కుమారుడు నోట్టక్కార వేంకటయ్యన్ రెండు నీటిపారుదల కాలువలు త్రవ్వించాడు.** ఆ రెండు కాలువలవలన సుభిక్షమైన రెండుగ్రామాలలో పండిన పంటద్వారా లభించిన ద్రవ్యంలో 200 బంగారు నాణాలు మలయప్పస్వామి వారికి జరిగే చిత్తిరై బ్రహ్మోత్సవంలో 10వ రోజున వసంత ఋతువులో జరిగే ఉత్సవాలలో భాగంగా వసంతమంటపంలో నివేదనలకీ, తిరుమంజనానికి, మలయప్పస్వామివారి యిద్దరు నాచ్చియార్లకు, కృష్ణునికీ; తిరువాయ్‌మొళి మంటపంలో 132 రోజుల నివేదనకీ (అంటే అంకురార్పణ నుండి 'విడాయాట్టి' వరకు 12రోజుల చొప్పున ప్రతి 11 బ్రహ్మోత్సవాల లోను); పదకొండింటిలో ప్రతి బ్రహ్మోత్సవంలో 10వ రోజున ఉద్యాన మంటపంలోను, తానే బహూకరించిన వెండి శేషవాహనంయొక్క మొదటి రాత్రి ఊరేగింపు తరువాత; వెండి వాహనంమీద మూడవరాత్రి ఊరేగింపు జరిగే నివేదనలకు, క్రీ॥శ॥4-11-1614 కేటాయించాడు. అతనే శ్రీరామనవమి మరునాడు శ్రీరామపట్టాభిషేకానికీ యేర్పాటుచేశాడు. అది పుష్యమీ నక్షత్రయుక్త చైత్రమాస శుక్లపక్షంలో పదవరోజున నోట్టక్కార వేంకటప్పయ్యన్ భార్య వేంకటమ్మ గౌరవార్థం వొక కార్యక్రమం యేర్పాటు చేశాడు. వెంకటప్పయ్యన్ దంపతులు విజయనగరం దగ్గర చిన్న హుత్తూర్‌లో ఉండేవారు. అదే సందర్భంలో గుడిలోని మలయప్ప, అతని యిద్దరు దేవేరులు, సీతాలక్ష్మణ సమేతుడైన శ్రీరాముడు, సేనై ముదలియార్, రామానుజుడు, హనుమంతుడు, సుగ్రీవుడు, అంగదుడు-వీరందరికీ తిరుమంజనం జరపాలి. వారందరిపై చందనం ప్రోక్షించాలి. కర్పూరం, జవ్వాదులతో వారికి తిరుచూర్ణం అద్దాలి. పెరుగు కలిపిన వంటకాలు, ఆరురకాల పిండివంటలు-అతిరసం, అప్పం, దోసె, ఇడ్లీ మొదలైనవి నివేదించాలి. **వెన్నుమాలై ఇట్టాన్ మంటపం (బహుశా విశాలంగావున్న ముందు వసారా తిరుమామణి మంటపం)** పట్టాభిషేక మహోత్సవానికి ఉపయోగపడే వాయుపురాణభాగం కూడా పేర్కొనబడినవి (సంఖ్య. 18).

**సిరగిరిరాజయ్య కుమారుడు శ్రీమాన్ మహామండలేశ్వర చిన్నతిమ్మ రాజయ్య (భోగాల రాజయ్య కుమారుడు) క్రీ॥శ॥1616లో అంటే వేంకటరాయ దేవమహారాయల పరిపాలనా కాలంలో, 12రకాల ప్రసాదాలకు యేర్పాటు చేశాడు.** ఈ ప్రసాదాలు ఆలయ ధర్మకర్తలకు చెందే భాగంలోనివి. తిరుమలలో నివాసమేర్పరుచుకున్న **తిరునారాయణపురం వాసి అయిన తిరువేంకటయ్యంగార్ (దాత ప్రతినిధి) రామరాజయ్య (అళియరామరాజు) గారిచే యేర్పాటు చేయబడినవి.** అంతేకాకుండా వేంకటేశ్వరుని నిత్య నివేదనం,మలయప్ప స్వామియిరువురు 'నాచ్చియార్ల'కు (10 బ్రహ్మోత్సవాలలో కొన్నిరోజులలో), తిరుమామణి మంటపంలో కొలువుదీరి వున్నప్పుడు, తొమ్మిది రోజులు గరుడ ధ్వజానికి (పురట్టాశిమాసంలో జరిగే బ్రహ్మోత్సవం మొదలుకొని) వైకాసి, ఆని, ఆవణి, మాసిమాసాల్లో గోవిందరాజస్వామివారికి తిరుపతిలో జరిగే నాలుగు బ్రహ్మోత్సవాలలోనూ, గరుడ ధ్వజానికి 4 బ్రహ్మోత్సవాల మొదటిరోజునుండి 9 రోజులవరకు కూడా నివేదనలను యేర్పాటు చేయబడ్డాయి.

**తిరుమలలో జరిగే ప్రతి పదకొండు బ్రహ్మోత్సవాలలో ఆఖరిరోజున వసంతనవమి ఉత్సవాలు నోట్టక్కార కోనప్పయ్య మనుమడు నోట్టక్కార వేంకటయ్య (సంఖ్య.18). కుమారుడైన నోట్టక్కార నారాయణ యేర్పాటు చేశాడు.** ఇది బహుశా ఉత్సవాలలో తొమ్మిదవరోజున అయివుండాలి. (వరాహస్వామివారి ఆలయం ముందున్న మంటపంలో స్వామిపుష్కరిణీ జలాలలో నిర్వహించబడే తీర్థవారి పూజలో అంటే ఉత్సవం ముగిసేనాటికి) ఇది మలయప్పస్వామి ఊరేగింపు తరువాత; **'పల్లయంతులామ్'**లో మలయప్పస్వామి, పల్లకిలో 'నాచ్చియార్' తిరుచ్చిలో సేనైమొదలియార్, రామానుజులు, అందరూ తిరుమంజనం తరువాత వసంత మంటపంలో కొలువు దీరిన పిమ్మట. ప్రతి బ్రహ్మోత్సవంలో మూడవ రోజున, దాత తండ్రి వేంకటయ్యగారిపేరిట సంవత్సరంలో వచ్చే ప్రతి 53 ఆదివారాలలో, అలాగే ఉత్సవమూర్తులకు రాత్రి, పగలు ఊరేగింపులు, నివేదనలూ వుంటాయి. బహుశా ప్రభుత్వోద్యోగంనుండి విశ్రాంతి పొంది తిరుమలలో వేంకటేశ్వరస్వామివారికి సేవచేయాలనుకున్న వేంకటపతి దేవమహారాయలు యేర్పాటుచేసిన **దణ్ణాయకమంగళం** అనే ఇళ్లే దాత నివాసంగా పేర్కొన బడింది. దీనికి సంబంధించిన శాసనం **శ్రీవీరరాహుత్తరాయ దేవమహారాజు** పాలనాకాలంలో అంటే శకసంవత్సరం 1549 లో అంటే క్రీ॥శ॥ 05-05-1527 ప్రభవనామసంవత్సరంనాటిది.

**25, 26 సంఖ్యలుగల శాసనాలు సీసమాలికలో, తెలుగు అక్షరాలలో చెక్కబడివున్న 25, తమిళ గ్రంథ లిపిలో చెక్కబడి ఉన్న శాసన సంఖ్య.26, శక సం॥1550 నాటికి విభవ సంవత్సరం దానికి సరియైన క్రీ.శ.1628 శాసనాలు, మట్ల తిరువేంగళరాజు చెన్నమ్మల కుమారుడైన మట్లకుమార అనంతరాజు తల్లిదండ్రులు, యుద్ధాలు, సేనలు, బహుమతులు, దానాలకు సంబంధించిన వివరాలతో ఉన్నాయి.** అతడు దేవచోడ కుటుంబమనే సూర్యవంశ సముద్రానికి చంద్రునివంటివాడు. అతని యేలుబడి వేంకటాచలంనుండి అహోబలపర్వతంవరకు వున్న ప్రాంతంలో విస్తరించింది. **రాజసింహ** (రాజులలో సింహం), **మైవరగండ** (మైవారులలో శ్రేష్ఠుడు), **భిదుర సామజ సింహభీషణ** (ఏనుగువలె ప్రసిద్ధిచెందిన యోధులకు, నాయకులకు, సింహంవలె భీకరుడు), **గండరబాలప్రచండ విక్రమశాలి** (ప్రభాత సూర్యుని వలె ప్రకాశవంతుడు, భయంకరుడూ అయిన యోధుడు), **మానినీజన మనోమన్మథ** (స్త్రీలకు మన్మథునివలె మనోరంజకుడు–బహుశా చాలా అందగాడేమో), **శ్రీ వేంకటేశ్వర సేవాధురంధర** (శ్రీ వేంకటేశ్వర పాదసేవకే అత్యంతమూ అంకితమైనవాడు), **ఆశ్రిత మందార** (కల్పవృక్షంవలె ఆశ్రితుల కోర్కెలు తీర్చేవాడు), **ఆర్యనుత** (ఆర్యులమెప్పు పొందేవాడు) వంటి అనేకమైన బిరుదులుగలవాడు.

పాలగిరి, అనిమేలా, పీలేరు, చప్పలి, వేముపల్లిలలో జరిగిన యుద్ధాలలో కపర్ది (శివుడు)వలె పోరాడినాడు. కొట్టగల, పలకడ, గుండ్లూరు, ముష్టూరు, కుమాళ్ళ కాల్వలలో శత్రుసైన్యాలను తుదముట్టించాడు.

**ఉదయాచలాధీశ్వరభగవాన్ (ఉదయగిరి శ్రీరంగనాథుడు) యితనికొక దమాయి భేరి, సామజ (గజధ్వజం) (రాచరికపు గుర్తు) ప్రసాదించాడు. వేంకటేశ్వరుడు అఖేటకుడు (వేటగాడు) గా ప్రసిద్ధిపొందిన**

**వాడు గనుక ఆఖేటమంటపాన్ని నిర్మించాడు.** ఉద్యానవనం తిరువళ్లూరులోని శ్రీ వీర రాఘవ స్వామికొక వసంతమంటపం నిర్మించాడు. వేంకటాచలపతికొక **స్వర్ణాశ్వం** (బంగారు అశ్వం), **ఒక స్వర్ణ సింధూరం** (స్వర్ణగజం), **ఒక స్వర్ణసమరభూపాలవాహనం** (సమరభూపాలకులు మోసే వాహనం), ఒక పద్మపీఠం, **రత్నాఢ్యమకుటం** (రత్నాలు పొదిగిన కిరీటం), **నైవేద్యభాజనం** (నివేదనలకొరకు పళ్ళెరం), **ఒక ఉన్నత కేళీమంటపం, సోపానమార్గం** (అనేక మెట్లతో కూడిన మార్గం), **ఒక అగ్రగోపురం** (గాలిగోపురం అనే పేరున్న ముందున్న కొండపైగల స్థూపాకృతి), తక్కిన కట్టడాలు నిర్మించాడు. **గాంగేయ గజతురంగమ వాహన అర్ణవ** (స్వర్ణగజం, అశ్వవాహనాలు) బహూకరించి గోవిందరాజమూర్తి (భ్రాజిష్ణు)ని అందంగా మలచాడు. నీలగ్రీవుడు, మహాదేవుడైన శ్రీకాళహస్తి గ్రామ శ్రీ కాళహస్తీశ్వరునికి కనక **మోహన మయూరవాహనం** (బంగారు నెమలివాహనం) బహూకరించాడు. కొండమీది దారిలో వేంకటాధీశ్వరుని విగ్రహప్రతిష్ఠ గావించాడు.

**నెలందలూరు (కడపజిల్లాలోని నందలూరు) లోని రఘునాథు (శ్రీరాముడు)ని కొరకు ప్రాకారపు గోడలనానుకుని బాహ్యమంటపాలు నిర్మించాడు.** పుష్కరిణి మధ్యభాగంలో సరసీమంటపం **(నీరాళిమంటపం)** మరియు స్వామివారి సేవకు పూలతోట నిర్మింపజేశాడు. **కడప జిల్లా నందలూరు సమీపంలో గల ఒంటిమిట్ట రఘునాథుని (శ్రీరాముని) దేవాలయ ప్రాకారాన్ని అంటిపెట్టుకొనే విధంగా బయటి మంటపాలను నిర్మించాడు.** దేవాలయానికి దక్షిణ, ఉత్తర దిశలలో రెండు విశాలమైన గోపురాలను నిర్మించాడు. అంతేకాదు, గర్భగుడి చుట్టూ ప్రదక్షిణ నమస్కారాలు సమర్పించే దానికి అంతర్గత వలయాకృతిని ఏర్పాటు గావించాడు. స్వామికి నిత్యోపచారాలకు (నిత్యపూజ) ఏర్పాట్లు చేశాడు. **చెన్నమాంబాపురం, చెన్నమాంబా సముద్రం అనే రెండు అగ్రహారాలను స్థాపించాడు. కడపదగ్గర సిద్ధవటంలో చెన్నకేశవస్వామి విగ్రహప్రతిష్ఠచేసి, దాని ప్రాకారం, గోపురం నిర్మించడమేకాక ఒక పవిత్రమైన కార్యంగా భావించి స్వామివారికి ఆభరణాలు బహూకరించాడు. అదేచోట సిద్ధవటేశ్వరస్వామివారు** ఆరోహించటానికి **హాటక వృషభవాహనం** (బంగారు వృషభవాహనం) బహూకరించాడు. గ్రామాలలో పేరెన్నికగన్న అనంతరాజ పురవర గ్రామం సుదర్శనచక్రధరుడైన విష్ణువుకు కైంకర్య దీక్షితుడై గోపుర నిర్మాణసేవ గావించాడు. **సోమశిల** (చంద్రగిరి) లో కరుణామయుడైన కపర్ది**(శివుడు)**కి ధృడమైన గోపురం కట్టించాడు. ప్రతి సంవత్సరం జరిగే ఉత్సవంలో ఆనందం పాలుపంచుకొనే ఒకనిగా **పుష్పగిరిదైవం** ప్రసవాచలేశ్వరునికి **ప్రాకారం, గోపురం కట్టించాడు. దేవుని కడప (గడప)లో రమావిభునికి (లక్ష్మీవిభుడు-విష్ణువు. అంటే శ్రీవేంకటేశ్వరుడు) అతని ఆలయప్రాకారంతోబాటు గోపురంకూడా కట్టించాడు. కడపజిల్లాలోని రాచవీడు (ఇప్పటి రాయచోటి) లోని వీరభద్రునికి పేరు గాంచిన ద్విముఖగోపురం (రెండు గోపురాలు కలిసిన కట్టడం)నిర్మించాడు.**

అతడనేక అన్నసత్రాలు కట్టించిన దాత. ఈ అన్నసత్రాలలో షడ్రుచులతో కూడిన ఆహారపదార్థాలతో యాత్రీకులకు రోజూ విందుభోజనాన్ని ఏర్పాటు చేశాడు. ఆ యాత్రీకులు భిన్నభిన్న ప్రాంతాలవారు. దక్షిణానగల రామేశ్వరం సేతువునుండి **శీతాచలం (బదరి)వరకు, తిరుపతిలోని ఆళ్వార్ తీర్థం (కపిలతీర్థం,**

**తిరుపతి), శేషాచలం కురువ (శేషాచలానికి కాలినడక దారి) మీది బాటవరకు, సిద్ధవటం, ఒంటిమిట్ట, ప్రసవమణిభృత్ (పుష్పగిరి), ఓరాముపాడు (కడపజిల్లాలో), దువ్వూరు, గుండ్లూరు, పోరుమామిళ్ల, నెలవనూరు, ఊర్మిళ్ల, అనంతరాజపురం వరకు కాలిబాటన తీర్థయాత్రలు చేసేవారు.** సంతోషంగా వెండి బంగారాలతో తాను తులాభారం తూగి ఆ బంగారాన్ని, వెండినీ అందరికీ పంచేవాడు. బ్రాహ్మణులకు గోదానం, భూదానం, బహుసహస్ర కన్యాదానాదులుచేసి వారు ప్రజాహితంకొరకు యాగాదులు, దానధర్మాలు చేసేలా సహకరించేవాడు. అతడు కటకపురిని కొల్లగొట్టాడు. ప్రతి సంవత్సరం గంగానదినుండి తెచ్చిన జలంతో స్నానంచేసి పవిత్రుడయ్యేవాడు. ఆయన **అనఘమూర్తి** (పాపమంటనివాడు); ఆయన చెన్నూరుపురం నడచి వెళ్ళే త్రోవలో తటాకాకారంలో వున్న ఒక అడ్డంకిని తొలగించాడు **(తటాకాకారవిజిత నిరాకర).**

ఆయన తిరువెంగళరాజుగారికి రత్నంలాంటి పుత్రుడు. రాజులలో అగ్రగణ్యుడు. చెన్నాంబకు ఆహ్లాద మొనగూర్చే ముత్యంలాంటి పుత్రుడు. వైభవానికి ఆటపట్టు. మానవలోకానికి తలమానికం. ప్రజలకు బహుమతు లివ్వడంలో అతని కతడేసాటి. మధురవాగ్మి. మట్లకుమార అనంతుడు సాహసి కూడా.

అందమైన విశాలమైన శేషాచలం ప్రక్కనే అతడు శ్రీపాదమంటపాన్ని నిర్మింప జేశాడు. ఆ ముంగిట్లో విష్ణుదేవుని పవిత్ర పాదాలను శిల్పింపజేశాడు. ఆది బ్రహ్మ, ఈశ్వర, సనకాది దేవతలు, మునులు ఆచంద్రతారార్కం వీక్షించి తరించే విధంగా నిర్మింపజేశాడు. శ్రీపాద మంటపానికి మీద కొద్ది గజాల దూరంలో పాదాలమంటపం అని పిలువబడే బాటలో గోపురం నిర్మించాడు. ఇది క్రొత్త గోపురంగా ప్రసిద్ధి చెందింది. అంతకు ముందున్న శిథిలమైన పెద్దగోపురం *సాళువ నరసింహుడు 15వ శతాబ్దంలో నిర్మించినది (కొద్ది దశాబ్దాల క్రిందట దాని పైభాగం శిథిలమై క్రిందపడిపోయింది). **మట్లకుమార అనంతరాజే దాన్ని నిర్మించడానికి సాక్షిగా దాని తూర్పు పునాది లోపల భాగంలో రెండు చిన్న శిలాశాసనాలు చెక్కబడివున్నాయి. అదేచోట, కొంచెం పైభాగంలో ఆయన తల్లిదండ్రుల మూర్తులు చెక్కబడివున్నాయి. వాటిక్రింద రెండు శాసనాలు (ఒకటి తెలుగులో (సంఖ్య.29), మరొకటి తమిళంలో (సంఖ్య.30)) ఆ మూర్తులు మట్లతిరు వెంగళనాథరాజు, అతని రాణి చెన్నమ్మలని ధృవీకరిస్తున్నాయి.**

**"కుమార అనంతరాజు, తిరుపతి గోవిందరాజు దేవాలయానికి తూర్పు దిక్కులో గల పెద్దగోపురాన్ని నిర్మింపజేశాడు. అంతేకాదు దక్షిణ దిశలో లోపలివైపు గల తెలుగు శాసనం (సంఖ్య–31)లో ఆ గోపురం, స్వామివారికి 'ఉభయం' (కైంకర్యం)గా నిర్మించబడినదిగా చెప్పబడింది. ఆ కైంకర్య దాత పేరు శ్రీమాన్ మహామండలేశ్వర కుమార అనంతరాజయ్య, ఇతడు మట్ల తిరువెంగళనాథరాజయ్య దేవచోడ మహారాజులయ్యగారి కుమారుడు".**

---

* ప్రస్తుతం యిది పునఃనిర్మించబడుతోంది. సాళువ నరసింహునికట్టడం క్రింది భాగంలో ఒక క్రొత్తకట్టడం నిర్మించబడుతోంది." గోపీకృష్ణ

"సరిగ్గా తూర్పు దిశా శాసనానికి వ్యతిరేక దిశగా అంటే ఉత్తర దిక్కు వైపుగా పెద్ద గోపురం ఉంది. దాని లోపలివైపుగా రెండు బొమ్మలు చెక్కబడి ఉన్నాయి. దానిక్రింద గల శాసనంలో (సంఖ్య-32) **మట్ల తిరువెంగళనాథ రాజు, ఆయన భార్య రాణి చెన్నమ్మల పేర్లు చెక్కబడి ఉన్నాయి".**

క్రీ॥శ॥ 29-9-1631 న శ్రీ వీరకుమార వేంకటపతి దేవరాయల పాలనా కాలంలో రామచంద్రయ్య అనే ఆయన పురటాసి బ్రహ్మోత్సవం నాలుగవరోజున ఉత్సవమూర్తులకు, గోవిందరాజు, ఆయన 'నాచ్చియార్'కి తిరుపతిలో చిత్రపూర్ణిమ నాడు, మకర సంక్రమణంరోజున, గోదాదేవి బ్రహ్మోత్సవంలో అయిదవరోజున గోదాదేవికి, గోవిందరాజు ఆలయంలో గరుడాళ్వార్‌కి అనునిత్యం నివేదనకై తగిన పైకం సమకూర్చాడు.

**ప్రతివాది భయంకర అణ్ణంగరాచార్య శ్రీలక్ష్మీనారాయణ పెరుమాళ్ విగ్రహానికి ప్రాణప్రతిష్ఠచేసి పెరియాళ్వార్ మూర్తితోసహా తిరుపతిలోని దక్షిణ మాడవీథిలోని వొక ఆలయంలో నెలకొల్పాడు.** ఒక బంగారు నాణెం భూదానంగా యిచ్చాడు. వేంకటపతి రాయ దేవమహారాజుల పాలనాకాలంలో (క్రీ॥శ॥2-1-1636న) గోవిందరాజస్వామికి వైకాసి బ్రహ్మోత్సవంలో ఒకరోజు, పెరియాళ్వార్ జన్మనక్షత్రమైన స్వాతితో కూడిన రోజున లక్ష్మీనారాయణ పెరుమాళ్ గుడిముందు మంటపంలో గోవిందరాజు 'నాచ్చియార్', సేనై ముదలియార్, రామానుజులకు, గోవిందరాజు, 'నాచ్చియార్', కృష్ణ, ఆండాళ్‌లకు, అదే మంటపంలో 'ఆడి' మాసంలో జన్మనక్షత్రమైన పూర్వఫల్గుణి (తిరువాడిప్పూరం) నక్షత్రంతో కూడినరోజున, **లక్ష్మీనారాయణ పెరుమాళ్‌కు** 'ఆడి' మాసంలో దాత జన్మనక్షత్రమైన పుష్యంతో కూడిన 'ఆడి' మాసంలో; పైన చెప్పబడిన అదే మంటపంలో ఆండాళ్‌కు మార్గళి- నీరాట్టం పర్వంలో యేడవనాడు; లక్ష్మీనారాయణ పెరుమాళ్ వారి అధ్యయనోత్సవపు 12వ రోజున; పెరియాళ్వార్‌కు సంవత్సరంలో 13 సార్లు వచ్చేవారి జన్మనక్షత్రం స్వాతితో కూడిన రోజున, **ఆచార్య నాథముని గుడిలో తిరుపతిలో అతని పేరుతో పిలువబడే వీథిలో విచ్చేసియున్న శ్రీరాములవారికి శ్రీరామనవమి రోజున నివేదనలకు తగిన యేర్పాట్లు గావించాడు. పైన చెప్పబడిన నివేదనలన్నీ గోవిందరాజస్వామివారి ఆలయం వంటశాలలో వండించి శ్రీ లక్ష్మీ నారాయణులగుడికి, ఆచార్య నాథముని గుడికి ఆయా రోజులలో తీసుకొని వెళ్ళేవారు.** (సంఖ్య-22)

శ్రీవీర శ్రీరంగదేవమహారాయల పరిపాలనాకాలంలో క్రీ॥శ॥ 15-6-1638న ఒకదాత 11 బ్రహ్మోత్సవాలలో నాలుగవరోజున మలయప్పకు, ఉద్యాన మండప స్థితమైన ఆయన 'నాచ్చియర్'కి; గోవింద రాజు యిద్దరు 'నాచ్చియార్'ల తిరుమంజనానికి, 13సార్లు మూలానక్షత్రం వచ్చే రోజులు, 11మార్లు నివేదనలకు, ఊరేగింపులకు మిగిలిన (రెండు వైకాసి, ఆని బ్రహ్మోత్సవాలలో కలిసిపోవడంవల్ల) యేర్పాటు చేయడం జరిగింది.

**ఋగ్వేద శాఖాధ్యాయి, అశ్వలాయన సూత్రుడు, శ్రీవత్సగోత్రుడూ అయిన రాజశ్రీ శివరాజ రామచంద్ర సీతామాతరావు దబీరుశాయి 5 వరహాల బరువు, 525 శ్రీరంగరాయ 'వరహాల' (ఆ కాలములో**

**గద్యాణములని పేరు) విలువగల ఒక వృత్తాకార స్వర్ణ కంఠాభరణం (అపరంజి బంగారు కంటె) క్రీ.శ.1684 మార్చినెల 19వ తేదీ తిరువేంగడనాథస్వామికి సమర్పించుకున్నాడు.** 4 శుద్ధాన్నపు కొలతలు, ఒక అలంకారపు కొలతతో పాటు మహారాజ **శ్రీషూదభానుజ పంతులు**గారి నివేదనలతో పాటు వరాహస్వామి నిత్య నివేదనలో 'తలిగ', ఒక కుండెడు పాయసం యేర్పాటు గావించబడ్డాయి. (సంఖ్య-24)

ఈ శాసనంలో పరిపాలన చేస్తున్న యేరాజుపేరు ప్రస్తావించబడలేదు. బహుశా యీదాత ప్రభుత్వోద్యోగి అయిన ఒక మహారాష్ట్ర బ్రాహ్మణుడు. **మహారాష్ట్ర నేత, మహారాష్ట్ర చక్రవర్తి శివాజీ పడమటి తీరంలోని కొంకణ దేశాన్ని క్రీ॥శ॥1673లో జయించాడు.** నాలుగు సంవత్సరాల తరువాత కర్నూలు, జింజి, వేలూరు ఆక్రమించి తన పరిపాలనను ఆ ప్రాంతాలకి తన అనుచరగణంలో కొందరిని పాలనాధికారిగా నియమించివుండాలి. (సీవెల్ వ్రాసిన **'ది ఫర్గాటన్ ఎంపైర్' పుట-220) ఆ రోజుల్లో ఆలయాల్లో మరాఠీభాష ప్రజలకు అర్థంకాకపోవడంవల్ల శాసన భాషకై తెలుగు ఉపయోగించివుంటారు.** కాని, తరువాత 19వ శతాబ్ది ప్రారంభంలో దేవాలయ రికార్డులకు మరాఠీ మాత్రమే వాడేవారు. ఇదంతా ఆర్కాట్‌నవాబు తన ఆత్మరక్షణకొరకు ఒక అదనపు దళాన్ని యేర్పాటు చేయటంకోసం దేవాలయపు ఆదాయాన్ని **ఇంగ్లీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ** చేతులలో పెట్టినపుడు జరిగింది.

పాతధ్వజస్తంభం క్రింద పద్మాకారంలో వున్నచోట ఒక తెలుగుశాసనం (సంఖ్య.42) లో **"శ్రీ వేంకటపతికి ప్రణామం. ఈ ధ్వజస్తంభం రాజా శ్రీ సిద్దలూరి రామాజీమాదర్సు పంతులుగారి దానం"** అని వ్రాయబడి ఉంది. మొత్తం 163 బంగారునాణాలు (నెం.47) విలువచేసే తిప్పగుంటపల్లి గ్రామం ఎవరో దాతద్వారా దైవానికి నివేదనల నిమిత్తం దానంగా యివ్వబడింది (సంఖ్య.48) – ఒక శకలంలో శ్రీరంగదేవమహారాయలు పాలిస్తున్నట్లు వ్రాసి వున్నది. కాని, యే సంవత్సరంలో అన్నది చెరిగిపోయింది.

సంఖ్య.54లో పదకొండు బ్రహ్మోత్సవాలు, నివేదనల ప్రసక్తి వుంది. సంఖ్య.56లో ఉగాది (చాంద్రమాన సంవత్సరంలో మొదటిరోజు) నాడు *తిరుమామణి మంటపంలో మలైకునియ-నిన్ర-పెరుమాళ్* (ఉత్సవ విగ్రహం) కొక తిరుప్పావడ (అన్నంతో చేసే ఒక ఘనమైన వంటకం) నివేదనకు సంబంధించిన ప్రస్తావన వుంది. సంఖ్య.61. కోడైతిరునాళ్ (వేసవి ఉత్సవం) లో తిరుమలలోని రాతి రథంలో ఉపస్థితులైవున్న ఉత్సవమూర్తుల నివేదనలు ప్రస్తావించబడ్డాయి.

సంఖ్య.90 లో గోవిందరాజస్వామివారికి జరిగే రెండు బ్రహ్మోత్సవాల చివర, తీర్థవారిరోజున యాగశాలముందు గోవిందరాజస్వామివారికి నివేదనల ప్రస్తావన ఉన్నది. ఈ బ్రహ్మోత్సవాలు వైకాశి, ఆని మాసాల్లో జరుగుతాయి. గోవిందరాజు, అతని దేవేరులకు కొండ దిగువనవున్న శ్రీపాదమంటపంలో ఉత్సవాలు జరుగుతాయి.

సంఖ్య.93 లో హనుమంతునికి సంవత్సరంలో వచ్చే 52 శనివారాల లోను; గోవిందరాజులకు, గోవింద కృష్ణునికి (వెంకటయ్యన్‌చేప్రతిష్ఠింప బడిన విగ్రహం) నిత్య నివేదనలు ప్రస్తావించబడ్డాయి.

**కొండయ్యన్** (సంఖ్య. 100) అనే మట్లకుమార అనంతరాజుగారి ప్రతినిధివున్నట్టు, అతడు రాజుగారి దానాలను పర్యవేక్షించినట్లు చెప్పబడింది (సంఖ్య. 25, సంఖ్య. 26లలో).

సంఖ్య. 113 లో వేంకటేశ్వరునికి తీర్థవారి, కనుమ (మకరసంక్రమణం తర్వాతి రోజు), **పాడియవేట్టై (వేటసంబరం)** (కనుమనాడే), ఉగ్రమూర్తి అయిన వేంకటత్తురైవర్ (ఉగ్రమూర్తి)కి ఒక ప్రత్యేకమైన రోజున యేర్పాటు చేయబడిన నివేదనల ప్రస్తావన ఉన్నది.

**సంఖ్య. 124లో వీడు, వెన్నంపల్లి అనే రెండు గ్రామాలదానం (తాళ్ళపాక చినతిమ్మయ్యగారిచే) ప్రస్తావన వున్నది.** ఈ గ్రామాలు నిత్యమూ గోవిందరాజ స్వామివారికి మూడు తిలాన్నాలకు (సంవత్సరానికి మొత్తం 1095); వేంకటేశ్వరునికి ఆరు రాజాన్నాలు (ఆంధ్రుల రాజనాల బియ్యంతో వండిన శ్రేష్ఠమైన అన్నం) మొత్తం 2190 (సంవత్సరానికి) ప్రస్తావించబడ్డాయి. వరిధాన్యం కొలవడానికి వాడే ప్రమాణాన్ని తిరుమల గుడిలో **కోదై-కడమైక్కాల్** అని పిలిచేవారు. సాధారణంగా తిరుమల దేవాలయంలో ఉపయోగించే ధాన్యపు కొలతకు (వడ్ల కొలమానం) **మలై కునియ నిన్హాన్‌కాల్ (మరక్కాల్)** అనే పేరుతో తిరుమల దేవాలయంలో వ్యవహరించేవారు. తిరుపతి గోవిందరాజస్వామివారిదేవాలయంలో దీన్ని **చాళుక్య నారాయణన్‌కాల్** అనేవారు. ఈ ధాన్యం ధర ఒక పుట్టి లేక వట్టికి 4 పణాలు.

సంఖ్య. 126 లో నరసగణే అనే ఆయన తన కుటుంబసౌఖ్యం కోరుతూ స్వామివారి దేవాలయంలో సాయంకాలం వెలిగించే దీపాలకు, పూజించే పుష్పాలకు చేసిన యేర్పాట్లను ప్రస్తావిస్తోంది.

* * *

# అధ్యాయం-23

## తళ్ళికోటయుద్ధం-విజయనగర సామ్రాజ్యపతనానంతరం వేంకటేశ్వరాలయం-దానివైభవానికి సంభవించిన దుష్పరిణామాలు

**సదాశివరాయల పరిపాలనాకాలంలో పలుకుబడిగలవాడూ, బలవంతుడూ అయిన అతని బావమరిది అళియరామరాజు అతని ప్రధానమంత్రి.** తన యిద్దరు తమ్ముళ్ళ సహాయంతో సలకంసోదరులు పెద్ద తిమ్మరాజు, చినతిమ్మరాజులను జయించాడు. రాజ్యంలో చాలా పలుకుబడి గలవారైన ఆ సోదరులు రాజ్యపాలనలో కీలకమైన పాత్ర వహించటమేగాక అచ్యుతరాయల కొడుకు చిన్న వేంకటాద్రి (అచ్యుత రాయలు క్రీ॥శ॥1542 లో కాలం చేసినపుడు) సింహాసనంపై కన్ను వేయటాన్ని సమర్థించేవారేమో, లేక అచ్యుతరాయల తమ్ముడు రంగరాయల కుమారుడు సదాశివరాయలను సింహాసనంపై కూర్చుండ బెట్టేవారేమో!

**సమర్థుడైన ప్రధానమంత్రి అళియరామరాజు సదాశివరాయల పేరు మీద సామ్రాజ్యమే లేదు. ప్రాంతీయ పరిపాలకులను తన అదుపులో వుంచుకుంటూ, సదాశివరాయలను నేపథ్యంలోనికి నెట్టివేశాడు.** అతడు శూరుడు, సాహసి, తెగువగలవాడు. సైన్యాన్ని శక్తివంతమూ, పరిపుష్టమూ చేశాడు. అతని శక్తి సామర్థ్యాలవలన తమలో తాము పరస్పరమూ కలహించుకుంటూ ఉండే బహమనీ సుల్తానులు పదేపదే అతని సహాయం అర్థించేవారు. అతనుకూడా వారిని కాదనలేదు. కాని, అతను వారిపట్ల, వారి దూతలపట్ల అహంకారపూరితమైన ధోరణి అవలంబించే వాడు. మసీదులను అపవిత్రం చేసేవాడు. వారు అవమానంపాలై తమ మతానికి ద్రోహం జరిగినట్లు భావించేవారు. అందువల్ల నలుగురు సుల్తానులు విజయనగరాన్ని కలిసికట్టుగా ఆక్రమించి, నాశనంచేసి, హిందూసామ్రాజ్యాన్ని కూడా తుదముట్టించాలని కుట్రపన్నారు. మహాసైన్యాలు కూడ గట్టుకొని, బీజాపూర్‌లో వొకచోట కలిసి, కృష్ణానదివరకు పురోగమించి, తళ్ళికోట సమీపంలో గుడారాలు వేసుకున్నారు.

ఆక్రమణకు వస్తున్న సుల్తానుల వివరాలు పూర్తిగా తెలుసుకున్న రామరాజు తన తమ్ముడు తిరుమలరాజును శత్రువులు నదిని దాటకుండా అడ్డుకోవడానికి సైన్యంతో పంపాడు. అంతేకాక, తానే స్వయంగా మొత్తం విజయనగర సామ్రాజ్యపు సైన్యంతో (సామ్రాజ్యంలోని ప్రాంతాలన్నిటిచుట్టూ సమూహాలని కూడగట్టుకొని, రాజధానిని పరిరక్షించడానికొక చిన్నసైన్యాన్ని కూడా ఉంచకుండా బయలుదేరాడు. అతని విజయంమీద అతనికి మితిమీరిన ఆత్మవిశ్వాసం. **"అతని వయస్సు 96 సంవత్సరాలు. కాని ముప్పై సంవత్సరాల పురుషుడికి వుండే సాహసంవుంది"** "గాంభీర్యం చూపి, నా శత్రువులు చిన్నపిల్లలే. త్వరలోనే చిత్తగిస్తారు. గుర్రాన్ని అధిరోహించ కుండానే క్రిందిస్థాయినుండి కార్యకలాపాలు సమీక్షిస్తాన"న్నాడు. అతనికి తన విజయంమీద యెంతటి విశ్వాసమో! హుసేన్ నిజామ్ తల తీసుకుని రమ్మనితన సైనికులనుఆజ్ఞాపించాడు. జీవితఖైదీగా యినుప పంజరంలో బందీగా ఉంచడానికి ఆదిల్‌షాని గోల్కొండ నవాబు ఇబ్రహీంని సజీవులుగా తెమ్మని ఆజ్ఞాపించాడు.

**యుద్ధం జరుగుతుండగా, తన సైనికులను ప్రోత్సహించే ఉద్దేశ్యంతో రామరాయలు తన అంబారీనుండి దిగి ఎఱ్ఱని పట్టుగొడుగుకు క్రింద రత్నాలతో తాపడం చేయబడిన ఒక సింహాసనంమీద కూర్చొని తనచుట్టూ రాసులకొద్దీ ధనం పేర్చుకొని తాను మెచ్చిన అనుచరులకు బంగారం, ఆభరణాలు పంచగలిగేలా ఉండేటట్టు తన కోశాధికారికి ఉత్తర్వులు జారీచేశాడు.** కాని, ఐదుగురు ముస్లింల శతఘ్నులు" యెంత వినాశకారు లంటే యుద్ధభూమిలో 5,000 మంది హిందువులు అసువులు బాశారు. 5,000 మంది ముస్లిం ఆశ్వికులు రాయలు వున్నచోటికి వడివడిగా దూసుకుపోయారు. మళ్ళీ తన స్థానం మార్చిన రాయలు తన అంబారీ యెక్కాడు. అదే సమయంలో ఒక ఏనుగు అతనివైపుకి దూసుకువచ్చింది. **అంబారీలో కూర్చున్న రాయలవారిని అతని వాహకులు భయంతో క్రిందికి జార విడిచారు. అతను తన గుఱ్ఱం యెక్కేలోపలే అతని శత్రువులు అతణ్ణి చుట్టుముట్టి బందీ చేశారు." వారిలో ఒక దళపతి అతని శిరస్సు ఛేదించి ఒక పొడవైన బల్లెంమీద అతని శిరస్సును ప్రదర్శించాడు.** వారి దళపతి మరణించడం చూసిన హిందూ సైన్యాలు చెల్లాచెదరయాయి. బహుశా వేంకటాద్రికూడా ఆ యుద్ధంలో ప్రాణం కోల్పోయి ఉండవచ్చు.

**తిరుమలరాయలొక్కడే ప్రాణంతో మిగిలాడు. విజయనగరానికి పారిపోయి, కంగారుగా ధనరాసులు మూటగట్టుకొని పెనుకొండకు పారిపోయాడు.** సదాశివ రాయలను తనతోబాటు తీసుకొనిపోతూ బంగారం, వజ్రాలు, జాతిరాళ్ళు 550 యేనుగులపై మూటగట్టి, రాచరికపుచిహ్నాలు, రాజవంశపు రత్నసింహాసనంకూడా తీసుకొనిపోయాడు.

తళ్ళికోట యుద్ధంలో విజయనగరసైన్యం పరాజయం, పలాయనం (నిజానికి తళ్ళికోటనుండి 30 మైళ్ళదూరంలో, 10 మైళ్ళు కృష్ణానదికి దక్షిణంగావున్న రక్కెసతంగెడువద్ద 23-1-1565 లో జరిగిన యుద్ధంలో) విజయనగర రాజధానికీ, హిందూ సామ్రాజ్యానికీ తేరుకోలేని పతనావస్థ దాపురించింది. యుద్ధం తరువాత రెండు రోజులవరకూ సుల్తానులు, వారిసైన్యం రణరంగంలో విశ్రమించి, సేద తీర్చుకున్నారు. మూడవనాడు రక్షణలేని విజయనగరం చేరుకుని, ఐదుమాసాలపాటు ఆ నగరంపై పగతీర్చుకున్నారు. ఆ నగరాన్ని సర్వనాశనం చేశారు. నిరాశ్రయులైన అక్కడి ప్రజాసమూహాన్ని జాలిలేకుండా నరికారు. దేవాలయాలు, రాజప్రాసాదాలు, మంటపాలు నాశనం చేసారు. దేవతా విగ్రహాలు ధ్వంసం చేశారు. "దోపిడివల్ల ప్రతి ముస్లిం సైనికుడూ బంగారం, ఆభరణాలు, గుడారాలు, ఆయుధాలు, గుఱ్ఱాలు, బానిసలను సంపాదించుకున్నాడు." సుల్తానులు వారు దోచుకున్నవాటిలో ఏనుగులు తప్ప మిగిలినవన్నీ వారికే యిచ్చివేశారు. **"వారు దోచిన సంపద అపారమైనది. వారు దోచుకున్న ఖజానాలలో కోడిగ్రుడ్డంత వజ్రం కూడా వొకటుంది. ఆ వజ్రం ఆదిల్‌షా హస్తగతమైంది."** కాగడాలు, కత్తులు, గొడ్డళ్ళు, యినపచువ్వలతో ప్రతిరోజూ వారు వినాశకర మైన దోపిడీని కొనసాగించారు. **"ప్రపంచ చరిత్రలో అంత గొప్ప మహానగరంపై అంతటి వినాశనం, అంత హఠాత్తుగా విరుచుకుపడి ఉండలేదేమో! ఒకరోజు ముందు తన కష్టార్జితమైన అపారధనంతో తులతూగుతూ, లోటులేని సంపదలు కలిగినవారు వొక్కసారిగా మరుసటి రోజునే ఆక్రమణల తాకిడి వలన, శిథిలావస్థకు చేరుకున్న అనాగరికమైన విధ్వంసానికి గురియై,**

**అవాగ్గోచరమైన దుస్థితికి చేరిన మహానగరం యేదీవున్న దాఖలాలులేవు." (ఎ ఫర్‌గాటెన్ ఎంపైర్, అధ్యాయం-xv, విజయనగర విధ్వంసం, 196-208 పుటలు).**

రాజధానినగరంపై జరిగిన విధ్వంసకాండ హిందూసామ్రాజ్యంమీద కూడా ప్రభావం చూపించింది. ఈ విధ్వంసాన్ని బిజాపూర్, గోల్కొండ నవాబులు అంచెలంచెలుగా సృష్టించారు. చివరగా యీ మొత్తం భూభాగమంతా మొగల్ సామ్రాజ్యం హస్తగతం చేసుకుంది. వినాశకరమైన తళ్ళికోటయుద్ధం జరిగిన ఒక సంవత్సరం తరువాత (క్రీ।।శ।। 1566) గోల్కొండ సైన్యాలు రాజమండ్రిపై దండయాత్ర చేసి క్రీ।।శ।। 1571-72లో కైవసం చేసుకున్నారు. బిజాపూర్ సుల్తాన్ ఆదోనిపై దండెత్తి దాన్ని ఆక్రమించుకున్నాడు. 1573 లో బిజాపూర్ సుల్తాన్ ఆదిల్‌షా ధార్వార్, ఒంకాపురంపై దండెత్తి ఒకటిన్నర సంవత్సరాల తరువాత దాన్ని వశం చేసుకున్నాడు. తరువాత కొంకణ్ ఆక్రమించుకున్నాడు. మూడు సంవత్సరాల తరువాత బెల్లంకొండమీద దండెత్తాడు. రాయలు పెనుకొండ, చంద్రగిరుల నుండి భయంతో పారిపోయాడు. తిరుమలరాయల తరువాత రంగరాయలు సింహాసనం అధిష్ఠించగానే గోల్కొండ నవాబు క్రీ।।శ।। 1578లో పెనుకొండపై దండెత్తి ఆ నగరాన్ని ఆక్రమించడమేకాక, శ్రీరంగరాయలను బందీ చేశాడు. తరువాత అతనిని విడుదలచేసి, తూర్పు ప్రాంతమైన అహోబలాన్ని ఆక్రమించి ఆరు సంవత్సరాలు తన అధీనంలో ఉంచుకున్నాడు. **"శ్రీరంగరాయలు 1584-85 లో అహోబలంలో వ్రాయించిన ఒక శాసనంలో అహోబలంకు పట్టిన దుస్థితి ఆ ప్రాంతాన్ని పాలించిన 'మట్ల' అధికారి శత్రువులతో చేయి కలపడంవల్లనే" అని పేర్కొనబడింది. (డా।। ఎస్.కె. అయ్యంగార్, హిస్టరీ అఫ్ తిరుపతి, 337వ పేజీ, సంపుటి ii).**

అతడే క్రీ।।శ।। 1579 లో వినుకొండ, కొండవీడు, కొచ్చెర్లకోట, ఖమ్మం కోటలు ఆక్రమించి, కృష్ణానదికి దక్షిణానగల అనేక భూముల్ని వశం చేసుకున్నాడు. క్రీ।।శ।। 1581 లో గోల్కొండ నవాబు మహమ్మద్‌కులి కర్నూలు, కడపజిల్లాలపై దండెత్తి కర్నూలు, నంద్యాల, గండికోటలతో సహా అనేక ప్రాంతాలు ఆక్రమించాడు. నెల్లూరు జిల్లామీద కూడా దండెత్తాడు. 1610 వరకు మైసూర్‌ని విజయనగర సామ్రాజ్య ప్రతినిధి పాలించేవాడు. 1610 తరువాత అది దానిని పాలించే ప్రభువుల చేతిలో స్వాతంత్ర్యం సంపాదించింది. 1603 లో తంజావూరు నాయకరాజులు, మధుర ప్రభువులు స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు.

**తళ్ళికోట యుద్ధంలో తన సోదరుడు అళియరామరాజు వ్యూహరచనలలో చేసిన అవివేకమైన తొందరపాటు నిర్ణయాలవల్ల సిగ్గుచేటయిన పరాజయం మూటగట్టుకొని తిరుమలరాయలు, చక్రవర్తి సదాశివరాయలతోపాటు జనవరి 1565 లో పెనుకొండ నుండి పారిపోయిన పిమ్మట సదాశివరాయల పేరిట సామ్రాజ్యపు దక్షిణభాగాన్ని సదాశివరాయలు 1568 లో మరణించి నంతవరకు పరిపాలించాడు.** 1568 లో తిరుమలరాయలే సింహాసనం ఆక్రమించి 1595 వరకు ఆ ప్రాంతాన్ని పరిపాలించాడు. అతని తరువాత అతని రెండవ కుమారుడు రెండవ శ్రీరంగరాయలు విజయనగర సామ్రాజ్యానికి చక్రవర్తి అయ్యాడు. అతని పరిపాలన 1586 వరకు కొనసాగింది. 1578 ప్రాంతంలో తన రాజధాని పెనుకొండ

నుండి చంద్రగిరికి మార్చాడు. అతని తదనంతరం మొదటి వేంకటపతిరాయలు సింహాసనం అధిష్ఠించి 1614 వరకు పాలించాడు. సంతతిలేని అతని మరణానంతరం వారసత్వానికి ఒక అంతర్యుద్ధమే జరిగింది. **గొబ్బూరి జగ్గరాయలు** (వేంకటభార్య రాణిబయ్యమ్మ సోదరుడు) **తిమ్మనాయకుడు, చిత్తూరు జిల్లాలోని కార్వేటినగర ప్రభువు మద్దతులో తన సోదరికొడుకు సింహాసనకాంక్షను గౌరవించాడు. మొదటి వేంకటపతిరాయలు అభ్యర్థి, అతని మేనల్లుడు మూడవ శ్రీరంగరాయలు సింహాసనమధిష్ఠించాడు.** కాని **రాజ్యభ్రష్టుడై జగ్గరాయల రాజభవనంలో బందీ గావించబడ్డాడు.** వెలుగోటి దళపతి నాయకుని సహాయంతో జైలునుండి పారిబోజూచిన శ్రీరంగరాయలు విషయం తెలిసి (వెలుగోటి అధిపతివద్దకు తన రెండవ కొడుకును అప్పటికే రహస్యంగా శ్రీరంగం పంపివున్నాడు). **తన దేవేరిని, యిద్దరు కొడుకులను, కుమార్తెను చంపి ఆత్మహత్య చేసుకోవలసివచ్చింది. యాచమనాయకుడు రాజు మద్దతిచ్చి తంజావూరు రఘునాథనాయకుని సహాయంతో అతన్ని సింహాసన మధిష్ఠింపజేశాడు.** (కుంభకోణంవద్ద పారిపోయిన రాకుమారునికి పట్టాభిషేకం చేయబడింది). 1616 నుండి 1632 వరకు రాజ్యమేలాడు. అతనుకూడా నిస్సంతుగానే మరణించాడు. 1622 లోనే రెండవ వేంకటపతిరాయలను, నాల్గవ శ్రీరంగరాయలను తన అభ్యర్థులుగా ప్రకటించాడు. రెండవ వేంకటపతిరాయలు తరువాత రాజ్యాధికారానికి వచ్చాడు. 1642 వరకు పరిపాలించాడు. నాలుగవ శ్రీరంగరాయలు అక్టోబర్ 1642 లో పదవిలోనికి వచ్చి 1672 వరకు పరిపాలించాడు. 1681 వరకు గల శాసనాలలో శ్రీరంగరాయల పేరు చూడవచ్చు. ఆ తరువాత వేంకట, రంగ, మాధవరాయలపేర్లు 1678 నుండి 1793 మధ్యలో– ఒకరి తరువాత ఒకరు శాసనాలలో కనబడతారు. కాని, **హిందూ సామ్రాజ్యం** అనే పేరెక్కడా కనబడదు.*[1]

పెనుకొండ నుండి తిమ్మరాయలు ముస్లింల ఆక్రమణలను అడ్డుకొన్నారు. కాని, అతని కుమారుడు శ్రీరంగరాయలు పెనుకొండ వదలి చంద్రగిరివద్ద నివాస మేర్పరుచుకోవలసి వచ్చింది. తన భూభాగంలో కొంతమేర శత్రువులకు వదలి వేయవలసి వచ్చింది. అతని పిమ్మట అతని సోదరుడు వేంకటపతిరాయలు గోల్కొండ సైన్యాలతో తీవ్రంగా పోరాడి వారిని కృష్ణానదికి అవతల ఉండేలా నిలువరించగలిగాడు. చిత్తూరు, వేలూరు, చెంగల్పట్టు జిల్లాలు, దక్షిణ ఆర్కాట్ జిల్లాలో కొంతభాగం 17వ శతాబ్ది మధ్యకాలం వరకు విజయనగర చక్రవర్తుల నామమాత్రపు యేలుబడిలో ఉండేవి. తిరుపతి, చంద్రగిరి, వాటిచుట్టుపక్కల ప్రాంతాలు తమ అధీనంలో ఉంచు కోవటానికి రెండవ వేంకటపతిదేవరాయలు, నాలుగవ శ్రీరంగరాయలు, తరచు బిజాపుర్, గోల్కొండ సైన్యాలతో యుద్ధం చేయవలసివచ్చేది. (విజయనగర సామ్రాజ్యపు

---

*1 శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి **'ఆంధ్రకవితాపితామహుడ'** ని రాయలచే పిలువబడిన అల్లసానిపెద్దన మనుచరిత్రలో (ఆశ్వా.3, పద్యం 142) రాయలను సంబోధిస్తూ చెప్పిన **"హిందూరాజ్యరమాధురంధర"** అనేదొక బిరుదంగా గ్రహించాలి. ఎందుకంటే, టి.టి.డి. వారి శ్రీకృష్ణదేవరాయల శాసనాల్లో (క్రీ.శ.1514 జూన్ 9 వ తేదీ వేసిన నెల్లూరులోని ఉదయగిరి కోటను గెలిచినప్పుడు) **'హిందూరాజ్యసురత్రాణ'** (సురత్రాణ=సుల్తాన్) హిందూరాజ్యసుల్తాన్‌గా రాయలకు బిరుదున్నట్లుగా స్పష్టమౌతున్నది. (ము.ప్ర.రావు.)

ప్రాంతీయాధిపతులు ప్రభుభక్తి పరాయణులు కాకపోవడంవల్ల స్వాతంత్ర్యం ప్రకటించుకున్నారు. వారిలో నాలుగవ శ్రీరంగరాయలు బాగా విసుగెత్తి 1656 లో మొగల్ చక్రవర్తి షాజహాన్‌కి, అతని కుమారుడు, దక్కన్ వైస్‌రాయ్ అయిన ఔరంగజేబు ద్వారా అవిధేయులైన తన అధికారులకు వ్యతిరేకంగా మద్దతు కూడగట్టుకొనే ప్రయత్నం చేశాడు. అవసరమైతే ఇస్లాం మతం స్వీకరిస్తానని కబురంపాడు. కాని, అతని అభ్యర్థన షాజహాన్‌కు చేరనేలేదు).

**వేంకటాచల విహార శతకం :**

## గోల్కొండ సుల్తాన్, అతని సైనికుల చేతిలో తిరుపతి ప్రజలు పడ్డ దుస్తరమైన పరాభవాలు–వాని వర్ణన

ఒక తెలుగుకవి [నల్లకాల్వ వరకవి సీతాపతి], గోల్కొండ సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్‌షా వజీరు అశ్వికదళం చేతిలో పురుషులు, స్త్రీలు, పిల్లలుపడ్డ వర్ణనాతీతమైన బాధలు, వేధింపులు, బలాత్కారాలు, హత్యలు కళ్ళకు కట్టినట్టుగా చిత్రించాడు. హిందువుల పవిత్ర స్థలాలను, దేవాలయాలను అపవిత్రం గావించారు. విగ్రహాలను **ధ్వంసంచేయడం, వాటికి సంబంధించిన ఆభరణాలు, వజ్రాలు దోచుకోవడం–యివన్నీ వర్ణించాడు.** కవిపేరు ఎక్కడా ప్రస్తావించబడలేదు. (ఇటీవలనే కడపజిల్లా, మెకంజీ కైఫియత్తుల నుండి శ్రీ కట్టా నరసింహులు గారి ద్వారా తెలుసుకోబడింది.) కవిపేరు – నల్లకాల్వ వరకవి సీతాపతి. గ్రంథంపేరు వేంకటాచల విహారశతకం. శతకమంటే నూరు పద్యాలు. కాని దానిలో సీసమాలికలో వ్రాయబడిన 98 పద్యాలు మాత్రమే లభ్యమయ్యాయి. (శతకంలోని చివరి రెండు సీసపద్యాలు తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయంలో లభించాయని ఆచార్య కె.జె.కృష్ణమూర్తి గారు పత్రికా ముఖంగా తెలిపినారు. పూర్తిగా నూరు సీసపద్యాల శతకానికి చూడు: శ్రీవేంకటేశ్వర లఘుకృతులు – (సంపా.) వేటూరి ప్రభాకరశాస్త్రి, ప్రచురణ: వేటూరివారి వాఙ్మయపీఠం, తి.తి.దే., తిరుపతి, 2013 – ము.(ప్ర.రావు) సీసమాలికలో అంతర్భాగమైన ప్రతి తేటగీతిలో ఒకపాదం అంటే నాలుగవపాదంలో వేంకటేశ్వరస్వామి ప్రస్తావన వున్నది. **'శత్రు సంహార వేంకటాచలవిహార'** అంటే **'శత్రువులను సంహరించేవాడా! వేంకటాచలంపై విహరించేవాడా' అని అర్థం.** కవి వైష్ణవుడు కాబోలు. అందుకే 66వ పద్యంలో "గాయత్రీ మంత్రం త్యజించి ముస్లింల 'కర్తారు' మంత్రం యెలా పఠించను? పాపిష్ఠివానిలా నామం ధరించకుండా ఎలా ఉండగలను? అంటాడు.

నిఖిల జగతికి తండ్రివైన నిన్ను విడచి పెనుకొండబాబు (నవాబు) ని ఏ రీతిగా కొలవగలను?" అని ప్రశ్నిస్తాడు. ఏడవ పద్యంలో బ్రాహ్మణుడైన తన వద్ద వేంకటేశ్వరుని చక్రంలాంటి ఆయుధంవుంటే దానిని తప్పక భీకరంగా ప్రయోగించి తురకలను కొట్టి, చీల్చిచెండాడి వారి గుర్రాలు ఒకదానిమీద ఒకటి చచ్చిపడేలా తురకలను గోల్కొండ వరకు తరిమి కొడతానంటాడు. 9 వ పద్యంలో "తమిళ ప్రబంధ గీతాలు విన్న నీ చెవులు వాటిని వినకుండా చెవులు మూసుకోవలసి వస్తుందేమో" అని ఆందోళన వ్యక్తం చేస్తాడు. ఆళ్వారుల తమిళ పాశురాలకు బదులు బలవంతంగా ముస్లిమ్ గీతాలు వినరాదని అతని భావం. 91 వ పద్యంలో "నేనింతవరకు వేదనాదంతో పునీతమైన వేంకటేశ్వర నామాన్ని మాత్రమే ప్రస్తుతించాను. ఏ మానవుడిలా

పొగడలేదు. ఇకమీద నాకేమిగతి? అని వాపోయాడు. V.4 లో మోడేగుంట, కావలి, జలదంకి, కొడవలూరు, గండవరం, సురతాని అబ్దుల్ (గోల్కొండ సుల్తాన్ అబ్దుల్లా) సైన్యాలు, గజదళం, అశ్వికదళం, కత్తులు ఝళిపించే పదాతిదళంముందు వణికిపోయినట్టు వర్ణించాడు. **గోల్కొండనేలిన సుల్తాన్ అబ్దుల్లాను 'సురతాణి అబ్దుల్లా' అని 'సురధాణ అబ్దుల్లా' అని ఆనాడు పిలిచేవారు.** 77వ పద్యంలో నెల్లూరు నగరం 'సురధాణ అబ్దుల్లా' యొక్క భీకరమైన సైనికుల తాకిడిని ఎలా తట్టుకుంటుందో అని విస్తుపోతాడు. ఆ నగరంలోని అనేక దేవాలయాలు అపవిత్రం చేయబడ్డాయి. ఉద్యానవనంలోని చెట్లు ఏనుగుల విహారానికి ఆటపట్టులయ్యాయి. పవిత్రులైన బ్రాహ్మణులచేత పూజలందుకున్న ప్రదేశాలు సర్దారుల విశ్రాంతికి ఆటపట్టులుగా మారాయి. తామర పూవులతో నిండిన కొలనులు లఘుశంకతో అపవిత్రం చేయ బడ్డాయి. యవనుల ఆశ్వికదళ పదఘట్టనలతో కావలి, కోవూరు, దువ్వూరు, నెల్లూరు, సాలూరు, వెల్లకూరు, రావూరు, ధూళి ధూసరితమైపోయాయి.

నేలటూరు, తాళ్ళపాక, మన్నూరు, ఓటుకూరు, ఓరముపాడు, పెనుబాల పేట, కోడూరు, మన్నేరు, కురువ, మాముదూరు (మామండూరు), కాళహస్తి శత్రువుల వశమయ్యాయని వ్రాశాడు. వాళ్ళు కాలువ దాటుతున్నప్పుడు ఆ సైన్యం చేసిన మహారావానికి కొండగుహలు ప్రతిధ్వనించాయట! వేంకటేశ్వరా! నీవింజామరలు, వాహనాలు, ఛత్రాలు, బంగారపు యుద్ధభేరి పోయినా, అచ్యుత కృష్ణరాయలు బహూకరించిన వజ్రపుహారం (అటువంటి హారాలు కృష్ణరాయలు, అతని యిద్దరు దేవేరులూ బహూకరించేవారు) పోరాదు. హుండీలో వేయబడిన నాణాలు, వస్తువులు సర్దుకోవలసిన అవసరం రారాదు. తురుష్కులు ఆలయంలో జొరబడి విగ్రహాలను ముక్కలు చేసినపుడు, ఆధ్యాత్మిక గురువులను బాధించినపుడు, వారి నామాలు నాకివేసినపుడు, వారి శిఖలుపట్టి లాగినపుడు, వారిని చంపడం నీకు సాధ్యమా? నా బలహీనతవల్ల నిన్ను వేడుకుంటున్నాను. నీ దయార్ద్ర హృదయమే నా భాగ్యరేఖ.

కంఖాణాగణం (దళపతుల అధీనంలోని సైన్యం), గోల్కొండ వజీర్‌ల వద్దవున్న శక్తివంతమైన సైన్యం, శిరోముండనం చేసుకున్న సన్యాసుల తలలు పోట్లగిత్తల తలలవలె ఒకరితల మరొకరి తలలో ఢీకొట్టినప్పుడు, యజ్ఞయాగాది క్రతువులు నిర్వహించే సోమయాజుల యజ్ఞోపవీతాలు తెంచి వారి ధనుస్సులకు అల్లెత్రాడుగా కట్టినపుడు, దేవాలయపు రథాలెక్కి పెద్దపెద్ద కేకలతో వాటిని నడుపుతున్నట్లు నటించినపుడు, వైశ్యస్త్రీలను బలాత్కరించి వారివద్ద డబ్బుగుంజుకునే ప్రయత్నం చేసినపుడు దిగువ తిరుపతిలో నాగరికులు బాధపడుతూవుంటే నీ జ్యేష్ఠసోదరుడు తిల్లగోవిందరాజు నిద్రిస్తున్నాడు. నిద్రావస్థలోనుండి తేరుకోలేకున్నాడు. అతడు వయోవృద్ధుడు, సనాతనుడు. అతనిచేతికి చక్రంపట్టే శక్తిలేదు. తిండిలేక చక్రం తాకట్టు పెట్టాడు. అతని శార్ఙ్గధనువు తుప్పుపట్టి పనికిరాకుండా పోయింది. అతని ఖడ్గం చిల్లులుపడింది. కౌమోదకి, పాంచజన్యం మొక్కవోయాయి. అతని సేవకగణం అతన్ని విడిచిపెట్టి ఎవరి త్రోవనవారు జారుకున్నారు. జీతంబత్తెం లేని అతని కొలువు మా కొద్దన్నారు. తానే శక్తిహీనుడైతే, యవన ప్రభువుల మీద దండయాత్ర ఎలా చేయగలడు? (బహుశా యిది ఆనాటి గోవిందరాజ స్వామివారి ఆలయం దుస్థితిని తెలియజేస్తుంది).

తుప్పు పట్టిన యిత్తడి, రాగివస్తువులు ఫిరంగి గుండ్లుగా మార్చాడు. పూజకై గండకీ నదినుండి సంగ్రహించే సామగ్రిని తూటాలుగా మార్చారు. నాపరాళ్ళు మెట్లుగా వాడుకున్నారు. నీవు గమనించావో లేదో కాని యివన్నీ తురుష్కుల దుష్కృత్యాలే సుమీ! మూడురోజులై దేవీదేవతలు ఖరీదైన ఆభరణాలు ధరించలేదు. దీనికి కారణం తురుష్కుల భయంకాదా? వారిని గోల్కొండవరకు తరిమివేయి.

తురుష్క సేవకులు గర్వాతిశయంతో, మదిరాపానమత్తులై, శక్తి పిపాసతో జియ్యంగారుని కొట్టారు. అతడు బిగ్గరగా విలపించాడు. కేకలుపెడుతూ వారు ఆలయంలోకి పరుగులు తీయగా తీసివుంచిన తలుపులు దండలుగా మారి వారికంఠాలను అలంకరించాయి. అది చూచిన నంబి అక్కడ ఒక తేలు కుట్టగా, నిశ్శబ్దంగా నిలబడ్డాడు. గుడి నిర్వాహకుడు, స్త్రీలగుంపు మధ్య తలదాచుకున్నాడు. విధ్వంసం సృష్టిస్తున్నవారి తల నరకడానికి అసమర్థుడైన తిల్లగోవిందరాజులను దూషించగలమా?

హీనకులజులు పవిత్రమైన నీ కొండ ఎక్కినా, పంచములు పుష్కరిణిలో నీటిని జల్లుకున్నా, అందరికీ మోక్షమిచ్చే దేవాలయంలోకి ప్రవేశించినా యిబ్బందిలేదు. కాని, దేవతా విగ్రహాల శరీరాన్నలంకరించిన ఆభరణాలు దొంగిలించడం సహించలేని విషయంకాదా! నీ గర్భగుడిలోకి వారు ప్రవేశించి ఆభరణాలు దొంగిలించినపుడు ఎలా సహించావు? నువ్వు రాజుల వంశానికి చెందిన యోధుడవుకాదా! నీకు పౌరుషం లేదా! (V.27).

ఆశ్వికదళాలను మట్టుపెట్టి జీర్ణకర్ణాట లక్ష్మిని ఆదుకోలేవా? నీ కొండను అపవిత్రం చేసేవారంటే నీకు అసహ్యం కలగదా? (V.29). నీ చక్రంతో వజీరుల తలలు ఖండించలేవా? వాళ్ళేకదా ప్రజల తలలు నరికి కత్తులతో పొడిచి, పేరూరు గ్రామంలో వున్న తటాకంవరకూ తరిమి, వారి శరీరాల నుండి రక్తపుటేరులు ప్రవహించేలా చేస్తున్నారు? (V.30) పాశ్చాత్య ఆశ్వికులు కొండపై భాగానికి వారి గుర్రాలను ఉరికించి, తమ ఫిరంగులతో గుళ్ళవర్షం కురిపించి యవన కాలాంతకుల (ముస్లిం మృత్యుదేవత) వలె జననష్టం (వారి కాలమింకా ముగియకుండానే) కలిగిస్తున్నారు. వారిని నువ్వెందుకు సంహరించవు? వారిని ఓడించి విజయలక్ష్మినెందుకు వరించవు? (5.32). వాళ్ళు నీ ధ్వజస్తంభం క్రిందవున్న ముఖద్వారపు బంగారు తొడుగు వొలిచి వేస్తూవుంటే నీవు వారి చర్మంయెందుకు వొలిచి వెయ్యడంలేదు? పచ్చని ఉద్యానవనాలన్నీ గోరీలుగా మారాయి. ఆలయానికి అభిషేకజలం తెచ్చేవారెవ్వరూ వీధులలో కనబడటంలేదు. కల్లుముంతలే కాని కమండలువులు (నీటిపాత్రలు) మఠాలలో ఎక్కడా కానరాకున్నవి. మాటలేకాని, వేద పఠనం వినబడటంలేదు. గుడులలో నిత్యపూజాదికాలు కానరాకున్నవి. హయహేషలు మాత్రమే వినవస్తున్నాయి. పఠానుల ఆశ్విక దళాన్ని పరిమార్చకుండా ఎందుకు ఉపేక్షిస్తున్నావు? గంధపు చెక్కలుండ వలసిన ఉద్యానవనంలో మాంసపు ముక్కలు ఎండబెడుతూవుంటే, వరాహ పుష్కరిణిలో చెత్తాచెదారం కరుగుతూవుంటే, వైఖానస ద్వారమార్గాలలో నమాజ్‌లు చేస్తూవుంటే, (V.V.38,39) ఎలా సహించగలిగావు? ప్రజలు వాళ్ళయిళ్ళు విడిచి ప్రాణాలరచేత బట్టుకుని చెల్లాచెదురుగా పరుగులు తీసారు. ఆడవారు జుత్తులు

విరబోసుకుని చెట్ల పొదలలో తలదాచుకున్నారు. కొందరు స్త్రీలు తమ భర్తలని, పిల్లలని వదలి, ఆభరణాలుకూడా త్యజించి, సొరంగాలలోకి పారిపోయారు. (V. 62).

కృష్ణునిగా గోసంరక్షణ చేసిన నీవు తురుష్కులు గోవధచేస్తూవుంటే ఎలా సహించగలిగావు? ద్రౌపది మానాన్ని కాపాడిన నీవు వివాహితులైన స్త్రీలు మానాన్ని చెరుపుతూవుంటే చూసి ఎలా సహించగలిగావు? బ్రాహ్మణులకు, దేవతలకు రక్షణగా నిలిచిన నీవు బ్రాహ్మణులను బాధించినపుడు, గ్రామాల్లో దేవీదేవతల విగ్రహాలు ముక్కలు చేసినపుడు ఎలా సహించగలిగావు?

తురుష్కులు సిద్ధవటంపై దండెత్తి ప్రజలను ఊచకోత కోసినపుడు, కామాక్షీదేవి ముఖాన్ని వికృతంగా చెరచినపుడు, సిద్ధలింగదేవుడు శరీరాన్ని విడిచిపెట్టాడు. అదే క్షేత్రంలోని చెన్నకేశవస్వామి పెన్నానదిలో మునిగిపోయాడు. మిగిలిన దేవతలు పారిపోయారు. ఒంటిమెట్టపైనున్న రఘూద్వహుడొక్కడే స్థానభ్రష్టుడుకాలేదు (V. 69).

సేతుబంధ రామేశ్వరస్వామి సముద్రతీరపు ఇసుకలో కూరుకు పోయాడు. జంబుకేశ్వరుడు ఫలాలుతింటూ, కేశపాశాలు అలంకరించు కుంటూ, తపస్విగా మారాడు. చిదంబరేశ్వరుడు (నటరాజు) అపారమైన భస్మాసుర హస్తం శక్తికి చలించి పోయాడు; శ్రీశైలమల్లికార్జునుడు దట్టమైన అరణ్యాలలో దాక్కున్నాడు. మధురచొక్కయ్య (మధురచొక్కనాథుడు) విలాసాలకు బానిస అయ్యాడు. శ్రీరంగనాథుడు అహర్నిశలూ నిద్రపోతూ వుంటాడు. కాని, నీవు మాత్రం కొండ దిగిరావు కదా! తురుష్కులకు ఊచకోత కోసేశక్తి లేదా నీకు? (V. 61)

మన మంగళగిరిస్వామి (మంగళగిరి పానకాల నృసింహస్వామి) కడవలకొద్దీ నిరంతరం పానకం తాగడంలో నిమగ్నుడైయున్నాడు; అహోబలాధ్యక్షుడైన హరి (అహోబల నృసింహస్వామి) నిరంతరం లక్ష్మీకేళిలో తేలియాడుతున్నాడు. పురుషోత్తముడు నిరంతరం ప్రసాదం స్వీకరించడమే కాని, మరే ఆలోచన లేకుండా ఉన్నాడు. మరే ఆలోచనకు తావివ్వడం లేదు. ధర్మపురిమహాస్థానపతి (ధర్మపురి మహాధీశ్వరుడు) తనగురించిన తలపులలో తలమున్కలైయున్నారు. ఈ దేవతలు యిప్పటికే ఇస్లాంమతం స్వీకరించారు. కానీ, ముస్లిం దేశంలో ఒకేఒక్క దాక్షిణాత్యుడవైన నువ్వు యిదంతా ఎలావోర్వగలవు? తురుష్కసైన్యం నీ కొండని చుట్టుముట్టి నిన్నెదుర్కొంటే నీ కొండ శిఖరాలు వారి నడ్డుకోగలవా? నీ మీద వారు దాడిచేసి నీ చేతిలోని ఖడ్గం లాక్కుంటే నిన్ను రక్షించే వారెవరైనా ఉన్నారా? దౌష్ట్యంతో వారు నీ ఆభరణాలు బలవంతంగా దొంగిలింపజూస్తే నిన్ను కాపాడే రక్షకులెవరైనా వున్నారా? వారు నీ గుడిలో బలవంతంగా ప్రవేశించి, నీ బిలం నాశనంచేస్తే నీ ఆర్తనాదాలు వినేవారెవరు? అయ్యో! బాధితులైన దాక్షిణాత్యులు నీ కృపలేకుండా ఎలా మనగలరు? (V. 79)

**'బిలం' అనే మాట పురాణ ప్రసిద్ధమైనది. అనేక యుగాలుగా వేంకటేశ్వరస్వామి నివాసంగా పేర్కొనబడింది. తొండమాన్ చక్రవర్తి యీ బిలంలోనే స్వామివారిని దర్శించి స్వామికి గుడికట్టాడు.**

అటువంటి బిలం ఆయన గర్భగుడిలో ఇంకావుంటే అందులో స్వయంగా స్వామి దాగివుండటమేగాక ఆభరణాలు, ధనరాసులు కూడా దాచగలడేమో! **ఈ బిలాన్నే 'గొంది' (23వ పద్యంలో) అని కూడా పేర్కొనడం జరిగింది.** 84 వ పద్యంలో వేంకటేశ్వరస్వామి శయనించినట్టు పేర్కొనబడిన స్థలంకూడా యిదే.

ముష్కరులైన వజీర్లు ఒకరి శిఖ మరొకరి శిఖకు ముడికట్టి శ్రీవైష్ణవులను బాధించసాగారు. ములికినాడు కులస్థులను కొట్టారు. గొడ్లవేటి మహాగ్రహారానికి చెందిన బ్రాహ్మణులను గుంపులుగా తరిమి వేధించ సాగారు. ద్రవిడులను అసభ్య పదజాలంతో దూషించారు. బయటకు రాకుండా నా బిలంలో నీవు దాగివుండటం ఎంతటి దౌర్భాగ్యం!

నీకు చక్రహస్తుడనే యశస్సు మాత్రమే మిగిలింది. తురుష్కులను ఎదుర్కొన లేకున్నావు. నీ సతి లక్ష్మీదేవి వైభవం మాత్రమే నీకు మిగిలింది. భక్తులు మొక్కుకున్న ముడుపులలో ఒక్కటైనా విడిచిపెట్టడానికి నీకు మనసొప్పదు. నీవు సర్వాధికుడవని ప్రజలు భావిస్తున్నారు. కాని నిన్నభ్యర్థించిన ఆశ్రితులెవ్వరికీ 1006 లైనా యివ్వలేకున్నావు (1116 చాలా పెద్దబహుమానంగా భావించబడేది. వారు చెప్పిన 1006 బహుశా 1116 నేమో!) బంగారు ఉడుపులు ధరించినవాడవని కీర్తిగడించావు. కాని, ఇప్పుడు దంపుడు బియ్యం మాత్రమే నీ ఆహారం. నీవు తిన్న కంచం కూడా కడగనివ్వవు. ఇలా లుబ్ధుడవై ధనాన్ని కూడబెట్టావు. నిన్ను నీవు రక్షించు కోడానికి యీ డబ్బు తురుష్కుల కివ్వజూస్తే నిన్ను నీ భక్తులు ఎలా నమ్మగలరు? నీ శ్రేయోభిలాషిగా నీవెవ్వరికీ డబ్బులివ్వవని నమ్ముతున్నాను.

కావేరి రంగని (కావేరీ ద్వీపం మీద వున్న శ్రీరంగనాథుడు) నైవేద్యాలు, కంచివరదప్ప గరుడసేవ, పెనుగొండ రామభద్రునివైభవం, గండికోట మాధవుని దర్పం, ఉదయాద్రి (ఉదయగిరి) రఘువీరుని ఐశ్వర్యం, కడప వేంకటరాయని (కడప వేంకటేశ్వరుని) గొప్పదనం, కాళహస్తీశ్వరుని యశస్సు, శ్రీశైలమల్లికార్జునుని వైభవం–అన్నీ మాయమయ్యాయి. నీ ఒక్కడవే యీనాటివరకు ఐశ్వర్యం (మిగిలినవారిలా పోగొట్టుకోకుండా) అనుభవిస్తున్నావు (V.92). గోరీలుకట్టడానికి నీ కొండపైనున్న రాళ్ళు పెకలించ బడుతున్నప్పుడు ఏ కొండమీద తలదాచుకుంటావు? నీ కొండపై నున్న పూలమొక్కలు పెరికివేసి గంజాయి విత్తనాలు నాటుతున్నప్పుడు కురులలో ఏ పూలు ధరిస్తావు? కొద్దిమంది అశ్వికులను ధనవంతులనుజేసి, పరాకు చిత్తగించగలవా? నీ శక్తి సామర్థ్యాలు తెలుసుకో. పారశీకులను త్వరగా మట్టుపెట్టు (V.93).

ప్రజల ప్రవర్తనలో నియమాలు నశించాయి. తురుష్కులు తిరుపతిని కర్కశంగా చుట్టుముట్టి దోచుకున్నారు. నీ నైవేద్యాలను అపవిత్రం చేసిన తురుష్కులను శిక్షించలేవా? వెయ్యి స్తంభాల మంటపాన్ని గుర్రాలశాలగా మార్చి, బాబయ్య (ఒక పెద్దముస్లిమ్‌కు అధికారి) గోరీకోసం ఆలయాన్ని గోరీగా మార్చి, గర్భగుడిలో చెత్తాచెదారం ప్రోదిచేసి విగ్రహాలు ధ్వంసంచేసి, పవిత్రమైన ఆభరణాలు సంగ్రహించి, వంటశాలలోని వస్తువులు చెల్లాచెదురు చేసి, నంబులనుకొట్టి, జియ్యంగారి శరీరాలు కుళ్ళబొడిచి,

తిరుమాళిగైఘళ్ (పెద్దవారి భవనాలు) పరిసరాలు అపవిత్రం చేశారు. ప్రజల్ని దోపిడీ చేస్తున్న తురుష్కులను ఎందుకు దండించవు?

ఇంతకు పూర్వం మనుజ రాక్షసుల (నరరూప రాక్షసులు)తో నిండిన విజయపురి (బీజాపూర్) సైన్యం దక్షిణాది రాజ్యాలు ఆక్రమించి, వారిని బానిసలను చేసి స్వాధీన పరుచుకున్నారు. రాజగోపాలమూర్తి నీచులైన యవనులకు వెన్నిచ్చి పారిపోయాడు. తన ఉదరంలో నిక్షిప్తమైవున్న వజ్రాన్ని అపహరిస్తారేమో అన్న భయంతో కంచివరదప్ప (వరదరాజు) వణికిపోయాడు. శక్తిమంతుడైన ఘటికాచలదైవం (షోలింగర్) చెంగలరాయుడు (నరసింహ స్వామి) కొండ దిగనైనా దిగటంలేదు; శ్రీ యిష్టదైవం భూగర్భంలో తలదాచు కున్నాడు. తిరుక్కోవలూరు దైవం (విగ్రహం) అనేక శకలాలైంది (V.30)

శుక్లపక్షంలో, 10,11,12 రోజులైన దశమి, ఏకాదశి, ద్వాదశి విందులు ఆగిపోయాయి. రంజాన్ (ముస్లిమ్) విందులు ప్రాధాన్యం సంతరించు కున్నాయి. శివవైష్ణవక్షేత్రాల వైభవం చిన్నబోయింది. 'బాబయ్య'కు బహుమతులు వెల్లులెత్తాయి; మత (హిందూమత) గురువుల సేవలు క్షీణించాయి. ఫకీర్ల గౌరవం ద్విగుణీకృతమైంది. వేదశాస్త్రాలు యితర ధార్మిక విద్యలు అరుదయ్యాయి.(V.81).

అల్లా శాస్త్రాలు (ముస్లిమ్ మతగ్రంథాల) వన్నెకెక్కాయి. అయ్యో! నీ బలహీనతవల్ల ప్రసిద్ధిచెందిన నీ జ్ఞానాన్ని తురుష్కులకు బదిలీ గావించావా?

నీవు తురుష్కులను మట్టుబెట్టకపోతే నేనూరుకోను. నీ గత జీవితంలోని రహస్యాల్ని బట్టబయలు చేస్తాను. నేనువాటిని విస్మరించలేదు. వెన్న దొంగలించి తిన్నవైనం, రేపల్లెలో వివాహితులైన గోపకాంతల శీలాన్ని దొంగిలించిన తీరు, తల్లిలా పాలివ్వ జూచిన పూతనను నువ్వు సంహరించడం, వయసుమీరిన యమునా నదిని నాగలితో శిక్షించేలా నీ అన్న బలరాముణ్ణి ప్రేరేపించిన తీరు–అన్నీ బట్టబయలు చేస్తాను. (V.80).

నిన్ను 'శ్రీహరి' అని పిలుచుకోకు; 'మృత్యుజాహల్లి' అని పిలుచుకో. 'పెరుమాళ్ళు' అని పిలుచుకోకు. 'ఖోడా' అని పిలుచుకో. 'విష్ణువ' ని పిలుచుకోకు. 'కర్తార' ని పిలుచుకో. 'కృష్ణా' అని పిలుచుకోకు. 'బాబయ్య' అని పిలుచుకో. దక్కినుల్ (డక్కానిస్), టర్కీలు (తురుష్కులు), పార్శీలు (పారశీకులు), తానకీల్ (పోలీస్ ఠాణా లేదా సైనిక స్థావరం) నిన్ను అవమానించి, దూషించి, వివస్త్రుణ్ణిచేసి కొడతారు. నీ అన్నం తిన్నవాణ్ణి. నీ వల్ల లాభం పొందినవాణ్ణి. ఆ కృతజ్ఞతతో చెప్తున్నా. నా కింకే ఆలోచనా లేదు. దుర్భరమైన యీ దృశ్యాలు చూడకముందే తప్పించుకోవడానికి ప్రయత్నించు. (V.85).

మ్లేచ్ఛభటులు తాగి తందనాలాడుతున్నారు. హేయంగా గోలచేస్తున్నారు. మెరుస్తున్న కరవాలాలు ఝళిపిస్తున్నారు. వారు ప్రజలని భయాందోళనలకు గురిచేస్తుంటే వారిని నాశనం చేయకుండా సహిస్తున్నావు. ఇది నీకు సమ్మతమా? (V.96).

మత్స్య, కూర్మ, నరసింహావతారాలకి తోడు ముగ్గురు రాముల అవతారాలు (పరశురామ, రామ, బలరామ), యింకెన్నో అవతారాలు ఎత్తిన నీవు వజీర్లనుకొట్టి, చీల్చి, నరకి, ఖండించి, పారద్రోలకపోతే, వారే నిన్ను జయించగలరు. (V.83).

మేలుజాతి అశ్వాలను కడుపునొప్పితో చంపు. అద్భుతమైన ఏదో ఉపాయంతో కొండలలాంటి ఏనుగులు మట్టిగరిచేలా చెయ్యి. ఆశ్వికదళాల పీచ మడిచి, వారి గోరీలుకట్టు. శత్రువులైన వజీర్ల నడుము విరగగొట్టు. అలా చేస్తే తురుష్కులు గోల్కొండ, ఢిల్లీ, ఆగ్రా, బీజాపూర్, యింకా తక్కినచోటకి *"సాహిబ్ సల్లాము, ఖూబ్ కియా"* (దేవరా! నమస్కారం, మంచిపని చేశారు) (iv.97) అని అరుస్తూ వెంటనే పారిపోగలరు. (V.97).

చివరగా వేంకటేశ్వరస్వామికి క్షమాపణలతో, రచయిత విచారంలో ఇలా విన్నవించుకుంటున్నాడు. "అహంకారంలో నిన్ను భీముడని పిలిచాను. నీవు మహాయోధుడవు. భక్తజన రక్షకుడవు. సూక్ష్మాతి సూక్ష్మమైన అణువులోను, శిరోజాలలోని సూక్ష్మ రంధ్రాలలోను, విశ్వమంతటావున్న దైవానివి. నువ్వే స్థాణువు. స్వయం ప్రకాశుడవు. శోకసంతప్తుడనై నిన్ను నిందించాను. ప్రపంచ క్షేమంకోరి నిన్ను హెచ్చరించాను. దురాక్రమణచేసే తురుష్కులను నిలువరించమని వేడుకున్నాను. నేను చేసిన వెయ్యి అపరాధాలు సహించు తండ్రీ!" (V.98).

ఈ నల్లకాల్వ వరకవి సీతాపతి వర్ణనవలన క్షీణించిన విజయనగర సామ్రాజ్యం మధ్యభాగంలో (ఎగువ తిరుపతి, దిగువ తిరుపతి సహా) గోల్కొండ నవాబు సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్‌షా సైన్యాలవల్ల, దక్షిణ భాగంలో బీజాపూర్ సైన్యాలవల్ల హిందువులు దయనీయంగా యిబ్బందులు పాలయ్యారనే విషయం తెలియవచ్చింది. అనేకులు ఇళ్ళు, ఆస్తులు, కుటుంబాలు, భార్యలు, పిల్లలు, బంధువులు, చివరకు వారి జీవితాలు కోల్పోయారు. అడవులలో, నివాసయోగ్యం కాని ప్రదేశాలలో తలదాచుకున్నారు. అది బాధితులకు అత్యంత విషాదకరమైన, హృదయ విదారకమైన స్థితి. అపవిత్రం చేయబడ్డ దేవాలయాలలో, కొల్లగొట్టబడ్డ గుడులతో, ధ్వంసం చేయబడ్డ విగ్రహాలతో హిందూమతం కించపరచబడ్డది.

సుల్తాన్ అబ్దుల్లా, అతని వజీరులు, సైన్యం కావాలనే వారిలో దాగివున్న అనాగరికతను బహిర్గతం చెయ్యడానికి, తద్వారా వారు దురాక్రమణ చేసే సమయంలో ప్రజలను భయపెట్టి, లొంగదీసుకుని, ఆ ప్రాంత ప్రజలను, ప్రాంతాన్ని తమ పూర్తి ఆధీనంలోకి తీసుకోవటానికి యీ భయానక స్థితిని కల్పించివుండాలి. అటుపిమ్మట వారు వారి క్రూరమైన నడవడిలో కొంత తీవ్రతను తగ్గించి వుండవచ్చు. ప్రజలుకూడా నిరాశాజనకమైనవారి జీవనానికి, వారికి అలవాటులేని చిత్రమైన స్థితిగతులకి అలవాటుపడి ఉండాలి.

గోల్కొండ మంత్రిగా వున్న మీర్‌జుమ్లా ఈ ప్రాంతాన్ని ప్రప్రథమంగా జయించాడు. ఔరంగజేబు పక్షానికి మారిపోయినపుడతను షాజహాన్ క్రింద క్రీ॥శ॥ 1656 లో దక్కను వైస్‌రాయ్‌గా పనిచేసేవాడు. అప్పటికే దక్కను మొగల్ సామ్రాజ్యంలో భాగంగా ప్రకటించబడింది. తరువాత కాలంలో సుల్తాన్–దాన్ని మరలా జయించి క్రీ॥శ॥ 1672 వరకు, తాను మరణించే వరకు తన అధీనంలో వుంచుకున్నాడు. అంటే

తిరుపతి ప్రాంతానికి చెందిన ఈ అబ్దుల్లా ఆక్రమణ క్రీ॥శ॥ 1656 తరువాత, క్రీ॥శ॥ 1668 ముందు, తిరుపతిలో గోల్కొండ వైస్‌రాయ్ వద్దకు వారి ఛార్టర్ అనుమతికోసం ఈస్ట్ ఇండియా కంపెనీవారు తమరాయబారిని పంపటం జరిగిందన్నమాట. బహుశా అది 1664-65 ప్రాంతంలో జరిగి వుండవచ్చు. పద్యంలో మీర్‌జమ్లా పేరు ఎక్కడా లేదుకాని సుల్తాన్ అబ్దుల్లా పేరుమాత్రం రెండుసార్లు పేర్కొనబడింది.

1688 లో ఔరంగజేబు పరిపాలనలో గోల్కొండ రాజ్యమనేది లేకుండా పోయినంతవరకు తిరుపతి ముఖ్యపట్టణంగా చేసుకుని గోల్కొండ వైస్‌రాయ్‌లు తిరుపతి ప్రాంతాన్ని పాలించారు. రెండవ వేంకటపతి రాయల పరిపాలనాకాలంలో రాణిగారి యిద్దరు అన్నదమ్ములు దామెర్ల వెంకటప్ప నాయకుడు, అయ్యప్పనాయకుడు చాలా పలుకుబడి కలిగి వుండేవారు. వెంకటప్పయ్య నాయకుడు అపారమైన శిస్తులు వచ్చే వందవాసికి మంత్రి, గవర్నరూకూడా. అయ్యప్పనాయకుడు పూనమల్లిలో అంతకంటె కొంచెం చిన్నపదవిలో వుండేవాడు. వెంకటప్పనాయకుడు, చక్రవర్తి రెండవ వేంకటపతి రాయలు తన నివాసమైన చంద్రగిరినుండి అంగ్లేయుడైన ఫ్రాన్సిస్‌డేకి మద్రాసులో ఒక కర్మాగారం నెలకొల్పడానికి మార్చి 1639లో అనుమతిచ్చాడు. 1645 లో నాల్గవ శ్రీరంగనికాలంలో దీనికి పూర్తిగా అనుమతి లభించింది.

1636 లో ఢిల్లీ చక్రవర్తి షాజహాన్ దక్కను ఆక్రమించి, అహ్మద్ నగర్‌ని జయించి, బీజాపూర్‌తో సంధి కుదుర్చుకున్నాడు. ఈ సంధిలో భాగంగా పతనమై క్షీణించిన విజయనగర సామ్రాజ్యంలో బీజాపూర్ తనకు సాధ్యమైనంతమేర స్వాధీనం చేసుకోవటానికి తగిన స్వేఛ్ఛయివ్వబడింది. గోల్కొండకూ అదే రకమైన స్వేఛ్ఛ యివ్వబడింది. బీజాపూర్ వెల్లూర్ ఆక్రమిస్తే, గోల్కొండ చంద్రగిరిని ఆక్రమించింది. 1649 లో బీజాపూర్ జింజీని వశపరచుకుంది. 1638 నుండి బలవంతుడైన తమమంత్రి మీర్‌జుమ్లా ద్వారా గోల్కొండ విజయనగర సామ్రాజ్యపు దక్షిణ భాగాన్ని జయించటం ఆరంభించింది. షాజహాన్ వద్ద దక్కను వైస్‌రాయ్‌గా ఉంటున్న మీర్‌జుమ్లా ఔరంగజేబు పక్షాన చేరిపోయాడు. మీర్‌జుమ్లా జయించిన ప్రాంతాన్ని షాజహాన్ మొగల్ సామ్రాజ్యంలో భాగంగా ప్రకటించి దాన్ని మీర్‌జుమ్లా అధీనంలోనే వుంచాడు. కాని, గోల్కొండ దానిని మరల తమ కైవసం చేసుకుని 1672 వరకు తమ అధీనంలో వుంచుకుంది. కాని, తదనంతరం 1686-88 లో ఔరంగజేబ్ గోల్కొండను ఓడించాడు. ఆవిధంగా కర్ణాటక, దక్కన్ ప్రాంతాలు రెండూ మొగల్ సామ్రాజ్యంలో భాగాలయ్యాయి.

ఇది యిలా వుండగా 1668 లో దేశం మధ్యభాగం గోల్కొండ అధీనంలో వుండగా మద్రాసులో ఇంగ్లీష్ ఈస్ట్ ఇండియా కంపెనీవారు తిరుపతిలో వున్న వైస్‌రాయ్ వద్దకు వారి దూతను పంపారు. గోల్కొండ వైస్‌రాయ్ ఆ దూతను గోల్కొండకు వెళ్ళి వారి అధికారి నెక్‌నమ్‌ఖాన్‌ను కలిసి ఈస్ట్ ఇండియా వారి వినతిపత్రానికి అనుమతి పొందమని చెప్పాడు. 1680 లో మరొకసారి కంపెనీ తమ దూతను గోల్కొండ మంత్రి అక్కన్నను కలవమని పంపారు. ఆ దూత మంత్రి సోదరుడు మాదన్నను కలువగా ఆయన ఆ దూతను తిరుపతికి వెళ్ళి అక్కన్ననే కలవమని సలహాయిచ్చాడు. ఆ కాలంలో తిరుపతి ఒక పవిత్ర క్షేత్రంగానేగాక, రాజకీయ, సైన్యశాసనాలకనువైన కేంద్రంగా రూపొందింది.

**శివాజీ, మహారాష్ట్రులు:** అదే సమయంలో 17వ శతాబ్ది ఉత్తరార్థంలో పశ్చిమ భారతంలో ఒక హిందూ సామ్రాజ్యం ఉద్భవించింది. ఇది మొక్కవోని సాహసంగల శివాజీ నాయకత్వంలో పరిఢవిల్లిన మహారాష్ట్ర రాజ్యం. అతని తాత మల్లోజీభోంస్లే ఆశ్విక దళాధిపతిగా వుంటూ, అహమ్మద్ నగర్ సుల్తాను వద్ద కొన్ని జాగీర్లు సంపాదించాడు. తన కుమారుడు షాజీకి అహ్మద్ నగర్ సుల్తాన్ నుండి సంక్రమించిన జాగీర్లలలో కొన్నింటిని భోంస్లే యిచ్చి వేశాడు. 1636 లో షాజహాన్ బీజాపూర్ సుల్తానుతో సంధి కుదుర్చుకున్నప్పుడు, షాజీ, బీజాపూర్ సుల్తాను కొలువులో చేరాడు. ఒక దండయాత్ర సందర్భంగా కర్ణాటకకు పంపబడ్డాడు. ఆ కాలంలో విజయనగర సార్వభౌముడయిన నాల్గవ శ్రీరంగరాయలు అతనినెదిరించి, 1632 లో వెల్లూరు జిల్లాలోని గుడియాత్తం దగ్గర ఓడించాడు. కాని షాజీ, సేలం గుండా వెల్లూరుకు చేరుకుని జింజీని వశపరచుకున్నాడు. విజయవంతమైన అతని దండయాత్రకు మెచ్చి, బీజాపూర్ సుల్తాన్ అతనికి బెంగుళూరు వద్ద విలువైన కొన్ని జాగీర్లు బహూకరించాడు. అతను తన కుమారుడు శివాజీకి తన పూనాజాగీరు బహూకరించాడు. తదనంతరం దక్షిణభారతంలో మరికొన్ని జాగీరులు అతని వశమయ్యాయి. శివాజీ సోదరుడైన వెంకాజీ వీటిని స్వాధీనం చేసుకున్నాడు. సాహసికుడైన శివాజీ వెంటనే బీజాపూర్‌లో దండయాత్రలు కొనసాగించాడు. కోపించిన సుల్తాన్ అతని తండ్రి షాజీని నాలుగు సంవత్సరాలు బీజాపూర్‌లో బంధించాడు. తండ్రి విముక్తుడైన పిమ్మట, శివాజీ తన అధికారాన్ని విస్తరించాడు. తన విజయ పరంపరను కొనసాగించాడు. 1674లో ఒకరాజుగా రూపొందాడు.

1676 లో శివాజీ తన సోదరుడు వెంకాజీనుండి దక్షిణంలో జాగీర్లను స్వాధీనం చేసుకోవాలని నిశ్చయించాడు. వెంకాజీ బీజాపూర్ సుల్తానుకు సామంతుడిగా వుండేవాడు. బీజాపూర్‌కు దక్షిణ ప్రాంతాలను గోల్కొండ సుల్తాన్‌కొరకు జయించటానికి గోల్కొండ సుల్తాన్‌తో వొడంబడిక కుదుర్చు కున్నాడు. దీనికి బదులుగా ఉత్తరాన వున్న అతని రాజ్యభాగాలకు భద్రత కల్పించటానికి గోల్కొండ నవాబు అంగీకరించాడు. అదే సమయంలో నాల్గవ శ్రీరంగరాయల వితంతువు, ఆమె యిద్దరు పిల్లలు శివాజీకి భరణం కోసమై అర్థించగా "శివాజీ వారి రాజకుటుంబానికి తగిన భరణం ఏర్పాటు చేశాడు **(డా॥ ఎస్.కె. అయ్యంగార్, హిస్టరీ అఫ్ తిరుపతి, రెండవ సంపుటం, 314 వ పేజీ).** శివాజీ, కల్లూరు కనుమద్వారా చిత్తూరు జిల్లాలో ప్రవేశించాడు. గ్రామాలను అగ్నికి ఆహుతిచేస్తూ, పొలాలు నాశనంచేస్తూ, తిరుపతి, కాళహస్తి, కంచిగుండాపోతూ వెల్లూరు, ఆరణి, జింజీలను వశపరచుకున్నాడు. గోల్కొండ సుల్తాన్ హఠాత్తుగా అతని సహాయం అర్థించాడు. వెంటనే శాంతాజీ వద్ద ఒక చిన్న సైన్యాన్నుంచి అతను వెనుదిరిగాడు. ఆ చిన్న సైన్యం వెంకాజీ చేతిలో పరాజయంపాలైంది. వెంకాజీ తంజావూరు, మిగిలిన ప్రాంతాలు తన అధీనంలో వుంచుకున్నాడు. ఆ ప్రాంతాలనుండి లభించే శిస్తులో సగపాలు శివాజీకిచ్చే షరతుమీద వెంకాజీ తంజావూరు, మరికొన్ని యితర ప్రాంతాలు తన అధీనంలో ఉంచుకున్నాడు.

1680 లో శివాజీ కాలం చేసిన పిమ్మట అతని కుమారుడు శంభాజీ మహారాష్ట్ర ప్రభువయ్యాడు. 1686 లో ఔరంగజేబు చక్రవర్తి రాజస్థాన్ నుండి దక్కన్‌కు మారిపోయాడు. మొదట బీజాపూర్ మీద

దండెత్తి దాన్ని ధ్వంసం చేశాడు. మహారాష్ట్రుల మీద యుద్ధం ప్రకటించి శంభాజీని బంధించి, వధించాడు. తరువాత గోల్కొండను ఆక్రమించి ధ్వంసం గావించాడు. ఆ నాటినుండి దక్కన్‌కు అనుబంధంగా కర్ణాటక కూడా మొగల్ సామ్రాజ్యపు సొత్తు అయింది.

శంభాజీ మరణించిన పిమ్మట, పసివాడైన అతని కుమారుడు సాహు సింహాసన మధిష్ఠించాడు. అతని చినతండ్రి రాజారామ్ రాజప్రతినిధిగా వ్యవహరించాడు. మొగలాయీలు సాహుని బంధించారు. రాజారామ్ సింహాసనం ఆక్రమించి జింజీని స్వాధీన పరచుకున్నాడు. ఎనిమిది సంవత్సరాలపాటు చుట్టుముట్టి జుల్ఫికర్‌ఖాన్ జింజీని స్వాధీనం చేసుకున్నాడు. రాజారామ్ వెల్లూర్‌కి, అక్కడనుండి సితారాకు పారిపోయాడు.

ఔరంగజేబు దక్షిణ భారత విజయం కేవలం సైనిక పరమైన విజయం మాత్రమే. విప్లవాలు, యుద్ధాలు చెలరేగి దేశమంతా అట్టుడికిపోయింది. అదే సమయంలో ఉత్తర హిందూ స్థానం కూడా శాసన రాహిత్యంతో ఛిన్నా భిన్నమయ్యింది. అతడు దక్షిణాదిన 20 సంవత్సరాలు నిరాశాజనకమైన యుద్ధాలుచేసి, ఢిల్లీకి తిరుగు ప్రయాణంకట్టి, 1707 లో మరణించాడు. అటుపిమ్మట మొగలాయీ సామ్రాజ్యం కష్టాలలో కూరుకుపోయింది.

ఈ సమయంలో నిజామ్-ఉల్-ముల్క్ అనే బిరుదుతో అసఫ్‌జా దక్కనుకు సుబేదారుగా నియమితుడైనాడు. కాని, ఒక సంవత్సరం తిరక్కుండానే అతని స్థానంలో హుసేన్ ఆలీ నియమించబడ్డాడు. అతని నియామకానికి మహారాష్ట్రులు కొన్ని షరతులు విధించారు. స్వతంత్ర రాజుగా సాహుచౌత్ (నాలుగవవంతు) వసూలు చేసుకొనే అధికారం, దక్కన్ సుభాలలోను, దక్షిణ రాష్ట్రాలైన తంజావూరు, మైసూరు, తిరుచినాపల్లులలో శిస్తులో పదవవంతు అతనికి చెందటమే యీ షరతు. హుసేన్ ఆలీ హత్య చేయబడిన పిమ్మట, అసఫ్‌జా హైదరాబాద్‌లో తనకు తానే దక్కన్ సుబేదారుగా ప్రకటించుకున్నాడు. ఆర్కాట్ నవాబు పరిపాలన క్రింద కర్ణాటక అతని రాజ్యంలో ఒక భాగమైపోయింది.

1740 లో మహారాష్ట్రులు రఘోజీభోంస్లే నాయకత్వంలో కర్ణాటకను ఆక్రమించు కున్నారు. పిమ్మట కల్లూరు కనుమగుండా చిత్తూరు జిల్లాలో ప్రవేశించి **దామలచెరువు యుద్ధంలో నవాబ్‌దోస్త్ ఆలీ, అతని కొడుకును ఓడించి సంహరించారు. వెల్లూరు కోటనుండి దోస్త్ ఆలీ మరోకొడుకైన సఫ్దర్ ఆలీ, సంధి కోరుకున్నాడు. రఘోజీభోంస్లే అతని వద్దనుండి కూడా ఒక కోటిరూపాయలు స్వీకరించి వెనక్కి మళ్ళాడు.** 1740 లో జరిగిన ఈ ఆక్రమణ సమయంలోనే కాబోలు **రఘోజీభోంస్లే చిత్తూరు జిల్లాలో తిరుపతికి సమీపంలో వుండగా ఆ అవకాశాన్ని వినియోగించుకుని వేంకటేశ్వరస్వామిని దర్శించుకొని స్వామివారికి విలువైన ఆభరణాలు సమర్పించు కున్నాడు.** అవి:

33,000 రూపాయిల విలువచేసే ఒక ముత్యాలహారం (ఒక పచ్చతో పొదగబడిన కెంపుతో చేయబడిన కర్ణాభరణంతో సహా)

సుమారు 28,000 రూపాయిల విలువచేసే ముత్యాలసరాలు (పచ్చపొదగబడిన ఒక కర్ణాభరణంతో సహా) *

సుమారు 8,500 రూపాయిలు విలువచేసే ఒక కలికి తురాయి (రత్నాలతో చేయబడి శిఖరాగ్రంలో మొనదేలి వున్న ఒక ఆభరణం–కిరీటానికి జతచేయబడి ఉండేది)

సుమారు 45,000 రూపాయల విలువచేసే ఒక ముత్యాలహారం (5 పేటలు గలది, 20 సెట్లుగలది) (వజ్రాలతో ఒక ప్రక్క, కెంపులతో ఒక ప్రక్క అమర్చబడిన ఒక కర్ణాభరణంతో సహా).

ఇవి 35 సంవత్సరాల క్రిందట వెలగట్టినవి. ఈ ఆభరణాలు **'రఘోజీవారి పెట్టె'** అనే ఒక ప్రత్యేకమైన పేటికలో పదిలపరచబడివున్నాయి. కొన్ని ప్రత్యేకమైన దినాలలో వీటిని స్వామికి అలంకరింపజేస్తారు.

## దక్కను, కర్ణాటక యుద్ధాలు

ఇప్పటినుండి దక్కన్, కర్ణాటక ప్రాంతాలు రాజకీయ కుట్రలు, హత్యలు, కుతంత్రాలు, యుద్ధాలకు ఆటపట్టులయ్యాయి. హైదరాబాద్ నిజామ్‌కు, కర్ణాటక నవాబుకు మధ్య యుద్ధాలు జరిగాయి. ఈ యుద్ధాలలో ఇంగ్లీషు వారొక ప్రక్క, ఫ్రెంచివారొక ప్రక్క వత్తాసు పలికారు. ఇంగ్లీషువారికి హైదర్ ఆలీ, అతని కుమారుడు టిప్పుసుల్తానులమధ్య 1800 వరకు యుద్ధాలు జరిగాయి. వీటికి మధ్యలో మహారాష్ట్రుల గొరిల్లా యుద్ధాలు కూడా వున్నాయి.

కర్ణాటక ప్రాంతం ఆర్కాట్ నవాబు అధీనంలోనికి వచ్చిన నాటినుండి వేంకటేశ్వరస్వామి ఆలయంతో సహా తిరుపతి ప్రాంతమంతా అతని పరిపాలనలోకి వచ్చింది. అందువల్ల స్వామి ఆలయాలనుండి వచ్చే ఆదాయం అతని స్వాధీనమైంది. అందువల్ల తరువాత కాలంలో అది ఇంగ్లీషువారికి చెందేలా చెయ్యడానికి అవకాశం కలిగింది. తిరుచినాపల్లి ప్రభువైన చందా సాహెబ్ మీద అతని కొడుకు రాజాసాహెబ్ మీద చేసిన దురాక్రమణలతో అతని ఖజానా ఖాళీ అయింది. ఎట్టకేలకు ఇంగ్లీషువారు అతణ్ణి ఆర్కాట్ సింహాసనంమీద స్థిరంగా కూర్చోబెట్టగలిగినా, 1740 లో ఆలయపు శిస్తులు, తన అధీనంలో వున్న కొన్ని జిల్లాలు ఇంగ్లీష్‌వారికి అప్పజెప్పవలసి వచ్చింది.

సెప్టెంబర్ 1751లో, మేడమ్ డూప్లే రాజగోపాలపండిట్ అనే ఒక అమల్‌దార్ (అధికారి)ని పంపగా ఇంగ్లీషు వారిచే నియమించబడిన వాసుదేవాచారి ఆలయాన్ని అతనికి అప్పజెప్పడానికి నిరాకరించి అతణ్ణి వెనక్కి పంపడం జరిగింది.

1753 లో నరసింగరావు మురారిరావు ఆక్రమణను ఎదుర్కొన్నాడు. చౌత్, పేర వసూళ్ళను పర్యవేక్షించటానికి రాఘవాచారి, బాలకృష్ణశాస్త్రి అనే యిద్దరు మహారాష్ట్ర అధికారులు, కరకంబాడిగుండా

* సుమారు 28,000 విలువచేసే 17 పేటలు గలిగిన ముత్యాలసరాలు (ఒకపేటలో 20 ముత్యాలతో)

తిరుపతిపై దండెత్తారు. అప్పుడు జరిగిన యుద్ధంలో రాఘవాచారి (తూటాదెబ్బకు) మరణించాడు. సైన్యంతో స్వామి దర్శనానికై కొండపైకి ఎక్కడానికి ప్రయత్నించిన మహారాష్ట్ర సైన్యాధిపతి బలవంతరావ్‌ను దేవాలయాన్ని అద్దెకు తీసుకున్నవారు అడ్డుకున్నారు. స్వంత అనుచరులు కొద్దిమందితో మాత్రమే బల్వంతరావ్ అనుమతింపబడ్డాడు. ఆ విధంగానే వ్యవహరించిన బల్వంతరావు 1757 లో దేవాలయ దర్శనం చేసుకున్నాడు. ఆ ప్రాంతంలో ఏ విధమైన విధ్వంసం సృష్టించవద్దని తన సైనికులను ఆదేశించాడు.

**రాజాసాహెబ్ సైన్యం కావేరీపాక్కమ్‌వద్ద పరాజయం పొందిన పిమ్మట, అతని వద్ద పనిచేస్తూ నిరుద్యోగులైన కొందరు దుస్సాహసికులు ఆ ప్రాంతంలో లూటీలు చేయసాగారు.** వారందరిలో అత్యంత సాహసికుడైన మొహమ్మద్ కమల్, మొదట నెల్లూరులో తన కార్యక్రమం ముగించి, తిరుపతి దేవాలయంపై దండెత్తడానికి బయలుదేరాడు. తిరుపతి దేవాలయంలో తమకు అద్దెకడుగుతున్నవారిని కాపాడు కోవడానికి ఆంగ్లేయులు ఒక చిన్న సైన్యాన్ని మద్రాసునుండి తిరుపతికి పంపారు. కమల్ ఏనుగు చనిపోయింది. అతణ్ణి బందీచేసి, ఉరిశిక్ష విధించారు.

**అటుపిమ్మట 1756 లో ఆర్కాట్ నవాబ్ మొహమ్మద్ అలీ సోదరులలో ఒకడైన నజీబుల్లా అతనిమీద తిరుగుబాటుచేసి, నవాబు కోటల్లో ఒకదాన్ని ఆక్రమించడమేగాక, 1757 లో ఆలయాన్ని చుట్టుముట్టే ప్రయత్నం చేశాడు.** మద్రాసునుండి ఇంగ్లీషువారు ఒక చిన్నసైన్యాన్ని పంపగా, ఆ ప్రయత్నంనుండి విరమించి, ఆలయానికి సెప్టెంబర్– అక్టోబర్‌లలో జరిగే వార్షికోత్సవాలకు వచ్చే తీర్థయాత్రికులను దారి దోపిడిచేసి, వారిని త్రోవ మళ్ళించాడు.

**1759 లో మరాఠాసైన్యాధిపతి గోపాలరావు ఆధ్వర్యంలో ఒకపెద్ద మరాఠాసైన్యం మొట్టమొదట కడపజిల్లాను దోచుకుని, కల్లూర్ కనుమ ద్వారా చిత్తూరు జిల్లాలోకి ప్రవేశించి, ఆలయాన్ని చుట్టుముట్టే ప్రయత్నం చేసింది.** అతను "కొండయెక్కి మార్చిలో శిఖరం స్వాధీనం చేసుకున్నాడు." ఏప్రిల్‌లో దేవాలయానికి వచ్చే ఆదాయం తన సొంతం చేసుకుందామని ఆశించాడు. కాని, ఆ ఉత్సవం జరగక ముందే పీష్వాబాలాజీ రావు ఆ సైన్యంలోని ముఖ్యమైనవారిని వెనక్కి పిలిచాడు. నారాయణశాస్త్రి ఆధ్వర్యంలో మిగిలిన చిన్నసైన్యం చంద్రగిరినుండి వచ్చిన అబ్దుల్ వాహబ్ చేతిలో పరాజయం పాలయ్యింది. అబ్దుల్ వాహబ్ ఇంగ్లీషు వారిచేతిలో దెబ్బలు తినే ప్రమాదం కొని తెచ్చుకోదలచలేదు. తన విజయాన్ని మద్రాసు ప్రభుత్వానికి తెలియజేస్తూ దేవాలయపు ఆదాయం తాను గ్రహించడానికి అనుమతించ వలసిందిగా కోరాడు. కాని, అతని అభ్యర్థన నిరాకరించబడింది. ముందుగా అద్దెకున్న వ్యక్తికే కొనసాగించడం జరిగింది **(ఎ.ఫ్.కాక్స్, డిస్ట్రిక్ట్ మాన్యువల్, హెచ్.ఎ.స్టువర్ట్‌చే పరిష్కృతం చేయబడినది, 1895, పుట.73). వాహబ్ చేతిలో పరాజితుడైన నారాయణశాస్త్రి తిరుపతికి తూర్పున వున్న కరకంబాడిలోను 'పాలగర్' వద్దకు బయలుదేరాడు. తన అనుయాయులతో దేవాలయాన్ని పరిరక్షించటం అతని విధ్యుక్తధర్మం. ఆగస్టులో తిరిగి దేవాలయాన్ని తన కైవసం చేసుకున్నాడు.** 200 మంది సిపాయిలు, 15 మంది ఐరోపావాసులు అతన్ని ఎదుర్కొనటానికి

మద్రాసునుండి బయలుదేరారు. కాని, తిరుపతి చేరుకునే సమయానికి 80 మంది అగ్రవర్ణానికి చెందిన హిందువులు మాత్రమే కొండ ఎక్కి దేవాలయంలోకి ప్రవేశించగలరని అర్థమైంది. వీరుమాత్రమే పంపబడ్డారు. అక్కడ భీకరంగా జరిగిన యుద్ధంలో అనేకమంది దేవాలయం వెలుపల, లోపల ప్రాణాలు కోల్పోయారు. హతశేషులు వెనక్కి మరలక తప్పలేదు. మేజర్ కలియౌద్ అనే పేరుగల ఇంగ్లీషు సేనాధిపతి దారి మళ్ళి కరకంబాడి మీద దాడిచేసి, దాన్ని అగ్నికి ఆహుతి చేయగా, ఆ ప్రాంతపు 'పాళెగార్' చనిపోయాడు. **మళ్ళీ దేవాలయం మీద దండయాత్ర జరిగింది. ఆ యుద్ధంలో చతికిలపడ్డ మహారాష్ట్రులు నారాయణశాస్త్రి నాయకత్వంలో వెనక్కి తగ్గారు. ఇంగ్లీషువారి వద్ద అద్దెకు తీసుకున్నవారు మళ్ళీ ఆ ప్రాంతాన్ని వశం చేసుకున్నారు.**

ఆర్కాట్ నవాబ్‌కు సోదరుడైన అబ్దుల్ వాహబ్ ఆంగ్లేయులు తనను దేవాలయపు శిస్తులు వసూలు చేసుకోవడానికి అనుమతించకపోవడంలో దిగువ తిరుపతిమీద దండెత్తబోయి ఇంగ్లీషు సైన్యం ఒకటి అక్కడికి వస్తున్నదని తెలిసి, ఆ ప్రయత్నం నుండి విరమించుకున్నాడు. చంద్రగిరికోట ఆక్రమించి సమయంకోసం వేచివున్నాడు. అదే సమయంలో అంటే 1758 అక్టోబరులో ఫ్రెంచి సేనాధిపతి కల్నల్‌బుస్సీ హైదరాబాదు నుండి వస్తూ కౌంట్ డి. లాలీతో కలసి మద్రాసుమీద దండెత్తే ఉద్దేశ్యంతో తిరుపతి వద్ద విశ్రమించాడు. దేవాలయపు శిస్తులన్నీ తానే వశపరచుకుంటానని ఇంగ్లీషు వారివద్ద అద్దెకున్నవారిని బెదిరించాడు. అప్పుడు నవాబ్ మొహమ్మద్ ఆలీ సోదరులిద్దరూ, నెల్లూరుకు చెందిన నజీబుల్లా చంద్రగిరి నుండి అబ్దుల్ వాహబ్ బుస్సీతో చేతులు కలిపి అతని సైన్యాన్ని అనుసరించారు. నిరాశతో వాహబ్ చంద్రగిరి కోటకు వెనుదిరిగిపోయాడు.

1763 లో దక్కన్ సుబేదార్ అయిన నిజామ్ ఆలీ కర్ణాటకపై దండెత్తి ఆక్రమించుకున్నాడు. కర్ణాటక నవాబు మొహమద్ అలీ కోరగా ఇంగ్లీషు వారొక సైన్యాన్ని పంపారు. తిరుపతిలో రెండు సైన్యాలు ఒకరికొకరు తారసపడ్డారు. "కాని, నిజామ్‌కి ఆతిధ్య మివ్వవలసినవారు రాత్రి చీకటిలో నెల్లూరుకు పారిపోతూ కాళహస్తి మార్గంలో పయనించారు."

రెండవ మైసూరు యుద్ధంలో హైదర్ ఆలీ కర్ణాటకను ఆక్రమించు కున్నాడు. ఆ క్రమంలో చిత్తూరు కోటను వశపరచుకున్నాడు. చిత్తూరు 'పాళెగార్', కాళహస్తి, కార్వేటినగరం, వెంకటగిరి జమీందార్లు హైదరాలీకి మద్దతిచ్చారు. 1780 లో నవాబ్ మొహమ్మద్ ఆలీ సోదరుడైన అబ్దుల్ వాహబ్ తన ఆధీనంలో వున్న చంద్రగిరి కోటను హైదర్ ఆలీకి అప్పగించాడు. కాని, హైదర్ ఆలీ యే మతాన్ని కించపరచేవుద్దేశ్యం లేనివాడుగా తిరుపతి మీద దండెత్తలేదు. **విల్స్** మాటల్లో చెప్పాలంటే "హైదర్ సగంకంటే ఎక్కువ హిందువు. అందువల్ల తిరుపతి దేవాలయానికి ఏ విధమైన కీడు జరగడానికి అతడు యిష్టపడలేదు. చంద్రగిరికి కేవలం 9 మైళ్ళదూరంలో వున్నా, మొహమ్మద్ ఆలీకి తిరుపతి చెల్లించవలసిన కప్పం విషయంలో కూడా మేమాత్రం జోక్యం చేసుకోలేదు." **హిస్టరీ అఫ్ తిరుపతి (రెండవ సంకలనం, 534-35 పేజీలు)** అనే

పుస్తకంలో డాక్టర్ ఎస్.కె. అయ్యంగార్, హైదర్ ఆలీ గురించి **విల్స్** అభిప్రాయాన్ని ప్రస్తావించి అదే పుస్తకంలో 552 వ పేజీలో దాన్ని యిలా వ్యాఖ్యానించాడు. "హైదర్ ఆలీ వొక్కడే యీ విషయంలో విభిన్న దృక్పథంగలవాడు. **విల్స్** చెప్పినట్లు ఆలీ శిస్తులు, ఖర్చులకు సంబంధించిన విషయాలు దేవాలయానికే వదిలేశాడు." అంటే హైదర్ ఆలీ దేవాలయ నిర్వహణలో జోక్యం చేసుకోలేదు. **తిరుపతి శ్రీవేంకటేశ్వర బాలాజీ అనే గ్రంథంలో (164వ పుట) శ్రీ.వి.యస్. శ్రీనివాసరావు** యీ అభిప్రాయంతో యేకీభవిస్తూ **"హైదర్ ఆలీ మన ప్రశంసలకు పాత్రుడు. ఎందుకంటే అతడు దేవాలయపు శిస్తుల విషయంలో జోక్యం చేసుకోలేదు. దాని సంస్థలను యథావిధిగా పనిచేసుకోనిచ్చాడు."** వేరొకచోట పేర్కొనబడిన అమల్దార్ల జాబితాలో ఔనికల నరసయ్య అనే అతను హైదర్ తరపున 1782-84 లో రెండు సంవత్సరాలపాటు దేవాలయ వ్యవహారాలు నిర్వహించాడని తెలియవస్తుంది." 182 పుటలో నాలుగవ నోట్‌లో అమల్దార్ల జాబితా (మెకంజీ, 25వ సంకలనం, 76వ పుట)లో "1781-83 లో ఔనికల నరసయ్య 'ప్లవ' నుండి 'శుభకృత్' వరకు హైదర్‌వల్ల కలిగిన చిక్కులనుండి తగిన రక్షణ కల్పించాడ"ని వ్రాయబడివుంది. దీనివల్ల మనకు తెలిసినదేమంటే హైదర్ ఆలీ దేవాలయ వ్యవహారాలలో జోక్యం చేసుకోకపోగా, విగ్రహారాధనకు వ్యతిరేకంగా కనబడకపోయినా ఒక అమల్దార్ ద్వారా దాన్ని అధీనంలో ఉంచుకున్నాడు. అంతేకాదు, సంవత్సరానికి ఒక లక్ష పగోడాలు హస్తగతం చేసుకునేవాడు కూడా.

* * *

# అధ్యాయం-24

## వేంకటేశ్వరస్వామి ఆలయం
## ఈస్ట్ ఇండియా కంపెనీ, ఇంగ్లీషువారి హస్తగతం

1744 లో ఆరంభమైన కర్ణాటక యుద్ధాలలో, ఇంగ్లీషు కంపెనీ ఆర్కాట్ నవాబులనుండి కర్ణాటకలోని కొన్నిభాగాలు, దానితోబాటు 1748 లో వేంకటేశ్వర స్వామివారి ఆలయంనుండే లభించే శిస్తులు సంపాదించింది. 1799 లో నాలుగవ మైసూర్ యుద్ధం తరువాత (నవాబ్ మొహమ్మద్ ఆలీ, 1795 లోను, అతని కుమారుడు 1801 లోను మరణించిన పిదప) కంపెనీవారు మొహమ్మద్ ఆలీ రెండవ కొడుకైన అజీమ్–ఉల్–ఉమరతో జూలై 1801 లో ఒక ఒడంబడిక కుదుర్చుకున్నారు. “దీనిద్వారా మొత్తం కర్ణాటక ప్రాంతంమీద అధికారాలన్నింటినీ కంపెనీ హస్తగతంచేసి, తాను, తన కుటుంబసభ్యుల పోషణకు ఆప్రాంతంనుండి లభించే శిస్తులలో అయిదవ భాగం తనకు (ఉమర= ఉమ్రావ్) సంక్రమించేలా ఒప్పందం చేసుకున్నాడు.

ఆ విధంగా ఇంగ్లీషు కంపెనీ కర్ణాటకపై అందులోని ఆలయాలతో సహా సర్వం సహాయాధికారాలు పొందింది. వేంకటేశ్వరస్వామికి హిందూ రాజులు, వారి తాబేదారులు, యితర దాతలు యిచ్చిన భూములు, గ్రామాలు (7వ శతాబ్దినుండి 16 వ శతాబ్దివరకు), సదాశివరాయల పాలనాకాలం ముగిసేవరకు వున్నవన్నీ కంపెనీవారి హక్కు భుక్తాలయ్యాయి. దేవాలయానికి సంబంధించినట్టుగా ఏ గ్రామమూ ప్రత్యేకంగా గుర్తించబడలేదు. ఇది స్థానిక పాలకులనుండి కంపెనీ స్వాధీనం చేసుకున్న దక్షిణ భారతంలోని గ్రామాలన్నిటికీ వర్తిస్తుంది. ఆ గ్రామాలనుండి, భూముల నుండి పంట చేతికందకపోవటంతో వేంకటేశ్వరస్వామికి జరిగే బ్రహ్మోత్సవాలలోను, మిగిలిన పర్వదినాలలో జరిగే అనేక ఉత్సవాదులు నిర్వహించబడకపోవటమే గాక దాతలు నిర్దేశించిన అనేకరకాల నివేదనలకు కూడా స్వస్తిచెప్పడం జరిగింది. **కైఫియత్ అఫ్ ది బౌండరీస్ అఫ్ తిరుపతి** అనే పేరుతోవున్న (మెకంజీ సేకరించిన) ఒక వ్రాత ప్రతిలో ముస్లింలు ఆక్రమించుకున్న దేవాలయభూముల పరిమితులు చూపే పురాతనమైన ఒక చిత్రపటం (Map) ఉన్నది. **వి.యన్. శ్రీనివాసరావు తన గ్రంథంలోని రెండవ అధ్యాయంలో 168 వ పేజీలో పల్లెలతో కూడిన దేవాలయ భూముల సరిహద్దులతో చిత్రపటం తయారుచేశాడు. ఈ భూములు తూర్పున, దక్షిణాన వేంకటగిరి, కాళహస్తి, కార్వేటినగర జమీందారీలలో, పడమటవున్న చంద్రగిరి తాలూకా, ఉత్తరాన కడప జిల్లాలో కొంతభాగానికి చెందినది.** (ఈ ఎస్టేట్‌లో 187 గ్రామాలున్నాయి. కాని, వీటిలో ఒక గ్రామం మాత్రమే దేవాలయం అధీనంలోవున్నది. రెండు గ్రామాలు పెద్దజియ్యంగార్ అధీనంలో, యింకోరెండు చిన్నజమీందార్ అధీనంలో, పదహారు గ్రామాలు నాలుగు అర్చకుల కుటుంబాల అధీనంలో, 13 గ్రామాలు “ఆచార్య పుంగవులకి, ప్రధాన జైలర్‌కి; న్యాయమైన అద్దెకివ్వబడిన అగ్రహారాలు, శ్రోత్రియుల గ్రామాలు (చిత్తనూర్, మాలూర్), (ఇద్దరు మహంత్‌లవద్ద నాలుగు, మిగిలిన ఈనామ్‌దారులవద్ద మూడు), నూట ఇరవైనాల్గు గ్రామాలు పాలెగార్లు, జమీందార్ల మట్ల

కుటుంబానికి చెందిన దళాధిపతుల కుటుంబాలలోను, ఐదు గ్రామాలు కరకంబాడి పాలేగార్లచేతిలోను, ఐదు గ్రామాలు కృష్ణపురం పాళేగార్, తిరుపతి పాలేగార్‌గా సేవలందిస్తున్నవారికి; (తిరుపతిలో పాత పురపాలక కార్యాలయాన్ని ఆనుకొని ఒకరాతి మంటపం వున్నది. *[1] దీన్నే **'కృష్ణాపురంతాణా'** అని అంటారు. బహుశా ఆ రోజుల్లో నగరపు పడమర మూలనవున్న ఆ ఠాణాలో రక్షకభటులుండేవారు) మామండూర్ పాలెగారు ఆధ్వర్యంలో రెండు గ్రామాలు, మొగరాల పాళేగార్ ఆధ్వర్యంలో ఒకగ్రామం, కాళహస్తి జమీందార్ చేతిలో పదహారు గ్రామాలు, కార్వేటినగరం జమీందారు చేతిలో ముప్పై ఆరు గ్రామాలు, నాగపట్ల పాళేగార్ చేతిలో ముప్పైనాల్గు గ్రామాలు, నుట్లదళపతి చేతిలో పద్ధెనిమిది గ్రామాలు వుండేవి. ఈ పాళేగార్లకు, జమీందార్లకు దేవాలయాన్ని ఏ విధమైన ఆక్రమణనుండైనా రక్షణ కల్పించేందుకు వీలుగా రక్షకభటులను నియమించేందుకు నియోగించారు. తిరుపతినుండి కొండకు వెళ్ళే దారిలో **'మామండూరిమిట్ట'** (ఎత్తైననేల) అనే స్థలం *[2] ఉన్నది. బహుశా మామండూరు వద్దగల రక్షక నిలయానికి తోడు యీ ప్రదేశం మామండూర్ పాళేగార్‌యొక్క రక్షక స్థావరం అయివుండవచ్చు.

**తిరుపతికి చెందిన 187 గ్రామాలు ఎప్పుడు తిరుపతిలోని శాశ్వత సేవకులకు, రక్షకభటులకు పంచబడ్డాయో తెలియదు. శాసనాల్లో వీటికి సంబంధించిన వివరాలేమీ లేవు.**

తిరుపతి ఎస్టేట్‌కి నాలుగు ప్రక్కలవున్న 187 గ్రామాలేకాకుండా, దేవాలయానికి అనేకులైన రాజులు, దళపతులు, దాతలు యిచ్చిన ఎన్నో గ్రామాలు ఉండేవి. ఇవి విజయనగర సామ్రాజ్యానికి చెందిన అనేక ప్రాంతాలలో ఉండేవి. ఇవి విజయనగర సామ్రాజ్యం వైభవంగా సంపదలతో తులతూగుతూ ఉన్నప్పుడు అనేక సందర్భాలలో ఇవ్వబడినవి. మెకంజీ కలెక్షన్‌లో మాత్రం వీటి ప్రస్తావన కానరాదు. పైన చెప్పబడిన గ్రామాలన్నీ 1748 నుండి ఆర్కాట్ నవాబు భూభాగంలోనూ, అటుపిమ్మట 1801 నుండి ఇంగ్లీష్ వారి కంపెనీలోనూ అంతర్భాగంగా వుండేవి.

తన పుస్తకంలోని 173 వ పుటలో శ్రీ వి.యస్. శ్రీనివాసరావు ఒక చిన్న విషయాన్ని ఇలా నివేదించారు. భావనామ సంవత్సరంలో వేంకటేశ్వర దేవాలయంలో అమల్‌దార్‌గా వున్న శ్రీనివాసాచారి 30 సంవత్సరాలపాటు మేనేజరుహోదాలో వుండి 1744 నుండి 1762 వరకు, 1763 నుండి 1764 వరకు, 1769 నుండి 1789 వరకు, తిరుచానూరులో కొంత భూమి సంపాదించాడు. దాని ఒక 'శ్రోత్రియం'

---

*1 బహుశా 'చాళుక్యనారాయణ' అనే యీ బిరుదు ఆరవీడు కుటుంబానికి తూర్పు చాలుక్యులలోను, యాదవరాయల కుటుంబాలతోనుగల సంబంధాన్ని తెలియజేస్తుంది. తూర్పుచాళుక్యుల అధికారం తిరుపతికి ప్రత్యక్షంగా విస్తరించక పోయివుండవచ్చు. కాని, యాదవరాయల కుటుంబం యీ ప్రాంతాన్నేలింది. ప్రప్రథమంగా యేలిన యాదవరాయ ప్రభువుల కాలంలో గోవిందరాజస్వామివారి ఆలయంలో ప్రవేశపెట్టబడిన ఒక తూ15'మెరక్కాల్' (చాళుక్యనారాయణన్‌గళ్)

*2 ఇది కేవలం అతిశయోక్తి మాత్రమే కావచ్చు. ఎందుకంటే, అతను తన జ్యేష్ఠసోదరుడు అళియరామరాజు క్రీ॥శ॥ 1565 లో జరిగిన తళ్ళికోట యుద్ధంలో సదాశివరాయలతో బాటు పెనుకొండకు పలాయనం చిత్తగించవలసివచ్చింది.

(అగ్రహారం)గా రూపొందించి, 26 భాగాలుగాచేసి, 26మంది బ్రాహ్మణులకు తర్పణమిచ్చి దానం చేశాడు. భావనామ సంవత్సరం, అంటే క్రీ॥శ॥ 1755, అటుపిమ్మట వచ్చే సంవత్సరం హేవలంబి (క్రీ॥శ॥ 1778). "ఆర్కాట్ సుబాకు చెందిన ప్రసిద్ధులైన బ్రాహ్మణ గవర్నర్ మొహమ్మద్ ఆలీ వద్ద రెవెన్యూమంత్రిగా పనిచేసిన రాజా బీర్బల్ రామోజీపైన పేర్కొనబడిన గ్రామాల శిస్తులు వసూలుచేసి, 26 ఇళ్ళతో కూడిన ఒక అగ్రహారాన్ని 26 భాగాలు (ఆవృతులు) కలిగిన పద్మసరోవరం చుట్టూ నిర్మించి బ్రాహ్మణులకు దానం చేశాడు (See p.307)

**సవాల్-జవాబ్ పట్టీ:** దేవాలయాలను స్వాధీనం చేసుకున్న మద్రాసులోని ఇంగ్లీష్ ప్రభుత్వం వసూళ్ళు, అప్పులు, ఆదాయం, వ్యయం, నిత్యనివేదనలు, ప్రత్యేకమైన సందర్భాలలో చేసే నివేదనలూ, ధార్మికపరమైన సేవలు, పండుగలు, అనూచానంగా దేవాలయానికి సేవలు చేసేవారు, వారి వేతనాదులు, వారి బాధ్యతలు, దానికి సంబంధించిన తదితర విషయాలు; ఆలయానికి సంబంధించిన ధార్మిక నియమాలు, వాటిచరిత్ర, వాటి పుట్టుపూర్వోత్తరాలు, వాటిలో వున్న దేవీదేవతలు, తిరుమల, తిరుపతి, తిరుచానూరులో వున్న పెద్ద, చిన్న దేవాలయాలు, వాటికి అనుబంధంగా వున్న దేవాలయ సముదాయానికి సంబంధించిన వివరాలతో కూడిన నివేదిక తయారుచేసింది. తయారు చేయబడిన ప్రశ్నావళిని దేవాలయాలకు చెందిన అనేకమంది అధికారులు తయారుచేసిన జవాబులతో కూడిన సవాల్ జవాబ్ పట్టీగా రూపొందించారు. సమగ్ర పరిశీలన తరువాత తమ శాసనంలో వున్న తిరుమల, తిరుపతి, తిరుచానూరులలోని దేవాలయాలకు సంబంధించిన విషయాలపై సమాచారం సేకరించేందుకై ఈ ప్రశ్నావళి రూపొందించ బడింది. అవి:

1) ప్రతి దేవాలయంలో నిర్వహించబడే ధార్మిక సేవలు సర్కారు (ఇంగ్లీష్ కంపెనీవారి ప్రభుత్వం) వారి గ్రాంటులతో అనుబంధం కలిగివున్నవా? లేవా?

2) దేవాదాయ ధర్మాదాయ శాఖద్వారాగాని, ప్రైవేటుదాతల ద్వారాగాని, దేవాలయ సేవకులద్వారాగాని, జమీందార్లు, వారి 'పాలేగార్ల' వల్లగాని,

3) ఈ ఆదాయాన్ని, దానంగాని యే విధంగా సంపాదించబడింది.

4) ఈ ఆదాయాన్ని సేకరించడానికి ఎవరైనా ఉద్యోగస్థులు పనిచేశారా, ఆ క్రమంలో వారికి ఎంత ఖర్చయింది?

5) ఏదైనా ఒక సంస్థని ప్రత్యేకంగా అభివృద్ధి చేయడానికి అవకాశం వున్నదా?

6) గుడి రాతితోకట్టారా లేక సిమెంట్‌తో కట్టారా లేక రెండిటితో కట్టారా? ప్రాకారపు గోడలు, గర్భగుడి, అంతరాలయం, ముఖమంటపం, కళ్యాణ మంటపం, తక్కిన మంటపాలు కట్టడంలో యెంతమేర రాయి, యెంతమేర సిమెంటువాడారు?

7) దేవాలయలలోని వివిధ రకాల ఉద్యోగులు, దైవారాధనలో వారు నిర్వర్తించే విధులు, సేవలు, రోజుకెన్నిసార్లు పూజలు చేస్తున్నారు? ఎంత సమయం దానికోసం వెచ్చిస్తున్నారు?

8) విధులు సక్రమంగా నిర్వర్తించని ఉద్యోగులకు యేవిధమైన శిక్ష విధించబడు తున్నది?

9) ఆలయపు ఆదాయం, ఖర్చుల సమగ్రవివరాలు

10) దేవాలయ ఉద్యోగులలో ప్రభుత్వం చేత నియమింపబడిన కొందరు క్రమశిక్షణతో మెలగి ప్రభుత్వం అడిగిన సమాచారాన్ని అందించటంలో సక్రమంగా సహకరిస్తున్నారా? ఉదాహరణకు ధర్మకర్తలకు మేనేజర్ దేవాలయంకోసం యిచ్చినవస్తువులు దొంగలించకుండా ఉపయోగిస్తున్నారా? నివేదనల విషయంలో ఏమైన లోటుపాట్లున్నాయా?

11) ధర్మకర్తలవలన ఆలయానికి లభించే ఆదాయం ఎవరైనా ఉద్యోగస్థులకు జీతంగా గాని మరేవిధంగాగాని యివ్వబడుతోందా? అలాగయితే దానికి సంబంధించిన అనుమతి పత్రం వుందా? దానంగా యివ్వబడిన దాన్ని రక్షించి భావితరాలకు అందజేయాలి; పాడుచేయరాదు. ఈ ఉద్దేశంతో దానం రూపంగా వచ్చిన ప్రతి ఆదాయాన్ని ఒక్కొక్క ప్రత్యేక ఖర్చుకే కేటాయించాలి.

12) ఆనాటికి దేవాలయం ఎవరి ఆధ్వర్యంలో వున్నది, దానిని ఎవరు నిర్మించారు, ధర్మకర్త ఏ విధమైన అధికారాలు కలిగివున్నాడు? ఆదాయ వ్యయాలు ఎవరి అధికారం క్రింద వున్నాయి? నిజానికి ఆదాయమెంత? వ్యయమెంత? దానం స్వీకరించినపుడు నిర్దేశించిన సూచనలకనుగుణంగానే యీ నాటికి ఖర్చుపెట్టబడుతోందా?

13) దానధర్మాలు ఆ దాతలసంతతి చేతిమీదుగా నిర్వహించ బడుతున్నాయా లేక ఉద్యోగుల చేతులమీదుగానా? దాతలుకాక అన్యులెవరైనాగాని, లేక దాతల వంశీకులుగాని 'పడితరం' (నివేదనకు ఉపయోగించే వస్తువులు), 'పడి' (వడ, లడ్డు లేక నేతిలో వండిన ఇతర నివేదనలు)లో కొంతభాగం స్వీకరిస్తూవుంటే ఏ అధికారంతో (ఏ అధికార పత్రం సహాయంతో) వాటిని స్వీకరిస్తున్నారు?

14) తిరుపతి తాలూకాలో ఏవైనా దేవాలయాలు, సత్రాలు ఏ నిర్వాహకుల చేతిలోనూ లేకుండావుంటే అటువంటి సత్రాల జాబితాలు ఇవ్వవలసినది.

ఫస్లీ 1227 లో అంటే క్రీ॥శ॥ 1818-19 లో ఈ ప్రశ్నావళి ప్రచురించబడింది. ఆగస్టు 14, క్రీ॥శ॥ 1811 లో దీని జవాబులు, దీనికి అనుబంధించిన 14 అంశాలతో 19 ధార్మిక సంస్థలకు చెందిన వివరాలు వెలువడ్డాయి. **తాలూకా ఆఫీసులో శిరస్తదారుగా పనిచేస్తున్న అలబ్ధు గోవిందరావు యీ వివరాలు సేకరించాడు. సంస్థలలో సంబంధమున్న అనేక వ్యక్తులనుండి సమాచారం సేకరించి, పొందుపరచి, కొన్ని పట్టికలతో నివేదిక రూపొందించాడు. ఆనాడు తిరుపతి, తాలూకా ముఖ్యకేంద్రం. చిత్తూరు జిల్లాకు ముఖ్యపట్టణం.**

బహుశా ఆర్కాట్ నవాబు జూలై క్రీ॥శ॥ 1801 లో దేవాలయాలతో సహా ఆ ప్రాంతాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీ వారికి అధీనంచేసిన నాటినుండి ఫస్లీ 1211 (1801-2) లో పారంపర్యంగా వస్తున్న శాశ్వత సేవకులు, కొద్దిమంది తాత్కాలిక సేవకులు, ఉద్యోగస్థుల పేర్లతో, వారి బాధ్యతలు, వారి వేతనాలకి సంబంధించిన వివరాలతో ఒక **'కైంకర్యపట్టి'** రూపొందించ బడింది.

అటుపిమ్మట ఫస్లీ 1230 **(క్రీ॥శ॥1820-21) శిరస్తదార్ ఎ.రంగారావు, తహశిల్దార్ ఆర్. సుబ్బారావు పొందుపరచి,** సంతకం చేసిన అదే విధమైన ఒక కైంకర్యపట్టి తయారు చేయబడింది. ఇంకొకటి అక్టోబరు 2, క్రీ॥శ॥ 1820 లో రూపొందించ బడింది.

ఆగస్టు 14, క్రీ॥శ॥ 1819 లో తయారు చేయబడిన సవాల్, జవాబ్ పట్టీతోబాటు తిరుమల, తిరుపతి, తిరుచానూరులలో అనేక గుడులు, గోపురాలు, అనేక దేవీదేవతలకు సంబంధించిన జమ, ఖర్చుల లెక్కలతో స్థానిక గ్రామకరణాలు, ఆనాటి శిరస్తదారు అలబ్బు గోవిందరావు సంతకం చేసిన **పైమాయిషీ ఖర్చుల లెక్క**కూడా పొందుపరచ బడింది.

వీటికి తోడు **ఒక 'దిట్టమ్' పుస్తకం** (దేవాలయ ఆదాయ వ్యయాలను బట్టి నిర్ణయింపబడిన రీతిగా సరకులు కొలతల వారీగా పంచే రేషన్ పద్ధతి) లో అయ్యవార్ల నివేదనలకు, దేవాలయాలకు అనునిత్యం, నిర్దిష్ట సమయాలలో కావలసిన నివేదన ద్రవ్యాల పరిమాణం; వారంలో, పక్షంలో, మాసంలో, సంవత్సరంలో ప్రత్యేకమైన (పండుగలకు కావలసిన వస్తువులు, వాటి కొలతలతో సహా, వాటిని పంచవలసిన విధానంతో రూపొందించబడ్డాయి. ఇవి తరువాత కాలానికి, యీనాటికి కూడా ప్రమాణంగా రూపొందింది. దేవాలయ నిర్వహణకి సంబంధించిన **'బ్రూస్ కోడ్'** అనే రికార్డు కూడా తయారు చేయబడింది.

## సవాల్ - జవాబ్ పట్టి

**1. వేంకటేశ్వరాలయం:** సవాల్-జవాబ్‌పట్టి తయారుచేయడంలో శ్రీ వేంకటేశ్వర స్వామి దేవస్థానం అత్యంత ప్రధానమైనదిగా గుర్తింపబడింది. దానికి అనుగుణంగా జవాబులు తయారు చేయబడ్డాయి. సర్కార్ సరుకులకు నిర్దేశించిన మొత్తం 7997 'పూలి' వరహాలు, 3 మైలీలు, 6 కాసులు, ఇంకొక 6074 'పూలి' వరహాలు, 9 మైలీలు, 49 కాసులు (సేవకులకు దానమివ్వబడిన ధర్మాలు) ఇంకా 2935-41-12 అనేకమంది దాతలు, దేవాలయసేవకులు, వైశ్యకులానికి చెందిన వ్యాపారులు, జమీందారులు, యితరులద్వారా లభించే, 1700-పూలి, 8 మైలీ, 67 కాసులు/కానుకలు, ఆర్జితాల (నివేదనలకు, పర్వదినాలకు, వాహనాది సేవలకు వసూలు చేసే పైకం రూపంలో సర్కారు ద్వారా) (బహుశా ఏజెంట్లద్వారా లేక రైతులద్వారా) 34458 పూలి, 16 మైలీ, 77 కాసులు; ఇంకా కమతానికివ్వబడిన ఇనామ్ భూములునుండి 6074 పూలి, 9 మైలి, 58 కాసులూ సంపాదించబడ్డాయి. మొత్తం 40532 పూలీ, 26 మైలీ, 46 కాసులు, దానధర్మాల ఏజెంట్లద్వారా 2935 పూలీ, 41 మైలి, 12 కాసులు; మొత్తం 43468 పూలి, 22 మైలి, కాసులు-మొదటి మొత్తం కూడికలో 80 కాసులు ఒకమైలి, 45 మైలీలు ఒక పూలి వరహాలని గుర్తించాలి.

ఈ ఆదాయాన్ని వసూలు చేయడానికి వేరే ఉద్యోగులులేరు. దేవాలయాన్ని సందర్శించే యాత్రికులు ప్రత్యక్షంగా తమ బహుమతులను ఆలయానికి అందజేసేవారు. ఇవి **'చిట్టా'** (ఎకౌంట్ పుస్తకం) లోనికి జమచేయబడేవి. మాట బారుషేక్ సాహెబ్ ఏజెంట్లు దానధర్మాలు వసూలు చేసివాటిని దానంచేసిన గృహస్థుల కోరికమేరకు ఏ వర్గం క్రింద వాటిని వినియోగించుకోవాలో నిర్ణయించి, వసూలు చేయడానికయిన ఖర్చులు మినహాయించి, మిగిలిన మొత్తాన్ని **'చిట్టా'** లో జమ చేసేవారు.

**ఉత్తర భారతానికి చెందిన రఘోజీభోంస్లే, తదితరులు నిర్వహించే 'ధర్మం' కూడా వుండేది. నిర్దేశించబడిన 14,000 నారాయణపేట రూపాయలలో (3500 పూలివరహాలకు సమానం), పూలి 1146-11-20 (4585 రూపాయలు) శ్రీవారి ఆభరణాలకు, పూలీ 511-11-20 (2045 రూపాయలు) తోటమాలి జీతబత్తాలకు, స్వామికి వింజామరలు వీచే యిద్దరి జీతాలకు, హారతి కర్పూరానికి,** ఉచిత అన్నదానానికి, అంగదేవతల నివేదనకు, భగవంతుని సహస్రనామార్చనకు, మహారాజ పోషకులకు, దానమిచ్చే గృహస్థులకు; నిత్య నివేదనలకూ, పక్షంలో ఒకసారి చేసే నివేదనలకు; బ్రహ్మోత్సవాలలో నివేదనలకు, వాహనాలకు, పుష్పాలకు, దీపపు నూనెకు, అభిషేకాలకు, మిగిలిన ఖర్చులకు కేటాయించగా మిగిలిన మొత్తం 1507 'పూలి' పదికాసులు.

తక్కిన ధర్మకర్తల ద్వారా దానధర్మాలు జరుపబడేవి.

జాబితాలో 5వ ప్రశ్నకు జవాబుగా వెలగరాల తాలుకా, మొత్తం దేవాలయానికి ఇనామ్ భూమిగా లెక్కింపబడింది. దానినుండి లభించే ఆదాయం లభించడంలేదని, ఇతర తాలూకాలలో వున్న ఇనామ్‌లకు సంబంధించిన సమాచారం లభించటంలేదని, కానివాటిని కూడా లెక్కలోకి తీసుకోవలసి వుండటంవల్ల, ఆ తాలూకాలకు చెందిన తహశిల్దారులు డబ్బు వసూలుచేసి సంబంధిత 'పారుపత్తేదార్'లు దానధర్మాలు కొనసాగించ డానికి వీలుగా వారికి ఆ డబ్బు జమచేయమని సలహాయివ్వబడింది.

అందులోనే తిరుమలలో పారుపత్తేదార్ వొక్కడే కార్యనిర్వహణాధికారి  కావడంవలన, అతనికి సుస్తి చేస్తే అతని స్థానంలో అతని విధులు నిర్వహించడానికి వీలుగా ఒక సహాయకుడు అవసరమని, అందువలన ఒక సహాయకుడిని నియమించడానికి అనుమతించవలసినదని ఒక సలహా పొందు పరచబడింది.

మరొకటి, అంటే మూడవ సలహాకూడా యివ్వబడింది. ఆలయ అధికారులు 'మహిసూర్-కర్త' అయిన పూర్ణన్నయ్య సాహెబ్‌కు వేంకటేశ్వర స్వామివారి పూజకై పూవులు పరఫరా చేయమని అర్జీ పెట్టుకున్నప్పుడే, అంటే ఆయన ఆలయాన్ని ఫస్లీ 1227 లో (క్రీ॥శ॥ 1818-19లో) సందర్శించినప్పుడు ఒక ఉద్యానం కేటాయించి ఇద్దరు తోటమాలీలకు అవకాశం కల్పించాడు. వారి జీతభత్యాలకు యేర్పాటు చేస్తే మరొక తోటకూడా స్వామివారికి తగినన్ని పువ్వులకోసం ఏర్పాటు చేయవచ్చని అభిప్రాయం.

ఆరవ ప్రశ్నకు జవాబుగా ఆలయం రాతితో చేయబడిన విషయం; గర్భగుడి కొలతలు, మంటపం, ప్రాకారం కొలతలతోసహా **'పైమాయిషీ' ఎకౌంట్‌లో** (ఆదాయ వ్యయాల ప్రామాణిక పట్టిక) పేర్కొనబడ్డాయి.

7 వ ప్రశ్నకు జవాబుగా ఆలయ కార్యకర్తలు, వారిపేర్లు, వారి ఉద్యోగ వివరాలు యివ్వబడ్డాయి. ఇందులో 92 పెద్ద ఉద్యోగులు, చిన్న ఉద్యోగులు, తాత్కాలిక ఉద్యోగులతో కూడిన మొత్తం జాబితా వుంది.

ఇద్దరు ద్వారపాలకుల మధ్యలో వున్న ఆలయ బహిర్ద్వారం (బంగారు వాకిలి) తాళంచెవులు, ఆభరణపు పెట్టెల తాళాలు కూడా జియ్యంగార్ అధీనంలో వుండేవి (యీనాటికీ అంతే). అంతర్ద్వారం తాళాలు, దేవతలు నిత్యం ధరించే ఆభరణాలుగల పెట్టెల తాళాలు దానికి బాధ్యతలు అప్పజెప్పబడిన అర్చకుని వద్దనే వుండేవి. ఆలయద్వారాలు ఉదయం 8 గం॥లకి తెరిచేవారు. ఆ సమయానికి కొంచెం ముందుగా ఒక దేవాలయపు బంట్రోతు జియ్యంగారిని, మరొక బంట్రోతు అర్చకుణ్ణి తాళాలతో సహా ఆలయానికి తీసుకొనివచ్చేవారు. ఆ సమయానికే ఆలయపు 'పారుపత్తేదార్' తక్కిన ఉద్యోగులు ఆలయద్వారం వద్ద ఉపస్థితులై వుండేవారు. బంగారు వాకిలి తెరవగానే అర్చకుడు, ఏకాంగి, గొల్ల ఆలయంలో ప్రవేశించేవారు. ఆలయపు తలుపు మూసివేసి, నేతితో నిండిన అఖండ దీపాన్ని సరిచేసి, ద్వారం తలుపులు తెరవగానే జియ్యంగార్ ఆలయ ప్రవేశంచేసి, అర్చకునికి హారతిపళ్ళెం అప్పగించేవాడు. అర్చకుడు స్వామివారికి హారతిచ్చేవాడు. ఇంతలో అన్నమాచార్య వంశీకులలో ఒకరు స్వామివారి సుప్రభాతం గానంచేయాలి. తొమ్మిదింటికల్లా తోమాలసేవ, తక్కిన పూజలు పూర్తయ్యేవి. ఘంటానాదంతో మొట్టమొదటి నివేదన జరిగేవి. ఇంకా కొంతపూజ జరిపిన తరువాత రెండవసారి నైవేద్యం (హారతితోబాటు) యేర్పాటు చేయబడేది. నిత్యార్చనలు, నివేదనల తరువాత, సందర్శకులను స్వామి దర్శనానికి అనుమతించేవారు.

కాని, దేవాలయపు ఉద్యోగులు, కార్యకర్తల జాబితా తయారుచేసిన పిమ్మట, వారి విధులు వివరించిన తరువాత (7వ ప్రశ్నకు జవాబుగా) దాని చివరన స్వామివారి పూజాకార్యక్రమాలను ప్రస్తావిస్తూ వారికి మొదటి అర్చన ఉదయం తొమ్మిదింటికి ప్రారంభమవాలని, ఆ సమయానికి తోమాలసేవ ముగించాలని చెప్పబడింది. పదింటికి 'మాత్ర', (దధ్యోదనం), బకాళాభాత్, చప్పిడి ప్రసాదం (శుద్ధాన్నం) నివేదన చేయాలని, అప్పటినుండి మధ్యాహ్నం పన్నెండువరకు భక్తులని దర్శనానికి అనుమతించాలని చెప్పబడింది. రెండవసారి మధ్యాహ్నపూజ ఒంటిగంటకి జరిపి, రెండవ ఘంటానాదానికి రెండవ నివేదన కానివ్వాలి. ఇందులో 'అలంకారం–అన్నం', 'సూపం', రసం, పాయసంవుండాలి. రాత్రి 8.30 లకు ప్రారంభమైన తోమాలసేవ తొమ్మిదింటికి సంపూర్ణం కావాలి. మళగుజాగిరం (నెయ్యి, మిరియాలపొడి, ఉప్పుతో కలపబడిన వండిన అన్నం), పరమాన్నం (తిరువీసం), శుద్ధాన్నం దైవానికి నివేదన చేయవలె. అప్పుడు భక్తులకు దర్శనం చేసుకునే అవకాశం కల్పించాలి. రాత్రి పదింటికి మంచపు సేవ పూర్తికావాలి. దేవాలయానికి సంబంధించిన సేవలు, ఉత్సవాలకు వాటివాటికి సంబంధించిన అధికారులు హాజరై వారి సేవలందించాలి. దీనివలన పగలు మొదటి నైవేద్యం తరువాత ఉదయం 10 నుండి మధ్యాహ్నం 12 వరకు దర్శనంవేళ అని తెలియవస్తున్నది.

అప్పుడు ఆలయ ప్రవేశద్వారం వద్ద ఒక పెద్దపాత్ర ఉంచుతారు. బంగారువాకిలి వద్ద 'పారుపత్యదార్' నిలబడి యెక్కువ ద్రవ్యం, కానుకలు తెచ్చిన భక్తులను ఆసీనులనుచేసి, వారివద్దనుండి ధనం తీసుకుని, లెక్కించి, గుడ్డమూటలోకట్టి, 'ముద్ర' వేసి, ఆ 'ముద్ర' వేసిన మూటలతో భక్తులను దైవదర్శనానికి పంపుతాడు. వారికి తోడుగా ఒక బంట్రోతుని పంపుతాడు. మూటలను ఆలయంవద్దనున్న పాత్రలో నిక్షిప్తం చేయడానికి ఆ బంట్రోతు సహాయం చేస్తాడు. కానుకలిచ్చిన భక్తులకు స్వామి దర్శనం చేసిన పిదప వడ ప్రసాదాదులు యివ్వబడతాయి. దర్శన సమయం ముగిసిన పిమ్మట, 'ముద్ర' చేయబడిన ధనం, ఆభరణాలు నిక్షిప్తం చేయబడిన మూటలు, విడి నాణాలు (పాత్రలో యాత్రికులు వేసినవి) బంగారు వాకిలికి వెలుపలనున్న రంగమంటపం వద్దకు తీసుకురాబడతాయి. పారుపత్యదార్, జియ్యంగార్‌ల రిజిస్టర్‌లలో జమ వ్రాయబడిన తరువాత ఆలయపు జియ్యంగారు, పారుపత్యదార్, ముద్రలువేసి, మూటలుకట్టిన తరువాత జియ్యంగార్ వద్ద పనిచేసే జమాఖర్చుల గుమస్తా, 'పారుపత్యదార్' సంతకం చేస్తాడు. అప్పుడు హుండీ ('కొప్పెర') ని కట్టివేసి, రక్షకభటులకు వాటిని భద్రంగా అప్పజెప్పిన పిమ్మట, పారుపత్యదార్ యింటికి వెళ్ళిపోతాడు. అర్చకుడు తలుపుమూసి, తాళంవేసి తానుకూడా గృహోన్ముఖుడౌతాడు.

రాత్రి ఎనిమిదింటికి ఆలయపు బంట్రోతులతో అర్చకుడు, జియ్యంగార్ ఆలయానికి చేరుకుని రాత్రి తొమ్మిదిలోపల పూజ, నివేదనలు ముగిస్తారు. అప్పుడు యాత్రికులను స్వామిదర్శనానికి అనుమతిస్తారు. దర్శనానంతరం పదింటికి మంచపుసేవ వుంటుంది. తరువాత అంతర్ద్వారానికి తాళంవేసి అర్చకుడు యింటికి వెళ్ళిపోతాడు. బంగారువాకిలిని కూడా మూసి తాళం వేస్తారు. తాళంమీద గుడ్డచుట్టి వివిధమైన ముద్రలు వేస్తారు.

ఆలయంలో జియ్యంగారుకాని, అతని సహాయకుడు (ఏకాంగి) కాని కర్పూరం వెలిగించి హారతిపళ్ళెం అర్చకుని చేతికిచ్చి, అది అతను దైవానికి నివేదించేలా చేస్తారు. పువ్వులు, పువ్వులదండలు, వస్త్రాలు, స్వామి అలంకరణకుపకరించే యితర ద్రవ్యాలుకూడా అర్చకుని చేతికివ్వబడతాయి.

'పారుపత్యదార్' రాత్రిపూట కూడా భక్తుల వద్దనుండి కానుకలు గైకొని (దర్శన సమయంలో) వాటిని మధ్యాహ్నం యేవిధంగా భద్రపరుస్తాడో, ఆ విధంగానే భద్రపరుస్తాడు.

తోలప్పాచారి కుటుంబానికి చెందిన ఆచార్య పురుషుడు ఆలయంలో జరిగే నిత్యపూజల సందర్భంగా వేదపారాయణ కార్యక్రమాన్ని నిర్వహించే వాడు. అలాగే దేవతల ఊరేగింపులప్పుడు కూడా. ఆకాశగంగ తీర్థంనుండి 3 పాత్రల నీళ్ళు తన ప్రతినిధి ద్వారా తెప్పించుకొని, యేడుగురిలో అందరికన్న ప్రథమంగా తీర్థం స్వీకరించేవాడు. అర్చన సమయంలో మంత్ర పుష్పం, సహస్రనామం పారాయణచేసేవాడు. తక్కిన ఆరుగురు ప్రబంధం పఠించేవారు.

సామవేద పాఠకుడు నిత్యం సామవేదాన్ని పఠించడమేకాక ప్రతి శుక్రవారం యజ్ఞోపవీతత్రయం, కొందరు భక్తులు నిర్దేశించిన రీతిలో వేంకటేశ్వరస్వామికి సమర్పించేవాడు. ఈ యజ్ఞోపవీతం సమర్పించడం,

దాన్ని ధరించడం తాళ్ళపాక పెద తిరుమలాచార్య క్రీ॥శ॥ మార్చి 1532లో ప్రారంభించాడు (సంపుటం 4, సంఖ్య 14).

'పల్లె' కులానికి చెందిన బంట్రోతు 'పారుపత్యదార్' తో అతని ఆజ్ఞమేరకు విధులు నిర్వర్తించేవాడు. ఉగ్రాణం (సరుకులు నిల్వచేసే గది) లో పనిచేసే మరొక బంట్రోతు భక్తులు సమర్పించిన కొబ్బరికాయలు, తమలపాకులు సంగ్రహించి వీటిని బజారు ధరలకమ్మి, అలా వచ్చిన సొమ్మును సర్కారు (ఖజానాకు) జమచేసేవారు. దేవతల విగ్రహాల ఊరేగింపు సమయంలో ఆయుధాలు ధరించి రక్షకుడిగా వ్యవహరించేవాడు.

'గొల్లచార్వాకారు' ఇరవైమందితోను, ఆఫీసరు బంట్రోతులతోను తహశీల్దారును సేవిస్తూ, కానుకలున్న ముద్రవేయబడిన మూటలు విప్పి, **'పరకామణిసేవ'** సమయంలో లభ్యమైన యితర వస్తువులు కొనడానికి వర్తకులకు సిద్ధంగా వుంచేవాడు. పరకామణిసేవ తరువాత, మళ్ళీ వస్తువులను మూటలలో కట్టి, ముద్రలువేసి పెట్టెలలో భద్రపరచేవాడు. అంతేకాదు. గోవిందరాజు, రామస్వామివారి ఊరేగింపుల సందర్భంగాను, వారు పార్వేటు, తీర్థవారికి వెళ్ళేటప్పుడు బహుశా తన అనుచరులతోబాటు రక్షకభటుడిగా వ్యవహరించేవాడు.

గజశాలలో ఒక దరోగా (దరోగా = పర్యవేక్షకుడు / ఇన్‌స్పెక్టర్) నలుగురు మావటివాళ్లు, అయిదుగురు 'గమేకార్లు'–మొత్తం 14 మంది వుండేవారు. అశ్వశాలలో ముగ్గురే అశ్వరక్షకులు వుండేవారు. పశువులకు మేత సరఫరా చేసేవారు ముగ్గురు మాత్రమే. జంతువుల సంఖ్య చెప్పబడలేదు. కాని, ఉద్యోగుల సంఖ్యవలన నాలుగు యేనుగులు, మూడు గుర్రాలు వున్నట్టు, తెలియవస్తోంది. వాటిని తిరుపతిలోనే వుంచి దేవతామూర్తుల ఊరేగింపులో వైభవంగా ప్రదర్శించేవారు. ఉత్సవవైభవంకోసం, తిరుమలలో ఉత్సవాలు, పండుగల సమయంలో వాటినిక్కడకు తీసుకుని వెళ్ళేవారు.

8వ ప్రశ్నకు సమాధానం, విధినిర్వహణలో ప్రమత్తులైనవారిలో అనారోగ్యం కారణంగా విధులు నిర్వహించలేనివారిపై చర్యలు లేవు. చిన్న తప్పులు చేసినవారిని జరిమానాలో వదిలేసేవారు. తీవ్రమైన అపరాధాలు చేసినవారిని 'హజూర్' దృష్టికి తీసుకొనివచ్చేవారు. హజూర్ విధించిన శిక్షలు అమలుచేసేవారు.

ప్రశ్నావళిలో 12వ ప్రశ్నకు జవాబుగా వేంకటేశ్వర దేవస్థానం చాలా పురాతన సంస్థగా పేర్కొనబడింది (అనాది); మొదట స్వామి బ్రహ్మకు దర్శన మిచ్చినట్లు, బ్రహ్మ అతనిని పూజించినట్లు, తొండమాన్ చక్రవర్తికి ప్రత్యక్షమవగా అతడు స్వామి దేవాలయం కట్టించినట్లు, అందువల్ల ఆనాటి జమ, ఖర్చులు తెలియరానట్టు ప్రస్తావించబడింది. తరువాత కాలంలో శాలివాహన శకం 939 లో పింగళనామ సంవత్సరంలో భాష్యకారుడైన రామానుజుడు జన్మించాడు. అతని కాలంలో ఆయన కత్ల (స్వామి అర్చనలో సేవలు, నివేదనలు) దివ్యదేశాల (విష్ణువు నర్చించే అనేక క్షేత్రాలు)న్నింటిలో జరిగే విధానాన్ని క్రమబద్ధీకరించాడు. ధర్మకర్తగా వ్యవహరించి, గోపురం, ప్రాకారం, మిగిలిన నిర్మాణాలుకూడా చేసి 'ధర్మం' నిర్వహించేవాడట. ప్రస్తుతంవున్న జియ్యంగారు శిష్యపరంపరలోనివాడు. అతని ఆదాయం ప్రత్యేకంగా ప్రస్తావించబడింది. నవాబునాటినుండి అనేక శీర్షికల క్రింద వెచ్చింపబడిన సొమ్ము లెక్కలు పరిశీలించబడ్డాయి. 'తసాదిక్' (నిత్యం ఖర్చులు) నిర్దేశించబడి ఆ ప్రకారంగానే వెచ్చించబడుతున్నాయి.

**2. గోవిందరాజస్వామి ఆలయం:** రెండవ ప్రధాన దేవాలయంగా గోవిందరాజ స్వామివారి ఆలయం గుర్తించబడింది. సర్కారువారు దానికి నిర్దేశించిన ఆదాయం, అదనపు ద్రవ్యం, సరుకుల నిమిత్తం ఖర్చు-అంతా కలసి 563 పూలి, 28 మైలి, యింకా 40 కాసులున్నూ, కానుకలు, భూమి తాకట్టుపెట్టగా 26 పూలీ, 2 మైలీ, యింకా 66 కాసులు మొత్తం 589 పూలి, 31 మైలి, 26 కాసులు. 'ధర్మా'ల ప్రతినిధులు, గుడిలోని సేవలు, వర్తకులు, తదితరులద్వారా లభించేది 131 పూలీ, 35 మైలి, 14 కాసులున్నూ. చివరగా కానుకలు, ఆర్జితం (నివేదనలకు, వాహనాల ఊరేగింపులకు) పెట్టిన తాకట్టు నెలకు 900 పూలీలు. చివరకు లెక్కతేలింది. 1057 పూలి-వరహాలు, 38 మైలీలున్నూ.

వివిధ ప్రదేశాల నుండి వచ్చిన సందర్శకుల కానుకలనుండి, నివేదనలకు వచ్చిన ఆర్జితం, కానుకలనుండి వచ్చిన సొమ్ము ప్రతి సంవత్సరానికి లెక్కవేయబడేది. రైతులు సర్కారుకు ఉద్యోగులద్వారా శిస్తులు చెల్లించేవారు.

'ధర్మా'ల ప్రతినిధులు తమ విధినిర్వహణలో భాగంగా ఉత్సవాలలో నిర్దేశించబడిన రోజులలో నివేదనలకు కావలసిన సరుకులు అందించేవారు. మేళంవారికి, గొల్లలకు యే జీతమూలేదు. కాని, ఆలయపు కానుకల కమతం తీసుకున్నవారు వారికి డబ్బిచ్చేవారు. అందువల్ల పండుగలు, ఉత్సవాలు జరిగే సమయంలో మాత్రమే మేళంవారు పూర్తిగా పనిచేసేవారు. మిగిలిన రోజుల్లో సాయం సమయాల్లో మాత్రమే పనిచేసేవారు. పూజా సమయాలన్నిటి లోను కూడా కాదు. అందువల్ల వారికి జీతం నిర్ణయించి తసాదిక్ (అనుమతించబడిన ఖర్చుల జాబితా)లో దాన్నికూడా చూపి పూజ జరిగే అన్ని సమయాలలోను ఆలయంలో వారి సేవలు కొనసాగేలా యేర్పాటు చేయాలని కోరడమైనది.

ఈ దేవాలయంలో విమానం, గోపురం, తక్కిన కట్టడాలు యిటుక, సిమెంటుతో నిర్మించబడ్డాయి. ఆలయంలో రెండుచోట్ల లోపల బయట దడి కట్టబడివున్నది. బాహ్యప్రాకారంలో అనేక రాతిమంటపాలున్నాయి. వీటిని 'పైమాయిషీ' జమాఖర్చుల పట్టికలో ప్రస్తావించారు.

వేంకటేశ్వరుని ఆలయంలో సేవచేసే నాలుగు అర్చకుల కుటుంబాలలో రెండు కుటుంబాలకు మాత్రమే గోవిందరాజస్వామివారి ఆలయంలో పూజచేసే హక్కు వుండేది. పెద్దజియ్యంగార్, చిన్నజియ్యంగార్-యీ యిరువురికి, వారి సహాయకులకి, ఏకాంగులకి గుడిలోకూడా విధులు వుండేవి. ఏడుగురు అర్చక పురుషులకికూడా. జీతంలేని, వంశపారం పర్యంగా సేవచేసే, గౌరవానికి పదవులు నిర్వహించేవారిలో 3 రకాల వ్యక్తులుండేవారు. సహస్రనామం పారాయణ చేసే పాఠకుడు, ప్రబంధం పఠించే **అధ్యాపకుడు, దైవజ్ఞుడు, పురోహితుడు, గొల్లచార్వాకారుడు, పల్లెచార్వాకారుడు, కైకాలుడు** (నేతపనివాడు), **కామాటి** (వడ్రంగి), **జినిగిరి** (చిత్రకారుడు), **దర్జీ, బొక్కసంసభ** (పక్క, మంచం, దుస్తులు, మిగిలిన వస్తువులు) పర్యవేక్షించేవాడు, **'దైవవర్= దైవవారి** (తమిళం)= వంటవాడు [ దేవళకర్ (మరాఠీ)= దేవలకులు (సంస్కృతం)= దేవాలయ పరిచారకులు ] మొత్తం 27గురు వుండేవారు.

నెల జీతానికి పనిచేసేవారు 8 మంది మాత్రమే. వీరిలో ముద్రమనిషి (చక్రాంకితం చేసేవాడు, శంఖాన్ని ముంజేతిపైన ముద్రించేవాడు), ఛత్రం పట్టేవాడు, పూదండలు కట్టే సాతాని, తిరువీథులు తుడిచి శుభ్రంచేసే యిద్దరూ వుండేవారు.

మొదటి తరగతికి చెందిన ఉద్యోగస్థులలో వేంకటేశ్వరస్వామి ఆలయంలో పనిచేసే అనుమతించబడిన ఉద్యోగస్థులు.

తిరుపతిలోనే వున్నప్పటికీ ఏనుగులు, గుర్రాలు, మావటివారు, యితరులపై పెట్టే ఖర్చు వేంకటేశ్వరస్వామి ఆలయపు ఆదాయంలోంచే లెక్కింపబడేవి.

గోపురంక్రింద ద్వారంవద్ద పల్లె చార్వాకారులకు చెందిన ఒకవ్యక్తి కాపలావుండే వాడు. భక్తుల వద్దనుండి లభించే డబ్బు సేకరించడంలో కానుకల కమతందారుడికి ఒక గొల్ల బంట్రోతుగా వ్యవహరించి సహకరించే వాడు.

ప్రధానమైన పర్వదినాల్లో దేవతల ఊరేగింపు సమయంలో గొల్ల చార్వాకార్ బంట్రోతులు, పల్లె చార్వాకార్ బంట్రోతు ఆయుధాలు ధరించి ఊరేగింపుని వెన్నంటి వుండేవారు. పర్వదినాల్లో దర్జీ రథాన్ని వస్త్రాలతో అలంకరించేవాడు. అవసరమైనప్పుడు వాటిని సరిచేసి, తనవద్ద భద్రపరచే వాడు. చిత్రకారుడు కర్రతో చేయబడిన సారధి మూర్తులను, సింహాలకు, గుర్రాలకు రంగులు వేసేవాడు. కామాటి (వడ్రంగి) రథానికి అవసరమైన చిన్న రిపేర్లుచేసి, రథం ఊరేగింపులో (పర్వదినాల్లో) భద్రంగా నడిచేలా చేసేవాడు.

గోవిందరాజస్వామి ఆలయంలోని పూజావిధానం వేంకటేశ్వరస్వామివారి ఆలయంలోలాగే వుండేది. అయితే ఆ పూజల సమయంమాత్రం కొంచెం ముందుగా వుండేది. ఆలయసేవకులు వారియింటికి వెళ్ళి పిలవగానే అర్చకుడు, జియ్యంగార్, ఒక యేకాంగి వారిని అనుసరించి తాళాలు తీసుకొని ఉదయం ఏడింటికి ఆలయానికి చేరుకోగానే, ముద్రమనిషి, యితరుల సమక్షంలో గుడిబయట తలుపు జియ్యంగార్ తెచ్చిన తాళంతో తెరిచేవారు. లోపలితలుపు అర్చకుడు తెరిచేవాడు. ఏకాంగి, 'కైకాల' బంట్రోతు, అర్చకుడితో సహా లోపలికి ప్రవేశించేవారు. దీపాన్ని సరిచేసి, లోపలవున్న వస్తువులు భద్రంగా వున్నదీ, లేనిదీ పరిశీలించేవారు. అప్పుడు జియ్యంగార్ లోపలికి ప్రవేశించేవాడు. తొమ్మిదింటిలోపల తోమాలసేవ, అర్చన, అటుపిమ్మట నివేదనతో కూడిన పూజ సంపూర్ణమయ్యేది. అప్పుడు సందర్శకులను దర్శనానికి అనుమతించే వారు. కమతందారు వారివద్దనుండి కానుకలు గ్రహించి, వాటిని చిన్నపెట్టెలో నిక్షిప్తం చేసేవాడు. ఈ దర్శనంవేళ మద్యాహ్నం 12వరకు, అంటే మధ్యాహ్న పూజవరకు కొనసాగేవి. సందర్శకులు యివ్వదలచిన నైవేద్యాదులు కమతందారు ద్వారా దైవానికి సమర్పింపబడి, అటుపిమ్మట మరల అతనిద్వారానే సందర్శకులకు అందించేలా యేర్పాటు చేయబడేది. అప్పుడు అర్చకుడు లోపలి తలుపుకి తాళంపెట్టి యింటికి వెళ్ళిపోయేవాడు. జియ్యంగార్, తదితరులుకూడా వారివారి యిళ్ళకు పోయేవారు. రాత్రి యేడింటప్పుడు అందరు ఉద్యోగులు విధులలో వుండేవారు. రాత్రి పదింటికల్లా రాత్రిపూజ, నైవేద్యం, దర్శనం, దేవతాశయనం

– అన్నీ ముగిసేవి. తన అధీనంలో వున్న తాళంతో జియ్యంగారు బాహ్యద్వారానికి తాళంవేసి, తనతోబాటు తాళాన్ని తన మఠానికి తీసుకొనిపోయేవాడు.

ఈ గుడిలోని **యాదవ పెరుమాళ్ మందిరం – (పార్థసారథిగుడి అనికూడా పిలువబడేది)** (మహాభారత యుద్ధంలో అర్జునుడి రథసారథియైన శ్రీకృష్ణుడు) విజయనగర సార్వభౌముడైన రాయలకాలంలో కట్టబడింది. అటుపిమ్మట, భాష్యకారుడైన రామానుజుడు చిత్రకూటం (చిదంబరం) నుండి గోవిందరాజస్వామివారి విగ్రహం తెప్పించి, మందిరం, దాని పరిసరాలను నిర్మించి అందులో ఆ విగ్రహం ప్రతిష్ఠ గావించాడు. గోవిందరాజస్వామివారి యెడల ఆధ్యాత్మిక విశ్వాసం ఎక్కువ కావడంవల్ల, అతనికి జరిగే పూజలు కొనసాగాయి. ప్లాస్టర్‌తో చేసినదవటంవల్ల, వైకల్యంతో వున్న పార్థసారథి విగ్రహానికెవరూ పూజచేసేవారు కారు.

**3. సాల–నాచ్చియార్ మందిరం:** ప్రజలు పట్టించుకొన్న మరోదైవం (మూడోదైవం) సాల–నాచ్చియార్, సర్కారునుండి ఆవిడకు లభించే భత్యం–సరుకులకి 18 పూలి, 2 మైలి, 54 కాసులు, నగదురూపమైన చెల్లింపు 6 వరహాలు, మొత్తం 24–2–54 వరహాలు. ఉభయదార్ల (దాతలు) 'ధర్మం' పూలీ 8–26–41. భక్తులు విడిగా యిచ్చే కానుకలలో ఒక రూపాయి, దానికి పైబడిన సొమ్ము గోవిందరాజస్వామి దేవాలయం కమతందారుకి, ఒక రూపాయికంటే తక్కువయిన సొమ్ము పరిచారక (మందిరంలో సేవలందించే ఒక వంటవానికి) కు చెందేవి. ఉభయదార్లు పర్వదినాలలో నివేదనాదులకు కావలసిన సామగ్రిని సరఫరాచేసేవారు. ఈ మందిరం కొంత రాతితోను, కొంత సున్నంతోను కట్టబడింది. ఉదయం 7 గంటల నుండి 10 గంటల మధ్యలో గోవిందరాజస్వామివారి అర్చకుని వద్ద పనిచేసే గుమాస్తా పూజ నిర్వహించే వాడు. రెండు పర్యాయాలు అర్థశేరువండిన బియ్యం నైవేద్యంగా సమర్పించబడేది. 7 రోజులు జరిగే పర్వదినాలలో, గోవిందరాజస్వామివారి ఆలయసిబ్బంది అందరూ యీ పూజా కార్యక్రమాలు జరపడంలో సహకరించేవారు.

భాష్యకారుడు గోవిందరాజస్వామివారి విగ్రహానికి ప్రాణప్రతిష్ఠచేసిన పిమ్మట **శ్రీమహాలక్ష్మి విగ్రహాన్ని** (నాలుగు చేతులతో యాదవ పెరుమాళ్ గుడికి ఉత్తరాన, రాయలకాలంలో దక్షిణాభి ముఖంగావున్న) దాని స్థానం నుండి తప్పించి, శాలలో పునఃప్రతిష్ఠించటం జరిగింది (ఈ శాల కట్టడంలో ఒకభాగం. ఇది ముఖమంటపానికి నైఋతిమూలన వున్నది). ఈ దేవతకి సాలనాంచారమ్మ అనే పేరు వచ్చింది.

**4. శూడికొడుత్త–నాచ్చియార్ మందిరం:** నాలుగవ సంస్థ శూడి కొడుత్త నాంచారమ్మ (నాచ్చియార్) మందిరం. సర్కారు దానికి కావలసిన సామగ్రుల నిమిత్తం యిచ్చిన పైకం 39–16–19 పూలీలు. ఏక మొత్తంగా యిచ్చిన కానుక 32 పూలీలు. ఉభయాలకు 18–5–62 పూలీలు. మొత్తం ఆదాయం 50–5–62 పూలీలు. సాల–నాంచారమ్మ మందిరంలోపలె, యీ మందిరంలో కూడా ఒక రూపాయి, అంతకుమించిన మొత్తం గోవిందరాజస్వామివారి ఆలయంలో కానుకలు స్వీకరించి నిర్వహించినవారే నిర్వహిస్తారు. రూపాయికి

తక్కువగావున్న మొత్తాలు అర్చకునికి చెందేవి. ఈ మందిరం కొంత రాతితోను, కొంత సిమెంటుతోను నిర్మించబడింది. అర్చకుని గుమస్తా పూజ, 'పరిచారకం'-రెండింటికీ హాజరయ్యేవాడు. ఉదయం 10 నుండి మధ్యాహ్నం 12 వరకు, రాత్రి 7 నుండి 10 వరకు పూజ నిర్వహించబడేది. గోవిందరాజస్వామివారి ఆలయంలో నిర్దేశించబడిన నివేదనలనుండి యీ మందిరంలో పగలు, రాత్రి అర్ధశేరు అన్నం నివేదించేవారు. ఈ మందిరం భాష్యకారుని కాలంలో నిర్మించబడిందంటారు.

**5. శ్రీ కోదండరామస్వామి వారి ఆలయం:** తిరుపతిలో ప్రస్తావించ బడిన అయిదవ సంస్థ శ్రీ కోదండరామస్వామివారి ఆలయం. సరకుల నిమిత్తం సర్కారువారు కేటాయించిన మొత్తం 145-38-0 పూలీలు. కానుకలనుండి, భూకమతంనుండి లభించే మొత్తం 80-4-2 పూలీలు. 'ధర్మాల ప్రతినిధులనుండి, ఉభయాలద్వారా లభించేవి సొమ్ము 71-8-42 పూలీలు. మొత్తం ఆదాయం 151-12-44. కానుకల ద్వారా ఆలయానికి లభించే పైకంలో 'జీర్గమ్' వారు (సేవలందించేవారు) కొంతభాగం వాడుకొనేవారు. మిగిలిన దానిలో కొంతభాగం వంట చెఱకుకై వెచ్చించేవారు. తిరుమల, తిరుపతి దేవాలయాలలోను, గోవిందరాజస్వామి వారి దేవాలయంలోను సంప్రదాయంగా దేవాలయపు వంట వాళ్ళకు యిచ్చే ఫస్కి 'ప్రాసిక', నివేదన చేయబడిన ఒక ముద్ద అన్నం నిర్వహణ తేవకూలవార్ల వంటవాళ్ళ చేతిలో వుండేది.

ఆ వంటవాళ్ళు కమతం పైకాన్ని దేవాలయం ధర్మకర్తలు **గుండప్పకు, వెంకటరావుకు** చెల్లించేవారు. అంతేకాదు, స్థానికులు, బయటవారు, సరుకులు తెచ్చే వర్తకులు, యితర వర్తకుల (ఫస్లి 1199 అంటే క్రీ॥శ॥ 1790-91 లో) వొప్పందం ప్రకారం, నవాబుగారి అనుమతిపొంది **'మస్తజారు'** (కార్యనిర్వహణాధికారి) ద్వారా 'ఫస్కి' అమలులో పెట్టబడేది. ధర్మకర్త గూడప్ప, వెంకటరావుల తరపున వసూలు చేయబడిన సొమ్ము కొంతభాగం ఆలయ ఉద్యోగుల జీతంగాను, మిగిలినది ఆలయంకొరకు వెచ్చించబడేది. దానికి వేరే పద్దువుండేది. సర్కారువారి జమాఖర్చులతో దీనికి సంబంధంలేదు.

ఇది పురాతన దేవాలయం. రాతితో, కట్టబడింది. విమానం, గోపురం మాత్రం సిమెంట్‌తో కట్టబడ్డాయి. మేళతాళాలు వాయించేవారు విధిగా వుండేవారు.

దాని ఉద్యోగులలో ఒక అర్చకుడు, బొక్కసానికి సంబంధించిన ఒక గుమస్తా, ఒక వంటవాడు, యిద్దరు గొల్లవాళ్ళు, ఒక తోటమాలి వుండేవారు. అర్చకుడు ఉదయం 7 నుండి 9 వరకు పూజచేసేవాడు. 'మాత్ర' నైవేద్యం, దధ్యోదనం అర్పించేవాడు. ఆ తరువాత 10 నుండి 12 వరకు మధ్యాహ్నపూజ, తరువాత నైవేద్యం. రాత్రి 7 నుండి 9 వరకు పూజ, నైవేద్యం, అలంకారం, పూలఓగిరం వుండేవి. అటుపిమ్మట మంచపుసేవతో ఆ రోజుకి స్వామిసేవ ముగిసేది (తీరుమానం= తీర్మానం). బొక్కసం గుమస్తా అభిషేకానికి జలం యేర్పాటు చేసేవాడు. గంధం సిద్ధం చేసేవాడు. పూజకి పాత్రలు శుభ్రం చేసేవాడు. వంటవాడు నివేదనలు సిద్ధం చేసేవాడు. గొల్ల ఆలయానికి కావలసిన సంభారాలు (వంటకు కావలసిన సరుకులు) తెచ్చేవాడు. ఆలయానికి కాపలా కాసేవాడు. తోటమాలి పూజకు పువ్వులు అందించేవాడు.

చంద్రవంశానికి చెందిన జనమేజయ మహారాజు గుడి నిర్మించి, విగ్రహ ప్రతిష్ఠగావించాడు. రాయలవారి కాలంలో **అయోధ్యరామానుజ అయ్యంగార్** ప్రాకారమూ, గోపురమూ నిర్మించాడు. ఫస్లి 1226 (క్రీ॥శ॥ 1817-18లో) ఒక కొత్త విమానం నిర్మించబడింది. దాని ప్రతిష్ఠ సందర్భంగా కుంభాభిషేకం జరిగింది.

**6. తిరుచానూరులోని శ్రీకృష్ణస్వామి మందిరం:** ప్రస్తావించబడిన ఆరవ దేవాలయం తిరుచానూరు శ్రీకృష్ణస్వామిది. సర్కారువారు దీని సంభారాల (ప్రసాదాల తయారీకి కావలసిన సామగ్రి) నిమిత్తం యిచ్చేది 32-25-57 పూలీలు; దాతలవద్దనుండి 'ఉభయాలు'గా లభించేది 3-15-55 పూలీలు. ఈ మందిరం రాతితో కట్టబడింది. పద్మావతీ దేవస్థానంలో భాగంగా దీని పద్దులుండేవి.

పద్మావతీ అమ్మవారి ఆలయంలో పనిచేసే అర్చకుడు, వంటవాడు, సంభారాలు తెచ్చే సేవకుడు, ధర్మకర్త, కృష్ణాపురం 'పాలెగారు' తలారి, యీ ఆలయంలో కూడా సేవలందించేవారు. అర్చకుడు మొదట యీ ఆలయంలో ఉదయం, మధ్యాహ్నం, రాత్రి పూజలు నిర్వహించి, పిమ్మట పద్మావతీ అమ్మవారి ఆలయానికి వెళ్ళేవాడు. వంటవాళ్ళు పద్మావతీ అమ్మవారి నైవేద్యంతోపాటు శ్రీకృష్ణునికి కూడా నైవేద్యం వండిపెట్టేవారు. స్వామివారికి ముందుగా నివేదన జరిగేది. అటుపిమ్మట పద్మావతీ అమ్మవారికి కూడా.

ఈ మందిరం పురాతనమైనది. శ్రీశుకుడు సువర్ణముఖీనది ఒడ్డున తపస్సు చేస్తూంటే, శ్రీకృష్ణుడు, అతని సోదరుడు బలభద్రస్వామి తీర్థయాత్రలు చేస్తూ యీ ప్రాంతానికి చేరుకున్నారు. శుకుడు వారినక్కడనే వుండమని, వారిని పూజించాడు. తన సంకల్ప మాత్రంవలన 108 మందిని సృష్టించి వారిని కృష్ణమందిరంలో పూజకు, తిరుమలలోని శ్రీవారిసేవకు నియోగించాడు. వారి కుటుంబ సభ్యులు కృష్ణమందిరంలో పూజలు నిర్వహించేవారు. ఈ పూజాదులకు చెందినదే తిరుచానూరు అగ్రహారం. వారిలో శ్రీనివాసాచార్యులనే ఆయన తక్కినవారికి కూడా అగ్రహారం నిర్మించాడు. ఈ మందిరం నిర్మించిన వారెవరో తెలియదు.

**7. తిరుచానూరు శ్రీపద్మావతీ అమ్మవారి ఆలయం:** తిరుచానూరు పద్మావతీ అమ్మవారి ఆలయం (తిరు-శుక-నూర్, శ్రీశుక-పురి అనే ప్రసిద్ధికెక్కిన వ్యవహార నామంగలది) యేడవ ఆలయంగా ప్రస్తావించబడినది. ఆలయ సంచారాలకి యేర్పాటు చేయబడిన సొమ్ము 80-17-19 పూలీలు.

ఆలయ కమతపు సొమ్ము 66-23-26 పూలీలు, కానుకల కమతపు సొమ్ము 57-8-60 పూలీలు, మొత్తం సొమ్ము 204-4-25 పూలీలు; ధర్మాల ప్రతినిధులనుండి వచ్చే ఆదాయం 368 పూలీ, 35 మైలీ, 9 కాసులు. స్థానికులు, స్థానికేతరులు యిచ్చిన కానుకల సొమ్ము దీపదర్శనానికి, శుక్రవారంనాడు పూజాదికాలకు వినియోగించేవారు.

మేళతాళాలవారికి ఆలయంనుండి జీతం లభించేదికాదు. ఈనామ్ భూములు కూడా వుండేవికావు. వారికి చాలీచాలని కొద్దిపాటి ప్రసాదం మాత్రం యివ్వబడేది. అందువల్ల రోజుకి మూడుసార్లు జరిగే పూజ కార్యక్రమాలలో సేవలందించేవారు కారు. పూజ జరిగే సమయంలో వాద్యంవరకే వారి సేవలు

పరిమితమయ్యాయి. అంతేకాదు. ఈ ప్రదేశం గొప్ప ధార్మిక కేంద్రం. అక్కడ నిత్యపూజలు, వారానికొక్కసారి జరిగేపూజలు, మాసంలో, వత్సరంలో జరిగే పూజలు వుండేవి. అందువల్ల మేళగాళ్ళకు జీతాలిస్తే, అన్నీ సక్రమంగా జరుగుతాయి.

ఆలయంలో యిద్దరు ధర్మకర్తలుండేవారు. వారు సంభారాలు తీసుకుని వంటవారికి నివేదనలు తయారు చేయడానికి యిచ్చేవాడు. ఒక అర్చకుడు, బొక్కసం మనిషి, ఒక వంటవాడు వుండేవారు. వీరికితోడు, కృష్ణాపురం 'పాళేగార్' ఉద్యోగి ఒకరు తిరుపతినుండి సంచారులు తీసుకునివచ్చి, శుభ్రంచేసి వంటవారికి అందించేవాడు. మేళగాళ్ళు, పల్లెకు చెందిన గణకుడు కూడా వుండేవారు.

అర్చకుడు ఉదయం 8 నుండి 10 వరకు మధ్యాహ్నం 11 నుండి 12 వరకు, రాత్రి 8 నుండి 10 వరకు పూజలు, అటుపిమ్మట ఏకాంతసేవ నిర్వహించేవాడు. శుక్రవారంనాడు అభిషేకంవంటి ప్రత్యేక పూజలు, దేవతా విగ్రహాల ఊరేగింపు వుండేవి.

ఈ ఆలయం తొండమాన్ చక్రవర్తి కాలంలో నిర్మించబడింది. దానికి 55 సంవత్సరాల ముందు తారణ నామ సంవత్సరంలో (అంటే సుమారు క్రీ॥శ॥1764 నాడు) నిజాం-ఉద్దౌలా సైన్యం గ్రామంలోకి చొచ్చుకునివచ్చి, ఆలయాన్ని ధ్వంసంచేసి, ప్రధాన విగ్రహాన్ని రూపులేకుండా చేశారు. తరువాత వచ్చిన పార్థివ నామ సంవత్సరంలో (క్రీ॥శ॥1765) ముస్తజారు (కార్యనిర్వహణాధికారి) అయిన వైద్యుల తిరుమలవారు అనుమతితో దేవాలయం మేనేజర్లు చెన్నపట్టణంలో నివసించే దుబాషీ వాచ నారాయణపిళ్ల అనే ఆయనకు కలసి ప్రాకారాన్ని పునర్నిర్మించారు. ఒక కొత్త విగ్రహం చేయించి ప్రతిష్ఠించారు. తిరుచ్చిలోనో, తిరుపతిలోనో వున్న పాత ఉత్సవ మూర్తి, తక్కిన మూర్తులు తిరిగి తెప్పించి ఆలయంలో పునఃప్రతిష్ఠించాడు.

**8. తిరుచానూర్ సూర్యనారాయణ స్వామివారి మందిరం:** ప్రస్తావించ బడిన 8వ మందిరం తిరుచానూర్‌లోని శ్రీ సూర్యనారాయణ స్వామివారిది. సర్కారు వారినుండి ఆలయానికి యేవిధమైన ఆర్థిక సహాయమూ అందలేదు. వెచ్చాలకు గాను 6-33-60 పూలీలు, 3-28-10 పూలీలు భూమినుండి లభించే కమతంగాను, మొత్తం 10-16-70 పూలీలు లభించేవి. తిరుపతికి చెందిన పత్తుతాతాచారి అనే అర్చకుడు (కోదండ రామస్వామివారి ఆలయానికి సంబంధించిన) ఈనామ్ భూమిని అనుభవించేవాడు. అతని గుమస్తా రోజుకొక్కసారి మాత్రమే ఆలయంలో పూజ చేసేవాడు.

ఇది ఒక పురాతనమైన సంస్థ. తిరుమల వేంకటేశ్వరుడు పద్మసరోవరం వద్ద పద్మావతీ దేవిగూర్చి తపస్సు చేయగా సరస్సునుండి ఒక స్వర్ణకమలం ఉద్భవించింది. ఆ మొగ్గ పూచేందుకు అనుగుణంగా సూర్యకాంతి లభించేలా సూర్యనారాయణస్వామి వారు వచ్చారు. ఆయన ఆలయం రాతితో కట్టబడింది.

**9. తిరుపతి కపిలేశ్వరస్వామివారి ఆలయం:** తొమ్మిదవదిగా ప్రస్తావించ బడిన ఆలయం కపిలేశ్వరస్వామివారిది. సర్కారునుండి ఆలయానికి లభించే భృతి 50-11-20 పూలీలు. ధర్మాలనుండి యేవిధమైన సహాయంలేదు. దానికెవరూ ధర్మకర్తలేదు. దాని గర్భగుడి, రంగమంటపం, యితరభాగాలు

రాతితో కట్టబడ్డాయి. ప్రదక్షిణం, మహాద్వారం, స్తంభాలూ-యివన్నీ కలపతో చేయబడినవే. ఆలయంలో ఒక అర్చకుడు, అతని గుమస్తా విధులు నిర్వహించేవారు. దేవాలయాన్ని కాపలా కాయడం కరకంబాడి 'పాళేగార్' బాధ్యత. రోజుకి ఒకసారి పూజ నిర్వహించబడేది. ఆలయంలోని దైవం కపిలేశ్వరస్వామి కపిలమహామునికి దర్శనమిచ్చాడు. ఇక్కడ స్వామి స్వయంభువు. ఆలయం పురాతనమైనది. తొండమాన్ చక్రవర్తి కాలంముందే దీన్నెవరు నిర్మించారో తెలియదు.

**10. తిరుపతి హనుమంతరాయస్వామి గుడి:** కపిలతీర్థానికి వెళ్ళే తోవలో హనుమంతరాయస్వామివారి ఆలయం ఒకటున్నది. ముస్తజార్ శ్రీనివాసాచారి వేదాంతపుర అగ్రహారంలో ప్రతిష్ఠించటం నిమిత్తమై విగ్రహం చెక్కించాడు. ఆ స్థలంలో విగ్రహానికి పూజలేదు. అంతేకాదు, గ్రామంలో అగ్నితో ఒక దుర్ఘటన కూడా జరిగింది. అందువల్ల గ్రామీణులు తమ గ్రామంనుండి తెచ్చి కపిలతీర్థానికి వెళ్ళేతోవలో దాన్ని ప్రతిష్ఠించారు. మొదట్లో, ఒక బైరాగి దానికి పూజలు చేసేవాడు. 40 సంవత్సరాల క్రిందట (క్రీ॥శ॥1780)లో వేంకటేశ్వరస్వామిని దర్శించిన మదరాస్‌కి చెందిన ఒక గుజరాతీ యీ ఆలయాన్ని కలపస్తంభాలతో నిర్మించాడు. ఫస్లీ 1209 (క్రీ॥శ॥ 1801లో)లో అప్పటి ముస్తజారువద్ద పనిచేసే గుమస్తా (సామిసెట్టి) దిన వెచ్చాలు అందజేసేవాడు. ఇంగ్లీషు కంపెనీవారు దానిని హస్తగతం చేసుకున్నప్పుడు, ఈ విధానాన్ని అనుమతించారు. (ఆ విధంగా 20-4-13 పూలీల విలువగలిగిన దినవెచ్చాలు అమలులోవుండేవి).

**11. తిరుపతి సంజీవరాయస్వామి దేవాలయం:** 11 వ ఆలయం సంజీవరాయ స్వామివారిది. (సంజీవనీ పర్వతం-జీవనదాన మివ్వగలిగిన మూలికతో వున్నది- ఆంజనేయస్వామివారు దీన్ని తీసుకుని వచ్చినట్టుగా). తిరుపతిలోని గాంధీరోడ్డులోని శ్రీహాథీరాంజీ మఠానికి ఎదురుగా, ఉత్తరపు వరసలో వున్నది. మొదట ఈ విగ్రహాన్ని ఖాళీగావున్న మంటపంలో యేపూజ లేకుండా వుంచేవారు. ఫస్లీ 1204 (క్రీ॥శ॥1795లో) అమీర్ కేసరిసింగ్ దీనికి ప్రాణప్రతిష్ఠచేయించి దినవెచ్చాలు యేర్పాటు చేశాడు. దీన్ని అనుమతించిన ఇంగ్లీష్ కంపెనీ దాన్ని కొనసాగించారు కూడా.

**12. తిరుపతి మణవాళమహాముని ఆలయం:** 12వ గుడి ఉత్తరద్వారం వద్ద గోవిందరాజస్వామివారి ఆలయానికి తూర్పున వున్న మణవాళ మహామునిగుడి. సర్కారు వద్దనుండి దాని కంటే ఆర్థిక సహాయం 2-22-8 పూలీలు. కమతంద్వారా లభించేది 3-3-41 పూలీలు; యితర ఆదాయం 34-1-29 పూలీలు; మొత్తం 37-4-70 పూలీలు.

దాని గర్భగుడి, మంటపం రాతితో కట్టబడినవి. వంటశాల, ఇటుకల తోను, స్తంభాలు మట్టితోను చేయబడ్డాయి. ఇక్కడ పూజ రోజుకొక్కసారి మాత్రమే జరిగేవి.

ఈ ఆలయం **ధర్మకర్త ఆచార్య పురుషవీరవల్లి అప్పలాచార్యులు. అతని తరువాత వీరవల్లి అరంగన్ వరదయ్య ధర్మకర్తగా వ్యవహరించాడు.** 400 సంవత్సరాల క్రిందట తన ఇనామ్ భూమిలో, సిందూర హనుమంతరాయ స్వామి మందిరం ప్రక్కన ఒక గుడికట్టాడు. కపిలతీర్థం దారిలోవున్న ఈ గుడిలో

విగ్రహానికి ప్రాణప్రతిష్ఠ జరుపబడింది. దాని పొలిమేరలు నాశనం అయిన పిమ్మట, అతని వంశీకుడయిన కోనప్పాచారి 200 సంవత్సరాల క్రిందట దానిని తీసుకొనివచ్చి సన్నిధి వీథిలో వున్న గోవిందరాజస్వామివారి ఆలయపు రెండవ ప్రాకారం బయటవున్న మంటపంలో కట్టబడిన ఒక మందిరంలో ప్రతిష్ఠించాడు.

**13. తిరుపతి నమ్మాళ్వార్‌గుడి:** 13 వ గుడి నమ్మాళ్‌వారిది. తిరుపతిలోని గోవిందరాజస్వామివారి దేవాలయానికి ఉత్తరంగావున్న వీథిలో ఉత్తరపు వరసలో వున్న నమ్మాళ్వార్ గుడి సర్కారునుండి దానికి లభించే ఆదాయం 13-2-0 పూలీలు. ఈ ఆలయం రాతికట్టడం. దీనికి యేధర్మకర్త లేడు. రోజులో ఒకసారి పూజ జరిపి రాత్రిపూట దీపం వెలిగించేవారు. ఈ గుడి కోనేరి మహారాయలు కట్టించినది.

**14. తిరుపతి వేదాంత దేశికునిగుడి:** 14వ గుడి వేదాంత దేశికునికి సంబంధించినది. సర్కారునుండి దీనికి దక్కే ఆర్థికసాయం 9-28-8 పూలీలు. భూకమతాలవల్ల లభించే పైకం 8-33-60 పూలీలు. ఉభయాలకు లభించేపైకం 4-13-8 పూలీలు. దాని ధర్మకర్త తాతాచారి రోజుకొక్కసారి పూజ నిర్వహించేవాడు. గోవిందరాజస్వామివారిని తెచ్చినప్పుడు, వారిని ప్రతిష్ఠించిన ఆస్థానమంటపం పెద్దది. 400 సంవత్సరాలక్రితం ఆనాటి పూజారి ముత్తాత అయిన మాడభూషి వీరరాఘవాచారి ఆలయం గర్భగుడిని కలపస్తంభాలతో నిర్మించాడు. నేల చదునుచేసి, దేశికుణ్ణి స్థాపించి, దానాల సహాయంతో పూజలు జరిపించాడు. 100 సంవత్సరాల క్రిందట బ్రహ్మ తంత్ర స్వామి దానికి ముందు ఒక విశాలమైన మంటపం నిర్మించాడు. ఇది ఉత్తరానికున్నది. దీనికి ముందుభాగంలో ఒక నాలుగు స్తంభాలమంటపం కూడా నిర్మించాడు. 60 సంవత్సరాల క్రిందట ముస్తబూరు శ్రీనివాసాచార్యులు గర్భగుడి కట్టించాడు (వాటి గోడలతో సహా). నేలచదునుచేసి సర్కారునుండి సహాయం అందేలా చేశాడు. రికార్డులపరంగా ఆనాడు పూజారిగావున్న శేషాద్రి అయ్యంగార్, మాడభూషి తామరపు తాతాచార్యుల తరపున గర్భగుడిచుట్టూ స్తంభాలతో కూడిన ప్రదక్షిణం నిర్మించాడు. ఈ గుడి ఉభయాలకోసం ఈనామ్ భూములు కలిగివున్నవి.

**15. ఉలగాళ్వార్ (పిళ్లై లోకాచార్యులు) గుడి:** గోవిందరాజస్వామివారి ఆలయంలోవున్న 15వ గుడి ఉలగాళ్వార్. దాని ఖర్చులలో దీపానికి 0-40-24 పూలీలు యివ్వబడేవి. గోవిందరాజస్వామి అర్చకుని వద్ద పనిచేసే గుమస్తా ఆలయంలో ఉదయం ఒకసారి, రాత్రి ఒకసారి పూజచేసే వాడు. కందాళ అప్పలాచారి, గోవిందాచారి అనే యిద్దరు పరిచారకులు వంతులవారీగా సేవలందించేవారు. గోవిందరాజస్వామి ఆలయంనుండి కొనివచ్చిన నాలుగు అన్నం కబళాలు ఉదయం, రాత్రి నివేదనలకు వాడేవారు. ఆళ్వార్ ఉత్సవ విగ్రహం గోవిందరాజస్వామి 'ప్రదక్షిణం'లో దక్షిణంవైపు వుండేది.

**15. (a) ముగ్గురు ఆళ్వార్‌లు:** పెరియాళ్వార్, తొండరడిప్పొడి ఆళ్వార్, తిరుప్పాణి ఆళ్వార్‌ల గుడులు రెండవ తరగతి ప్రాధాన్యం సంతరించుకున్నాయి. ఈ ముగ్గురు ఆళ్వార్‌ల సేవలు కందాళ అప్పలాచారి, తదితరుల పర్యవేక్షించే వారు (అలిపిరిలోని పెరియాళ్వార్ సేవకూడా). ఇవి పురాతన మందిరాలు. 300 సంవత్సరాల క్రిందట రామస్వామి మహారాయలు ఆలయం, గోపురం, ప్రాకారంలో సహాకట్టించారు.

150 సంవత్సరాలనాడు ఒక 'లాలా' అక్కడకి వచ్చాడు. పరిచారకుని ముత్తాత అప్పలాచారి యిద్దరు ఆళ్వార్‌ల మూర్తులు గోవింద పట్టణానికి (తిరుపతికి) తీసుకుని వచ్చాడు.(పెరియాళ్వార్, తొండరడిప్పొడి ఆళ్వార్‌లది). తిరుప్పాణి ఆళ్వార్ విగ్రహం పంచములు కైవసం చేసుకున్నారు. ప్రధాన విగ్రహం పాత ఆలయంలోనే వుండిపోయింది. తిరుప్పాణి ఆళ్వార్, తొండరడిప్పొడి ఆళ్వార్ విగ్రహాలు కొంత కురూపం సంతరించుకున్నాయి. ప్రధాన విగ్రహాలు చాలాకాలం పూజలందుకోలేదు. సర్కార్‌వారి అనుమతితో గోవిందాచారి గోవిందరాజస్వామివారి ఆలయంలో దక్షిణ మంటపంలో వాటిని ప్రతిష్ఠించాడు; కలపద్వారాలు నిర్మించాడు, విగ్రహాల నివేదనలకు, దీపాలంకరణకు ఏర్పాట్లు చేశాడు.

**15 (b) తిరుమంగైయాళ్వార్ గుడి:** ప్రస్తావనలోకి వచ్చిన యింకో చిన్నగుడి కపిలతీర్థానికి పోయేదారికి తూర్పున వున్న తిరుమంగై–ఆళ్వార్ గుడి. ఇది శిథిలమై వుండేది. చిన్న జియ్యంగార్ నిర్వహణలో వుండేది. ఈ ఆలయం కృష్ణరాయలు కట్టించాడని ప్రతీతి. దానికి దగ్గరలో నివాసగృహాలేవి లేవు. అందువల్ల 50 సంవత్సరాల క్రిందట ఉత్సవ విగ్రహం తెచ్చి పెరియాళ్వార్, తదితరులవద్ద ఉంచేరు. వాటితోబాటు, ఈ గుడికి పూజ, నైవేద్యం, దీపారాధన జరిగేవి. ప్రధాన విగ్రహానికి రూపం ఏర్పడింది.

**15(c) కులశేఖరాళ్వార్‌గుడి:** కులశేఖరాళ్వార్‌గుడి కూడా ప్రాధాన్యం తక్కుగా గల ఆలయాల జాబితాలో చేర్చబడింది. అయోధ్య రామానుజ జియ్యంగారు చేరి ఆపబడి, కపిలతీర్థానికి పోయేదారిలో పశ్చిమాన వుండేది. పెద్దలచేత నిర్వహించబడేది. ఈ గుడి కూడా ఊరికి దూరంగా వుండటంవల్ల, శిథిలమైపోయి వుండటంవల్ల, దానిలోని ఉత్సవ విగ్రహాన్ని తీసుకొనివచ్చి పెరియాళ్వార్ గుడిలో భద్రపరచారు. బోయలు ఈ గుడిలో సేవలు నిర్వహించేవారు. తక్కిన విగ్రహాలతోబాటు దీనిని కూడా పూజ జరుపబడేది.

**16. తిరుమల నంబిగుడి:** గోవిందరాజస్వామి ఆలయంలోని తిరుమలనంబి గుడి 16వ గుడిగా లెక్కించబడేది. సర్కారునుండి 1–38–67 పూలీలభత్యం, తోలప్పాచారి తరపున లభించే ఉభయం 25–12–49 పూలీలవరకు వుండేది. ఇది తోలప్పాచారికి సంబంధించినసేవ, గోవిందరాజ స్వామి ఆలయ అర్చకుని గుమస్తా యీ ఆలయంలో ఉదయం ఒకసారి, రాత్రి ఒకసారి పూజ చేసేవాడు. గోవిందరాజ స్వామి ఆలయం నుండి తెచ్చిన గుండ్రని అన్నం కబళాలు యిక్కడ నివేదనకు ఉపకరించేవి.

**17. కూరత్తాళ్వాన్‌గుడి:** కూరత్తాళ్వాన్‌గుడి 17 వ గుడిగా పేర్కొనబడేది. సర్కారునుండి దీనికి లభించే దిట్టం 3–39–0 పూలీలు, భూముల కమతంద్వారా లభించే పైకం 23–12–53 పూలీలు, మొత్తం 27–6–53 పూలీలు. అర్చకుని గుమస్తా పగలొకసారి, రాత్రి ఒకసారి పూజ నిర్వహించే వాడు. కూరత్తాళ్వాన్ మిగిలిన సేవలు చేసేవాడు. పూజ జరిపే రెండుసార్లు నాలుగు కబళాల అన్నం నివేదన చేసేవారు. వేంకటపతి రాయలకాలంలో అతని ధార్మిక గురువైన **దొడ్డాచార్య భట్టరు** (కూరత్తాళ్వారు వంశీకుడు) ఒక గుడికట్టి అందులో తన అగ్రహారంలో తన బంధువుల సహకారంతో ఒక విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. **భక్తిసారపురం అనే పేరుగల అగ్రహారంలో తిరుమలేశ ఆళ్వాన్ విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు.**

కొంతకాలానికిది శిథిలావస్థకు చేరుకుంది. **ముస్తజూరు రఘునాథాచార్యుల** కాలంలో, యీ ప్రదేశాన్ని **సయ్యద్ మొహమ్మద్ఖాన్** సందర్శించినప్పుడు భట్టర్ కుటుంబానికి చెందిన **కృష్ణమాచారి** తన అల్లుడు **మాడభూషి గోవిందాచారికి** శాసనం (బదిలీకి సంబంధించిన పట్టా అయివుండవచ్చు) అందజేశాడు. 'కీలక' నామ సంవత్సరంలో గోవిందాచారి రెండు విగ్రహాలను గోవిందరాజ స్వామివారి మంటపానికి బదిలీచేసి వాటిని ప్రతిష్ఠచేశాడు.

**18. భాష్యకారర్గుడి:** 18వదిగా లెక్కింపబడిన గుడి భాష్యకారునిది. సర్కారునుండి, ఉభయాలద్వారా దీనికి లభించే భత్యం 18-4-32 పూలీలు. మధ్యాహ్నం, రాత్రి అర్చకుడు జరిపే పూజలో 4 కబళాల అన్నం నివేదించేవారు. **వెంగాపురం రాఘవాచారి** యితర సేవలు నిర్వహించేవాడు. ఈ సేవలు గౌరవ ధర్మకర్త పెదజియ్యంగారు తరపున నిర్వహించబడేవి. నివేదన చేయబడిన అన్నం పరిచారకునికి చెందేది. ఈ ఆలయం **కడియ యాదవరాయలచే నిర్మింపబడింది.** భాష్యకారుని బంధువు, శిష్యుడూ అయిన ఎంబారు భాష్యకారుని విగ్రహాన్ని యిక్కడ ప్రతిష్ఠించాడు.

**19. తిరుమంగై ఆళ్వారుగుడి :** 19 వ గుడి తిరుమంగై ఆళ్వారుది. సర్కారునుండి 4-14-61 పూలీలు, ఉభయాలద్వారా 5-33-32 పూలీలు, మొత్తం 10-3-13 పూలీలు ఆలయానికి భత్యంగా లభించేవి. అర్చకుని గుమస్తా మధ్యాహ్నం, రాత్రి పూజచేసి 4 కబళాల వండిన అన్నం నివేదించేవాడు. కందాడై కుటుంబానికి చెందిన ఒకవ్యక్తి మిగిలిన సేవలు చేసేవాడు. ఆలయంలో యీ సేవలు ధర్మకర్త చినజియ్యంగార్ తరపున జరిగేవి. పూజచేసిన వ్యక్తికి యీ అన్నప్రసాదం లభించేది. కపిలతీర్థానికి పోయేదారిలో తూర్పుగ వుండే యీ గుడి శిథిలమైపోయింది. ఇది కృష్ణరాయలు కట్టించినట్టు వినికిడి. శిథిలమై, యేకాంతంగావుండి, దగ్గరలో మానవసంచారం లేకపోవడంవల్ల, ఉత్సవ విగ్రహం తెచ్చి పెరియాళ్వార్ మందిరంలో భద్రపరిచారు. అక్కడ తక్కిన ఆళ్వార్ల విగ్రహాలతోపాటు, యీ విగ్రహంకూడా పూజలందుకొనేది. ప్రధాన విగ్రహం కురూపం పొందింది.

ఈ పత్రం చివర దేవస్థానాల సంఖ్య 19 గా చెప్పబడింది. పెరియాళ్వార్, మిగిలిన రెండు (తిరుమంగై ఆళ్వార్, కులశేఖర ఆళ్వార్లని) 15 వ గుడి అయిన ఉలగాళ్వార్ సముదాయంలో చేర్చబడినవి. ఈ గుడులు శిథిలావస్థకు చేరుకోవడం, వాటిలోని ప్రధాన విగ్రహాలు కురూపం పొందడం, వాటి ఉత్సవ విగ్రహాలు **పెరియాళ్వార్ గుడి**లోనే వుండడం దీనికి కారణం. పెరియాళ్వార్ గుడి గోవిందరాజ స్వామివారి ఆలయానికి ఉత్తరాన, రెండవ ప్రాకారం తూర్పున ఆనుకుని, ఆలయ ప్రవేశద్వారం వద్ద వున్నది.

## పైమాయిషీ జమ, ఖర్చులు

ఫస్లీ 1227లో అనేక ప్రాంతాలకి చెందిన కరణాలు మరాఠీ భాషలో అనేక దేవాలయాలు, యితర కట్టడాలకు సంబంధించిన పైమాయిషీ జమ, ఖర్చులు వారి సంతకాలు, తాలుకా ఆఫీస్లోని శిరస్తదార్ సంతకాలతో, అగస్టు 14వ తేదీ, క్రీ॥శ॥1819లో అలబ్ధ గోవిందరావు వివిధ ఆలయాల్లో అనేక సన్నిధులు కొలతలు, వాటి నిర్మాణం, వాటి ఉపయోగం గూర్చిన వివరాలు పొందుపరచాడు.

**1. వేంకటేశ్వరాలయం:** మొట్టమొదటగా తిరుమల వేంకటేశ్వరస్వామి ఆలయంలో, దాని గర్భగుడిలో, దాని అంతరాలయంలో, మీదనున్న విమానంతో, ముఖమంటపం పేర్కొనబడ్డాయి. అటుపిమ్మట చెప్పబడినవి ఏకాంత సేవాగృహం, తరువాత శ్రీరామచంద్రస్వామివారిసన్నిధి, దానికి దగ్గరలో తూర్పున ముఖాంతరాల మంటపం, చివరగా రంగమంటపం (అంతర్ ప్రదక్షిణతో కూడినది) ఆగ్నేయదిశగా మొదలిడి డోలమంటపం నుండి గర్భగుడి ద్వారాపోతూ, ఉత్తరాన సేనైమొదలియార్, దాని సమీపంలో వెలుపలికి పోయేదారి. ఇవన్నీ కలసి ఆలయానికి కేంద్రబిందువులుగా వుండేవి.

ఈ సముదాయానికి ఆగ్నేయంగా 'స్వయంపాకశాల' యిక్కడనుండి పశ్చిమంగా కళ్యాణమంటపం వరకు ఒక మార్గం వుండేది. ఆ దారిలో ఒకవరుస 10 రాతిస్తంభాలు ముందుకి, మూడు గదులు వెనుక భాగంలోనూ – ఒకటి దీపాలకు, ఒకటి యాగశాల, యింకొకటి మెహతాజీసర్కార్ పర్యవేక్షణ లోనూ వుండేవి. కళ్యాణమంటపంలో ఒక పలుచని రెండు స్తంభాలతో చెక్కబడిన సింహాసన మంటపం, మలయప్పస్వామి వారికొరకు ఒక చిన్న మందిరం (బ్రహ్మోత్సవాలలో ఉపయోగించేలా) దాని వెనుకనే ఒక చిన్న గర్భగృహం వున్నాయి. ఇవన్నీ విమానంతోబాటు వున్న విమాన ప్రదక్షిణానికి దక్షిణంలో వొకయెత్తైన వేదికమీద వున్నాయి.

ఈ ప్రదేశానికి పడమటనున్న వేదికమీద కొన్ని గదులున్నాయి; ఒకటి రఘోజీ భోంస్లే పల్లకీకి, వాహనాలకి, రెండవది నడిగడ్డపాలెం కుటుంబీకుల వాహనాలకు, మూడవది సురపుర రాజ్యవాహనాదులకు, నాలుగవది వెంకటగిరిరాజా ప్రసాద వితరణార్థం, ఐదవది పాడగపు కుటుంబం అధీనంలోనూ, ఆరవది కస్తూరి/జవ్వాది తైలం తయారు చేయటానికీ నిర్దేశించబడ్డవి.

విమాన ప్రదక్షిణానికి ఉత్తరానగల వేదిక మీద గల గదులలో వంటవాళ్ళు, మైసూర్ రాజ్యం సంచారాలకు, మట్లదళపతి అనుయాయులు, కైకాలబంట్రోతులు, వగపడి, తాళ్ళపాక సంగీతం విద్వాంసులు చెక్కబడిన తామ్రఫలకాలు, దేవతలవస్త్రాలు నిక్షిప్తం చేయడానికి 'సభ–అరా' (సభైరా), భాష్యకారుని మందిరం, మంచపు అర (దేవుని మంచం దాచేగది), కానుక అర (సందర్శకుల కానుకలుంచేగది), బొక్కసం కాపాడేవారి పణ్యారంగది, గంధం అరగదీసేగది, గుడి ప్రాసాదం దాచేగది, దానికి దక్షిణాన తూర్పు అంచున యోగనరసింహస్వామి ఆలయంవుండేవి.

చిన్నగోపురం, వంటశాల క్రిందనున్న లోపలదారికి, ఆగ్నేయమూలకి మధ్య వరదరాజస్వామివారిగుడి వుండేది.

రెండవ సంచారస్థలం సంపంగి ప్రదక్షిణం (అన్నింటిలోను పెద్దదైన బాహ్యగోపురం క్రిందనున్న ద్వారంవద్ద రక్షకభటుల ద్వారంనుండి మొదలయ్యే లోపలి ప్రాకారం) చుట్టూ వున్న అచ్యుతరాయలు, కృష్ణరాయలు విగ్రహాలు తూర్పు ప్రాకారపు గోడ వద్దనున్నవి) ప్రస్తావించబడ్డాయి. దక్షిణ దిక్కున కాగడాలు, దివిటీలు, మైసూరు ప్రభుత్వవాహనాలు, రంగనాయకుని వంటశాల, విమానం (ప్లాస్టర్‌తో చేసినది) మీదనున్న అతని మందిరం, దానినానుకుని పడమటదిక్కున పిండిశాల (బియ్యం పిండి చేసేగది), బహిరంగ మంటపం;

పడమరదిక్కున ఒక సరుకులు భద్రపరచేగది, దాని ద్వారంవద్ద వజ్రనాడి అనే పేరుగల నీరు ఊరే చిన్న దిగుడుబావి వుండేవి. ఉత్తరాన పణ్యారం తయారుచేసే వంటశాల; పూలదండలు కట్టబడివున్న 'యమునోత్తర'; చివరగా నాలుగంతస్థుల సువర్ణమంటపం వుండేవి. పడమటనున్నది రజతమంటపం. సువర్ణమంటపం మధ్యలో ఉత్తరభాగాన గల మంటపం ద్వారాన్ని ఆనుకుని వున్నది. ఈ మంటపంలో పోతపోసిన మూడువిగ్రహాలు - ఒకటి కృష్ణరాయలవారిది, యింకొకరెండు ఆయన దేవేరులవి. ప్రతిష్ఠించబడ్డాయి. దక్షిణభాగాన అచ్యుతరాయలు, అతని దేవేరి విగ్రహాలున్నాయి.

ప్రవేశద్వారం తూర్పునుండి పడమరకు 33 అడుగులు, ఉత్తరనుండి దక్షిణానికి 31 అడుగులు, 15 అడుగుల యెత్తుగలది, కలశాలు (అలంకరించబడినది) గోపురాలతో......తూర్పునుండి పడమటకు 33 అడుగుల పొడవున్నది. చ 21 అడుగుల వెడల్పు (ఉత్తరంనుండి దక్షిణంవరకు) గలది, 51 అడుగుల ఎత్తుగలది.

తిరుమలరాయమంటపం 54 స్తంభాలతో 3 అంచెలుగా నిర్మించబడింది. ఉత్సవమూర్తులను కూర్చోబెట్టడానికి వీలుగా ఎత్తైన సింహాసనమంటపం వుంది. ఈ మంటపం 6×6 చదరపు అడుగుల నల్లరాతితో చేయబడింది. నాలుగుస్తంభాలమీద నిలబెట్టబడింది. సున్నంతో చేయబడిన ఒక విమానం కలిగివుంది. రెండవ దిగువ మంటపం 30 స్తంభాలు గలది. తూర్పునుండి పడమరకు 33 అడుగులు వెడల్పు, ఉత్తరంనుండి దక్షిణానికి 39 అడుగుల పొడవు, మూడవ దిగువ మంటపం 16 స్తంభాలు కలిగి, 24 అడుగుల ఎత్తు కలిగి, ఉత్తరంనుండి దక్షిణానికి 33 అడుగులు, తూర్పునుండి పడమరకు 30 అడుగుల వెడల్పు కలిగివున్నది. వాటి స్తంభాలు అందమైన శిల్పసంపదతో అలరారుతున్నాయి.

ధ్వజస్తంభమంటపం ముందున్న తిరుమలరాయమంటపం (బలిపీఠం, అలంకరించబడిన ధ్వజస్తంభం) ప్రస్తావించబడింది.

తోడరమల్లు, పోతపోసిన విగ్రహాలు ప్రతిష్టింపబడి నాలుగు స్తంభాలపై నిలబెట్టబడిన ఇటుకలతో నిర్మించిన మంటపం ప్రస్తావన చేయబడింది.

తోడరమల్లు మంటపానికి, పూలబావి (నిర్మాల్యాలు – పూలు, పూలదండలుకూడా యిందులో వేసేవారు. అలంకరణ తరువాత వీటి నెవరు ధరించరాదనే ఉద్దేశ్యంతో యిలా చేసేవారు)కి మధ్య సువర్ణమంటపాన్ని ఆనుకుని తూర్పు దిక్కున రజతమంటపం; తోడరమల్లు మంటపంవెనుక వెంకటపతిరాజు విగ్రహంవున్న 9×9 చదరపు అడుగుల వైశాల్యంతో, నాలుగు స్తంభాలమీద నిలబెట్టిన మంటపం, వుండేవి.

**2. గోవిందరాజస్వామివారి గుడి:** పైమాయిషీ గణాంక పట్టికలో గోవిందరాజ స్వామివారి ఆలయం యీ విధంగా వర్ణించబడింది. ఈ గుడి రాతికట్టడం. తూర్పుకి అభిముఖంగా వుంటుంది. గర్భగుడి తూర్పునుండి పడమరకు 15 అడుగులు, ఉత్తరంనుండి దక్షిణంవరకు 21 అడుగులు; ఎత్తు 12 అడుగులు. శేషతల్పం (ఆదిశేషుని శరీరం తల్పంగా చేయబడిన) మీద శయన ముద్రాంకితుడైన స్వామి శిరస్సుపై

ఛత్రంలా తామ్రఫలకంతో కప్పబడిన శేషుని ఏడుపడగలు వుంటాయి. చిత్రకూటం నుండి తెచ్చిన రాతి విగ్రహంతో చేయబడింది. ఒక సాలెగ్రామం (గండకీ నదిలో యిటువంటి రాళ్ళుచాలా ఆకారాలలో దొరుకుతాయి. మంచి శుభచిహ్నాలతో కూడిన అటువంటి రాళ్ళని విష్ణుస్వరూపంగా భావిస్తారు), శిరస్సునుండి పాదాలవరకు సున్నంతోను, ఉదర మధ్యంనుండి పాదాలవరకు వెండిరేకుతో కప్పబడి వున్నది. పల్లపుస్థలం మీద చతుర్ముఖుని మూర్తి చెక్కబడి వున్నది. దీనికితోడు శ్రీదేవి రాతి విగ్రహం (పూర్వాభి–ముఖంగా వుండేది), స్వామి పాదాలవద్ద ఉత్తరదిక్కున; భూదేవి విగ్రహం (ఉత్తరాన వున్నది) దక్షిణాభి ముఖంగా వుండేది; మధుకైటభ రాక్షసుల రెండు రాతివిగ్రహాలు అతని పాదాలవద్ద ఈశాన్యమూలలో నిలబడి వుండేది. దీని ఈశాన్య ప్రదక్షిణలో సేనై ముదలియార్‌గుడి; కానుకలగది ఆగ్నేయమూలకు ఉండేవట.

గోవిందరాజస్వామి ఆలయాన్ని ఆనుకొని దక్షిణదిక్కున పేరెన్నికగన్న తిరువంది యాదవ పెరుమాళ్ (గోపాలకృష్ణుడు) గుడివున్నది. ఇది పురాతనమైనది. కాని, యిక్కడ ఏ విధమైన అర్చనలూ లేవు. కృష్ణుడు, అతని దేవేరుల విగ్రహాలు మాత్రమే ఇందులో ఉన్నాయి.

గోవిందరాజస్వామి ఆలయంలో సంజీవరాయస్వామి ఉత్సవమూర్తులు వుంచేవారు. ఇవి గుడికి ఎదురుగా వున్న తూర్పువీధిలోను; ఉత్తరపు వీధి అంటే బజారువీధికి దగ్గరలో వున్న ముఖ్యమైన మార్గంలోను ఉండేవి. పేటగుడి (కపిలతీర్థం దారిలో వున్న తిరుమంగై ఆళ్వార్ లేదా జియ్యంగార్‌గుడి అని పిలువబడేది) నుండి తేబడిన పట్టాభిరామస్వామి, అతని సోదరుడు లక్ష్మణుని విగ్రహాలు ఇందులోనివే.

ఈ రెండు ఆలయాలకు కలిపి వున్న ప్రదక్షిణం 66 అడుగులు (తూర్పునుండి పడమరవరకు); ఉత్తరంనుండి దక్షిణానికి 341/2 అడుగుల పొడవు, 12 అడుగుల వెడల్పు, 30 స్తంభాలతో కూడి ఉన్నది.

వంటశాల రంగమంటపానికి ఆగ్నేయంగా ఉన్నట్టు పేర్కొనబడింది. దాని పడమరకు పిండి తయారుచేసే గది; దాని పడమరకు రాతితో నిర్మించబడిన మేంజాన్ వేంకటేశ్వరస్వామి విగ్రహం, ఈ గుడికి పడమరన నలుగురు ఆళ్వార్‌ల విగ్రహాలు (పెదపేరి) ఆళ్వార్, తిరుమంగై ఆళ్వార్, కులశేఖర ఆళ్వార్, తొండరడిప్పొడి ఆళ్వార్‌లవి), కోదండరామస్వామివారిది, అతని భార్య సీతాదేవిది, అతని సోదరుడు లక్ష్మణునిది; వీని తరువాత యాగశాల, దాని ప్రక్కన విమానంతో కూడిన కళ్యాణమంటపం (దిగువన అధిష్ఠాన దేవతకోసం); వెలుపల తూర్పుదిక్కులో వేంకటేశ్వరస్వామిగుడి, దక్షిణాన గజేంద్ర వరదరాజస్వామి (గజేంద్రుణ్ణి మొసలి బంధంనుండి దయతో విముక్తుణ్ణి చేసిన విష్ణువు)తో కూడిన నమ్మాళ్వార్‌గుడి, వరదరాజ స్వామి వారితోబాటు మహాలక్ష్మి, (యిద్దరూ గరుడవాహనారూఢులై) ఉన్నాయి. వుంటాయి.

తూర్పున ప్రాకారపు గోడనానుకుని ఒకపొడవైన అంగణంలోని మంటపం (సుమారు 5 లేక 6 అడుగుల వెడల్పుగల ప్రాంతం)లో కోశాగారంకి సంబంధించిన ఉద్యోగులుండే గది ఒకటి ఈశాన్యమూలలో, దాని తరువాత కానుకల కమతందారు కానుకగది, ఆ తరువాత 'పల్లె' వారు తమ వస్తువులు

భద్రపరచుకొనేగది, దానికి దక్షిణాన, బలిపీఠానికి ఎదుట సంజీవరాయస్వామివారి ఆలయం, దానిపైనున్న ముఖమంటపంలో 6×6×8 ఘనపుటడుగుల ఒకగదిలో అక్కన్న *3 రూపుగల విగ్రహం (ఇటుకలు, సున్నంతో చేయబడినది. అక్కన్న ఒకప్పటి గోల్కొండ సుల్తానుకు ప్రధానమంత్రి. సుల్తాన్ అబ్దుల్‌హసన్ కుతుబ్‌షాకి (క్రీ॥శ॥ 1675-1687) చంద్రగిరి-తిరుపతి గవర్నరుగా వున్న తన సోదరుడు మాదన్నతో సహా సహాయకారి.

మీదచెప్పిన కట్టడాలన్నీ మీద చెప్పబడిన మొదటి ప్రాకారపు గోడ పరిధిలోనివి. తూర్పుకి, అలాగే పడమరకు యీ ప్రాకారం 234 అడుగుల పొడవు కలిగివున్నది. ఉత్తర, దక్షిణాలకు 183 అడుగుల పొడవు కలిగివున్నది. నాపరాతితో చేయబడిన భాగం 22 అడుగుల ఎత్తుగలది. 2 అడుగులు యిటుకలు, సున్నంతో తాపడంచేయబడి మొత్తం 24 అడుగుల ఎత్తు, 3 అడుగుల మందంగలది. లోపలిమార్గం (తూర్పుగోడ వద్ద) అంటే **తిరువంది - యాదవ పెరుమాళ్ గుడి**కి ఎదురుగా వున్నది తూర్పుకి 24 అడుగులు, ఉత్తరాన 27 అడుగులు, పొడవుగలది. 10½ అడుగుల ఎత్తుగలది. చుట్టూ 24 అడుగుల ఎత్తుగల గోపురంగలది.

ఉత్తరాన రెండవ ప్రాకారానికి వెలుపల (తూర్పున), బయటకుపోయే మార్గానికి దక్షిణాన తూర్పుకి అభిముఖంగా లక్ష్మీదేవి మంటపం వున్నది. 7½ అడుగులపొడవు గలిగి, ఎక్కడానికి మెట్లుగలిగి, తూర్పుకి 19½ అడుగులు, ఉత్తరానికి 33 అడుగులుగలిగి, 8 స్తంభాలతో వున్న 8 అంగణాలు కలిగివున్నది. పడమటి దిక్కులో దక్షిణానవున్న రాతిగోడ 4 అడుగులమందం, 10 అడుగుల ఎత్తుగలది.

ఈ ప్రధాన కట్టడానికి తోడు ఒక మంటపం నిర్మించబడింది. అది 4 అడుగులు ఏత్తైన అరుగు మీద 5 స్తంభాలతో తూర్పుకి 9 అడుగులు, ఉత్తరానికి 33 అడుగులు, తూర్పున 13 అడుగుల యెత్తుకలిగి వున్నది. దళవాయి అనం తప్ప ధర్మంగా 7½ అడుగుల యెత్తుకలిగి, ఉత్తరపు దిక్కులో ఆఖరి అంగణంలో వున్నది.

దానికి దక్షిణపు దిక్కులో 2 నాలుగు స్తంభాలమంటపాలు వున్నాయి. వీటికి తూర్పువైపున గోవర్ధనగిరిమంటపం అనే పేరుగల మంటపం మధురవేణమ్మ కట్టించింది.

---

*3 ప్రజల దర్శనానికి అనువుగా అక్కన్న విగ్రహం దానిస్థానం నుండి తప్పించి సిమ్మెంటుతో బాగుచేసి ఉత్తరమూలన పశ్చిమంలో స్థాపించారు. రుద్రాక్షలు ధరించి యజ్ఞోపవీతంతో అలంకరించబడిన ఈ విగ్రహం ముకుళిత హస్తాలతో ప్రణామంచేస్తూ నిలుచుని ఉంది. 6-3-1977 లో పార్థసారథి స్వామివారి ఆలయ ప్రతిష్ఠ జరిగినప్పుడు ఈ విగ్రహం, అదివున్న గది ధ్వంసం చేయబడ్డాయి. ముందుగా వున్న అక్కన్న రూపు ఈ మరమ్మత్తులతో మాయమయ్యింది. అంతవరకు ఒక పురాతనమైన ఆళ్వార్ విగ్రహం ఒకటి యిక్కడ వుండేది. శ్రీపార్థసారథి స్వామివారి గర్భగుడిలో ప్రతిష్ఠించబడిన ఈ విగ్రహం దాని స్వస్థానంనుండి తొలగించబడి యీనాడు అదృశ్యమైంది. మరెక్కడికో యీ విగ్రహాన్ని తరలించారని అంటున్నారు. కృష్ణుని దరిలోవున్న అతను పెరియాళ్వారేమో! -(గోపీకృష్ణ)

తరువాత చెప్పబడినవి రెండు 4 స్తంభాల మంటపాలు బాహ్యాగోపురం తూర్పున (ఆలయపు రెండవ ప్రాకారానికి) 10×10×25 ఘనపుటడుగులలో పైకప్పుకి కొక్కెములతో దేవతల ఊయల వ్రేలాడడానికి గొలుసులు, దానిపైన 7½ అడుగుల యెత్తుగల విమానం, దానికి దగ్గరలో ఒక కృత్రిమ జలపాతం వున్నాయి.

తూర్పుకి కొంచెం దూరంలో ప్రధానమైన వీథిలో మఠాధిపతులు కట్టించిన పెద్దగోపురం వుంది. దానిగుండా మార్గంగల దిగువభాగం తూర్పుకి 54 అడుగులు, ఉత్తరానికి 72 అడుగులు; 28 అడుగులయెత్తు కలిగి, 13 అడుగుల వెడల్పు కలిగివుంది. దానిమీద 7 అంతస్థులుగల గోపురం, ఒక్కొక్క అంతస్థులో రెండు ముఖద్వారాలు, ఒకటి తూర్పు ప్రక్కన, రెండవది పడమరన వున్నవి. ఇది యిటుకలతో, సున్నం నిర్మించబడింది. దీనియెత్తు 110 అడుగులు. ఇది ఆగ్నేయమూల కొద్దిగా ధ్వంసమైంది.

తరువాత గోవిందరాజస్వామి దేవాలయం బాహ్యప్రాకారం లేక రెండవ ప్రాకారంలోని గుడులు, యితర కట్టడాలు ప్రస్తావించబడ్డాయి. దక్షిణపు వరుసలో తూర్పు ప్రాకారం, గోడకు ఆనుకుని, లోపల పరిధిలో తిరుమల నంబిగుడి; దానికి తూర్పున భాష్యకారుని మందిరం; దాన్ని ఆనుకుని కూరత్తాళ్వార్ ఆలయం (తిరుమళిశై ఆళ్వార్ విగ్రహం ఉన్నచోట); తూర్పున గర్భగృహంతో కూడిన విశాలమైన మంటపం, 130½ అడుగులు తూర్పుకి, 69 అడుగులు ఉత్తరానికి, 12 అడుగులయెత్తు గలిగి, నెయ్యి, నూనె ఇవ్వచేయడానికి వీలుగా 14 బావులు కలిగివున్నవి.

ఉత్తరపు వరుసలో పిండి తయారుచేసే పురాతనమైన గది ఉన్నది. తూర్పుకి ఒక బావిముందు స్థలంలో **మధురకవి ఆళ్వార్ గుడి** వున్నది. పూలతోటకి మూడువైపులా మంటపాలున్నవి; బాహ్యాగోపురానికి ఆనుకుని తూర్పున ఉన్న మంటపం; పడమరకి అభిముఖంగా దిగువన 8 స్తంభాలతో ఒక మంటపం వున్నది. ఇది తూర్పుకి 15 అడుగులు, ఉత్తరానికి 26 అడుగులు వైశాల్యం కలిగివున్నది. మొదటి అంతస్థులో 1260 గణాలు గల ఒక మంటపం వున్నది. దానికి దగ్గరలో వున్న గోపురం రాతిమీద చక్రరూపం చెక్కబడివున్నది. దీనిని చక్రత్తాళ్వార్‌గా పూజించేవారు. ఇది తూర్పుకి 24 అడుగులు, ఉత్తరానికి 24 అడుగులు; 8 అడుగులయెత్తు, 20 స్తంభాలు కలిగి మెట్లతో అలరారుతున్నది.

రెండవ పరిధిలోవున్న తూర్పు ప్రాకారపు గోడతో ముడివడిన బాహ్యాగోపురం 33 అడుగులు ఉత్తరానికి, 27 అడుగులు తూర్పుకి; 17 అడుగులయెత్తు కలిగి ద్వారం కలిగి, ఇటుకలతోను, సున్నంతోను చెక్కబడిన గోపురం (33 అడుగుల యెత్తుగలది) కలిగివుంది. రెండవ ప్రాకారపుగోడలు తూర్పుకి 215 అడుగులు, ఉత్తరానికి 181 అడుగులు వైశాల్యంకలిగి, 24 అడుగుల యెత్తు కలిగివున్నవి.

**3. కోదండరామస్వామివారి ఆలయం:** తరువాత ప్రస్తావించబడినది తిరుపతికి ఉత్తరభాగంలో వున్న శ్రీకోదండరామస్వామివారి ఆలయం. అది **'సంగ బంది' శైలికి చెందినది.** రాతితో నిర్మించబడిన యీ కట్టడం పశ్చిమాభిముఖంగావుంది. దానికప్పటి పూజారి పట్టుతాతాచారి. రెండడుగులయెత్తుగల వేదికమీద

దాని గర్భగృహం రాతితో చెక్కబడింది. 24×24 అడుగుల చదరపు గదిలో 20 అడుగుల యెత్తున్న విమానం 10 అడుగులయెత్తుగా దీనిని నిర్మించారు. దానిలో 3 ప్రధాన విగ్రహాలు – కోదండరామస్వామి, శ్రీదేవి, లక్ష్మణుల విగ్రహాలు వున్నాయి. దానికి పడమరన నేలమీద నాలుగు తామ్రమూర్తులు–విష్వక్సేనుడు, ఆంజనేయుడు, నమ్మాళ్వార్, భాష్యకారులవి వున్నాయి. దక్షిణాన వున్న స్నపనమండపం ఉత్తరానికభిముఖంగా భాష్యకారుని గుడిలో రెండు శిలామూర్తులు (ఒకటిచిన్నది, ఒకటిపెద్దది) ఉన్నవి. ఈ గుడిలోనే మూడు శ్రీ వేంకటేశ్వరుని ఉత్సవమూర్తి, ఉభయ 'నాచారు'లమూర్తులు వున్నాయి. అతని యిద్దరు దివ్యసతులు, పాకాలపాలయంలోని మంగాపురం దేవాలయానికి * చెందిన చక్రం కూడావున్నాయి. దానికభిముఖంగా మరో ప్రక్కన దక్షిణదిక్కుగా సేనాధిపతి విష్వక్సేనుని దేవాలయం వున్నది.

స్నపన మంటపానికి ఆనుకుని పడమరదిక్కున ఆస్థానమంటపం వున్నది. నాప రాతితో నిర్మించబడిన ప్రాకారపుగోడ దేవాలయంచుట్టూ వున్నది. అది తూర్పుకి 345 అడుగులు, ఉత్తరానికి 174 అడుగులు; రాతితో 13½ అడుగులయెత్తు, 1½ అడుగులయిటుక, సిమెంటుతో చేయబడి, మొత్తం 15 అడుగుల ఎత్తుకలిగి వున్నది. గుడిముందు పడమటి ప్రాకారం మధ్యలో ఒకరాతి మహాద్వారం వున్నది–24 అడుగులు తూర్పుకి, 30 అడుగులు ఉత్తరానికి వైశాల్యం కలది, 11 అడుగుల యెత్తుకలిగి, ద్వారం 15 అడుగులు వైశాల్యం కలిగి 3 అంతస్తులున్న, 29 అడుగుల యెత్తున్న గోపురం కలిగి ఉన్నది.

**4. నమ్మాళ్వార్‌గుడి:** తరువాత ప్రస్తావించబడినది గోవిందరాజస్వామి ఆలయానికి ప్రక్కనున్న ఉత్తరపు వీథిలోవున్న నమ్మాళ్వార్‌గుడి. అది ఉత్తరపు వరసలో దక్షిణం దిక్కుగా రాతితో కట్టబడివున్నది. దాని గర్భగుడిలో నమ్మాళ్వార్ విగ్రహం, ఉత్సవవిగ్రహం, శ్రీనివాసమూర్తి అర్చామూర్తి, తిరుప్పాణాళ్వార్ అతడు ఆరాధించే కృష్ణ, రుక్మిణి, సత్యభామమూర్తులు వున్నవి. గర్భగుడికి దక్షిణాన ఆస్థానమంటపం, దానిమధ్యలో 48 అడుగులు తూర్పుకి, 63 అడుగులు ఉత్తరానికి వైశాల్యం కలిగి, 10 అడుగుల యెత్తుగల రంగమంటపం వున్నది. ఆనాడు తాలూకా కార్యాలయం మంటపంలో వుండేదని వినికిడి. ఈ కట్టడం 114 అడుగులు తూర్పుకి, 285 అడుగులు ఉత్తరానికి వైశాల్యంకలిగి, 3 అడుగుల మందం, 17 అడుగుల యెత్తుకలిగి వున్నది.

**5. గంగై–కొండన్–మంటపం:** శ్రీ గోవిందరాజస్వామివారి సేవ కుపయోగించే తిరుపతిలోని రామచంద్రపురం వీథిలోని గంగుండ్రమంటపం కూడా ప్రస్తావించబడింది. ఈ మంటపం పేరు బిరుద గంగైకొండన్ అనే ఒకటవ రాజేంద్రచోళుని పేరుకి బహుశా విరూపమేమో! దీని ప్రస్తావనలో ఊరిపొలిమేరలు ఈ మంటపం వరకు విస్తరించిన విషయం గమనించ బడింది. అందుకే యీ వీథికి గంగుండ్రమంటపం వీథి అనేపేరు వచ్చింది.

**6. ఒక ఆళ్వారు, కృష్ణుడు:** మాలవాడకి పడమరనున్న ఒక ఆళ్వార్‌గుడి, మాదిగవాడ (రెండు హరిజన వాడలు)కి దక్షిణాన వున్న చెన్నకేశవస్వామి గుడి కూడా ప్రస్తావించబడ్డాయి.

**7. కపిలేశ్వరుని మందిరం:** స్వయంభువువైన కపిలేశ్వరస్వామివారి ఆలయానికి సంబంధించిన వర్ణినలో వారి గుడి కొలతలు 6¾×7½×7 ఘనపుటడుగులుగా ప్రస్తావించబడ్డాయి. సిమెంటుతో ధృడంగా స్థాపించవలసిన ఒకలింగాకృతి కూడా ప్రస్తావనకు వచ్చింది. గర్భగుడికి దక్షిణాన 9×5¼×6 ఘనపుటడుగుల పరిమాణం కలిగిన ఒక రహస్యమందిరం వున్నది. అందులో అమ్మవారి ఉత్సవ విగ్రహం ఉన్నది. దానికి అమ్మవారి గర్భగుడి నుండి దారివున్నది. అది అమ్మవారి గుడికి దక్షిణాన ఆనుకుని వున్నది. కాని, అది భారీగావున్న నాపరాతిలోను, మరికొన్ని చిన్నపలకలతోను, యిటుకలు, సిమెంటుతోను కప్పబడివున్నది. రహస్య గృహాన్ని ఆనుకుని పడమర ఒక అంగణం స్థలంలో కపిలేశ్వరుని స్వయంభూస్వరూపం ఉన్నది. దాని క్రింద 3 అడుగుల ఎత్తుగల ఒక చీమలపుట్ట, దానిమీద కర్రతో చెక్కబడిన కామధేనువు, దాని దూడ, ఉత్తర దిక్కుగా కపిలమహామునిమూర్తి (వారిరక్షకుడుగా) వున్నాయి. దానికి దక్షిణాన కామాక్షమ్మ గుడివున్నది. దాని ముంగిట కపిలేశ్వరుని కెదురుగా నందితో కూడిన ముఖమంటపం ఉన్నది. ఉత్తరాన ఉమామహేశ్వరుడు, సూర్యనారాయణుడు, దక్షిణాన చిన్న వినాయకునిమూర్తి–యీ మూడూ పడమట దిక్కుగా వున్నాయి. ప్రదక్షిణానికి ఉపయోగించే ఉత్తరపు త్రోవలో చండికేశ్వరుడున్నాడు. వెలుపల వున్న అంగణంలో ద్వారపాలకులు నిలబడివున్నారు. ఉత్తరపు మందిరంలో దక్షిణాభిముఖుడైన విశ్వేశ్వరుడు, దక్షిణానగల గదిలో ఒక అరలో మూడుమూర్తులు **షణ్ముఖస్వామి (గుహుడు, స్కంద సుబ్రహ్మణ్యస్వామి, కుమారస్వామి)** అతని యిద్దరు దేవేరులు వల్లీ దేవసేనలవి గలవు. మంటపంలో పానవట్టం (స్నానంచేయించిన నీరు, పాలు, తదితర ద్రవాలు బయటకు పోయేమార్గం)తో కూడిన ఒక గుండ్రని పాత్రతో కూడిన ఒక లింగం, ఒక చిన్న నంది వున్నాయి. దానికి పడమటి దిశలో ధ్వజస్తంభంతో కూడిన సిమ్మెంటుతో చేయబడిన ఒక అరుగు ఉన్నాయి.)

ముఖమంటపానికి దక్షిణాన రంగమంటపం, దక్షిణామూర్తి విగ్రహంతో, నాగదేవతామూర్తితోకూడి ఉత్తరపు గోడకానుకుని ఉన్నది. తూర్పున వంటశాల, వెలుపల స్థలంలో దక్షిణాన ఒక పెద్దనంది ఉత్తరాభిముఖంగా విశ్రమిస్తున్నట్లుంది. దానితో పశ్చిమాభిముఖంగా వున్న కాలభైరవుడు, అతని భక్తుడు గరువడతో కూడి ఉన్నాడు. అతనికి ముందు భాగంలో కాశీవిశ్వేశ్వర స్వామి, విఘ్నేశ్వరుడు, కాలభైరవుడు, వారిముందు ఒకనంది, విగ్రహాలువున్నాయి.

**8. వేణుగోపాలస్వామి:** కపిలతీర్థానికి దక్షిణానగల ఒక మంటపంలో వేణుగోపాల స్వామి ఆలయం వున్నది. అతని ముక్కు రూపు చెడివున్నది. అతని కిరుప్రక్కల రుక్మిణీ సత్యభామలు, బయట యిద్దరు ద్వారపాలకులు వున్నారు.

**9. రంగమంటపం, లక్ష్మీనారాయణస్వామి:** ఉత్తరాన కపిలతీర్థపుర రంగమంటపం కలదు. 6×6 అంగణాలు, 50×50×16 ఘనపుటడుగులు గలిగి 49 రాతి స్తంభాలు కలిగి ఉంది. ఇందులోని రాతి విగ్రహం లక్ష్మీసహిత నారాయణస్వామివారిది. అతని నాసిక కొంతమేరకు రూపు చెడివున్నది.

**10. గుహలో లక్ష్మీనారాయణస్వామి:** కపిలతీర్థానికి పడమటి ఒడ్డున పడమటి భాగంలో గుహాంతర్గతుడైన, పూర్వాభిముఖుడైన, కొంతమేర రూపుచెడిన లక్ష్మీనారాయణ స్వామి రాతి విగ్రహం వున్నది. గుహలోనికి దిగడానికి మెట్లు యేర్పరిచి ఉన్నాయి.

**11. నమ్మాళ్వార్‌గుడి:** కపిలతీర్థం ముఖద్వారంవద్ద నమ్మాళ్వార్ రాతివిగ్రహంతో కూడిన అతని గుడిలో నమ్మాళ్వార్, కూరత్తాళ్వాన్, భాష్యకారుడు, ఆచార్య నాథముని విగ్రహాలు, శ్రీనివాసమూర్తి చిన్నమూర్తి ఒకటి వున్నట్లు, గోవిందరాజస్వామి గుడికి నమ్మాళ్వార్ ఉత్సవమూర్తి కొని రాబడినట్లు ప్రస్తావించబడింది. తలుపులేని కారణంగా దాని ముఖద్వారం ఒకరాతి పలకతో కప్పబడింది.

**12. అలిపిరి పాదాల మంటపం, పారువేట మంటపం:** ఈ వర్ణనలో అలిపిరి వద్దనున్న రాతిమంటపం (కొండమీదకు వెళ్ళేమెట్ల సముదాయంలో బాగా క్రిందకున్న మెట్టు–అడిప్పడి)–కొండదిగువన వున్నది, పెద్దగోపురానికి (తరువాతకాలంలో శిథిలమైపోయింది) దక్షిణంగా వున్నది ప్రస్తావించబడింది. దానిమీద వేంకటేశ్వరస్వామి పాదాలు నేలమీద నాపరాతి ఫలకంపై చెక్కబడివున్నాయి. అందువల్ల మంటపం శ్రీవారి పాదాల మంటపంగా పేరుపొందింది. తిరుపతికి తూర్పునున్న, రేణిగుంట రోడ్డుమీద ఒక మైలు దూరంలో తిరుపతికి తూర్పుదిశలో పార్వేటమంటపం వున్నది.

**13. తిరుచానూరు పద్మావతీదేవి మందిరం:** ఈ వర్ణనలో తిరుచానూరు లోని (తిరుశుకనూర్, చిరతానూరు) పద్మావతీ అమ్మవారి ఆలయం వర్ణించబడింది. పూర్వాభిముఖంగా వున్న యీ గుడి రాతితో కట్టబడింది. దాని గర్భగుడి తూర్పునుండి పడమరకు 10 అడుగులు, ఉత్తర దక్షిణాలకు 7 అడుగులు వైశాల్యం కలిగి, 8 అడుగుల యెత్తు కలదైవున్నది. దానిమీద 18 అడుగుల ఎత్తుగల విమానం వున్నది. అక్కడ పద్మాసనాసీనురాలైన కమనీయమైన అమ్మ రాతివిగ్రహం అమ్మ వున్నది. అటువంటిదే అమ్మ ఉత్సవవిగ్రహం, శయన భంగిమలోనున్న అమ్మ మూర్తి, శ్రీనివాసమూర్తి విగ్రహం, ఒక పీఠం క్రింద ఒక సరంచి మీద శ్రీదేవీ భూదేవీ సమేతుడైన అళగ (సుందరమైన) తిరువేంగడస్వామి (శ్రీ వేంకటేశ్వరుడు); తిరుమంగై ఆళ్వార్‌మూర్తి, కృష్ణస్వామి, రుక్మిణీ సత్యభామల మూడు మూర్తులు వున్నాయి. గర్భగుడిలోని ప్రదక్షిణంచుట్టూ ఒక గదిలో ఉత్తర దిక్కున ఎంబెరుమానార్ (రామానుజులు) రాతివిగ్రహం ఒకటి, దక్షిణాభిముఖంగావున్న ఉత్సవ విగ్రహం ఒకటి వున్నాయి. దక్షిణపు దిక్కున వున్న గదిలో సేనాధిపతి ప్రధాన విగ్రహం (రాతితో చేయబడినది), నమ్మాళ్వార్, గరుడాళ్వార్ (గరుడవాహనం) విగ్రహాలు వున్నాయి. ప్రదక్షిణ మంటపం ఆనుకుని తూర్పున 25 అడుగులు తూర్పుకి, 36 అడుగులు ఉత్తరానికి వైశాల్యం కలిగి, 11 అడుగుల ఎత్తు కలిగిన ఆస్థానమంటపం వున్నది. అందులో శిథిలమైన ఒక అశ్వవాహనం (తామ్రఫలకంతో అలంకరించబడినది) వున్నది. దానికి తూర్పున కలపతో చేయబడిన ఒక ధ్వజస్తంభం ఉన్నది. అది 54 అడుగుల ఎత్తు కలది. దాని బలిపీఠం తూర్పుదిశగా వున్నది. వాటిమీద ఒక కలపలతో కప్పబడివున్నది. దానికి తూర్పున 16 రాతిస్తంభాలుగల రంగమంటపం వున్నది. 4 అడుగుల ఎత్తు, 24×24×8 ఘనపుటడుగులు వైశాల్యంగల అరుగుమీద ఉపస్థితమై ఉన్నది.

**14. కృష్ణస్వామి మందిరం:** అమ్మ ఆలయానికి దక్షిణాన ఒక గజందూరంలో రాతితో కట్టబడిన శ్రీకృష్ణుని మందిరం వున్నది. దాని గర్భగృహం 6×6×9 ఘనపుటడుగుల వైశాల్యం కలది. ఆస్థాన మంటపానికి యెగువన ఒక పెద్ద ఘంట వ్రేలాడదీయబడి వున్నది. గర్భగుడిలో రెండు భుజాలు కలిగిన కృష్ణస్వామి రాతివిగ్రహం (తూర్పుకి పద్మాసనంలో); రెండు భుజాలతో బలభద్రస్వామి (ఉత్తరానికి) రాతివిగ్రహం, మూడు వేణుగోపాల స్వామి ఉత్సవమూర్తులు (వేణువునూదుతున్నట్లున్న గోపాల కృష్ణుడు), రుక్మిణీ సత్యభామలు, విష్ణువు సుదర్శన చక్రం వున్నాయి.

**15. అళగు తిరువేంకటనాథుని మందిరం:** కృష్ణస్వామిగుడికి దక్షిణాన అళగు తిరువేంగడనాథస్వామి (అందమైన వేంకటేశ్వరుడు) ఆలయం వుంది.[1] రాతితో నిర్మించబడిన యీ ఆలయంలో పూజాదికాలు లేవు. ఆలయం మంచి స్థితిలోనే వుంది. దాని గర్భగుడి 7×7×9 ఘనపుటడుగుల కొలతలు ఒక ప్రదక్షిణం, ఆస్థానమంటపం (తూర్పున), కొంచెం దూరంలో రంగమంటపం, దానికి తూర్పు కొసన ఒక గరుడ మందిరం వున్నాయి.

కృష్ణస్వామి మందిరానికెదురుగా రాతితో చేయబడిన మహాద్వార మంటపం వున్నది. ఇది రాతితో నిర్మించబడింది. దానిమీద వున్న యిటుకలతో కట్టబడిన కప్పు[2] శిథిలావస్థలో వున్నది. తూర్పుకి 13 అడుగులు, ఉత్తరానికి 24 అడుగులు వైశాల్యం కలిగి 15 అడుగుల ఎత్తులో వున్నది. దానికి కలప తలుపులు, ద్వారబంధాలు, దానిపైన ఒకసాదా సీదాగోపురం (ఇటుక, సిమెంటుతో చేయబడినది) ఉన్నాయి.

ఆలయ ప్రాకారపుగోడ తూర్పుకి 210 అడుగులు, ఉత్తరానికి 156 అడుగులు, వైశాల్యంకలిగి, 116 అడుగుల ఎత్తుకలిగి వున్నది. ఇది ఇటుకలు, సిమెంటుతో నిర్మించబడింది. ప్రస్తుతం యిది చిన్న చిన్న నాపరాళ్ళతో యీ కొంచెం యెత్తుగా కట్టబడివున్నది.

పద్మసరస్సు మధ్యలో నీరాళిమంటపం ఉన్నది. తై(జనవరి) మాసంలో కార్వేటినగరం జమీందారు సరస్సులో తెప్పోత్సవం నిర్వహించేవాడు. మంటపం దిగువభాగం నీటి అడుగున వున్న పునాది నుండి 7 అడుగుల లోతులో వుంది. ఎత్తు చేయబడిన నేలమీద 12×12×10 ఘనపుటడుగుల మంటపం నిర్మించబడింది. 10 అడుగుల యెత్తుగల విమానానికి ఊతగా నాలుగు స్తంభాలు కూడా నిర్మించబడ్డాయి.

ఈ సరస్సు తూర్పు ఒడ్డున తీర్థవారి మంటపం వున్నది. అందులో 9వ రోజున జరిగే తన ఉత్సవం సందర్భంగా ఆసీనురాలై వుండగా అమ్మకు అభిషేకాదులు నిర్వహిస్తారు. ఇది కార్తికి అనే పేరుగల తమిళమాసంలో తీర్థవారి సందర్భంగా జరుగుతుంది.

---

1. ప్రస్తుతం ఇక్కడ సుందరరాజస్వామి పూజింపబడుతున్నాడు.
2. ఇప్పుడిది పునర్నిర్మాణం తర్వాత చక్కని పరిస్థితిలో ఉన్నది.

**16. సూర్యనారాయణస్వామి, వేంకటేశ్వరుడు:** సరస్సుకి తూర్పున చతుర్భుజుడైన సూర్యనారాయణ స్వామివారి ఆలయం; వేంకటేశ్వరస్వామి ఆలయం పశ్చిమాభి ముఖంగా వున్నాయి. వేంకటేశ్వరస్వామి ఆలయం 39×24×12 ఘనపుటడుగుల పరిమాణంకలిగి, 24 స్తంభాలతో మంచి స్థితిలో వుంది. శ్రీ వేంకటేశ్వరస్వామి తనను వదలి వెళ్ళిన లక్ష్మీదేవిని మరల పొందటానికి యిక్కడే తపస్సు చేశాడంటారు.

**17. వరద రాజస్వామి:** గ్రామానికి తూర్పున, పశ్చిమాభిముఖంగా వరదరాజ స్వామి వారికొక పెద్దగుడి వున్నది. పూర్వాభిముఖంగా వున్న పేరిందేవమ్మ గుడియిందులోనే వున్నది. వంటశాలలో వాడే రాతిపలకలు పద్మావతీ అమ్మవారి గుడి నిర్మాణంలో వినియోగించారు.

## కైంకర్య పట్టీ

ఫస్లీ 1211 (క్రీ॥శ॥ 1801)లో ఒకటి, ఫస్లి 1230 (క్రీ॥శ॥ 1820) లో ఒకటి, రెండు కైంకర్య పట్టీలు తయారు చేయబడ్డాయి. ప్రతి ఉద్యోగస్థుని ద్వారా యివ్వబడిన వివరాలపట్టి ఫస్లి 1211 పట్టిలో చేర్చబడ్డాయి. ఇందులో ఉద్యోగుల సేవలు, వారికి అందే ధనం రూపేణా, బహుమతుల రూపేణా అందేవి, వారివద్ద వున్న భూములు, వారి అధికారంలో వున్న గ్రామాలు, యితర ఉపయోగమైన వివరాలు వుండేవి. దానిలో నలుగురు అర్చకుల కుటుంబాలు, ఇద్దరు జియ్యంగార్లు, నలుగురు 'ఏకాంగులు', సర్కారువారి అర్చకుడు, శ్రీరాములవారి గుడి అర్చకుడు, ఆచార్య పురుషుల యేడు కుటుంబాలు, బొక్కసం సభకు చెందినవారు, తాళ్ళపాకవారి కుటుంబీకులు, గొల్లపరిచారకుడు, పల్లెపరిచారకుడు, జానకి దాస్ మహంత్, బాలకీరం మఠానికి చెందిన దయారామ్‌మహంత్, తిరుపతి, మంగాపురానికి చెందిన కరణాలు, కరకంబాడి పాళేగార్, కృష్ణపురం పాళేగార్లు, మామండూర్ పాళేగార్లు వుండేవారు. వంశపారంపర్యంగా నిర్ణీతపదవీ కాలం దేవాలయ సేవకుని తాళ్ళపాక కుటుంబానికి చెందిన అర్చకులకి భూములు, గ్రామాల ద్వారా వచ్చే ఆదాయమేకాక, గౌరవభృతి, ప్రసాదంకూడా లభించేవి. జియ్యంగార్లు, ఆచార్యపురుషులు పర్వదినాల్లో వైష్ణవ అతిథులకు భోజనంపెట్ట వలసి ఉండేది. ఆలయాల్లో ఉభయాల, ఆళ్వారుల గుడులలో సేవలు చేయడమేకాక విద్యార్థులకు పాఠాలు బోధించవలసి వుండేది. ఇవన్నీ నిత్యం గోవిందరాజస్వామి, వేంకటేశ్వరుని ఆలయాల్లో ప్రబంధాల నిత్యపారాయణకు తోడు చేయవలసివచ్చేది. బొక్కసం సభకు చెందిన వారి అధీనంలో యేవిధమైన గ్రామాలు, భూములు ఉండేవికావు.

దేవాలయంనుండి జీతభత్యాలు అందుకొనే వారిలో ఉత్తర – పారుపత్తేదార్, 17 గురు యితరులు ఉండేవారు. కాని రెండు పట్టీలలోను పారుపత్తేదార్ పేరెక్కడా కనబడదు.

ఫస్లి 1230కి చెందిన కైంకర్యపట్టీలో చాలమంది కైంకర్యాలు (సేవలు) ప్రస్తావించ బడ్డాయి. కాని, వారి జీతంకాని, భూములుకాని, గ్రామాలుకాని పేర్కొనబడలేదు.

తిరుపతి నుండి కపిలేశ్వర దేవాలయంవరకు పర్యవేక్షణ నెరపడం, తిరుపతిలోని అనేక మార్గాలలో రక్షణ స్థానాలు (రక్షకభట స్థావరాలు) యేర్పాటు చేయడం, భక్తుల భద్రత, వారు తెచ్చే కానుకల భద్రతపై దృష్టిసారించటం ముగ్గురు పాళేగార్ల విధులు.

ఎ.ఎస్. రామాచార్యులనే ఆయన, **మద్రాస్ గవర్నర్ మేజర్ మన్రో** వేంకటేశ్వర స్వామి దర్శనార్థియై వచ్చి, తిరుపతికి వచ్చి, ఒకరాత్రి విడిదిచేసినట్టు, మరుసటి రోజు కొండ ఎక్కడానికి నిర్ణయించుకున్నట్లు ప్రస్తావించాడు. ఆ రాత్రి అతనికి వేంకటేశ్వరస్వామి కలలో కనిపించి (ఒక ఆచార్య పురుషుని వేషంలో) హిందువు కాని కారణంగా అతనిని కొండమీదకు వెళ్ళవద్దని, మద్రాసుకు తిరిగిపొమ్మని చెప్పాడట. అతను స్వామి ఆజ్ఞమేరకు నడుచుకున్నాడు. ఇది **మన్రోకి** వేంకటేశ్వరుని యెడలగల విశ్వాసాన్ని నిరూపిస్తోంది. ఈ విశ్వాసమే దైవానికి నివేదనల నిమిత్తం కొంతభూమిని అతడు దానంచేసేలా చేసింది. ఈ నివేదన మొదటి ఘంటారావానికి ముందు, ఉదయం పూజ తరువాత.

మీద చెప్పిన ప్రశ్న – జవాబుల పట్టికలో 20 వ ప్రశ్నకు బదులుగా 60 సార్లు నిర్వహించబడే నిత్యనివేదనలకు గాను పూర్వం రాజులు, తదితరులచేత తిరుపతికి సమీపంలో 432 గ్రామాలివ్వబడ్డాయి. సుమారు 170 గ్రామాలు దేవాదాయంగా గుడి ఉద్యోగులకి, తిరుపతి తాలుకాలో పర్యవేక్షించే పారుపత్తేదార్లకి, తక్కిన 250 పైగా గ్రామాలు చిత్తూరు, కడపజిల్లాలోని వివిధ తాలూకాల క్రింద చూపబడ్డాయి. 1565 లో జరిగిన తళ్ళికోటయుద్ధంవరకు, యీ 432 గ్రామాలేకాక, అనేక గ్రామాలు రాజులు, దళపతులు, జమీందారులు, దాతలు ఆలయానికి దానమిచ్చారు. ఇవన్నీ దక్షిణభారతంలో కేరళలోని తిరువాన్కూరు (ట్రావెన్‌కోర్) వరకు వుండేవి. బిజాపుర్ సుల్తాన్, గోల్కొండ సుల్తానులు జయించిన ప్రాంతంలో కొంతభాగం. తరువాత ఆర్కాట్ వద్దనున్న కర్ణాటక నవాబు అధీనం చేసుకున్నాడు. చివరగా ఇంగ్లీష్ ఈస్ట్ ఇండియా కంపెనీకి అప్పజెప్పబడిన సమయానికి ఈనాములుగా, దానంగావుండి, సుదర్శనచక్రం ముద్రించిన రాళ్ళతో హద్దులు గుర్తింపబడిన యీ భూములు, గ్రామాలు దక్షిణానగల అనేక జిల్లాలు, తాలూకాలలో కలిసిపోయాయి. ఫలితంగా 60 సార్లు భగవంతుడికిచ్చే నివేదనలు 3 పర్యాయాలకు పరిమితమైపోయాయి. నివేదనల పరిమాణంకూడా చాలవరకు తగ్గిపోయింది. ఉదయం, మధ్యాహ్నం, రాత్రి సరుకులకు విధించబడిన పరిమితులకు లోబడిపోయాయి.

అంతేకాదు, క్రీ॥శ॥ 1786 నాటికే ఆర్కాట్ నవాబు కానుకలనుండి, ఆర్జితంనుండి లభించే ఆదాయం ఇంగ్లీష్ కంపెనీకి అప్పజెప్పబడింది. క్రీ॥శ॥ 1843 వరకు కంపెనీ యీ ఆస్తులన్నింటినీ అద్దెకిచ్చి, వాటిద్వారా లభించే ఆదాయం, శిస్తులు అనుభవించింది.

* * *

# అధ్యాయం-25

## మహంతులకు దేవాలయపరిపాలన బదిలీచేసి బ్రిటీషువారు తమ బాధ్యతలనుండి తప్పకొనుట: ఐశ్వర్యానికిదారి

ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్ల సముదాయానికి కంపెనీలోని అధికారులు, సంబంధిత వ్యక్తులు హిందూ దేవాలయాలలోని విగ్రహారాధనలో పాల్గొనడం యేమాత్రం నచ్చలేదు. ఇది యీ మతపరమైన సంస్థలతో వారికున్న సంబంధంవల్లనే అని గ్రహించినవారు తాము తటస్థవిధానం అవలంబించి నట్లు కనబడి ప్రజలలోని మతపరభావంనుండి తమ అధికారులను దూరంచేసే ప్రయత్నంగా ఆలయ పరిపాలనా బాధ్యతలనుండి కంపెనీవారు తప్పుకున్నారు. విక్టోరియామహారాణి పాలనలో మొట్టమొదటి సంవత్సరాలలో క్రీ॥శ॥ 1842-43లలో యీ శాసనం అమలులోనికి వచ్చింది.

దీనికనుగుణంగా తిరుపతిలోని శ్రీవేంకటేశ్వరునిగుడి, దాని కనుబంధంగా వున్న శ్రీ గోవిందరాజ, శ్రీ కోదండరామ, శ్రీ కపిలేశ్వరాలయాలు; తిరుచానూరులోని శ్రీ పద్మావతి ఆలయం క్రీ॥శ॥1843లో అప్పటి మహంత్ అయిన శ్రీ హాతీరామ్‌జీ మఠానికి చెందిన శ్రీ సేవాదాసకు అప్పజెప్పబడ్డాయి. అతణ్ణి దేవాలయపు విచారణకర్తగా నియమించడం జరిగింది. క్రీ॥శ॥ 21-4-1843లో కుదిరిన ఒక ఒప్పందం (ముచ్చిలికా) ద్వారాశిష్య పరంపరద్వారా పరిపాలన కొనసాగేలా యేర్పాట్లు చేయబడ్డాయి. కాని దీనికొరకు యేవిధమైన, మూలధనం కేటాయించబడలేదు. ఎన్నోగట్టి అభ్యర్థనలమేరకు మహంత్ చేతిలో 5,000 రూపాయలుపెట్టారు. ఆలయం నుండి కంపెనీ సంపాదించిన వార్షిక ఆదాయంలో క్రీ॥శ॥1843 వరకు దాచిపెట్టిన సొమ్ము 40 లక్షలవరకు పోగయ్యింది. 20వ శతాబ్దిలో నెల్లూరుకు చెందిన ఎ.ఎస్.కృష్ణారావనే అడ్వొకేటు (మద్రాసు లెజిస్లేచర్‌లో ఒక సభ్యుడు) అనేకసార్లు యీ విషయాన్ని శాసనమండలి దృష్టికి తీసుకొని వచ్చి, తిరుమల తిరుపతి దేవస్థానానికి యీ సొమ్ము చెల్లించవలసిందిగా మద్రాసు ప్రభుత్వాన్ని కోరడంజరిగింది. సరియైన సమాధాన మివ్వకుండా మద్రాస్ ప్రభుత్వం దాటవేసి చివరకు అటువంటి పైకమేదీ తమలెక్కలలోలేదని తేల్చివేసింది.

క్రీ॥శ॥ 1843 నుండి 1933 వరకు ఆరుతరాలకు చెందిన మహంత్‌లు దేవస్థానం విచారణకర్తలుగా అధికారం చెలాయించారు. ఆలయానికి సంబంధించిన శాసనాలలో వారిలో ముగ్గురందించిన సేవల వివరాలు పేర్కొనబడివున్నాయి. మొదటి మహంత- విచారణకర్త సేవాదాస రెండు ప్రధాన సరస్సులకు చుట్టూవున్న స్వామి పుష్కరిణిని పునర్నిర్మించారు. ఈ రెండు సరస్సులు శ్రీవరాహతీర్థం, శ్రీనివాస తీర్థంలో మార్కండేయాగ్ని, యమ (మృత్యుదేవత), వశిష్టఋషి, వరుణ (వర్షదేవత), వాయు (గాలిదేవత), కుబేర (ధనదేవత), గాలవ (మహర్షి), సరస్వతీ (విద్యాధిదేవత) తీర్థాలు (పవిత్రమైన నదీజలాలు), మొత్తం 9 తీర్థాలన్నింటిలోను, క్రీ॥శ॥1849 ఆగస్టునెల 31వ తేదీ గురువారం (శకసంవత్సరం 1771), సౌమ్యనామ సంవత్సరంలో (సంఖ్య 130, సంకలనం6, భాగం-1) పునర్నిర్మించాడు. శ్రీనివాసుడు, శ్రీ అలమేలుమంగలకు నిర్వహించే తెప్పోత్సవాన్ని పునరుద్ధరించాడు.

సంస్కృత గద్యంలో వ్రాయబడిన యీ శాసనం తెలుగులిపిలో వ్రాయబడింది. సంఖ్య 131లో వున్న దీని ప్రతివొకటి దేవనాగరిలిపిలో వ్రాయబడింది.

తరువాత **విచారణకర్త శ్రీమహంత్ ధర్మదాస (శ్రీమహంత్ సేవాదాస శిష్యుడు)** కపిలతీర్థం మెట్లు పునర్నిర్మించాడు. తూర్పు, పడమరగట్లమీద నున్న మంటపాలుకూడా (క్రీ॥శ॥10-2-1865 రక్తాక్షి నామసంవత్సరం, శకసంవత్సరం 1787లో). 134వ సీసమాలికలో (తెలుగులో) శ్రీ వేంకటేశ్వరుని దేవాలయపు బాహ్యద్వారగోపురం అతడు నిర్మించినట్లు పేర్కొనబడింది. పడికావలి (విధినిర్వహణలో వున్న రక్షకభటుడు) గోపురంతో బాటు దగ్గరలోని కొన్ని మంటపాలుకూడా. ఇది క్రీ॥శ॥11-9-1878 బహుధాన్య నామసంవత్సరంలో.

**ఆరవవాడు, చివరివాడైన విచారణకర్త శ్రీమహంత్ ప్రయాగదాస, అతని సోదరుడు రామలక్ష్మణదాస** క్రీ॥శ॥30-9-1908నాడు శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయంలో విమానమీద స్వర్ణకలశం స్థాపించాడు. ఇది కలియుగం 5010, కీలకనామ సంవత్సరం నాటిమాట (సంఖ్య135).

### వివిధ మహంత్-విచారణకర్తలు-వారిసేవలపై గోపాలాచార్యులవివరణ

తిరుపతికి చెందిన కీ॥శే॥ ఎం.పి. గోపాలాచార్యులు (ప్రజలకు నల్ల గోపాలాచార్యులుగా పరిచయం), దేవస్థానంనుండి జీవనభృతిపొందుతూ, విచారణకర్తల పరంపర అందించిన సేవలజాబితా తయారు చేశాడు.

**విచారణకర్తలలో ప్రథముడైన శ్రీమహంత్ సేవాదాస చేసిన కైంకర్యాలలో ఒకటి** పాదాలవరకువున్న పట్టుపీతాంబరం, స్వర్ణయజ్ఞోపవీతం, బంగారు పద్మపీఠం, రత్నఖచితమైన దుద్దులు, భుజాలపై నాగాభరణం, కిరీటానికి క్రిందభాగంలో పొదగబడిన వజ్రాలు, వేంకటేశ్వరస్వామి విగ్రహానికి యేర్పాటుచేయడం. ఒక ముత్యాల శిరోభరణం (వైరముడి) వేంకటేశ్వర స్వామి ఉత్సవ విగ్రహానికి, ముత్యాలతో పొదగబడిన ఒక కిరీటం, చేతులకి, కాళ్ళకి బంగారు తాపడం చేయించిన వెండి తొడుగులు, రాజముడి (ముడి వేసిన జుత్తుమీద-శిరోభరణం)-ముత్యాలతోచేసినది (ఇద్దరు దేవేరులకూ, ఒక్కొక్కటి) చేయించాడు. గర్భగుడిలోని కులశేఖరపడి అని పిలువబడే బాగాలోపలవుండే గడపవద్ద అల్లిన తడకవంటి తలుపు, వెండితో అలంకరించబడినది; **(వెండివాకిలి)** నిద్రించేమంచానికి నాలుగువెండి గొలుసులు, సింహతలాటాలు గలిగిన వెండి పీఠాలు (ఉత్సవ విగ్రహాని కిరువైపులా) యేర్పాటు చేశాడు. ముక్కోటి ప్రదక్షిణం(లోపలిభాగంలోనిది) పునర్నిర్మించి, ఉత్సవ విగ్రహానికి వజ్రకవచం (వజ్రాలతో పొదిగినబంగారు తొడుగు) ప్రదక్షిణలో వుండేటప్పుడు యేర్పాటు చేసేవాడు. తరువాత కాలంలో యీ పద్ధతికి స్వస్తి చెప్పబడింది. ఇరుకైన ప్రదక్షిణమార్గంలో భక్తుల తొక్కిడి ప్రమాదాన్ని సంశయించి యిలా చేశారు. అతను స్వామి పుష్కరిణి మరమ్మత్తులు గావించి పాత కోనేరునుండి భూగర్భంలోనుండి నీటి సరఫరాకు యేర్పాట్లుగావించాడు. వెండితిరుచ్చి (మకరతోరణంలో కూడినది) తయారుచేయించి అతిపెద్ద శేషవాహనాన్ని బంగారుపూతతో అలంకరింపజేసాడు. ఒక క్రొత్త బ్రహ్మరథం కట్టించాడు. తిరుమలలో ఒకపెద్ద రథంచేయించాడు.

తిరుపతిలోని గోవిందరాజస్వామివారి ఆలయానికి తూర్పుదిక్కున నున్న పెద్దగోపురంలో శిథిలమైనభాగం మరమ్మత్తు చేయించాడు. తిరుచానూరులో అమ్మవారి ముఖమంటపం నిర్మించాడు. ఆమె చేతులపైనున్న వెండితొడుగులను బంగారుపూతతో అలంకరించాడు.

**1864లో శ్రీమహంత్ సేవాదాస శిష్యుడైన శ్రీమహంత్ ధర్మదాస విచారణకర్తగా పదవి చేపట్టాడు.** అతడు ఒక బంగారుకిరీటం, చేతికి తొడుగులు, పాదాలకు బంగారు తొడుగులు, రెండు బంగారు నాణాలతో (సానారకాసులు) చేయబడిన హారాలు, బంగారపు మకరకంఠి (దేవాలయం ఖజానాలో భద్రపరచిన రత్నాలతో–వాటి విలువ 2 లక్షల రూపాయలవరకు వుంటుంది). వీటికితోడు వజ్రాలతో, కెంపులతో కిరీటంలో పొదిగిన ఒక వృత్తాకారంలో వున్న ఆభరణం (ఒక అరచేతి పరిమాణంలోవున్నది), దశావతారాల మూర్తులు బంగారు తాపడంతోవున్న రాగిఫలకంతో కూడిన కలప తలుపులు, ద్వారబంధాలని కప్పివేసింది. అందువల్ల దీనికి **బంగారు వాకిలి** అనే పేరువచ్చింది.

ఉత్సవమూర్తియైన మల్లప్పకోసం, కలికి తురాయి మళ్ళీ తయారు చేయించాడు. ఇది రఘోజీభోంస్లే బహూకరించిన ఆభరణాలలోనిది. బంగారపు తాడుతో కట్టబడిన ఖజానాలోనుండి గ్రహించబడిన ముత్యాల నుండి, వజ్రాలతో, పచ్చలతో చేయబడిన వ్రేలాడే కర్ణాభరణాలతో (ముప్పనూరురాణి బహూకరించినవి), బంగారు తొడుగుతో ఒక క్రొత్త మకర తోరణంచేయించాడు. దీనికిరువైపులా గంధర్వులు, బంగారు తొడుగు గల ఒక సర్వభూపాలవాహనం, వెండితొడుగుతో వున్న ఒక సూర్య ప్రభవాహనం, పెద్ద, చిన్న గరుడవాహనాలు, హనుమంతవాహనం, గుర్రపు బగ్గీ, కల్పవృక్షవాహనం (అన్నీ వెండితొడుగుగలవి) వున్నవి.

అతను వెయ్యిస్తంభాలమంటపం బాగు చేయించాడు. దాన్ని భక్తుల నివాసంకోసం గదులుగా మార్పుగావించాడు. రెండుగోపురాలు, ప్రాకారపు గోడలతో కొన్నిభాగాలు, తిరుమలలోని కొన్ని మంటపాలు బాగు చేయించాడు. కళ్యాణమంటపంలోని యాగశాల మరమ్మత్తు చేయిస్తుండగా, సీలువేయబడిన చిన్న పాత్రలనిండా బంగారునాణాలు దొరికాయి. ఇవి చక్రవర్తి వెంకటపతికి, ఒరిస్సారాజైన గజపతికి; ఉమామహేశ్వర, గండభేరుండ, ఇక్కేరివరహాలు (దక్షిణ కర్నాటకకు చెందిన బంగారునాణాలు), సానారకాసులు–సుమారు 2 లక్షలరూపాయల విలువచేసేవి. ఇవి తమ కోశాగారపు నిధిగా అధీనం చేసుకుని, జిల్లాకోర్టులో వుంచారు. వైఖాన సాగమ శాస్త్రప్రమాణాలు చూపి, దేవస్థానంవారు నాణాలతో నిండిన 5 పాత్రలు తెప్పించి వారి కోశాగారంలో నిక్షిప్తం చేశారు.

అతను తిరుపతిలో గర్భగుడి (జడి–బంధనం)ని మరమ్మత్తు చేయించాడు. గోవిందరాజస్వామి విగ్రహాన్ని చెక్కుచెదరకుండా పునఃస్థాపించాడు. గోవిందరాజ స్వామివారికి, అతని యిద్దరు దేవేరులకు బంగారు కర్ణాభరణాలు, బంగారు కిరీటాలు చేయించాడు. 'సాల–నాంచారు' గుడిలోని రాతిధాన్యాగారం తీయించివేసి, ముఖద్వారం వద్దనుండి భాష్యకారుని మందిరంవరకు మంటపాలు నిర్మించాడు. కూరత్తాళ్వాన్‌కొక క్రొత్తమందిరం నిర్మించి, భట్టర్‌మూర్తి నొకదానిని దానిలో ప్రతిష్ఠించాడు. ఉత్తరపు వరుసలోని ఉద్యానవనాన్ని

వాహనాలుంచుకునే గదిగా మలచాడు. పెద్దశేషవాహనం, చిన్నశేషవాహనం, గరుడవాహనం, హనుమంతవాహనం, హంసవాహనం, అశ్వవాహనం, భోగితేరు (భోగిపండుగరోజున జనవరిలో గోవిందరాజు, ఆండాళ్‌లను ఊరేగించేవాహనం) తయారు చేయించాడు.

తిరుపతిలోని శ్రీరాముని గుడిలో మూడు ప్రధానమైన విగ్రహాలకు జడిబంధనం (దృఢంగా ప్రతిష్ఠించడం) నిర్వహించాడు. గుండ్రని తొడుగులతో ధ్వజస్తంభాన్ని అలంకరించాడు. బంగారుపూత పూసిన వెండి కిరీటాలు సీతమ్మవారికి, రామలక్ష్మణులకు, సేనాధిపతికి, రామలక్ష్మణులకు ధనుర్బాణాలు, రాములవారి ప్రధాన విగ్రహానికొక పెద్ద వెండి ధనుస్సు తయారు చేయించాడు. రక్షకభటులుండే ద్వారానికి వెనుకగా గుడిలో ఒక రాతిమంటపం నిర్మించాడు. రథానికి వెనుక యింకో మంటపంకూడా నిర్మించాడు.

ఆళ్వార్‌తీర్థం (కపిలతీర్థం) వద్ద దాని కిరువైపులావున్న మంటపాలు బాగు చేయించాడు. వేణుగోపాలస్వామిమంటపం, లక్ష్మీనారాయణ స్వామి వారికి ముందున్న మంటపం, పడమరగట్టున గుహలోవున్న నరసింహస్వామి మంటపం బాగు చేయించడమేకాక కపిలేశ్వరస్వామి ఆలయంలో శిథిలమైన భాగాలుకూడా బాగు చేయించాడు.

తిరుచానూరులో ప్రాకారం, గోపురం కట్టించాడు. తవ్వకం జరిపించి పుష్కరిణి నిర్మించాడు. శుక్రవారపు తోటలో బావితో కూడిన మంటపం నిర్మించాడు. పద్మావతి అమ్మవారికి **జడీ బంధనం** నిర్వహించి, రత్నఖచితమైన కిరీటంచేయించి ఆమె శిరోజాలకు చిన్నబంగరు గంటలతో కూడిన బంగరు తొడుగుతో అలంకరించబడిన ఆభరణం, తక్కిన నగలు చేయించాడు. ఆమె చేతులకు బంగారు పద్మాలతో కూడిన తొడుగులు చేయించాడు. ఒక క్రొత్తరథం చేయించాడు. వంటశాల నిర్మించాడు. వంటశాలకి పడమరగా గదులు, వాహనమంటపం, సూర్యనారాయణస్వామి మందిరం నిర్మించాడు. మందిరంలో స్వామివారిని ప్రతిష్ఠింపజేశాడు.

**క్రీ॥శ॥ 1880లో శ్రీ మహంత్ ధర్మదాస తరువాత అతని శిష్యుడు శ్రీ మహంత్ భగవాన్ దాసవిచారణకర్త బాధ్యతలు చేపట్టాడు.**

తిరుమలలో ధ్వజస్తంభం స్థాపించాడు. కొన్ని మంటపాలు, ఆభరణాలు బాగు చేయించాడు. తిరుపతి కార్యాలయంనుండి టెలిఫోను సౌకర్యం కల్పించాడు. మంచినీటి చెరువు బాగుచేయించి, దానిలోనుండి వీధి కుళాయిల ద్వారా నీరు సరఫరా అయ్యేలా భూగర్భంలో గొట్టాలు యేర్పాటు గావించాడు. చెరువుకి దక్షిణాన గవర్నరు, ఉన్నతాధికారుల అతిథి మర్యాదల కనువుగా బంగళా కట్టించాడు.

తిరుపతిలోని ఉద్యానవనం (పువ్వులతోట)లో గదులు నిర్మించాడు. ఉన్నత పాఠశాలభవనం కట్టించాడు. సంస్కృత పాఠశాల స్థాపించాడు. స్వామికి వేదనలు భక్తులకందేలా యేర్పాటుగావించాడు.

తిరుత్తని తాలూకా ఫలసాయం కమతంకోసం కార్వేటినగర ప్రభువుకు తన గురువు ధర్మదాసయిచ్చిన అప్పుకితోడు తానుకూడా కొన్ని లక్షల రూపాయలు అప్పుగా యిచ్చాడు. కచ్చినార్ తాలూకాలో అదే విధమైన వ్యవహారంలో శ్రీకాళహస్తి ప్రభువుకుకూడా పైకం అప్పుగాయిచ్చాడు.

తిరుపతిలో శ్రీరాములవారి ఉత్సవ విగ్రహానికొక బంగారు తాపడం చేసిన మకరతోరణం తయారు చేయించాడు. రెండు **'బాజి-బందు'** (బాహువులు కప్పేవి)లు చేయించాడు. ఇది వజ్రాలతో పొదగబడినది. ఒక కలికితురాయి, వజ్రఖచితమైన ఒకవడ్డాణం, మెడనలంకరించే మకరకంఠి, రెండు వజ్రాలతో పొదిగిన వ్రేలాడే దుద్దులు, ఒక **'రాకడి'** (వజ్రాలతోకూడిన శిరస్సు వెనుక ధరించే ఆభరణం). శిరస్సు వెనుకగా గల పొడవైన కేశపాశాలను కొన్నిటిని ఈ రాకడి వెనుకగల వలయంలో చొప్పించి, శిరస్సు వెనుకగానే వచ్చేంత వరకు చేసి, దానిని జడ మూడుపాయలతో (త్రివేణి) కలిపి అల్లుతారు. బంగారు కాసులతో చేయబడిన రెండు గొలుసులు చేయించాడు. ఇది తిరుపతిలోని, తిరుచానూరులోని దేవీదేవతల కోసం, కోశాగారంలో నిక్షిప్తం చేయబడ్డవి.

అతనే వెండి తాపడంతో కూడిన ఒక సూర్యప్రభవాహనం, తిరుపతిలో ఒక సర్వభూపాలవాహనం తయారు చేయించాడు.

తిరుచానూరులో ధ్వజస్తంభం చుట్టూ మంటపం నిర్మించాడు. సుందరరాజస్వామి మందిరం, నీరాళిమంటపం-అందులో స్వర్ణకలశంతో అలంకరించబడిన విమానం నిర్మించాడు. తెప్పోత్సవానికి శ్రీకారం చుట్టాడు.

**శ్రీ మహంత్ భగవాన్ దాస (1890-1894)కి శిష్యుడు, వారసుడైన శ్రీమహంత్ మహావీరదాస చెప్పుకోదగ్గదేమీ చెయ్యలేదు.**

**క్రీ॥శ॥1895లో అతని పిమ్మట బాధ్యతలు స్వీకరించినవాడు శ్రీమహంత్ రామకిషోర్‌దాస్.** అతను వేంకటేశ్వరస్వామి ఉత్సవ విగ్రహానికి రత్నాలు పొదిగిన శంఖచక్రాలు చేయించాడు. స్వామి దేవేరులిద్దరికీ చేతులకు తొడుగులు, కటిబంధాలు చేయించాడు. తిరుపతిలో ఆండాళ్‌కి (గోదాదేవికి) చిన్నగంటలతో, అందెలతో కూడిన బంగారపు ఆభరణాలు చేయించాడు.

**శ్రీ మహంత్ రామకిశోర్‌దాస్ ముగ్గురు శిష్యులకు శిక్షణ యిచ్చాడు. వారు ప్రయాగదాస, రామలక్ష్మణదాస, మూలరామానుజదాస. వారిలో అతని తరువాత 1900లో మహంత్‌గా యెన్నుకొనబడినవాడు ప్రయాగదాస.**

**శ్రీ మహంత్ ప్రయాగదాస నీరాళిమంటపాన్ని సరిక్రొత్తగా నిర్మించాడు.** స్వామి పుష్కరిణి వాయువ్య దిక్కుననున్న శిథిలమైన శ్రీవరాహస్వామివారి ఆలయాన్ని పునర్నిర్మించాడు. ఐనా (అద్దాల)మహల్‌లో, ముఖద్వారానికి ఉత్తరాన శ్రీవేంకటేశ్వర స్వామివారి ఆలయంలో, వరాహస్వామి విగ్రహాన్ని పునఃప్రతిష్ఠించాడు. అంతకుముందు యీ విగ్రహం 12 సంవత్సరాలపాటు శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయంలోనే వుండేది.

అతనొక క్రొత్తవాహనం తయారు చేయించాడు. వేంకటేశ్వరస్వామి ఆలయంలోని సంపంగి ప్రదక్షిణంలోని నేల, కొన్నిమంటపాలు బాగుచేయించారు. ఒక క్రొత్త వెండి తిరుచ్చి చేయించాడు. భక్తులు విశ్రమించటానికి సత్రాలు కట్టించాడు. ఆస్పత్రి స్థాపించాడు. ఆలయంలో ద్వారపాలకులుండే ప్రదేశాన్ని వెండి పలకలతోకూడిన తడికవంటిదానిని యేర్పాటుచేయడం శ్రీపద్మావతీ అమ్మవారి స్వర్ణప్రతిమ యేర్పాటు చేశాడు. ప్రాణప్రతిష్ఠ చేయించి వేంకటేశ్వరుని ఛాతీపై వుండేలా యేర్పాటు చేశాడు. ఎత్తివున్న వెనుక చేతులు రెంటిలోనూ వున్న శంఖచక్రాలకు బంగారుపూత పూయించాడు. రామలక్ష్మణుల చేతులకు, సీతమ్మవారి చేతులకు బంగారు తొడుగులు చేయించాడు.

తిరుపతిలో గోవిందరాజు, వారిదేవేరులకు వెండితొడుగులు యేర్పాటు చేశాడు. ఉత్సవ విగ్రహానికికొక వజ్రఖచితపటకం, బంగారుదుద్దులు, సూడికొడుత్త నాంచారుకోసమొకరత్నఖచితకటిబంధం, కాసులపేరు చేయించాడు. వెండితొడుగుతో సింహవాహనం, గజవాహనం, మకర తోరణం యీ మూడింటినీ చేయించాడు. గోవిందరాజు విగ్రహానికి రెండుసార్లు **'జడీబంధనం'** యేర్పాటుచేశాడు. గర్భగుడి, ముఖమంటపం, కళ్యాణమంటపం, రక్షకభటులు నిలబడే గేటువరకు వుండే మార్గాన్ని నాపరాతితో నిర్మించాడు. గర్భగుడిపై విమానం క్రొత్తగా నిర్మించాడు. ఆ విమానంమీద బంగారు పూతపూసిన కలశాలు ప్రతిష్ఠించాడు. దేవస్థానం కార్యాలయం, కోశాగారం (భద్రతకొరకై ఒక ఖజానాతో) క్రొత్తగా నిర్మించాడు. విశాలమైన, పురాతనమైన ధాన్యాగారమంటపాన్ని కార్యాలయంగా, దస్తావేజులు భద్రపరచుకొనే గదిగా, మరికొన్ని పనులకొరకు ఉపకరించేలా మార్పుచేశాడు.

తిరుపతిలోని శ్రీరాములవారి ఆలయంలో, శ్రీరాములవారికి వెండి కవచం బాగుచేయించాడు. సీతమ్మవారికి, లక్ష్మణస్వామివారికి క్రొత్తవెండి కవచాలు చేయించాడు. చేతికి, పాదాలకు బంగారు తొడుగులు చేయించాడు. ఒక చిన్నగంటతో కూడిన ధనుర్బాణాలు చేయించాడు. ఉత్సవ విగ్రహాలకు కొన్ని ఆభరణాలు చేయించాడు. గర్భగృహంనుండి, ప్రదక్షిణంనుండి ముఖద్వారంవరకు వున్న నాపరాతితోపరచి మార్గం యేర్పరిచాడు.

తిరుచానూరులో పద్మావతీ అమ్మవారి గర్భగుడిమీద వొక విమానం నిర్మించి, దానిపైన ఒక బంగారుపూత పూసిన కలశం స్థాపించాడు. శ్రీ సుందరరాజ స్వామివారి విగ్రహం ప్రతిష్ఠించాడు. అమ్మవారికి బంగారు కిరీటం, వెండితొడుగు యేర్పాటు గావించాడు. సుందరరాజస్వామికి వెండి ప్రభతోవున్న ఒక కిరీటం చేయించాడు. క్రొత్తచేతి తొడుగులు, కొన్ని ఆభరణాలు, ఒక వజ్రఖచిత కర్ణపాత్రలజత (కర్ణాభరణాలు) అమ్మవారి ఉత్సవవిగ్రహంకోసం చేయించాడు. ఆలయంలోని వేంకటేశ్వరుని విగ్రహానికొక జత కర్ణాభరణాలు యేర్పాటు గావించాడు. మందిరంలోపల, బయటనేలకు నాపరాతి పలకలు అతికింపజేశాడు. బంగారుపూత పూసిన ధ్వజస్తంభం ప్రతిష్ఠించాడు. ఆలయానికి దక్షిణాన తీర్థయాత్రికుల నివాసం నిమిత్తం సత్రం నిర్మించాడు. తెప్పోత్సవం ప్రారంభించాడు. కొండ దిగువనున్న కపిలేశ్వరాలయంలో కుంభాభిషేకంచేసి, కపిలేశ్వరస్వామిని పునఃప్రతిష్ఠించాడు. స్వామి, అమ్మవారి ఉత్సవవిగ్రహాలకు బంగారు కిరీటాలు, హస్తకమలాలు (చేతి

తొడుగులు), పాదానికి తొడుగులు, కొన్ని క్రొత్త ఆభరణాలు చేయించాడు. నందివాహనానికి వెండి తొడుగులు చేయించాడు. విగ్రహాలకి తెప్పోత్సవం మొదలుపెట్టాడు.

తిరుపతిలోని ఈస్ట్‌కోస్ట్ రైల్వేస్టేషన్‌కి దగ్గరలో తీర్థయాత్రికుల నిమిత్తం మొట్టమొదటిసారిగా ఒక విశాలమైన సత్రం కట్టించాడు.

అతడే దేవస్థానానికి చెందిన 5 లక్షల రూపాయలు **'బాంబే డెవలప్‌మెంట్ లోన్'**లో కుదువబెట్టి, సంవత్సరానికి 54,500 రూపాయలవడ్డీ సంపాదించే వాడు. 20వ శతాబ్దపు రెండవ దశకంలో అతను చెన్నయ్‌కి చెందిన పి.ఓర్, అతని సంతతినుండి 14,000 రూపాయలకు వజ్రాలు, కెంపులతో కట్టబడిన స్వర్ణముద్రలతో కప్పబడిన, కుచ్చులతో కూడిన జడసాదు(వేలాడే పట్టు కుచ్చులతో అల్లబడినజడ) వేంకటేశ్వరస్వామి దేవాలయంలో మలయప్ప స్వామి యిద్దరు దేవేరులతో ఒకరి నలంకరించే వుద్దేశంతో కొన్నాడు. మద్రాసునుండి కొని రాబడిన యీ ఆభరణం పర్వదినాలలో గోవిందరాజ స్వామివారి దేవేరుల ఉత్సవమూర్తులను అలంకరించడానికి ఉపయోగించే వారు.

20వ శతాబ్దపు మూడవదశకంలో గద్వాల్ సంస్థానపు రాణి ఆలయానికి కొన్ని నాణాలు, బంగారు ఆభరణాలు, పైకం, వాటితోబాటు ఆభరణాలతో పొదిగిన విలువైనరాళ్ళు బహూకరించింది * నా నిర్దేశకత్వంలో ఎంతో అనుభవమూ నైపుణ్యమూ గల ఒక కంసాలి (మద్రాస్ కంట్రాక్టర్‌వద్ద పనిచేసే) ద్వారా మలయప్పకు ఒక అందమైన రత్నఖచిత కిరీటం శ్రీ మహంత్ ప్రయాగ దాస తయారుచేయించాడు.

## బ్రూస్ కోడ్

నవాబ్‌మొహమ్మద్ ఆలీ 1795లోను, అతని జ్యేష్ఠకుమారుడు 1801లోను మరణించిన పిమ్మట, ఇంగ్లీష్ కంపెనీవారు మహమ్మదాలీ రెండవకొడుకైన అజీమ్–ఉల్–ఉమరతో జూలై 1801లో ఒక ఒడంబడిక కుదుర్చుకున్నాడు. "ఈ ఒడంబడికవలన ఉమర కర్ణాటకమీద తనకున్న అధికారాలన్నింటినీ కంపెనీ కప్పగించి, తనకు తనకుటుంబపోషణకు సరిపడేలా దానినుండి లభించే శిస్తులలో అయిదవవంతు స్వీకరించాడు" (24వ అధ్యాయం, 305వ పేజీ).

వేంకటేశ్వరుని దేవాలయంతోబాటు కర్ణాటకనికూడా స్వాధీనం చేసుకున్న కంపెనీ నాలుగు రికార్డులు తయారు చేయించింది. బ్రూస్‌కోడ్ వాటిలో వొకటి. దానిలో దేవాలయపు పరిపాలన, ఆదాయాలకు సంబంధించిన వివరాలు, వారసత్వంగా వచ్చిన దేవాలయాధికారులు, శాశ్వత ప్రాతిపదికపై వున్న దేవాలయాధికారుల వివరాలు, యితర వివరాలువున్నాయి.

* * *

---

* తి.తి.దే. శాసనాలు సేకరించటానికి, ప్రచురణలకు శ్రీ సాధుసుబ్రహ్మణ్యశాస్త్రి (ఈ పుస్తకరచయిత)కి సహకరించినవారు శ్రీ మహంత్ ప్రయాగదాసా. దీని వివరాలు తి.తి.దే శాసనాలపై వ్రాయబడిన రిపోర్ట్‌కు వ్రాయబడిన ముందుమాటలో చదువవచ్చు–జి.కె.

## అధ్యాయం-26

### రచయితలు, కవుల వాగ్గేయకారులు : వారి అంకితాలు, పొగడ్తలు

విజయనగర సార్వభౌములలో అత్యంత ప్రముఖుడైన కృష్ణదేవరాయలు తమ కావ్యాలను వేంకటేశ్వరుని కంకితం చేసిన వారిలలో ప్రథముడు. ఆతని పద్యకావ్యం **ఆముక్తమాల్యద** వలన అతను గీర్వాణాంధ్రాలు రెంటిలో మహాపండితుడని, విశిష్టాద్వైతసిద్ధాంతంలో దిట్ట అని తెలియ వస్తున్నది. తాను స్వయంగా కవి కావడమే కాక, విద్వత్తు కలిగిన వారికి రాజపోషకుడై కవులకు, కళాకారులకు, సంగీత విద్వాంసులను, నాట్యవేదులను, శిల్పులను, తాపీ పనివారిని, కట్టడాలరూపు రేఖలు నిర్దేశించే వారిని ఉదారంగా బహూకరించాడు **(155 వ పుట, 184-185 పుటలు - నోట్ 3 - శాసన సంబంధమైన రిపోర్ట్)** వార్షిక సమావేశా లేర్పాటు చేసిన కవులను, కళాకారులను ఉదారంగా సత్కరించేవాడు. వేంకటేశ్వరస్వామికి ప్రగాఢ భక్తుడైన అతడు యేడు పర్యాయాలు స్వామిని దర్శించాడు. మొదట్లో తన దండయాత్రలలో శత్రువులను వెన్నాడుతూ పోయినపుడు తన రాణులతోటి కానీ, వొక రాణితో కాని, స్వామికి తన భక్తిని చాటుకునేవాడు. విలువగల వస్తువులు, ఆభరణాలు స్వామికి బహూకరించాడు. శ్రీవేంకటేశ్వరుని గర్భగుడిపై వున్న ఆనంద దివ్యవిమానానికి బంగారు తొడుగు నిమిత్తమై 30,000 వరహాలు కేటాయించాడు. (ముందు ప్రస్తావించిన రిపోర్ట్‌లో 165 వ పుట చూడవచ్చు). క్రీ॥శ॥ 9-9-1518 నాటికి యీ పని పూర్తయ్యింది. తన **పారిజాతాపహరణం** కావ్యాన్ని అంకితం చేస్తూ రచించిన పద్యాలలో అతని ఆస్థాన కవులలో వొకడైన ముక్కు తిమ్మకవి **'శ్రీవేంకట గిరివల్లభసేవాపరతంత్రహృదయ'** (శ్రీవేంకటగిరి ప్రభువు - అంటే శ్రీవేంకటేశ్వరునికి నిరంతరం అంకితమైన మనస్సుగల వాడని - దీని అర్థం) అనే పద్యపాదంలో తన సార్వభౌముని భక్తిభావనను ప్రకటించాడు. అదే విధంగా అతని ఆస్థాన కవులలో అగ్రగణ్యుడైన అల్లసాని పెద్దనామాత్యుడు తన ప్రబంధమైన **మనుచరిత్ర** ను కృష్ణరాయల కంకితమిస్తూ తన సార్వభౌముణ్ణి **"కరుణాకర వేంకటవిభు చరణస్మరణ ప్రసంగసంగతమతి"** (వేంకటేశ్వర స్వామి పవిత్ర చరణాలపై నిరంతర ధ్యానం గలవానిగా, పండిత ప్రకాండులతో పరివేష్ఠింపబడిన వాడు) గా అభివర్ణిస్తాడు.

ఒరిస్సా రాజైన ప్రతాపరుద్రగజపతిపై తన కళింగ దండయాత్రలో భాగంగా వెడలినపుడు కృష్ణదేవరాయలు విజయవాడ వద్ద కొద్ది రోజులు విశ్రమించి క్రీ॥శ॥1516 జనవరి మధ్యభాగంలో శ్రీకాకుళానికి బయలు దేరాడు. అక్కడ వొకరాత్రి **'ఆంధ్రమధు మథనుడు'** లేక 'ఆంధ్రవిష్ణువు'ని సేవిస్తూ ఉపవసించాడు. రాత్రి నాలుగవ జాములో ఆంధ్ర కంజాక్షుడతనికి స్వప్నంలో సాక్షాత్కరించి రాయలు ఆముక్తమాల్యదతో చెప్పినట్లు తెలుగులో వొక కావ్యాన్ని వ్రాసి తనతో రూపసారూప్యం కలిగిన వేంకటేశుని కంకితమిమ్మని ఆదేశించాడు (**ఆముక్తమాల్యద**, అధ్యాయం-1, పద్యం 2). ఆముక్తమాల్యద కావ్యం యొక్క పేరు తాను ధరించిన దండను తాను నివసించే విల్లిపుత్తూరు గ్రామంలోని స్వామికి ధరింపజేయడానికిచ్చిన ముద్దరాలని అర్థం గలది. ఆ చర్యవలన ఆనాటినుండి ఆమె పేరు 'గోదా' (ఆండాళ్) అయినప్పటికీ,

ఆమెను **'సూడి-కొడుత్తనాచ్చియార్'** అని పిలిచేవారు. ఈ గ్రంథానికి మరోపేరు 'విష్ణుచిత్తీయం' (విష్ణుచిత్తునకు సంబంధించినది). ఇది నిశ్చయంగా గోదాదేవి లేక ఆండాళ్, ఆమెను పెంచి పెద్ద చేసిన తండ్రి విష్ణుచిత్తునికి సంబంధించినదే అయినా పురాణేతిహాసాలలోని మహనీయులకు సంబంధించిన ఘట్టాలతో కూడి, విశిష్టాద్వైత తత్వం, నీతిశాస్త్రాలను ప్రబోధిస్తుంది. చదవడానికి, అర్థం చేసుకోవడానికి యిది క్లిష్టమైన గ్రంథం. విష్ణుచిత్తులు విల్లిపుత్తూరు దైవానికి భక్తుడు. తానే పెంచి పోషించిన వొక ఉద్యానవనంలోని పూలతో, నాటి దండలతో భగవదారాధన చేసేవాడు. అతడు నిస్సంతు. ఒకరోజు ఉద్యాన వనంలో మట్టి తీస్తుండగా, భూగర్భంలో వొక ఆడశిశువుని చూసి, ఆమెను తన యింటికి తీసుకొని పోయి పెంచుకున్నాడు. ఆ శిశువు పెరిగి పెద్దదవుతున్న కొద్దీ స్థానిక దైవం మీద ప్రగాఢ విశ్వాసం పెంచుకుంది. ఆమెను పెంచిన తండ్రి రోజూ దైవారాధనకి పూలదండలు గ్రుచ్చేవాడు – ఆమె వాటిని కాసేపు అలంకరించుకొని వాటిని తీసివేస్తూ వుండేది. ఆమె తండ్రి తన కుమార్తె చేసిన యీ పని తెలియక, ఆలయానికి వాటిని తీసుకొని పోయి దేవుణ్ణి అలంకరించడానికి యిచ్చేవాడు.

17 వ శతాబ్దిలో **'విశ్వగుణాదర్శచంపు'** రచయిత అయిన **వేంకటాధ్వరి** తన గ్రంథంలో (191-206 పద్యాలలో) వేంకటేశ్వరస్వామిని యీ విధంగా వర్ణించారు.

"ప్రభువు శ్రీనివాసమూర్తి వైకుంఠంపై తన ప్రేమ వీడి శేషాచలానికి వేంచేసి తన భార్య రమ (అలమేలుమంగమ్మ) తో క్రీడిస్తున్నాడు. ఆతడు వేదమూర్తి, జగద్రక్షకుడు, ఆశ్రితవరదుడు. శేషాద్రిపై కొలువుండి సకల జీవులకు, సకల జగత్తులకు సృష్టి, స్థితి, లయ కారకుడు. కరుణామయుడైన వేంకటేశ్వరస్వామి, మానవుల ద్వారా తాను భక్తసులభుడనని చాటి చెపుతున్నాడు. ఈ స్వామి కృష్ణుని అవతారంలో 'పృథుకములు' (ఎండబెట్టి దంచిన బియ్యం – అటుకులు) స్వీకరించి దానికి బదులుగా అనంతమైన ఐశ్వర్యం ప్రసాదించాడు. అదేవిధంగా యీ కలియుగంలో వేంకటేశ్వర స్వామి భక్తుల నుండి తృణమో, పణమో స్వీకరించి దానికి బదులుగా వారి కోరికలన్నీ తీరుస్తాడు. అగణితగుణగణుడైన స్వామి వారి గుణాలు వర్ణనాతీతమైనవి. ఈ స్వామి తన కృపవలన చెవిటి వాడు వినేలా, మూగవాడు పలికేలా, అవటి వాడు (చేయిపని చేయనివాడు) వ్రాసేలా, గ్రుడ్డివాడు చూసేలా, కుంటివాడు పర్వతం అధిరోహించేలా, గొడ్రాళ్ళు సంతానవంతులై కొండనెక్కేలా చేస్తున్నాడు".

తన గ్రంథాన్ని వేంకటేశ్వరుని కంకితంచేసిన మరొక రచయిత తెలుగు కవి **చింతలపల్లి ఛాయాపతి**. ఇతడు **'రాఘవాభ్యుదయం'** అనే గ్రంథాన్ని తెలుగులో రచించి వేంకటేశ్వరుని కంకితమిచ్చాడు. ఈ గ్రంథకర్త పండిత కుటుంబానికి చెందినవాడు. బోరవల్లికి చెందిన వెంకటరెడ్డి ఆహ్వానాన్ని పురస్కరించుకొని యీ కవిత రచించి, వేంకటేశ్వరస్వామి కంకితమిచ్చాడు. ఇతడు 18 వ శతాబ్దంలో తెలంగాణాకు చెందిన వాడు. పాత నిజాముకు చెందిన గద్వాల్ సంస్థానంలో తరువాత రోజులలో విలీనమైన బోరవల్లి రాజుల కోరిక మేరకు యీ రచన చేపట్టాడు (30-1-1966 న 'హిందూ' పత్రికలో దాని సమీక్ష చూడవచ్చు).

తిరుమల తిరుపతి దేవస్థానపు ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్‌కి చెందిన శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి గారు 19 శతకాలు (శతకమంటే వంద పద్యాలు), స్తవం (శ్లాఘిస్తూ వ్రాసిన రచన), తిరుమల తిరుపతి దేవస్థానపు యితర రకాల వ్రాతప్రతుల నుండి ప్రచురించబడిన గద్యం తీసుకుని సంకలనంగా రూపొందించాడు. ఇవన్నీ **'శత్రుసంహార వేంకటాచలవిహార'** (శత్రునాశకుడు, వేంకటాచలంపై క్రీడించే వాడు), **'వేంకటశైల నాయక', 'వేంకటరమణ', 'వేంకటేశ్వర'** (వేంకటనగరానికి ప్రభువు), **'వేంకటాచలపతి'** మొదలైన నామాలతో స్వామినుద్దేశించినవి. కొన్ని సంపూర్ణంగా ఉన్నాయి. మరికొన్ని అసంపూర్ణంగా ఉన్నాయి. చాలా గ్రంథాల రచయితలెవరో తెలియదు. ఈ గ్రంథానికి (సంకలనానికి) **'శ్రీవేంకటేశ్వర లఘుకృతులు'** అని పేరు పెట్టాడు. వీటిలో **'వేంకటాచల విహారశతకం'** 17 వ శతాబ్ది మూడవ చతుర్థభాగంలో గోల్కొండ సుల్తాన్‌కు చెందిన తురుష్క సైన్యాలు తిరుపతిపై కొనసాగించిన విధ్వంసకాండ, తిరుపతి వాసుల వేదనకు సంబంధించినది (291–297 పుటలలో వివరించబడింది).

**'వేంకటాచలధామతారావళి'** (27 పద్యాలు, 27 నక్షత్రాల సంఖ్యతో సమానం – యీ పద్యాలన్నీ వేంకటాచల నివాసునికి చెందినవి). ముజ్జగాల నేలే వేంకటేశ్వరుడు శుద్ధంగా లేని పళ్ళెరాలలో ముడి బియ్యంతో చేసిన అన్నం తినవలసి వచ్చిందని, చిల్లర కాసుల కోసం చెయ్యి జాచవలసి వస్తోందని, ధనలక్ష్మి (శ్రీలక్ష్మి) తన వక్షస్థలంపై నివాసమున్నప్పటికీ కాసు, కాసు కూడబెట్టి వడ్డీ చెల్లించడానికి తన ధనరాశిని పెంచే ప్రయత్నంచేస్తున్నా డని విచారిస్తాడు. "నీ సేవకుని కోరిక నా కోరిక కాదా?" అని ప్రశ్నిస్తాడు.

**'పంకజాతభవాండేశతకం'** దశావతారాలు నొక వేంకటేశ్వరునివే నని, కలియుగాంతంలో దుర్మార్గులు భూమిని పరిపాలించేటప్పుడు, ధర్మగ్లాని సంభవించి నప్పుడు, రాజులు, యితరులు దొంగలవలె వ్యవహరించి నప్పుడు, గొప్పనదులు (జీవనదులు) యింకిపోయినపుడు, కరువుకాటకాలు తాండవమాడేటప్పుడు, కల్కిగా అవతరించి క్రూరులను మట్టుబెట్టి భూమిపై ధర్మం స్థాపిస్తాడని వర్ణిస్తాడు. దానిలో అతని కిరీటం, కుండలం, కౌస్తుభ మాణిక్యం, రత్నహారం, వక్షస్థలంపై విస్తరించిన అలమేలుమంగని వర్ణిస్తాడు.

**'వేంకటేశ్వరపంచకం'** లో స్వామి నుదుటనున్న కస్తూరీ తిలకం, మధువుతో నిండిన పద్మావతిపై వ్రాలే భ్రమరాలను తిరస్కరించే అతని శిరోజాలు, ఆతని వక్షస్థలంపై నున్న ముత్యాలసరాలు, అలమేలుమంగ ప్రస్తావన వున్నది. వేంకటేశ్వరుని శిరోజాలు, అతని వక్షస్థలంపై నున్న ముత్యాలసరాలు, అలమేలుమంగ ప్రస్తావన వున్నది. వేంకటేశ్వరుని శిరోజాల ప్రస్తావన చాలా ప్రత్యేకమైనది.

కవి **'వేంకటాచలపతి శతకం'** లో అలమేలుమంగ చూచుకముల అరుణపరాగం స్వామి వక్షస్థలంపై ముద్రించిన గుఋతులు, శేషశక్ష్మలం మీద స్వామి శాశ్వత నివాసం ప్రస్తావిస్తాడు. తనను రక్షించమని వేడుకుంటాడు. వేంకటేశుని శంఖచక్రాలు, పద్మాలవంటి పాదాలు సమగ్రంగా దర్శించానని, ఆతని పులుకాపు తీర్థం (సువాసితమైన అభిషేక జలం) వాసనచూసేనని, వొక గుక్క రుచిచూసేనని, పురాకృతపాపాలను

నాశనం చేసే స్వామి ప్రసాదం ఆస్వాదించానని వర్ణిస్తాడు. "నీవే (శ్రీవేంకటేశుడు) ముజ్జగాలకు విధాతవు. ఇది నిరూపించడానికి వొక శిల నీటిమీద తేలేలా చేస్తాడు. నీవే పరమపవిత్రుడవు. అన్నిటినీ పవిత్రం చేయగలవు. నాకంటె పరదైవ మెవ్వరూ లేరు. పాములను ముట్టి, నీ పవిత్ర చరణాలు స్పృశించి యీ విషయమే చాటుతారు. నీ సేవకుని శక్తి చూస్తూ వుండు". "ఈ నాటికి నీ చరణాల యందలి నా భక్తి మదిలో స్థిరత్వం సంతరించుకున్నది". "నా జన్మధన్యమైనది. నా సౌశీల్యం జయించినది. భవసాగరం తరించడానికి నీ చల్లనిచూపే నావ". "నా పుత్రికకు దుస్తులు ధరించడం, రంగస్థలంపై నిలబడడం నేర్పాను. నిన్ను చక్కగా స్తుతిస్తూ పాడటం కోసం ఆమెకు నాట్య తత్త్వనీతి నేర్పాను". "ఇవి లక్ష్మీదేవి వొత్తే నీ పాదాలలో సహజంగానే నిక్షిప్తమై వున్నాయి. నీ తులసిమాల, వరమాలికలలోను వున్నాయి. నీ శంఖ చక్ర చిహ్నాలలోనూ వున్నాయి. నీ తిరుమణి తిరుచూర్ణరేఖ (నుదుటపైనున్న తెల్లని సమాంతర రేఖలు, మధ్యలో నున్న ఎఱ్ఱటి తిలకం) లలో ఉన్నాయి". "తండ్రి ప్రాపు లేనిదే తనయుడు వర్ధిల్లడు. నీవు త్రిజగదధీశ్వరుడవు వినయశీలురైన నీ సేవకులను క్షమించి, రక్షించడానికి ప్రతిన బూనావు".

**'వేంకటనగాధ్యక్షశతకం'** రచయిత వేంకటేశుణ్ణి యిలా ప్రశ్నిస్తాడు. "నేను పిలిచినపుడు, నువ్వు పలకవు. నా యెడల నీకు కరుణ లేదా? ఉన్నా, దిక్పాలురందరి స్తోత్రపాఠాలు వినడంలో నిమగ్నుడవయి, నా పిలుపు వినలేదా? లేక వడ్డికాసుల సంపాదనకై గ్రామగ్రామాలు తిరుగుతున్నావా? మా తప్పులు లెక్కిస్తున్నావా? ఆహా! మంచిదే. తరువాత యేమిటి? నీవు నా కుడిచేతిని అధోదిశగా చూపుతున్నావు. ఈ స్థలాన్ని వైకుంఠంగా లెక్కించుకోమంటావా? లేక నీ శుభప్రదమైన పాదాలు చూడమంటావా? అవి కర్మవలన అవిద్యకు గురియైన మనుజులను రక్షించగలవని తెలుసు. నా కా విషయమై శంక వున్నది. అందువలన నిన్నే చెప్పమని అడుగుతున్నాను." "గతంలో కూడా గాధలనేకం విన్నాను. నీ ఆశ్రితులకు నీవే రక్షకుడవు. అన్యులెవ్వరూ లేరు. నీ పాదాలే జగత్తులకు రక్ష. భ్రమలో పడ్డ ప్రజలకు నీవే రక్షకుడవు". "నా కన్నులపండువగా నీ బంగారు దుస్తులు, నీ శంఖ చక్ర భంగిమలు, నీ నుదుటిపైన అభయప్రదమైన తిలకం, అణిమాద్యష్టమ సిద్ధులు భాసించే నీ పాద ద్వయం తిలకించాను".

**'శ్రీవేంకటేశ్వరకళ్యాణం'** సరళశైలిలో త్రిమూర్తులలో అగ్రగణ్యుడెవ్వరో పరీక్షించి తెలుసుకోవడానికి లక్ష్మీనివాసమైన విష్ణువు కుడి వక్షాన్ని భృగుమహర్షి తన్నే పురాణగాథను వర్ణిస్తుంది. తెలిసిచేసిన యీ పరాభవానికి ఆమె ఆగ్రహించడం, కొల్హాపురానికి (కొల్హాపూర్) తరలి పోవడం, వైకుంఠానికి తిరిగి రమ్మని విష్ణువు ఆమెను ప్రాధేయపడటం, పద్మసరోవరానికి (తిరుచానూరులోని పద్మసరస్సు) వెళ్ళిన పిమ్మట వేంకటగిరి మీద కలిసి ఉందామని ఆమె తెలియజేయడం, అక్కడ ఆమె శ్రవణ నక్షత్రంతో కూడిన వొక శనివారం నాడు, కార్తీకమాసంలో అయిదవనాడు అలమేలుమంగ అనే పేరుతో స్వర్ణకమలంలో జన్మించడం, ఆ సమయంలో అక్కడకు వచ్చిన దేవతలలో తాను వరించిన శ్రీహరి మెడలో తాను ధరించిన పుష్పమాల వేయడాన్ని వర్ణిస్తుంది. అప్పుడు దేవగురువు బృహస్పతి వారి వివాహం జరిపించాడు.

ద్విపద ఛందస్సులో, వ్యావహారిక శైలిలో, తరిగొండ వెంగమాంబ వేంకటేశ్వరుడు, లక్ష్మీదేవి వివాహ వృత్తాంతాన్ని హాస్యరస స్ఫోరకమైన ఘట్టాలతో **'శ్రీరమాపరిణయం'** గా విరచించింది. తన చిన్ననాటి నుండి యీ కవయిత్రిలో తన స్వగ్రామంలోని దైవం తరిగొండ నరసింహస్వామి పట్ల భక్తి తత్పరత అంకురించింది. నరసింహుని యెడల ఆమె హృదయం భక్తి పారవశ్యంతో నిండిపోయింది. ఈ భక్తి తిరుపతి వేంకటేశ్వరస్వామి యెడల కూడా ప్రాకింది. వారిద్దరూ వొకటే అని ఆమె భావన. ఆమె తండ్రి ఆమెను బలవంతంగా పెళ్ళి చేశాడు. దిశలేని జీవితం నుండి మరలించి ఆమెనొక యింటి దానిని చేయాలనుకున్నాడు. కాని, ఆమె గృహస్థ జీవనం త్యజించి వేంకటేశ్వరస్వామి సేవకు మన స్ఫూర్తిగా అంకితం కావాలను కున్నది. చిన్నతనంలో ఆమె భర్త మరణించగా తన తల్లిదండ్రులను వదలి, బాల్యవితంతువైన ఆమె తిరుమలకు పోయి అక్కడ స్థిరపడి వేంకటేశ్వర స్వామినే నిరంతరమూ ధ్యానించేది. 'శ్రీరమాపరిణయం' చివర ఆమె ప్రస్తావించినట్లు **సుబ్రహ్మణ్య గురువు** అనే ఆయన వద్ద ధ్యానానికి తోడు యోగం కూడా అభ్యసించింది. ఇక్కడే ఆమె నందవరీకుడు, వశిష్ఠ గోత్రుడు అయిన తన తండ్రి పేరు **కానాల కృష్ణయ్య**గాను, తల్లిపేరు **మంగాంబ**గాను ప్రస్తావించింది. తాళ్ళపాక అన్నమాచార్య, కవితిలకుడు అల్లసాని పెద్దనామాత్యుడు, కృష్ణదేవరాయల ప్రధానమంత్రి సాళువ తిమ్మరుసు యిదే శాఖకు చెందినవారు. ఆమె భర్త ఇంజేటి వేంకటాచలపతి నుండి, ఆమెకు **'ఇంజేటి'** అనే యింటిపేరు వచ్చింది.

**ద్విపద భాగవతం, రాజయోగసారం, వేంకటాచలమాహాత్మ్యం** అనే యితర గ్రంథాలలో తాను నిరక్షరాస్యురాలినని, ఏ ఉపాధ్యాయుడు తనకు ఓనమాలు నేర్పలేదని చెప్పుకున్నది. నరసింహస్వామి కృపవలన తాను వ్రాయడానికి యత్నించినందు వలన తన ఛందస్సులో తప్పులు పట్టవలదని పండితులను, విమర్శకులను ప్రార్థించింది. తన యోగశక్తిని బాగా పెంపొందించుకుంది. అతీంద్రియమైన మేధాశక్తితో గీర్వాణాంధ్ర భాషలు రెంటిలో పాటవం సంపాదించి, పాండిత్యం పెంపొందించుకొని తెలుగు కవితలో వరాహ, భవిష్యోత్తర పద్మపురాణాలు మూడూ తెలుగులో వ్రాయగల ప్రజ్ఞ సంతరించుకుంది. అవసరమైన స్వంతమార్పులతో పద్మపురాణం వ్రాసింది. మహాభారత, భాగవతపురాణాలు ఆధారంగా పద్యాలు, కావ్యాలు రచించింది. ద్విపద ఛందస్సులో రాజయోగసారమనే చిన్న కావ్యం వ్రాసింది. **వేంకటాచలమాహాత్మ్యము, ద్విపద భారతము, చెంచు నాటకము, యోగ వాసిష్ఠము, రాజయోగసారము, విష్ణుపారిజాతము, శ్రీరమాపరిణయము, శివనాటకము, ముక్తికాంతావిలాసము** మొదలైనవి ఆమె రచనలు. ఆమె తన రచనలను తరిగొండ నరసింహస్వామికి, శ్రీవేంకటేశ్వరస్వామికి (వారిద్దరినీ వొకే దైవం యొక్క రూపాలుగా భావించి) తన కావ్యాలన్నీ అంకితం చేసింది. తన 'విష్ణుపాదం' లో వారిద్దరినీ శ్రీకృష్ణునితో సమానంగా భావించింది.

ఆమె బహుశా 18 వ శతాబ్దపు ఉత్తరార్థంలోను, 19 వ శతాబ్దపు పూర్వార్థంలోనూ నివసించేది. గోగర్భతీర్థంలో వున్నప్పుడు వేంకటేశ్వర స్వామిని నిరంతరం దర్శిస్తూ అట పిమ్మట అనేక సంవత్సరాలపాటు

గుడికి పదిమైళ్ళ ఉత్తరంగా నొక దట్టమైన అడవి మధ్యంలో నిర్భీకురాలై తుంబురుకోన* కు పోయి తన జీవితపు ఉత్తరార్థంలో తీవ్రమైన యోగం, ధ్యానంలో గడిపింది. కొంతకాలం గడిచిన పిమ్మట, ఆమె తిరుమలకు తిరిగివెళ్ళింది. ఆధ్యాత్మికానందంలో వేంకటేశ్వరస్వామిని దర్శిస్తూ కాలం గడిపింది. ఎప్పుడు కోరితే అప్పుడే ఆమెకు వేంకటేశ్వరస్వామి దర్శనమిచ్చే వాడని ప్రతీతి. అంటే ఆమె యోగసమాధిలో స్వామిని దర్శించేదన్న మాట. ఆమె సమాధి తిరుమలలోని ఉత్తరపు వీధిలో ఉత్తరాన నున్న వొక తోటలో యింకా వుంది. ఇది ఆమెను రక్షోదేవతగా పేర్కొనే ఎస్.వి.బి.నాగిరెడ్డి ఇంగ్లీష్ మీడియమ్ స్కూల్ ఆవరణంలో వుంది. ఆమె వేంకటేశ్వరుని ఆలయంలో ఉయ్యాలలో శయనించే భోగశ్రీనివాసమూర్తికి విష్ణువు దశావతారాలలో వొకదాని కూపంలోముత్యాలు పొదగబడిన వొక వెండిపళ్ళెంలో కర్పూరదీపాలు వొక దానివెంట వొకటి పేర్చి ప్రతిరాత్రి **ముత్యాల హారతి** యిచ్చేది. ఆమె వంశీకులద్వారా యీనాటికీ యీ అభ్యాసం అమలులో వుంది. ఆమె ధన్యజీవి.

తరిగొండ వెంగమాంబ పేరిట గ్రామాలు, భూముల దానం, బంగారు నాణాల బహుమానం, బియ్యం దానం రిజిష్టర్ చేయబడిన 31 తాళపత్రపు దస్తావేజులు వెంగమాంబ కుటుంబంలో సంబంధం వున్న కీ॥శే॥ శ్రీ గండేపల్లి కుప్పయ్యగారిచే భద్రపరచబడ్డాయి. శ్రీ కృష్ణారెడ్డి, ఎమ్.ఏ.,బి.ఇడి. (గోపీకృష్ణ) తిరుమలలోని తరిగొండ వెంగమాంబ ఉద్యానవనంలో ఉన్న ఎస్.వి.బి.నాగిరెడ్డి ఇంగ్లీష్ మీడియమ్ హైస్కూల్‌లో ప్రిన్సిపాల్‌గా వుండగా, విద్వాన్ కె.జె.కృష్ణమూర్తి, ఎమ్.ఏ., ఎస్.వి.యు. ఓరియంటల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ వారి పరిశోధనకై వీటిని తెప్పించారు. విద్వాన్ మూర్తిగారు వీటిపై తాను వ్రాసిన సంగ్రహమైన వివరణను నాకు దయతో చూపించారు. ఇవి శక సంవత్సరం 1707 నుండి, కలియుగం 4886 వ సంవత్సరం నుండి, ప్రదక్షిణ వరుసక్రమంలో వచ్చే విశ్వావసు సంవత్సరం, చైత్రమాసం - అంటే క్రీ॥శ॥1785 మార్చి నుండి శక సంవత్సరం 1730 (కలియుగ సంవత్సరం 4909), ప్రదక్షిణ వరుసక్రమంలో వచ్చే విభవ నామ సంవత్సర ఫాల్గుణ మాసం (అంటే క్రీ॥శ॥1809) వరకు - 25 సంవత్సరాల కాలానికి చెందినవి.

---

* తుంబురుకోన లేక తుంబురుతీర్థం అనబడే సన్నని త్రోవ ప్రకృతి సిద్ధమైనది. 100 కోట్ల సంవత్సరాల పూర్వమే వుండేది. భూగర్భశాస్త్రరీత్యా ఉత్సుకత కలిగించే యీ కోన దట్టమైన అడవులతో, సమ్మోహనమైన ప్రకృతిలో వొక అద్భుత దృశ్యం. ఈ నాటికీ సామాన్య మానవులు గుంపులుగా తప్ప వొంటరిగా అక్కడికి వెళ్ళడానికి సాహసించరు. అక్కడ రాబోయే ప్రమాదాలు ఆనాడు తరిగొండ వెంగమాంబ అక్కడకు వెళ్ళి వుండడాన్ని బట్టి ఊహించవచ్చు.

ఈ తీర్థానికి దగ్గరలో **'వెంగమాంబ గెవి'** అనే వొక గుహ వుండేది. అక్కడ వెంగమాంబ తపస్సు చేసిందంటారు. తిరుమల గుడినుండి ప్రస్తుతం కాన్వెంట్ వున్న ఉద్యానవనానికి పోయే వొక రహస్య మార్గం వుండేదని వొక నమ్మకం. దానికి సాక్ష్యంగా వొక పెద్ద నాపరాతితో కప్పబడిన బావివంటి గొయ్యి వొకటి బడిలోని ఆమె సమాధి మంటపానికి సమీపాన కానవస్తున్నది. ఆమె పూజలందుకున్న వొక సూక్ష్మరూపధరుడైన హనుమద్విగ్రహం కూడా అక్కడ వున్నది. ఆ నాపరాతి మీద ఆసీనురాలై ఆమె వేంకటేశ్వరునికి పూలదండలల్లినట్లు చెబుతారు. ఈనాటికీ ఆ స్థలాన్ని పవిత్రమైనదిగా భావించి పూజలు చేస్తారు. ఆమె అడుగుజాడలో మహంత్ ప్రయాగదాస సహాధ్యాయి అయిన అధికారి రామలక్ష్మణదాస తుంబురుకోన వద్ద 6 మాసాలు తపస్సు చేశాడు (గోపీకృష్ణ).

ఆమెకివ్వబడిన బహుమానాలు వైశాఖమాసంలో నృసింహ జయంతి జరపడానికి, ఆ రోజున అన్నదానం చేయడానికి యివ్వబడినవి. అనేక సంవత్సరాల ముందు ఆమె వీటిని జరపడం ప్రారంభించి వుండాలి. వైశాఖమాస శుక్లపక్షంలో 13 వ రోజు వచ్చే యీ జయంతి, చాంద్రమాస చైత్రమాస శుక్లపక్షంలో 9 వ రోజున (మార్చి–ఏప్రిల్‌లో) వచ్చే శ్రీరామనవమి, శ్రావణమాస (సెప్టెంబర్ నెల) కృష్ణపక్షంలో 8వ రోజున వచ్చే శ్రీకృష్ణ జన్మాష్టమి (గోకులాష్టమి లేక కృష్ణజయంతి) వంటిది. ఈ జన్మదినాలలో ఆయా దైవాలను యిళ్ళలోను, గుడులలోను విస్తృతంగా అర్చిస్తారు.

నృసింహజయంతి నాడు వెంగమాంబ చేసే అన్నదానం కోసమే అనేక గ్రామాల ప్రజలు ఆమెకు బహుమానాలిచ్చేవారు. ఈ దాతలలో గ్రామపెద్దలు, ఎకౌంటెంట్లు, రైతులు, పురోహితులు, వైశ్యకులానికి చెందిన వ్యాపారస్థులు, ఫణాలవారు (చిల్లర బేరం చేసే దుకాణదారులు), బేరిసెట్లు (బంగారు, వెండి ఆభరణాలు అమ్మేవారు), **'నూట– యిబ్బంద్రు–నాగరం వారు'** (102 మంది నగరంలోని ప్రముఖ వర్తకులు), పాలెగార్లు (పోవాస్ లేక సైన్యాధికారులు వీరి జీవనాని కనుగుణంగా వీరికి కొన్ని గ్రామాలు అప్పజెప్పబడ్డాయి. వేంకటేశ్వరస్వామి ఆలయం, దాని పరిసర ప్రాంతాల పరిరక్షణ బాధ్యతలలో చాలు కవాతులు జరిగే ప్రదేశాల బాధ్యతల కూడా వీరికి అప్పజెప్పబడింది), దిండిగల్ జమీందారు కూడా వున్నారు.

దాతల గ్రామాలలో కొన్నిటిని తిరువిళయాట్టమ్ (నిజానికి **'తిరువిళయాట్టం'** అంటే దేవుని కిచ్చివేయబడినవి – దేవదానం) అని పిలిచేవారు. ఇది 'ఉర్' మండలం (వేంకటేశ్వరుని గుడికి చుట్టూ వుండే ఆలయ మధ్య ప్రాంతం, లోననున్న లేక లోపలి ఆవృతం) లోనివి. ఇది **గొడగరనాడు** లోనిభాగం. 'గొడుగుల నాడు' అనే పదంగా పొరబాటుగా అనువదించబడిన ప్రాచీన తమిళనామం **'కుడవూర్‌నాడు'**, 'కుడ' (కోడై)ని 'గొడుగు' గా దేవస్థానపు శాసనాలు కొన్నిటిలో వ్యాఖ్యానించారు. 'గొడగర్‌నాడు'* గా పేర్కొనబడిన యీ ప్రాంతం వొకే గొడుగు క్రిందకు వచ్చే వొక గ్రామ సముదాయంగా భావించబడింది. కుడవూరు గ్రామం వీటన్నింటి మధ్యలో వుండేది. ఈ గ్రామం తిరుపతికి కొంచెం దక్షిణంగా వుండేది. ఈనాడు దీని జాడలేదు. ఈ గ్రామాలన్నీ తొండ మండలంలోనివి.

శక సంవత్సరం 1707 లో ప్రప్రథమంగా వ్రాయబడిన పత్రంలో, కలియుగ శక సంవత్సరం 4886 లో, ప్రదక్షిణ వరుస క్రమంలో వచ్చే విశ్వావసు నామసంవత్సరం, అశ్వినీ నక్షత్రయుక్త చైత్రమాస శుక్లపక్ష భానువారం నాడు (మార్చి 1785), చంద్రగిరి తాలూకాకు చెందిన కరణం సేతువరాయ పిళ్ళ 50 గుంతల భూమి దానానికి సంబంధించిన పట్టా (మాతృశ్రీ వెంగమాంబ పేరిట) వ్రాసి యిచ్చాడు. ఈ

* గొడగర్‌నాడు : ఈ ప్రాంతంలో కాపులు లేక రెడ్లు – అంటే సువర్ణముఖి నదీతీరాన నివాసమేర్పరుచుకుని వున్న రెడ్లు ఆ ప్రాంతనామానికనుగుణంగా గొడగనాటి రెడ్లుగా పిలువబడేవారు. [ఆంధ్రప్రదేశ్‌లోని రాయలసీమలోగల అనంతపురం జిల్లాలో ఇప్పటికి 'గొడగర్లు' అనే ప్రత్యేక జానపద నృత్య కళాకారులున్నారు. వీరు వీరశైవ సంప్రదాయానికి చెందినవారు. చూ॥ జానపద నృత్యకళారీతులు – గొడగర్ల సంప్రదాయం (డా॥ బి.రామాచార్యులు –1998)]

భూమి కొలవడానికి 48 అడుగుల పొడవుగల కర్రని ఉపయోగించారు. ఈ భూమిని స్థలాలుగా విభజించారు. ఇవి ఆగారం (అగరాల) జలాశయానికి దగ్గరలో ఉన్నాయి. ఆగారం (అగరాల) గ్రామం పర్వత దుర్గమైన చంద్రగిరికి పశ్చిమంగా, ఐతేపల్లికి తూర్పున, వృషభ పర్వతానికి ఉత్తరాన, శేషాచలానికి దక్షిణ ప్రాంతంలోను, తొండ మండలం (కాంచీపురం కేంద్రంగా గల పురాతన పల్లవరాజుల భూభాగం) లో **తిరువిళయాట్టం, ఉర్ మండలా**లలో వున్నాయి.

తరువాత రికార్డులో – శక సంవత్సరం 1716, ఆనంద, మార్గశిర శుద్ధ పౌర్ణమి రోజున (డిసెంబర్ 6, 1794, శనివారం), ఔబలరాజు, వెంగమాంబల కుమారుడు కదిరి పోతరాజు మనుమడు అయిన కల్లూరి రంగపతిరాజు (బహుశా కల్లూరు పాళేగార్) పురోహిత కుటుంబానికి, శెట్టివర్తకులు (సెట్టి లేక కోమటి కులానికి చెందిన వర్తకులు), కాపులు (వ్యవసాయం చేసేవారు), పణాలవారి (చిల్లర వర్తకులు) కుటుంబానికి చెందిన వొక్కొక్క గృహస్థ (దాతల పరిపాలనలోని గ్రామాలకు చెందినవారు – మా తాలూకా – గ్రామాదులలో) సంవత్సరాని కొక అపరంజిక (చిన్నబంగారు నాణెం) కట్టవలెనని (ఘనమైన నృసింహ జయంతి పర్వదినాన అన్నదానం కోసం) శాసించాడు.

వర్షాశన దానపత్రికలో (సంవత్సరచందాకు సంబంధించిన దానపత్రం) పుల్లూరు మొగరాల పాలెగారు రఘునాథనాయనివారు వొక శాసనం చేసినట్లుగా చెబుతారు. ఘనమైన శ్రీనృసింహజయంతి పర్వదినం నిమిత్తమై శ్రీ వెంగమాంబగారికి సంవత్సరానికి 5 వరహాలు చెల్లించవలసినదిగా శాసించాడు. ఈ శాసనం శక సంవత్సరం, 1717, రాక్షస, ఆశ్వయుజ పౌర్ణిమ, సౌమ్యవాసరం నాటిది (బుధవారం, పౌర్ణిమ, 28 అక్టోబర్, క్రీ॥శ॥1795).

ఆ సంవత్సరంలో పదిరోజుల పిమ్మట ఆశ్వయుజ బహుళ దశమినాడు (శనివారం, క్రీ॥శ॥7-11-1795 నాడు) బంగారుపాలెం పాళేగార్ అయిన చంద్రశేఖరనాయనివారు (వెంకటవీరప్పనాయనివారి కుమారుడు, చంద్రశేఖరనాయని వారి మనుమడు) **శ్రీమాన్ మహానాయంకరాచార్య బిరుదాంకితుడు,** తన పాలనలో వున్న గ్రామాలలో 12 వరహాలు, వర్షాశన దానం గావించాడు. ఇది ఘనమైన నరసింహస్వామి జయంతి పర్వదినం నాడు అన్నదానానికై మాతృశ్రీ వెంగమాంబకు చెందేలా శాసించాడు.

తరువాత సంవత్సరంలో శక సంవత్సరం 1718, నల కార్తీక శుద్ధ దశమి (నవంబర్, క్రీ॥శ॥1796) నాడు పాళేగార్ రాజశ్రీ మామందూరు కృష్ణనాయని వారొక దానశాసనం చేశారు. దీని ద్వారా బరణిగడ్డ పంటపొలంలోని 97 గుంటల భూమిని దానం చేశారు. ఈ పొలం పుదిపట్లలోని తూంగపాళ్లుకు పశ్చిమాన, పెరుమాళ్ళపల్లెకు తూర్పున, **శేషాచల పర్వతానికి దక్షిణాన, తిరువిళయాట్టమ్ – ఉళ్ మండలంలో, కృష్ణనాయని పరిపాలనలో వున్నది. నృసింహోత్సవం నాడు అన్నదానం చేయడం నిమిత్తమై యీ భూమిని శ్రీ వెంగమాంబ మఠానికి దానం చేశాడు.** ఆచంద్రతారార్కం దాత దీన్ని అనుభవించేలా శ్రీలక్ష్మీనరసింహ స్వామికి అంకితంగా జల, హిరణ్య తర్పణలతో యీ భూమిని దానం చేశాడు.

శక సంవత్సరం1718 లో అదే రోజున, నలకార్తీక శుద్ధ దశమి (క్రీ॥శ॥1796 నవంబర్‌లో) మామండూరు పాలెగారి కుటుంబానికి చెందిన నొక సభ్యుడు (బహుశా అతనే అసలు పాళేగార్ అయి వుండవచ్చు. పైన దస్తావేజుల్లో చెప్పబడిన దాత అతని సోదరుడో, కుమారుడో, వుండవచ్చు). వేంకటప్పనాయనివారు (మామండూరి సర్వప్పనాయకులు) రాజమాన్య రాజపూజితుడైన రాజశ్రీ బిరుదాంకితుడు (రాజుగారికి అభిమాని, రాజపూజకుడు, మాన్యుడైన రాజు), అదే విధమైన దానం - 77 గుంతల పరిమాణం గలది - అదే కాలంలో, అదే భూపరిధిలో, అతని అధీనంలోనిదే, నృసింహస్వామి సర్వంలో అన్నదానానికై వెంగమాంబకు దానం చేశాడు.

ఈ దాన శాసనం **టంకాల వరదప్ప కుమారుడు వేంకటరాముడు** వ్రాయించినట్లు తెలియవస్తోంది. వరదప్ప బహుశా టంకశాలలో పని చేసివుండటం చేత అతని యింటిపేరు టంకసాల అయి వుండవచ్చు. దీనివలన నాణాలు ముద్రించటానికి వొక టంకసాల వుండేదని తెలియ వస్తోంది. ఇది బహుశా మామండూరు పాళేగారి ఆధ్వర్యంలో ఉండేది.

శక సంవత్సరం 1720 - కాళయుక్తి - శ్రావణ బహుళ పంచమి క్రీ॥శ॥1798 ఆగస్టులో) నాడు దాసరి నాయని వారి మనుమడు, రాఘవప్ప నాయనివారి కుమారుడు, కరకంబాడి పాలెగారయిన వీరరాఘవప్ప నాయనివారు నల్లమానికాల్వ గ్రామానికి ఈశాన్యంలో వున్న 100 గుంతల భూమిని వైశాఖమాసంలో వెంగమాంబ శ్రీకారం చుట్టిన నృసింహోత్సవంలో అన్న సంతర్పణకై తరిగొండ వెంగమాంబను దానికి ఆచంద్రతారార్కం దానవిక్రయాధికారాలతో, వారి శిష్యులు కూడా అనుభవించేలా వ్రాసి యిచ్చాడు.

కార్వేటినగరం తాలూకా లోని తయ్యూరు పాయకత్తులో పెదకొండపల్లి గ్రామానికి చెందిన వొక పేరు మోసినరైతు బసివిరెడ్డి నృసింహజయంతి నాటి అన్నదానం కోసమై వొక పూలవరహా తరిగొండ వెంగమాంబ మఠానికి చెందేలా దానమిచ్చాడు. ఇది క్రీ॥శ॥1803 అక్టోబరులో లిఖించబడినది.

సెప్టెంబర్ 1806 లో గొట్టిగల్లుకుచెందిన తిమ్మారెడ్డి అనే ఆయన వైశాఖమాసంలో జరిగే నృసింహ జయంతి నాడు తరిగొండ వెంగమాంబ మఠం నిర్వహించే అన్నదానానికై వొక చిన్న భూభాగాన్ని దానం చేశాడు.

శక సంవత్సరం 1728, అక్షయ, వైశాఖ బహుళ పంచమి, సౌమ్య వాసరం (బుధవారం, మే 7, 1806) నాడు కాళికాంబా వరప్రసాదుడైన (కాళికాంబ వలన వరము పొందినవాడు). వెలిగారం ధనకోటి కుమారుడు వేంకటసామి గాజుల బసివిరెడ్డి - చవిడి రెడ్ల అనుమతితో వైశాఖ మాసంలో వచ్చే శ్రీనృసింహోత్సవం సందర్భంగా శ్రీ వెంగమాంబ మఠానికి సంవత్సరాని కొక పూల వరహా చొప్పున దానం చేసేవాడు.

శక సంవత్సరం 1717 – రాక్షస నామ సంవత్సర భాద్రపద శుద్ధ పంచమి – హస్తా నక్షత్రయుక్త సౌమ్యవాసరం (బుధవారం, ఆగస్టు 19, క్రీ।।శ।।1795) నాడు దిండిగల్ జమీందారు అరణి విజయ వేంకటపతిరాజు  బహదూర్ వారు తన పాలనలో వున్నవాడ మధుర, చిత్తూరు గ్రామాలను మాతృశ్రీ వెంగమాంబగారి అన్నసత్రానికి వ్రాసి యిచ్చాడు. ఇంగ్లీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ వారు ఆలయ కార్యనిర్వహణ చేస్తున్న 19 వ శతాబ్దపు ప్రథమ దశకాలలో వెంగమాంబ మేనకోడలు చెంగమ్మ దశావతారాలలో వొక రూపంలో ముత్యాలు పొదిగిన వెండి పళ్ళెరంలో ప్రతిరాత్రి ఉత్సవమూర్తి యేకాంతసేవలో నిత్యకర్పూర హారతిలో భాగంగా నిర్వహించడానికయ్యే ఖర్చు 480 రూపాయలు; మాతృశ్రీ వెంగమాంబ నిర్వహించే అన్నసత్రానికి సంవత్సరానికి 2160 రూపాయలు (ఈనాటికే యీ ఆచారం కొనసాగు తున్నది); నిత్య తలియ (తలిగ, నిత్య నివేదన), మనోవృత్తి ఖర్చుల (ఆమె కిష్టమైన రీతిలో ఖర్చు చేసేందుకు) 1000 రూపాయల వరకు – అన్నీ కలిపి 4000 రూపాయలవరకు ఖర్చుగా లెక్కవేసి యీ గ్రామాలు దానం చేశాడు.

ప్రదక్షిణ క్రమంలో వచ్చే ఆనంద నామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ సప్తమి (మార్చ్, క్రీ।।శ।।1795) నాడు తిరుమల తిరుపతిని దైవసింహాసనంలా భావించి, ప్రతి యింట నుండి సంవత్సరానికొక అపరంజి రూక (వొక చిన్న బంగారు నాణెం) వెంగమాంబ నృసింహజయంతి నాడు నిర్వహించే అన్నదానం నిమిత్తమై వసూలు చేసే, తిరుమల తిరుపతిలో నివసించే బేరిసెట్టి కులస్థులు అనాది నుండి కుబేరుని (ధనపతి) సంతతిగా ప్రఖ్యాతి గాంచిన వారు. ధర్మశివాచార్య ఆశీస్సులతో వన్నెకెక్కిన అయోధ్యా నగర పరిపాలనలో వారు భాగస్వాములు. తిరుకచ్చినంబివారి కులానికి చెందిన వైష్ణవ శ్రేష్ఠుడని, వారి కులగోత్రాలతో పునీతుడైన వాడని వారు భావించేవారు. శ్రీ వరదరాజు స్వామివారి పవిత్ర పాదపద్మముల మకరందం గ్రోలిన మనస్సుగల భ్రమరముల వంటి వారని, సహస్ర ఋషి గోత్రీకులని, మూడు శివార్లలో నివసించిన నగరం వారని (నగర ప్రముఖులని), పేరుగాంచిన వారని వర్ణించేవారు.

శక సంవత్సరం 1717, రాక్షస నామ సంవత్సర ఫాల్గుణశుద్ధ పౌర్ణిమ (క్రీ।।శ।।1796 మార్చి) రోజున నూట–యిచ్చాద్రు నగరం వారు (నగరానికి చెందిన 102 మంది), శ్రీ గోవిందరాజస్వామివారి ఆలయ సమీపంలో వుంటూ సకల సద్గుణ సంపన్నులై, పెనుకొండ రాజ్యానికి పేరెన్నికగన్న ప్రభువులై (బహుశా నగరపాలక మండలి సభ్యులై), కుబేర సంతతిగా సంపదలతో వర్ధిల్లినారు. కన్యకాపరమేశ్వరి సహోదరులుగా వాసికెక్కారు. జనార్దన దేవుని పాదపద్మాలు కొలిచి, భాస్కరాచార్యుల ఆశీస్సులతో కీర్తిగడించారు. మాతృశ్రీ వెంగమాంబ ప్రతి సంవత్సరం నిర్వహించే నృసింహ జయంతోత్సవానికి యింటికొక అపరంజిరూక చొప్పున దానమిచ్చేవారు.

శక సంవత్సరం 1718 నలనామ సంవత్సర చైత్ర శుద్ధ దశమి (అనగా మార్చి, క్రీ।।శ।।1796) నాడు వ్రాయించిన పట్టాలో 102 నగర ప్రముఖులలో రాచప్పసెట్టి లింగసెట్టి, కేశవసెట్టి మొదలైన

వారొక్క రొక్కరు శ్రీనృసింహోత్సవదినానికి సంవత్సరానికొక్కమారు శ్రీ వెంగమాంబకు, యింటికొక అపరంజిరూక చొప్పున బహూకరించేవారు.

అదేవిధంగా వివిధ గ్రామాలకు చెందిన నూటయిబ్బంద్రు – నగరం వారు వెంగమాంబకు ప్రతివొక్కరి యింటి నుండి సంవత్సరానికొక మారు అపరంజి కాసు దానమిచ్చేవారు. ఇది కూడా నృసింహోత్సవం రోజున జరిగే అన్నదానం కోసమే వీరిలో 102 మంది వర్తకులున్నారు. వీరు **నాగపట్లపేట (భాస్కరపేట), రంగంపేట,** తదితర గ్రామాలకు చెందినవారు. శక సంవత్సరం 1718 లో నలనామ సంవత్సర చైత్రబహుళ సప్తమి నాడు (ఏప్రిల్, క్రీ॥శ॥1796) సెట్టి, పీలేరు తాలూకాకు చెందిన అయ్యవారిపల్లెకు చెందిన 102 మంది నగర ప్రముఖులు (సెట్టిగారితో సహా), పెనుమూరిపేట గ్రామానికి చెందిన 102 నగర ప్రముఖులు, శక సంవత్సరం 1720, కాలయుక్త, చైత్ర బహుళ త్రయోదశి – అనగా క్రీ॥శ॥ 14–4–1798 నాడు సంవత్సరానికొక్కొక్క శంఖురూక (శంఖంలో ముద్రితమైన నాణెం) దానం చేశాడు. దేవతు వేంకటేశం సెట్టి, రావూరి వేంకటరామిసెట్టి, తదితరుల నాయకత్వంలో ఆఖరిది 31 వది అయిన రికార్డ్‌లో **మంగళంపేట శ్రీ ప్రసన్న వేంకటేశ్వర స్వామి** సమీపంలో నివసించే వర్తకులందరూ వొక వొప్పందానికి వచ్చి ఘనమైన నృసింహజయంతి పర్వదినాన అన్నదానానికి, ఘనమైన పుష్పాంజలికి ప్రతి యింటి నుండి ప్రతి సంవత్సరం వర్షాశన ధర్మంగా వొక శంఖురూక వెంగమాంబకు దానమిచ్చేవారు. ఈ పత్రం శక సంవత్సరం 1730, కలియుగ సంవత్సరం 4909, విభవ నామ సంవత్సరం ఫాల్గుణ శుద్ధ పంచమి (అనగా, రవివారం, ఫిబ్రవరి 19, క్రీ॥శ॥1809) నాటిది.

శక సంవత్సరం 1719, పింగళ నామసంవత్సర చైత్రబహుళ పంచమి (ఏప్రిల్, క్రీ॥శ॥1797) నాడు 18 మంది ఫణాల వారు (స్థానికులు, స్థానికేతరులు) వైశాఖమాసంలో నృసింహోత్సవానికి అన్నదానం కొరకు మాతృశ్రీ వెంగమాంబకు ప్రతి సంవత్సరం వొక అపరంజి రూక దానం చేయడానికి నిర్ణయించారు. ఆచంద్రతారార్కం ఆమె శిష్య పరంపరకు కూడా యీ దాన ప్రక్రియ సంక్రమించేలా యేర్పాటు చేయబడింది. ప్రతి సంవత్సరం నృసింహోత్సవానికి వెంగమాంబ మఠానికి శక సంవత్సరం 1720, కాళయుక్తి, శ్రావణ శుద్ధ విదియ (బుధవారం, జూలై – ఆగష్ట్ క్రీ॥శ॥1798) నాడు రెండు వరహాల చొప్పున రెడ్లు (రెడ్డి కులస్థులైన రైతులు), కరణాలు (గ్రామంలో శిస్తుల జమ, లెక్కలు వేసేవారు) దానమిచ్చారు. ఈ దానం వెంగమాంబ శిష్య పరంపరకు ఆచంద్రతారార్కం దాతలు, వారి కుమారులు, వంశీకుల వద్దనుండి లభించేలా యేర్పాటు చేయబడింది. దాతలు చిత్తూరు తాలూకాలోని వావిలికోటకు చెందినవారు.

రెండు వరుస సంవత్సరాలలో (శక సంవత్సరం 1716, ఆనందనామ సంవత్సరం క్రీ॥శ॥1794–95, శక సంవత్సరం 1717, రాక్షస నామ సంవత్సరం, క్రీ॥శ॥1795 లోను తయారుచేయబడిన పది పత్రాలలో వివిధ తరగతులకు చెందిన ప్రజలు, రుజువు డజను లేక డజనుకు పైగా గ్రామనివాసులు, నృసింహ జయంతి పర్వదినాన అన్నదానం కోసం వెంగమాంబకు ప్రతి యింటి నుండి వొక మానెడు బియ్యం

అందజేయడానికి వొప్పుకున్నాడు. మూడు రికార్డ్‌లలో నొక చలి–బింద్రా (చలివేంద్రం–ఆమె తీర్థయాత్రికులకు నీరు అందించుటకు వినియోగించే వాటర్‌షెడ్, నిర్వహణ కూడా ప్రస్తావించబడింది. ఈ గ్రామాలలో కొన్ని తిరువిళైయాట్టమ్ లేక దేవదాన – అంటే దేవుని సేవ నిమిత్తమై యివ్వబడినది. గ్రామాలలో ఆరు తరగతులకు చెందిన ప్రజల బియ్యం దానం చేయడానికి అంగీకరించారు. వారు రెడ్డి కుటుంబాలు, కరణాలు, పురోహితులు, సెట్టి వర్తకులు, కాపులు, పణాల వారు. వేరొక వేంకటేశ్వర స్వామి ప్రతిమ వున్న అలమేలు మంగాపురం కొండ ప్రాంతమైన నాగపట్ల తాలూకాలో వుంది. కాని, యీనాడు దాన్ని మంగాపురం అని మాత్రమే పిలుస్తున్నారు. తిరుచానూర్‌ని అలమేలు మంగాపురం అని పిలుస్తున్నారు. కొన్ని గ్రామాలలోని ప్రజలు సంవత్సరానికి సగటున నాలుగు బల్లల బియ్యం యివ్వడానికి అంగీకరించారు. తొండవాడ గ్రామస్థులు 2 పుట్ల బియ్యం (ఒక పుట్టి కారుపంట – డిసెంబర్ – జనవరి పంట నుండి, మరొకపుట్ట కోడ పంపి – వేసవిపంట నుండి) తో బాటు 4 అపరంజి రూకలు కూడా యివ్వడానికి అంగీకరించారు.

దిండిగల్ జమీందారు,పాలెగార్లు దానంగా యిచ్చిన బంగారునాణాలు, బియ్యం, భూములు, గ్రామాలు స్వచ్ఛందంగా యివ్వబడినవే. ఏ పత్రంలోను వెంగమాంబ తరపున యెవ్వరూ బహుమతులు, దానాలకోసం ప్రచారం చేసిన దాఖలాలు లేవు. యోగిని వెంగమాంబ గురించి ప్రజలు బాగు తెలిసికొని వుండాలి. ఆమె ఆధ్యాత్మిక చింతన, ఆమె నృసింహస్వామికి చేసే ఆరాధన, స్వామివారి జయంతి వేడుకలకు ఆమె నిర్వహించడం, అన్నదానం చేయడంలో ఆమె దాతృత్వం, తీర్థయాత్రికులకు చలివేంద్రం నిర్వహించడం, దైవానికి చేసే పువ్వులసేవ, ఆమె నివేదన లేర్పాటు చేసిన తీరు, ఆమె పవిత్ర జీవన విధానం – వీటన్నిటి వల్ల అందరి ప్రశంసలకు పాత్రురాలై, వారు స్వచ్ఛందంగా ఆమెకు కానుకలిచ్చేలా ప్రేరేపించింది. ఆమె రచించిన ధార్మిక, వేదాంత, యౌగిక రచనల ద్వారా ఆమెకు సంక్రమించిన సాహిత్య సంపదకు తోట తోడు మతపరమైన మనస్సునకిది ప్రతీక.

అంతటి ప్రజాదరణ పొందడానికి, తన నిబద్ధతతో వారికి విశ్వాసం కలుగ చేయడానికి వెంగమాంబ వొక దశాబ్దమో, దశాబ్దికంటె యెక్కువ సమయమో శ్రమించి వుండాలి.

బాల్యంలో తన జన్మస్థలమైన తరిగొండలో శ్రీ నరసింహస్వామి వారి యెడల ఆమె భక్తి ప్రపత్తులు పెంపొందించుకున్నది. ఈ భక్తి తత్పరత యింటి పనుల మీద అశ్రద్ధ కలిగేలా చేసి, కుటుంబంలో విభిన్నంగా వుండేలా చేసి, ఆమె తల్లిదండ్రుల ఆగ్రహానికి కారణమైంది. వారు ఆమెకు యిష్టం లేని వివాహం చేశారు. ఆమె భర్త త్వరలోనే కాలం చేశాడు. ఆమె బాల్య వితంతువుగా మిగిలింది. ఆమె బహుగా మరికొన్ని సంవత్సరాలు తన తలిదండ్రులలో కలిసి జీవించి వుండవచ్చు. ఆమె బహుశా తన యిరవయ్యవ యేట తిరుమలకు తరలిపోయి వుండవచ్చు. ఆమె నొక తపస్విని వలె ఏకాంతంగా వొక దశాబ్దం పాటు కఠోరంగా శ్రమించి వుండవచ్చు. ఆమె కీర్తి దేశమంతటా వ్యాపించింది. క్రీ॥శ॥1785 నుండి క్రీ॥శ॥1809 వరకు, అంటే 25 సంవత్సరాలపాటు ఆమెకు ప్రజలు స్వచ్ఛందంగా కానుకలిచ్చే

వారు. సి.పి.బ్రౌన్ తన తెలుగు నిఘంటువులో ఆమె క్రీ॥శ॥1840 లో నివసించి వున్నట్టు వ్రాయడాన్ని బట్టి ఆమె 80 లేక 85 సంవత్సరాల పండుముసలిగా వుండేదని తెలియవస్తోంది. బహుశా అప్పటి నుండి మరో దశాబ్దం జీవించిందేమో!

ఇవన్నీ పరిశీలించగా వెంగమాంబ క్రీ॥శ॥1750–1755 ల మధ్య కాలంలో* జన్మించి వుండవచ్చునని, బహుశా తిరుమలలో తన 20 వ యేట స్థిరనివాస మేర్పచుకుని వుండవచ్చునని వూహించవచ్చు. అక్కడ ఆమె శ్రీనరసింహస్వామి వారి ఆరాధన కొనసాగించింది. అప్పటికే తన జన్మస్థలమైన తరిగొండలో ఆమె శ్రీకారం చుట్టిన స్వామివారి జయం త్యుత్సవం మొదలైంది. ఆమె ఆరాధించిన తరిగొండ గ్రామదైవం నరసింహ స్వామిగా వన్నెకెక్కాడు. ఆమె క్రీ॥శ॥1850 వరకు అంటే 90 లేక 95 సంవత్సరాల వరకు జీవించి వుండవచ్చు.

తన సాహిత్యంలో ఆమె శ్రీవేంకటేశ్వరునికి, శ్రీ తరిగొండస్వామికి అభేదం ప్రకటించింది.

కీర్తిశేషులు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి గారు ప్రాచీన తెలుగు కవుల వ్రాతప్రతుల నుండి సంగ్రహించిన 16 ఖండికలతో నొక సంకలనాన్ని ప్రచురించారు. అందులో కొన్ని శ్రీవేంకటేశ్వరుని కంకితమివ్వబడినవి. కాని వాటన్నిటిలో వేంకటేశ్వరుని రూపురేఖావిలాసాదులు, అవయవాదులు, ఆభరణాలు, అలంకరణలు, యిద్దరు లేక ముగ్గురు కవుల వ్యాజస్తుతులు వున్నాయి. వాటిలో 14 వ శతాబ్ది నుండి 19, 20 శతాబ్దులకు చెందిన వారున్నారు.

**ఎఱ్ఱాప్రెగడ**

14 వ శతాబ్దిలో నివసించిన శంభుదాస (ఈశ్వరుని సేవకుడు), ప్రబంధ పరమేశ్వర (ప్రబంధ కావ్యరచనలో అగ్రగణ్యుడు) బిరుదాంకితుడైన ఎఱ్ఱాప్రగడ వారిలో ఆద్యుడు. ఆంధ్రమహాభారత అరణ్యపర్వ శేషాన్ని పూరించాడు. మిగిలిన భాగాలు అతనికి ముందు నన్నయభట్టు, తిక్కన సోమయాజి రచించారు. ఎఱ్ఱాప్రెగడ **'నృసింహపురాణం'** రచించి కర్నూలు జిల్లాలోని అహోబల శ్రీనృసింహస్వామి వారి కంకితమిచ్చాడు. సంగ్రహించ బడిన పదమూడు పద్యాలలో యేడింట సాంఖ్య, యోగ, వైఖానస, పాంచరాత్రాది ఆరాధనా సంప్రదాయాలకు చెందిన వారు నరసింహస్వామికి వారివారి భావనల కనుగుణంగా ఆరాధిస్తారని అంటాడు. ("యంసర్వ..." అనే నాలుగవ ప్రార్థనా శ్లోకంతో పోల్చవచ్చు).

* "నాలుగవ దశకంలో తిరుమలలోని తరిగొండ వెంగమాంబ మఠానికి వారసుడైన శ్రీ గుండేపల్లె కుప్పయ్య శర్మ ప్రచురించిన వొక వ్రాతప్రతిలో శకనామ సంవత్సరం 1738 (ఈశ్వరనామసంవత్సర శ్రావణశుద్ధ నవమినాడు – అనగా 7-8-1817న) లో వెంగమాంబ స్వర్గస్థురాలైనట్టు ప్రకటించబడింది. అందువల్ల శక సంవత్సరం 1798 కి బదులు 1738 గా పొరబాటున పేర్కొనబడి వుండవచ్చు. అందువలన ఆమె స్వర్గస్థురాలై తేది 7-8-1877 గా చెప్పవచ్చు. ఇదే నిజమైతే ఆమె రామానుజుల వలె 120 సంవత్సరాలు జీవించి వుండవచ్చు" (గోపీకృష్ణ).

తాళ్ళపాక అన్నమాచార్యులు కూడా యీ భావాలతో పోలికలున్న సంకీర్తన రచించాడు. కాని, దాని ఆద్యంతాలు వేరే పద్ధతి కలిగినవి. బౌళిరాగంలో వున్న యిది **"ఎంతమాత్రమున నెవ్వరు దలచిన అంతమాత్రమే నీవు, అంతరాంతరము లెంచి చూడపిండంతే నిప్పటి యన్నట్లు"** అనే పల్లవి గలది. దాని భావం, "మానవుల భక్తికి తగినట్లుగానే నీవు స్పందిస్తావు. పిండికొద్దీ రొట్టె కదా! వైష్ణవులు నిన్ను విష్ణువని ప్రేమతో స్మరిస్తారు. వేదాంతులు నిన్ను పరబ్రహ్మమంటారు. శైవులు తగిన భక్తితో నిన్ను శివుడని కీర్తిస్తారు. కాపాలికులు నిన్ను ఆదిభైరవుడని హృదయపూర్వకంగా స్తుతిస్తారు".

"శాక్తేయులు నిన్ను మూర్తీభవించిన శక్తిగా భావిస్తారు. నిన్ను దర్శించడానికి వచ్చే ప్రజలు వారి కోరికలకనుగుణంగా నిన్ను భావిస్తారు. అల్పమతులు నిన్ను సంపదల కోసం అర్చిస్తారు. అటువంటి వారి యెడల నీవంత ఉదారంగా కానరావు; ఉదారస్వభావంతో నిన్ను గొలిచే జ్ఞానులకు నీవు అత్యంత మనోజ్ఞుడవై భాసిస్తావు".

"నీలో లేనిది లేదు (నీవు సంపూర్ణుడవు), ఉన్న వాటికి తగినట్లు పద్మం వికసించినట్లు, భాగీరథి (గంగ) నుండి జలం వొడ్డున వున్న బావులలోకి ఊరినట్లు ఓ శ్రీవేంకటపతి దైవమా! నీ యందు అచంచల విశ్వాసంలో నీ ఆశ్రితునిగా స్వీకరిస్తావని నమ్ముతూ, నీ ఆశ్రయం కోరుతున్నాను. ఇదే నా చివరి ఆశయం".

**తాళ్ళపాక అన్నమాచార్య**

తరువాత చెప్పదగిన రచయిత వేంకటేశ్వర శతకం రచించిన తాళ్ళపాక అన్నమాచార్య. అతడు 15 వ శతాబ్దికి చెందిన వాడు. శ్రీవేంకటేశ్వరుని ఆలయానికి సంకీర్తనాచార్యుడుగా వేంకటేశ్వరునుద్దేశించి 32,000 సంకీర్తనలు రచించాడు. విజయనగర రాజ్యానికి చెందిన రెండవ పరంపరలోని ప్రభువులలో వొకడైన సాళువ నరసింహరాయలు. అతనిని యెంతగానో గౌరవించాడు, బహూకరించాడు. ఈ శతకం (నూరుపద్యాలు) ఆలమేలుమంగ గుణగణాలు, చేతలు, ఉదంతాలు, స్వామి దృష్టికి తేవడం కోసం వేంకటేశ్వరునుద్దేశించి వ్రాసినవి.

"ఓ వేంకటేశ్వరా! భువిలోని ప్రజలు నీ దేవేరి అలమేలుమంగను – ఓ అలమేలుమంగా! చిగురుటాకులవంటి చేతులు కలదానా! జగద్గురువు సతీ! జగజ్జననీ! సమస్త జీవకోటి స్థితికి కారకురాలా! నీ చల్లని చూపులు మాపై ప్రసరించడం వల్ల పునీతులము, ఐశ్వర్య సంపన్నులమూ అయ్యాము" – అని స్తుతిస్తారు.

"నీవు నీ దేవేరితో వీథులలో విహరిస్తూ వుండగా, ప్రజలు నీకు ఆరతులెత్తుతారు".

"ఓ వేంకటేశ్వరా! ఆమె చల్లని చూపులు నీ చూపులే అని దేవకాంతలు ప్రస్తుతిస్తారు. అమ్మా! ఎల్లప్పుడు నీ వాక్కులు స్వామివారివే. అతడే నీ మనస్సు. ప్రజలందరి స్థితిగతులు నీ చేతిలోనే వున్నాయి. అలమేలుమంగ నలంకరించిన పుష్పగుచ్ఛాలు ఆమె నీ వంక తిరుగగానే నీ పైన వుంచినట్లుగానే భాసిస్తాయి.

నీకు ప్రియమైన నా దేవేరి అమృతమూర్తి. సాగరమథనసమయంలో ఉద్భవించింది కదా!" అంటూ మునీంద్రులామెను కీర్తిస్తారు.

"ఓ వేంకటేశ్వరా! నేను నీకు ప్రీతిపాత్రురాలైన దేవేరిని ఆరాధిస్తాను. వినమ్రుడనై ఆమెను "అమ్మా! గుణహీనుడనైన నేను కష్టజీవిని. అల్పమతిని. పుట్టుకతోనే దురదృష్ట వంతుణ్ణి. నీ ఆశ్రయం కోరాను. ఓ అలమేలుమంగా! నీ దయతో నీ చల్లని చూపులు నాపై ప్రసరిస్తాయని ఆశిస్తున్నాను. పూర్తిగా వికసించిన నా అక్షర కుసుమాలతో నిన్నర్చిస్తున్నాను" అని ప్రార్థిస్తాడు.

**తాళ్ళపాక పెదతిరుమలాచార్య**

'శ్రీవేంకటేశ్వర ప్రభాతస్తవం' అని పిలువబడే స్తోత్రం సరళమైన తెలుగులోనికి (తెలుగు పద్యాలలోనికి) 'శ్రీవేంకటేశ్వర సుప్రభాతం' సంస్కృత శ్లోకాల నుండి ద్విపద ఛందస్సులోనికి అన్నమాచార్య కుమారుడు పెదతిరుమ లాచార్య అనువదించాడు. ఇది స్వామిని ఉదయమే మేల్కొలిపి అతడు దేవతలు, మునులను ఆశీర్వదించి, వారి కోరికలు తీర్చడానికి, జగత్తుకి ఐశ్వర్యం ప్రసాదించడానికి ఉద్దేశించబడింది. పెదతిరుమలాచార్య కృష్ణదేవ రాయలు, అచ్యుతరాయలు, సదాశివరాయలు పరిపాలనా కాలంలో జీవించి వున్నాడు. కృష్ణదేవరాయలు అతనికి ప్రోత్సహించలేదు. కాని అచ్యుతరాయలు, సదాశివరాయలు. వారిరువురూ అతనికి రాజపోషకులుగా వుండి అతనికి కొన్ని గ్రామాలు బహూకరించారు.

**రేవణూరి వేంకటార్య**

అన్నమాచార్యకు తన రెండవ భార్య అక్కమాంబకు రెండవ కుమార్తె అయిన తిరుమలాంబ ద్వారా కలిగిన మనుమడు రేవణూరి వేంకటార్య. అతడు రేవణూరి తిరుమల కొండయార్య కొడుకు. 16 వ శతాబ్దికి చెందిన వాడు. **'శ్రీ పాదరేణు మాహాత్మ్యము'** పై వొక తెలుగు పద్యకావ్యం వ్రాశాడు. శ్రీ పాదరేణువు సన్నని కర్పూరపు పొడి, జవ్వాదినూనెతో కలిసిన ముద్ద. ప్రతి శుక్రవారం చేయబడే యీ ముద్ద శ్రీవారి పాదాలపై కొద్దిసేపు వుంచి తరువాత ఆలయమిరాశి సేవకులకు, తీర్థయాత్రికులకు దైవప్రసాదం రూపంలో కొద్దికొద్దిగా యివ్వబడుతుంది. రచయిత దాని కారణాలు ప్రస్తుతిస్తాడు. శేషాద్రి పై గుడిలో మధురమైన స్వామి పాదరేణువుగా, అగరు, చందనవృక్షం, కలువపువ్వు, గంధపుపొడి (సన్నని కర్పూరపు పొడితో, కస్తూరితో, పగడపువ్వుతో, జవ్వాదితో) కన్న చక్కని సువాసన గలదై తన నాలుకపై వసించమని, మహాకవుల బాణీలో కవితాశక్తిని ప్రసాదించమని వేడుకుంటాడు. "వేంకటేశుడు యెటువంటి మొండి వ్యాధినైనా రూపు మాపగల శక్తి గల ధన్వంతరి రూపం దాల్చాడు. అటువంటి ఐశ్వర్య ప్రదుడైన దైవం ఆద్యంతమూ నన్ను వ్యాధి నుండి విముక్తుణ్ణిచేసి, నాకు చిరాయువు ప్రసాదించుగాక! అని కోరుకుంటాడు. మూగతనం, చెవుడు, అజ్ఞానం, నత్తి తొలగించుటలో శ్రీనరసింహస్వామి వారి పవిత్ర పాదస్పర్శతో దానిని (శ్రీపాదరేణువుకి) శక్తి గలిగిందని రచయిత భావిస్తాడు. విష్ణువు అవతారాల చర్యలన్నింటిలో శ్రీపాదరేణువుకు ముఖ్యపాత్ర వున్నదనీ, అన్నమాచార్య విజయానికదే హేతువనీ వక్కాణిస్తూ తననూ, తన ప్రజలనూ

రక్షించమని శ్రీపాదరేణువును కోరుకుంటాడు. ఆ రేణువే అలమేలుమంగ పతియైన వేంకటేశుని పాదపద్మాలపై స్థిరంగా వుండేది.

**కాకుమాను మూర్తికవి**

16 వ శతాబ్దికి చెందిన తెలుగుకవి కాకుమాను మూర్తికవి. తన **'రాజవాహన విజయమనే'** పద్యకావ్యాన్ని వేంకటేశ్వరుని కంకితమిచ్చాడు. తన కంటి చూపులతో నిరంతరమూ తనను ధ్యానించే భక్తుల అజ్ఞానాన్ని దూరం చేయమని వేడుకుంటాడు. "వైజయంతి (స్వామివక్షస్థలంపైన వుండే పూలదండ) మాకు సిరులు ప్రసాదించుగాక! అమ్మ అలమేలుమంగ చేయి పట్టుకుని, సువర్ణచ్ఛాయలో మెరిసే ఎర్రని వస్త్రంలో అలంకరించబడిన మేనితో, భుజాలపై శంఖచక్ర, హంసచక్రాలతో, కౌస్తుభమణిలో ఔదార్యశీలి అయిన కావ్యపతి అయిన శేషాచలపతి నాకు కలలో దర్శనమిచ్చాడు" అని కవి పేర్కొంటాడు.

ఆయన నా భావప్రకటన స్వచ్ఛందమూ, అర్థవంతమూ అవుతుందని నిర్ధారించాడు. నా పలుకులు పంచదారలా, పండ్లలా, జున్నులా, ఉక్కెర (గోధుమతో చేసే తియ్యని పదార్థం), మనోహరం (వేయించిన బియ్యం, బెల్లంతో చేసిన గుండ్రని బంతివంటి వంటకం) లా తియ్యగా వుంటాయని, నేను వ్రాసిన ప్రతి పద్యం అమృతమయంగా వుంటాయని సెలవిచ్చాడు. అటువంటప్పుడు మకుటాయమైన శేషాద్రివాసునికి నా కృతిని అంకిత మివ్వకుండా యెలా వుండగలను? ఉద్యానవనాలతో, జలాశయాలలో, ధూర్జటి జటాజూట నిర్గత గంగావాహిని నుండి జనించే జలపాతాలతో శోభిల్లే, పాపనాశన తీర్థం కలిగి, ప్రతి వృక్షం గంధపుచెట్టు, ప్రతిరాయి వొక ఇంద్రనీలం, ప్రతి జంతువు కస్తూరి మృగం, సింహం, ప్రతి సరస్సు గంగాజలంతో ప్రవహించేది, ప్రతి తీర్థం గొడ్డలిలా పాపనాశనం చేసేది, ప్రతి మంటపం బంగరు మంటపం, ప్రతి ఋషి వొక భృగుమహర్షి, ఆనందఖని, ఆశ్రిత కల్పతరువు, పేదలపెన్నిధి, నిశా తమస్సునకు సూర్యరశ్మి, పవిత్ర హృదయులకు అమృతరాశి అయిన తిమ్మప్ప నివాస గిరి అసామాన్య మైన పర్వతం! అటువంటి వేంకటగిరిని కీర్తించడం న్యాయమే కదా!

అతని స్వర్ణగోపురం అతని ఆశ్రయం కోసం గుమిగూడే భక్తులతోఅది మేరు పర్వతమేమో అనే శంక కలుగజేస్తుంది. అతని బలిపీఠం చుట్టూ ఆర్తులు, చెవిటి, గ్రుడ్డి, కుంటివారు, నిస్సంతులు, వినయ వినమితగాత్రులై ఉంటారు. అతని ప్రదక్షిణం ఆశలు రేకెత్తిస్తుంది. అతని గర్భగుడి చందన గంధం, కస్తూరి, కుంకుమపువ్వుల పరిమళం వెదజల్లుతుంది. అలమేలు మంగపతి అయిన దైవం, వేంకటగిరిపై విరాజిల్లే గుడిలో నివాసముంటూ తన భక్తుల పూర్వజన్మ దుష్కృతాలను హరిస్తూ వుంటాడు.

అప్పప్పా! (హా! హా!) మనం శుక్రవారం నాడు గర్భగుడి నుండి వచ్చే కస్తూరి, కర్పూర, చందన సమ్మిశ్రితమైన చల్లని అభిషేక జలం సువాసనలు ఆస్వాదించవలదా! అభయవరదుడైన స్వామి తన చేతికి దీక్షాకంకణం ధరించాడు. వారి పూర్వజన్మ పాపాలు హరిస్తాడు. వారి పేదరికాన్ని పారద్రోలుతాడు. మందుల వలన బాగుపడని వ్యాధులు, వాపులు బాగుచేస్తాడు. దయ్యాలు, క్షుద్రశక్తుల బారినుండి

కాపాడుతాడు. ఎందుకంటే అతడు మూర్తీభవించిన మంచితనం, అమృతమూర్తి, సాగరమథనానంతరం అమృతాన్ని వశపరచుకున్నవాడు. చక్రధారి. పవిత్ర నామం కలవాడు. చీకటిలో వెలుగు రేఖ.

దేవకాంతలు ముక్కోటి (జనవరి చివరలో ముక్కోటి ద్వాదశి సర్వానికి, అభిషేకానికి) నాడు స్వామివారి దేవేరి ముడిబియ్యంతో చేసిన అన్నం స్వామికి పెడుతుందని, అది ఆయన జీర్ణించుకొనగలడో లేదో పట్టించుకోదని కడగని పళ్ళెరాలకు యజమాని అయిన అతనిని భార్య స్వర్ణమయమైన దుస్తులతో అలంకరిస్తుందని, అతని కవి నప్పుతాయో లేదో ఆలోచించదని, డబ్బు దుబారా చేస్తాడని నిందిస్తుందని చతురోక్తులాడుతూ కొండపైకి వెళతారు. వడ్డికాసులు వడ్డీగా గుంజే వాని ధనాగారం తరిగిపోతుందేమో నని కాబోలు! కానుకలలో వున్నదీ ఆయనే, భక్తుల మొక్కుల స్వీకరించేది ఆయనే.

లక్ష్మీదేవిని వక్షస్థలంలో కలిగిన శ్రీవేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాలకు (సెప్టెంబర్, అక్టోబర్) కటకంనుండి, కల్యాణంనుండి, ఢిల్లీనుండి భక్తులు తరలివస్తారు. గుడ్డివానికి స్వామి చూపు ప్రసాదించిన తీరు, గొడ్రాళ్ళకు సంతానవతులుగా చేసిన కథలు, కుంటివారికి శీఘ్రగామిత్వం ప్రసాదించిన తీరు, చెవిటి వారికి శ్రవణ శక్తి ప్రసాదించిన తీరు తలుచుకుంటూ, వొకరి నొకరు ఉత్సాహ పరచుకుంటారు.

దక్షిణాన ప్రసిద్ధికెక్కిన సేతువు (రామేశ్వరం సేతువు) నుండి, ఉత్తరాన కాశీనుండి తీర్థయాత్రికులు వేంకటేశ్వరునికి నిత్యం జరిగే వైశాఖతీర్థం (వైశాఖమాసంలో జరిగే అభిషేకాలు–స్వామిని చల్లబరిచే వొక ప్రక్రియ) దర్శించడానికి వేంకటగిరికి భక్తులు గుంపులు గుంపులుగా తరలివస్తారు. వక్షస్థలంపై చందనం పూసుకుంటూ, పారిజాత పుష్ప పరిమళాలాస్వాదిస్తూ, ఆ పువ్వులను కళ్ళకద్దుకుంటూ (అవి వారి కరుదు), వాటినికొప్పులలో తురుముకుంటూ, పారిజాతపుష్పాల దండలలో అలంకరించుకుంటూ, ఆకాశగంగా తీర్థంలో మునుకలిడి వారి శరీరాలు శుభ్రం చేసుకుంటూ ఉంటారు.

లక్ష్మీపతి వేంకటేశుడు యెంత పెద్ద కుటుంబానికి యజమానియో ఆశ్చర్యం వేస్తుంది! అతని కుమారుడు మన్మథుడు. అతనికి కుమార్తె భాగీరథి (గంగానది). అతని భార్య భూదేవి, అతని నివాసమొక కొండ. అతని జ్యేష్ఠసోదరుడు బలభద్రుడు (బలరాముడు). అతని పెద్ద కొడుకు బ్రహ్మ, అతని కోడలు శారద (సరస్వతీదేవి). శ్వేతకుముద సతియైన చంద్రుడతని బావమరది. అతని మామగారు సాగరుడు. అతని రెండవ మామగారు భోజరాజు. అతని వక్షస్థలాన్నలంకరించినది అమూల్యమైన కెంపు. అతని వస్త్రం స్వచ్ఛమైన బంగారం. ఈ ఆభరణాలు ముక్కంటికి లేవు. చతుర్దశ భువనాలు అతని కుక్షిలోనిక్షిప్తమై ఉన్నాయి. శేషాచలపతి యైన వేంకటేశ్వరుని కంటె ఉదారంగా కానుకలిచ్చే మరే దేవుడెవ్వరైనా ఉన్నారా?

**సిద్ధిరాజు తిమ్మరాజు**

కొండవీడు గవర్నరయిన సిద్ధరాజు తిమ్మరాజు ఓబలరాజు కుమారుడు. అరవీడు కుటుంబానికి చెందిన అళియరామరాజు మేనల్లుడు. 16 వ శతాబ్దికి చెందిన యితను **'పరమయోగివిలాసం'** అనే పద్యకావ్యం రచించి మంగళగిరి నృసింహస్వామికి అంకితమిచ్చాడు. కవి ఒక సీసమాలికలో ఆశ్రితుల

యెడల వేంకటేశ్వరుని శాంత గంభీరముద్రను అభివర్ణిస్తాడు. స్వామి తొడపైనున్న అతని వామ హస్తం, అతని బంగరు దుస్తులు, తన పాదాలే రక్ష అని ఆర్తులకు సూచించే అతని దక్షిణ వరద హస్తం, అతని కరుణాపూరిత దృక్కులు, అతని వక్షస్థలంపై శోభించే ముత్యాల సరాలు, ధగధ్ధగాయమామైన అతని కిరీటం, ఇరుపార్శ్వాలలోను స్వామి ధరించిన శంఖచక్రాలు యిందులో వర్ణించబడ్డాయి.

## తరిగొప్పుల మల్లన్న

తరిగొప్పుల మల్లన్న 16 వ శతాబ్దికి చెందిన వొక తెలుగు కవి. అతడు జన్మించిన స్థలం చంద్రగిరి. **'చంద్రభానుచరితం'** అనే పద్యకావ్యం వ్రాసి, మాహూరాపురదైవమైన దత్తాత్రేయుని కంకితమిచ్చాడు. కోట్లమంది యాత్రికులు బుగ్గల లోతీగలు గుచ్చుకొని మూతి మూసేసుకుని వేంకటేశ్వరుని ఆరాధనకై చేసే ప్రయత్నాన్ని వర్ణిస్తూ, తలనిండా మొక్కులు తీర్చే కానుకలతో శరీరం ప్రక్కకు వాలిపోకుండా శిరస్సును సవరించుకుంటూ అలసిపోకుండానేలపై వారి శరీరాలను దొర్లిస్తూ, మెట్టుమెట్టుకీ అప్పుడప్పుడూ గుడులలో కూడా పొర్లుదండాలు సమర్పిస్తూ ఉంటారు. వారు మొట్టమొదట శ్రీ గోవిందరాజు వారిని శయన భంగిమలో ఆదిశేషుడు తల్పంగా అతని పడగనీడన, వామహస్తం తొడవరకు చాచి, కుడి చెయ్యి తలగడగా ఆనుకుని, వక్షస్థలానికి కుడిపక్కన వున్న కౌస్తుభం, శ్రీవత్సాంకం ప్రక్కకు వొరుగుతూ అతనే స్వయంగా కుడిప్రక్కకు వంగుతూ, అతని జ్వాజ్వల్యమైన కనులు, పాదాలు గమనించాడు. అటుపిమ్మట వారు యాచకుల హాస్యధోరణిలో, హాస్యోక్తులలో అనుకరణలతో, గంగిరెద్దు లాటలతో, నాట్యాలతో, పాటలతో వారిని వారే అలంకరించుకున్నారు.

అప్పుడు యాత్రికులు కొండపైకి వెళ్ళడం మొదలు పెట్టారు. స్త్రీలు గొప్ప శ్రమకు లోనయ్యేరు. ఆపసోపాలు పడుతూ, యిక్కడా అక్కడా ఆడుతూ, శ్వాస భారీగా పీలుస్తూ, వొంటికి పట్టిన చెమట తమ దుస్తులతో తుడుచుకుంటూ, కాళ్ళు తడబడుతూ, అలసిసొలసి, వొక ప్రక్కనుండి యింకొక ప్రక్కకు వాలిపోతూ, అలసిన తమ కాళ్ళపై నిలబడలేకున్నా, అమితానందం పొందుతూ, యెట్టకేలకు గుడికి చేరుకున్నారు.

తన దక్షిణ హస్తం తన పాదాలను సేవించండని చూపుతూ, వామ హస్తం తొడని తాడుతూ (సంసారసుఖాలు నడుము వరకేనని సూచిస్తూ), ఖడ్గం వ్రేలాడుతూ, దైవభక్తిని ప్రేరేపించే వేంకటేశ్వరుని చూశాడు.

"చేతిలో చక్రం ధరించి, వక్షస్థలంపై లక్ష్మికి నివాసమిచ్చి, భక్తులను యెల్లప్పుడూ కాపాడేవాడు, భూమిని ఉద్ధరించడానికి వరాహరూపం దాల్చిన వాడు, దుష్ట రాక్షస వినాశకుడూ అయిన విష్ణువుని కొలుస్తాన" ని స్వామి చెబుతున్నాడు.

## పింగళసూరనార్యుడు

పింగళ సూరన 16 వ శతాబ్దపు తెలుగుకవి. అతడు 5 తెలుగు గ్రంథాలు రచించాడు. ఆతడు కర్నూలు జిల్లాలోని నంద్యాల ప్రాంతానికి ప్రభువైన కృష్ణరాయల ఆశ్రయం పొందిన వాడు. అతడు తన

కవితా వ్యాసంగపు ఉత్తరార్థంలో రచించిన గ్రంథాలలో **'కళాపూర్ణోదయం'** వొకటే (దీన్ని 'మెటమోర్ఫోసిస్' అనే పేరుతో సి.పి.బ్రౌన్ పేర్కొన్నాడు). దానికతడు రాజపోషకుడైన కృష్ణరాయల కంకితమిచ్చాడు. నంద్యాలకు చెందిన యీ దళపతుల కుటుంబం అళియ రామరాజుకు జన్మించిన ఆరవీడు వంశానికి దగ్గర బంధుత్వం గల (వేలు విడిచిన శాఖ) అతని సోదరులు ఆరవీటి బుక్కయ్య వంశీకులు. ప్రబంధంలోని ద్వితీయ స్కంధంలో నారదమహర్షికి భక్తి సంగీతంలో శిష్యుడైన మణికంధరుడు భారతదేశమంతటా విస్తృతమైన తీర్థయాత్రలు చేయడం (యమునా నదినుండి బదరికాశ్రమ, నైమిశారణ్య, కురుక్షేత్ర, ప్రయాగ, కాశీ, అయోధ్య, గంగాసాగర సంగమం (గంగానది సముద్రంలో సంగమించే ప్రదేశం), నీలాచల, జగన్నాథ, కూర్మవిభు (కూర్మరూపం), సింహాచలస్వామి, అహోబలస్వామి, చిట్టచివరగా వేంకటేశ్వర స్వామి ఆలయం చేరుకోవడం వర్ణించబడ్డాయి.

ఆతడు పవిత్రమైన స్వామి పుష్కరణి జలాలలో స్నానమాచరించాడు. భూవరాహస్వామిని ఆయన దేవేరితో సహా ఆరాధించాడు. అటుపిమ్మట ప్రసిద్ధికెక్కిన వేంకటేశ్వరుని గుడికి పోయి, పరివార దేవతలను దర్శించి, తరువాత గర్భగుడిలో వేంకటేశ్వరుని దర్శించాడు. నిటారుగా స్థాణువు వలె వుండి మృదు పద్మపాదుడై, కాళ్ళకు మెరిసే అందెలలో, బంగరు తొడుగులతో, వక్షస్థలాన్నలంకరించే బంగరు తాడులో, శ్రీలక్ష్మి వక్షస్థలా న్నలంకరిస్తూవుండగా, నేలకుచూపే వరద హస్తం (దక్షిణ హస్తం), ఎడమచెయ్యి వక్షస్థలంపైనా, వెనుక నున్న మిగిలిన రెండు చేతుల శంఖచక్రాలు ధరించి వుండగా, మెడలో ముత్యాల సరాలు వ్రేలాడుతూ వుండగా, మృదువైన కపోలాలు, మందస్మిత వదనం, మకరకుండలాలంకృత మైన కర్ణద్వయం, కలువలను తిరస్కరించే కనులు, చక్కని ముక్కు, అందమైన కనుబొమలు, ముత్యాల తిరునామం (నిడివిగా నుదుటిపైన తీర్చిన రెండు తెల్లని సమాంతర రేఖలు), రత్నఖచితమైన కిరీటమూ గలస్వామిని దర్శించాడు.

అతడు విస్మయానందాలతో స్వామి అంగాంగ వీక్షణచేసి నిలుచున్నారు. కొంతసేపటికి తెప్పరిల్లి స్వామినుద్దేశించి యీ విధంగా అన్నాడు. "స్వామీ! నీ పాదపద్మముల దర్శనంతోచకితుడైన నా చూపు వాటి నుండి మరల లేకున్నది. అటువంటి నా చూపును నీ కనకాంబరం వైపు యెలా మరల్చగలను? కనకాంబరంపై దృష్టిపడిన నేను, నీ ఉదర బంధనంపైకి దృష్టి యేవిధంగా మరల్చగలను? నీ ఉదరబంధంపై పడిన నిశ్చలంగా కేంద్రీకృతమైన నా దృష్టిని శ్రీవత్సాంకంపైకి యెలా మరల్చగలను?శ్రీ వత్సాంకంపై పడిన దృష్టిని నీ పద్మహస్తంపైకి యెలా మరల్చగలను? నీ పద్మహస్తాలపైన, మెడ, పెదవులు, మకరకుండలాలు, గడ్డం, ముక్కు, కళ్ళు, కనుబొమలు, శిరోజాలు – యీ అంగాలలో వేటి మీద దృష్టిపడినా దృష్టి మరలకున్నది. నేనేమి చేయగలను?" – ఆ విధంగా ఆలోచిస్తూ, అతడు పరవశుడై, ప్రపంచాన్నే మరచాడు. కొంతసేపటికి తెప్పరిల్లి, పునఃపునరంజలి ఘటించి, తన గొంతు తన వాద్యవిశేషాలతో అనుసంధానం గావించి వేంకటేశ్వరునుద్దేశించి సోత్ర పాఠాలు గానం చేయనారంభించాడు. ఈ విధంగా అతడు మూడు పగళ్ళు, మూడు రాత్రులు వేంకటగిరి మీద గడిపారు. పిమ్మట అక్కడ నుండి క్రిందకు దిగి కంచికి వెళ్ళారు.

**శ్రేష్ఠలూరి వేంకటరాయ కవి**

కందాళ అప్పలాచార్యుల వారి శిష్యుడూ, 13 వ శతాబ్దికి చెందిన తెలుగు కవియైన శ్రేష్ఠలూరు (చేట్లూరు) వేంకటరాయ కవి (వెంకటాచార్యులు), తెనాలి రామకృష్ణ కవికి, సారంగ తమ్మయ్య (**'వైజయంతీవిలాసం'** అనే తెలుగు కావ్యకర్త) కు సమకాలీనుడు. ద్విపద ఛందస్సులో, తెలుగులో **'శ్రీనివాసవిలాససేవధి'** అనే ద్విపదకావ్యం రచించాడు. రెండు దశాబ్దుల క్రింద దేవస్థానం వారు దీన్ని ప్రచురించ దలచారు. దేవస్థానం ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన కీ॥శే॥ కోరాడరామకృష్ణయ్య, ఎం.ఏ. దానిని తెలుగు ఒక గద్య సంగ్రహ రచన వెలువరించారు. దానిపేరు **'శ్రీనివాసవిలాసం'**. ఇది 1954 లో దేవస్థానం వారిచే ప్రచురించబడింది. రామకృష్ణయ్యగారి అభిప్రాయం ప్రకారం, శ్రేష్ఠలూరి (చేట్లూరి) కవి ద్వాదశ పురాణాలలోని భావనల, వర్ణనల వినోదం తొలగించి తెలుగులో వొక ద్విపదకావ్యం వ్రాశాడు. ఇది టి.టి.డి.వారి చేతనే 1956లో కోరాడ రామకృష్ణయ్యగారి పరిష్కరణలో వెలువరించారు.

ఈ కావ్యం సంగ్రహం పూర్వార్థంలో క్రింది విధంగా పుష్కరిణిలోని తొమ్మిది తీర్థాల జాబితా యివ్వబడింది.

1. వాయవ్యమూలలోని **వరాహతీర్థం.**
2. ఉత్తరాన **ధనద (ధనపతి అయిన కుబేరుడు) తీర్థం.**
3. ఈశాన్యంలోని **గాలవ తీర్థం.**
4. తూర్పున **మార్కండేయ (గొప్ప శివభక్తుడు) తీర్థం.**
5. ఆగ్నేయంలో **అగ్ని తీర్థం.**
6. దక్షిణాన **యమ (మృత్యుదేవత) తీర్థం.**
7. నైరుతిలో **వశిష్ఠ (ముని) తీర్థం.**
8. పశ్చిమాన అశ్వత్థ వృక్షచ్ఛాయ నున్న **వాయుదేవుని తీర్థం.**
9. పుష్కరిణి మధ్యలో **సరస్వతీ (విద్యా ధిదేవత) తీర్థం.**

పిమ్మట చోళప్రభువైన వారచోళుని కథ వర్ణించబడింది. ఒకరోజు వేటకు వెళ్ళిన అతను సువర్ణముఖీ నదీతీరాన నొక ఉద్యానవనంలో నాగేంద్రుడైన ధనంజయ మునికుమార్తె నందినిని కలసి ఆమె అనుమతితో గాంధర్వవిధిని ఆమెను వివాహమాడి, గృహోన్ముఖుడయ్యాడు. ఆ నాగకన్య గర్భవతి అయింది – చోళరాజుతో తన వివాహ విషయాన్ని తండ్రికి తెలియజేసింది. అనతికాలంలో ఆమె కొక కుమారుడు పుట్టాడు. ఆ పుత్రుడు పెరిగి పెద్దవాడై తన తండ్రి యెవరో చెప్పమని తన తల్లినడిగాడు. చోళరాజు అతని తండ్రి అని ఆమె చెప్పగానే తండ్రిని చూడాలనే తన కోరిక ప్రకటించాడు. నాగేంద్రుడతణ్ణి వొక సారంగం గుండా పంపాడు. ఆ పిల్లవాడు చోళరాజు వద్దకు వెళ్ళాడు. తన మంత్రుల సలహా మీద నందినిని ఆహ్వానించి,

కుఱ్రవానికి తొండమాన్ అనే నామకరణంచేసి, వేంకటగిరికి సమీపంలో రాజధాని నిర్మించి అతణ్ణి పట్టాభిషిక్తుణ్ణి గావించాడు. రాజై అతడు పాండ్యరాజు కుమారిని, మరికొందరు యితర రాజకుమార్తెలను పెండ్లాడాడు.

ఒకరోజు తొండమాన్ తన ఉద్యానవనంలో వినోదాల్లో మునిగి వుండగా, కొందరు సేవకులు వచ్చి అక్కడ దగ్గరలోని వొక చీమలపుట్ట వద్ద పాలకుండలు వాటంతటవి బ్రద్దలవుతున్నట్లు, అందులోని పాలు భూమిలోనికి పోతున్నట్లు చెప్పారు. నిద్రపోయే ముందు అతడు యీ విషయమై తీవ్రంగా ఆలోచించాడు. ఆ రాత్రి కలలో పద్మాక్షుడైన విష్ణువు తన స్థితిని అతనికి తెలియజేశాడు. మరుసటి రోజు ఉదయాన్నే వేటగాళ్ళలో ప్రముఖుడైన వాసు రాజుగారితో వొక తెల్లని పంది ప్రతిరాత్రి తన వరిపొలం నుండి గింజలు (వరి) తినేస్తోందనీ, దానిమీద ప్రయోగించిన బాణాలు ముక్కముక్కలవుతున్నా యనీ, ఆకాశవాణి ఆ వరాహం కలియుగదైవ మనీ, రాజుగారిని అక్కడకు తీసుకురమ్మని ఆదేశించిందనీ విన్నవించాడు.

మరుసటి రోజున తొండమాన్ ఆ ప్రదేశానికి లక్షలకొలది పాలకుండలతో పయనమయ్యాడు. ఆ రాత్రి శ్వేతవరాహం పొలంలోని పంటను తినివేస్తుండగా చూసి బాణం సంధించాడు. వేటగాడైన వాసు అతణ్ణి ఆపడానికి ప్రయత్నించాడు. వరాహం కొండ గుహలోనికి పరుగెత్తింది. రాజు గుహను తొలిచి, పాలతో దాన్ని తడపగా, అతనికి వరాహావతారం దర్శనమిచ్చి యీ విధంగా ఆదేశించింది : "ఒక పెద్ద విమానం నిర్మించండి. నా కోసం మంటపాలు, ప్రాకారాలు నిర్మించండి. వైఖానసాగమ విధానంలో అర్చనలు చేయండి. ఐశ్వర్యవంతులు కండి. స్వామి పుష్కరిణికి దక్షిణాన శ్రీనివాసుడనే పేరుతో వుంటాడు. విమానం, ప్రాకారం, మంటపాలు కట్టి, నిత్యపూజలు జరిపితే వైకుంఠం నీ అరచేతిలో వుండగలదు". నిత్యపూజలు జరిపి రాజు యోగిగా రూపొందవలసినదని చెప్పిన పిమ్మట స్వామి అదృశ్యుడయ్యాడు. రాజుగారు స్వామి ఆదేశానుసారం నిర్మాణ కార్యక్రమాలు కొనసాగించాడు. తాను నిత్యం పూజించే దైవం తనకు చూసిన సొరంగమార్గం నుండి దారి చేసుకుని ప్రయాణం కొనసాగించాడు. కన్య (సెప్టెంబర్–అక్టోబర్) మాసంలో స్వామి ఉత్సవాలు జరపడానికి అనుమతి పొంది, స్వామి అర్చనకు, అలంకరణకు, ఊరేగింపులకు పూజారిగా వ్యవహరించ వలసినదిగా వైఖానస మునిని ఆహ్వానించి సముచిత విధిగా వాటన్నంటినీ నిర్వహించాడు (ధ్వజారోహణంతో సహా). వివిధ వాహనాల ఊరేగింపులతో ఉత్సవాలు నిర్వహించాడు.

1. భక్తుల కొరకు **శేషవాహనం.**
2. బ్రహ్మకు ఆధ్యాత్మిక బోధన చేసిన దానికి దాఖలాలాగా **హంసవాహనం.**
3. హిరణ్యకశిపుని వధించినట్లు చూపే **సింహవాహనం.**
4. తాను, సీతామహాదేవి యేవిధంగా ప్రయాణం చేశారో చెప్పడానికి కుబేరుని **పుష్పకవిమానం.**
5. మొసలితో గజరాజు సంఘర్షణోదంతం, స్వామి మొసలిని చంపి గజాన్ని విముక్తుణ్ణి చేసిన విధం ప్రదర్శించడానికి **గరుడ వాహనం.**

6. హనుమత్సహాయుడై లంకకు పోయి రావణ సంహారం చేసిన విధానం సూచించే **హనుమద్వాహనం.**
7. శత్రుంజయమనే గజంపై విహరిస్తూ అయోధ్యను రాముడు పాలించినట్లు ప్రకటించే **గజవాహనం.**
8. అంతరాదిత్య జ్ఞానమెరిగిన వానిలా **సూర్యవాహనం (సూర్యప్రభ వాహనం).**
9. మహాభారత యుద్ధంలో అర్జునుడు విజయుడయ్యేలా సారధ్యం వహించినట్టు **రథవాహనం.**
10. మ్లేచ్ఛులను (ధర్మభ్రష్టులను) నాశనం చేస్తున్నట్టు సూచించే **అశ్వవాహనం.**
11. శిబిక వాహనం **(పల్లకీవాహనం)** – నవరత్నాలతో అలంకరించ బడిన ఆశ్రితులను రక్షించడానికి కృతనిశ్చయంతో ఉన్నట్లు తెలియజేసే తొమ్మిదవ రోజున ఆది వరాహ మందిరానికి పోతూ స్వామిపుష్కరిణీ జలంతో అభిషేకింపబడే వాహనం.

శివుని కుమారుడైన కుమారస్వామి తన తండ్రి కృపతో తారకుని సంహరించి బ్రహ్మ హత్య చేసిన వాడయ్యాడు. ఆ కారణంగా ఆకలి దప్పులు కోల్పోయి దస్సిపోయాడు. అతని బాధా నివారణకు, పాతకహరణానికి శివుడతనికి మానసిక ఉపాంసువురీతిలో ధ్యానించడానికి నారాయణ మంత్రోపదేశం చేశాడు. దారిలో బృహస్పతి కనిపించి నీవెందుకు విష్ణువును వెదుకుతూ వెళ్తున్నావు? నీవే స్వయం విష్ణువు కదా? అని ప్రశ్నించాడు. 'అదెలా?' అని కుమారస్వామి బృహస్పతిని ప్రశ్నించాడు. అప్పుడు బృహస్పతి "తారకాసురుని వధించడంలో విష్ణ్వంశ శివునిలో వున్నదని, అదే అంశతో గిరిజాదేవికి వొక కుమారుడు జన్మిస్తాడని దేవతలకు తెలియజేశాడు.

ఇంతలో గిరిజాదేవి శివునికి వారి కుమారుని భద్రత పట్ల తన ఆందోళన తెలియజేసింది. వారిద్దరూ వేంకటగిరికి పయనమయ్యారు. అక్కడ వొక వన్యమృగ మిథునం క్రీడిస్తూ వుండగా చూసి వారు కూడా మన్మథ ప్రేరితులైనారు. వారు కూడా మృగ మిథునంగా మారి క్రీడించారు. వారి క్రీడాఫలమైన బీజాగ్ని వాయుదేవుడు స్వీకరించి అదే కొండపై తపస్సు చేస్తున్న అంజనాదేవికి బహూకరించాడు. ఆమె గర్భవతియై హనుమంతునికి జన్మనిచ్చింది. శివపార్వతులు తమ కుమారుడైన కుమారస్వామిని కుమారధారా తీర్థం వద్ద కనుగొన్నారు.

**విష్వక్సేన తీర్థం : దాని పేరుకి మూలం.**

దుర్వాసమహర్షి తపస్సుచేస్తూండగా కుంతల అనే అప్సరసను ఇంద్రుడు అతని తపస్సు భంగం చేయించడానికి పంపాడు. ఆమె చేష్టలకు కోపగించిన మహర్షి ఆమెను చెంచెతగా జన్మించమని శపించాడు. ఆ విధంగానే జన్మించి వొక తోటలో క్రీడాసక్తురాలై యుండగా వరుణుడు ఆమెతో శృంగార క్రీడ సలిపాడు. గర్భవతియైన ఆమెకు విష్వక్సేనుడుదయించాడు. ఒక సరస్సు వద్ద విష్ణువును ధ్యానించి విష్ణుసాయుజ్యం పొంది అతని దళపతి అయ్యాడు. విష్వక్సేనుడు ఆ సరస్సువద్ద తపస్సు కొరకై నివసించి యుండుటవలన దానికి విష్వక్సేన తీర్థమనే పేరు వచ్చింది.

**కపిలతీర్థం**

కపిల మునిరూపంలో విష్ణువు ఆ సరస్సు మార్గంలో పోతూ శివలింగా న్నర్చించేవాడు. అందువలన దానికి కపిల తీర్థమనే పేరు వచ్చింది.

**గణపవరపు వేంకటకవి**

17 వ శతాబ్దికి చెందిన గణపవరపు వేంకటకవి **'శ్రీ ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసం'**, తదితర గ్రంథములు వేంకటేశ్వరుని కంకితం చేశారు. దయార్ద్ర హృదయుడైన వేంకటేశ్వరునితో తనను, తన కుటుంబాన్ని రక్షించమని వేడుకుంటాడు. అతని వక్షస్థలంపై వసించే అలమేలుమంగను తన కోర్కెలు తీర్చమని, తన యింట వెలసి ఉండమని ప్రార్థిస్తాడు. తమ తలపై మూటలతో యాత్రికులు ప్రతిచోట సాష్టాంగప్రణామం చేస్తూ, ప్రార్థనలు చేస్తూ ప్రయాణం కొనసాగిస్తారు. మోకాళ్ళ ముడుపు (రెండవ అధిరోహణానికి పైనున్న రాతిమెట్ల సముదాయం) లో ప్రతిమెట్టు కాలినుండి మోకాలివరకు వున్నంత యెత్తు కలిగివుండటం వల్ల చాలా శ్రమకు గురిచేస్తుంది.

చాలామంది యాత్రికులు ఉభయాలు (వండిన పదార్థాలతో నివేదనలు), చెరుపులు (వంటకాలు), దోసెలు, అప్పాలు, అతిరసాలు సిద్ధంచేసి స్వామికి తమ ప్రార్థనలతో నివేదన చేసి అందరికీ ప్రసాదం రూపంలో పంచుతారు.

వేంకటేశ్వరుని భక్తులు ఉత్సవాలకు వచ్చి అలసిన యాత్రికులకు వడపప్పు (తడపబడిన పెసరపప్పు), పానకం (బెల్లపునీరు), అరటిపళ్ళు, కొబ్బరి బోండాం నీళ్ళు, వేడినీళ్ళు, మజ్జిగ, పెరుగు, మంచి కప్పురపు పొడితో కలిసిన చందనం, పునుగు, వక్కపొడి, కస్తూరి, పువ్వులు, విసనకర్రలు, ఎండనుండి రక్షించుకొనే సాధనాలు, యేలకులు, అల్లం, లవంగాలు, పనసపండ్లు, చెరుకులు, ఖర్జూరాలు యిచ్చేవారు.

కవి అంటాడు, "చిన్నస్వర్ణ ఘంటలతో కూడిన చిన్న అందెలతో అలంకరించబడిన నీ పాదాలు చూశాను. నీ వరద హస్తం, నడుముపై ఆన్చిన నీ వామహస్తం, నీ పీతాంబరం, నీ బుగ్గలో నున్న నమిలిన వక్క, లోకాలన్నీ దాచుకున్న నీ విశాలమైన కుక్షి, అలమేలుమంగ విశ్రమించే నీ విశాలమైన వక్షస్థలం, శ్రీవత్సం, శంఖచక్రాలు ధరించే నీ రెండు చేతులూ, నీ భుజకీర్తులూ, మెడలో వ్రేలాడే తులసిమాల, నీ చెవుల నలంకరించే మకర కుండలాలు, నీ గులాబీ వన్నె పెదవులు, సున్నితమైన కపోలాలు, సొగసైన నాసిక, కరుణరస ప్లావితమైన కన్నులు, నిర్మలమైన ముఖం, నీ కిరీటం కూడా చూశాను. నీవు కడగని పళ్ళెరాలలో ముడిబియ్యంతో చేసిన అన్నం తింటూవుంటే చూసి అలమేలుమంగ సహించగలదా? వడ్డికాసులతో నీవు చేసే వసూళ్ళ తీవ్రత తట్టుకోగలదా? ఒక గొప్ప వైష్ణవుడు చెరువు తవ్వుతూ వుండగా వచ్చిన మట్టి ముద్దలు నీవు మోసుకుని వస్తూ వుండటం, మరొక స్త్రీని నువ్వు వివాహమాడటం చూసిన ఆమె సహించగలదా? నీ యీ చేష్టన్నా గంభీరంగా గమనించిన ఆమె పెళ్ళిలో నీకు తగిన రీతిలో యీ విధంగా సలహా యిచ్చింది.

"పూర్వం తండ్రిగా యెందరో చేసిన తప్పులు సహించావు. శబరి తన యెంగిలితో అపవిత్రం చేసిన పండ్లు స్వీకరించావు. ఎరుకల ప్రభువు కోరికలన్నీ తీర్చావు. నీకు పెట్టవలసిన ఆహారాన్ని తగ్గించి, నీకు అందవలసిన ఆభరణాలు నీతో బాటు పంచుకుంటూ వుండే పాదుషా నీతో సమాన హక్కుదారా? నీ వ్యవహారాలు నైపుణ్యంగా నిర్వహించేవారు. పారుపత్యదార్ నీ స్నేహితుడా? వారి ప్రభువు నీవా లేక నీవంటి మరొక దైవమా? మాకు తెలియాలి. మేము తప్పులెన్నకుండా మమ్ముల నాదుకొనే వొకే వొక్కదైవం కోసం వెదుకుతున్నాము".

(కవి అందించిన విలువైన సమాచారం యిది. ఇంతకు ముందు కాలాల్లో చాలామంది ప్రభువులు, దళపతులు వేంకటేశ్వరునికి విలువైన ఆభరణాలు బహూకరించారు. అనేక గ్రామాలు దానం యిచ్చారు. నిత్యనివేదనలకు, అప్పుడప్పుడు చేసే నివేదనలకు యేర్పాట్లు గావించారు. పాదుషా, స్వామి నివేదనలకు, అప్పుడప్పుడు చేసే నివేదనలకు యేర్పాట్లు గావించారు. పాదుషా, స్వామికి నివేదనలు తగ్గించినట్లు, అతని ఆభరణాలు తీసి వేసినట్టు, గ్రామాలు, భూములు కూడా స్వామివారి అధారంలో లేకుండా చేశాడు. ఈ పాదుషా ఖచ్చితంగా గోల్కొండ సుల్తానే అయివుండాలి. క్రీ॥శ॥1660 లో అతడే (అబ్దుల్‌హసన్ కుతుబ్‌షా) ప్రప్రథమంగా తిరుపతి పరిసరాలలో వున్న విజయనగర సామ్రాజ్యపు భూములు జయించి వేంకటేశ్వరస్వామి మందిరాన్ని కూడా తన అధీనంలోనికి తెచ్చుకున్నాడు. అతడు 1672 లో మరణించాడు. అట పిమ్మట అబ్దుల్‌హసన్ కుతుబ్‌షా పరిపాలనకు వచ్చాడు. 1688 లో ఔరంగజేబు గోల్కొండ రాజ్యానికి చరమగీతం పాడాడు. కవి, యీ కాలంలో నివసించి ఉండాలి. ఎందుకంటే అతడప్పుడు స్వామివారికిచ్చే ఆభరణాలు, సంభారాలు తగ్గిన విషయం కల్పించారు.

"చక్కగా తిరుపతి పాలన జరుగుచున్నదని ఊహాలలో విహరించకుండా, యితరులలోని తప్పులెన్నకుండా, భువిలోను, దివిలోను ఆనందం నింపుతూ, అలమేలుమంగ నిన్ను వరించడం నీ అదృష్టం. ఆర్తుల పిలుపు లెక్కించకుండా, నీ మాటలతో, నీ చేతలతో వారికి సహాయం అందించకుండా నీకు నీవే దైవత్వం ఆపాదించుకోవడం న్యాయమా? ఇది నాకే చెల్లింది. అయినా నువ్వు మా తండ్రివి. అలమేలుమంగ మా తల్లి. "అలమేలుమంగ కృప వలన మా మనోవనంలో నీ కీర్తిమంతమైన సంప్రదాయ వృక్షం పాదుకొనుగాక!".

బహుశా యీ గణవరపు వేంకటకవియే శ్రీవేంకటేశాంధ్రమనే మరో పేరుతో **'సర్వలక్షణశిరోమణి'** కూడా రచించాడు. వేంకటేశ్వరుని కంకితమిచ్చాడు. ఒక సీసమాలికలోని మూడవ చరణంలో దేశీయాలు, తద్భవాలు, తెలుగుపదాలు పోగుచేసి వాటిని దేవతల, మానవుల, స్థావర, తిర్యక్పదాలని నాలుగు తరగతులుగా వర్గీకరించాడు. వీటికి నానార్థ వర్గు తోడుచేశాడు. 128 పద్యాలలో విశ్వశ్రేయస్సు కొరకు ప్రతిపదాల సముదాయానికి సంస్కృత పదాలు (సమానార్థాలు కలవి) పొందుపరచాడు. తన గ్రంథం అమరసింహుని **'అమరకోశం' ('నామలింగాను శాసనం')** అంతటి ప్రయోజనకారి అని, తెలుగు కవుల నుండి ఆంధ్ర నిఘంటువని ప్రశంసలు పొందటానికి అపూర్వమైనదని పేర్కొన్నాడు. అంత్య గద్యలో తాను శ్రీ పెరంబూదూరి యతిరాజాచార్య [**క్రీ.శ.1017-1137లో జీవించిన శ్రీమద్రామాను-జాచార్యులు వేరు!**

**ఈ యతిరాజాచార్యులు వేరు!**] ఈయన క్రీ.శ.16వ శతాబ్దంవాడు) శిష్యుడనని, నందవరీకుడనని, అశ్వలాయన సూత్రుడనని, వశిష్ఠ గోత్రోద్భవుడనని, రథగజతురగాదులు కానుక గొన్నవాడనని, రత్నఖచితమైన ఆభరణాలు, వస్త్రాలు, ఇళ్ళు కర్ణాట, మందిర (తొండ మండలం), చోళ, పాండ్య ప్రభువుల నుండి పొందానని, గణపవరపు మంత్రి మణిమంగమాంబల కుమారుడనని చెప్పుకున్నాడు. తిరువేంగడనాథునికి తన కృతి అంకితమిచ్చినట్లు చెప్పుకున్నాడు.

**చెళ్ళపిళ్ళ నరసకవి**

చెళ్ళపిళ్ళ నరసకవి 18 వ శతాబ్దపు ఉత్తరార్థంలో 19 వ శతాబ్దపు పూర్వార్థంలోని వాడు. ఒక చెంచెతతో వేంకటేశ్వరుని వివాహం వర్ణిస్తూ వేంకటేశ్వర విలాసం రచించాడు. ఇతర కావ్యాలు కూడా వ్రాశాడు. స్వామి మందస్మిత సుందరవదనునిగా, తన బంగారు దుస్తులతో ప్రకాశిస్తున్నట్లు, దృఢకాయుడు, కరుణ నిండిన చూపులు గలవాడు, లక్ష్మిని తన వక్షస్థలంపై ధరించినవాడు, నుదుట నిడుపైన కస్తురి తిలకం ధరించిన వాడు, శంఖ చక్రధారి, రత్నఖచిత కిరీట ధారి. ఆ చెంచెత భక్తులను దోచుకుంటున్నట్లు, చిల్లర కూడా పోగొట్టుకోకుండా మొక్కులు వసూలు చేసుకుంటున్నట్లు, ముడిబియ్యం అన్నం శుభ్రం చేయని పళ్ళెరాలలో తింటున్నట్లు, పిలిచిన ప్రతివాని యింట భోజనం చేస్తున్నట్టు, తన యింట్లో అరమరికలు మరచి అందరికీ అన్నం పెడుతున్నట్టు, ప్రసాదాలు అమ్ముతున్నట్టు, భోజనం ధరను ముక్కుపిండి వసూలు చేస్తున్నట్టు "ప్రజలు నీ ప్రవృత్తిని విమర్శిస్తున్నారు. నన్ను నీవు నిందించటం యెంత వరకు సమంజసం?" అని ప్రశ్నిస్తున్నట్టు పేర్కొంటాడు.

బహుశా వేంకటేశ్వరుడు యీ విధంగా సమాధానమిస్తాడు : "భక్తుల ధనాన్ని హరించడం వారిని లుబ్ధత్వం నుండి మరలించడానికే కదా! నేను తుప్పు పట్టిన పళ్ళెరాలలో ముడిబియ్యంతో చేసిన అన్నం స్వీకరించడం నీ అహంకారానికి కళ్ళెం వేయలేదా? అందరూ అందించే అన్నం తినడం సమానత్వం కాదా? ఆరు రకాల ఆహారం వండి అందరికీ వడ్డించటం ఔదార్యం కాదా? ఇవి నిందించదగిన గుణాలు కావు. అద్భుత గుణాలకు ప్రతీకలు".

**కృష్ణకవి**

కృష్ణకవి 18 వ శతాబ్దపు తెలుగు కవి. చిరుమామిళ్ళ పాపయ్య ప్రభువుకు ఆస్థానకవి. ప్రసిద్ధికెక్కిన కాళిదాసు శాకుంతలం తెలుగులోని కనువదించి **'శకుంతలా పరిణయం'** అనే పేరిట శ్రీవేంకటేశ్వరుని కంకిత మిచ్చాడు. అతడు యీ విధంగా వ్రాశాడు.

అలమేలుమంగ అనే మారుపేరు గల ఇందిరాదేవి (లక్ష్మి) ని వక్షస్థలంపై వున్న కుంకుమ తన వక్షస్థలానికి అంటేటట్లుగా బిగియార కౌగిలించే వేంకటపతిని స్తుతిస్తారు. ఏ మూర్తి చల్లని చూపులు సకల జగత్తులకు ఆనందప్రదాతలో, యెవని సుందరాకృతి ప్రజలకు క్షేమంకరమో, ఎవరిని విద్యావారధిగా భావించి, వారికి సేవకులై అంగ, వంగ, కళింగ, చోళ (వంగ, గౌళ, గౌడ, విదర్భ), పాంచాల, నేపాళ,

మాళవ, ఆంధ్ర, శక, యుగంధరాది ప్రాంతాల ప్రభువులు భాగ్యశాలులవుతారో, ఆ దేవతల ప్రభువు వైకుంఠం వదలి, సర్వాలంకార శోభితుడై, ఇందిరాదేవితో స్వామి పుష్కరిణి దరినున్న స్వర్గసౌధంలోనికి ప్రవేశించాడు. తన దాసుల మొక్కులు ఆనందంగా స్వీకరిస్తూ ఆ స్వామి శేషగిరిపై శోభాయమానంగా విరాజిల్లుతుంటాడు.

**వేంకటాచలవిలాసం**

'వేంకటాచలవిలాసం' వేంకటాచలానికి వెళ్ళే కొందరు మునుల తీర్థయాత్రను వర్ణించేవొక తెలుగు కావ్యం. కవి, అతని కాలం, యితరాల వివరాలు మనకు తెలియవు. వారు వెళ్ళే తోవలో శ్రీకాకుళ దేవుణ్ణి అర్చించారు. తమ లోట్లు తీర్చుకొని, ఆనందంగా ప్రయాణం చేస్తూ కృష్ణానదికి చేరుకున్నారు. ఆ నది సాగరుని రాణి. వేంకటాచల దర్శనాభిలాషు లైన వారు సాగరాన్ని చేరుకునే యితర నదులలో కూడా స్నానం చేశారు. తమ పాదయాత్రలో సరస్సులతో, గుహలతో అలరారే శేషశైలాన్ని మునులు దర్శించారు. కిరీటం, ముతాల తిరుమణి, మకరకుండలాలు ధరించి, చిరునవ్వు మోము, పగడాల పెదవులు, నున్నగా మెరిసే కపోలాలు, సుస్వరమైన కంఠం, శంఖచక్రాలు, కల్పవృక్షంలా వరాలిచ్చే రెండు చేతులు, అలమేలుమంగ నివసించడానికనువైన నీలవక్షం గలవాడు, వక్షస్థలం నుండి వ్రేలాడే ఖడ్గం గలవాడు, నడుంచుట్టూ జంగమ జిలుగులతో శోభించే పట్టుపీతాంబరం గలవాడు, మెరిసే అందెలు గలవాడు, విద్యుల్లత కాంతిని తిరస్కరించే దేహకాంతి గలవాడు, సకలదేవతలకు ప్రభువనే ప్రసిద్ధి చెందిన బిరుదుగలవాడు, శ్రేయస్కరుడు, కడగని పళ్ళేరాలు పరిపాటిగా వాడేవాడు, ముడిబియ్యంతో చేసిన అన్నం భుజించేవాడు, మొక్కులకై కాసులు గుంజేవాడు, ముక్కోటి తీర్థంలో మురిసేవాడు, అడుగడుగు దండాల వాడు, బంగరు వరహాలు ముడుపుగా గలవాడు, శుక్రవారం నాడు అభిషేకం అందుకునే అందమైన దేవుడు, అపరిమితాహారాన్ని స్వీకరించేవాడు, త్రిమూర్తులలో అగ్రగణ్యుడుగా కీర్తించబడినవాడు, శేషాచలాధిపతి. అందరి ఆత్మ. పరంధాముడు. విశ్వాత్మకుడు. నిఖిలరూపులు తన రూపమైనవాడు. సనకసనందాదుల స్తుతికి పాత్రుడు. అందరి మన్ననలూ అందుకున్నవాడు. "సృష్టి కార్యక్రమంలో నీవు ఆద్యుడవు. స్థితి సంహారాలలో కూడా నీవు జగత్సాక్షివి. అందరి కోరికలు తీర్చే దేవతల రాజువి. బ్రహ్మ, రుద్ర, ఇంద్రాది దేవతలు అర్థం చేసుకోలేని వాడవు. తపస్వులు కానలేని పరబ్రహ్మవు. శంఖచక్రగదా ఖడ్గశార్ఙ్గచాపాదిధరుడవు. "ఈ ప్రాంతపు అందం, తీర్థ ప్రాశస్త్యం, శౌరివరుణ గురువాగీశఫణీశులకై నా యీ అచలవైభవం వర్ణించతరమా? ఏనాడు యే తపస్సు చేశామో, యే సుకృతమొనర్చామో, యే వ్రతమాచరించామో, మా కోర్కె లీడేరాయి. వేంకటాచలప్రభువు దర్శనం లభించింది. ఆ ప్రభువు కోర్కెలు తీర్చడంలో, శుభ ఫలితాలివ్వడంలో, పాపాలు హరించడంలో ఘనుడు. అలా తలపోస్తూ, మునులు కొండపై కెక్కారు. కొండకు దక్షిణభాగాన వున్న ఆళ్వారు తీర్థానికి చేరుకున్నారు. ఆ తీర్థంలో పాపహరమైన జలం వున్నది. అందులో స్నానం చేశారు. సర్పభూషితుడైన స్వామిని దర్శించాడు. అష్టదిక్కులు ఆభరణంగా, అగ్నినేత్రంగా గల నాగభూషణుడు, దిగంబరుడు, కపిలేశ్వరుడు.

అక్కడనుండి వారు తిరుపతిలోని గోవిందరాజస్వామి దేవాలయానికి వెళ్ళి సాష్టాంగ ప్రణామం చేశారు. ఆ కొండకు ప్రభువైన వానిని వీడి రావడానికి యిష్టపడక, విరాజిల్లే అందెలతో వుండే స్వామిని స్మరిస్తూ, మాటిమాటికి వెనుదిరిగి చూస్తూ ప్రయాణం కొనసాగించారు.

**దివాకర్ల తిరుపతిశాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి**

19 వ శతాబ్ది ఉత్తరార్థంలోను, 20 వ శతాబ్ది పూర్వార్థంలోను వుండేవాడు. వారు సహ రచయితలుగా శతాధిక గ్రంథకర్తలు. వీరు చిన్నతనంలోనే వేంకటేశ్వరుని దర్శించి స్వామిని యీ విధంగా వర్ణించారు. "నువ్వు కాసు, కాసు కూడబెట్టి, నీకందరూ తెచ్చియిచ్చిన డబ్బుతో సంపద కూడబెట్టావు. కాని, కానుకలకు మేము దూరం. వణుకుతూ, ప్రజలు నిన్ను దర్శించవస్తారు. కాని, మేమువారిని స్వచ్ఛందంగా కలిసినా, వారు మమ్ములను వీక్షించరు. నీకు స్వచ్ఛందంగా యిచ్చేవారే మాకు యే కొద్దిగా యిచ్చినా చాలా యెక్కువగా యిచ్చినట్లు భావిస్తారు. నీకు సేవలందించి నీకెంత కావలసినా ఇస్తారు. కాని, అదే మేము వారిని సేవిస్తే వొక కాసు కూడా విదల్చరు. వేయి మాటలేల? "తిరుపతి, వేంకటేశ్వరనామాలు నీకు,మాకు సమానమే అయినా, మన అదృష్టాలు మాత్రం వేరు". "నీవు దేనికి కాసుల్ని అడుగుతావు? అలా అడగటం పేదరికం కదా! లంచగొండులను యెందుకు ప్రోత్సహిస్తావు? అది ఆశ్రితపక్షపాతం కాదా? డబ్బు అప్పుకిచ్చే పెద్ద కోమటుల వలె అప్పులిచ్చి అనేకులైన రాజులనెందుకు వేధిస్తున్నావు? వేటగాడిలా శిఖరాగ్రం మీద అధివసించి ఉంటావెందుకు? ఈ చేష్టలన్నీ నీవు చాలా నిగ్రహుడని చాటుతున్నాయి. కాని, యీ నీ చేష్టల వలన యేమి వ్యక్తం చేయదలచుకున్నావు? అలసులైన తిరుపతి వేంకటకవి నామధేయులైన ఆస్థానకవులకు ఆశ్రయిభూతుడైన వో దైవమా! ఓ తిరుపతి వేంకటేశ్వరా! ఇదే నీకు మా వందనాలు!

రెండవసారి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి వొక్కడే తన 66 వ జన్మదినాన మిత్రులు, ఛాత్రులు షష్ఠి పూర్తినాడు జరుపవలసిన శుభకర్మలను ప్రోత్సహించగా జూలై 1936 లో వేంకటేశ్వరుని దర్శించాడు. అప్పుడు కొన్ని పద్యాలలో స్వామి వారి నుద్దేశించి యిలా అన్నాడు. "అనుచర సమేతుడై ఇందిరాప్రియుడైన స్వామి విహారానికి అనువైన అనేక ప్రదేశాలలో, స్వామి శేషగిరిని ఆనందంలో, స్వచ్ఛంగా ఎన్నుకున్నాడు (తెలుగు కవితలో పదాలు వినే వుద్దేశంతో). "ఉపనిషత్తులు చాటిన రీతిలో ఆంధ్రులచే 'వెంకన్న' అని పిలువబడే పరబ్రహ్మ... రమ్మని పిలువగానే 'ఆ' అని స్పందించి వారిని రక్షిస్తాడు". "చనిపోయిన కొడుకుని పునరుజ్జీవితుడుగా జేసెనని, ఊబిలో చిక్కుకుని 'అంబాజీ' అని ఆర్తనాదాలు చేస్తున్న గోవును రక్షించాడని భగవంతుని విశ్వసించిన వారు నిర్మల హృదయంలో స్వామికి నమస్కరిస్తారు. "వేంకటేశ్వరుడు మా జనకుడ' ని కీర్తిస్తారు. జ్ఞానులు సచ్చిదానంద రూపుడైన పరబ్రహ్మకు నివాసస్థానమైన సత్యలోకం ఆరు లోకాలకు పైనున్నది. కాని, యిక్కడ భూలోకంలో ఆరుకొండలపై విష్ణులోకమైన వేంకటేశ్వరుడున్నాడు. భక్తులు గోపుర శిఖరాలపై సూర్య కిరణాలు తాకి వాటిని ప్రకాశింప జేసేముందే కొండపైకెక్కడానికి యత్నిస్తారు. "వేంకటేశ్వరుని కరుణ వలన గతంలోని కష్టాలు, అవి ఉపశమించిన తీరు వారితో వారు చర్చించుకుంటూ, గుంపులుగా ఉచ్చైస్వరంతో స్తోత్రపాఠాలు చేస్తూ, యేడవ కొండపైకి యెగ బ్రాకుతారు.

"అనేకమంది దేవతలున్నారు. మొరబెట్టినా వీరెవ్వరూ పలుకరు. కలియుగంలో నీ వొక్కడివే పలుకుతావు. నా మొరకు మునుపే నీ దర్శనం లభించింది. ఈ రోజున తిరిగి దర్శనం లభించింది". "వృషాధీశ్వరా! మావంటి హీనజన్ములు ముందుగా మా భాగ్యాన్నెలా దర్శించగలం? నీ వొక్కడవే మా అదృష్టమెరిగిన వాడవు. దయతో మా ప్రార్థనను మన్నించు. ఎల్లప్పుడూ నేను నీ సన్నిధిలోనే వున్నట్టు భావించు. నేను నీ వాడిని. నీ కృపకు పాత్రుణ్ణి చేయి". "నా 66 వ జన్మదినమైన యీ రోజున నీ దర్శనం లభించింది. ఈ రోజు ఎంతటి శుభదినం! ఇహంలో నీ దర్శనం శుభప్రదమైనది. అంతేకాదు. స్వర్గానికి త్రోవ సుగమం చేస్తుంది". "ఉత్తర హిందూస్థానవాసులు నిన్ను 'బాలాజీ' అని పిలుస్తారు. అది 'శక్తి' కి మరోపేరు సూచిస్తుంది. అప్పుడు బహుశా నువ్వు నా అమ్మవౌతావు. చాలామంది నిన్ను ఫాలాక్షుడైన శివుని కుమారుడు, సుబ్రహ్మణ్య స్వామిగా భావిస్తారు. ఇన్ని మాటలేల! నీవే అందరికీ అన్నీ". ఎవరైనా నిన్నెందుకు శంకించాలి?" "రామానుజులు యిక్కడి దైవాన్ని హరిగా మలచాడని, అంతకు ముందు యిది శివక్షేత్రమని, – శివునికి చెందిన చిహ్నాలింకా యిక్కడ వున్నాయని అంటారు. నిజానిజాలు నేనెరుగను. ఈ వివాదం అద్వైతులను యే విధంగా ప్రభవింప చేస్తుంది (వారు జీవాత్మ, పరమాత్మలకభేదం చెబుతారు గదా! "జగన్నాస్తి" అనే వీరు ప్రతి వస్తువులో పరబ్రహ్మను సందర్శిస్తారు కదా! నా వృద్ధాప్యంలో నేను డోలీ యెక్కాను. డోలీలో కొండపైకి నిన్ను తీసుకుని వెళ్ళడం, వృద్ధాప్యం రెండవ బాల్యమనే సనాతన ఋషుల మాట నిజం చేసింది. "నా ముత్తాతకు తమ్ముడైన నరసకవి అనే వొక గొప్ప కవి నీ మీద వొక శతకం రచించాడు. దానిపేరు **'వేంకటేశ్వరవిలాసం'.** నేను యీ కోవకు చెందినవాడనే. నన్ను నీ కరుణతో పెంచమని వేడుకుంటున్నాను" అంటాడు.

**వట్టిపల్లె నరకంఠీరవశాస్త్రులు**

నా మేనమామ 'తర్కాలంకారభూషణ' బిరుదాంకితులు కీ॥శే॥ పండిత వట్టిపల్లె నరకంఠీరవశాస్త్రులు శ్రీ వేంకటేశ్వరునుద్దేశించి 5 శ్లోకాలతో కూడిన వొక స్తోత్రం, 9 శ్లోకాలతో కూడిన మరొక స్తోత్రం (శ్రీవేంకటేశాష్టకమ్) రచించారు. 8 శ్లోకముల మొదటి అక్షరాలు కలిపి చదివితే అష్టాక్షరీ మంత్రం అవుతుంది (ఓం నమో నారాయణా). ఈ శ్లోకాలు **'తిరుమల శ్రీవేంకటేశ్వర'** అనే జర్నల్‌లో (సంచిక 1, సంఖ్య 7, నవంబర్ 1932) ప్రచురించబడ్డాయి.

**ఐదు శ్లోకాలతో కూడిన మొదటి కూర్పు :**

**శ్రీవేంకటేశ్వరస్తోత్రం**

1. చతుర శ్చతుర సకృత్ పుమర్థాన్
చతురోదాతుమ్ ఇవోద్వహన్ భుజాన్ యః
కరుణావరుణాలయాః సమింధే
ఫణిశైతే శరణం తమాశ్రయామః

2. నమస్కుర్మో కుర్మోస్ నతజన మనోభీష్ట ఘటనా
పటీయాంసం శేష క్షితి ధర శిరోభూషణ మణీం,
త్రిలోకీ నిర్మాణ స్థితి హరణ లీలా సురసికమ్
శ్రియఃకాంతం దేవం సుగుణ నిధిం అస్మత్కుల గురుమ్.

3. శ్రీమద్వేంకట శైల శేఖర తటే సంచార మాతన్వతీ,
నిష్కంపం తటితం సదైవదధతి భూయోఽమృతం వర్షతి,
సౌహార్ద్రం చ ధనంజయే విధదతీ ధ్యాతుం తమో ధున్వతీ,
పుష్యాద్వో నితరాం ప్రమోదలతికం యా కాపి కాదంబినీమ్.

4. జయంతి శ్రీకంఠ ప్రణయ రసధారా మధురిపోః
కటాక్షాః కారుణ్యామృత జలధి కల్లోల నికరాః,
త్రిలోకీ కళ్యాణ ప్రణయన మహాకల్ప విటపాః
శ్రిత స్వాంత ధ్వాంత ప్రశమ కరణాదిత్యకిరణాః.

5. అహీన శైలస్థం అహీన వైభవం మహో యదాభాతి మహోత్సవః శతామ్।
నిరంతరం తం నిగమాంతగోచరం చిరంతనం చేతసిచింతయా మహమ్॥

**9 శ్లోకాలతో కూడిన రెండవ కూర్పు**

1. **ఓం** తత్పదితి నిర్దేశ్యం జగజ్జన్మాది కారణమ్ ।
అనంత కళ్యాణ గుణం వందే శ్రీవేంకటేశ్వరమ్ ॥

2. **న**తామరశిరోరత్న శ్రీపదాంబుజమ్ ।
ప్రావృష్యేణ్యఘనశ్యామమ్ వందే శ్రీవేంకటేశ్వరమ్ ॥

3. **మో**హాది షడరీ వ్యూహ గ్రాహాకుల మహార్ణవే ।
మజ్జతాం తరణీం నృణాం వందే శ్రీవేంకటేశ్వరమ్ ॥

4. **నా**థం త్రిజగతామేకం సాధు రక్షణ దీక్షితామ్ ।
శ్రీశేషశైలమయం వందే శ్రీవేంకటేశ్వరమ్ ॥

5. **రా**జద్రాజీవ పత్ర శ్రీమదమోచనలోచనమ్ ।
మందహాస లసద్వక్త్రమ్ వందే శ్రీవేంకటేశ్వరమ్ ॥

6. **య**న్ముఖేందు స్మితజ్యోత్స్నా భూయసీం తమసాం తతిమ్ ।
విధునోతి ప్రసన్నానాం వందే శ్రీవేంకటేశ్వరమ్ ॥

7. **నాం**తస్య కస్యచిత్ వాక్యం శబ్ద స్యానన్య వాచినోః ।
బ్రహ్మ రుద్రేంద్ర జనకమ్ వందే శ్రీవేంకటేశ్వరమ్ ॥

8. **యద్వ**క్షఃస్థల మధాస్య భాతి శ్రీరమాపాయినీ ।
తటిల్లేఖేవాభ్రమధ్యే వందే శ్రీవేంకటేశ్వరమ్ ॥

9. **వేం**కటేశాష్టకమిదం నరకంఠీరవోదితమ్ ।
యః పఠేత్సతతమ్ భక్త్యా తస్మైవిష్ణుప్రసీదతి.॥

ఈ రెండు శ్లోకాలలో కూర్పులకు తోడు,కొన్ని ఆశువుగా చెప్పబడిన శ్లోకాలు కూడా వున్నాయి.

1. శ్రియమాత్మనం తనోత్వ తనుకోటివిలాసితనుః
సుతనుసమంచితం దధద్ధుర స్థలం అష్టమలైః ।
సతతవిభావితః పరమహర్షి మహర్షికులైః ।
ఫణిగిరి శేఖరః సుగుణ భూస్తవకోఽపి విభుః ॥

2. శ్రీమాన్ శేషగిరీంద్ర శేఖర మణిర్వందారు చూడామణిః
దుఃఖధ్వాంత నిరాసవాసర మణి స్త్రైలోక్య రక్షామణిః ।
శ్రీమత్రయ్యబలాశిరోమణి రురోవిన్యస్త కాంతామణిః
పాయాన్న స తు దేవకీజఠరజశ్శ్రీశోమరగ్రామణిః ॥

(తిరుమలై వేంకటేశ్వర జర్నల్, జనవరి 1933, మొదటిపేజీ)

**సంగీత విద్వాంసులు**

శ్రీవేంకటేశ్వరుని స్తుతిస్తూ సంకీర్తనలు చేసినవారిలో అగ్రగణ్యుడు తాళ్ళపాక అన్నమాచార్యుడు. 'అన్నమాచార్య చరితం' అనే ద్విపదకావ్యంలో అతని మనుమడు చిన్న తిరుమల అయ్యంగార్, తన తాత అన్నమాచార్యులు వేంకటేశ్వరునిపై 32,000 సంకీర్తనలు రచించిన విషయం ప్రస్తావించాడు. వేంకటేశ్వరుని గుడిలో యిరుప్రక్కల మూడు సంకీర్తనలు (ఒక్కొక్క ప్రక్క) చెక్కబడి, గుడిలోని వొక చిన్నగదిలో భద్రపరచ బడిన సుమారు 3,000 రాగి పలకలపైన అన్నమాచార్య, అతని కుమారుడు ఈ మొత్తం 18,000 సంకీర్తనలలో 10,000 అన్నమాచార్యవి; 5,000 పెద్దతిరుమలాచార్యవి, మిగిలిన 3,000 చిన్నతిరుమలాచార్యవి. మిగిలిన సంకీర్తనలేమయ్యాయో తెలియదు. కొన్ని సంవత్సరాల క్రిందట మద్రాస్ ఎపిగ్రాఫికల్ డిపార్ట్‌మెంట్ వారు అహోబలస్వామి గుడిలోను, శ్రీరంగంలోని శ్రీరంగనాథస్వామి మందిరంలో కొన్ని ఫలకాలున్నట్టు గుర్తించారు. అహోబిలంలో వున్న కొద్దిపాటి ఫలకాలు మాత్రం తిరుపతి దేవస్థానం వారు సంగ్రహించారు.

తాళ్లపాక అన్నమాచార్యులు తెలుగు నందవరీక బ్రాహ్మణుడు. కాని, వేంకటేశ్వరుని సేవకు తన జీవితాన్ని అంకితం చేయడం వల్ల వైష్ణవదీక్ష గ్రహించి, ఆళ్వారుల పాశురాలలో చెప్పబడిన వైష్ణవ సిద్ధాంతాలను ఆకళింపు చేసుకున్నాడు. వాని కనుగుణంగా అనేక సంకీర్తనలు చేశాడు. అతని మనుమడు చిన్నమయ్యంగార్ తెలుగులో ద్విపద ఛందస్సులో అన్నమయ్య **'రామాయణం'** రచించినట్లు, సంస్కృతంలో **వేంకటాద్రి మాహాత్మ్యం, శృంగారమంజరి** వ్రాసినట్లు, 12 శతకాలు, శృంగార సంకీర్తనలు, సంకీర్తన లక్షణం మొదలైనవి వ్రాసినట్లు తెలియజేశాడు. కాని, మీద చెప్పబడిన యీ గ్రంథాలేమీ లభ్యం కాలేదు.

అతడు క్రీ॥శ॥1408, మే 9 న జన్మించాడు. క్రీ॥శ॥1503, 23 వ తేదీ ఫిబ్రవరి వరకు అంటే 96 సంవత్సరాలు జీవించాడు. తన 16 వయేట తిరుమలలో తన నివాస స్థానం చేరుకున్న నాటినుండి 80 సంవత్సరాల పాటు అనునిత్యమూ ఆ సంకీర్తనలు రచిస్తూ వేంకటేశ్వరుని సన్నిధిలో తన సేవలంకితం చేస్తూ, గానం చేశాడు. తన జీవితపు చరమాంకంలో ఆఖరి దశలో, రోజుకొక్క సంకీర్తన యైనా రచించి స్వామి సన్నిధిలో గానం చేయవలసినదిగా స్వామివారి ఆజ్ఞ! అతని మనుమడు చిన్నన్న తన అన్నమాచార్య చరిత్రలో అన్నమయ్య మొదటి నుండి తన స్వగ్రామమైన తాళ్ళపాకలో స్థిర నివాసమేర్పరచుకున్నట్లు, ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా బ్రహ్మోత్సవంలో ఆజన్మాంతం విధిగా పాల్గొనటం ప్రస్తావించాడు. ఉత్సవం తరువాత అతడు తన గ్రామానికి తిరిగి వెళ్ళి సంకీర్తనలు వ్రాయడంలో నిమగ్నమయ్యేవాడు. బహుశా తన కుమారుడైన పెద్దతిరుమలాచార్య, గుడిలో సంకీర్తనాచార్యుడుగా బాధ్యతలు స్వీకరించిన నాడు తన స్వగ్రామానికి తిరిగి వెళ్ళి పోయి ఉంటాడు.

వేంకటేశ్వరునితో తనకు గల ప్రగాఢ విశ్వాసం కారణంగా వైష్ణవ మతం స్వీకరించి, ఆనందించి, కుటుంబబంధాలు, అందులోని కష్టసుఖాలు, వాటిని తప్పించుకోవటానికి వొకే వొక నిశ్చయమైన మార్గం స్వామి యందు అచంచల విశ్వాసమని, అతనిని సంపూర్ణంగా శరణుజొచ్చుటమే మార్గమని, అతనిని స్తుతించుటయే మార్గమని, ధృఢంగా నమ్మాడు. వీటికనుబంధంగా భుజాలపై శంఖచక్రముద్రలు వేసుకోవడం యెవరినైనా రక్షించగలదని నమ్మాడు. ఈ ముద్రల వలన, శరణాగతి వలన, భక్తి వలన, పాపాల నుండి, శోకం నుండి విముక్తుడనయ్యానని, జీవిత గమనంలో విజయం సాధించానని, వేంకటేశ్వరుడు తనను స్వర్గానికెత్తి, తనపై శాంతి, ఆనందం వర్షించాడని అతను బోధించాడు. తాను వ్రాసిన 'అన్నమాచార్య చరిత్ర' పీఠికలో అతని మనుమడు చినతిరువెంగళనాథుడు, అన్నమాచార్య "మననందరినీ అనేక పూర్వజన్మల దుష్కృతాల నుండి విముక్తుణ్ణి చేశాడని, స్వామిని అన్వేషించడానికి, అతని యెడల భక్తి ప్రపత్తులతో వుండటానికి, స్వామిని స్తుతించడానికి, యితరుల స్తుతించనంగీకరించ లేకపోవడానికి, స్వామిని మాత్రమే స్తుతిస్తూ గానం చేయడానికి ఉద్యుక్తులను చేశాడు" అని వ్రాశాడు. శ్రీరామానుజుల మతాన్ని బోధించాడు. నీ వొక్కడవే దైవమనీ, తానే అందరికన్నా మంచి గురువని బోధించాడు. అతడు చేసిన మేలుకు బదులుగా అతనిని కృతజ్ఞతతో స్మరించుకోవాలి. "స్వామీ! మేము చేసే కోట్ల కొలదీ అపరాధాలను లెక్కలోకి తీసుకోవద్దు. మమ్ములను వదలి వెళ్ళవద్దు. మమ్ములను క్షమించు. ఎల్లవేళలా కాపాడు. మా ఇంటి వేలుపువై వర్థిల్లు.

అన్నమాచార్యుల కొరకు, కుమారుడుగా నేను చేసే ప్రార్థనను దయామయుడైన తండ్రిగా మన్నించి మమ్ములను కాపాడు". అన్నమయ్యంగార్ 'శృంగారమంజరి' చివర ప్రత్యేకంగా చేర్చబడిన వొక పద్యంలో అదే విధమైన భావాలు ప్రకటించబడ్డాయి. "అన్నమయ్య వెంకటప్ప ఉదారమైన బహూకృతి. పురుషాకృతి దాల్చిన, చెట్టునుండి వ్రేలాడుతున్న వేంకటేశ్వరుని ఖడ్గం నందకమే అతనిగా జన్మించిందని ప్రతీతి. అతడు యెల్లప్పుడూ ధర్మబుద్ధి గలవాడు. తన మదిలో విశ్వజనకుడైన ఆదినారాయణుని నెలకొల్పుమన్నాడు. బ్రహ్మానందాన్ని ఆస్వాదిస్తూ సనక సనందనాది ఋషుల వలె అతడు గొప్పఋషి అయ్యాడు. వేంకటేశ్వరుని మహిమను తెలియజేసే అనేక సంకీర్తనలు వ్రాశాడు. వేదార్థము లాకళింపు జేసుకుని, వాటికి వ్యాఖ్యానం వ్రాశాడు. రామానుజ మతం స్వీకరించి దానికి తగినట్టు జీవితం గడిపాడు. వేడుకగా, విందులా మనకున్న అనేకమైన దేవతలలో వేంకటనాథుని ఆరాధించమన్నాడు. ఈ పద్యం చినతిరుమలాచార్య స్వయంగా మార్చాడేమో!*

తన భక్తి ప్రపత్తులతో వేంకటేశ్వరునికి కళ్యాణోత్సవం ప్రారంభించాడు. లక్ష్మీదేవిని అతని భార్యగా యెన్నుకోవడంతో పాత్ర వహించి వేంకటేశ్వరునికి మామగారయ్యాడు. అన్నమయ్యంగారి వంశీకులు యీనాటికీ స్వామి వివాహ వేడుకలలో యీ సంప్రదాయాన్ని కొనసాగిస్తున్నారు. ఏప్రిల్ 1949 లో తిరుపతి దేవస్థానం అధికారులు 'అన్నమాచార్య ఉత్సవం' మొదలు పెట్టారు. ఈ ఉత్సవం ప్రతి సంవత్సరం అతని జన్మదినం నుండి 3 రోజులపాటు గాయకుల సంకీర్తనలతో కొనసాగుతుంది.

శాసనాలలో పెద తిరుమలయ్య, తిరుమల అయ్యంగార్, తిరుమలయ్య, తిరుమలాచార్య, తిరుమలదేశికుడు అనే పేర్లతో పిలువబడే అన్నమాచార్య కుమారుడు పెద్ద తిరుమలాచార్య, తన తండ్రివలె గొప్ప విద్వాంసుడు, తత్త్వవేత్త, గాయకుడు కూడా. అతడు గుడిలో రెండవ సంకీర్తనాచార్యుడు. మరణశయ్య నుండి రోజుకొక్క సంకీర్తన అయినా రచించమని తన తండ్రి ఆదేశించిన మేరకతడు వేంకటేశ్వరు నుద్దేశించి **శృంగారసంకీర్తనలు, ఆధ్యాత్మిక సంకీర్తనలు, హరివంశ కావ్యం** కూడా రచించాడు. **చక్రవాళ మంజరి, వైరాగ్య వచన మాలికాగీతాలు, శృంగారదండకం, శృంగారవృత్త పద్యాల శతకం, ఉదాహరణలు నీతి సీస శతకం, సుదర్శనరగడ, గద్యంలో భగవద్గీత** మొదలైన గ్రంథాలు రచించాడు. అతని మేనల్లుడు రేవణూరి వేంకటకవి తన శకుంతలా పరిణయంలో పెద్ద తిరుమలాచార్యుల విశేష భక్తి, సంకీర్తన సేవలకు మెచ్చి వేంకటేశ్వరుడు వరమిచ్చినట్లు, దానివలన అతని కుటుంబంలో మూడు తరాల వారికి (తిరుమలయ్యతో మొదలిడి) దర్శనమిస్తానని, యేడు తరాల వారికి మోక్షం ప్రసాదిస్తానని వరమిచ్చినట్లు పేర్కొన్నాడు.

పెద్దతిరుమలాచార్య జ్యేష్ఠపుత్రుడు చిన్నతిరుమలాచార్య తన తాత, తండ్రుల అడుగుజాడలో నడుస్తూ గుడిలో సంకీర్తనాచార్యుని పదవి స్వీకరించాడు. వేంకటేశ్వరుని యెడల భక్తిప్రపత్తులతో **శృంగార సంకీర్తనలు, ఆధ్యాత్మిక సంకీర్తనలు** రచించాడు. **అష్టభాషా దండకం** రచించాడు. తన తాత అన్నమాచార్య రచించిన

* ఇక్కడ అన్నమయ్య పాట 'వాడల వాడల...' అనే దానికి సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి గారి వివరణ తొలగించబడింది.

సంకీర్తన లక్షణం తెలుగులోనికనువదించాడు. అతని అష్టభాషా ప్రావీణ్యానికి (సంస్కృత, శౌరసేన, మాగధి మొదలైన భాషలు) గుర్తుగా అతనికి **'చారుతర అష్టభాషాచక్రవర్తి'** అనే బిరుదు ప్రదానం చేశారు. అతని మూడవ తమ్ముడు చిన్నతిరువేంగళనాథుడు (చిన్నన్న అనే పేరుతో ప్రసిద్ధుడు) రచించిన **'అష్టమహిషీ కళ్యాణం'** అనే గ్రంథంలో యీ విషయం ప్రస్తావించబడింది. ఈ గ్రంథం యితర గ్రంథాలతో బాటు తామ్ర ఫలకాలపై లిఖించబడింది **(బుధవారం, నవంబరు 7, క్రీ॥శ॥1537). (ఇంకా వివరాలు కావలసిన వారు టి.టి.డి. ఎపిగ్రాఫికల్ రిపోర్ట్ 279 - 302 పుటలు చూడవచ్చు).**

కన్నడ వాగ్గేయకారులు, కవులలో పండరిపురానికి చెందిన పాండురంగ విఠలస్వామిని గాఢభక్తితో కీర్తించిన పురందరదాసులు సుప్రసిద్ధులు. ఇతడు 15 వ శతాబ్దపు ఉత్తరార్థంలో, 16 వ శతాబ్దపు పూర్వార్థంలో ఉండేవాడు. ఈ గాయకులను కన్నడిగులు దాసరులని పిలుస్తారు. వారు విఠలదేవుని కీర్తిస్తారు. అన్నమాచార్యుల కీర్తిప్రతిష్ఠలు విని పురందరదాసు వారి దర్శనానికై స్వయంగా తిరుమలకు విచ్చేశాడు. అతనిని **పుంభావ వేంకటేశ్వరునిగా** కీర్తించాడు. వారిరువురు వారి కలయికకు గుర్తుగా వొక పాట వ్రాశారు. పాట చివరలో వారి వారి యిష్టదేవతల నుద్దేశించారు.

పల్లవి : నారాయణ తే నమో నమో

1 వ చరణం : భవనారద సన్నుత నమో నమో
మురహర నగధర ముకుంద మాధవ
గరుడ గమన పంకజ నాభ
పరమపురుష భవభంజన తే నమో (కేశవ)
నరమృగ శరీర నమో నమో

2 వ చరణం : జలధి శయన రవిచంద్ర విలోచన
జలరుహ భవనుత చరణ యుగా
బలిబంధన గోవర్ధన వల్లభ
నలినోదర తే నమో నమో

3 వ చరణం : ఆదిదేవ సకలాగమ పూజిత
యాదవకుల మోహన రూపా

**1. వేదోద్ధర తిరువేంకట నాయక**
**నాద ప్రియ తే నమో నమో!! అన్నమయ్య ముద్ర**

**2. వేదోద్ధారక వేంకట నాయక**
**పురందర విఠలా నమో నమో!! పురందరదాసుల ముద్ర**

ఇక్కడ అన్నమాచార్యులు తిరువేంకటనాయకుని యిష్టదైవంగా ప్రస్తావించాడు. పురందరదాసు తన యిష్టదైవమైన పుండరీక విఠలుని స్మరించాడు. తన పేరును యిష్టదేవత పేరుకు ముందు జోడించాడు.

ఆలయ దర్శనమప్పుడు అతడు కొన్ని పాటలు గానం చేసినట్టున్నది. అందులో వేంకటేశ్వరుని రూపరేఖా విలాసాదులు, ఆభరణాలు వర్ణిస్తూ, స్వామిని స్తుతించాడు. తాను రచించిన వొక కృతిలో **"కండే కండే స్వామియ బేడి కొండే"**[1] ("నేను స్వామిని దర్శించాను. వేడుకొన్నాను") అని వ్రాశాడు. "కోటి సూర్యప్రభాభాసమానుడు, కిరీటధారి, విస్మయాన్నిగూర్చే మందస్మిత వదనుడు, లలాట తిలకధారి, అసమానమైన శంఖ, చక్ర, గదాదులు తన చతుర్భుజాల యందు, పాదాల యందు ధరించిన వాడు, సమయానికి మొక్కులు తీర్చని వారి వద్ద వడ్డీ వసూలు చేసేవాడు, ఉప్పుతో కూడిన ఆహారం స్వీకరించే వాడు, తీర్థం అమ్ముకునే వాడు (సేరుకి 20 పైసల చొప్పున). శేషతల్పగతులు, జగత్పితయైన వేంకటరమణుని పాదాలు దర్శించాను. వక్షస్థలంపై నివాసమున్న శ్రీదేవి (లక్ష్మి) ని, రమణీయమైన కౌస్తుభాన్ని దర్శించాను. అంతేకాదు, గరుడ, కిన్నెర, గంధర్వులను దర్శించాను. భక్తులకు వరమిచ్చే వరదహస్తం కనుగొన్నాను. శేషాచల నివాసి, వరములిచ్చే స్వామి, సాగర శయనుడైన స్వామిని దర్శించాను. ఈ కృతి ముఖారి రాగంలో, మధ్య తాళంలో వున్నది. ఇది **"కండే కండే స్వామియ బేడికొండే, కండే తిరుపతి వేంకటేశనా..."**[2] అనే పదాలతో ఆరంభమౌతుంది. కాఫీ రాగం ఆదితాళంలో **"ధనియ నోడిదేనో వేంకట రమణ ధనియ నోడిదే శిఖామణి తిరుమలనా"**[3] అనే మరొక పాటలో తాను సిరిగల దేవుడు వేంకటాచలపతి, తిరుమలకు మకుటాయమానము, పాదములకు గజ్జెలు గలవాడు, పీతాంబరధారి, పట్టబంధం – అనగా నడుముకు బంధంగలవాడు, మెరిసే పాగడా ధరించేవాడు, వ్రేలాడే బంగరు సిరులు గలవాడు, కౌస్తుభం, వైజయంతి, భుజకీర్తులు ధరించేవాడు, లలాటంపై చక్కని తిలకం ధరించేవాడు, శంఖ చక్రధారి, ముంజేతికి చిన్న కంకణం ధరించేవాడు, శంఖ నినాదం చేసేవాడు, "ఇదే భూలోక వైకుంఠ మన్నట్లు తన హస్తంతో సూచించేవాడు, వడ్డికాసులవాడు, కస్తురి చందన లేపితగాత్రుడు, ఇటునటు తిరిగే వేటగాడు, సృష్టి కారకుడూ అయిన స్వామిని దర్శించినట్లు మరల మరల చెపుతాడు.

నవరోజురాగం ఆదితాళంలో కూర్చబడిన మూడవ పాటలో అతడు వేంకట రమణుని యీ విధంగా సంబోధిస్తాడు, **"నంబిదే నిన్న పాదవా, వేంకటరమణా, నంబిదే నిన్నపాదవా" "నంబిదే నిన్న పాదాంబుజ యుగళ..., చండాగి సలహో మందర ధరణే"** ("నీ పాదాబ్జాలు నమ్ముకున్నాను. మందరగిరి యెత్తినవాడా! నన్ను సరియైన మార్గంలో నడిపించు"). అతడు అనేక కృతులు గానం చేశాడు. సావేరి రాగంలో పాడిన వొక పాటలో, వేంకటరమణుని వొక భక్తుని యింటికి వెళ్ళమని అర్థిస్తాడు. **"బారయ్యా వేంకటరమణా, భకుతరమనెగె".** అతని దశావతారాలలో (ఆదికచ్ఛప, మెదడి (ఆది) సూకర, సదయ – నరసింహ

1,2,3. పురందరదాసుల వారి ఈ మూడు కీర్తనలు, అన్నమయ్య రాసిన పొడగంటిమయ్యా; కంటి శుక్రవారము; వంటి కీర్తనలలోని భావాలతో సంవదిస్తున్నాయి.

మొదలైనవి – బుద్ధుడు, కల్కి అవతారాల వరకు) పిలుస్తాడు. అతని యింటికి వెళ్ళమని ప్రార్థిస్తాడు. బిలహరి రాగం, ఆదితాళంలో రచింపబడిన మరొక కృతిలో వేంకటేశుని మరల సంబోధిస్తూ దశావతారునిగా వర్ణిస్తూ, తమ లోపాలను చక్కదిద్దుమని, తప్పులను మన్నించమని వేడుకుంటాడు. వీటికి తోడు వొక జోలపాటకూడా పాడతాడు. అదే విధంగా విజయనగర సార్వభౌముడైన కృష్ణదేవరాయల వద్ద గొప్ప ప్రశంసలు పొందిన పురందరదాసు గురువైన వ్యాసరాయలు (వ్యాసతీర్థులు), వేంకటేశ్వరుని పై తోడిరాగం, రూపక తాళంలో వొక కృతి గానం చేసాడు, **"నిన్ననోడి ధన్యనాదేనొ, శ్రీ శ్రీనివాస"** – అంటూ

తక్కిన కన్నడదాసులు కూడా వేంకటేశ్వరునిపై పాటలు పాడారు. **"శ్రీవేంకటేశ పాలిశో, నిన్న శ్రీపాద సేవార్థనదిశో**(నాదనామక్రియారాగం– **"గురు గోపాలవిట్టల"** ప్రతీకగా చెప్పబడిన); **"దూషణక భూషణ, యదుభూషణ, శేషగిరివాస శ్రీ నరవేంకటేశ** (కాంభోజి, రంగవహలప్రతీక); **వేంకటేశ, భవసంకటపతి పరిసో, నిన్నవరమెనిసో"** (కాంభోజిశ్రీపతి, విట్ఠల ప్రతీక).

వేంకటేశుని బేహారివలె, లుబ్ధునిగా (లోభిశెట్టివలె) అభివర్ణించే నొక పాటవున్నది. రచయిత పేరు ప్రస్తావించబడలేదు.

పల్లవి : బందేవయ్యా గోవిందసెట్టి

అనుపల్లవి : హరివాసతీర్థ ప్రసాద వుండేన నాగె.

చరణం :

1. అప్పవు అతిరస, తుప్పవు బిసి – హాలు
   ఒప్పువహవాలక్కి, సుంటిమెరుసు, అపురూపవాడె,
   ఖజ్జాయగలా – నెల్ల, చప్పన్నదేశక్కె, మారువసెట్టి
2. వడడ మడికెటండ, ఇదిదునామవమాడి, కోడువేను
   కాసిగెనొవ్వందను, వొడల తంబిమెక్క, అన్నవ మారిసి,
   వెదెవెయగలి సువ, కదులోభిసెట్టి
3. శేషగిరియల్లి యాసవాగిహ–సెట్టి, దేశదేశక్కె
   హెసరాద–సెట్టి, కాసుకాసుగె బడ్డి, కానిపి–కొండ
   ఆదికేశవనారాయణ తిమ్మసెట్టి.

తరువాత వేంకటేశునిపై గానం చేసిన గాయక త్రయం–18–19 శతాబ్దులకు చెందిన ముత్తుస్వామి దీక్షితుడు, శ్యామశాస్త్రి, వారిలో త్యాగరాజు సుప్రసిద్ధుడు. తంజావూరు జిల్లాలోని తిరువారూరులో క్రీ॥శ॥1759 లో త్యాగరాజు జన్మించాడు. ఇతడు కాకర్ల రామబ్రహ్మం, కాంతమ్మ (లేక సీతాదేవి) ల కుమారుడు. ఏ భూస్వామి వద్ద పనికొప్పుకోకుండా స్వతంత్ర్యంగా 88 సంవత్సరాలు జీవించాడు.

క్రీ॥శ॥6-1-1847 లో సన్యాసిగా జీవితం చాలించాడు. అతడు శ్రీరామునికి గొప్ప భక్తుడు. వాల్మీకి రామాయణంలోని 24,000 శ్లోకాలకు 24,000 కీర్తనలు రచించాడట. కాని, తెలుగులోకి వచ్చినవి వొక వెయ్యి మాత్రమే. అనేక యితర దేవతల దర్శనార్థం వెళ్లినప్పుడు వారిపైన కూడా గేయరచన గావించాడు. ఒకసారి వేంకటేశ్వరుని దర్శించిన సమయంలో అతనిపై రెండు కీర్తనలు పాడాడు. తన 'ఘనరాగపంచకం' లో వొక కీర్తనలో (**'సాధించెనే, ఓమనసా'** అనే కీర్తనలో, ఆరభిరాగంలో) స్వామి పేరు ప్రస్తావించాడు.

తాను దర్శనానికి వెళ్ళిన సమయంలో బహుశా అపరాహ్ణమవటం వల్ల నేమో మధ్యమావతిరాగం, ఆదితాళంలో వొక కృతి ఆలపించాడు.

పల్లవి :

1. ఎక్కువ నీవని దిక్కులు బొగడగ అక్కర గొని మది
   సొక్కికనుగొన, నిక్కము నీవగ్రక్కున బ్రోవ
   తళుక్కని మెరిసె చక్కదనము గల;

2. ఏ నోము ఫలమో నీ నామామృత పాకము కనువొపారము
   దొరకెను, శ్రీనాయక! పరమానంద! నీ సరికానను,
   శోభాయమాన - అంఘ్రులుగల;

3. యోగిహృదయ, నీవేగతియను జనభాగధేయ!
   భోగీశ శయన! భాగవతప్రియ!
   త్యాగరాజు నుత! నాగాచలముపై బాగా నెలకొన్న.

("వేంకటేశా! దివ్యరూపం దాల్చిన నిన్నర్చించడానికి సహస్రనయనాలు కావలె. అన్ని దిక్కులు నీ వొక్కడవే పరబ్రహ్మమని ప్రస్తుతిస్తున్నాయి; నిన్ను దర్శించాలనే ప్రగాఢ వాంఛగల మాకు నీవు మెరుపువలె ప్రత్యక్షమౌతావు. ఏదో పూర్వజన్మ సుకృతం వల్ల, నిన్ను చేరే సోపానంగా నీ పవిత్ర నామామృతం కొద్దిగా సేవించగలిగాను. పవిత్ర చరణాలు గల నీకు సరిసాటి వారెవ్వరినీ చూడము; నీవు యోగిహృదయ నివాసివి. నిన్ను విశ్వసించిన ఆశ్రితులకు నీవే అదృష్టప్రదాతవు. పన్నగరాజైన ఆదిశేషుని తల్పంపై విశ్రమించే నీవు భక్తమందారుడవు. త్యాగరాజు నుతుడవు. శేషాచలంపై వసించే పవిత్ర మూర్తివి).

గౌళపంతురాగం, ఆదితాళంలో వున్న మరొక కీర్తనలో, తన మనసున మెదిలే మాత్సర్యం దూరం చేయమని తిరుపతి వేంకటరమణుని ప్రార్థిస్తాడు. ఆ మాత్సర్యం అతణ్ణి ధర్మం నుండి, అర్థం నుండి, మోక్షం నుండి దూరం చేస్తోంది.

పల్లవి : తెర తీయగ రాదా నాలోని, తిరుపతి
వేంకటరమణ మదమత్సర మను;

అనుపల్లవి : పరమ పురుష! ధర్మార్థ మోక్షముల
పారదోలు చున్నది నాలోని;

చరణం(1): మత్స్యము ఆకలిగొని గాలముచే
మగ్నమైన రీతి నున్నది, అచ్చమైన
దీప సన్నిధిని మరగునపడి చెరచినట్లున్నది;

(2): ఇర వొందగ భుజియించు సమయమున
ఈగ దగులు రీతి నున్నది. హరి ధ్యానము సేయువేళ

(3): వాగుర–యని తెలియక మృగగణములు
వచ్చి తగులు రీతి నున్నది – వేగమెనీ – మతము న
నుసరించి త్యాగరాజ – నుత, మదమత్సరమను

(ఓ తిరుపతి వేంకటరమణా! – దయతో నాలోని అసూయ అనే తెరను తొలగించు. ఓ పరమ పురుషా, ఆ తెర నేను ధర్మార్థ మోక్షములు సాధించకుండా అడ్డు పడుతున్నది. అది చేపలు పట్టే గాలపు ఎరను కరిచి పట్టి దానికి చిక్కుకునే చేప వంటిది. చక్కని వెలుగును అవరోధించే పురుగు లాంటిది. తింటున్న ఆహారంలో ఈగ పడినట్లున్నది. హరిస్మరణలో ఉన్న మనస్సు తుచ్ఛస్థలాలకు మరలినట్లున్నది, వల అని గుర్తెరుగక క్రూరజంతువు లందులో పడి బంధింపబడినట్లు వుంది. కాబట్టి, నీ ఆశ్రితులను రక్షించే క్రమంలో నా మదమాత్సర్యాల తెర తొలగించు).

త్యాగరాజు స్నేహితుడు **ముత్తుస్వామి దీక్షితులు** క్రీ॥శ॥1775 లో జన్మించాడు. అతని తండ్రి రామస్వామి దీక్షితుడు. తల్లి సుబ్బమ్మ. తన పదహారవ యేటనే వేదాధ్యయనం, సంస్కృత సాహిత్యాధ్యయనం, ఆయుర్వేద విజ్ఞానం, జ్యోతిషం యివన్నీ నేర్చుకోవటం పూర్తిగావించారు. ఆస్థాన విద్వాంసుడైన తన తండ్రి వద్ద (మనాలీలో వున్న) వుండగా, చిదంబరానందయోగి అనే వొక ముని ఆతనిని కాశీకి తీసుకొనిపోయి, 5 సంవత్సరాలు తన వద్దనుంచుకొని మనాలీకి తిరిగి పంపించాడు. కొంత కాలం పిమ్మట ముత్తుస్వామి దీక్షితులు తిరుత్తణికి పోయి, శ్రీ సుబ్రహ్మణ్యస్వామిని పంచదశాక్షరి మంత్రంతో ధ్యానం చేశాడు. ఒకరాత్రి దైవం వొక వృద్ధయోగి రూపంలో అతనికి దర్శనమిచ్చి, అతని నోట కలకండ ముక్కలుంచాడు. ఆ క్షణమే అతనికి కవిత్వ, సంగీతాలలో పటుత్వం సిద్ధించింది. అతడు సుబ్రహ్మణ్యస్వామిని **'గురుగుహ'** అనే నామంతో సంబోధించి వొక గానం చేశాడు. **'గురుగుహ'** అనే పదాన్ని తన పాటలన్నిటికీ మకుటంగా వాడుకున్నాడు. గీర్వాణ విద్వాంసుడైన అతను సంస్కృతంలో తన కృతులు రచించాడు. అనేక దేవతలను 300 కృతులలో స్తుతించాడు. తక్కిన భాషలు తెలిసినా, సంస్కృతంలోనే కృతులు రచించాడు. అతను 60 సంవత్సరాలు మాత్రమే జీవించాడు. 1835 లో ఎట్టియాపురంలో కాలం చేశాడు.

అతడు వేంకటేశ్వరునిపై 5 పాటలు వ్రాశాడు. అందులో వొకటి వాటి వసంత భైరవ రాగం (వకుళాభరణం) త్రిపుట తాళంలో వున్నది.

(శుభకరుడైన వేంకటేశ్వరుని పొగడవలె అతడు నాటి వసంత భైరవ (రాగం) లో కీర్తింపబడిన వాడు, తంజనగర నివాస (తంజావూరు, తాంజోర్), గురుగుహునికి బాగుగా పరిచితులు, ఆద్యుడు (పరబ్రహ్మ), వశిష్ఠ వామదేవులచే నుతింపబడినవాడు, అలమేలుమంగ స్వాధీనపతికగా గలవాడు, సంగీత తత్త్వజ్ఞులకు శిరోమణి, కరుణానిధి, భక్తులకు ఆనంద ప్రదాత.

పల్లవి : ప్రసన్న వేంకటేశ్వరమ్ భజరే
నాటీ వసంత భైరవనుతమ్,

అనుపల్లవి : ప్రసిద్ధ తంజనగర స్థితమ్ ప్రబల
గురుగుహవేద్యమ్ ఆద్యమ్ – వసిష్ఠ
వామదేవ – విదితం – వరాలమేలుమంగాశ్రితమ్
రసిక శేఖరమ్ కృపాకరమ్, రక్షిత భక్తానందకరమ్

– సురటి రాగం, ఆదితాళంలో వున్న మరొక కృతి వేంకటేశుని "వినాయక తురగా రూఢం" (వినాయకునధిరోహించేవాడు) గా అభివర్ణిస్తుంది. వినాయకుణ్ణి అతని అశ్వంగా, మూషిక వాహనం గుర్రంగా గల వినాయకుడు వాహనంగా గలవాడు, గోకర్ణ క్షేత్రంలో పాపవిదూరుడుగా, అలమేలుమంగా సమేతుడుగా అభివర్ణిస్తాడు.

పల్లవి : శ్రీ వేంకట గిరీశమ్ – ఆ లోకమే – వినాయక తురగారూఢం,

అనుపల్లవి : దేవేశ పూజిత భగవంతం, దినకర కోటి
ప్రకాశవంతమ్, గోవిందమ్, నటభూసుర
బృందం, గురుగుహానందం, ముకుందం;

చరణం : అలమేలుమంగా సమేతం, అనంతపద్మనాభం, అతీతం
కలియుగ ప్రత్యక్ష విభాతమ్,
కంజజాది దేవోపేతమ్, జలధరసన్నిభ
సుందరగాత్రం, జలరుభమిత్రాబ్జశత్రు
నేత్రమ్, కలుషాపహ – గోకర్ణ – క్షేత్రమ్.
కరుణారసపాత్రమ్ చిన్మాత్రమ్,

పూర్ణచంద్రికా రాగం, రూపక తాళంలో వున్న మూడవకృతిలో వేంకటేశ్వర స్వామిని యీ విధంగా స్తుతిస్తాడు.

పల్లవి : శంఖ-చక్ర-గదాపాణిం-అహం
వందే శ్రీ శార్ఙ్గ-నందక-కౌస్తుభ
ధరమ్ వందే;

అనుపల్లవి : పంకేరుహ - చరణమ్ పద్మావతీ రమణమ్
సంకటాపహరణమ్ - సదా - భోక్త్రాభరణమ్
కుంకుమ - పంకిల - గాత్రమ్ పంకజ - విశాల
నేత్రమ్ - శంకర - సన్నుతి - పాత్రమ్ వేంకట
వరద - క్షేత్రమ్;

చరణం : గజేంద్ర - సంరక్షణమ్
గరుడవాహ - విచక్షణమ్
అజేంద్రాది - విలక్షణమ్
అమృతసార - భక్షణమ్
అజామిళాది ప్రభృత్యనేక దాసాది
సంతరణం భజే పూర్ణచంద్రి
కాంగ - గురుగుహాంత కారణం
కుజాదిగ్రహ విహితం
విరాజనాది తతస్థితం
సజాతీయాది రహితం
నిజానంద బోధ హితం.

మరొక నాలుగవ పాటలో వరాళి రాగం, రూపక తాళంలో వేంకటేశ్వరుని ఆరాధించాడు.

పల్లవి : శేషాచల నాయకం భజామి
విశేషఫలదాయకం

అనుపల్లవి : భాషారమణ ప్రభృత్య శేషమరనుత
కౌస్తుభ భూషాలంకృత బహు తర
వేషాత్మక విగ్రహం

చరణం : మందహాస వదనం
స్వచ్ఛంద హృదయ సదనం
సుందర జితమదనం
ముకుందం మధుసూదనం

అరవింద పాత్ర నయనం
గోవిందం – ఉరగ శయనం
సురబృంద సత్కృతాధ్యాయనం
నంద నారాయణం
పురందరాది దిక్పాల
సనందనాది మునివరాళి
వందితం అభినవగురుగుహ
నందిత మనంతకీర్తిమ్.

5 వ కృతి కాపీరాగం, ఆదితాళంలో మూడు భాషల పదాలు – తెలుగు, కొంత తమిళం, కొంత సంస్కృతంలోను – కూర్చబడింది. అందుకే దాన్ని మణిప్రవాళ కీర్తన (రత్నాలు, పగడాలు కలిసిన దండ) అని అంటారు.

ఈ కృతిలో బ్రహ్మాది దేవతల స్తుతిపాత్రుడు, ఆశ్రిత రక్షకుడు, వరదుడు, శేషాచలం నుండి పయనమై భక్తులను రక్షించేవాడు, గుడ్డివారిని బ్రోచిన వాడు, గోకర్ణక్షేత్ర నివాసియై, మృకండాది మునులకు వరాలిచ్చినవాడు, అయిన వేంకటేశ్వరుని ప్రార్థిస్తాడు. రమాపతే (లక్ష్మీనాథుడు), దయానిధే (కరుణాసముద్రుడు), వానరులచే మొక్కులందిన వాసుదేవుడు; కోరిక లీడేర్చేవాడు, దీనరక్షకుడు (ఆర్తులను ఆదుకునేవాడు), పీతాంబరధారి (పచ్చని పట్టు ధోవతిని ధరించేవాడు), దేవదేవా (దేవతలకు ప్రభువు), వేంకటాచలపతే, గురుగుహుని (సుబ్రహ్మణ్యస్వామి, కుమార స్వామి, షణ్ముఖుడు) వివిధ రీతులుగా సంబోధిస్తాడు.

పల్లవి : వేంకటాచలపతే, నిన్ను నమ్మితి

అనుపల్లవి : పంకజాక్ష ప్రముఖాది వినుత
పాదము నాశ్రయించిన వారికెల్ల
సంకటములు దీర్చి, సంపదలిచ్చి
మంగలం పొరుందియ, పురివరతా
విలంగమ్, వేంకటాచలపతే;

చరణం : శ్రీనివాస శేషాచలము నుంచి
శీఘ్రుంవందు, అంధుని కభీష్ట
దానమొసగి, గోకర్ణ క్షేత్రములో
నెలకొని మృకండు ముదలాన భక్తానామ్
అభయ వరప్రదాన చతురతర రమాపతే

దయానిధే, ప్రత్యక్షముగా నిందమా
నిలత్తిల్ నిన్ - మహిమైయనేకం వానర్
వణంగుం వాసుదేవనే వాంఛితార్థ
ఫలమిచ్చివదానే, దీన రక్షా
పీతాంబరధర, దేవదేవ, గురుగుహన్ మామనాన.

వాగ్గేయకారత్రయంలో మూడవ వాడైన శ్యామశాస్త్రి క్రీ।।శ।। 1763 లో త్యాగరాజు కంటే నాలుగు సంవత్సరాల ముందు తిరువారూరులో జన్మించాడు. ఆయన తల్లిదండ్రులకు చాలాకాలం వరకు సంతతి కలుగలేదు. స్థలదేవతయైన కామాక్షీదేవి నారాధించాడు. ప్రతి మాసంలో ఆఖరి శనివారం రోజున వేంకటేశ్వర ప్రీతిగా కొందరు బ్రాహ్మణులకు భోజనం పెట్టేవారు. ఒక రోజున వొక వృద్ధ బ్రాహ్మణుడు, దైవప్రేరితుడై వారికి వొక సంవత్సరంలో కుమారుడుదయిస్తాడని వక్కాణిస్తాడు. అలాగే వొక వత్సరం దాటకుండా వారికి శ్యామశాస్త్రి జన్మించాడు. అతనికి వేంకటసుబ్రహ్మణ్యం అని నామకరణం చేశారు. కాని, అతని తల్లిదండ్రులు శ్యామకృష్ణ అనే ముద్దు పేరుతో పిలిచేవారు. క్రీ।।శ।। 1827 లో తన 64 వ యేట మరణించాడు. విభిన్నమైన రాగాలలో 300 కృతులు రచించాడు. వేంకటేశ్వరుని మీద కూడా వొక కృతి రచించాడని ప్రతీతి.

శ్యామశాస్త్రి రెండవ కుమారుడైన సుబ్బరాయశాస్త్రి (1803–1863) వేంకటేశ్వరునిపై యీ పాట వ్రాసాడు.

**హమీరు కళ్యాణి రాగం, ఆదితాళం**

పల్లవి : వేంకటశైల విహారా నీవే గతి బ్రోవరాదా శ్రీ...

అనుపల్లవి : పంకజ భవ సురపతి నుతచరణ
కింకర సంకుల సంకట హరణ శ్రీ...

చరణం : వింటిని నీ వరగుణ కథలను
వీనుల కెంతో ఆనందముగ
కంటిని గిరిని గోపురముల మణిమయ
మంటపములను నీ బంటుడనైతి శ్రీ...

(వేంకటాచలంపై విహరించేవాడా! నీవే నాకు దిక్కు. నన్నెందుకు రక్షించవు? బ్రహ్మేంద్రాది దేవతలు యెవరి పాదాలకు మ్రొక్కెదరో, తన భృత్యుల సంకటాల ఎవరు హరిస్తాడో వాడే నాకు దిక్కు. చెవులకింపైన నీ లీలలు నన్నానందింపజేశాయి. నీ కొండ, నీ గోపురాలు, నీ మంటపాలు దర్శించాను. నీ భృత్యుడనయ్యాను).

తరువాత వచ్చిన కొందరు వాగ్గేయకారులు (పైన చెప్పిన గాయక త్రయానికి వీరిలో కొందరు శిష్యులు). వేంకటేశ్వరుని స్తుతిస్తూ గానం చేశారు.

**వీణకుప్పయ్యర్** త్యాగరాజుకి ప్రత్యక్ష శిష్యులు. తరువాత కాలంలో మద్రాస్‌లో స్థిరపడ్డారు. వేంకటేశ్వరునిపై పంచరత్నాలు రచించాడు. అవి (ఆచార్య పి.సాంబమూర్తి) గారు ఆదివారం 28-12-1969, హిందూ పత్రికలో వ్రాసినట్లు);

1. "మమ్ము బ్రోచు..." - సింహేంద్ర మధ్యమ రాగం, ఆదితాళం.
2. "నన్ను బ్రోవనిక..." - ముఖారి రాగం, ఆదితాళం.
3. "సరోజాక్షుని..." - సావేరి రాగం, ఆదితాళం.
4. "నీవే దిక్కని..." - దర్బారు రాగం, ఆదితాళం.
5. "బాగు మీరగను నాతో పలుకగ..." - శంకరాభరణ రాగం, రూపక తాళం.

**పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్**(1845-1902) కూడా వేంకటేశ్వరునిపై కొన్ని పాటలు వ్రాశాడు. తాను రచించిన వొక కృతిలో తన పాపాలకు నిష్కృతి ప్రసాదించమని, సరియైన సమయంలో తనను రక్షించమని, గజరాజును రక్షించినట్టే తనను సేవించమని వేడుకుంటాడు. కోట్లాది భక్తుల ప్రార్థన మన్నించి వారి కోరికలు తీర్చాడు.

**కేదారరాగం, రూపకతాళంలో**

పల్లవి : సమయమిదెనను బ్రోవ జాలమేల తాళజాల;

అనుపల్లవి: కమలనాభ శ్రీరమణ కమలాసననుత చరిత్ర

చరణం : కరుణతోను గజరాజును గాంచి
రక్షించినది గాన
వర పార్థసారథి యనుచు,
వసుధలో బిరుదాంకితుడై
పరమభక్త కోట్లకెల్ల వరము లిచ్చి
బ్రోచిన శ్రీ వరద వేంకటేశ నాదు దురితమెల్ల
దీర్పవయ్య :

అతని మరొక కృతి : కదన కుతూహల రాగం, ఆదితాళంలో

"రఘువంశసుధాంబుధి చంద్ర...

మూడవది బృందావన సారంగరాగం, ఆదితాళంలో, "సరసీరుహానన శ్రీరామ..." అతని నాలుగవ కృతి బిలహరి రాగం - మిశ్రజతి, జంపెతాళంలో

పల్లవి : పరిదానమిచ్చితే పాలింతువేమొ.

అనుపల్లవి : పరమపురుష! శ్రీపతి నాపై నీకు,
కరుణగలుగకయున్న కారణ మేమయ్యా!;

చరణం : రొక్కమిచ్చుటకు నే ముక్కంటి
చెలిగాను, చక్కని చెలిని యొసగ
జనకరాజునుగాను, మిక్కిలి సైన్యమివ్వ
మర్కటేంద్రుడగాను, అక్కటికము
ఎటుగల్గు, ఆదివేంకటేశ నీకు.

(నేనేమైనా పరిహారంగా సమర్పిస్తే బహుశా నువ్వు నన్ను రక్షిస్తావు కాబోలు! ఓ పరమ పురుషా!, లక్ష్మీనాథా!, నీవు నాపై దయ చూపకుండుటకు హేతువేమి? నీకు డబ్బివ్వడానికి నేను ముక్కంటి (త్రినేత్రుడైన శివుడు) స్నేహితుడగు (ధనపతి – కుబేరుడను) గాను, అందమైన భార్యనొసగుటకు నేను జనకమహారాజుగాను, పెద్దచమూసమూహమివ్వడానికి నేను వానరరాజు (సుగ్రీవుడు) ను గాను, అటువంటప్పుడు నీ హృదయంలో నాపై కాఠిన్య మెందులకు?

పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్ శిష్యుడు శ్రీరామనాథపురం శ్రీనివాస అయ్యంగార్ కూడా వేంకటేశ్వరునిపై 'శ్రీనివాసా' అని సంబోధిస్తూ కొన్ని పాటలు వ్రాశాడు. అతని పాటలు వొకటి కేదారగౌళ రాగం, ఆది తాళంలో వుంది.

పల్లవి : సరగున పాలింప సమయమురా
నీకు సరియెవ్వరున్నారురా సరసిజనేత్ర!

అనుపల్లవి : వరగుణ శేషాద్రి వరద
వేంకటేశ్వర, వనజ సంభవనుత
వరము లొసగినను,

చరణం : శరధృతి పూపజిత గజరాజు
మొరలిడగ అనుగ్రహించలేదా, అటమట
జెందిన పరమభక్తుడగు ప్రహ్లాదుని
మునుపే బ్రోవలేదా, మన్మథజనక
మహార్షమునకు నికేతన మహనీయ
శ్రీనివాస నీదు, సత్కథలను విని నిను
వేడితిని, మనసు కరిగి నీవు నాదు
సంకటముల దార్చి.

ఈ కృతిలో బ్రహ్మచే మన్ననలందు కొన్న ప్రసిద్ధిగాంచిన శేషాద్రి వాసుడైన వరద వేంకటేశ్వరుని (కోరికలు తీర్చేవాడిని) తనకు వరములిమ్మని, సరియైన సమయంలో రక్షించమని ప్రార్థిస్తాడు. "ఎందుకంటే రక్షించడంలో నీకు సాటి యెవరూ లేరు. శరము ధరించినవాడుగా నుతింపబడిన నీవు గజరాజు (గజేంద్రుడు) సహాయానికై మొరలిడితే రక్షించలేదా? నీవు నిస్సహాయస్థితిలో నున్న నీ పరమభక్తుడు ప్రహ్లాదుని రక్షింపలేదా? ఓ మన్మథుని తండ్రీ! బ్రహ్మానందఖనీ! ఓ సర్వశక్తి సమన్వితుడవైన శ్రీనివాస ప్రభూ! ఉదారమైన నీ లీలలాలకించి, నీ దయ కోరాను. పరిపక్వమైన మనసుతో నా ఆర్తి హరించి, నన్ను రక్షించు".

రామనాథపురం శ్రీనివాస అయ్యంగార్ పై వ్రాసిన వ్యాసంలో శ్రీ ఎన్.ఆర్. భూవర్ధన్ ( ఆదివారం, 22.2.1970–హిందూపత్రిక) శ్రీనివాస అయ్యంగార్, పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్ ద్వారా త్యాగరాజస్వామి ప్రశిష్యుడని అంటాడు. శ్రీ ఏకా సుబ్బారావు వ్రాసిన **'క్రొత్త సంగీత విద్యా దర్పణం'** అనే గ్రంథంలో శ్రీ వాగ్గేయకారులు' అనే శీర్షికలోని వర్ణనలో క్రీ॥శ॥1845 లో జన్మించిన సుబ్రహ్మణ్య అయ్యర్, త్యాగరాజు మరణించిన రెండు సంవత్సరముల తర్వాత జన్మించియుండుటచే త్యాగరాజు శిష్యుడు కాజాలడని, త్యాగరాజు శిష్యులలో యెవరికైనా శిష్యుడైయుండ వచ్చునని పేర్కొనబడినది.

### విద్యాల నరసింహనాయుడు

హరికథా గాయకుడు, వైణికుడు, ఫిడేలు కూడా వాయించ గలిగిన వాడు, 1871–1910 మధ్యలో నివసించిన, తిరుపతికి చెందిన విద్యాల నారాయణస్వామి నాయుడు వేంకటేశునిపై యెన్నో కృతులు రచించాడు. సంగీత విద్వాంసుడైన విద్యాల నరసింహనాయునికి **'సప్తగిరి సంగీత విద్వన్మణి'** అనే బిరుదు ప్రదానం చేయడానికి 28–1–1973 న నిర్వహించబడిన సదస్సు (తిరుపతిలో ని త్యాగరాజ మంటపంలో నిర్వహించ బడే త్యాగరాజోత్సవంలో) చివరన, నరసింహనాయుని మేనల్లుడైన సంగీత కళానిధి చిత్తూర్ సుబ్రహ్మణ్యం పిళ్ళైగారు నారాయణస్వామి నాయుడు కీర్తనలలో నాల్గింటిని గానం చేశారు. అటుపిమ్మట నరసింహనాయుడు వాటిని నాకు చెబుతుండగా నేను వ్రాసుకున్నాను. అవి :

**(1) బేగడరాగం, ఆదితాళం**

పల్లవి : నీ దాసుడనని వేడితే నిర్దయుండవైనను బ్రోవనేమి

అనుపల్లవి : వేదాంతశాస్త్రముల నేరుగ వివిధ పురాణ విధులనేరుగ;

చరణం : కరిరాజు శాస్త్ర నిపుణుడనియ కడు భాగ్యశాలి
కుచేలుడనియ తిరముగ బ్రోచిన నల్లనాడు
తిరుపతి పురవరద వేంకటేశ.

**(2) సావేరి రాగం, ఆదితాళం**

పల్లవి : ఎందుబోదుర రామ నీవాడ యెంత వేడుకున్నా సుంతైనా
దయరాదు.

అనుపల్లవి : ముందటి వలె భక్తుల బ్రోవ లేద మోహనాంగ నామొరా
లకింపవు.

చరణం : ధీరుడ నీవిట్లూరకున్నావేమి దేవుడెవ్వడో
తెల్పుమా యిలన్ తిరుపతి పురవరద వేంకటేశ
దివ్యమైన నీరూపము జూపక

**(3) పుష్పతిలక రాగం, ఆదితాళం**

పల్లవి : ఇకనైనా నామొర వినరాదా ఇనకులేంద్ర యిది సమయమురా

అనుపల్లవి : అకలంక నీవే ఆధారమని ఆశించి యున్నా ఆదరించవేమి.

చరణం : పరమ దయాకరుడవని ప్రహ్లాదాదులు (మునుపు)
వేగ కరుణించి వేగ కాపాడ లేదా – తిరుపతి పుర
వరద – వేంకటేశ.

**(4) బలహంస రాగం, ఆదితాళం**

పల్లవి : ఇకనెవరితో విన్నవింతురా ఇనవంశాంబుధి సోమ.

అనుపల్లవి : శుకశౌనక సన్నుతరామ సుందరాకార నే(నిక)

చరణం : తెరచాటగు యీ కరమాసంపు తెరదేహమునే
నమ్మి హరుడె (హరియె) తిరుపతి పుర
వాసు డౌ ఆత్మయె అన్నే నెరుగ.

(1) ఒక భృత్యుడుగా నిన్నర్థిస్తూ వుంటే, నా యెడల కరుణ జూపవేమి? నన్ను కాపాడవేమి? ఓ ధృతిమంతుడా! నీవు మౌనంగా వున్నావు కదా! అందువలన భూలోక దైవమెవరో నాకు చెప్పు. ఓ తిరుపతి వరద వేంకటేశా! నిన్ను చూడకుండా నేనెక్కడకు పోగలను?

(2) రామా, నీ మనిషినైన నేను యెక్కడకు పోగలను? నేనెంత వేడినా, నా యెడల రవ్వంతైనా కరుణ జూపవు. మోహనాంగా! మునుపటి వలె నా భక్తులకు నీవు ఆదుకోవా? నా మొర వినవా? ధీరుడా! నీవు మౌనంగా వున్నావు. ఈ యిలలో దైవమెవరో సెలవివ్వు. ఓ తిరుపతి వరద వేంకటేశా! నీ దివ్యరూపం దర్శించకుండా నేనెక్కడకు పోగలవాడను?

(3) ఇనవంశాబ్ధిసోమా! ఇదే అదను. ఇప్పటికైనా నా మొరలాలించు. అకలంకుడైన నిన్నే నా యేకైక సహాయకుడుగా భావిస్తూండగా, నీ వేల నాపై కృపజూపవు? మున్నెప్పుడో ప్రహ్లాదులర్థించినపుడు, కరుణాబ్ధివని కీర్తించినపుడు, వెనువెంటనే నీ కృపారసం వారిపై కురిపించి, వారి నాదుకో లేదా?

(4) ఇనవంశాబ్ధిసోమా! ఇంకెవరితో నా కష్టాలు విన్నవించుకోగలను! శుక శౌనకముని జన వినుత! మోహనాంగా! మాంసలమైన మానవ శరీరాన్ని నమ్మి, పరిశీలించి హరి వొక్కడే, తిరుపతిలో వుండే వాడొక్కడే నా ఆత్మయని యెరుగనైతిని.(బహుశా రచయిత 'హరి' (విష్ణు) నుద్దేశించి యుండవచ్చు. అనుపల్లవిలో రాముల వారి నుద్దేశించి వుండవచ్చు. పల్లవిలో అతని పరివారాన్నుద్దేశించి వుండవచ్చు – మిగిలిన కృతులలోవలె – అతనికి (రాములవారిని) వేంకటేశునితో సారూప్యం చెబుతాడు. కాని, యితరులు గానం చేస్తున్నప్పుడు, ఆ పేరు 'హరుడు' గా మారివుండవచ్చు, ఆఖరి అక్షరంలోని శబ్దం వలన ('డు') – ఆ శబ్దం పుంలింగమైన తరువాత పదం 'వసుడౌ' ని సూచిస్తుంది. అందువలన 'హరియే' అనే పదం యిక్కడ సరిపోతుంది).

బహుశా 19 వ శతాబ్ది మొదటి భాగానికి చెందిన తిరుపతి నివాసియైన **వారణాసి సుబ్బరాయుడనే** వొక వ్యక్తి వేంకటేశుని 'శ్రీనివాసా' అని సంబోధిస్తూ, మంగళాశాసన మొకటి రచించాడు. అతని దర్శనానికి కుతూహలుడై వుంటాడు. అందమైన స్తంభాలతో కూడిన రంగమంటపం చూడాలని, సంపదలు, ఐశ్వర్యం కలిగేలా స్వామి ఆశీర్వాదం పొందాలని, శుక్రవారపు అభిషేక తీర్థం వొక గుక్క రుచి చూడాలని కోరుకుంటాడు. ఆ తీర్థం గర్భగుడికి వెలుపల గోలేలలో (తొట్లలో) వుంచుతారు. ఈ తీర్థం పాపాలను హరించి స్వామి కృపవలన బుద్ధివికాసం పొందాలని ఆకాంక్షిస్తాడు. తోమాలసేవ చూడాలని, అనేకమంది అధికారులను బ్రతిమాలి వైభవోపేత మైన స్వామి సహస్ర నామార్చన తిలకించాలని, దారిద్ర్యం దూరం చూసే స్వామి ఏకాంతసేవను చూడాలని, చివరగా స్వామి అనుగ్రహానికి పాత్రుడవాలని కోరుకుంటాడు – 'భవన్తు మంగళమ్'.

(1) రంగైన స్తంభాల రమణీయమైనట్టి – రంగమంటపపు – సేవలెన్నటికో శృంగార మొప్పగ సిరుల నొసగేటి శ్రీనివాసుని దయ కలుగుటెన్నటికో స్వామీ మంగళం మంగళం;

(2) ఎట్లైతే పాపములు యీడ్చి పొర్లించిన తొట్టి – తీర్థపు – సేవనెన్నటికో అట్టే యిట్టే తపములన్ని అణచిన స్వామి జ్ఞాన – ప్రసాదము కలుగు టెన్నటికో స్వామీ మంగళమ్ మంగళమ్;

(3) చాలా జనుల చేత బతిమాలి – పడి తోమాలసేవ చూచు టెన్నటికో, వాలాయముగా సహస్రనామ పూజ వైభోగము చూచుటెన్నటికో – స్వామీ మంగళమ్ మంగళమ్;

(4) చింతలన్ని యెడబాపు – చేయగ యేకాంత సేవచూచుటెన్నటికో, యింతటికి **వారణాసి సుబ్బరాయ** శ్రీనివాసుని దయ కలుగుటెన్నటికో స్వామీ మంగళమ్ మంగళమ్.

సంస్కృత పండితుడు, కవియైన నా మేనమామ శ్రీ వట్టిపల్లి నరకంఠీరవ శాస్త్రులు సంస్కృతంలో శేషభూషణుని 'మాధవా' అని సంబోధిస్తూ మంగళ గీతమొకటి స్వామి నుద్దేశిస్తూ వ్రాశారు :

1. అంగదాంగజ – కోటి శృంగార ధర
దివ్య మంగళాంగ సంగ రంగ శ్రవణత్
వంగదుత్తుంగ వియద్గంగాతరంగ భుజంగ
పుంగవ భోగ సంగైక శ్రవణ మంగళమ్
మాధవ తవ మంగళమ్ మంగళమ్

2. కుంద కుసుమ శరదిందు శీత – సుధారస
మంద హసిత బృంద సుందర వదనార
వింద బృందారక వందిత చరణార
వింద కుంద ముకుంద మంగళమ్
మాధవ తవ మంగళమ్ మంగళమ్

3. శేష భూషణ బలిపేషణ ముఖ
సురదోషణ వినుత విభీషణ శయన
మేష విశేషో దోష విశేషణ భీషణ
చరిత మంగళమ్ మంగళమ్ మాధవ
తవ మంగళమ్ మంగళమ్

4. అకుంఠ శేఖర దశ కంఠ దానవనాథ
కంటకానన పరిలుంఠన నిపుణ
కుంఠితాఘ నరకంఠీరవ కవి
కంఠీరవ నిత్య కంఠోక్త సుగుణ
మంగళమ్ మాధవ తవ మంగళమ్ మంగళమ్.

* * *

## అధ్యాయం-27

### వేంకటేశ్వరుని ఆలయంలో దైనందిన నిత్య పూజాదికాలు

(1) తెల్లవారుజాము 3-3.30 మధ్య - సుప్రభాతం. ఇందులో 'సుప్రభాతం', స్తోత్రం, ప్రపత్తి, మంగళాశాసన శ్లోకాలు వల్లిస్తారు. తాళ్ళపాక అన్నమాచార్యుని వంశీకులలో వొకరు. అతడు వ్రాసిన కొన్ని సంకీర్తనలు గానం చేస్తారు. విశ్వరూప సర్వదర్శనానికి 25 రూపాయల టిక్కెట్లు సందర్శకులకు మాత్రమే అనుమతిస్తారు.

(2) తెల్లవారుజామున 3.30 - 3.45 మధ్య - శుద్ధి.

(3) తెల్లవారుజామున 3.45 - 4.30 మధ్య - తోమాలసేవ; భోగమూర్తికి స్నానం, అర్చన అలంకరణ - పూలమాలలతో, ప్రబంధంలోని కీర్తనలతో - 200 రూపాయల టిక్కెట్లు కొన్ని వారిలో యిద్దరిని మాత్రమే ఆమంత్రణోత్సవానికి అనుమతిస్తారు.

(4) తెల్లవారుజామున 4.30 - 4.55 మధ్య ఉత్సవమూర్తి కొలువు (దర్బారు) - మైసూరు మహారాజా వారు బహూకరించిన ఛత్రం క్రింద స్వర్ణఫలకాలంకృతమైన వొక కుర్చీలో కూర్చున కొలువు శ్రీనివాసమూర్తి-ఆ మూర్తికి నువ్వులపొడి, బెల్లంతో చేసిన పదార్థాలు నివేదిస్తారు. మూడు రోజులలో గుడికి వచ్చిన ఆదాయం లెక్కలు ప్రస్తావించబడతాయి. పంచాంగం నుండి ముందురోజు, ఆ రోజు, మరుసటి రోజు ఖగోళ వివరాలు చదువుతారు.

(5) తెల్లవారుజామున 4.45 - 5.30 మధ్యలో - మొదటి అర్చన (వేంకటేశ్వర సహస్ర నామాలతో)

(6) తెల్లవారుజామున 5.30 - 6.00 మధ్య - మొదటి ఘంట - మొదటి నైవేద్యం - రెండు పెద్ద ఘంటానాదాలతో నివేదనను ప్రకటించడం, తరువాత జియ్యంగారు కాని, వారి సహాయకుడు కాని, కొందరు వైష్ణవాచార్యులతో కలిసి కొన్ని ప్రబంధ కీర్తనలు పఠించటం, 'మాత్ర' (పెరుగుతో కలిపిన అన్నం) దధ్యోదనాన్ని అందరికీ పంచటం.

(7) తెల్లవారిన పిమ్మట 6-12 మధ్యలో సర్వదర్శనం.

(8) మధ్యాహ్నం 12 - 1 మధ్యలో - రెండవసారి నివేదన, రెండవసారి అర్చన (అష్టోత్తర శతనామాలతో రెండవ అర్చన - ఏకాంతం - బయటి వారెవ్వరికీ అనుమతి లేనిది). రెండవ సారి భక్తులిచ్చిన సొమ్ముతో చెరువులు, పణ్యాలు లేక పల్లు వేంకటేశ్వరునికి నివేదిస్తారు. కొంత ప్రసాదం, కొంత పణ్యారం స్వీకరించిన పిమ్మట, మిగిలినది గృహస్థులకు పంచుతారు.

ఇంతకు పూర్వం రెండవ అర్చన కూడా ఆర్జితం అంటే టిక్కెట్టు ద్వారా దర్శనానికి అనుమతించడం (1970 నుండి దీన్ని ఆర్జితంగా ప్రకటించారు). 1971-72 సంవత్సరానికి దేవస్థానం వారు 1971 లో

ప్రచురించిన పంచాంగం ఆఖరి పుటలోని వొక అధోజ్ఞాపికలో నిత్యార్చనకు రుసుము  చెల్లించిన వారిని (రూ॥42/–లు సంవత్సరానికి, అంతకు సమానమైన డిపాజిట్ (వర్తక) మొదట, తరువాత ప్రతి సంవత్సరానికి తత్సమానమై రుసుము) – స్వామి అర్చనకు (తమ పేరులో, ఆశీర్వచనాపేక్షులై) మొదటి అర్చనకు మాత్రమే అనుమతిస్తారు.

(9)  మధ్యాహ్నం 1.00 నుండి రాత్రి 7.00 మధ్యలో – సర్వదర్శనం (ఈ సమయంలోనే గృహస్థులు సొమ్ము చెల్లించిన కళ్యాణోత్సవం, వాహనోత్సవం జరుపబడతాయి).

(10)  సాయంత్రం 7.00 – 8.00 మధ్యలో – రాత్రిపూజ (తోమాలసేవ, అర్చన, నైవేద్యాలతో).

(11)  రాత్రి 8–12 మధ్యలో – సర్వదర్శనం.

(12)  12.30 (అర్ధరాత్రి) – ఏకాంతసేవ (పానుపుసేవ) దర్శనం – ఆర్జితం – రూ.200/–లు ఆమంత్రణోత్సవం టిక్కెట్టు ఉన్నవారికి మాత్రమే). తరిగొండ వెంగమాంబ హారతి – దశావతారాలు చెక్కబడిన వొక పళ్ళెరంలో – ప్రతిరోజూ ఆ సమయానికి ఆమె వంశీకులలో వొకరు తెచ్చిన ముత్యాలతో –  పాలు, జీడిపప్పు నివేదన చేసిన పిదప గృహస్థులకు వీటిని ప్రసాదంగా వితరణ చేస్తారు (ప్రతివారికీ వొక ఉద్ధరణి పాలు, కొన్ని జీడి పలుకులు).

అర్ధమంటపం (సర్వదర్శన సమయంలో వేంకటేశ్వర దర్శనార్థమై భక్తులు నిలబడి ప్రత్యేకించే వొక చిన్నగది) లో నాలుగు వెండి గొలుసులతో మీదనుండి వేలాడదీయబడిన వొక మంచం పైన శయ్యలో భోగశ్రీనివాస మూర్తిని నిద్రింపజేస్తారు. ఈ భోగమూర్తి సంవత్సరంలో 11 మాసాలు తన శయ్యలో నిద్రిస్తాడు. మార్గళి మాసం లేక ధనుర్మాసంలో (సుమారు డిసెంబరు 15 నుండి జనవరి 16 వరకు) ఆ శయ్యలో శ్రీకృష్ణుడు శయనిస్తాడు.

ఈ కాలంలో కుంకుమపువ్వులతో కలిపిన చందనం (రెండు నారింజల రూపంలో వొక వెండి గిన్నెలో – అందువల్ల **'ఫలం'** అని పేరుతో పిలువబడేది) వేంకటేశ్వరుని పాదపద్మాలపై ఉదయం అర్చన సమయం వరకు వుంచి,  కొద్ది కొద్దిగా విశ్వరూప ఉద్యాపనసమయంలో భక్తులకు వితరణ చేస్తారు. ఏకాంతసేవ సమయంలో, అన్నమాచార్యుని వంశీకుడొకడు స్వామికి జోల పాడతాడు.

అంతేకాదు, ఈ సేవ సందర్భంగా నీటితో నింపిన పెద్ద స్వర్ణపాత్రలు  తలుపులు వేసే ముందు గర్భగుడి బయట పెడతారు. మరుసటి రోజు ఉదయాన్నే వొక వెండి ఉద్ధరణిలో కొంచెం కొంచెంగా బ్రహ్మాది దేవతలు  స్వామిపూజలో వినియోగించిన తీర్థంగా వితరణ చేయబడుతుంది. ఈ పద్ధతి వారంలో ప్రతి రోజూ అనుసరించేదే. బుధ, గురు, శుక్రవారాల్లో అవసరమైన మార్పులు చేయబడుతాయి.

బుధవారాలలో (ఉదయం 6 నుండి 8 వరకు తప్ప) యిదే పద్ధతి కొనసాగుతుంది. 1008 ఘటాల జలంతో ఉదయం 8 కి భోగ శ్రీనివాసునికి సహస్ర కలశాభిషేకం జరుగుతుంది. అటుపిమ్మట సర్వదర్శనం

మొదలౌ తుంది. గురువారం నాడు ముందు శుక్రవారం నాటి ఖరీదైన వేంకటేశ్వరుని దుస్తులు, అలంకరణలు చాలావరకు తీసివేస్తారు. అతి కొద్దిపాటి మాత్రమే అతని శరీరంపై వుంటాయి. స్వామి వొక మెత్తని అంగవస్త్రం ధరిస్తాడు. ఈ ప్రక్రియను సడలింపు లేక సల్లింపు (వదలు చేయుట లేక తీసివేయుట) అని పిలుస్తారు. అటుపిమ్మట అష్టోత్తర శతనామాలతో స్వామికి రెండవసారి అర్చన జరుగుతుంది. నైవేద్యం సమర్పించబడుతుంది. అటుపిమ్మట, సాయంత్రపు పూజ, నైవేద్యం తరువాత పానకం, వడపప్పు నివేదించిన తరువాత స్వామి దేహమంతా శిరస్సు నుండి పాదాల వరకు పూలమాలలతో అలంకరిస్తారు. అందుకే యీ స్వామి దర్శనాన్ని పూలంగి దర్శనమని పిలుస్తారు. అటుపిమ్మట అర్ధరాత్రి 12.30 లకు ఏకాంతసేవ జరుప బడుతుంది.

శుక్రవారం నాడు ఉదయాన్నే సుప్రభాతం వినిపించిన తరువాత తోమాలసేవ, అర్చన ఏకాంతంగా జరుపబడిన పిమ్మట, స్వామికి అల్పాహారం సమర్పింపబడిన పిమ్మట, అతని అభిషేకానికి అన్ని ఏర్పాట్లు జరుగుతాయి. పచ్చకర్పూరపు పొడి, తడికుంకుమ పువ్వు ముద్ద, కస్తూరిని జవ్వాదినూనెతో కలిపి ముద్దగా చేసి, చందనం తయారుచేసి, జవ్వాది సంచులను గానుగ నూనెలో మరగించి దానినుండి కస్తూరి తైలం తీసి పచ్చ కర్పూరంలో ముద్దచేసి, యీ సుగంధ ద్రవ్యాలన్నింటినీ వెండి గిన్నెలలోకి తీసి వాటిని ఊరేగింపుగా సొన్నాయి, మృదంగ వాద్యాలలో విమాన ప్రదక్షిణం గుండా గర్భగుడిలోనికి తీసుకుని వెళతారు. బంతి ఆకారంలో వుండే యీ సుగంధ ద్రవ్యపు ముద్దని స్వామి పాదాలపై ఉంచుతారు. ఆ తరువాత వొకటిగాని, అన్నీ అంటే నాలుగు గాని సేవలు దానికి కావలసిన రుసుము చెల్లించిన వారికి, అభిషేకం టిక్కెట్లు తీసుకున్నవారిని అనుమతించిన పిమ్మట, వేంకటేశ్వరునికి అభిషేకం మొదలౌతుంది.

ఈ అభిషేకం జలంతో, పురుష సూక్తం, ప్రబంధంతో మొదటి, అటుపిమ్మట పాలు, నీరు, చందనద్రవంతో, మరల జలంతో, తడిచేసిన కుంకుమ పువ్వులతో, ఆఖరున స్వచ్ఛమైన జలంతో జరుపబడుతుంది. అతని దేహం నుండి ప్రవహించే కుంకుమ పువ్వు జలం వెండి గిన్నెలలోకి, అంతకన్న పెద్దగిన్నెలలోకి గ్రహించబడుతుంది. అప్పుడు స్వామి దేహం గుడ్డతో తుడిచి పొడిగా చేస్తారు. కొద్దిగా జవ్వాది తైలం శిరస్సు నుండి పాదాలవరకు జల్లుతారు. కొంచెం పచ్చకర్పూరంతో గడ్డం తాకుతారు. స్వామి వదనంపై తిరునామాలు తీర్చి, కస్తూరి తిలకం దిద్దుతారు. అప్పుడు శ్రీసూక్తం పఠిస్తూ స్వామి వక్షస్థలంపై స్వర్ణహారంలో వ్రేలాడుతున్న శ్రీలక్ష్మి స్వర్ణమూర్తిని అభిషేకిస్తారు. చిట్టచివరగా కర్పూరహారతి యిస్తారు.

యాత్రికులు వెళ్ళిపోయిన పిమ్మట, తిరునామం వెడల్పుగాను, మందంగాను, తీర్చిదిద్దుతారు. స్వామి పీతాంబర ధారియై విలువైన ఆభరణాలు ధరిస్తాడు. వంశపారంపర్యంగా వచ్చే సేవకులకు పచ్చకర్పూరం, జవ్వాది నూనె కలిపిన ముద్ద కొంత భాగం వితరణ చేయబడుతుంది. గృహస్థులకు శ్రీ పాదరేణువు చిన్నచిన్న కణాలుగా యివ్వబడుతుంది.

చుబుకానికి కర్పూరపు పొడి అద్దడం ఒక సంప్రదాయానికి సంబంధించినది. ఒక భక్తుడు (రామానుజుల శిష్యుడైన అనంతాళ్వాన్ అని అంటారు), తన భార్యతో సహా తాను చేసే ప్రత్యేక సేవగా ఆళ్వార్ సరస్సు (ఆళ్వార్ టాంక్ అని ఇప్పుడు పిలువబడే సరస్సును) త్రవ్వాలని సంకల్పించి ఉండగా అతడు భూమినుండి మట్టితట్టలు రహస్యంగా మోస్తున్న వొక బాలకుని చూశాడు. ఆ బాలుడు తన పనిలో జోక్యం చేసుకోవడానికి కోపించి, అతని చుబుకం మీద పారతో కొట్టాడు. ఆ బాలుడు అదృశ్య మయ్యాడు. ఆ భక్తుడు ఆలయానికి స్వామి అర్చనకు వెళ్ళినప్పుడు, వేంకటేశ్వరుని చుబుకం నుండి రక్తం కారుతూ వుండటం చూసి, తన అపరాధానికి చింతించి, యేదో మందు తెచ్చి స్వామి చుబుకానికి పూశాడు. ఈ విషయాన్ని గుర్తుంచుకుని, శుక్రవారం నాడు స్వామి అభిషేకం తరువాత అతని చుబుకానికి పచ్చకర్పూరం అద్దుతారు. స్వామి దేహం నుండి సంగ్రహించబడిన కుంకుమపువ్వు జలం (ఇప్పుడు పచ్చకర్పూరము కూడా కలుపుతున్నట్టున్నారు) అభిషేక తీర్థం. అతని దేహంతో సంపర్కం వల్ల ఆ జలం పవిత్రత సంతరించుకుంటుంది. తరువాత వచ్చే సర్వదర్శన సమయంలో (ఉదయం 10 నుండి రాత్రి 7 వరకు) భక్తులకు చిన్న ఉద్ధరణిలలో యివ్వబడుతుంది. గృహస్థులకు కూడా దానితో బాటు ఎండిన చిన్న చందనపు ముద్దలు, శ్రీపాదరేణువు, పణ్యారాలు వితరణ చేయబడతాయి. ఇవి యింటికి తీసుకుని వెళ్ళటానికి అనువుగా వుంటాయి. స్నేహితులకు, బంధువులకు తీర్థయాత్రకు గుర్తుగా విందుచేస్తూ కొద్దిగా తీర్థం, పణ్యారం యిస్తారు. ఈ తీర్థం, శ్రీపాదరేణువులు యిళ్ళలో భద్రపరచి, యింట్లో పూజ అయిన తరువాత కొద్దిగా స్వీకరిస్తారు. ఈ తీర్థం మరణశయ్యపై వున్న వారికి గంగాజలంలా కూడా ఇస్తారు.

అభిషేకం, అలంకరణ తరువాత, ఉదయం 8.30 – 9.30 మధ్యలో అష్టోత్తర శతనామాలతో తోమాలసేవ, అర్చన జరుపబడతాయి. అటు పిమ్మట వేంకటేశ్వరునికి ఉదయం 9.30 – 10 మధ్యలో శాత్తుమొరతో నైవేద్యం సమర్పించబడుతుంది. ఇక సర్వదర్శనమే (ఉదయం 10 నుండి రాత్రి 7 వరకు).

తరువాత రాత్రి తోమాల సేవ, అర్చనలో ఏకాంతంగా నివేదనలు అర్పించ బడతాయి. ఏకాంతసేవ ఆర్జితం అర్ధరాత్రి 12.30 లకు.

## దర్శనాలు, సేవలు, ఉత్సవాలు, వాటికి చెందిన సుంకాల పట్టిక

## ఆర్జితం పట్టిక

**గమనిక :**

ఒక కర్పూర హారతి – రూ.1/–

**దర్శనాలు :**

ప్రత్యేక దర్శనం – రూ.25/–లు
సుప్రభాతం – రూ.25/–లు

**సేవలు :**

1. ఆమంత్రణోత్సవం - రూ. 200/-లు
2. పూరఅభిషేకం - రూ. 500/-లు
3. గంబూరపాత్ర - రూ. 300/-లు
4. జవ్వాది పాత్ర - రూ. 200/-లు

**ఇతర పాత్రలు**

5. జఫ్రా పాత్ర - రూ. 100/-లు
6. కస్తురి పాత్ర - రూ. 100/-లు
7. సహస్ర కలశాభిషేకం - రూ. 2,500/-లు
8. తిరుప్పావడ - రూ. 5,000/-లు

(1) ఉదయం తోమాలసేవ, అర్చన సమయంలో కుటుంబంలో యిద్దరు వ్యక్తులకు దర్శనానికి, రాత్రి ఏకాంత సేవకు అనుమతిస్తారు. నివేదన తరువాత మధ్యాహ్నం వారికి పొంగలి ప్రసాదం యిస్తారు.

(2) నుండి (6) వరకు - శుక్రవారాలలో మాత్రమే. ఒక టిక్కెట్టుకి వొక్కరినే అనుమతిస్తారు. అభిషేకానంతరం టిక్కెట్టు ఉన్నవారికి వడ ప్రసాదం యిస్తారు.

(7) బుధవారాల్లో మాత్రమే.

(8) గురువారాల్లో మాత్రమే.

ఇవన్నీ వొక్కక్కటీ వొక్కోరోజు జరిగే ఉత్సవాలు. పాల్గొన్నవారికి ప్రసాదాలు, వడ, అప్పం, దోసె మొదలైనవీ, (7) కార్యక్రమం తరువాత వస్త్రభూషణం కూడా.

**సాధారణం :**

'దతం', హారతుల కొరకు సంప్రదాయం, సందర్భాన్ని బట్టి అదనంగా వొక రూపాయి చెల్లించాలి.

**ఉత్సవాలు :**

1. వసంతోత్సవం - రూ. 2,500/-లు
2. ఊంజలసేవ - రూ. 1,500/-లు
3. బ్రహ్మోత్సవం - రూ. 750/-లు
4. కల్యాణోత్సవం - రూ. 1,500/-లు
6. సహస్రదీపాలంకారసేవ - రూ. 2,000/-లు
7. శ్రీపుష్పయాగం - రూ. 5,000/-లు

**ఉత్సవం :**

**(1) వసంతోత్సవం :** ఆలయ నిర్వాహకులు, భక్తుల సౌకర్యం మేరకు మూడు లేక అంతకన్న తక్కువ దినాలలో నిర్వహించబడుతుంది. పాల్గొన్న వారికి వస్త్రభూషణాలిస్తారు.

**(2) ఊంజల్‌సేవ :** వస్త్రభూషణంతో బాటు గృహస్థులకు ఒక బంగారు డాలర్ కూడా యిస్తారు.

**(3) బ్రహ్మోత్సవం :** ఆలయ నిర్వాహకులు, భక్తుల సౌకర్యం మేరకు మూడు లేక అంతకన్న తక్కువ రోజులు నిర్వహించబడే ఉత్సవంలో ప్రతిరోజు బ్రహ్మోత్సవానికి ఆరుగురిని అనుమతిస్తారు. ఉత్సవదినాల్లో పొంగలి, దోసె యిస్తారు. ఉత్సవం చివరన వస్త్రభూషణం, ప్రసాదం యిస్తారు.

**(4) కళ్యాణోత్సవం :** ఉత్సవం చివరన, సంప్రదాయానుసారం వస్త్రభూషణ, ప్రసాదాదులు వితరణ చేయబడతాయి. వీటితో బాటు లడ్డు, వడలు, అప్పాలు, దోసెలు, అన్న ప్రసాదాలు కూడా. పర్వదినాలలో తప్ప ప్రతిరోజూ యిదే పద్ధతి. ఉత్సవానికి పది మందిని అనుమతిస్తారు. ఉత్సవానికి వసూలు చేసే సుంకం తిరుమలలో వుండే గృహస్థుని నివాసానికి దేవస్థానం నుండి తీసుకుని వెళ్ళడానికయ్యే రవాణా ఖర్చులు కూడా యిందులో భాగం.

**(5) తెప్పోత్సవం :** గృహస్థులకు వస్త్రభూషణానికి తోడుగా వొక బంగారు డాలర్ కూడా యిస్తారు (మంగళవారం నాడు మాత్రమే).

**(6)** ప్రతి మాసం శ్రవణ నక్షత్ర యుక్తమైన దినాన నిర్వహించే ఉత్సవానికి ఆర్గురు వ్యక్తులను సాయంత్రం 4 నుండి 6 వరకు అనుమతిస్తారు.

**(7)** 1981 లో జరిగిన శ్రీవారి బ్రహ్మోత్సవం నాటి నుండి యీ ఉత్సవం నిర్వహించాలనే ఆలోచన వున్నది.

**వాహనాలు :**

1. సర్వభూపాల వాహనం, వజ్రకవచం, హారతి – రూ. 125/–లు
2. స్వర్ణగరుడ, కల్పవృక్ష, పెద్దశేష, సూర్యప్రభ, సర్వభూపాల వాహనం, హారతి – వొక్కొక్క దానికి రూ. 125/–లు
3. రజత గరుడ, చిన్నశేష, చంద్రప్రభ, గజ, అశ్వ, సింహ, హంస, హనుమద్వాహనాలు, హారతి – వొక్కొక్క దానికి రూ. 100/–లు

ప్రతి ఉత్సవానికి గృహస్థునికి వొక వడ యివ్వబడుతుంది.

**సాధారణం :**

III, IV లకు – సందర్భానుసారంగా, సంప్రదాయానుసారంగా హారతులకు వొక రూపాయి అదనంగా చెల్లించవలె.

**అన్నప్రసాదాలు :**

1. దధ్యోదనం – రూ.75/–లు
2. పులిహోర – రూ.75/–లు
3. పొంగలి – రూ.100/–లు
4. చక్కెర పొంగలి – రూ.100/–లు
5. శర్కరాభాత్ – రూ.125/–లు
6. కేసరిభాత్ – రూ.125/–లు
7. పాయసం – రూ.125/–లు
8. సీర – రూ. .... లు

గమనిక : స్వామికి నైవేద్యం అయిన పిమ్మట గృహస్థులకు ప్రసాదం వితరణ చేయబడుతుంది.

**పడుల ప్రసాదాలు :**

1. అప్పం – రూ.250/–లు
2. లడ్డు – రూ.600/–లు
3. వడ – రూ.350/–లు
4. పోలి – రూ.250/–లు
5. దోసె – రూ.250/–లు
6. తేన్‌తొళల్ – రూ.250/–లు
7. సుగియం – రూ.250/–లు
8. జిలేబీ – రూ.600/–లు

గమనిక : పడుల ప్రసాదాల నివేదనలలో పాల్గొన్న వారికి వారిచ్చిన వాటిలో 30 ప్రసాదాలు యివ్వబతాయి. గృహస్థులు వారి వారి స్వంత పాత్రలలో ప్రసాదాలు స్వీకరించాలి.

**నిత్యసేవలు :**

1. నిత్యకర్పూర హారతి – రూ.21/–లు
2. నిత్యనవనీత హారతి – రూ.42/–లు
3. నిత్యార్చన – రూ.42/–లు

* * *

# అధ్యాయం-28

## శ్రీవేంకటేశ్వర సుప్రభాతం

వేంకటేశ సుప్రభాతం నాలుగు అంశాలతో కూడినది.

1. సుప్రభాతం (శుభోదయం – స్వామిని ఉదయం మేల్కొలిపే 29 శ్లోకాలతో గూడిన ప్రార్థన), 2. స్తోత్రం (రక్షించమని వేడుకునేది) – 11 చరణాలతో కూడినది, 3. ప్రపత్తి (స్వామి పవిత్ర చరణముల నాశ్రయించుట) – 16 పద్యాలలో, 4. మంగళాశాసనం (ప్రార్థనతో కూడిన కోరిక – స్వామి మనస్సు, అతని శ్రేయస్కరత్వము వ్యక్తీకరించే 14 చరణాలు – మొత్తం 70 శ్లోకాలు.

శ్రీవేంకటేశ్వర సుప్రభాతం చిన్న పుస్తకం (మీద చెప్పబడిన నాలుగు అంశాలతో కూడినది) దేవస్థానం విచారణ కార్యాలయాలలో అతి తక్కువ ధరకు తిరుమల, తిరుపతిలలో లభ్యమౌతుంది.

ఈ సుప్రభాతంలో మొదటి శ్లోకం కౌసల్య కొడుకు, శుభకరుడూ అయిన రాములవారి నుద్దేశించి చెప్పబడింది. రెండవ శ్లోకం ఇంద్రునిచే సృష్టించబడిన గాలివాన నుండి గోవులను రక్షించిన గోపాలకుడు కృష్ణుడు, గోవిందు నుద్దేశించి చెప్పబడింది. కమలాపతి, శ్రీలక్ష్మీ పతియైన విష్ణువునకు సంబంధించిన ప్రస్తావన వున్నది. రాముడు, కృష్ణుడు, విష్ణువులతో వేంకటేశ్వరునికి సారూప్యం చెప్పబడింది.

మూడవ, నాలుగవ చరణాలు వృషాచలపతి (వృషభాచలం వొక కొండపేరు) శ్రీవేంకటేశుని సతియైన శ్రీలక్ష్మినుద్దేశించి చెప్పబడినవి.

తరువాత వచ్చే 24 శ్లోకాలు వేంకటేశుని శేషాద్రి శేఖరవిభునిగా, వేంకటా చలపతిగా, వేంకటునిగా, వృషాచలపతిగా పేర్కొని అతనికి శుభోదయం పలుకుతాయి.

29 వ చరణం, ఆఖరి చరణం సుప్రభాతం పఠించేవారు పరమాత్మను, బ్రహ్మానంద స్థితియైన మోక్షం (అందరూ కోరుకొనేది) పొందడానికి తగిన మేధాశక్తిని పెంపొందించు కుంటారని పేర్కొంటుంది.

ఈ స్తోత్రంలో, భక్తుడు వేంకటేశునికి అతనొక్కడినే ఆరాధిస్తూ ఉన్నట్లు, మరి యే దైవాన్ని కొలిచే ఆలోచన లేనట్లు విన్నవించుకుంటాడు. ఎంతో దూరం నుండి స్వామి పాదాలనర్చించడానికి వచ్చే తాను వేంకటపతిని అప్పుడప్పుడు దర్శించుకో–నిమ్మని 10 వ శ్లోకంలో వేడుకుంటాడు. స్వామి క్షమాగుణాన్ని పెంపొందించేది శ్రీమహాలక్ష్మి. ఆమె పద్మాసనస్థితయై చిగురుటాకుల వంటి తన రెండు చేతులతో పద్మాలు ధరించి ఉన్నది. ఆమె వాత్సల్యాది గుణోజ్జ్వలయైన భగవతి. ఆమెను స్తోత్ర రచయిత వినమ్రుడై కీర్తిస్తాడు. నమస్కరిస్తాడు. తరువాత 15 శ్లోకాలలో వేంకటేశ్వరుని పాదాలను వినమ్రుడై మ్రొక్కుతాడు. శ్రీలక్ష్మిని స్తుతించి, ప్రార్థించే శ్లోకాలు ఆమె కరుణను సూచిస్తాయి, ఆమె తన తరపున స్వామివారి కొక మంచిమాట చెప్పి వారి కరుణకు పాత్రుణ్ణి చేయాలనేది అతని మనస్సులోని మాట. ఈ ఉద్దేశం 16 వ, ఆఖరి చరణంలో కూడా ఉన్నది.

ప్రపత్తిలోని 10 వ శ్లోకంలో, భక్తాగ్రేసరుడైన రచయిత స్వామి పాదాలు మకరంద ఝరులని, ఆనందదాయకాలని, తదితరములైన మంచి గుణాలతో శోభిల్లేవని ఋగ్వేదంలో పేర్కొనబడిన విషయాన్ని పేర్కొంటాడు. వేంకటేశ్వరుని హస్తం చూపుతున్నట్లువి మకరందపు మాటలని, అతని పాదాలనాశ్రయిస్తాడు. 11 వ చరణంలో పార్థసారథిగా అర్జునునికి తన పాదాలు చూపిన స్వామి తన కోసం మరల చూపుతున్నట్టు రచయిత భావించి వినమ్రుడౌతాడు. తన పాదాలే మానవులకేకైక ఆశ్రయమని చేతితో, దయతో సూచించే శ్రీ వేంకటేశ్వరునికి మంగళా శాసనపు 9 వ శ్లోకంలో మంగళం (శుభం) జరగాలని కోరుకుంటాడు.

తనను సంపూర్ణ విశ్వాసంతో ఆశ్రయించే దాసులను వేంకటేశుడు తప్పక పరిరక్షించగలడన్నదే యీ శ్లోకాల తాత్పర్యం. కొద్దిసేపు దర్శించినా, ఎన్నిసార్లు దర్శించినా అమృతరూపుడైన ('అతృప్త్యామృతరూపాయ') స్వామి దర్శన కాలం మరల మరల కావాలని, మంగళాశాసనంలోని 8 వ శ్లోకం వక్కాణిస్తుంది. స్వామి సమక్షంలో ఎల్లప్పుడూ ఉండాలని, అతని దివ్యసుందర విగ్రహం వీక్షిస్తూ తమ ఆత్మలను అమృతమయం చేసుకోవాలని ఆకాంక్షిస్తారు. స్వామి సమక్షం నుండి మరల్చబడిన భక్తుల అనుభవం యిది. వారు బంగారువాకిలి చేరుకొనే వరకు ఆత్రంగా స్వామి వారిని తిరిగి, తిరిగి వీక్షించాలనే అందరి భక్తుల అనుభవం యిది. వేంకటేశ్వరుని దివ్యమంగళ రూపురేఖల సౌందర్యం, ఆకర్షణ అంతటిది. ఇదీ భావాన్ని 16 వ శతాబ్దపు తెలుగు కవి వొకరు వెల్లడించారు.

* * *

# అధ్యాయం-29

## శ్రీవేంకటేశ - అష్టోత్తర శతనామం

సూతమహాముని సన్నిధిలో అద్భుతమైన శ్రీ వేంకటాచల, శ్రీవేంకటేశ్వర గాథలు విన్న మునులు, స్వామిని పూర్వం కొలిచిన వారందరి వివరాలు తెలుసుకోదలచారు. వారికి సమాధానమిస్తూ సూత మహాముని పూర్వం కపిలమహర్షి స్వామిని అష్టోత్తర నామాలతో స్తుతించినట్లు, తరువాత కాలంలో బ్రహ్మ అవే నామాలతో స్వామిని కీర్తించినట్టు చెప్పాడు. ఈ నామాలు గోప్యమైనవి. ప్రతివారికి చెప్పదగినది కావు.

ఈ నామాలతో వేంకటేశ్వరుని పూజించటం వల్ల భక్తులకు చిరాయువు, ఆరోగ్యమూ, ఐశ్వర్యమూ, ఆనందమూ కలుగుతాయి.

ఈ స్తోత్రపాఠానికి ముందు యీక్రింది విధంగా ధ్యానించాలి.

**అష్టోత్తరశతస్యాస్య**
**ఋషిః బ్రహ్మా, ఛందో అనుష్టుప్ ।**
**హృదయం వేంకటేశః ॥**

**ధ్యానమ్ :**

1. శ్రీమాన్ శేషగిరీంద్ర శేఖరమణి ర్వందారుచూడామణిః
దుఃఖధ్వాంత నిరాసవాసరమణీ స్త్రైలోక్యరక్షామణీ
శ్రీమాత్రయ్యబలాశిరోమణిరురో విన్యస్తకాంతామణిః
పాయాన్నస్తు-దేవకీ-జాతరజస శ్రీసోమరగ్రామణీ.

2. వందే శ్రీ నయనోత్పలస్య శశినం శేషాచలాధీశ్వరం
బ్రహ్మాద్యార్చిత పాదపద్మయుగళమ్ లోకైక నేత్రోత్సవమ్
వాశిష్ఠైస్సనకాధిభిర్మునిగణై స్సంసేవ్యమానంసదా
భక్తానా మఖిలేష్టదాయిన మహం శ్రీవేంకటేశమ్ గురుమ్

3. భాస్వచ్చంద్రమసౌ యదీయ నయనే భార్యా యదీయా రమా
యస్మాద్విశ్వసృజాస్యభూద్యమికులమ్ యద్ధ్యానయుక్తం సదా
నాథో యో జగతామ్ నగేంద్ర దుహితు ర్నాథోఽపి యద్భక్తిమాం
స్తాతో యోమదనస్యయో దురితహా తం వేంకటేశం విభుమ్

4. ఊర్ధ్వౌ హస్తౌ యదీయౌ సురరిపు దళనే బిభ్రతౌ శంఖచక్రే
సేవ్యావంఘ్రీ స్వకీయా వభి దధారో దక్షిణోయస్య పాణిః
తావన్మాత్రమ్ భవాబ్ధిమ్ గమయతి భజతామూరుగో వామపాణిః
శ్రీవత్సాంకశ్చ లక్ష్మీర్యదురసి లసస్తస్తం భజే వేంకటేశమ్

**నీలాగోక్షీర సంభూతాః - బీజమ్**
**శ్రీనివాసః - శక్తిః**
**వేంకటాధిపః - హృదయమ్**

(ఈ మూడు పదాలు ఉచ్చరించే సమయంలో యుక్తమైన అంగన్యాసం చేయాలి)

## అష్టోత్తరశతనామస్తోత్రం

1. ఓం వేంకటేశాయ శ్రీవేంకటేశాయ నమః
2. ఓం శేషాద్రినిలయాయ ”
3. ఓం వృషదృగ్గోచరాయ ”
4. ఓం విష్ణవే ”
5. ఓం సదంజనగిరీశాయ ”
6. ఓం వృషాద్రిపతయే ”
7. ఓం మేరుపుత్రగిరీశాయ ”
8. ఓం సరస్స్వామితతీజుషే ”
9. ఓం కుమారకల్పసేవ్యాయ ”
10. ఓం వజ్రిదృగ్విషయాయ ”
11. ఓం సువర్చలా – సుత్యన్యస్త – సైన్యాపత్యభరాయ ”
12. ఓం రామాయ ”
13. ఓం పద్మనాభాయ ”
14. ఓం సదావాయుస్తుతాయ ”
15. ఓం త్యక్తవైకుంఠలోకాయ ”
16. ఓం గిరికుంజవిహారిణే ”
17. ఓం హరిచందనగోత్రేంద్రస్వామినే ”
18. ఓం శంఖరాజన్యనేత్రాబ్జవిషయాయ ”
19. ఓం వసూ పరిచర త్రాత్రే ”
20. ఓం కృష్ణాయ ”
21. ఓం అబ్ధికన్యా పరిష్వక్తవాక్శేషే ”
22. ఓం వేంకటాయ ”
23. ఓం సనకాదిమహాయోగిపూజితాయ ”

24. ఓం దేవజిత్ప్రముఖానంతదైత్యసంఘప్రణాశినే శ్రీవేంకటేశాయ నమః
25. ఓం శ్వేతద్వీపవసన్ముక్తాపూజితాంఘ్రియుగాయ ”
26. ఓం శేషపర్వతరూపత్వాప్రకాశనపరాయ ”
27. ఓం సానుస్థాపితతార్క్ష్యాయ ”
28. ఓం తార్క్ష్యాచలనివాసినే ”
29. ఓం మాయాగూఢవిమానాయ ”
30. ఓం గరుడ స్కంధవాసినే ”
31. ఓం అనంతశిరసే ”
32. ఓం అనంతాక్షాయ ”
33. ఓం అనంతచరణాయ ”
34. ఓం శ్రీశైల నిలయాయ ”
35. ఓం దామోదరాయ ”
36. ఓం నీలమేఘనిభాయ ”
37. ఓం బ్రహ్మాది దేవదుర్దేశవిశ్వరూపాయా ”
38. ఓం వైకుంఠాగతసద్ధేమవిమానాంతర్గతాయ ”
39. ఓం అగస్త్యాభ్యర్థితాశేషజనదృగ్గోచరాయ ”
40. ఓం వాసుదేవాయ ”
41. ఓం హరయే ”
42. ఓం తీర్థపంచకవాసినే ”
43. ఓం వామదేవప్రియాయ ”
44. ఓం జనకేష్టప్రదాయ ”
45. ఓం మార్కండేయమహాతీర్థజాతపుణ్యప్రదాయ ”
46. ఓం వాక్పతిబ్రహ్మదాత్రే ”
47. ఓం చంద్రలావణ్యదాయినే ”
48. ఓం నారాయణనగేశాయ ”
49. ఓం బ్రహ్మక్లుప్తోత్సవాయ ”
50. ఓం శంఖచక్రవరానమ్రలసత్కరతలాయ ”
51. ఓం ద్రవన్మృగమదాసక్తవిగ్రహాయ ”
52. ఓం కేశవాయ ”

53. ఓం నిత్యయౌవనమూర్తయే శ్రీవేంకటేశాయ నమః
54. ఓం అర్థితార్థప్రదాత్రే ”
55. ఓం విశ్వతీర్థాఘహారిణే ”
56. ఓం తీర్థస్వామి సరస్స్నాతజనాభీష్టప్రదాయినే ”
57. ఓం కుమారధారికావాసస్కంధాభీష్టప్రదాయ ”
58. ఓం జామదఘ్నసముద్భూతపోత్రిణే ”
59. ఓం కూర్మమూర్తయే ”
60. ఓం కిన్నరద్వంద్వశాపాంతప్రదాత్రే ”
61. ఓం విభవే ”
62. ఓం వైఖానసమునిశ్రేష్ఠపూజితాయ ”
63. ఓం సింహాచలనివాసాయ ”
64. ఓం శ్రీమన్నారాయణాయ ”
65. ఓం సద్భక్తనీలకంఠార్చ్యనృసింహాయ ”
66. ఓం కుముదాక్షగణశ్రేష్ఠసైన్యాపత్యప్రదాయ ”
67. ఓం దుర్మేధఃప్రాణహర్త్రే ”
68. ఓం శ్రీధరాయ ”
69. ఓం క్షత్రియాంతకరామాయ ”
70. ఓం మత్స్యరూపాయ ”
71. ఓం పాండవారిప్రహర్త్రే ”
72. ఓం శ్రీకరాయ ”
73. ఓం ఉపత్యకాప్రదేశస్థశంకరధ్యాతమూర్తయే ”
74. ఓం రుక్మాబ్జసరసీకూలలక్ష్మీకృతతపస్వినే ”
75. ఓం లసల్లక్ష్మీకరాంభోజదత్తకల్హారకస్రజే ”
76. ఓం సాలగ్రామనివాసాయ ”
77. ఓం శుకదృగ్గోచరాయ ”
78. ఓం నారాయణతీర్థశేషజనదృగ్విషయాయ ”
79. ఓం మృగయారసికాయ ”
80. ఓం వృషభాసురహారిణే ”
81. ఓం అంజనాగోత్రపతయే ”

82. ఓం వృషభాచలవాసినే శ్రీవేంకటేశాయ నమః
83. ఓం అంజనాసుతదాత్రే ”
84. ఓం మాధవీయాఘ హారిణే ”
85. ఓం ప్రియాంగుప్రియభక్షాయ ”
86. ఓం శ్వేతకోలవరాయ ”
87. ఓం నీలధేనుపయోధరాసేకదేహోద్భవాయ ”
88. ఓం శంకరప్రియమిత్రాయ ”
89. ఓం చోళపుత్రప్రియాయ ”
90. ఓం సుధర్మిణీసుచైతన్యప్రదాత్రే ”
91. ఓం మధుఘాతినే ”
92. ఓం కృష్ణాఖ్యవిప్రవేదాంతదేశికత్వప్రదాయ ”
93. ఓం వరాహాచలనాథాయ ”
94. ఓం బలభద్రాయ ”
95. ఓం త్రివిక్రమాయ ”
96. ఓం మహతే ”
97. ఓం హృషీకేశాయ ”
98. ఓం అచ్యుతాయ ”
99. ఓం నీలాద్రినిలయాయ ”
100.ఓం క్షీరాబ్ధినాథాయ ”
101.ఓం వైకుంఠాచలవాసినే ”
102.ఓం ముకుందాయ ”
103.ఓం అనంతాయ ”
104.ఓం విరించాభ్యర్థితానీతసౌమ్యరూపాయ ”
105.ఓం సువర్ణముఖారీస్నాతమనుజాభృష్టదాయినే ”
106.ఓం హలాయుధజగత్తీర్థ సమస్తఫలదాయినే ”
107.ఓం గోవిందాయ ”
108.ఓం శ్రీనివాసాయ ”

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

* * *